# శ్రీ వివేకానందసంపూర్ణగ్రంథావళి

[ శతతమ జన్మదినోత్సవ ప్రచురణము ]

## నాలుగవ సంపుటము


సంపాదకులు :

సాహిత్యభూషణ, విద్యాసాగర

ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఎం.ఏ., బి.ఎల్., బి.టి.పి. గారు.





శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

# విజ్ఞప్తి

శ్రీవివేకానందసంపూర్ణగ్రంథావళిలోని నాలుగవ సంపుటమును మా పఠితల కందించుటకు మేము మిగుల ఆనందించుచున్నాము. శ్రీవివేకానందస్వాములవారి మహోత్కృష్టగ్రంథములలో నొకటియైన జ్ఞానయోగ మిందు పరిఢవిల్లుచున్నది. కీ॥ శే॥ శ్రీ తత్త్వానందస్వాములవారును, కీ॥ శే॥ శ్రీ కందుకూరు మల్లికార్జునంగారును తొలుత దీని నాంధ్రీకరించిరి. గ్రంథరూపమున మేము ప్రచురించితిమి. ప్రేమపురస్సరకర్తవ్యముగా దీని ననువదించి మా కొసగిన ఈ యిరువురు మిత్రుల పవిత్రాత్మలకు మా కృతజ్ఞత దెలుపుచున్నాము. శ్రీస్వాములవారిచే రచింపబడిన మఱికొన్ని రచనలును, అనుష్ఠానవేదాంతమును, భక్తియోగోపన్యాసములు మున్నగునవియును ఇందు జేర్పబడినవి. శ్రీస్వామిజీ కృతులలో ప్రజాదృష్టిని విశేషముగా నాకర్షించిన వానిలో జ్ఞానయోగ మొకటి. ఆంగ్లమునం దిది పది ముద్రణముల నందినది.

భగవాన్ రామకృష్ణపరమహంస శిష్యులలో అగ్రగణ్యులైన శ్రీవివేకానందస్వాములవారు వివిధమతగ్రంథములను, తత్త్వశాస్త్రములను, బహుళ ప్రాచీప్రతీచీప్రాచీనార్వాచీనసాంస్కృతిక గ్రంథములను సమీక్షించి, సమగ్రముగా హృదయంగమ మొనరించుకొనిరి. మననిదిధ్యాసనభక్తివిశ్వాసములవలన ఆయన సత్యసాక్షాత్కారమునంది, నిరుపమానవచఃకౌశలముతో పుడమి నాలుగు మూలలందు సత్యమును ప్రకటించిరి. కడుంగడు క్లిష్టములైన తాత్త్వికభావములు వారివలన సరళమై, స్పష్టమైన శైలిలో వ్యక్తీకరింపబడినవి. తమ యాధ్యాత్మిక దూరదృష్టివలన వేదాంతమును దైనందినజీవనమున కందించి, దాని యనుష్ఠానమున

మనలను బద్ధదీక్షితులను జేయుటకు వారు శక్తివంచనలేక కృషి సలిపిరి. మానవజాతి సుఖశాంతులతో వెలయవలెననిన, సర్వజనీనదృష్టి మిక్కిలి అక్కఱయైనదని తమ అల్పజీవితమందు వారు మాటిమాటికి చాటిరి. వైజ్ఞానికసూత్రములు భౌగోళికదూరమును నేడు సంకుచిత మొనరించినవి. వీనివలన మానవులు ఒండొరులకు మిగుల సన్నిహితులైరి. కావున నిపుడు విశాలమై, విశ్వజనీనమైన దృష్టి విశేషముగ నావశ్యకమై యున్నది. మనుష్యలోకమునకు మిగులగూర్చు నిక్కంపు నెచ్చెలియైన శ్రీ వివేకానందస్వాముల వారివలన అనల్పశక్తితో వ్యక్తీకరింపబడిన గంభీరభావబంధురాధ్యాత్మిక సందేశమును సర్వదిశలందు ప్రచార మొనరించుట ఇత్తఱి మిగుల నావశ్యకమైనది.

ఈ లక్ష్యమును దృష్టియం దిడికొని, ఆయన రచనలను, సూక్తులను సాధ్యమగునంతవఱకు అనేక ప్రాంతీయభాషలందు అనువదించి, ప్రజాళి కందించుట కీ శతవార్షికమహోత్సవసమయము తగిన యదనని ఊహించితిమి.

సాహిత్యభూషణ, విద్యాసాగర, జ్ఞానభాస్కర, అధ్యాత్మరత్న, అమృతవాక్యశిఖామణి, ఉపన్యాసకేసరి, వేదాంతవిద్యావిశారదాది బిరుదాంకితులు ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్., బి. టి. పి. గారు సమగ్రసంపుటమును పరిశోధించి, సంస్కరణ మొనరించిరి. అందలి కొన్ని భాగములను అనువదించిరి. వారికి మా ధన్యవాదములు.

శ్రీ వివేకానందస్వాములవారి
శతవార్షిక జన్మదినము
28 జనవరి, 1962

ప్రకాశకులు.

# విషయసూచిక



## జ్ఞానయోగము

# జ్ఞానయోగము

## మతావశ్యకత

(లండనులో ఉపన్యాసము)

మానవజాతిభవిష్యత్తును నిర్ణయించుటకు ఇంతవఱకు కారణభూతములయినటువంటియు, ఇంకను కారణభూతములగుచున్నట్టియు, మూలశక్తులు అనేకములు కలవు. వాని యన్నిటిలోను మతరూపమున గోచరించు దానిని మించినది వేఱొకటిలేదు. సమస్తసంఘవ్యవస్థలకును వెనుక ఎక్కడనో యొకచోట మతమహిమ యుండితీరును. నరసమాజములందు మిత్రత్వమునుగూర్చు శక్తులలో అత్యద్భుతమగు శక్తి మతము నుండియే యుద్భవమగుచున్నది. అనేక సందర్భములలో జాతి, దేశము, వంశము, అను బాంధవ్యములను మించి బలవత్తరమై మత సంబంధము వెలయుట మనమెఱుగుదుము. ఒక్క వంశములోనివారికంటెను, అన్నదమ్ములకంటెనుగూడ, ఒక్క దేవతనే పూజించుచు ఒక్కమతమునే అవలంబించువారు హెచ్చుగ పరస్పరవిశ్వాసమును పరస్పరాభిమానమును చూపుకొనుచు, ఒకరి కొకరు అండయై నిలుతురనుట మనమందఱ మెఱుగుదుము గదా! ఇట్టి మత మనుదాని యుత్పత్తి యెక్కడనో కనుగొనుటకై అనేక ప్రయత్నములు చేయబడినవి. ఇప్పటికి మనకు సంక్రమించి యున్న పురాతన మతములన్నింటను అవి అపౌరుషేయము లను వాదము కలదు. నరుని మేదస్సున కాక నరుని బుద్ధి కతీతమగు నెక్కడనో అవి ప్రభవించెనందురు.

ఈ కాలపు విద్యావంతులు కొంతవఱ కంగీకరించు సిద్ధాంతములు రెండున్నవి. మతము పైతృకము అను సిద్ధాంత మొకటి,

'అఖండ' భావనాపరిణామము అను సిద్ధాంతము రెండవది. మతమునకు ప్రథమదశ పితృదేవతారాధనమని ఒకపక్షమువారి వాదము; ప్రకృతియందలి మూలశక్తులకు మూర్తికల్పనచేయుట యని రెండవపక్షమువారి వాదము. మృతులయిన తన బంధువులను సంస్మరించుచుండవలయునను కోరిక నరునందు కలదు. శరీరము నాశనమైన పిమ్మటను వారు సజీవులయి యున్నటులనే భావనచేసి, వారికి పిండదానములచేయుచు, వారి నొకవిధముగ ఆరాధింప గోరును. దీనినుండి మతమనునది ప్రభవమందినది. ఈజిప్టు, బాబిలోనియా, చైనా, అమెరికా మొదలగు దేశములందలి అయా జాతులవారి పురాతన మతములను పరిశీలించి చూచిన యెడల పితృదేవతారాధనమే మతమున కాది యను సూచనలు విస్పష్టముగా కానవచ్చును. ప్రాచీనకాలపు ఈజిప్టు దేశీయులు ఆత్మయనగా ఒకవిధమగు సూక్ష్మశరీరమని భావించిరి. ప్రతి మనుజుని శరీరములోపలను, దానిం బోలు మఱొక శరీరము ఇమిడి యుండును. ఆ మనుజుడు మరణించునప్పుడు ఆ సూక్ష్మశరీరము వాని స్థూలశరీరమునుండి వెడలిపోవును. అయినను సజీవమైయే యుండును. కాని అట్లుండుట ఆ స్థూల మృతశరీరము శిథిలమై పోకుండ నిలిచియున్నంతవఱకే. అందువలననే ఈజిప్టువారు మృత కళేబరములు శిథిలమై పోకుండ గాపాడుట కంత శ్రద్ధ వహించుట! "పిరమిడు" లను నాలుగు కోణములుగలిగి గోపురాకారమున నుండు పెద్ద పెద్ద సమాధులు కట్టి వానియం దా కళేబరములను సంరక్షించుచుండిరి. బాహ్యశరీరమున ఏ భాగమేని కుంఠితమగుచో, అటువంటి నష్టమే సూక్ష్మశరీరమునకును కల్గునని వారి విశ్వాసము. ఇది పితృదేవతారాధనయనుట స్పష్టము. బాబిలోనియాలోని జనులు నిట్టి సూక్ష్మశరీర మొకటి కలదను విశ్వాసముకలవారే; కాని యొకింత భేదమున్నది. ఆ సూక్ష్మశరీరికి ప్రేమ యనునది యుండదందురు. తనకు ఆహారపానీయముల నిడుడని బ్రతికియున్న

వారిని బెదరించునట! పెక్కురీతుల తనకు సాహాయ్యముచేయు డనునట! వానికి సొంతబిడ్డలపైని భార్యపైనిగూడ ననురాగముండదు. పూర్వపు భారతీయులందును నిట్టి పితృపూజ కలదను సూచనలు చూపట్టుచున్నవి. చైనావారి మతమునకుగూడ పునాది పితృపూజనమే అని చెప్పవచ్చును. ఇప్పటికి నిది వారి దేశమందెల్లెడలను గోచరించుచున్నది. పితృదేవతారాధన మొక్కటే ఆ దేశములో వర్ధిలుచున్న మతమనికూడ చెప్ప వచ్చును. ఇటుల పితృపూజనమే మతమునకు మూలమని వాదించు వారికి ప్రబలాధార మొకపక్షమున నేర్పడుచున్నది.

మతము ప్రకృతిశక్తుల యారాధనమునుండి ఉత్పత్తిల్లినదని ప్రాచీనార్య గ్రంథములనుండి నిదర్శనములచూపు పండితులు రెండవపక్షమువారు. భారతదేశమందెల్లెడల పితృదేవతారాధన కలదను రుజువు లిప్పుడు కాన్పించుచున్నను, ప్రాచీన గ్రంథ ములందెక్కడను వానిజాడ కానరాదు. ఆర్యజాతివారి గ్రంథ ములలో ప్రాచీనతమమగునది ఋగ్వేద సంహిత. అందీ జాడ యెక్కడను కానబడదు. అందు కాన్పించునది ప్రకృతి యారా ధనమే యని ఆధునిక పండితవరుల యభిప్రాయమై యున్నది. ఈ దృశ్య ప్రపంచమునకు వెనుక దాగి యేమున్నదో కనుగొనవలయు నని మానవుని బుద్ధి సదా పెనగులాడుచుండును. ఉదయాస్త మానములు, తుపానులు, మహత్తర గంభీర ప్రకృతి శక్తులు, అందలి రమణీయత—యివి నరునిబుద్ధి నాకర్షించినవి; అంతటితో తృప్తినందక వాని రహస్యమును కొంత గ్రహింప వలయునను కాంక్ష పొడమెను. ఇటుల ప్రయత్నించు నరులు ఆ ప్రకృతి వికారములను సగుణములుగ భావనచేసి, యొకప్పుడు శోభస్కరములును, మఱొకప్పుడు ప్రకృతి కతీతములు, నగు శరీరాత్మలను వాని కారోపణచేయసాగిరి. అట్టి ప్రయత్నములు సాగినప్పుడెల్ల ఈ ప్రకృతి వికారములు, మొదట సగుణములుగ భావన చేయబడినను లేకున్నను, తుదకు నిర్గుణములుగ భావన

చేయబడుట మాత్రము సిద్ధించుచు వచ్చెను. గ్రీకుల విషయము నను నిటులనే సంభవించినది. వారి పురాణజాల మంతయు నిర్గుణారోపణతో గూడిన ప్రకృతి యారాధనమే. ప్రాచీనకాలపు జర్మనులు, స్కాండినేవియనులు, ఇంకను నితరులగు నార్యజాతుల సందర్భమునను ఇటులనే యైనది. కాబట్టి ప్రకృతి శక్తులను సగుణములుగ భావనచేయుట తోడనే మతము ప్రారంభమైనదను పక్షమునకును వాదబలము చేకూరుచున్నది.

ఈ రెండువాదములును పరస్పరము విరుద్ధములుగ కాన్పించుచున్నను, మూడవదగు నింకొక సిద్ధాంతముచేత వీనికి సమన్వయము కూర్పవచ్చును. అదియే మతమునకు నిజమగు అంకురమని నా మదికి తోచుచున్నది. ఇంద్రియము లేర్పఱచు హద్దులను అతిక్రమించు ప్రయత్నమే అది యని నా తలంపు. నరుడు తన పూర్వికుల (అనగా మృతులయిన వారి), ఆత్మలకొఱకు వెదకుచుండును; అనగా ఈ శరీరము నాశమైనపిమ్మట నిలిచియుండు దానిని గూర్చి తెలిసికొన ప్రయత్నించుచుండునన్నమాట. లేదా మహత్తరములయిన ప్రకృతి వికారములకు మూలమగు మహాశక్తిని గ్రహింప యత్నించుచుండును. ఈ రెండిటిలో నేదియైనను, ఒక్కవిషయము మాత్రము స్పష్టము. నరుడు తన యింద్రియ పరిమితులను దాటి పోజూచుచున్నాడు. అతడు తన యింద్రియములతో తృప్తుడై యుండజాలడు; వాని నతిక్రమింప జూచుచుండును. ఇందుకు కారణము సుబోధమే. మతమునుగూర్చిన ప్రప్రథమ జ్ఞానాంకురములు స్వప్నములద్వారమున వెలువడుట సహజమని నాకుతోచుచున్నది. అమృతత్వమునుగూర్చిన ప్రప్రథమ భావనకూడ స్వప్నద్వారముననే లభింపవచ్చును. స్వప్నము మహా విచిత్రావస్థగదా! పసివారును పామరులును జాగ్రత్ స్వప్నావస్థలకు గల భేదము నంతగా గ్రహింపజాలరని మన మెఱుగుదుము. శరీరము చూపులకు మృతమై యున్నట్లుతోచు నిద్రావస్థయందు మనసు దాని విచిత్రచర్యల నన్నింటిని సాగించు

చుండుననువాదము వారికి సహజమై కాన్పించుటయం దాశ్చర్య మేమున్నది? అట్లే యీ శరీరము నశించిన యనంతరమును నట్టి చర్యయే జరుగునని పర్యవసానమును తేల్చుట విడ్డూరమా? అలౌకిక సంఘటనల నిట్లు గ్రహించుట చాల సహజమని నా యభిప్రాయము. ఈ స్వప్నభావము నాధారముచేసికొని నరుని బుద్ధి క్రమక్రమముగ నుత్తమ భావనలకు కడంగగలదు. కాలము జరిగిన కొలదిని నరులం దధికసంఖ్యాకులు, ఈ స్వప్నములు జాగ్రదవస్థయందు ఋజువగునవి కాకున్నను, స్వప్నావస్థయందు నరుడు వేఱొక సత్తను పొందక, తాను మేల్కాంచియున్నప్పటి అనుభవములనే పునస్స్మరణ చేయుచుండునని గ్రహించి రనుట సత్యము.

అయినను అప్పటికే తత్త్వాన్వేషణము ప్రారంభమైనది; ఆ విచారణ అంతర్ముఖమును అయినది. మనస్సూక్ష్మతర దశాంతరముల గూర్చి విమర్శనలసాగించి, జాగ్రత్స్వప్నములను మించిన సూక్ష్మతరావస్థలను గనుగొనిరి. ప్రపంచమందలి సుస్థిర మతములన్నిటియందును ఈ యవస్థ పేర్కొనబడియే యున్నది. అది ఆవేశమనిగాని (ఎక్స్టసి), తన్మయతయనిగాని (ఇన్స్పిరేషన్) ప్రస్తావింపబడుచున్నది. ఆ మతములందన్నింటను ఆయా మతస్థాపనాచార్యులును, ప్రవక్తలును, ఉపదేశకులును, జాగ్రన్నిద్రావస్థలకు భిన్నములగు మనోదశలను పొందినట్లును, అందు వా రాధ్యాత్మికము లనబరగు నవ్యతరానుభవములను పొందినటులను ప్రకటింపబడుచుండెను. జాగ్రదవస్థయందు కంటె మిన్నగా వా రా దశయందు ఘనతర విషయములను గ్రహింప జాలియుండిరి. ఉదాహరణమునకు బ్రాహ్మణములలోని మతముల చూడుడు. వేదములను ఋషులు రచించిరందురు. కొన్ని సత్యముల నపరోక్షానుభూతిచే గడించినవారే యీ ఋషులు. ఋషి యనగా మంత్రద్రష్ట - అనగా వేదమంత్రములలో గల భావములను దర్శించిన వాడని యర్థము. అతీంద్రియవిషయములనుగూర్చి

"   ంచిరి" అను పదమును ప్రయోగించుటకు ఒప్పుకొంటిమేని, కొన్ని మహాసత్యములను తాము దర్శించిరనియు, వానిని గ్రంథస్థముల చేసిరనియు, వారు ప్రకటించిరి. ఇట్టి సత్యములనే యూదులును, క్రైస్తవులును ప్రవచించియున్నారు.

దక్షిణశాఖాసంప్రదాయమువారగు బౌద్ధుల విషయములో ఈ విషయమున నొ ంత యాక్షేపణ కవకాశమున్నది. బౌద్ధులు భగవంతుడన్నను, ఆత్మయన్నను, విశ్వసింపరు కదా, వారిమతమునకు అతీంద్రియావస్థయందలి యనుభవము లెట్లాధారము కాగల్గునని ప్రశ్నింపవచ్చును. అందుకు సమాధానమేమన, బౌద్ధులును సనాతన నీతిధర్మము నొకదానిని కనిపట్టిరి. ఆ నీతిధర్మము హేతుబద్ధ విచారముచే సిద్ధించినది కాదు. బుద్ధుడు అతీంద్రియావస్థయందు దానిని కనిపట్టి ప్రకటించియున్నాడు. "ది లైట్ ఆఫ్ ఏషియా" యను మనోహర పద్యకావ్యమున బుద్ధ చరిత్రము క్లప్తముగ చెప్పబడినది. అతీంద్రియావస్థను పొందువఱకును బుద్ధుడొక యశ్వత్థవృక్షముక్రింద కూర్చుండినటుల ఆ గ్రంథమున చెప్పబడియున్నదిగదా! ఆయన యుపదేశములన్నియు నట్టి యవస్థలో ఉపలబ్ధములైనవే కాని, ఆలోచనామూలమున లభించినవి కావు.

ఈ విధముగా నన్ని మతములు నొక మహత్తర భావమును ప్రకటించుచున్నవి. నరుని మనస్సు కొన్ని సమయములందు ఇంద్రియాతీత క్షేత్రములకు పోవుటే కాక, యుక్తియుక్తవిచార క్షేత్రమును కూడ దాటిపోవునట! అప్పుడది యింద్రియము లెన్నడు ననుభవింపజాలనట్టియు, తర్కమునకు గోచరింపజాలనట్టియు, సత్యములను ప్రత్యక్షముగ చూడగలదు. ఇట్టి సత్యములే ప్రపంచమున నన్ని మతములకును మూలాధారములు. ఈ సత్యములను శంకించుటకును, తర్కముచే పరీక్షించుటకును, మన కధికారము కలదు నిజమే. అయినను లోకములోని యన్ని మతములును ఇంద్రియముల

యావరణలను, తర్క-ప్రహేద్దులను, దాటిపోగల యీ విచిత్రశక్తి మనస్సునకు కలదని సిద్ధాంతీకరించుచున్నవి.

మతములన్నియు ప్రకటించు నీ విషయము లెంతవఱకు నిజమో యను విచారణ యటుండ, నొక్క-విశేషము వానియన్నింటికి సామాన్యమై కన్పించుచున్నది. పదార్థవిజ్ఞానశాస్త్రము కనిపట్టిన ప్రత్యక్షరూపసత్యములవంటివి గాక, యివన్నియు కేవల భావైకగమ్యములు. సునిర్మితములయిన సకల మతతత్త్వము లందును నివి కేవల సత్తగా — భావమయవ్యక్తి యనిగాని, సర్వవ్యాపియనిగాని, భావైకగమ్యుడగు దేవుడనిగాని, నీతిశాసన మనిగాని, అస్తిత్వముగల ప్రతిదానికిని నాధారమగు మూలసత్త్వ మనిగాని—ప్రవచింపబడుచున్నవి. ఈ కాలమునందు సయితము, ఇంద్రియాతీతమగు మనస్థితితో ప్రమేయము లేకుండ మతబోధలు సల్పుచున్నామని చెప్పువారందఱును, ప్రాచీనుల ఈ పురాతనభావములనే కైకొని వానికి ''నీతిశాస్త్రము'', ''ఐక్యాదర్శము'' మొదలగు క్రొత్తపేర్లు పెట్టుచుండుట గమనార్హము. దీనినిబట్టి ఈ భావకల్పనము ఇంద్రియములందు ప్రభవమగుట లేదని తెలుచున్నది. మనలో నెవరుగాని పూర్ణాదర్శమూర్తియగు నరుని కాంచియుండము. అయినను నట్టివాని యునికిని విశ్వసింపుడని యుపదేశమునొందుచున్నాము. మనమెవరమును పరమాదర్శమూర్తిని ఇంకను ప్రత్యక్షము చేసికొనియుండకపోయినను, అటువంటి యాదర్శము లేనిది పురోభివృద్ధి కాంచజాలకున్నాము. కావున ఆదర్శభావైకమూర్తి యొకటి కలదనియు, దానిని ఈ మతములన్నియు మన యెదుట నుంప ప్రయత్నించుచున్నవనియు, స్పష్టమగుచున్నది. ఆ మూర్తిని సగుణ పురుషరూపముననో, నిర్గుణభావముగనో, ఒక విశిష్టధర్మముగనో, కేవలసత్తారూపముగనో, అవి చిత్రించును. ఆ యాదర్శముతో తాదాత్మ్యమునుపొందుటకే మనము నిరంతరమును శ్రమపడుచున్నాము. ప్రతి మానవుడును, నత డెట్టివాడైనను, ఎక్కడనున్నను, సర్వశక్తిమంతమగు నొక ఆదర్శమూర్తిని భావనచేయు

చుండును. ప్రతి నరుడును ఒక యఖండానందమయరూపుని ఆదర్శముగ భావనచేయుచుండును. మనచుట్టును జరుగు కార్యములన్నియు, సర్వత్ర ప్రకటితమగు ప్రవృత్తియంతయు, ఆ అప్రతిహతశక్తినో, ఆ పరిపూర్ణానందమునో, చేరుటకై జరుగు పెనగులాటయే సుడీ. కాని, తామెంతగా నీ యప్రతిహత శక్తిగొఱకై యత్నించుచున్నను, అది యింద్రియముల ద్వారమున లభించునది కాదని కొందఱు త్వరలోనే గ్రహింతురు. ఆ శాశ్వతానందముకూడ ఈ యింద్రియముల ద్వారమున లభించునది కాదని త్వరలోనే తెలిసికొందురు. అనగా, ఆ యఖండతను గ్రహించుటకీ యింద్రియముల ప్రజ్ఞ చాలదనియు, ఈ శరీరమున కట్టి శక్తిలేదనియు గ్రహింతురు. పరిమితమగు నెద్దాని సాహాయ్యమునకాని అఖండమును వ్యక్తము చేయుట యసంభవము. ఇట్లు ఖండమును సహాయముగగొని అఖండమును వ్యక్తపఱచు ప్రయత్నమును విడువవలసివచ్చునని నరుడు ఎప్పుడో యొకప్పుడు తెలిసికొనును. ఈ విరామమే, అనగా ఈ ప్రయత్నమును విడనాడుటయే, నీతిధర్మమునకు పునాది. పరిత్యాగమే నీతిసూత్రమున కాధారము. త్యాగశీలముపై నాధారపడని నీతిశాస్త్ర మెన్నడుగాని బోధింపబడియుండలేదు.

"నాహం; త్వమేవ" (నేనుకాదు. నీవే) అనియే నీతిధర్మము ఘోషించుచుండును. "అహంకాదు; నాహం" అనునదే దాని యాదర్శసూత్రము. ఇంద్రియముల ద్వారమున ఆ అనంతశక్తినికాని, ఆ పూర్ణానందమునుకాని, పొంద యత్నించునప్పుడు, నరుడు గట్టిగ పట్టుకొనియుండు నిరర్థక వ్యష్టిత్వమును పరిత్యజింపవలయునని నీతిశాస్త్రము శాసించుచున్నది. నీవు కడపట నిలిచి యితరులను నీకు ముందుగ నిలుపవలసియుండును. ఇంద్రియములు "నేను" ముందు, అనుచుండును; నీతిధర్మమో "నేను" తుది నుండవలయును అనును. ఇట్లు నీతిశాస్త్రములన్నిటికిని పరిత్యాగము (వైరాగ్యము) పునాదిగ నున్నది. భౌతిక ప్రపంచమున 'వ్యష్టి' వినాశము కావలయును; ప్రస్ఫుటము

కాదగదు. ఆ యనంతమూర్తి యీ భౌతిక ప్రపంచమున వ్యక్తమగువాడు కాడు. అట్లగుట సాధ్యపడదు; ఊహింపను నలవి కాదు.

నరుడా యఖండమూర్తిని చక్కగ దర్శింపగోరు నెడల ఈ భౌతిక ప్రపంచమును త్యజించి లోకాంతరముల కుద్గమనము చేయవలయును. ఈరీతిగా భావన చేయగా వివిధములగు నీతిశాస్త్రములు నిర్మితములయినవి. వానియన్నింటను సంతతాహంకారత్యాగమను ప్రధానభావ మమరి యున్నది. అహంకారమును పరిపూర్ణముగ నడంచివేయుటే నీతికి పరమగమ్యము. తమ వ్యష్టిత్వములగూర్చి తలపోయతగదని చెప్పినచో నరులు వెఱగందుదురు. వ్యష్టిత్వ మను దానిని కోల్పోవుటనిన వారు మిగుల భీతిల్లునట్లు కన్పింతురు. అయినను ఈ పురుషవరులే నీతిధర్మ పరమాదర్శములు సమంజసములని వక్కాణింతురు. కాని సమస్త నీతికిని ప్రయోజనమును, పరమార్థమును, గమ్యమును, ఈ వ్యష్టిత్వ భంజనమే కాని, వ్యష్టిత్వ నిర్మాణ మేమాత్రము కాదని వారు తలచుటయే లేదే!

నరులమధ్య నేర్పడు నైతికసంబంధములను ''ఉపయోగ మానములు'' (యుటిలిటేరియన్ స్టాండర్డ్స్) వివరింపజాలవు; ఏలయన ఉపయోగమను దాని విచారణనుబట్టి నీతి సూత్రము లేర్పడుట లేనేలేదు. ఈ ప్రకృతి కతీతమగు నొక యాధారములేనిది, అనగా అతీంద్రియ దృష్టియని నేను పేర్కొనునది లేకుండ, నీతి ధర్మమే కలుగదు. పరిపూర్ణమునుచేరు ఆవేదన లేనియెడలపరమాదర్శ మనునదేయుండజాలదు. మానవులను తమతమ సంఘ నియమములకు లోబఱచి బంధించి యుంపగోరు ఏసంప్రదాయమును, మానవధర్మశాస్త్రసూత్రములకు వివరణమును కూర్పజాలదు. ప్రయోజన సిద్ధాంతమునుబట్టి వాదించు నతడు మనలను పరిపూర్ణమునుగూర్చిన యత్నమునే విడువుడని కోరును; అతీంద్రియానుభవములకైన సాధనము పొసగునది కాదనియు, వెఱ్ఱి

ప్రయత్నమనియు, వాదించును. కాని యట్లనుచునే నీతి నవలంబించి సంఘశ్రేయము నొడగూర్పుడని హెచ్చరించుచుండును. మనము సత్కార్యాచరణమేల కావింపవలయును? సత్కార్యమనునది యవాంతర (సెకండరి) విషయము. మన కొక గమ్యముండవలయును గదా. నీతియే పరమార్థము కాజాలదు. అదియొక పరమావధిని చేర్చు సాధనమాత్రము. ఆ గమ్యము అభావమైనచో మనము నీతిమంతులముగ నుండనేల? నేను ఇతర మానవులకు ఉపకార మేల చేయవలయును? అపకార మేల చేయరాదు? సుఖానుభవమే నరజాతికి గమ్యమైనయెడల, నేను నా సౌఖ్య మేల చూచుకొనతగదు? ఇతరుల కసౌఖ్యమేల యొడగూర్పరాదు? అందు నన్నాటంకి పఱచునదేమి కలదు? మఱియు ప్రయోజన వాదమునకు గల యాధారము కడు సంకుచితమైనది. ఈనాటి సంఘాచార సంప్రదాయములన్నియు నేడున్న సంఘము నుండి యుద్భవమగుచున్నవి. సంఘము శాశ్వతముగ నుండునదని ఊహించుటకు ప్రయోజనవాది కేమి యాధారముగలదు? సంఘము యుగాంతరములకు పూర్వ మున్నదికాదు; యుగాంతరములకు పిమ్మట నిక నుండకయుపోవచ్చు. ఒకవేళ నిది మన మత్యుత్తమ పరిణామమును పొందుకడకలో మధ్యసంఘటిలిన తాత్కాలికావస్థ కానోపును. కావున సంఘమునుండి మాత్రమే సంగ్రహింపబడిన యే ధర్మమును స్థిరస్థాయిగ నుండజాలదు; అది మానవ స్వభావమునంతను తనలో నిముడ్చుకొనజాలదు. ఈ ప్రయోజనవాద సిద్ధాంతములు ప్రస్తుత సంఘస్థితి కనుకూలముగా మాత్ర ముపకరింప జాలు ననవచ్చునేమో. అంతకు మించి వానికి విలువయుండజాలదు. కాని మతమునుండియు, ఆధ్యాత్మిక విచారమునుండియు, సంగ్రహింపబడిన ధర్మ సిద్ధాంతముకాని, నీతిశాస్త్రముకాని, నరుని యనంత స్వరూపమును పూర్ణముగ తనలో నిముడ్చుకొనగలంత విశాలమైనదిగ నుండును. అది వ్యష్టి ప్రసక్తినిక్కై కొనియు అఖండము తోడి సంబంధము కలిగియే వర్తిం

చును. సంఘముతోడను ప్రసక్తి కలిగియుండును. ఏలయన వ్యష్టి నరులు కొందఱు కూడియేగదా సంఘ మేర్పడు చున్నది. కావున నది వ్యష్టికిని, వాని శాశ్వత జీవనమునకు, ననువర్తించును. అటులనే, సంఘమంతటికిని, ఆ సంఘము ఏకాలమున నే స్థితియం దున్నను గూడ, అనువర్తింపగలదు. కావున మానవజాతికి ఆధ్యాత్మికమగు మత మెల్లప్పుడును అవసరమగుచునే యుండునని మనము గ్రహింపగలము. జడపదార్థజాలమునుగూర్చి విచారించు చుండుటెంత యానంద ప్రదముగ చూపట్టినను, నరుడు సర్వకాల మును దానిని గూర్చియే సంస్మరించుచుండజాలడు.

ఆధ్యాత్మిక విషయములను గూర్చి యత్యంతము విచారణ పెట్టుకొనిన యెడల నీ ప్రపంచములో వ్యవహార సరణికడ్డుపడునను వాదము కలదు. "మనము ముం దీ లోకవ్యవహారములనుగూర్చి శ్రద్ధవహింతము గాక. ఈ లోక వ్యవహారములు సంపూర్తియైన పిమ్మట పరలోకముల గూర్చి విచారింపగలము" అను వాదము చైనాదేశ ఋషియగు కన్ఫ్యూషియసు నాటి ప్రాచీనకాలమునను కలదు. ఈ లోకమునుగూర్చి శ్రద్ధపూనుట మంచిదే; కాని పార మార్థిక విషయములను గూర్చి యత్యంత విచారము పెట్టుకొనిన యెడ, మన వ్యవహార సంబంధము 'లోకింత' విచ్ఛిన్నమగుచో, ఐహిక వ్యవహార సంబంధమునుగూర్చియే యత్యంతము విచారణ పెట్టుకొనినయెడ, నిహాపరముల రెంటికిని భంగముచేకూరునే! ఇది మనలను నాస్తికులనుగ చేసివేయును. నరునకు ప్రకృతి పరమ గమ్యము కాదు గదా! అంతకన్న నుత్తమమగు పరమార్థము కలదు కదా!

ప్రకృతి నతిక్రమింప యత్నించుచున్నంత వఱకే మాన వుడు మానవు డనిపించుకొన నర్హుడగును. ఈ ప్రకృతి బాహ్య మనియు, ఆంతరమనియు రెండు తెరగుల నుండును. మన శరీర మునందును, దాని వెలుపలను, నుండు జడపదార్థ పరమాణువు

లను పాలించు ధర్మములేకాక, ఆంతరమై వెలయు సూక్ష్మతర ప్రకృతిని పాలించునవికూడ, ఈ ప్రకృతిశబ్దములో చేరును. బాహ్యప్రకృతిని సయితము సత్యముగ పాలనము చేయు మూల శక్తి ఈ సూక్ష్మతర ప్రకృతియే. బాహ్యప్రకృతిని జయించుట ఘన కార్యమే, కాని మన అభ్యంతర ప్రకృతిని జయించుట యింకను ఘనతర కార్యమగును! ఈ నక్షత్రములను, గ్రహములను, పాలించు ధర్మములను గ్రహించుట ఘనమే, మాననీయమే. కాని నరుని విషయ వాంఛలను, భావములను, ఇచ్ఛాశక్తిని, పాలనముచేయు ప్రకృతిధర్మములను తెలిసికొనుట యత్యంతము ఘనతరమును, మాన్యతరము, నగును. ఈ యభ్యంతర పురుషుని జయించుటయు, మానవ హృదయాంతరమున పరగు సూక్ష్మతర చర్యల రహస్యమును గ్రహించుటయు, సంపూర్ణముగ మతమునకు మాత్రమే సంబంధించినకార్యము. మానవ ప్రకృతి—అనగా సామాన్య మానవ ప్రకృతి — గొప్ప గొప్ప ఆధిభౌతిక విషయములనే గమనింపగోరును. సామాన్య మానవునకు సూక్ష్మతర విషయము లేవియు తెలియవు. అందువలననే పామరజనము వేనవేల గొఱ్ఱెపిల్లల చంపు సింహమును చూచి మెచ్చుకొందురు. అది సింహమునకు తాత్కాలికముగా జయము నాపాదించినను, గొఱ్ఱెపిల్లల పాలిటి మృత్యువగుచున్నదని కటా, వారొక క్షణమాగి తలపోయరే! పశుబల ప్రకటనము వారికి ముదమును కూర్చు నందురు. సరే సామాన్య నరసంఘ మిటులున్నది. బాహ్యగతమగు దాని నెల్ల వారు కాంచి యానందింతురు. కాని ప్రతి సంఘమునందును నింకొక తెగవారు కలరు. వారి యానంద మింద్రియానుభవములందు లేదు. అందు కతీతముగ నుండును. ఈ జడపదార్థమున కతీతమై వెలయు దానిజాడను వారప్పుడప్పుడు దర్శింతురు. దానిని పొందుటకై వారు గిజ గిజ లాడుచుందురు. వివిధ జాతుల చరిత్రను విమర్శన దృష్టితో పఠించితిమేని, ఇటువంటి నరసత్తముల సంఖ్య యేజాతి

యందు హెచ్చుగ నుండునో, ఆజాతి యున్నతి పొందుచుండు ననియు, పరిపూర్ణమునుగూర్చిన యీ యన్వేషణము — ప్రయోజనవాదు లది వ్యర్థమైనదందురు గాక — ఏ జాతిలో క్షీణించునో ఆ జాతి దైన్యము నందుచుండుననియు, మనము గ్రహింపగలము. అనగా ఏ జాతికైనను దాని యాధ్యాత్మికవర్తనమే స్థాపనమునకు మూలాధార మనియు, ఆ యాధ్యాత్మిక చింత క్షీణించి, నాస్తికత బలపడినప్పు, డా జాతికి మరణ చిహ్నములు మొదలు పెట్టుననియు నర్థము.

మత విచారము వలన మనము నేర్వగల సుస్థిర విషయములును సత్యములు నటుండ, అందువలన మన మనుభవింపజాలు నానందమటుండ, మతము నొక శాస్త్రముగను, నొక యధ్యయనాంశముగను మాత్రమే గ్రహించినను, దానివలన నరుని బుద్ధికి లభింపగల వ్యవసాయము సయితము అత్యంత శ్రేయస్కరమును, ఉత్తమోత్తమమునై యుండగలదు. పరిపూర్ణమును గూర్చిన విచారణయు, ఆ అఖండ స్వరూపము నవగాహనము చేసికొనగోరు యత్నమును, ఇంద్రియానుభవములను, అనగా భౌతిక ప్రపంచమును, దాటి పోవలయునను కడకయు, ఆధ్యాత్మిక పురుషుడుగ పరిణతిగాంచు ఆకాంక్షయు—ఇంతేల మనవ్యక్తి పరిపూర్ణముతో తాదాత్మ్యమును పొందుకొఱకై రేయింబవళ్లు సాగించు సాధన — ఈ తీవ్ర ప్రయత్నమే, మానవుడు చేయగల సాధనలలో నెల్ల ఘనతమమును, మాన్యతమమును అనుటకు సందియము లేదు! కొందఱు తిండి తినుటయందు మహానందము ననుభవింతురు. వారి నధిక్షేపించుటకు మన కధికారము లేదు. మఱికొందఱికి కొన్ని కొన్ని వస్తువులను సేకరించి పెట్టుకొనుటయం దానందము చూపట్టును. వా రటుల చేయతగ దనుటకు మన కర్హత లేదు. అటులనే ఆధ్యాత్మిక విచారమున మహానందము ననుభవించు పురుషునిజూచి "కా"దనుటకును వా రెవరును అర్హులు కారు! జీవి క్షుద్రతరమైన కొలదిని ఇంద్రియానుభవములవలన కల్గు

ఆనందము హెచ్చుగనుండును. కుక్కకాని తోడేలుకాని తన యెరను తినునంతటి మక్కువతో నరుడు తన యాహారమును తిన జాలడు. కాని యా కుక్కయు తోడేలును ననుభవించు సుఖాను భవము లన్నియు వాని వాని యింద్రియములందు మాత్రము చొచ్చుకొనె ననవచ్చును. ప్రతిజాతియందును క్షుద్రమానవకోటి యిట్లే తమ యింద్రియానుభవములం దానందము గాంచు చుండును; సంస్కారులును, విద్యావంతులును మననము, తత్త్వ విచారము, కళలు, శాస్త్రములు మున్నగువానివలన ఆనందమును పొందుదురు. ఆధ్యాత్మికసాధన మింకను ఉత్తమవృత్తి యన దగును. ఆ విషయ మనంతమగుటంజేసి యా క్షేత్రమత్యుత్తమమై వఱలును. అచ్చో ననుభవించు నానందముకూడ దానియందు రుచిగలవారికి, మహోత్కృష్టమై తనరునుసుడీ. కాబట్టి నరు డానందము కొఱకై పాటుపడవలసినదేయను ప్రయోజనవాదుల మతము ననుసరించినను, సర్వమునందును ఆధ్యాత్మికానందము మహోత్కృష్టమగుటచేత, నరుడు పారమార్థిక చింతను సాధన చేయవలసినవా డగుచున్నాడు. కావున ఆధ్యాత్మిక వ్యాసంగము నా మనసున కత్యంతావశ్యక విషయముగ తోచుచున్నది. దాని ఫలమునుబట్టి చూచిన నదట్టిదేయని మనకు తెలియును. మానవ హృదయమున చలనము కల్గింపగల అత్యుత్తమశక్తి అందు కలదు. ఆధ్యాత్మికముకానట్టి మతేపరమార్థమును అంతటి శక్తిని మనయందు ఉద్దీపింప చేయజాలదు. మానవకోటి చరిత్ర మనకు తెలిసినంతలో నిట్లేయుండెననియు, దానిమహిమ సమయ లేదనియు స్పష్టమగుచునేయున్నది. కేవలము ప్రయోజనవాదము నవలంబించు పురుషులు సయితము నీతిమంతులును, నుత్తములునై యుండగల రనుటను నేను కాదనను. కేవలము ప్రయోజనవాదమును పాటించు వారిలోకూడ మనీషావంతులును, నీతిమంతులును, యోగ్యులు నగు ఘను లీ ప్రపంచమున చాలమంది కలరు. అయినను జగదు ద్ధారకులగువారు, లోకమున వశీకరణ శక్తిని మిగుల ప్రయోగించు

చుండిరో యన దగువారు, తమభావములను శతసహస్ర సంఖ్యాకులలో ప్రవేశపెట్టి నడుపజాలువారు, తమజీవితముచేతనే ఆధ్యాత్మికవహ్నిని ఇతరులలో ప్రజ్వరిల చేయగలవారు—ఇట్టివారి నందఱిని వెనుకనుండి నడుపునది ఆధ్యాత్మికచింతయేయని, అనగా పారమార్థికవిచారమేయని, తెలియుచున్నది. వారిని కదల్చు ఆ మూలశక్తియే మతము. ప్రతి నరునికిని సహజమును, జన్మస్వాస్థ్యమునగు, అనంతశక్తిని ప్రత్యక్షము కావించుకొనుటకై ప్రేరేపించు మహాశక్తి మతమే! శీలనిర్మాణమునందును, శ్రేయస్కరమును ఘనము నగు ప్రతి కార్యమును ప్రోత్సహించుటందును, ఇతరులకు శాంతిగూర్చుటందును, తమశాంతినొడగూర్చుకొనుటందును, మూలాధారశక్తియై పరగునది మతమే! కాబట్టి యీ దృష్టితో ఆధ్యాత్మికచింతకు కడంగవలయును. మతము నిప్పుడు పూర్వముకంటె విశాలతర భావముతో పరిశీలింపవలసియున్నది. సంకుచితములును, పరిమితములును, కలహకారణములునగు మత భావము లంతరింపవలసియున్నవి. మతమునుగూర్చిన భిన్నసంప్రదాయ భావములన్నియు—జాతి, శ్రేణి, సంబంధమగు పృథగ్భావములన్నియు—విడిచివేయవలయును. ప్రతిశ్రేణికి ప్రతిజాతికి ఒక ప్రత్యేక దేవత యుండవలయునను భావమును, తక్కినవారందఱును నపమార్గానువర్తులనెడు భావమును, మూఢవిశ్వాసమువలన కల్గుచున్నవని గ్రహించి విసర్జనము చేయవలసియుండును. అట్టి యూహల నన్నింటిని పాఱద్రోలవలయును.

మానవబుద్ధి వికసించు కొలదిని దాని ఆధ్యాత్మికగమనము కూడ విశాలమగుచుండును. ఎవడేని ఒక భావమును గ్రంథస్థము కావించినచో, అది పుడమిని వెంటనే దిశాంతములదనుక వ్యాపించు నట్టికాలము వచ్చినది. కేవలము ఆధిభౌతిక సాధనములచేతనే మనకు ప్రపంచమంతటితోను సంసర్గము కలుగుచున్నది. కావున భవిష్యత్కాల మతము లన్నియు తదనుగుణముగా విశాలములై, విశ్వజనీనములై, పరగవలయును.

భావికాలపు పారమార్థికాదర్శములు జగమున నుత్తమమును మహనీయమును అయియుండు దానినంతటిని తమలో నిముడ్చుకొనుటయేకాక, అనంతర కాలపరిణతినికూడ ఇముడ్చుకొనుటకు పరిపూర్ణావకాశము నీయగలిగియుండవలయును. పూర్వమందున్న దానిలో యోగ్యమగున దెల్ల రక్షింపబడవలయును. ఇదివఱకే సంచితమైయున్న దానితో భావికాలమున నింకను నూతనమగు దానిని చేర్చుట కవకాశ ముండవలసినదే. మతములు పూర్ణోదారములుగ నుండవలయును. తమ తమ ప్రత్యేక భగవదాదర్శములు భిన్నములుగానుండు కారణమున, నొకదాని నొకటి ద్వేషించుకొనదగదు. భగవంతుడొకడు కలడు అని — మన భావముల ప్రకారము—ఏమాత్రము విశ్వసింపక పోయినను, ఆత్మవిద్యాపరాయణులును వివేకవంతులునునై యున్నవారిని పెక్కుమందిని నేను స్వయముగా చూచియున్నాను. ఎన్నటికైన మనము గ్రహింపగల దానికంటె హెచ్చుగ వారు భగవంతుని గ్రహించి యుండినను ఉండవచ్చును. సగుణబ్రహ్మము, నిర్గుణబ్రహ్మము, పరిపూర్ణము, నీతిధర్మము, స్థితప్రజ్ఞత్వము మున్నగు సర్వమును మతనిర్వచనమున నిమిడియుండవలయును. మతము లిట్లు విశాలములైనప్పుడు నూఱంతలు హెచ్చుగ శ్రేయోదాయకములై వఱలగలవు. మతములు మహాశక్తిమంతములయ్యును సంకుచితములై పోవుటవలన ప్రపంచములో మేలుకంటె కీడునే హెచ్చుగ కల్గించి యున్నవి.

ఈ కాలమున సయితము అనేక మతసంప్రదాయములును సమాజములును, దాదాపుగా నొక్కవిధమగు ధర్మాదర్శముతే కలిగి యుండియు, ఒకరా యాదర్శముల ప్రకటించిన రీతిని తప్పియే కించిద్భేదముతోడనో మఱొకరు వానిని ప్రకటించుకారణమున, తమలో తాము పోరాటములు సలుపుచుండుట కాంచగలము. కాబట్టి మతములు విశాలతరములై యుండితీరవలెను. మతభావములు సార్వజనీనములును, విశాలములును, నఖండములును

కావలయును. అట్లయినప్పుడే "మతము" పూర్ణప్రయోజనకరము కాగలదు. మతమహిమ యిప్పుడిప్పుడే ప్రపంచమున ప్రకాశమునకు వచ్చుచున్నది. మతములు మృతము లగుచున్నవనియు, ప్రపంచమునుండి పారమార్థిక చింతలు తొలగిపోవుచున్నవనియు నొక్కొక్కప్పుడు చెప్పుటకలదు. నాకో యవి యిప్పుడే పెంపొందుట కారంభించినట్లు కన్పించుచున్నది. మతమహిమ విశాలమై, పవిత్రీకృతమై, నరజీవితమునందలి ప్రతియంశమునను చొరనున్నది. మతము ప్రత్యేకముగా కొందఱి చేతులలో — అనగా కొందఱు పురోహితుల చేతులలో—ఉన్నంత కాలమును, అది దేవాలయములందును, క్రైస్తవులగుడులందును, పుస్తకములందును, సిద్ధాంతములందును, కర్మకాండయందును, విగ్రహములందును, సంస్కారములందును మాత్రమే నిలిచిపోయియుండినది. కాని సత్యమును, పారమార్థికమును, విశ్వజనీనమునగు రూపము నొందినప్పుడు మాత్రమే, మతము సనాతనమును సజీవమును నై సత్వరము వర్ధిల్లగలదు. అప్పుడే యది మనప్రకృతిలోనికి చొచ్చును; మన ప్రతియుద్యమమును చైతన్యవంతముగ నొనర్చును; మన సంఘమున సర్వత్ర చొచ్చుకొనిపోయి వ్యాపించును; ఇదివఱ కెన్నడును జరిగియుండ నంతగా శుభప్రదమై అనంతశక్తితో వెలయగలదు.

అన్ని మతవిధానములును కలిసియే కూలిపోవుటో, నిలిచియుండుటో తటస్థించును కావున ఆయా సంప్రదాయములందు పరస్పర సమరసభావమమరియుండుట అత్యంత ముఖ్యము. ఆ సమరసభావము పరస్పర గౌరవమర్యాదలపై నాధారపడి యుండవలయును. కాని, యీనాడు అనేకుల కలవాటైపోయినరీతిని, అనుగ్రహించినట్లు, ప్రసాదించినట్లు చులకనగా చూపు సుహృద్భావము పైని ఆధారపడియుండరాదుసుడీ! అన్నిటికంటెను ముఖ్యావసరమగున దేమన ఈ దినములలో నయితము అనన్యసామాన్యాధికారముతో 'మతము' అను పేరును భుక్తముచేసి

కొనియున్న మనోవికార పరామర్శ ననుసరించి ప్రబలిన ఆయా మతాచారసంప్రదాయముల నడుమ మైత్రి చేకూరవలసియున్నది. ఈమతసంప్రదాయముల పాదములు పుడమినే హత్తుకొనియుండగా, వీని శిఖరములు మాత్రము గహనతరఖగోళమును భేదించుకొని పోవుచుండెనో యన తోచుచున్నది; అనగా భౌతికశాస్త్రప్రాబల్యముమాట చెప్పుచున్నాను.

ఇట్టి చెలిమి పొసగుట కిరుతెగలవారును కొన్ని పట్టుదలలను విడువవలసివచ్చును; మిక్కిలి ముఖ్యమైనవానినికూడ—ఒక్కొక్క సందర్భమున పరితాపముల భరించియు — విడువవలసియుండును. కాని యిటువంటి త్యాగమున కొడంబడుటవలన, ఇరుతెగలవారును లాభమునే పడసి, సత్యముగా పురోగమనము చేసినవారే అగుదురు సుడీ! పర్యవసానమున, దేశకాలపరిమితులచే ఇప్పుడు కట్టువడి పోయియున్న విజ్ఞానము, అట్టి దేశకాలములచే కట్టువడక, మనస్సునకును ఇంద్రియములకును అందరాక వీని కతీతముగ వెలయుచు, అవ్యక్తమును అనంతమునునై యుండు 'ఏకమే వాద్వితీయ' మగు ప్రజ్ఞానమును కలిసికొని అందైక్యమును పొందగల్గును.



# మానవుని యథార్థస్వరూపము

(లండనులో ఉపన్యస్తము)

మానవుడు తన యింద్రియములను గాఢముగా నమ్మును. తాను జీవించునట్టియు, నిత్యవిహార మొనర్చుచుండునట్టియు, ఈ బాహ్యప్రపంచ మతనికి వాస్తవముగాతోచుట సహజమే కదా! కాని ప్రతిమానవుని బుద్ధిలోను, ప్రతిజాతి బుద్ధిలోను ఏదో యొక తరుణమున "ఇది సత్యమేనా?" అను ప్రశ్న అప్రయత్నముగా ఉత్పన్నమగుచున్నది. కాల మంతయు వివిధములగు విషయభోగములందే కడపుచు "ఇంద్రియములను నమ్మదగునా?" అని ఆలోచించుటకైన తీఱిక లేనివానిని కూడ మరణ మెదుర్కొనును. అప్పు డతడును విషయవాస్తవికతను సంశయింప వలసివచ్చును. "జగత్తు వాస్తవమేనా?" అను సమస్యయే ఆస్తికధర్మజీవనము (రిలిజియను) న కారంభము. దాని పరిష్కారమే ఆ జీవనపరమార్థము. ఐతిహాసికయుగమునకు పూర్వము, పురాణయుగమునకుకూడ పూర్వము, నాగరికతాప్రభాకరు డుదయించుటకును పూర్వము, మానవబుద్ధి యింకను కనుచీకటిలో తడవులాడుచున్న ఆదిమకాలమునకూడ, ఈ ప్రశ్నయే బయలు దేఱెను: "ఇది యేమగును? ఏది వాస్తవము?"

"నరుని మరణమునుగూర్చి రెండు భిన్నాభిప్రాయములు కలవు: అతడు శాశ్వతముగా అంతరించెనని కొందఱివాదము, జీవించియే ఉన్నాడని మఱికొందఱి వాదము. ఇం దేది నిజము?" అను విచారముతోనే కఠోపనిషత్తు ప్రారంభమగుచున్నది. ఈ ప్రశ్న కెన్నెన్నియో సమాధానము లీయబడినవి. మానసిక శాస్త్రములు, వేదాంతశాస్త్రములు, మతశాస్త్రములు: ఇవన్నియు ఈ సమాధానములతోనే నిండియున్నవి. కొందఱీ

విచారమునే—“మరణానంతర మేమి కలదు? ఏది నిత్యము?” అను ప్రశ్నలకు మూలమైన బుద్ధి అశాంతినే—అణచివేయచూచిరి.* కాని, మరణము అనునది ఉండునంతకాలము, ఇట్టి ప్రయత్నము లెట్లు కొనసాగగలవు? ఇంద్రియాతీతమైనదేదియు లేదనియు, మన ఆశలను, లక్ష్యములను, ప్రస్తుతకాలపరిమితిలోనే యుంతు మనియు, చెప్పవచ్చును. ఇంద్రియప్రపంచమును దాటిపోకుండ చిత్తమును నిరోధింప యత్నింపవచ్చును. బుద్ధిని ఇట్లు అరికట్టి యుంచు యత్నమునకు బాహ్యప్రపంచ మంతయు సహకరింప వచ్చును. ఈ నిరోధనోద్యమమున లోకులందఱును ఏకీభవించినను, ఏకీభవింపవచ్చును. కాని, మరణ మనునది ఉండునంతకాలము “నిత్యాతినిత్యము లైనట్టును, సత్యాతిసత్యము లైనట్టును, మన మెంతో జలగపట్టుతో పట్టుకొనియుండు ఈ యైహికవిషయము లన్నియు మరణముతో అంతమొందునవేనా?” అను ప్రశ్న నిరంతరము బయలుదేఱుచునే ఉండును. క్షణమాత్రమున జగత్తంతయు అదృశ్యమై ఎట్లో, ఎచటికో, పోవును. పర్వతాగ్రమున, చఱియదరిని నిలుచుండి, తన ప్రక్కనే నోరు తెఱచుకొని యున్న ఘోరరాక్షసివలె కనిపించు అగాధమగు చీకటికోనను చూచుచో, ఎంతటి ధీరుడైనను జంకి వెనుకకుతగ్గి “ఇది నిత్యమేనా?” అని ప్రశ్నించుకొనును. జీవితకాల మంతయు ఎంతో బుద్ధి పాటవముతో, తదేకదీక్షతో, పరిశ్రమించి నిర్మించుకొన్న ఆశాసౌధము లొక్కనిమేషమాత్రమున కూలి నేలపాలగును “అవి నిత్యములేనా?” అను ప్రశ్న మరల ఉప్పతిల్లి సమాధాన మపేక్షించును. కాలము జరుగుకొలది మనల నీ ప్రశ్న క్రమాధిక బలముతో వేధించుచుండును. మఱొక విషయము. మనుష్యుడు సుఖాభిలాషి. సుఖముకై మన మెన్నెన్నిమార్గములనో పరువు

* “ఆత్మ ముక్తత్వము” అను ఉపన్యాసః నాల్గవ పేరాలో ఈ భావము తేటపఱుపబడినది.

లిడుచుందుము. ఈ వెఱ్ఱి వెదకులాట యంతయు ఇంద్రియ గోచర బాహ్య ప్రపంచమందే. పట్టినదెల్ల బంగా రగుచుండు నొక యువకుని ప్రశ్నించి చూడుడు. ప్రపంచము నిత్యమే, సత్యమే, అనును. అప్పు డతని నమ్మిక మదియే. వార్ధక్యదశలో మరల వానినే ప్రశ్నింపుడు. అప్పటి కత డెన్నియో ఆశాభంగము లను భవించియుండును. అత డిప్పుడు "అంతయు అదృష్టముపై ఆధార పడియుండును" అనును. తన యభీష్టములు నెఱవేఱలేవని అతనికి తెలిసిపోయినది. ఏ దారిపట్టినను దాట శక్యముకాని వజ్రకఠినమగు గోడ అడ్డు తగులుచున్నది. ఇంద్రియవ్యాపార ఫలము మొదట అనుకూలముగానున్నను, పిదప ఎదురుతిరుగు చున్నది. ఏదియు శాశ్వతము కాదు. అన్నియు అనిత్యములే. భోగములు, దౌర్భాగ్యము, విభవము, సంపద, అధికారపదవి, దారిద్ర్యము : అన్నియు అనిత్యములే. ఇంతేల ? జీవితమే అట్టిది.

మనుష్యు డవలంబింపదగిన మతమార్గములు రెండే. శూన్య వాది (నిహిలిస్టు) అయి, సర్వము శూన్యమనియు, భూతభవిష్యత్తు లను గూర్చి — వర్తమానమును గూర్చికూడ — ఎఱుగజాల మనియు, వాదించుట ఒకమార్గము. "వర్తమానమునుగూర్చి కూడ" అను ఁటలయనిన, భూతభవిష్యత్తులు శూన్య మను వారు వర్తమానము కలదనుట వెఱ్ఱి. "తల్లితండ్రులు లేరు, బిడ్డ కలిగెను" అనుటవంటిది. ఈ శూన్యవాద మొకమార్గము. క్షణమాత్రమైన నిజముగా శూన్యవాది కాగలవానిని నే నెన్న డును చూడలేదు. మాటలలోమాత్రము శూన్యవాదిగా నుండుట మిక్కిలి సులభమే.

ఇక రెండవమార్గము సత్యాన్వేషణరూప మగు విషయ విచారము : అనిత్యమై నిరంతరపరిణామములు చెందుచుండు ఈ జగత్తులో ఏదేని సత్యపదార్థము కలదా అని పరిశీలిం చుట. భౌతికపరమాణువులతో కల్పింపబడిన యీ శరీరమున

నిత్యపదార్థ మేదైన నున్నదా అను విచారము ప్రప్రథమము నుండియు మానవుడు చేయుచునే ఉన్నాడు. అప్పటినుండియు సత్యజ్ఞానము అతనిబుద్ధి కెన్నియోసార్లు మెఱపు మెఱసినట్లు తళుకుమని స్ఫురించుచునే ఉన్నది. అప్పుడుకూడ కొంద త్తీ శరీరము నతిక్రమించి ఒక యడుగు వైచినవారు కలరు. వారికి మఱొక శరీరము గోచరించెను. అది చాలవఱకు స్థూలశరీరము వంటిదే కాని, దీనికన్న సమగ్రము, దీనికన్న శ్రేష్ఠము, ఈ శరీరము లయ మొందినపిదపకూడ నిలిచియుండునది. మృతకళే బరమును దగ్ధముచేయుచున్న అగ్నిదేవు నుద్దేశించి పలుకు ఈ ఋక్కు ఋగ్వేదమున కలదు : "ఇతనిని నీ చేతులతో మిక్కిలి జాగ్రత్తగా, ఏమాత్రము కసుగందకుండునట్లు, ఎత్తుకొనిపోయి, శుభలక్షణసమగ్రమగు దివ్యదేహము నిచ్చి, వ్యథామరణము లెఱుగని పితృలోకమున చేర్పుము." ఈ ఆశయము అన్ని మతము లందును కానవగును. దీనితో చేరి మఱియొక ఆశయముకూడ కలదు. అది మానవుడు తన పూర్వస్థితినుండి పతనము చెందెననుట. ఈ మతమనక, ఆ మత మనక, అన్నిమతము లందును, ఈ ఆశయము కలదు. కొన్నిటియందు పురాణకథారూప మునను, కొన్నిటియందు విస్పష్టమగు తాత్త్వికసిద్ధాంతరూప మునను, మఱికొన్నిటియందు మనోహరకవితారూపమునను, కానవచ్చును. కాని, మానవుని పూర్వస్థితి యిప్పటిదానికన్న ఉన్నతము అను ఈ యాశయము సర్వదేశశాస్త్రములందును, సర్వదేశపురాణములందును నూపట్టుచున్నది. యూదుల వేదమున పేర్కొనబడిన 'ఆదాము' పతనకథలో గల మూలాశయమిదియే. హిందువుల 'కృతయుగము' సత్యయుగము. అప్పుడు కోరినవారికితప్ప మరణములేదు ; ఇచ్చవచ్చినన్నాళ్లు శరీరము నిలిచియుండును ; బుద్ధి ప్రసన్నమై పటుత్వము కలిగి యుండును ; పాపములు లేవు ; దుఃఖము లేదు. ఆ యుగమునుండి భ్రంశ మొందుటచేతనే ఈ కలియుగము దాపురించినది. ఇక జల

ప్రళయకథకూడ సర్వమతములలో కలదు. కాలము అధోగతిని పట్టిన దను భావము అన్ని మతములలోను కలదని స్థాపించుట కీ కథ యొక్కటియే చాలును. ఈ అధోగమనము సాగిసాగి భూలోకమంతయు పాపపంకిల మైనప్పుడు, జలప్రళయము వచ్చి, మానవజాతిని చాలవఱకు రూపుమాపెను. ఆ పిదప ఆరోహణ క్రమము మరల ప్రారంభమై, ఇప్పుడు మెల్లమెల్లగా సాగుచున్నది. చివరకు మరల తొల్లిటి పవిత్రదశ రాగలదు. బైబిలు ప్రాతనిబంధన (ఓల్డు టెస్టమెన్టు) లోని జలప్రళయకథ మీ రంద ఱెఱింగినదే. ఆ కథయే పూర్వకాలపు బాబిలోనియా, ఈజిప్టు, చైనా, హిందూ దేశములలో కూడ వ్యాప్తిలో ఉండెను. మనువు అను నొక ప్రాచీనమహాపురుషుడు గంగాతీరమున ప్రార్థనా తత్పరుడై యుండగా చిఱుచేప యొకటి వచ్చి ఆశ్రయము వేడెను. అతడు దాని నొక నీటి కుండలో ఉంచి, దాని రాకకు కారణ మడిగెను. పెద్ద చేపయొకటి తఱుముచున్నందున సంరక్షణార్థము వచ్చితినని అది చెప్పగా, దాని నింటికి కొనిపోయెను. ఉదయమున కా చిఱుచేప కుండ నిండుగ పెరిగి, ఈ కుండ నా కిక చాలద నెను. మనువు దాని నంతట ఒక చెఱువులో ఉంచెను. కాని మఱునాటి ఉదయమున కది చెఱువు నిండునట్లుగ పెరిగి, ఇక నిదియు చాలద నెను. అంతట దాని నత డొక నదిలో నుంపగా, ఉదయమున కది నదికూడ నిండు నట్లు పెరిగెను. చివరకు దాని నతడు సముద్రములో ఉంపగా, అది అతనితో ఇట్లనెను : "మనూ, నేను సృష్టికర్తను. ఈ భూలోకమును ప్రళయజలరాశిలో ముంచివేయనున్నాను. నీ కిది సకాలమున తెలుపుటకై ఈ రూపమునవచ్చితిని. నీవు పెట్టెయోడ నొకదానిని నిర్మించుకొని, జీవకోటిలో రకమున కొక్కొక్కజత వంతున అందుంచి, నీవును సకుటుంబముగా దానిలో ప్రవేశించి యుండుము. జలరాశిలోనుండి నా కొమ్ము బైటికి పొడుచుకొని వచ్చును. దానికి నీ ఓడను బిగించికట్టియుంచుకొని, వెల్లువ తీసి పోయినపిదప వెలికివచ్చి, భూలోకమునందుమరల జీవకోటి నభి

వృద్ధి చేయుము.'' అట్లే భూలోకము ప్రళయార్ణవములో మునిగి పోగా, మనువు తన కుటుంబమును, జీవులలో రకమున కొక జతను, ప్రతివృక్షజాతి విత్తనములను పదిలపఱచి ప్రళయము తీరిన వెంటనే భూమిని మరల జీవకోటితో నింపెను. ఆ మనువు వంశము వారమగుటచేతనే మనకు 'మానవులు' అను పేరువచ్చెను.

మనస్సులోని సత్యమును మాటలతో తేటపఱచు సాధనమే మానవభాష. మాట లింకను రాక, ఏవేవో అవ్యక్త శబ్దములుమాత్రమే ఉచ్చరించు పసిబిడ్డ అత్యున్నతమగు ఆధ్యాత్మికసత్యమును తెలుపుటకే యత్నించుచుండునని నా దృఢ విశ్వాసము. వలయు అవయవములును, ఉపాయమును, లేమియే లోపము. మహావేదాంతుల భాషయును, పసిబిడ్డల అవ్యక్తోచ్చారణలును, ఒక్క జాతికే చెందినవి. తరగతులందే వానికిగల భేద మంతయు. అనగా వానికి కలది పరిమాణభేదమే కాని ప్రకార భేదము కాదు. అట్లే కచ్చితముగా, విస్పష్టముగా, నియమానుసారముగా, భావమును వ్యక్తపఱచునని చెప్పబడు ఆధునిక వాగ్విధానమును, కథారూపమై, నిగూఢభావమై, మంచుక్రమ్మిన వస్తువవలె అస్పష్టముగా, నుండు మన పురాణభాషితములును, ఒక్క జాతికే చెందినవి. విస్పష్టతయందే తారతమ్యము. ఒక్క మహత్తరభావమే వీని కన్నిటికిని మూలము. అది వ్యక్తరూపమున వెలికివచ్చుటకై అందటిలోను పెనగులాడుచుండునని చెప్ప నొప్పును. గనులలో ప్రకృతిసిద్ధరూపమున బంగారుగడ్డలు కనిపించునట్లు మన పురాణవాఙ్మయమునందు అమూల్యసత్యములు కనిపించుచుండును. మన ఆధునికగ్రంథములన్ననో, అవి విస్పష్టభావముగల చక్కని మనోహరభాషలో రచింపబడియున్నను, వానియందు ఎన్నియోసార్లు వట్టి పనికిమాలిన చెత్తచెదారము మాత్రమే దొరకును. కావున పురాణకథారూపము నొందియున్న కారణముననే, ఏ ఆధునికపురుషుని సిద్ధాంతమునకో, ఏ ఆధునిక స్త్రీ సిద్ధాంతమునకో అది భిన్నముగా నున్నకారణముననే,

వస్తువును నిరాకరింప నవసరము లేదు. తమ తమ మతప్రవక్తల బోధలను విశ్వసింపు డనుచున్న కారణముచేతనే మతములు పరిహాసనీయములైనచో, ఈ ఆధునికు లింక నెంత పరిహాసనీయులు కావలెను! మోసెసును గాని, క్రీస్తును గాని, బుద్ధుని గాని ప్రమాణీకరించువారు ఈ కాలమున నగుబాట్ల పాలగుదురు. కాని హక్స్లీ, టిండాల్, డార్విన్ మున్నగువారి పేరు చెప్పిన చాలును. ఇక నెవ్వరును నోరెత్తరు! "హక్స్లీ ఉవాచ" అన్న చాలును, ఎంతోమందికి! ఇక పరమసత్యమే అది! మన "మూఢ విశ్వాసము" అంతరించి పోయినదట! నిజమే. కాని ఇది జరిగినది మతవిషయమున మాత్రమే. ఆ విశ్వాసమునకు బదులు భౌతిక శాస్త్రములనుగూర్చిన మూఢవిశ్వాసము చెలరేగినది. దానిమూలమున జీవామృతప్రాయములగు ఆధ్యాత్మికభావములును, వీని మూలమున కామకాంచనవ్యామోహములును, ఆవిర్భవించును. అది దైవారాధన, ఇది హేయములగు ధనమునకును, పేరుప్రతిష్ఠలకును ఆరాధన. ఇదియే భేదము.

పురాణకథావిషయమునకు మరల వత్తము. ఆ కథల కన్నిటికిని మూలమై దీపించుచుండు ముఖ్యభావము మానవుడు తన పూర్వస్థితినుండి పతనమొందెననుటయే. ఆధునిక పరిశోధకులు ఈ భావమును ఏ మాత్రము అంగీకరింపరు. పరిణామవాదుల మతమునకుకూడ ఇది ప్రత్యక్షవిరుద్ధము. మానవుడు నత్తజాతికి చెందిన క్షుద్రజీవుల క్రమ పరిణామరూపమగుటచే పురాణ కథాభావము సత్యముకానేరదని వారి వాదము. కాని హైందవ పురాణవాఙ్మయము ప్రకారము ఈ రెంటికిని సమరసత్వము కుదుర్చవచ్చును. దానిలో "కల్పము" లనునవి (థియరి ఆఫ్ సైకిల్స్) కలవు. 'కాలమునడచు నడక అలల నడకకు పోల్ప వచ్చును. ప్రతి అల పిదప దిగుడు, మఱుక్షణమున మరల ఎగుడు, ఆ వెంటనే దిగుడు, వెంటనే మరల ఎగుడు. ఈ చలన మంతయు చక్రపరివర్తన రూపమున సాగుచుండును. మానవుడు

కేవలపరిణామఫలము కానేరదనియే ఆధునికపరిశోధనలవలనకూడ స్పష్టపడుచున్నది.’ ‘ప్రతి వ్యాకోచదశ (ఇవొల్యూషను)కు ముందు సంకోచదశ (ఇన్వొల్యూషను) ఉండియే తీఱవలెను. యంత్రములో ఉంపబడిన శక్తికన్న అధికమగుశక్తి దానిలోనుండి వెలువడి రానేరదని ఆధునిక భౌతికశాస్త్రజ్ఞులు తెలుపుదురు. శూన్యములోనుండి యేదియు ఉప్పతిల్ల జాలదు. నత్తలోనుండియే మానవుడు పరిణమించియుండినయెడల, క్రైస్తు, బుద్ధుడు మున్నగు పరిపూర్ణదశ నందిన మానవులు నత్తలో సంకుచితరూపమున ఉండియే తీఱవలెను. లేనిచో, ఆ మహోన్నతపురుషు లెచ్చటనుండి వచ్చిరి? అభావము (శూన్యము) లోనుండి భావము (ఉనికి) రానేరదు.’ కావున మా శాస్త్రసిద్ధాంతమును ఆధునిక పరిశోధకులు ప్రకటించిన సత్యముతో సామరస్య మొందింప గలము. మెల్లమెల్లగా క్రమపరిణామమంది, చివరకు మహాపురుషరూపమున తేజరిల్లు శక్తి, శూన్యమునుండి ఉప్పతిల్ల నేరదు. ఎచటనో అది ఉండియే తీఱవలెను. ఈ శక్తికి మూలరూపము నత్తయో, దానికిని మూలరూపమగు ఇంకేదో జీవాణుద్రవ్యము (ప్రోటోప్లాసమ్) అయినచో, ఆ మూలద్రవ్యమునం దెట్లో ఈ మహాపురుషశక్తి అడగియే యుండవలెను. శరీరము అను పేరుగల భౌతికపదార్థ సముదాయమునకు ఆత్మ, చింతాశక్తి మొదలగు రూపములతో భాసించు శక్తి మూలమా, ఆ శక్తికి శరీరము మూలమా, అను సమస్య యిప్పుడు తీవ్రముగా చర్చింపబడుచున్నది. ఆ శక్తియే శరీరమునకు మూలమని సర్వమతముల సిద్ధాంతము. కాని శరీర మను యంత్రములోని భాగము లొకక్రమమున వ్యవస్థితము లైనప్పుడు, దానిలోనుండి చింతనశక్తి ఉప్పతిల్లునని ఆధునిక తత్త్వవిచారపరులు కొంద ఱందురు. వీరి మతమును అంగీకరించి, ఆత్మ (భావసముదాయము) ఈ భౌతికయంత్రముచే కల్పింపబడినదని, అనగా దేహమునకును బుద్ధికిని మూలమగు భౌతికపదార్థముల కలయికకు (సామాన్యపు కలయికగాని, రసాయనికరూప

మైన కలయికగాని) ఫలమే ఈ ఆత్మ, అని ఒప్పుకొన్నను, సమస్యా పరిష్కారము కాదు. 'ఈ శరీరము ఎట్లు ఏర్పడినది? దానిలో గల పరమాణువుల నన్నిటిని ఈ శరీరరూపముగా కూర్చి ఉంచు నది ఏ శక్తి? చుట్టుప్రక్కలనుండు భౌతిక పదార్థములనుండి, తనకు వలయు సామగ్రిని చేకూర్చుకొని, నా శరీర మొక తెఱగున, ఇంకొక శరీర మింకొక తెఱగున, ఇట్లెన్నో తెఱగుల శరీరములను కల్పించు నది ఏ శక్తి? ఈ అనంతభేదములకు కారణభూత మైనదెద్ది?' కావున ఆత్మయను శక్తికి భౌతికపరమాణుసముదాయనిర్మితమగు శరీరము మూల మనుట యుక్తియుక్తముకాదు: 'ఈ పరమాణువు లెట్లు ఒకటిగా కూడెను? ఆ కూర్చిన శక్తి ఎచటనుండి వచ్చెను? ఈ పరమాణువుల కూడికకు మఱియొకశక్తి కారణము, ఆత్మకు ఆ పరమాణుపదార్థము కారణము, పదార్థరాశి నొకటిగా కూర్చిన ఆత్మయే ఈ కూడికవలన కలిగెను అనుట సమాధానమేకాదు.' వివాదాంశములలో అన్నిటికో, లేక చాలభాగమునకో, అన్వయిం చుచు, పూర్వసిద్ధాంతములకు విరుద్ధముకాకుండు వాదమే ఆదరింప తగినది. భౌతికపదార్థమును సంగ్రహించి శరీరమును నిర్మించు శక్తియే ఆ శరీరముద్వారా గోచరించు ననుటే ఎక్కువ సమంజ సము. కావున శరీరముద్వారా దీపించు చింతాశక్తులు పరమాణు సముదాయవ్యవస్థాఫలములే అనియు, వానికి స్వతంత్రమగు ఉనికియే లేదనియు చెప్పుట అర్థరహితవాదము. అసలు భౌతిక పదార్థములలోనుండి శక్తి ఉత్పన్నమగుటే అసంభవము. ఇంతే కాదు. భౌతికపదార్థము అనుదానికి నిజమగు ఉనికియే లేదనికూడ నిరూపింపవచ్చును. ఒకదశలోనున్న శక్తియే భౌతికపదార్థము. ఘనత, కఠినత మున్నగు భౌతికపదార్థలక్షణములన్నియు చలనము వలన కలుగునని స్థాపింపవచ్చును. ద్రవపదార్థములందు అపరిమిత మైన ఆవర్త చలనమును ప్రవేశింపచేసినచో, వాని ఘనపదార్థములకుగల బలము లభించును. ఉగ్రసమీరరాశి (ఉ. ఝంఝామారుతము) లో నేర్పడు గాలిగుండము ఘనరూప

మొంది ఘనపదార్థములను విఱుచుటయు, చీల్చుటయు కలదు. సాలెపురుగు గూటిలోని తంతువు నొక్కదానిని అపారజవముతో చలింపజేయగలమేని, అది ఇనుపగొలుసువలె బలిష్ఠమై, అత్యంత కఠినమగు మహావృక్షపు బోదెను రెండుగా ఖండించివేయ గలుగును. ఈ దృక్పథమునుండి విషయపరిశీలనము చేసినచో, భౌతికపదార్థ మనబడుదానికి నిజమగు ఉనికియే లేదని సులభముగా నిరూపింపవచ్చును. తద్విరుద్ధవాదము నెగ్గించుట అసాధ్యము.

శరీరమూలమున దీపించు శక్తి యేదియైనను, అది అణువులను గ్రహించి వానితో రూప (మానవశరీర) నిర్మాణము చేయుచుండవలె ననుట మాత్రము స్పష్టము. మన శరీరమును నిర్మించుటకు మఱెవ్వరును వచ్చుటలేదు. నాకొఱకు కింకెవ్వరును భోజనముచేయరు. నేనే తిని, నేనే అఱిగించుకొని, రక్తశల్యాదులను దానితో నేనే నిర్మించుకొనవలెను. నాయందుండి ఈ కార్యములన్నియు నెఱవేర్చుచున్న అద్భుత నిగూఢశక్తి యేది? భూతభవిష్యద్విషయభావన కొందఱికి వెఱపు కలిగించును. మఱి కొందఱది గాలిలో మేడలుకట్టుట వంటి వ్యర్థకాలయాపన మని తలంతురు. ఐనను, ప్రస్తుతవిషయమగు "మనలోనుండి దీపించు శక్తి యెద్ది?" అను సమస్యనుగూర్చి విచారింతము. ఈ శక్తికి, లేక ఈ శక్తి ప్రదర్శనమునకు, కారణభూతమైనది తేజస్వంతమగు నొక వస్తువనియు, అది ఈ శరీరమును పోలినదైనను, ఇది నశించినపిదప కూడ అది నిలిచియుండుననియు, అతిపురాతనకాలపు శాస్త్రకారుల సిద్ధాంతము. అనంతరకాలమున అంతకన్న ఉన్నతమగు ఈ క్రింది సిద్ధాంతము వెలువడెను: 'ఆ శక్తికి మూలము తేజోమయ శరీరము కాదు. రూపము గల వస్తువు లన్నియు పరమాణువుల కూడిక చేతనే ఏర్పడును. వానికి స్వతస్సిద్ధమగు చలనశక్తి లేదు. మన శరీరములోని శక్తికి మూలకారణము ఇంకేదియో కావలసియున్నచో, ఆ తేజోమయశరీరశక్తికిని అట్లే కావలసియుండును. ఆ మూలకారణము ఆత్మ. స్థూలశరీరముద్వారా ప్రదర్శితమగు

శక్తి ఈ తేజోమయశరీరమువలన కలిగినట్లు తోచినను, దానికి ఆత్మయే మూలము. మనస్సు ఈ తేజోమయశరీరములో ఇమిడి యుండును. మనస్సు ద్వారా శరీరమునకు శక్తి నిచ్చునది ఆత్మ. ప్రతిమానవున కొక ప్రత్యేకమగు ఆత్మయు, ఒక ప్రత్యేకమగు సూక్ష్మశరీరమును కలవు. ఆ సూక్ష్మశరీరముద్వారా మనము స్థూలశరీరమునకు శక్తి నిచ్చుచున్నాము. శరీరమునకు, మనస్సునకు కూడ భిన్నమని ఈ సిద్ధాంతముచే ప్రతిపాదింపబడిన ఆత్మ తత్త్వమునుగూర్చి తీవ్రమగు చర్చలు ప్రారంభమయ్యెను. ఎన్నో విధముల ఊహలు కల్గినవి, ఎన్నోదృక్పథములనుండి పరిశీలనము సాగినది. తత్ఫలితముగా ఏర్పడిన ఆధ్యాత్మిక మతములు కొన్ని మీకు నివేదించెదను. ఆత్మతత్త్వమునుగూర్చి భిన్నాభిప్రాయము లున్నను, ఈ విషయమున మాత్రము అన్నిమతములవారును ఏకీభవించినట్లు కనిపించుచున్నది: 'దానికి ఆకారముగాని, అవయవములుగాని లేవు. నిరాకారము, నిరవయవము అగు పదార్థము సర్వగతమై యుండవలెను. దేశకాలములకు మనస్సే ఉత్పత్తిస్థానము. కాలము లేనిచో, నిమిత్తత్వము నిలువజాలదు. ముందువెనుకలు అను భావము కలిగిననేగదా నిమిత్తత అను భావము కలుగగలదు? కావున దేశకాలనిమిత్తత్వములు మనస్సు లోనివే. ఈ ఆత్మ మనస్సున కతీతమును, ఆకారరహితమును కనుక, అది దేశకాలనిమిత్తత్వముల కతీతమై యుండవలెను. దేశకాలనిమిత్తత్వములకు అతీతమగునది ఆద్యంతరహితమైయుండ వలెను.' దీని పిమ్మటి ఊహ మా వేదాంతమంతటిలోను అత్యు న్నతమైనది: 'ఆద్యంతములు లేని రెండువస్తువు లుండజాలవు. ఆత్మ ఆద్యంతరహితమైనచో, ఒక్క ఆత్మయే ఉండవలెను. కావున ప్రతి మానవున కొక ప్రత్యేకమగు ఆత్మ యుండుట అసంభవము. అనగా, సత్యదృష్టికి మానవుడు ఏకమును, పరిపూర్ణమును, సర్వగతమును అగు ఆత్మయే. స్థూలదృష్టికి కనిపించు మానవుడు ఆ పారమార్థిక మానవుని పరిచ్ఛిన్న

రూపము'. ఈ దృక్పథమునుండి విచారించినచో పురాణ కథా సిద్ధాంతము సత్యమే యగును. ఇంద్రియగోచరుడగు మానవు డెంత మహనీయుడైనను, బుద్ధికి అతీతుడగు పారమార్థిక మానవుని మందమగు ప్రతిబింబము వంటి వాడే. పారమార్థిక మానవుడగు ఆత్మ కార్యకారణాతీతుడును, దేశకాలాబాధ్యుడును, అగుటచే నిత్యముక్తుడు. అత డెన్నడును బద్ధుడు కాలేదు, కాజాలడు. తత్ప్రతిబింబమాత్రుడగు ఇంద్రియ గోచరమానవుడు దేశకాల నిమిత్తములకు లోబడియుండుటచే, బద్ధుడు, బద్ధుడుగా తోచునేగాని, నిజముగా బద్ధుడు కాడని కొందఱు వేదాంతుల మతము. ఈ సర్వగతత్వము, ఈ ఆధ్యాత్మికత్వము, ఈ పరిపూర్ణత్వము : ఇదియే మన ఆత్మలలోని సత్యము. ప్రతి ఆత్మయు అనంతము. కనుక జననమరణము లెట్లుండగలవు? పరీక్షకు డొకడు "ఈ భూమి యేల పడిపోక నిలిచియుండును?" అని బాలబాలికలను ప్రశ్నించెను. ఆకర్షణశక్తినిగూర్చిన సమాధానమేదో ఈయబడునని అతని తలంపు. కాని బుద్ధిశాలినియగు నొక బాలిక "అది ఎక్కడ పడగలదు?" అని మాఱుప్రశ్న వేసి పరీక్షకుని ప్రశ్న అర్థరహితమైనదని నిరూపించెను. భూమి ఎక్కడ పడగలదు? అది ఎగురుటయు, పడుటయు, అసంభవము. అనంతమగు మహాకాశములో క్రిందుమీదులు లేవు. ఆద్యంతములుగల తావుననే వానియునికి. అనంతవస్తువునకు రాకపోక లెట్లుండును? అది యెక్కడినుండి రాగలదు? ఎక్కడికి పోగలదు? కావున మానవుడు ఉన్నతమానసికక్షేత్రమునకు ఎగయుగోరినచో, భూత భవిష్యత్తుల తలంపే మానుకోవలెను. జననమరణబద్ధమగు ఈ శరీరముతోడి ఐక్యభావమును మఱువవలెను. సత్యదృష్టికి మానవుడు ఈ శరీరముగాని, ఆటుపోటులకు లోనైన ఈ మనస్సుగాని, కాడు. వీనికి అతీతమై, నిత్యమై యుండు ఆత్మయే అతడు. మనశ్శరీరము లెప్పుడును మాఱుచునే ఉండును. క్షణక్షణము పరిణామమొందుచున్నను, ఒకటే నిరంతరప్రవాహమువలె కనిపించు నదీజలము

వలె, ఎప్పుడును మాఱుచుండు స్వభావముగల విషయపరంపరనే మనశ్శరీరము లనుచున్నాము. ఈ శరీరములోని అణువు లెప్పుడును మాఱుచుండును. కొన్ని నిమిషములపాటైన అదేశరీర మెవ్వరికిని ఉండదు. కాని మనము దాని నొక్క-శరీరముగనే భావింతుము. మనస్సువిషయముకూడ ఇట్టిదే. ఒక క్షణమున సౌఖ్యము, మఱుక్షణమున అసౌఖ్యము; ఒకక్షణమున బలము, మఱుక్షణమున దౌర్బల్యము. ఇట్లది నిరంతరవికారములకులోనగు సుడిగుండము వంటిది. అట్టిది ఆత్మ యెట్లగును? ఆత్మ అనంతము కదా! అనిత్యవస్తువునందే మార్పు ఉండగలదు. అనంతవస్తువులో మార్పు కలిగెననుట అసంబద్ధప్రలాపము. పరిమితశరీరులము కనుక మనము స్థలాంతరమునకు పోగలము. జగత్తులోని ప్రతి అణువు క్షణ క్షణము అట్లు కదలుచునే ఉన్నది. కాని జగత్తునంతయు సమష్టిగా (ఒక్క- మొత్తముగా) భావించుచో, అది కదలజాలదు, మాఱ జాలదు. చలన మనునది సంబంధభావము. మఱొకవస్తు వున్న కదా సమీపించుటగాని దూరమగుటగాని? జగత్తులోని ప్రతి అణువు మఱొక అణువుకు దవ్వగనో, దగ్గఱగనో చలింపగలదు. కాని జగత్తునంతయు సమష్టిగా భావించినప్పు డది దేనిని డాయును, దేనిని పాయును? అది తప్ప వేఱువస్తువేదియు లేదుకదా! కావున అనంతమును ఏకమును అగు ఈ పదార్థము మార్పులు లేనిది, అచలము, పరిపూర్ణము. ఇదియే పారమార్థిక మానవు డనుమాటలోని భావము. అనగా మన యథార్థతత్త్వము అఖండవస్తువులో కలదుగాని, ఖండవస్తువులలో లేదు. మనము నిరంతరపరిణామమొందు స్వల్ప, పరిమిత, జీవుల మనుభావము ఎంత పురాతనమైనను, ఎంత సుఖప్రదమైనను, భ్రాంతి జనితమే. నీవు విశ్వాత్మకుడవు, సర్వగతుడవు, అని చెప్పినచో, మానవుడు భీతినొందును, కాని, నిజమునకు ప్రతి వస్తువు మూలముగ పనిచేయునది నీవే, ప్రతికాలితో నడచునది

నీవే, ప్రతిపెదవితో మాటాడునది నీవే, ప్రతిహృదయముతో కష్టసుఖాదు లనుభవించునది నీవే.

ఈ సత్యమును తెలిపినచో మనుష్యులు భీతిచెందుదురు. తమ వ్యక్తిత్వము (ఇన్డివిడ్యుయాలిటి) ఏమి కావలె నని వారు మాటిమాటికి ఆతురతతో ప్రశ్నింతురు. కాని, వ్యక్తిత్వ మనగా ఏమి? దానిని నేను చూడగోరుదును. చంటిబిడ్డనికి మీసము లుండవు. ఆ బిడ్డడు పెద్దయైనప్పుడు గడ్డము, మీసము, లేర్పడ వచ్చును. వ్యక్తిత్వము శరీరసంబంధమైన దగుచో, అప్పు డది నశించునుగదా! అట్లే నా కొక చేయి పోయినను, కన్ను పోయినను, నా వ్యక్తిత్వము నశించును. త్రాగుబోతు తన త్రాగుడును మానరాదు. మానినచో వానివ్యక్తిత్వము నశించును. చోరుడు సజ్జనుడు కారాదు. ఐనచో, వాని వ్యక్తిత్వము నశించును. ఇంతేల? ఈ వ్యక్తిత్వనష్టభీతిచే ఎవ్వరును తమ అభ్యాసములను మార్చుకోరాదు. నిజమునకు, వ్యక్తిత్వ మనునది పరిపూర్ణత యందుతప్ప ఇంకెచ్చటను లేదు. తక్కినదశలందు అన్నిచోట్ల, అన్ని వేళలందు, మార్పులే! లేక, ఈ వ్యక్తిత్వము ఉండునది స్మృతి యందా? అట్లైనచో తలమీద దెబ్బతగిలి నా పూర్వ జీవితమును మఱచితినేని, నా వ్యక్తిత్వము నశించినది. నా కథ ముగిసినట్టే. నా చిన్ననాటి రెండుమూడేండ్లు నాకు జ్ఞప్తి లేవు. ఉనికికి నిదర్శనము జ్ఞప్తియే ఐనచో, ఆ మఱచినభాగము నశించి నట్టే; ఆ కాలమున నేను జీవింపలేదు! వ్యక్తిత్వశబ్దమున కెంత సంకుచితరూపమగు అర్థమిది! నిజ మేమనగా, మన కింకను వ్యక్తిత్వము ప్రాప్తింపనే లేదు. దానికొఱకై, అనగా మన యథార్థతత్త్వమగు పరిపూర్ణత్వమును చేరుకొఱకై, ప్రయాసపడు చున్నాము. అఖిలజగత్తున జీవించువానిదే జీవితము. అనిత్యవస్తువు లందు లక్ష్యముంచి జీవించుటంతయు మరణముదెస పరువు లిడుటయే. విశ్వముతో నొకటియై, అనగా, అందఱితో ఏకీభావ బుద్ధితో, కడపిన కొలదికాలమే మనము జీవించినట్లు. తక్కిన

దంతయు క్షుద్రజీవితము. అది జీవితమే కాదు : మరణము. మనకు గల మరణభీతి కీ క్షుద్రజీవితమే కారణము. జగత్తులో ఒక్కజీవి యైన ఉన్నంతకాలము తాను జీవించియే యున్నాడు అను సత్యమును జీవితములో అనుసరించిన గాని, మానవుడు మరణభీతిని జయింప జాలడు. "అన్ని వస్తువులందును, అన్ని జీవులందును, నేను కలను ; ఈ జీవకోటి అంతయు నేనే; ఈ జగత్తంతయు నేనే" అని అన గల స్థితిలో గాని మానవుడు నిర్భయత్వము నొందజాలడు. ఎప్పుడును మార్పు లొందు వస్తువులకు అంతము (మరణము) లేకుండుట అసంభవము. "ఆత్మ అనంతము. కావున అదియే వ్యక్తి. అఖండపదార్థమును ఖండించు టెట్లు? తునుకలుగా విఱుచు టెట్లు? ఎల్లప్పుడును అది ఏకమే. అఖండమే. అదియే మానవ వ్యక్తి, అదియే మానవుని యథార్థరూపము. అందుపాటు కాని యథార్థమానవవ్యక్తిత్వమును ప్రదర్శించుటకై పడు పాట్ల మూర్తీభావమే ఇంద్రియగోచరమానవుడు" అని యొక ప్రాచీన కాలపు హిందూవేదాంతి పల్కియున్నాడు. ఆత్మకు పరిణామము లేదు. లోకములో కలుగుచుండు పరిణామములు — దుర్జనుడు సజ్జను డగుట, మృగము మానవు డగుట — ఇట్టి యే పరిణామములు గాని, ఆత్మలోనివి కావు. పరిణామ మంతయు ప్రకృతిలోనే. తత్ఫలముగా ప్రదర్శితమగునది ఆత్మ. నాముందొక తెర కల దనియు, దానిలోని ఒక చిన్న రంధ్రముద్వారా మీలో కొందఱిముఖములు మాత్రమే నాకు తెలియవచ్చు చున్న వనియు భావింపుడు. ఆ రంధ్రము పెద్ద దగు కొలది మీలో ఎక్కువమందిని చూడగలుగుచుందును. చివరకు ఆ తెర అదృశ్య మైనప్పుడు, మీ రందఱు పూర్తిగా కాన వత్తురు. ఇందు మీ రేమియు మాఱ లేదు. మాఱినది రంధ్రమే. మీరు క్రమాధికముగా గోచరించు చుంటిరి. ఆత్మవిషయముకూడ ఇట్టిదే. పరిపూర్ణత ఎప్పుడో వచ్చునది కాదు. మీరు ఇప్పుడే పరిపూర్ణులు, నిత్యముక్తులు. ఐనచో, మతములు, భగవంతుడు, భవిష్యత్సుఖాన్వేషణములు :

వీని కర్థ మేమి? మానవుని కొక దైవ మేల కావలెను? ప్రతిజాతిలో, ప్రతిసాంఘికదశలో, తమకు ఆదర్శముగా వర్తింప గల పరిపూర్ణత్వముకై ఎన్నో చోట్ల — మానవులందో, భగవంతునియందో, ఇతరమందో. జనులు ఏల వెదకులాడుచుందురు?'' అను ప్రశ్న రావచ్చును. ఆ పరిపూర్ణత్వము మీలో ఉన్నది కనుకనే ఈ అన్వేషణము. మీ హృదయస్పందన శబ్దమునే మీరు గుర్తింపజాలకున్నారు. అది మఱియెచ్చటనుండియో వచ్చిన దనుకొనుచున్నారు. మీ ఆత్మలోని భగవంతుడే తన్ను అన్వేషించి ప్రత్యక్షపఱచుకొమ్మని మిమ్ము ప్రేరించుచున్నాడు. వివిధ మతదేవాలయములలో, భూమ్యాకాశములలో, ఎచ్చటెచ్చటనో, వెదకి వెదకి, ప్రదక్షిణ మంతయు ముగిసిన పిదప, ప్రారంభస్థానమునకు—అనగా, మీ ఆత్మకడకే — వత్తురు. అప్పుడు మీకు సత్యము గోచరించును. ఎవనికై మీరు లోక మంతయు వెదకితిరో, ఎవనికై వివిధమతదేవాలయములలో విలపించి ప్రార్థించితిరో, ఎవడు గూఢాతిగూఢరూపమున మేఘముల చాటున డాగియున్నాడనుకొంటిరో, అతడు సర్వవస్తువుల కన్న మీ కత్యంతసమీపస్థితుడు. మీ ఆత్మయే; ఆత్మయే మీ జీవమందును, శరీరమందును, వ్యక్తిత్వమందును గల పరమసత్యము అని వ్యక్తమగును. అదియే మీ స్వాభావికతత్త్వము. అందు సుప్రతిష్ఠితులు కండు, దానిని వ్యక్తపఱపుడు. మీరు పరిశుద్ధులు కా నక్కఱ లేదు, ఇప్పటికే పరిశుద్ధులు. పరిపూర్ణులు కా నక్కఱలేదు, ఇప్పటికే పరిపూర్ణులు. ప్రకృతి అను తెర అడ్డుపడియుండుటచే, సత్యము మీకు గోచరించుట లేదు. ప్రతిమంచితలంపువలనను, ప్రతిమంచిపనివలనను, ఆ తెరను కొంచెము చించివేయుచున్నా రన వచ్చును. ఇట్లు చించుకొలది, మొదట దృష్టిగోచరము కాకున్న నిత్యశుద్ధమును, అనంతమును, అగు పరతత్త్వము (పరమసత్య మగు బ్రహ్మము) క్రమాధికముగా సాక్షాత్కరించును. ఇదియే మానవుని చరిత్ర మంతయు. దేదీప్యమానముగా ప్రకాశించుట పరతత్త్వమునకు

నైజము. కావున నడిమితెర పలుచబాఱుకొలది దానివెలుగు అధికాధికముగా కాన్పించుచుండును. అది అజ్ఞేయము, కాని దానిని తెలిసికొనుటకై మనము వ్యర్థపరిశ్రమ చేయుచుందుము. అది నిత్య విషయి (సబ్జెక్ట్). కావున తన తత్త్వమును కోలుపోయిన గాని అది జ్ఞేయము కాజాలదు. అతడు నిత్యద్రష్ట; ప్రపంచమునకు నిత్యసాక్షి. అతడే నీ ఆత్మ. జ్ఞానము విషయీకరణము (ఆబ్జెక్టిఫికేషన్) కనుక ఉపాధి (లిమిటేషను): ఒక క్రిందిమెట్టు; అవనతదశ. అనంత విషయిస్వరూపులమే అగు మనము దానిని మరల ఎఱుగు టెట్లు? తన వాస్తవికతత్త్వ మగు ఈ మహోన్నతస్థితిని తనజీవితమున ప్రదర్శించుటకై మానవు డెన్నో విధముల యత్నించుచుండును. కానిచో ఇన్ని ధర్మశాస్త్రము లేల పుట్టినవి? ఆ శాస్త్రము లన్నిటిలోను పరోపకార మను భావము అత్యంతప్రాముఖ్యము నొంది, కేంద్ర స్థాన మాక్రమించుకొనియున్నది. మానవజీవితమున ముఖ్య సూత్రముగా నుండవలసినది భూతదయ: మానవులయందును, జంతుకోటియందును, దయ. "నేనే ఈ జగత్తును, ఈ జగత్తంత యును ఒక్కటే" అను పరమ సత్యమే వేర్వేఱు ధర్మశాస్త్రము లలో వేర్వేఱు విధములుగా బోధింపబడియున్నదని చెప్పవచ్చును. కానిచో, నే నితరుల కేల ఉపకారము చేయవలెను? చేయు మని నన్ను బలాత్కరించున దేది? సానుభూతి, అనగా సర్వైక్యభావమే కదా! ఎట్టి కఠినహృదయులకైనను, ఇతరులయెడ ఒక్కొక్కసారి జాలి కలుగును. తనవ్యక్తిత్వము భ్రాంతిజనిత మగు మిథ్య యనియు, దాని నంటిపట్టుకొనియుండ జూచుట నీచలక్షణ మనియు, చెప్పినచో భీతిలువాడుకూడ, స్వార్థత్యాగపరిపూర్ణతయే సన్మార్గజీవనముఖ్య సూత్ర మని చెప్పును. కాని స్వార్థత్యాగపరిపూర్ణత అనగా ఏమి? ఈ అసత్యవ్యక్తిత్వమును పరిత్యజించుటయు, స్వార్థపరత్వము నంతయు త్యజించుటే కదా? ఈ మమతాహంకారములు పూర్వపు మూఢవిశ్వాసముల ఫలము ఈ మిథ్యావ్యక్తిత్వము క్షీణించుకొలది, సత్యవ్యక్తిత్వము చూపట్టు

చుండును. అది ధర్మబోధ కంతటికిని కేంద్రమును, ఆధారమును, సారభూతమును, అగు స్వార్థత్యాగము. మఱియు, ప్రపంచ మంతయు—బుద్ధిపూర్వకముగనో ఊరకయో—ఈ స్వార్థత్యాగ లక్షణమును కొద్దిగొప్పలుగా ఆచరించుచు, దానిదెసకు మెల్లగా సాగుచున్నది. తా మిట్లాచరించుచున్న విషయము నెఱుగనివారు, మమతాహంకార మూల మగు వ్యక్తిత్వము భ్రాంతిజనిత మని ఎఱిగి, ఈ స్వార్థత్యాగమును బుద్ధిపూర్వకముగా నొనర్తురు గాక! ఇప్పటి మానవుడు సర్వాధార మగు అనంతపరతత్త్వపు క్షణదర్శన ప్రాయుడు. సర్వాత్మక మగు అనంతవహ్నిలో నొక్క కణమువంటి వాడు. అనంతత్వమే అతని సత్యస్వభావము.

ఈ జ్ఞానమునకేమి ఉపయోగము? దీనివలని ఫలమేమి? ఈ కాలమున ప్రతివస్తువులోని గుణాగుణములను ధనలాభదృష్టితోనే విచారించుట పరిపాటి యైపోయినది. కాని సత్యమును ఈ దృష్టితో పరిశీలింపు మని ఎవరు చెప్పిరి? ఉపయుక్తము కానిచో దాని సత్యత్వము తఱిగిపోవునా? సత్యమున కది గుఱుతు కానే కాదు. కాని ఈ సత్య మత్యంతోపయుక్తమైనది కూడ. ప్రతి మానవుడును కాంక్షించునది సుఖము. దానిని అనేకులు అనిత్య పదార్థములనుండి సాధించుకొన ప్రయత్నించుచుందురు. ఇంద్రియ ములమూలమున సుఖ మెన్నడును ప్రాప్తింపలేదు. ఇంద్రియముల వలనకాని, ఇంద్రియలోలత్వమువలనకాని, సుఖించినవా డెవ్వడును లేడు. సుఖము ఉండునది ఆత్మయందు మాత్రమే. కావున ఈ ఆత్మసుఖము నార్జించుకొనుటకన్న మానవులకు అధికోపయుక్త మగు కార్య మేమి ఉండ గలదు? ఇక, తరువాతి విషయము: దుఃఖమునకు మూలకారణము అజ్ఞానము, పరమపురుషుడు అనిత్యు డనియు, అతడు ఏడ్చును, మొత్తుకొనును అనియు భావించుట కన్న అజ్ఞానము ఉండదు. శాశ్వతము, నిత్యశుద్ధము అగు పరమాత్మకు మూర్తిభావముల మగు మనము తుచ్ఛములు, పరిమితములు అగు ఈ మనశ్శరీరములము అని తలచుట ఈ

అజ్ఞానముదాల్చు ముఖ్యరూపము. స్వార్థపరత్వమంతయు ఇందుండి కలుగునదే. నే నొక స్వల్పశరీరమను అని అనుకొన్న తోడనే, దీనిని ఎట్లైన — అందుచే ఎవరికి ఏమి అపకారము కలిగినను — పదిలముగా కాపాడుకొనవలెను అను కోరిక కలుగును. అప్పుడు నాకును మీకును భిన్నత యేర్పడును. ఈ భిన్నభావము అన్ని అనర్థములకు, అన్ని కడగండ్లకు దారి తీయును. ఈ స్వార్థపరత్వమును, ఈ సంకుచితభావమును, ఈ నీచతను, ఏ కొలదిమందియైనను పరిత్యజించి రేని, రేపటి కీ భూలోకము స్వర్గలోకముగా మాఱిపోవును. ఇంతకన్న మహోపయోగ మేమి ఉండ గలదు? ఎన్ని యంత్రము లేర్పడినను, భౌతికజ్ఞాన మెంత అభివృద్ధి నొందినను, ఈ ఫలము లభింపదు. వ్యథ లధిక మగుటయే వానివలని ఫలము. ఆత్మజ్ఞానము లేనివానికి కలుగు భౌతికజ్ఞానమంతయు మంటలో పెట్టిన కట్టెలవంటిది. స్వార్థపరులు ఈ జ్ఞానముచే ఇతరులసొమ్మును అపహరించుటకును, ఇతరులకై తమ జీవితములను వినియోగించుటకు మాఱు, వారి జీవితములనే తమ మనుగడకై ఆహుతిగొనుటకును, సమర్థు లగుదురు.

"దీనిని అభ్యసించుట సాధ్యమా? ఆధునిక సంఘమున కిది ఆచరణయోగ్యమా?" అనునది ఇంకొక ప్రశ్న. సత్యము సంఘమున కెన్నడును దాసోహ మ్మని శిరసు వంపదు. సంఘమే సత్యమునకు లొంగి సేవ చేయవలెను. అట్లు ప్రవర్తింపని సంఘమునకు నాశము సిద్ధము. సత్యానుసారముగా సంఘములను తీర్చుకోవలెను కాని, సంఘమునకు అనుకూలించునట్లుగా సత్యము మార్పుల నొందదు. స్వార్థరాహిత్యమువంటి మహోత్తమాదర్శము ఏ సంఘములో అభ్యసించుట శక్యము కాదో, ఆ సంఘమును వీడి మానవుడు అడవులలో ఉండుట మేలు. అట్లు చేయువాడే ధీరుడు. ధీరత రెండు విధములది. ఫిరంగిగుండును ఎదుర్కొనుట ఒకటి. ఆధ్యాత్మికవిశ్వాసనిష్ఠాగరిష్ఠత యొకటి. భారతదేశముపై దండెత్తి వచ్చిన చక్రవర్తి యొకడు గుర్వాజ్ఞానుసారముగా అచటి జ్ఞానసిద్ధులను

చూడ గోరి, వెదకి వెదకి, చివర కొక మహావృద్ధసాధువును చేర పోయెను. కొద్దిపాటి సంభాషణవలననే ఆయన మహాపురుషు డని గ్రహించి, తమ దేశమునకు ర మ్మని ప్రార్థించెను. "నేను రా జాలను, ఈ అరణ్యనివాసమే నాకు చాలును" అని ఆయన బదు లిడగా, "నేను సార్వభౌముడను, మీకు సంపద, పదవి, విభవము; అంతయు ఇచ్చెదను" అని యతడు ఆసచూపెను. సాధు వప్పటికిని రా ననగా "రాకపోయినచో చంపివేయుదును" అని బెదరించెను. ఆయన, ప్రశాంతముగా, నవ్వి "సార్వభౌమా, ఇంత బుద్ధిమాలిన మాట నీ వెప్పుడును పలికియుండవు. నీవు నన్ను చంపజాలవు. నన్ను ఎండ ఎండింప జాలదు, అగ్ని దహింప జాలదు, ఖడ్గము ఛేదింప జాలదు. నేను ఆద్యంతరహితమును, నిత్యమును, సర్వగతమును, సర్వశక్తిమంతమును, అగు ఆత్మను" అనెను. ఇది ఆధ్యాత్మికధీరత, అది సింహవ్యాఘ్రాదుల ధీరత. 1857-వ సంవత్సరపు సిపాయీల తిరుగుబాటులో సాధుసత్తము డగు నొక స్వామిని మహమ్మదీయు డొకడు ఖడ్గముతో పొడిచెను. హిందువులు ఆ అపరాధిని పట్టుకొని చంపివేయుటకై స్వామియొద్దకు తెచ్చిరి. స్వామి అతనిని ప్రశాంతదృష్టితో చూచి "సోదరా, నీవు అతడవే!" అని పలికి ప్రాణములు విడిచెను. ఆధ్యాత్మికధీరత కిది యొక నిదర్శనము. మీ సంఘమును సత్యమార్గమున పెట్టుకొన జాల రేని, పరమసత్యమున కనుగుణముగా మీ సంఘమును నిర్మించుకో జాల రేని, మీ శరీరబలమునుగూర్చియు, మీ పాశ్చాత్యసంస్థావిశిష్టతనుగూర్చియు, ప్రగల్భము లాడుట మానుకొనుడు. 'ఈ ధీరత సంఘశ్రేయస్కరము కాదు, అందుచే అభ్యాసయోగ్యము కాదు' అందురా? ధనార్జనమే కాబోలును సంఘశ్రేయస్కరము! అత్యున్నతసత్యములు అభ్యాసయోగ్యములై, ఆచరింపబడుచుండు సంఘమే శ్రేష్ఠ మని నా అభిప్రాయము. మీ సంఘమున ఇట్టి ఉన్నతసత్యాభ్యాసము అనువు కాకున్నచో, అను వగునట్లు దానిని ఎంత శీఘ్రముగా మార్చిన, అంత

మంచిది. ఈ ప్రయత్నమున సుస్థిరులై, మీరు స్త్రీలనక, పురుషులనక, అందఱును, సత్యమును విశ్వసించుటకును, అభ్యసించుటకును, సాహసింపుడు. ఇట్టి ధైర్యముగలవారు కొన్ని నూర్లమంది లోకమునకు కావలసియున్నారు. సత్యము నెఱుగ సాహసించు ధైర్యము : జీవితరూపమున ఆ సత్యమును ప్రకటింప సాహసించు ధైర్యము : నిర్భీతితో మరణము నెదుర్కొను, మరణమునకు స్వాగతము చెప్పు ధైర్యము : 'నేను ఆత్మను, విశ్వమున ఏదియు నన్ను చంప జాలదు' అని మానవునకు వ్యక్తపఱచు ధైర్యము : అట్టి ధైర్యమును అభ్యసింపుడు. మీ రప్పుడు ముక్తు లగుదురు, ఆత్మ సాక్షాత్కార మందుదురు. ''ఈ ఆత్మనుగూర్చి వినవలెను, పిదప మననముచేయవలెను, ఆ పిదప నిరంతరధ్యానము చేయ వలెను.''

ఈ కాలమున కార్యాచరణమును ప్రశంసించుటయు, ఆలోచనాగతిని నిరసించుటయు ఆచార మగుచున్నది. పని చేయుట మంచిది, నిజమే. కాని దానికి మూలము విమర్శయే కదా. కండరములద్వారా కొంచెముగా గోచరించు శక్తిని పని యందురు. ఆలోచన లేనిదే ఏ పనియు కలుగ నేరదు. కావున మీ బుద్ధిని ఉత్తమము లగు తలంపులతో, అత్యున్నతము లగు ఆదర్శములతో, నిండించుకొని, రేయుంబవళ్లు వానిని దృష్టిలో నుంచుకొని ఉండుడు. తత్ఫలముగా అత్యుత్తమకార్యము లొనర్తురు. మనము అపరిశుద్ధులము అని ఎన్నడును పలుక వలదు. పరిశుద్ధుల మనియే పలుకుచుండుడు. మనము స్వల్పుల మనియు, జన్మించితి మనియు, మరణింతు మనియు, గాఢభ్రాంతి నొకదానిని కల్పించుకొని యున్నాము. అందుచే మనల నెప్పుడును అకారణ భీతి వెంటాడు చున్నది.

నిండుచూడి సింహ మొకటి ఆహారార్థము సంచరించుచు ఒక గొఱ్ఱెలమందను చూచి దానిలోనికి దుమికెను. కాని ఆ పరిశ్రమమును ఓర్వ జాలక ఈని వెంటనే మరణించెను. దాని కిశోరము గొఱ్ఱెలపోషణక్రిందనే పెరిగి, వానితోపాటు గడ్డి మేయుచు,

వానివలెనే గొఱ్ఱెయఱపు అఱచు చుండెను. పెద్ద దైన పిదప కూడ తాను గొఱ్ఱె యనియే దాని తలంపు. మఱియొక సింహ మొక నాడు ఆ ప్రాంతమునకు ఆహారార్థము వచ్చి, ఆ మందలో సింహ ముండుటను, గొఱ్ఱెలవలెనే అదియు పాఱి పోవుటను చూచి, అచ్చెరు వందెను. దానియొద్దకు పోయి అది గొఱ్ఱె కా దనియు, సింహ మనియు, తెలుప యత్నించెను గాని, అది దొరకక పాఱిపోవు చుండెను. సమయము వేచియుండి, ఆ 'గొఱ్ఱె - సింహము' నిదు రించుచుండగా సమీపించి 'నీవు సింహమవు'' అని దానికి చెప్పెను. ''కాదు, నేను గొఱ్ఱెనే'' అని అది గొఱ్ఱెఅఱపు అఱచెను. అంతట దాని నొక చెఱువుకడకు లాగుకొనిపోయి, తమ ఉభయుల ప్రతిబింబములను చూపెను. అంతట వితర్క మారంభమై ఆ 'గొఱ్ఱె - సింహము' తన ప్రతిబింబమును ఆ సింహమును పోల్చి చూడగా, క్షణమాత్రమున తాను సింహ మను సత్యము దానికి స్ఫురించెను. వెంటనే దాని గొఱ్ఱెయఱపు పోయి సింహగర్జనము వచ్చెను. మీరు సింహములు. నిత్యము, పరిశుద్ధము, పరి పూర్ణము అగు ఆత్మయే మీరు. విశ్వశక్తి మీయందు అణగియున్నది. ''మిత్రమా, ఏడ్చుచున్నా వేల? నీకు జననమరణములు లేవు, వ్యాధి దుఃఖములు లేవు, అనంత మగు ఆకాశమువంటి వాడవు నీవు. రంగురంగుల మబ్బులు దానిని ఆవరించి ఒక క్షణ మాత్రము క్రీడించి మాయ మగుచుండును. కాని ఆకాశ మెప్పు డును నిత్యవినీలకాంతిమయమే''. దుర్జనత్వము మన కేల కని పించుచున్నది? చెట్టుమోడొకటి నిలిచియుండెను. చీకటిలో దాని నొక దొంగ చూచి పోలీసు జవాను అనుకొనెను. ప్రియురాలి కొఱకు వేచియుండిన యువకు డొకడు చూచి తన ప్రియురాలు అనుకొనెను. దయ్యముల కథలు విన్న యొక బిడ్డ చూచి దయ్య మనుకొని వెఱపుతో అఱవ సాగెను. కాని అక్కడ ఉండినది ఆ మోడే. మన మనఃస్థితియే మనకు లోకమున కని పించును. ఒక గదిలో ఒక బిడ్డ యున్న దనుకొనుడు. ఆ

గదిలోనుండు ధనపు మూటను చోరుఁ డొకఁడు దొంగిలించుకొని పోయినచో, బిడ్డకు అది దొంగతనము అని తెలియునా ? మనలో నున్నదే మనకు బయట కనిపించును. బిడ్డకు లోపల దొంగ లేఁడు, కావున బయటకూడ లేఁడు. జ్ఞాన మంతయు నిట్టిదే. ప్రపంచ మున దుర్జనులు కలరు, పాపులు కలరు, అనకుఁడు. "మా దృష్టికి ఇంకను దుర్జనులు, పాపులు కనిపించుచున్నారే" అని దుఃఖిం పుఁడు, విలపింపుఁడు. లోకోపకారము చేయఁగోరుదు రేని లోకమును తూలనాడి, దానిని ఇంకను బలహీనము చేయకుఁడు. పాపము, దుఃఖము మున్నగున వన్నియు బలహీనతా ఫలములే సుఁడీ. ఇట్టి బోధలచే లోకముననున్న బలహీనత క్రమక్రమముగా హెచ్చి పోవుచున్నది. చిన్ననాటినుండియు "మీరు దుర్బలులు, మీరు పాపులు" అని లోకులకు చెప్పుచున్నారు. "మీ రందఱు — మీలోని అధమాధములు సైతము — అమృతపుత్రులు, మహి మాఢ్యులు" అని బోధింపుఁడు. చిన్ననాటినుండియు బలప్రద ములు, ధైర్యప్రదములు, ఆశాజనకములు అగు ఆశయము లతో వారి బుద్ధులను నిండింపుఁడు. మీరును అట్టి భావములనే చేరనిండు. అధీరతను, నిరాశను, పెంపొందించు ఆశయములను చేరనీయకుఁడు. "సోఽహం", "సోఽహం" (నేను అతఁడను) అను భావమును మీ మనస్సులలోని కెక్కించుకొనుచుండుఁడు. రేయిం బవళ్ళు మీ మనస్సులు ఆ భావముతో ధ్వనించుచుండు గాక. మరణకాలమున కూడ "సోఽహం" అని ప్రకటింపుఁడు. అదియే సత్యము. అనంత మగు విశ్వశక్తి యంతయు మీదే. మీ మనస్సుల నావరించియున్న వెఱ్ఱినమ్మకములను పాఱద్రోలుఁడు. సత్యము నెఱుఁగుఁడు. సత్యము నభ్యసింపుఁడు. గమ్యము దూరమే కావచ్చును. కాని లెండి, మేలుకొండి, ఆగక, గమ్యము చేరుకొండి.



# మాయ, భ్రాంతి

(లండనులో ఉపన్యాసము)

మాయ అనుమాటను మీలో అనేకులు విని యే ఉందురు. మామూలుగా సరియైన అర్థ మెఱుగక, తప్పుగా, 'మోహము' 'భ్రాంతి' వంటి ఏదో అర్థమున దానిని వాడుదురు. కాని వేదాంతవిద్యకు ఈ మాయావాదము మూలస్తంభము వంటిది గనుక, మనము దీనిని సరిగా గ్రహించుట ముఖ్యము. తొందర పడక సావధానముగా వినుడు. లేనిచో అపార్థము చేసికొందురు. వేదవాఙ్మయమున కనిపించు అతిపురాతనప్రయోగములలో అది భ్రాంతి యను అర్థముననే వాడబడి యున్నది. కాని మాయా వాద మప్పటికి సరియైన రూపొంద లేదు. ''ఇంద్రుడు తన మాయ చేత వివిధరూపములను ధరించెను'' అనున దొకప్రయోగము. ఇచ్చట దాని కర్థము గారడివిద్యవంటి దేదో అనుటకు సందేహము లేదు. ఇట్టి ప్రయోగము లెన్నియో కలవు. అన్నిటిలోను అదే అర్థము. పిదప మాయ అను మాట చాలకాలము అదృశ్య మైనది. కాని భావము మాత్రము క్రమక్రమముగా పరిపక్వ మగుచుండెను. కాలాంతరమున ''ఈ జగత్తుమర్మము మన కేల గోచరింప కున్నది?'' అను ప్రశ్న బయలుదేఱెను. ఆ ప్రశ్నకీ క్రింది విశేషభావవ్యంజక మగు సమాధాన మీయబడినది: ''మనము వ్యర్థప్రసంగములతో కాలము గడపుచున్నాము. ఇంద్రియవిషయములతోనే తృప్తినొందు చున్నాము. కోరికలవెంట పరువులిడుచున్నాము. ఇందుచే సత్య మును మంచుతెరతో కప్పివైచుచున్నా మన వచ్చును.'' ఇచట ''మాయ'' అను మాట వాడబడలేదు గాని, ''మన బుద్ధిపై నొక విధమగు మంచుతెర క్రమ్మినందున దానికి సత్యము గోచరించుట లేదు, అదియే మన అజ్ఞతకు కారణము'' అను ఆశయము

కలదు. ఇంకను చాల కాలము గడచిన పిదప, చివరి ఉపనిషత్తొకదానిలో 'మాయ' అను మాట మరల కనిపించుచున్నది. కాని అప్పటికి దానిలో క్రొత్తయర్థమెంతో ఇమిడి, దాని రూపమే మాఱిపోయె ననవచ్చును. ఇట్లగుటకు ముందు ఎన్నియో వాదప్రతివాదములు చెలరేగినవి. తత్ఫలముగా చివరకు సుస్థిర రూప మొందిన యర్థమే ఆ ఉపనిషత్తులో కనిపించునది. ''మాయామ్ తు ప్రకృతిం విద్యాత్ మాయినమ్ తు మహేశ్వరమ్'' (ప్రకృతి మాయ అనియు, మహేశ్వరుడు మాయి అనియు ఎఱుగునది) — శ్వేతాశ్వతరోపనిషత్తు. శంకరాచార్యులకు పూర్వపు వేదాంతులు ఈ మాయాశబ్దమును తమతమ మతముల కనుకూలించునట్లు లెన్నియో విధములుగా ప్రయోగించుకొనిరి. బౌద్ధులుకూడ ఈ శబ్దము నొకించుక ఉపయోగించిరి. కాని వారిమతమున అది ''ఆదర్శవాదము'' (ఐడియలిసమ్) వంటిది అయ్యెను. మాయాశబ్ద మిప్పుడా అర్థముననే వాడుకలో నున్నది. ''ఈ ప్రపంచము మాయ'' అని హైందవుడు పల్కినచో, ''భ్రాంతిజనితము'' అను అర్థ మితరులకు స్ఫురించును. ఇందుకు బౌద్ధతత్త్వజ్ఞులు కొంతవఱకు కారణభూతు లని చెప్ప వచ్చును. వారిలో నొకశాఖవారు ఈ బాహ్యప్రపంచమునకు ఉనికియే లేదనుచుండిరి గదా! కాని, వేదాంతమత పరిపక్వదశలో, 'మాయ' అనునది 'బాహ్యజగత్తు వాస్తవము కాదు' అను ఆదర్శవాదమునకు గాని, 'వాస్తవమే' అను బాహ్యసత్తావాదము (రియలిసమ్) నకు గాని సంబంధింపదు. అది యొక మతమే కాదు. మనస్థితిని, మన ముందు ప్రపంచస్థితిని యథాతథముగా తెలుపు మాటయే 'మాయ' అనునది. వేదములను నిర్మించిన ఋషులబుద్ధి మూలతత్త్వముల ననుసరించుటయందును, కనిపట్టుటయందును, వ్యగ్రమై ఉండెను. స్వల్పాంశములలోనికి దిగుటకుకాని, వానికై వేచియుండుటకు కాని, వారికి తీఱిక లేదు. అగాధ పరిశీలనచే వస్తువుల తత్త్వ

మెఱుగులే వారి సంకల్పము. లోకాతీతక్షేత్రమునుండి వారి కొక పిలుపు వినబడుచుండె నన వచ్చును. అందుచే వారికి వ్యవధి లేదు. భౌతికశాస్త్రములలో ఆధునికము లనబడు కొన్ని విషయములు ఉపనిషత్తులలో అచ్చటచ్చట కానవచ్చుచుండును. అందలి స్వల్పాంశములు ప్రాయికముగా తప్పులతో నిండియుండును కాని, మూలతత్త్వవిషయము లన్నియు నిర్దుష్టములు. ఇందు కొక ఉదాహరణము: ఆధునికభౌతికశాస్త్రజ్ఞులు మొన్న మొన్ననే కన్గొనిన ఆకాశపదార్థము (ఈథరు) వారి కప్పటికే పరిచితము. ఈ ఆధునికవాదము కన్న అది ఎంతో పరిపక్వరూపము నొంది యుండెనుకూడ. కాని అది మూలభావవిషయమున మాత్రమే. ఆ భావమును విస్తరపఱచి క్రియారూపవివరణమునకు దిగినప్పుడు ఎన్నో తప్పు లేర్పడినవి. జీవశక్తి సర్వగతమనియు, లోకములో గల జీవకోటియం దంతయు ఆ శక్తియే పరిమాణభేదములతో ప్రకాశించుచున్న దనియు, వేదకాలముననే కనిపట్టబడియున్నది. జీవశక్తినిగూర్చి పై యాశయములు గల పెద్ద స్తోత్ర మొకటి వేదసంహితలలో కలదు. మఱియొక విశేషము. మీ కది చిత్రముగా తోచు నేమో కాని, ఈ భూలోకములోని జీవోత్పత్తిని గూర్చి ఆధునికభౌతికతత్త్వపరిశోధన ఫలముగా ఇటీవల వెలువడిన వాదములవంటివే వేదకాలతత్త్వవాఙ్మయమున గూడ కలవు. జీవోత్పత్తికి మూలము ఇతరమండలములు అను ఆధునికవాదము మీ రందఱెఱిగినదే. ఆ మూలము చంద్రమండలమని వేదకాలపు తత్త్వవేత్తల కొందఱి సుస్థిరమతము.

విశాలభావమయములును, వస్తుసాధారణధర్మప్రతిపాదకములును, అగు మూలతత్త్వములను నిబంధించుటలో ఈ వేదకాలపు తత్త్వవిచారపరులు చూపిన ధైర్యసాహసములు అపారములు. బాహ్యప్రపంచవిచారమూలమున వా రొనర్చిన విశ్వరహస్యవిభేదనము సాధ్యమైనంతవఱకు సంతృప్తికరమే. కాని మూలతత్త్వమే అసమర్థమైయుండునప్పుడు,

ఆధునిక భౌతిక శాస్త్రజ్ఞులు చేయు దాని స్వల్పాంశ పరిశీలనము సమస్యాపరిష్కారమున కెట్లుపకరింపగలదు? ఆకాశపదార్థ వాదమును మూలాధారముగా కొని, పురాతనకాలపు తత్త్వ విచారపరులు విశ్వరహస్యమును భేదింపజాలకపోయిరి. ఇప్పుడు అదే మూలతత్త్వమును, సూక్ష్మాంశవిస్తరణ మొనర్చి పరిశీలించుట చేత ఆ రహస్యమును భేదింప వచ్చు ననుట వెఱ్ఱి కదా. సర్వవ్యాప్త మగు జీవశక్తిని గూర్చిన విచారణముకూడ ఇట్టిదే. మూల భావమే సమస్యాపరిష్కారమునకు అసమర్థమై యుండగా, తత్సూక్ష్మాంశవిచారణ మెట్లు సమర్థము కాగలదు? ఇంతకు, నేను చెప్ప వచ్చిన విషయ మే మనగా, మూలతత్త్వవిచారవిషయమున హిందువు లత్యంతధీరత చూపిరి. ఆధునికుల ధీరత కది తీసిపోదు. కొన్నిపట్ల ఎంతో అధికముకూడ. వారు నిబంధించిన సాధారణ ధర్మసిద్ధాంతములు కొన్ని అత్యద్భుతములు. అత్యంతవిపులాన్వయ ములు. ఊహౌన్నత్యమున మానవబుద్ధి అంతకన్న పైకి ఎగయ జాలదు. వారి భావములు కొన్ని ఇంకను సిద్ధాంతరూప మొంద లేదు. కాని అవి ఆధునికభౌతికశాస్త్రజ్ఞుల కింకను చర్చనీయాంశ ములుగ నైన స్ఫురింప లేదు. ఉదాహరణము: ఆకాశపదార్థ మును ప్రతిపాదించిన పిదప, వా రింకను అగాధపరిశీలన చేసి, మనస్సుకూడ సూక్ష్మతర మగు ఆకాశపదార్థమే యని నిర్ణయించిరి. అంతట ఇంకను లోతునకు దిగి మనస్సు కన్న సూక్ష్మతర మగు ఆకాశపదార్థముకూడ ఒకటి కల దని కనిపట్టిరి. కాని సమస్య ఇంకను పరిష్కృతము కాలేదు. బాహ్యప్రపంచపరిజ్ఞాన మెంత అభివృద్ధి చెందినను, మూల సమస్య అట్లే నిలిచి యుండెను. భౌతికశాస్త్రజ్ఞు డిందుచే నిరుత్సాహ మొందక ఇట్లనును: "ఇప్పు డిప్పుడే కదా మనకు కొంచెకొంచెముగా విష యము తెలియవచ్చుట! కొన్నివేల సంవత్సరములు ఆగుడు. పరిష్కారమార్గము లభించును." వేదాంతి ఇందు కే మాత్రము ఒప్పుకొనడు. మనస్సు పరిమితవస్తు వనియు, దేశకాలనిమిత్తములను

దాటి దానికి ప్రచారము లేదనియు, అతడు నిస్సంశయముగా ఎఱుగును. మనుష్యుడు తనలోనుండి బయటికి దుముకజాల నట్లే, కాల నిమిత్తములు గీచిన గిఱిని దాటి అతడు పోజాలడు. ఇక, దేశకాల నిమిత్తములు ఎట్లు ఉత్పన్నములైనవి అను విషయమును అత డెట్లు పరిశీలింపగలడు? ఆ పరిశీలనప్రయత్నము లన్నియు ఆ విధుల అధీనములోనుండియే కదా అతడు చేయవలెను! అగుచో, ప్రపంచమునకు అస్తిత్వము (ఉనికి) కలదు అను మాటకు అర్థ మేమి? "ప్రపంచమునకు అస్తిత్వము లేదు" అను మాట కర్థ మాలోచింతము. "దానికి స్వతంత్ర మగు అస్తిత్వము లేదు. నా మనస్సు, మీ మనస్సులు, ఇతరుల మనస్సులు : వీని సంబంధమున మాత్రమే దాని అస్తిత్వము" అని అర్థము. ఈ ప్రపంచమును మన పంచేంద్రియములతో చూచుచున్నాము. ఇంకొక ఇంద్రియ ముండినచో, దానియం దింక కొంత కనిపించును. ఇంకను మఱొక ఇంద్రియ మున్నచో, ఇంకను వేఱు విధముగా కనిపించును. అనగా, దానికి వాస్తవమగు అస్తిత్వము లేదు : అవికారము, అచలము, నిత్యము అగు అస్తిత్వము లేదు. అట్లని దానికి అస్తిత్వము లేనే లేదనుటకుకూడ వీలు లేదు. అది కలదు కదా! దానియందే, దానిమూలముననే, కదా మనము కార్యకలాపమును నెఱవేర్చుకొనుచున్నాము! అనగా, అది అస్తిత్వానాస్తిత్వముల కూడిక.

ఈ సూక్ష్మతత్త్వవిచారమునుండి మన దైనిక జీవిత వ్యాపారములకు దిగి వచ్చినను, జీవిత మంతయు పరస్పర విరోధమయమై, అస్తిత్వానాస్తిత్వములకూడికగనే కనిపించుచున్నది. జ్ఞానవిషయములో ఈ విరుద్ధభావము కలదు : మానవుడు కోరినచో అతనికి సర్వము తెలియ వచ్చు నని మొదట తోచును. కాని నాలు గడుగులు వేయక ముందే దాట శక్యము కాని వజ్రకఠిన మగు గోడ అడ్డు తగులును. తన కార్యాచరణ మంతయు ఒక వలయము లోపలనే! ఆ వలయము నతడు అతిక్రమింప జాలడు.

స్వవిషయకములును, మిక్కిలి ప్రియములును, అగు సమస్యలెన్నియో రేయుంబవళ్లు అతనిని వేధించుచున్నవి. కాని తన బుద్ధి కతీతము లగుటచే వాని నతడు పరిష్కరింప జాలడు. ఐనను ఆ వాసన సుస్థిరమై మనసులో నాటుకొనియే ఉన్నది. ఉన్నను, దానిని నిగ్రహించి అణచివేయుటే శ్రేయస్కర మని మన మెఱుగుదుము. ప్రతిక్షణము, మన హృదయప్రేరణ లన్నియు, స్వార్థపరత్వముదెసకే లాగుచున్నవి. కాని అనిర్వాచ్యవాణి యొకటి స్వార్థరాహిత్యమే శ్రేయస్కర మని ఉద్బోధించుచుండును. పసితనమున ప్రతివాడును ఆశా శీలుడే (ఆప్టిమిస్టు). అప్పు డతనికి భావిజీవిత మంతయు స్వర్గభోగమయమే. యౌవనమున అతడంతకన్న ఆశాశీలుడగును. మరణము, అపజయము, పరాభవము: ఇట్టివి లోకమున కల వనియే అత డప్పుడు నమ్మలేడు. కాని వార్ధక్యము వచ్చుసరికి జీవిత మంతయు శిథిలసౌధమువలె కనిపించును. ఆశ లన్నియు అంతరించును. భవిష్యత్తంతయు అంధకార మయము. మన మిట్లు ప్రకృతిచేత దెబ్బలు తినుచు, ఎక్కడకు పోవునదికూడ ఎఱుగక, అతి సుఖస్థితినుండి అతిదుఃఖస్థితిని చేరబాఱుచుందుము. బుద్ధుని జీవిత మగు 'లలితవిస్తార'లోని సుప్రసిద్ధ గేయ మొకటి నా కీ సందర్భమున జ్ఞప్తికి వచ్చుచున్నది. బుద్ధుడు మానవకోటి నుద్ధరించుటకై జన్మించెను. కాని రాజభోగములలో మునిగి తన్ను తానే మఱచిపోయెను. ఆయనను మేల్కొలుపుటకై దేవదూతలు వచ్చి యొక పాట పాడిరి. ఆ పాటలోని సారాంశ మిది: "మన మీ జీవితనదీప్రవాహములో పడి తేలియాడుచు పోవుచున్నాము. నది నిరంతరపరిణామ మొందుచున్నది. దానికి విరామము లేదు, విశ్రాంతి లేదు." అట్లే మన జీవితములుకూడ విరామవిశ్రాంతు లెఱుగక సాగిపోవుచునే ఉండును. మన మేమి చేయవలెను? అన్నపానీయములు సమృద్ధిగా కలవాడు ఆశాశీలుడు. అతడు ఆపదల మాటయే ఎత్తడు. ఆ మాట విన్న నే అతనికి భీతి. లోకములో గల కడగండ్లను

గూర్చియు, దుఃఖములనుగూర్చియు అతనికి చెప్పకుడు. "లోక మంతయు సుఖమయమే" అనుడు. "నిజమే, నేను క్షేమముగా ఉన్నాను. నన్ను చూడుడు. నాకు సుఖనివాసము కలదు, కూడు గుడ్డల లో టేమియు లేదు. కావున ఆ ఘోరవిషయములు నా యెదుట ఎత్తకుడు." కాని ఇతరు లెందఱో కూడుగుడ్డలకు కఱవై చచ్చుచున్నారు. లోకము సుఖమయ మని వారితో చెప్పినచో, వారు వినిపించుకొనరు. తాము దుఃఖములతో కృశించుచుండగా, ఇతరుల సుఖములు వారి కేల నచ్చును? మన మిట్లు ఆశా నిరాశలమధ్య ఊగులాడు చున్నాము.

ఇక మరణ మను అత్యుగ్రవిషయ మొకటి కలదు. ప్రపంచ మంతయు మరణము దెసకే సాగుచున్నది. ప్రతివస్తువు మరణించునదే. మన అభివృద్ధి, మన అహంకారము, మన సంస్కారణములు, మన భోగములు, మనసంపద, మన జ్ఞానము: అన్నిటికి గమ్య మొక్కటే — మరణము. ఏది తప్పినను అది తప్పదు. నగరములు పొడచూపును, అడుగంటును; సామ్రాజ్యములు మింటి కెగయును, మంట కూలును; గ్రహమండలములు విచ్ఛిన్నములై, ధూళిపాలై, ఇతరమండలవాతావరణములో తేలి యాడుచుండును. ఆదిమకాలమునుండియు కథ ఇట్లే నడుచు చున్నది. మరణమే అన్నిటికిని అంతము. జీవితమునకు, సౌందర్యమునకు, సంపదకు, అధికారపదవికి, అన్నిటికి — సౌశీల్యమునకు కూడ — మరణమే అంతము. పుణ్యపురుషులు, పాపపురుషులు; ప్రభువులు, బిచ్చగాండ్రు: అందఱు మృతినొందువారే. సర్వము పయనించునది మరణమువైపునకే. కాని ప్రాణములపై ఇంత తీపి! ఎట్లో జీవమును అంటిపట్టుకొని ఉందుము. ఎందుకో, మనకే తెలియదు. ఆ పట్టు వదలుట మనకు అసాధ్యము. ఇది మాయ.

తల్లి తన బిడ్డని ఎంతో ప్రేమతో పాలిచ్చి పెంచుచున్నది. ఆ బిడ్డ డామె ప్రాణమునకు ప్రాణము. వాడు పెరిగి పెద్దవాడైన

పిదప, చెడు త్రోవల పడి, పశుప్రాయుడై, ఆమెను ప్రతిదినము కొట్టి, తన్ని, హింసించుచున్నాడు. కాని ఆమె వానిని విడిచి వెళ్ల జాలదు. ఇందుకు కారణ మేమి అని ఎప్పుడైన విచారించు కొన్నచో, ప్రేమ అను ఆశయమును కల్పించుకొని తృప్తినొందును. కాని నిజమున కది ప్రేమ కాదు. ఆమె బుద్ధి నేదియో ఆవరించి లొంగదీసికొనినది. ఎంత యత్నించినను దాని నామె విదిర్చివేయ జాలదు. ఇది మాయ.

"బంగారు ఉన్ని"* ని సాధించి తెచ్చుటకై మన మంద అము ప్రయత్నించుచున్నాము. అది తనకు లభించు నని ప్రతివాని ఆస. ఆ ఆశ ఈడేఱుట ఏ రెండుకోట్లకో ఒక్క వంతు మాత్రమే అని బుద్ధిమంతు డగు ప్రతివానికిని తెలియును. కాని ప్రతివాడును దానికై పోరాడుచుండును. ఇది మాయ.

మృత్యుదేవత మన భూలోకమున రేయుంబగళ్లు వికట తాండవ మాడు చున్నది. కాని ఎప్పటికిని బ్రదికియుందు మనియే మనము నమ్మికొని యుందుము. "లోకమున నత్యంతవిచిత్ర మగు విషయ మేది?" అని ధర్మరా జొకసారి ప్రశ్నింపబడెను. "అనుదినము జనులు మన చుట్టును మరణించుచున్నారు ; కాని తాము మరణింప మని జనులు తలంచుచుందురు" అని ఆయన బదులు చెప్పెను. ఇది మాయ.

మన బుద్ధిప్రచారమందును, మన ఎఱుకయందును, మన జీవితసంఘటనము లన్నిటియందును కూడ, ఇట్టి విరుద్ధాశయములు అతిదారుణరూపమున మనల నెదుర్కొను చుండును. సంస్కర్త యొకడు ఆవిర్భవించి ఒక జాతిలోని లోపములను సవరింప జూచును. కాని అవి సరిపడుటకు ముందే మఱియొకచోట నొక

* ఇది గ్రీసుదేశపు పురాణకథావిషయకమైనది. ఈ కాలపు గొప్ప "లాటరీ" వంటి దనుకొన్న చాలును.

వేయి ఇతర లోపములు తలచూపును. పడిపోవు చున్న ప్రాతయిం టిని ఒక చోట కొంచెము బాగుచేసి నిలువబెట్టి నప్పటికి ఇంకొక భాగము పడిపోయి యుండును. నిర్బంధవైధవ్యము వలని హానిని గూర్చి మా హిందూదేశ సంఘసంస్కర్తలు ఘోషించు చున్నారు; అవివాహితస్త్రీ సమస్యను గూర్చి పాశ్చాత్యదేశము లందు ఘోష. అవివాహితస్త్రీల నొకచోట ఉద్ధరింప వలెను: వారు కష్టముల పా లగుచున్నారు. విధవల నింకొక చోట ఉద్ధరింప వలెను: వారును కష్టముల పా లగుచున్నారు. జీర్ణించిన కీళ్లనొప్పి వంటి సమస్య యిది. తలనుండి తఱిమిన శరీరమును చేరును. అచటనుండి తఱిమిన, పాదములను బాధించును. చదువు, సంపద, సంస్కృతి : ఇవి ఏ కొలదిమందికో మాత్రమే అందుపాటులో నుండ రా దని సంస్కర్తలు బోధింతురు. అందఱి కవి లభించు నట్లు చేయజూతురు. దీనిచే కొందఱికి సుఖము కలుగవచ్చును. కాని సంస్కృతి పెరుగు కొలది శరీరసుఖము తఱుగు నవకాశము కలదు. సుఖజ్ఞానముతో పాటు అసుఖజ్ఞానముకూడ గోచరించును. అగుచో, మనకు మార్గ మేది? ఒకని కేపాటి సంపద లభించునో అంత ఆపద ఇంకొకనికి ఆపాదిల్లియే తీఱును. లోకధర్మ మది. అనుభవరహితు లగు యువకుల కిది అంత స్పష్టముగా తోపక పోవచ్చును, కాని చాలకాలము జీవించినవారును, లోకములోని కష్టనిష్ఠురముల నెఱిగినవారును, ఇది గ్రహింప గలరు. ఇది మాయ. ఇవన్నియు నిరంతరసంఘటనములు — ఇది అనివార్యస్థితి. "ఏల" అను ప్రశ్నకు సమాధానము లేదు సరే గదా, ఆ ప్రశ్న వేయుటకు అవకాశముకూడ లేదు! ఎట్లు?, ఏల? అని ప్రశ్నించుట నిరుప యోగము. ప్రపంచరీతి ఇట్టి దనియు, ఇది మార్ప శక్యము కాని దనియు, మాత్రము మన మెఱుగుదుము. దానిని మనము పూర్తిగా గ్రహించుట అసాధ్యము. మనస్సులో స్పష్టముగా చిత్రించుకొనుటకూడ అసాధ్యము. ఇక దానిని పరిష్కరించు టెట్లు?

ఈ ప్రపంచము నడుచు క్రమమును యథాతథముగా తెలుపు మాటయే మాయ. ఇదంతయు తెలిపినచో జనులు భీతిలుదురు. కాని మనము భీతిల రాదు. వాస్తవస్థితిని దాచుకొన్నచో దానిని బాగుపఱచు మార్గము కనుగొను టెట్లు? కుక్కలు తఱుము నప్పుడు తల దాచుకొని కుందేలు అపాయ విముక్తి నొందితి ననుకొనును. కాని అందుచేత ఏమి ప్రయోజనము? ఈ వాదమునకు ఆక్షేపములు కలవు కాని, అవి సుఖజీవన సంపన్నులగు వారు చేయున వని కొందఱికి తోప వచ్చును. ఈ ఇంగ్లాండుదేశస్థులు నిరాశాశీలురు (పెసిమిస్ట్సు) కాలేరు. ఇట ప్రతివాడును లోక మెంత అద్భుతముగా, ఎంత పురోభివృద్ధి సూచకముగా, నడుచు చున్నది అనును. కాని తా ముండు స్థితియే వారికి లోకస్థితికూడ! పురాతనసమస్యలు చర్చింపబడు చున్నవి: క్రైస్తవజాతు లభ్యుదయసంపన్నులై యున్నారు గనుక క్రైస్తవమత మొక్కటే సత్య మైనది! కాని క్రైస్తవజాతుల అభ్యుదయమునకు కారణము ఇతరమతస్థులు దీనదశ నంది కడగండ్ల పాలగుచుండుటే కాన, ఈ ప్రతిపాదన తన్ను తానే ఖండించుకొనుచున్నది. వారికి బలి కా దగువారు లభించుచున్నప్పుడే వారి అభ్యుదయము. ప్రపంచ మంతయు క్రైస్తవమత మవలంబించినచో, క్రైస్తవజాతులకు దారిద్ర్యము చేకుఱును. ఇతరమతస్థులున్న గదా వీరికి ఆహుతి యగుటకు? కావున ఈ వాదమునందే దానికి విఱుపుకూడ కలదు. ఆకలములు తిని మృగములును, మృగములను తిని మానవులును, జీవింతురు. కాని బలవంతు లగు మానవులు బలహీన మానవులను ఆహుతిగొను ఘోరాచారము కూడ కలదు. అంతటను ఇది చూపట్టును. ఇది మాయ. ఈ స్థితిని సంస్కరించు టెట్లు? ఈ ప్రశ్న కెన్నెన్నియో సమాధానములు చెప్పబడుచున్నవి. కాలాంతరమున అంతయు చక్కబడు నని కొందఱి సమాధానము. అది యొకవేళ నిజమే కా వచ్చునని ఒప్పుకొన్నను, ఆ ఉపకారము చేయుట కిట్టి ఘోరాతిఘోరమార్గ

మేల? మంచి చేయుటకు మంచి మార్గములే ఏల అవలంబింప రాదు, ఈ పాపిష్ఠిమార్గములకు బదులు? రాబోవు పురుషాంతరపు జనులు సుఖపడవచ్చును, కాని ఇప్పటివారి కీ క్రూరవ్యథ లేల? ఈ ప్రశ్న కేమియు సమాధానము లేదు. ఇది మాయ. మఱొక వాదముకూడ కొందఱివలన వినుచున్నాము. లోపముల నన్నిటిని క్రమక్రమముగా రూపుమాపుచుండుట పరిణామ కార్య విశేషలక్షణములలో నొక టట! ఇట్లు లోపము లన్నియు నశించిన పిదప, మంచి మాత్రమే నిలుచు నట! ఎంత శుభవార్త! కావలసి నన్ని యైహికసంపదలు కలిగి, పూట గడచు టెట్లా అని సంక్షోభింప నవసరము లేక, పరిణామము పేరిటి ఈ క్రూర చక్రముక్రింద పడి నలిగి పోవక యుండు భాగ్యజీవుల అహంభావమున కిది ఎంత ఆహ్లాదకరము! ఆ మూక లెంత అగచాట్లు పడ్డ తమ కేమి? వారు చచ్చినచో, లోకమున కేమి కొఱత? బళీ! ఎంత చక్కని వాదము! కాని, ఇది యంతయు తప్పుల కుప్ప! లోకమున అభివ్యక్తములైన శుభాశుభముల పరిమాణములు నిర్దిష్టము లైన వనుట నిరాధారమగు వెఱ్ఱి ఊహ. శుభము క్రమక్రమముగా హెచ్చుచుండును, అశుభము క్రమక్రమముగా తగ్గుచుండును, అను నది అంత కన్న వెఱ్ఱి ఊహ. వీరి పరిణామకార్యము కొంతకాల మిట్లు సాగిన పిదప, అశుభ మంతయు నశించి, శుభము మాత్రమే లోకమున మిగులు నట! ఇట్లు చెప్పుట సులభమే గాని, అశుభము తఱిగిపోవుచున్న దని నిరూపింప గలరా? అడవిజాతివాని నొకనిని తీసికొందము. వాడు చదువు రానివాడు, వ్రాత యను మాటయే విన లేదు. బుద్ధిని వికసింప జేసికొను మార్గము లెఱుగడు. వానికి తీవ్ర మగు గాయము తగిలినచో, అది త్వరగనే నయ మవును. మనము కొంచె మెక్కడ నైన గీఱుకొనిపోయినచో మరణింతుము. యంత్ర నిర్మాణమువలన వస్తువులు చౌక ఐనవి. మనుష్యుడు అభివృద్ధి నొందుటకు, బాగుపడుటకు, అవకాశము లేర్పడినవి. కాని తన్మూల

ముగా ఒక్కడు లక్షాధికారి యగుటకై, వేన వేల జనులు క్రమ క్రమముగా అణచివేయబడి, దాస్యవృత్తికి పాల్పడి కృశించి పోవు చున్నారు. పశుప్రాయదశయందున్న మానవుడు ఇంద్రియము లందే జీవించును. కడుపునిండకపోవుటచేతను, శరీరమునకేదైన హాని కలుగుటచేతను, వాడు గోడు చెందును. వాని కష్టసుఖము లకు ఇంద్రియములందే మొదలు, ఇంద్రియములందే తుద. వాడు అంతకన్న ఉన్నతదశకు వచ్చి, వాని సుఖోత్పత్తిక్షేత్రము విశాలత నందుకొలది, దుఃఖోత్పత్తిక్షేత్రముకూడ విశాల మగుచుండును. అసూయపడుట, న్యాయస్థానముల కెక్కుట, పన్నులు చెల్లించుట, సంఘనిందలు మోయుట, హృదయ రహస్యములలోకూడ ప్రవే శించు ఘోరరాక్షసపరిపాలనకు లోబడి రేయుంబవళ్లు రాపిడి నొందుచుండుట : ఇవన్నియు అడవిజాతివా డెఱుగడు. నాలుగు ముక్కలు చదువు నేర్చి పొగ రెక్కిన మానవుడు దుష్టమృగముల కన్న వేయిరెట్లు క్రూరుడు కాగలడని అతనికి తెలియదు. కావున ఇంద్రియ జీవితమును దాటి పైకి ఎదిగిన పిదప మన సుఖాను భవశక్తి అధికమగుట నిజమే కాని, దానితోపాటు కష్టానుభవశక్తి కూడ అధిక మగుట తప్పదు. నరములు సూక్ష్మతరములై ఎక్కువ వ్యథను భరించుటకు సమర్థము లగును. ఏ జాతియందైనను చదువు రాని సామాన్యమానవుడు తిట్లకు అంతగా నొచ్చుకొనడు. ఒడలు విఱుగ గొట్టినప్పుడే వానికి కష్టము తోచునది. కాని మర్యాదస్థు డొక్క తిట్టునుకూడ ఓర్వజాలడు. వాని నరము లంత సూక్ష్మత నొందినవి. నరములు సుఖస్పర్శకు సున్నితము లగుటతోపాటు వాని వ్యథకూడ అధిక మైనది. పాపము, పరిణామవాదికీ సత్య మెంత ప్రతికూలము! మనము సుఖానుభూతిశక్తి నధికపఱచుకొను కొలది, దుఃఖానుభూతిశక్తినికూడ అధికపఱచుకొందుము. సుఖాను భూతిశక్తి కన్న దుఃఖానుభూతిశక్తి ఎన్నో రెట్లధికముగా పెరుగు చుండు ననికూడ నా యెన్నిక. పురోగమన మొందుకొలది సుఖ

దుఃఖములకు రెంటికిని సూత్నావకాశములు కలుగుచుండు నని స్వానుభవమే మనకు తెలుపుచున్నది. ఇది మాయ.

కావున మాయ అనునది దృశ్యలోకస్థితిని యథాతథముగా తెలుపు మాటయే కాని విశ్వరహస్యమును భేదింపజూచు వాదము కాదనుట స్పష్టము. మన జీవితమూలమందే పరస్పరవిరుద్ధ మగు ద్వంద్వత కలదు. మన మేమి చేసినను, దాట శక్యము కాని ఈ ద్వంద్వమయ వాతావరణములోనే చేయవలెను. మంచి ఉండుచోట నెల్ల కొంత చెడుగు, చెడుగు ఉండుచోట నెల్ల కొంత మంచి, ఉండియే తీఱవలెను. జీవమున్న చోట నెల్ల మరణము నీడవలె నిలిచియే యుండును. నవ్వువాడు ఏడ్వవలెను. ఏడ్చువాడు నవ్వవలెను. ఈ ద్వంద్వస్థితి మార్పశక్యము కానిది. చెడుగను మాటయే లేక, అంతయు మంచియే ఉండు నట్టియు, ఏడుపను మాటయే లేక, ఎప్పుడును నవ్వులే కలిగినట్టియు, ప్రదేశ మొకటి ఉండు నని మనము అనుకో వచ్చును; కాని అది వస్తుతత్త్వమునకే విరుద్ధము గావున అసంభవము. ప్రపంచపు మూలధర్మమును మార్చుట సాధ్యమా? నవ్వు కలిగించు శక్తి ఉన్న చోట నెల్ల ఏడ్పు కలిగించు శక్తికూడ దాగియే ఉండును. సుఖము కలిగించు శక్తి ఉన్న చోట నెల్ల దుఃఖము కలిగించుశక్తి కూడ ఎచ్చటనో దాగి యుండును.

అనగా, వేదాంతమతము ఆశాశీలము కాని, నిరాశాశీలము కాని కాదు. అందు ఆశానిరాశలు రెంటికిని స్థానము కలదు: ఏది వచ్చినప్పుడు అది. లోకములో శుభాశుభములు (మంచిచెడ్డలు) ను, సుఖదుఃఖములును కలిసి యుండు ననియు, ఈ ద్వంద్వములలో దేనిని పెంచినను, రెండవదికూడ పెరిగియే తీఱు ననియు దాని బోధ. లోక మంతయు కేవలము మంచిదిగనో, కేవలము చెడ్డదిగనో ఉండుట అసంభవము. ఆ భావమే అసంగత మైనది. మంచిచెడ్డలు పూర్తిగా వేర్వే ఱగు రెండు భిన్నవస్తువులు కావు

అను తత్త్వరహస్యము ఈ పరిశీలనవలన తేలుచున్నది. ‘‘ఇది మంచిది, కేవలము మంచిది; ఇది చెడ్డది, కేవలము చెడ్డది’’ అని రూఢిగా చెప్ప దగిన వస్తువు లోకములో ఒక్కటికూడ లేదు. నేడు మంచిదిగా తోచు విషయమే రేపు చెడ్డదిగా తోపవచ్చును. ఒకరికి దుఃఖకారణ మగు వస్తువే మఱొకరికి సుఖకారణము కావచ్చును. ఒక బిడ్డ దేహమును కాల్చి ఘోరాపద కలిగించిన అగ్నియే అన్నము పచనముచేసి పస్తులుపడియున్నవాని ఆకలి తీర్చును. మనస్సునకు దుఃఖబోధమును తెచ్చు నరములే సుఖబోధను కూడ తెచ్చును. కావున చెడుగు నిర్మూలింప వలెనన్నచో, మంచినికూడ నిర్మూలింప వలెను. వేఱు మార్గము లేదు. చావును రూపుమాపవలె నన్నచో, బ్రదుకును కూడ రూపుమాప వలెను. చావు లేని బ్రదుకు, దుఃఖము లేని సుఖము అనుట అసంగత ప్రసంగము. ఈ ద్వంద్వములలో ఏదియు ప్రత్యేకముగా లభింపదు. అవి ఒక్క దాని రెండు రూపములే. నిన్న నాకు మంచిదిగా తోచిన వస్తువు నేడు మంచిదిగా తోపదు. నా జీవితమే ఇందు కొక నిదర్శనము. చిన్ననాటినుండి నా లక్ష్యము లెన్నియో సార్లు మాఱినవి. బలిష్ఠము లగు జోడు గుఱ్ఱములు పూన్చిన బండి తోలుట ఒకప్పటి లక్ష్యము. ఒక దినుసు మధురభక్ష్యము చేయ గలుగుట ఇం కొక నాటి లక్ష్యము. భార్య, బిడ్డలు, ద్రవ్యసమృద్ధి, ఆ పిమ్మటి లక్ష్యము. ఆ యా కాలములందు నేను ఆనందపరమావధి నొందుటకు ఆ లక్ష్యముల సిద్ధి చాలియుండును. నే డవన్నియు నా దృష్టికి పరిహాసనీయము లగు వెఱ్ఱి కోరికలు! వ్యక్తిత్వ మెక్కడ నశించునో అని భీతిలుచుండిన దశ మన కిట్లే పరిహాసనీయముగా తోచు కాలము వచ్చి తీఱు నని వేదాంతమతము బోధించుచున్నది. ఈ దేహము నెప్పటికిని నిలుపుకొనియుండుటే సుఖము అను నట్టి ఆశయముకూడ మన కిట్లే వెఱ్ఱిగా, పరిహాసనీయముగా, తోచు కాలము వచ్చి తీఱును. కాని, ఇదియే యథార్థ మైనచో, మనము అనివార్య మగు పరస్పరవ్యతి

రిక్తవాతావరణములో — అస్తిత్వము కాక, నాస్తిత్వము కాక; దుఃఖము కాక, సుఖము కాక : ఈ విరుద్ధభావములు కూడిన వాతావరణములో — కదా చిక్కుకొని యున్నాము? అట్లగుచో, వేదాంతము కాని, ఇతరతత్త్వశాస్త్రములు కాని, మతములు కాని, ఎట్లు ఉపకరింప గలవు? 'సత్కార్యము లేల చేయ వలెను?' అనునట్టి గాఢసంశయముకూడ కలుగును. అపకారము కలిగింపని ఉపకారము కాని, దుఃఖము కలిగింపని సుఖము కాని, అసంభవమైనచో, ఉపకారము చేయు టేల? ఈ ప్రశ్నకు సమాధాన మేమనగా : 'పరుల దుఃఖరాశిని తఱిగించుటకై పాటుపడుటే మన సుఖమును పెంపొందించుకొను మార్గము'. ప్రతివారి కిది అనుభవము వలననే తెలియ వచ్చును. బుద్ధిమంతు లిది శీఘ్రముగనే గ్రహింతురు. మందబుద్ధులకు కొంత ఆలస్య మగును. కాని ఈ ఆలస్యము వలన వీరికి అపారనష్టము కలుగును. శీఘ్రముగా గ్రహించినవారి కంత నష్ట ముండదు. ఇది మొదటి సమాధానము. ఇక రెండవది : ఈ ద్వంద్వమయ ప్రపంచజీవనము నుండి మన మెప్పటి కైన విముక్తి పొంద గోరితి మేని, మన కర్తవ్యమును నెఱవేర్చుచుండవలెను. మన మీ స్వప్నమునుండి మేలుకాంచి, మట్టిపిడతలతో ఆడుకొనుట మానువఱకును, ఈ ఉపకారకశక్తులును అపకారకశక్తులును కలిసి మనకొఱ కీ ప్రపంచమును నిలిపియే యుంచును. మన మీ పాఠమును నేర్చుకోవలెను. కాని అది ఒకమాత్రమున రాదు. దీర్ఘకాలము — ఎంతో దీర్ఘకాలము — పట్టును. పరిపూర్ణుడే పరిమితు డయ్యె ననునట్టి భావముపై ఆధారపడిన తత్త్వసిద్ధాంత మొకటి నిర్మించు ప్రయత్నములు జర్మనీ ఇంగ్లాండు దేశములలో జరిగినవి. అఖండపరమాత్మయే ఈ ప్రపంచరూపమున సాక్షాత్కరింప యత్నించుచున్నాడనియు, కాలపరిపాకమున ఆ యత్నము సిద్ధింప గల దనియు, ఈ వాదములోని మూలాశయము. ఇది మంచిపనియే గాని, పరిమిత వస్తువు అఖండుని పూర్తిగా వ్యక్తపఱుప నేర్చును అనుట

కేమైన హేతుబద్ధ మగు ఆధారము కలదా అని తత్త్వవిచారపరులు ప్రశ్నింతురు. నిత్యుడును, అఖండుడును, అగు వాడు పరిమితు డైననే కదా ఈ ప్రపంచముగా కాగలడు? ఇంద్రియములద్వారా కాని, మనస్సుద్వారా కాని, బుద్ధిద్వారా కాని, గోచరించున దంతయు పరిమితము. పరిమితమే అపరిమితముగా నుండు ననుట యుక్తియుక్త మగు మాట కాదు. అట్లుండుట అసంభవము.

నిత్యుడు, (అఖండుడు), ఖండవస్తురూపమున వ్యక్తపడు టకు యత్నించు నని వేదాంతముకూడ అంగీకరించును కాని, కొంత కాలమున కిది అసాధ్య మని గ్రహించి, ఈ యత్నమును విరమించు నని దాని వాదము. ఆ విరమించుటయే వైరాగ్యము, త్యాగము. అదియే ఆస్తికధర్మజీవనమునకు నిజమైన ప్రారంభము. ఈ కాలమున వైరాగ్యము అను మాట ఎత్తుటయే బహుకష్టము. నన్ను గూర్చి అమెరికాదేశస్థు లేమనిరో తెలియునా? అయిదువేల సంవత్సరముల క్రిందట మరణించి, పూడ్చి వేయబడిన, దేశము నుండి వచ్చి వైరాగ్యమును ప్రశంసించువాడ నట నేను! ఆంగ్ల తత్త్వవేత్తలుకూడ అట్లే అందురు కాబోలును. కాని ఎవ్వ రే మన్నను, భగవదన్వేషణజీవనమునకు వైరాగ్య మొక్కటియే మార్గము. "జీవమును నాకొఱ కెవడు పరిత్యజించునో వానికే అది లభ్య మగును" అని కదా క్రైస్తుబోధ. మానవుడు పరి పూర్ణత్వమును సాధింప కోరినచో, వైరాగ్య మొక్కటియే మార్గ మని ఆయన ఎన్నియో సార్లు బోధించెను. మనస్సునకు ఈ సత్యము కాలపరిపాకమున గోచరింపగలదు. తన దీర్ఘభయానక స్వప్నమునుండి మనస్సు మేల్కొనును. పాప, ఆటవస్తువులను పాఱవైచి, తల్లిచెంతకు మరల పోగోరును. "ఉపభోగముచే కామము ఎన్నటికిని శమింపదు, నేతిచే అగ్ని రెచ్చినట్లు అది మఱియు హెచ్చును" అను సూక్తిలోని సత్యము దానికి గోచరించును. కామోపభోగములకు మాత్రమే కాదు,

ఇంద్రియభోగము లన్నిటికిని, వైజ్ఞానికభోగము లన్నిటికిని, మానసికభోగము లన్నిటికిని కూడ, ఇది అన్వయించును. అ వన్నియు తుచ్ఛములు, మాయావరణము లోనివి. అనగా మనకు అభేద్య మైన ఈ మాయాజాలము లోనివి. అనంతకాల పర్యంతము మనము దానిలో ఇటు నటు పరుగులిడుచుండినను, దానికి ముగింపు ఉండదు. ఒ కించుక సుఖము సంపాదించుకో గోరితి మేని, దుఃఖరాశి యొఱగి, మీద పడును. ఎంత ఘోరము! పర్యాలోచించి చూడ, "ఇ దంతయు మాయ" అను మాయావాద మొక్కటియే ఈ స్థితిగతులకు సరి యైన సమాధాన మని తోచును. ఈ ప్రపంచ మెంత దుఃఖపూరితము! లోక మంతయు తిరిగి చూచి నచో, తమతమ లోపములను ఒకజాతి ఒకవిధమునను, మ ఱొక జాతి మ ఱొక విధమునను, నివారణ మొనర్చుకొన జూచును. అనేకజాతు లొక్క-కీడునే వేర్వేఱువిధముల పోగొట్టజూచినవి. కాని ఏ జాతియు ప్రయత్నసిద్ధి నొంద లేదు. ఆ కీడు ఒక చోట తఱిగి నచో, మ ఱొక చోట అపారముగా పెరుగుచున్నది. ఇట్టిది దాని స్థితి. పాతివ్రత్యాదర్శమునకు ప్రాధాన్య మిచ్చి హిందువులు అతి బాల్యవివాహాచారమును నియమించిరి. కాలక్రమమున దానిచే జాతి దుర్బల మైపోయినది. సౌశీల్యము కాపాడబడినది నిజమే, కాని ఈ హానికూడ కలిగినది. ఈ రెంటిలో ఏది కోరుకొందురు? సౌశీల్యము కావలసినచో, స్త్రీపురుషులలో దౌర్బల్యము ప్రబలును. కాని, ఇచట మీ ఇంగ్లాండులో మీ స్థితిమాత్రము చక్కగా నున్నదా? లేదు. ఏల యన సౌశీల్యమే కదా జాతికి ప్రాణము. చారిత్రకదృష్టితో విచారించినచో, శీలభ్రంశమే జాతినాశమును సూచించు ప్రథమచిహ్న మని తెలియుచున్నది. ఆ చిహ్నము కనిపించునప్పుడు జాతినాశముకూడ కనిపించి నట్టే. అగుచో, ఈ విపత్తులోనుండి విముక్తిని పొందు టెట్లు? తలిదండ్రులు తమ బిడ్డలకు వధూవరుల నేర్పాటు చేసినచో, కొంత తగ్గ గలదు. హిందూబాలికలు హృదయోద్వేగములకు

లొంగి పోయి, పెద్దల హితోపదేశమును తిరస్కరించువారు కారు. కాని, వారి జీవితములు కవిభావకల్పితము లగు అలౌకికమార్గము లలో విహరింపక, గతానుగతికములై యుండును. ఇట్లు కాక జనులు తమ భార్యాభర్తలను తామే నిర్ణయించుకొన్నచో, ఆ వివాహము లంత సుఖప్రదము లగుట లేదు. హైందవస్త్రీసామాన్యము మిక్కిలి సుఖముగా జీవించుచుండును. భార్యాభర్తలకు కలహములు అంతగా నుండవు. యునైటెడ్ స్టేట్సులో వివాహనిర్ణయ విషయమున అపార మగు స్వాతంత్ర్యము కలదు. అచ్చట ఎన్నో గృహములును, ఎన్నో వివాహములును, వ్యథామయములు. ఈ వ్యథ, ఈ అసంతృప్తి, 'ఇందు కలదు, అందు లేదు' అనక సర్వత్ర నిరంకుశవిహారము చేయుచున్నది. దీని అర్థ మేమి? ఏ లక్ష్యమును అనుసరించినను, సుఖము అంతగా లభించుట లేదు. అందఱము సుఖముకొఱకే పరిశ్రమించుచున్నాము. కాని సుఖ మొక మార్గమున ప్రవేశించినచో, కష్టము మఱొక మార్గమున ప్రవేశించు చున్నది.

అట్లని ఉపకారకార్యములు చేయ నక్కఱ లేదా? చేయవలెను. వానియందు మునుపటికన్న ఎక్కువ అభిరుచికూడ చూపవలెను. అట్లైన, పై జ్ఞానము వలని ప్రయోజన మేమి అని అడుగుదురు. దానిచే మన మతదురభిమానతీవ్రతలు నశించును. అవి నశించినచో, ఆంగ్లేయుడు హైందవునిగూర్చి నిందావాక్యము లాడడు. ఇతరజాతుల ఆచారములను గౌరవముతో చూచును. స్వమతదురభిమానోన్మాదము (ఫెనటిసిసమ్) నశించుకొలది, అకృత్రిమకార్యాచరణ మధిక మగు చుండును. స్వమతదురభిమానోన్మత్తుల జవసత్త్వములలో చాల వంతు నిరర్థకముగా వ్యయ మగు చుండును కాన వారికి కార్యాచరణశక్తి అంతగా ఉండదు. భావోద్రేకములు లేక, ప్రశాంత నిష్పాక్షికబుద్ధి కలిగి, అసాధ్యమార్గముల పొంత పోక యుండు

వానికే కార్యాచరణసామర్థ్య ముండును. కావున పై జ్ఞానముచే కార్యసామర్థ్య మధిక మగును. యథార్థస్థితి నెఱుగుటచే సహన బుద్ధి అభివృద్ధి నొందును. దుర్మార్గులను, నిర్భాగ్యులను, చూచి నంతనే మతి చెడి వెఱ్ఱి పోకల పోకుందుము. ప్రపంచగతిని మనము మార్పజాల మనియు, దాని త్రోవనే అది నడుచుచుండు ననియు ఎఱుగుటచే, మనము తొందరపాటు మాని, తాలిమి వహింతుము. ఇందు కొక దృష్టాంతము. మనుష్యు లందఱును ఒక్కొక్కడిగా యోగ్యులైనచో, మృగము లన్నియు, ఆ లోపల మనుష్యులుగా పరిణమించి, అవియు యోగ్యస్థితి నంద వలసి యుండును. వృక్ష జాతులకుకూడ ఇదే పరిణామము కలుగ వలసి యుండును. కాని ఒక విషయముమాత్రము సత్యము. ఈ నిర్నిరోధ నదీప్రవాహము సముద్రాభిముఖమై, అత్యంత వేగముతో పర్వులిడు చున్నది. ఈ నదిలోని ప్రతిజలబిందువును కాలక్రమమున ఆ అపారపారావార ముతో నైక్య మొంద గలదు. అట్లే ఈ జీవితములో—ఆపదలు, వ్యథలు, సుఖములు, నవ్వులు, ఏడ్పులు, అన్నియు కూడి యుండు ఈ జీవితములో — ఒక్క విషయముమాత్రము నిస్సంశయము. సర్వవస్తువులు గమ్యముదెస దుముకుచున్నవి. ఎంతకాలము పట్టునో చెప్పజాలము కాని, మీరు, నేను, వృక్షజాతులు, మృగ జాతులు, జీవలేశము గల ప్రతినలుసుసహా, పరిపూర్ణము అను అనంతసాగరములో కూడియే తీఱ వలెను; ముక్తి నంద వలెను; భగవంతుని చేర వలెను.

వేదాంతమతప్రకారము ప్రపంచము కేవలము శుభము కాదు, కేవలము అశుభము కాదు. ఈ విషయము ఇప్పటికే తెలిపి యుంటిని. మనకు కలుగు శుభాశుభముల విలువ సమానమైన దని ఆ మతపు బోధ. మేలువిలువ యెక్కువ కాదు, కీడు విలువ తక్కువ కాదు. ప్రపంచధర్మము అట్టిది అని తెలిసి మనము ఓర్పుతో కార్యము లొనర్చుచుండవలెను ఎందు

కొఱకు? ఏల? ఈ స్థితిగతులలో గత్యంతర మేమి? అజ్ఞేయవాదులలో నేల చేర రాదు? ఈ కాలపు అజ్ఞేయవాదులుకూడ ఈ సమస్య పరిష్కరింప సాధ్యము కానిది—లేక, మా పరిభాషలో, ఈ మాయాజాలమును భేదించుట అసాధ్యము — అని ఎఱిగి, తృప్తి తెచ్చుకొని జీవితమున సుఖించుచుండు మందురు. ఈ బోధలో నొక ప్రమాదము—బొత్తిగా అసంగత మగు మహాప్రమాదము—కలదు. "జీవితము" అనగా ఏమి? ఇంద్రియజీవితమేనా? ఆ విషయమున మనకును మృగములకును అంతగా భేదము లేదు. కేవలము ఇంద్రియములందే జీవించువారు ఇచటి కెవ్వరును వచ్చియుండ లే దనియే నా నమ్మకము. అనగా, "జీవితము" అనునది అంత కన్న ఉన్నతక్షేత్రమునకు సంబంధించినది. మన హృదయ భావములు, మనోభావములు, ఆదర్శములు: ఇ వన్నియు మన జీవితములోని భాగములే. పరిపూర్ణత్వ మను మహోన్నతాదర్శమును సాధించుకొఱకు చేయు పోరాటము జీవితములో నొక అత్యంతప్రధానభాగము కాదా? దృశ్యప్రపంచజీవితమందే సుఖింపుడని అజ్ఞేయవాదుల బోధ. కాని జీవితశబ్దమునకు ముఖ్యార్థము ఆదర్శసాధనమే. పరిపూర్ణత్వముదెస సాగుటయే జీవితసారము. కావున మనము అజ్ఞేయవాదులమై దృశ్యప్రపంచముతోడనే తృప్తినంద జాలము. అజ్ఞేయవాదికి జీవిత మనగా ఆదర్శభాగము వినా తక్కిన దంతయు! 'ఆదర్శము నందుకొనుట అసాధ్యము. కావున దానికై చేయు అన్వేషణము పరిత్యజింప వలయును' అని అతని సుస్థిరాభిప్రాయము. ఈ ప్రకృతికే, ఈ ప్రపంచమునకే, మాయ అని పేరు. మతము లన్నియు మాయను తరించు ప్రయత్నము లనియే చెప్ప వచ్చును. ప్రాథమికదశలోనివి; పరిపక్వదశలోనివి; నిగూఢతాత్త్వికవాదమయములైనవి; పురాణరూపములైనవి; ప్రతిమల ప్రతీకముల మూలమున కాని, – దేవతల – రాక్షసుల – దేవదూతల – జ్ఞానసిద్ధుల – ఋషుల – మహాపురుషుల – మతప్రవక్తల కథలమూలమున కాని, బోధలొనర్చునట్టివి: ఈ అన్ని మతములకును

లక్ష్య మొక్కటే : ఈ ప్రకృతి కల్పించు నిరోధమును దాటుటే, ముక్తి సాధించుటే. తాను బద్ధుడై యున్నా డని, ఆ స్థితిని దాటిన కాని తన అభీష్టము తీర దని, ప్రతిమనుష్యునకును ఎట్లో తెలిసి పోవును. అ ట్లీల తోచునది అత డెఱిగియుండ వచ్చును, ఎఱుగ కుండ వచ్చును. కాని ప్రపంచజ్ఞానము కలుగునప్పుడే వానియం దీ భావము ఉదయించును. 'తాను బంధమునం దున్నాడు ; ఈ బంధమునుండి విడివడి యెచ్చటికో — ఈ శరీరమునకు అందని చోటికి — ఎగిరి పోవలెను అని తనలో గల ఏదో యొక శక్తి సంకల్పించుచున్నది ; ఈ బంధముచేత అది ఆగి యున్నది' : అను తలం పతనికి ఆ క్షణముననే ఉదయించును. అత్యంత ప్రాథమిక దశలో నున్న మతములలో కూడ—తమ మిత్రుల యిండ్ల యొద్ద తారాడుచు, గాఢమద్యమును, జంతుబలులను, అపేక్షించుచుండు క్రూరఘాతుకప్రేతపిశాచాదుల నారాధించు మతములలోకూడ — ఈ బంధవిమోచనేచ్ఛ కనిపించుచున్నది. దేవతల నారా ధించువానికి వారియందు కనిపించు ముఖ్యవిశేషము వారికి గల స్వేచ్ఛాధిక్యమే. వారి గమనమునకు గోడలు, మూసిన తలుపులు, అడ్డురాజాల వని వాని నమ్మకము. ఈ స్వేచ్ఛాధిక్యము క్రమ క్రమముగా అతిశయిల్లి, చివరకు ప్రకృతి (మాయా) బద్ధుడు కాని సగుణేశ్వరాదర్శముగా పరిణమించును. నా మనో నేత్రము నెదుట పూర్వదృశ్య మొకటి ఇప్పుడు జరిగినట్లు కనిపించు చున్నది : అరణ్యమధ్యములలోనుండిన పూర్వకాలపు ఋష్యా శ్రమములలో ఈ సమస్యయే చర్చింపబడుచున్నది. వయో వృద్ధులగు మహనీయులు సైతము దీనిని పరిష్కరింపజాలక పోరాడు చున్నారు. అప్పు డొక యాశ్రమములో నొక యువకుడా వృద్ధ తాపసుల మధ్యమున నిలిచి ఇట్లు పల్కుచున్నాడు : "అమృత పుత్రులారా, వినుడు. దివ్యధామ వాసులారా, వినుడు. నేను మార్గమును కనుగొంటిని. తమస్సున కవ్వల నుండు ఆ మహా పురుషు నెఱిగినచో, మనము మరణమును తరింపగలము."

ఈ మాయ సర్వత్ర కలదు. ఇది భయంకరము. కాని మనకు గత్యంతరము లేదు. దానినడుమ నిలిచియే మన ప్రయత్నములు సాగింపవలెను. ప్రపంచ మంతయు మంచి దైన పిదప కార్యారంభుడనై ఆనందానుభూతి నొందుదు నను వాడు అప్రయోజకుడు. గంగాతీరమున కూర్చుండి ఈ నీ రంతయు సముద్రములో చేరిన పిదప నదిని దాటుదు నను వాని వంటి వాడు. మన కర్తవ్యము మాయకు ఎదురీదుట కాని, దాని కనుకూలముగా ప్రవర్తించుట కాదు. మనము గ్రహింపవలసిన ముఖ్యవిషయ మిది : ప్రతోడ్పడుటకు కాదు మనము జన్మించినది, దానితో పోటిచేసి ఎదురొడ్డి పోరాడుటకు. ప్రకృతిపై అధికారము నెఱపుట మన ధర్మమైయుండగా, దానికి లొంగిపోవుచున్నాము. ఈ గృహ మెట్లు వచ్చినది ? ప్రకృతి కాదు దీనిని నిర్మించినది. అడవిలో నివసింపుమని ప్రకృతిబోధ. కాని మానవుడు ఆబోధను తిరస్కరించి, ఇల్లు కట్టుకొనెను. ఆదిమకాలమునుండియు మానవుడు ప్రకృతి నియమములను ప్రతిఘటించుచునే యున్నాడు. చివరకు మానవునిదే విజయము. ఆంతరంగిక లోకమునకూడ ఈ పోరాటమే జరుగుచున్నది : మానవుని ఉత్తమ (ఆధ్యాత్మిక) ప్రకృతికిని, వాని అధమ (పశు) ప్రకృతికిని ; జ్యోతిస్సు (జ్ఞానము) నకును తమస్సు (అజ్ఞానము) నకును. ఇచటకూడ మానవునికే గెలుపు. అతడు ప్రకృతిని ఖండించి త్రోవచేసికొని ముక్తిపదమును చేరుననవచ్చును. దీనినిబట్టి వేదాంతమతసిద్ధాంత మొకటి మనకు ఎఱుకపడుచున్నది. ఈ మాయను దాటినపిదప మాయాతీతస్థితి యొకటి కలదు. ఆ స్థితి నొందగలిగితిమేని, మాయ మనలను బంధింపజాలదు. ఇంచుమించుగా అన్ని మతములందును ఈ ఆశయ మేదోయొకరూపమున గోచరించుచునే యున్నది. కాని వేదాంత మతప్రకార మిది బ్రహ్మవిద్యలోనికి ప్రవేశము మాత్రమే. దానిలో పరిపూర్ణత కాదు. సాకారబ్రహ్మము, సృష్టికర్త, జగదీశ్వరుడు, ప్రకృతి(=మాయా)నియామకుడు : అను ఆశయము

ఈ వేదాంతమత పరమావధికి సంబంధించినది కాదు. మొదటి మెట్టువంటిది. ఇది క్రమక్రమముగా పరిపాకమంది, తన వెలుపల నిలిచియుండెనని మొదట తోచినవాడు తానే అనియు, వాస్తవముగా తనలోపలనే కలడనియు, వేదాంతి చివరకు గ్రహించును. అతడు నిత్యముక్తుడు. కాని ఉపాధిగతుడై బద్ధుడనని భావించుచుండెను.



# మాయ, ఈశ్వరభావపరిణామము

(తే 20-10-1896 దినాడు లండనులో ఉపన్యస్తము)

అద్వైతవేదాంతమునకు మూలాధారప్రాయములగు సిద్ధాంతములలో నొకటియై కనిపించు మాయ అంకురరూపమున సంహితలలోనే కలదనియు, ఉపనిషత్తులలో విస్తరిల్లి పరిణతరూపమున కనిపించు భావము లెల్ల, ఏదోయొక రూపమున సంహితలందే కనిపించుచున్నవనియు, మన కిప్పటికే తెలియును. 'మాయ' అనునది మీలో ననేకుల కిప్పటికే పరిచితమైయున్నది. భ్రాంతి అను అపార్థమున మాయాశబ్దము తఱుచు వాడుదురనియు, "ఈ ప్రపంచము మాయ" అనునప్పుడుకూడ "భ్రాంతి జనితము" అనియే అర్థము చెప్పవలసివచ్చుచున్నదనియు, మీ రెఱిగియున్నారు. ఈ అనువాదము అసంతృప్తికరమేకాక, తప్పు కూడ. మాయ అనున దొక వాదము కాదు. ప్రపంచధర్మమును ఉన్నది ఉన్నట్టు తెలుపు మాట అది. సంహితలలో అంకురరూపమున కనిపించు ఆ శబ్దార్థమును మొదట పరిశీలించినచో, దానిని గ్రహించుట సాధ్యమగును. "దేవతలు" అను భావము ఎట్లు ఉత్పత్తిల్లినది మన మిప్పటికే చూచియున్నాము. మొదట వారు బలిష్ఠులగు పురుషులే అనియు, వారియం దంతకన్న ఆధిక్యమేమియు లేదనియు, కూడ ఎఱుగుదుము. గ్రీకుల—యూదుల—పారసీకుల—ఇతరుల—పురాతనమతగ్రంథములలో కానవచ్చు దేవతాకృత్యములు కొన్ని ఘోరాతిఘోరములై మీలో కొందఱికి దుర్భరములుగా తోచును. కాని మన మీ 19-వ శతాబ్దము వారమనియు, ఆ దేవతలు ఎన్నో వేలయేండ్లనాటివారనియు, చదువునప్పుడు మఱతుము. వారి నర్చించుచుండిన జనులుకూడ అట్టిచర్యల కలవాటుపడినవారే అగుటచే, వారి కా దేవతల

కృత్యములు అసాధారణములుగగాని, భయానకములుగగాని, తోచియుండవు అన్న విషయముకూడ మఱతుము. మన జీవిత కాలమం దంతయు నేర్చుకొనుచుండవలసిన ముఖ్యమగు పాఠమిది : ఇతరుల గుణాగుణవిమర్శ చేయునప్పుడు మన ఆదర్శములనే ప్రమాణముగా కైకొనుట సరికాదు. ఎవని చర్యలను వాని ఆదర్శములప్రకారము విచారింపవలెనుగాని, ఇతరుల ఆదర్శముల ప్రకారము కాదు. లోకులతో వ్యవహరించునప్పు డెల్ల మన మీ మహాప్రమాదమునకు లోనగుచున్నాము. మన దేవతలను ప్రమాణముగా గొని ఇతరుల దేవతలను, మన ఆదర్శములను ప్రమాణముగా గొని ఇతరుల ఆదర్శములను, మన ఉద్దేశములను బట్టి ఇతరుల ఉద్దేశములను, విమర్శించు దురభ్యాసమే మన కలహములలో అనేకములకు మూలకారణమని నా దృఢ విశ్వాసము. నేను చేసిన పనినే మఱియొకడుకూడ చేసినచో, నన్ను పురికొల్పిన ఉద్దేశమే వానినికూడ పురికొల్పెనని నేను తలంతును. ఒక్క కార్యమే వివిధకారణములవలన సంభవింపవచ్చు ననుసత్యమును మఱచుటే ఈ మహాప్రమాదమునకు మూలము. వాని ఉద్దేశము నా ఉద్దేశమునకంటె కేవలము భిన్నమేమో! కావున ఈ పురాతన మతములనుగూర్చి విచారించునప్పుడు ఆ కాలపు తలంపులు, ఆ కాలపు జీవితవిధానము, మనము జ్ఞప్తియం దుంచుకోవలెను. మన ఇప్పటి దృక్పథమును మఱచి ఆ కాలపు దృక్పథము నవలంబింపవలెను.

బైబిలు ప్రాతనిబంధనలో వర్ణింపబడిన జిహోవాచర్యల లోని క్రౌర్యము, నిర్దాక్షిణ్యత్వము చూచి ఎందఱో ఆశ్చర్యచకితు లగుదురు. కాని, ఏల? భగవంతునిగూర్చి మన మిప్పుడు కల్పించుకొన్న భావములే ఆ ప్రాచీనకాలపు యూదుల జిహోవా యందుకూడ ఉండవలె ననుటకు వీరికేమి అధికారము? మన మింకొకవిషయముకూడ జ్ఞప్తిలో పెట్టుకోవలెను. మతమును దేవుని గూర్చిన ప్రాచీనకాలపువారి యాశయములు మన కిప్పుడు

ఎట్లు పరిహాసనీయములుగా తోచుచున్నవో, అట్లే వానిని గూర్చిన మన ఆశయములును భవిష్యత్కాలమువారికి పరిహాసనీయములుగా తోపగలవు. కాని ఇట్లు మార్పులొందు భావముల నన్నిటిని పరిశీలించినచో, వాని నన్నిటి నొకటిగా చేర్చు సువర్ణసూత్రమువంటి ఐక్యబంధ మొకటి కనిపించును. ఈ సూత్రమును కనుగొనుటయే వేదాంతలక్ష్యము. ''ఈ వివిధాశయము లన్నియు ముత్యములు. వీని యన్నిటిలో దూఱియుండు దారమును నేను'' అని శ్రీకృష్ణభగవానుడు చెప్పియున్నాడు. ఆధునికాభిప్రాయములనుబట్టి విచారించువారికి ఆయాశయము లెంత అసంబద్ధములుగా, ఎంత దుస్సహములుగా ఉన్నను, వాని నన్నిటి నొకటిగా కూర్చు దారమును కనుగొనుటే వేదాంత మొనర్పవలసిన కార్యము. ఆ పూర్వకాలపు మానసికవాతావరణములో ఆ ఆశయములే తృప్తికరములై పొందికకలిగి ఉండినవి. ఆ వాతావరణమునుండి ఊడబెఱికి ఇప్పటి వాతావరణమున బెట్టి పరీక్షించినప్పుడే అవి వికృతముగా కనిపించునది. ఆ కాలపు యూదు డిప్పుడు సూక్ష్మబుద్ధియై, ఆధునికమార్గము లవలంబించి ధనార్జనపరుడైనట్లే, పూర్వకాలపు ఆర్యు డిప్పుడు హైందవుడై, ప్రాజ్ఞతకు పేరుగాంచినట్లే, మునుపటి జిహోవాయును, మునుపటి దేవతలును, ఇప్పుడు పరిణామమునొందిరి. అర్చించువారిలోని పరిణామమును గుర్తించి, అర్చితునిలోని పరిణామమును గుర్తింపకుండుట మిక్కిలి పొరపాటు. మన మెట్లు భావముల స్వరూపములమో, అట్లే దేవతలుకూడ భావస్వరూపులే. ఆ భావము లెట్లు పెరిగెనో, ఈ భావములుకూడ అట్లే పెరిగెను. దేవుడు పెరుగు ననుమాట మీకు కొంత వింతగా తోపవచ్చును. ఎట్లు పెరుగగలడు? ఆయనలో మార్పు లుండవుగదా! ఇది ఒక యర్థమున నిజమే కాని, ఆ యర్థమున మానవుడుకూడ పెరుగడు. భగవంతునిగూర్చి మానవుని భావములు సర్వదా మాఱుచున్నవి; సర్వదా విశాలము

లగుచున్నవి. ఇంద్రియగోచరములగు మానవ స్వరూపముల కన్నిటికి మూలమగు పారమార్థికమానవుడు అచలుడు, అవికారుడు, పరిశుద్ధుడు, నిత్యపరిపూర్ణుడు అని మున్ముందు తెలియగలరు. అట్లే భగవంతునిగూర్చి మనకుగల తలంపుకూడ మనము సృష్టించుకొన్నదే. మన భగవంతుడు ఆ భావమునకు మూర్తీభావమే. ఆ భావమునకు ఆధారభూతుడగు పారమార్థికభగవంతుడు నిత్యశుద్ధుడు, నిర్వికారుడు. కాని ప్రత్యక్షభగవంతు డెప్పుడును మాఱుచు, వెనుకనుండు సత్యమును (పారమార్థిక భగవంతుని) క్రమాధికముగా వెలిపఱచుచుండును. సత్యము నెక్కువ వెలిపఱచుటకు "పురోగతి" (ప్రాగ్రెషన్) అనియు, ఎక్కువ మఱుగుపఱచుటకు "ప్రతీపగతి" (రిట్రాగ్రెషన్) అనియు పేళ్లు. అనగా మనము పెరుగుకొలది దేవతలుకూడ పెరుగుచుందురు. సామాన్యదృక్పథమునుండి మాటాడుచో మనము పరిణామ మొందుకొలది మనయథార్థత ఎట్లు బయలుపడుచుండునో, అట్లే దేవతలు పరిణామ మొందుకొలది వారి యథార్థతగూడ బయలుపడుచుండును.

మన మిప్పుడు మాయావాదమును గ్రహింపగలుగుదుము. లోకములోగల సర్వమతములను విచారించు వారికి స్ఫురించు ప్రశ్న ఇది: లోకములో సామరస్యము లేకుండుటకు కారణ మేమి? ఈ దుఃస్థితి ఎట్లేర్పడినది? మతభావోత్పత్తియైన ప్రాచీనకాలమున ఈ సమస్యలు లేవు. ఆదిమకాల మానవునికి లోకమున అసంబద్ధత యేమియు తోపలేదు. తన చుట్టుపట్లయందలి స్థితిగతు లతనికి ప్రతికూలములు కావు. అభిప్రాయభేదబాధ లేదు. మంచిచెడ్డలు భిన్నములనికూడ తోపలేదు. హృదయమున నొకప్పుడు సమ్మతికి సూచన, ఒకప్పుడు అసమ్మతికి సూచన స్ఫురించుచుండెను. తాత్కాలిక హృదయప్రేరణలనుబట్టి ప్రవర్తించువాడు అప్పటి కెట్లు తోచునో అట్లు ప్రవర్తించును. దేహశక్తిని వినియోగించి,

తోచిన పనిని చేయును. కార్యాకార్యవిచారణ లేదు. హృదయ ప్రేరణలను నిరోధించు ప్రయత్నమే చేయడు. ఆదిమకాల దేవతలును అట్టివారే. వారి ప్రవర్తనలకును తాత్కాలిక హృదయప్రేరణలే కారణము. ఇంద్రుడు వచ్చి రాక్షసబలమును ఛిన్నాభిన్నము చేయును. జిహోవా కొకనియెడ అనుగ్రహము, మఱియొకనియెడ ఆగ్రహము. అందుకు కారణ మెవ్వరును ఎఱుగరు. ఎవ్వరును విచారింపరు. విమర్శించు ఆచారమే అప్పటికి ప్రారంభము కాలేదు. అత డేమిచేసినను అది సరియే. మంచి చెడ్డలు అను భావమే లేదు. మన కిప్పుడు దుష్కార్యములుగా తోచువానిని దేవత లెన్నియో చేసిరి. ఇంద్రాదు లెన్నియో సార్లు ఘోరములగు దుష్కార్యము లొనర్చిరి. కాని ఇంద్రు నారాధించువారి కవి దుష్కార్యము లను భావమే స్ఫురింపలేదు. అందుచే వా రతనిని ప్రశ్నింపలేదు.

నైతికాశయము లభివృద్ధి నొందుకొలది సంఘర్షణము ప్రారంభమయ్యెను. మానవబుద్ధిలో నొక క్రొత్త ఎఱుక కని పించెను. దానికి ఒక్కొక్క భాషలో, ఒక్కొక్క జాతిలో, ఒక్కొక్క పేరు. అది ఈశ్వరవాణి కావచ్చును, పూర్వవిద్యా ఫలము కావచ్చును, మఱేదైనను కావచ్చును. కాని దానిలోగల విశేష మేమనగా, అది మానవనైజములగు హృదయప్రేరణ లను నిరోధించు ప్రభావము గలది. ''చేయుము'' అను హృదయ ప్రేరణ కలిగినవెంటనే ''చేయవలదు'' అను శబ్ద మొకటి విన వచ్చును. ఇంద్రియములద్వారా బాహ్యప్రపంచములోని కేగి రమింపుమని మనస్సు నెప్పుడును ప్రేరించు భావపుంజము వెను వెంటనే ''వలదు'' అని బోధించు భావపుంజముకూడ ఒకటి కలదు. ఈ రెండవది మిక్కిలి నీరసమై, హీనస్వరముకలిగి యుండును. కాని దాని ఉనికి నిస్సంశయము. ఈ రెండుప్రేరణ లను తెలుపు చక్కని సంస్కృతశబ్దములు రెండు కలవు. అవి ప్రవృత్తి, నివృత్తి : ముందుకు నిగుడుట, వెనుకకు ముడుగుట,

ప్రాయికముగా మనకార్యముల కీప్రవృత్తియే కారణము. ''వలదు'' అని బోధించు నివృత్తితో ఆధ్యాత్మిక జీవనము (రిలిజను) ఆరంభ మవుచున్నది. పారమార్థికపరత ఆరంభమగుచున్నది. అది లేని వానికి ఆత్మాన్వేషణము ప్రారంభముకాలేదు. యుద్ధనిమగ్నులగు దేవత లొకప్రక్క అర్చింపబడుచునే ఉండిరి. కాని మఱొకప్రక్క ఈ నివృత్తిపరత ప్రవేశించి మానవుల ఆశయముల పెంపొందింప సాగెను.

మానవహృదయములందు 'ప్రేమ' స్వల్పముగా అంకురించెను. అది అత్యంతస్వల్పము. ఇప్పటికిని, అది అంతగా అభివృద్ధి పొందలేదు. మొదట దాని కొక తెగలోపలనే ప్రచారము. ఆ తెగకు చేరినవారి అందఱియెడ నది వర్తించుచుండి యుండును. ఏయే తెగయెడ ఆయా తెగదేవుడు ప్రేమకలిగి దానిని సంరక్షించుచుండెను. కొన్నిజాతులలో ఒక్కొక్క వర్గమువారు ఇప్పుడును తామొక మూలపురుషుని వంశములోనివారమని చెప్పుకొనునట్లే, ఆ కాలములో కొన్ని తెగలవారు తాము తమ దేవుని సంతతివారమని చెప్పుకొనుచుండిరి. అట్టివారును, సూర్యచంద్రాదుల సంతతి వారమని చెప్పుకొనువారును, ఇప్పుడుకూడ కలరు. సూర్యచంద్రవంశచక్రవర్తుల బలపరాక్రమము లనేక ప్రాచీనసంస్కృతగ్రంథములలో వర్ణింపబడి యున్నవి. ప్రథమమున వారు సూర్యచంద్రాదుల నర్చించుచుండి, కాలక్రమమున వారి సంతతివారమని తలచుకోసాగిరి. సంఘమున ఈ భావము లభివృద్ధి నొందుకొలది ప్రేమయు, ఒండొరులయెడ బాధ్యతయు, సాంఘికవ్యవస్థయు: ఇవన్నియు అంకురప్రాయములుగా ఉప్పతిల్లినవి. సహనము, ఆత్మనిగ్రహము, లేనిది సాంఘికజీవనము చేయుటెట్లు అను ప్రశ్న అంతట బయలుదేఱెను. అప్పుడప్పుడు తమ హృదయప్రేరణలను అరికట్టక, తాలిమి వహింపక, భావోద్రేకానుసారమగు ప్రవర్తనను నిగ్రహింపక పోయినచో, ఇరువురెట్లొకటిగా కలిసి జీవింపగలరు? నిగ్రహించుకోవలెనను తలం

పున కిదియే మూలము. సాంఘికజీవనమంతయు ఈ నిగ్రహము మీదనే ఆధారపడియున్నది. ఈ సహననిగ్రహములను నేర్వనివారి జీవితములు దుర్భర క్లేశమయములుగానుండునని మనమెఱుగుదుము.

ఈ పారమార్థిక భావము లుదయించుటతోడనే మానవబుద్ధి కింకను ఉన్నతము, ఇంకను నైతికము, అగు మఱేదో ఒకటి స్ఫురించెను. హద్దుపద్దులు లేక, పోరాటముల కలవడి, మద్య మాంసములకు దాసులై, గాఢమద్యమందలి, వేపుడు మాంసమందలి వాసనలచేగాని సంతృప్తి నొందక, యుండిన తొల్లిటి దేవత లిప్పుడు వెగటుగా తోచిరి. ఇంద్రు డొక్కొకసారి తప్ప త్రాగి నేలపై బడి అపస్మారప్రలాపము లాడుచుండును. ఇట్టి దేవతలయెడ నసహ్యత ఉదయించెను. కార్యమూలములగు ఉద్దేశములు విచారించుట ప్రారంభ మైనది. ఈ విచారణకు దేవతలు కూడ గుఱియైరి. వారి చర్యలకు తగు సమాధాన మేమియు లభింపలేదు. అందుచే ఆ గుణములు గల దేవతలు పరిత్యజింపబడిరి. అనగా, దేవతలను గూర్చిన ఆశయములు ఉన్నతములైనవి. తొల్లిటి దేవతల సర్వ గుణములను, సర్వచర్యలను, పరిశీలించి, తమకు అసంగతము లుగా తోచినవానిని పరిత్యజించి, నిరాక్షేపములుగా తోచినవాని నుంచి, వానినన్నిటిని చేర్చి, దేవదేవుడు అను ఒక్క దేవుని కల్పించుకొనిరి. ఈ దేవుడు కేవలశక్తిమంతుడు మాత్రమే కాదు. అంతకన్న ఆధిక్య మవసర మయ్యెను. అతడు నీతిప్రధానుడు. మానవులన్న అతనికి ప్రేమ. వారి కతడు ఉపకారి. కాని దేవుని దేవత్వము మాత్రము నిలిచియే యుండెను. నైతికముగా అతని నిప్పుడు ఉన్నతు నొనర్చిరి. అతని శక్తిని కూడ అధిక పఱచిరి. లోకములో అంతకన్న నీతిపరిపూర్ణుడు లేడు. అతడు సర్వశక్తి.

కాని ఈ అందతుకులపని వలన కార్యసిద్ధి కాలేదు. విస్తరణ మధికమగుకొలది, పరిష్కరింపవలసిన సమస్యకూడ

గాఢము కాజొచ్చెను. దేవుని గుణాధికత పదింతలైనచో, వానినిగూర్చిన సంశయములు వేయింతలయ్యెను. ఈ సర్వేశ్వరుని బాధ్యతతో పోల్చిచూచిన, జిహోవా బాధ్యత కొద్దిపాటిది. ఈ చిక్కు ఇప్పటికిని కలదు. ప్రేమపరిపూర్ణుడును, శక్తిపరిపూర్ణుడును, అగు సర్వేశ్వరుని పరిపాలనములో ప్రపంచమున ఘోర సంఘటనము లేల నిలిచియున్నవి? సుఖమునకన్న దుఃఖ మింత అధికముగా ఉండుటకు కారణమేమి? మేలుకన్న కీడు ఇంత ఎక్కువగా ఏల యున్నది? ఈ ప్రశ్న లన్నియు మఱపున బెట్టినను, ప్రపంచము ఘోరహింసామయము అను సత్యమును మఱచు టెట్లు? "ఇదిగో పసుపు, ఇదిగో ముసుకు" అని ఆసలు కల్పించి, నేలపాలుచేయు ఘోరనరక మిది. మన హృదయ ప్రేరణ లత్యంత బలిష్ఠములు. ఇంద్రియభోగవాంఛ లంతకన్న బలిష్ఠములు. కాని ఆ వాంఛలు తీర్చుకొను శక్తి మనకు లేదు. మన బుద్ధి యెంత నిరోధించినను నిలువక, హృదయప్రేరణ మహా కల్లోలము మనలను ముందుకు నెట్టుకొనిపోవును. కాని ఒక్క యడుగు వైచినతోడనే దెబ్బపడును. ఈ లోకమున నిట్లు జీవించుచుండుటే మన విధి. ఇంద్రియభావాదర్శముల కేమాత్రము అందుపాటులో లేని మహోన్నతాదర్శములు మన బుద్ధికి గోచరించును. కాని వానిని కార్యరూప మొందజేయుట మన కశక్యము. మన చుట్టు గల సామాన్యజనసముద్రము మనల నణచివేయును. అట్లని ఆదర్శసాధన యత్నము లే మానుకొని ఈ లోకములో నెట్లో కాలముగడపుకొన్నచో, నేను మృగప్రాయుడనై, మనుష్యనామమున కనర్హుడ నగుదును. ఈ రెంటిలో ఏమార్గ మవలంబించినను సుఖము లభింపదు. పుట్టినవారు పుట్టినట్లే సామాన్యజీవితముతో తృప్తినొంది యుండువారికి క్లేశమే ప్రాప్తి. అట్లుకాక, పశుప్రాయజీవితము నొల్లక, సాహసించి, ఉన్నతాదర్శసాధనోద్యుక్తు లగువారికి అంతకన్న వేయిరెట్లధికమగు క్లేశమే లభించును. ఇదియే ఉన్న స్థితి. దీనికి కారణ మేమి

అను ప్రశ్నకు సమాధానము లేదు. సమాధాన ముండుటే అసంభవము. కాని, ఈ చిక్కులోనుండి తప్పించుకొను మార్గమును వేదాంతము చూపుచున్నది. నేను చెప్పవలసిన విషయములందు కొన్ని మీకు వెలుపు కలిగింపవచ్చును. కాని మీరు వానిని జ్ఞప్తి యుంచుకొని, ఆలోచించి, మనస్సుల కెక్కించుకొంటిరేని, ఆ సాత్తుమీాదై మిమ్ము నున్నత క్షేత్రమునకు కొనిపోయి, సత్యమును గ్రహించుటకు, సత్యమున జీవించుటకు, సమర్థత నిచ్చును.

'లేనిపోని ఆసలు కల్పించుచు, వానిని కూలద్రోయుచు, ఉండు ఘోరనరకమే ఈ ప్రపంచము' అనుటలో అతిశయోక్తి ఏమియు లేదు. దీనినిగూర్చి మన కేమియు తెలియదు. కాని తెలియ దనుటకుకూడ వీలు లేదు. ఈ గొలుసునుగూర్చి నా కేమియు తెలియనప్పుడు అది కలదని నే నెట్లు చెప్పగలను? ఉన్నట్లు కానిపించుట భ్రాంతి యేమో! కల గాంచుచున్నా నేమో! మీా యెదుట మాటాడు చున్నా ననుటయు, మీరు విను చున్నా రనుటయు, కల యేమో! కల కాదని ఎవ్వరును నిరూపింపజాలరు. నా బుద్ధియే కలలోని వస్తువేమో! ఎవ్వరును తమ బుద్ధిని చూచి యెఱుగరుగదా! అది ఉన్న దనిచెప్పువా రందఱికిని ఊహయే ప్రమాణము. సర్వవిషయములనుగూర్చియు ఇదియే స్థితి. నా శరీరము కలదనుటయు ఊహయే. కాని దాని ఉనికిని నే నెఱుగనని చెప్పజాలను. ఈ జ్ఞానాజ్ఞానముల నడిమి అవస్థ: రాత్రియు పగలును కాని దురవగాహమగు ఈ సంజవెలుగు ఈ సత్యాసత్యముల కలయిక — వీని కూడలి యెక్కడనైనది ఎవ్వరును ఎఱుగరు. కలలో నడచుట వంటిది మన జీవితము: సగము నిద్ర, సగము మెలకువ. మంచుతెరవంటి దేదో చూపు నడ్డగించుచుండును. ఇదియే మన అందఱి గతి. ఇంద్రియ గోచర జ్ఞాన మంతటి గతియు ఇదియే. తత్త్వజ్ఞాన గతియు, భౌతిక శాస్త్ర జ్ఞాన గతియు, ఇంతేల — మానవ జ్ఞానమంతటి గతియు, ఇదియే. వీనినిగూర్చి ఎన్ని ప్రగ

ల్పములాడినను, నిజము మాత్ర మిదియే. జగత్తు లక్ష
ణమే ఇది.

భౌతికపదార్థమనుడు, ఆత్మఅనుడు, మనస్సుఅనుడు, మఱే
మైననుడు, ప్రతివస్తువునుగూర్చిన సత్య మిదియే. అవి కలవని
చెప్పజాలము; లేవనియు చెప్పజాలము. అవి ఏకము అనజాలము,
అనేకము అనజాలము. వెలుగుచీకటుల కలయిక—ఒక మార్గము
ననుసరింపక, స్పష్టముగా ఎఱుగుటకు సాధ్యముకాక, వేఱు
చేయుట కలవికాక — ఇం దెప్పుడును నిత్యకేళీవిహారము సల్పు
చుండును. నిజము, కాని నిజముకాదు; మెలకువ, కాని నిద్రకూడ.
ఇదంతయు లోకపు యథాతథస్థితి. దీనికే మాయ అని
పేరు. మన మీ మాయలో జన్మింతుము, ఈ మాయలో
జీవింతుము, ఈ మాయలో తలంతుము, ఈ మాయలో కలలు
గందుము. దీనిలోనే మనము తత్త్వజ్ఞులము, దీనిలోనే సాధుపురు
షులము, దీనిలోనే పిశాచములము, దీనిలోనే దేవతలము.
మీ ఆశయము లెంత విశాలముగనైన వ్యాపింపనిండు, ఎంత
ఉన్నతికైన ఎగురనిండు, అనంతస్థితిని అందినవనుడు, లేక మీ
ఇచ్చవచ్చిన పేరింకేదైన పెట్టుకొనుడు : ఈ ప్రచార మంతయు
మాయావరణములోపలనే. దీనిని మార్చుట అసాధ్యము. మానవ
జ్ఞాన మంతయు ఈమాయావిస్తరణమే — అది గోచరించు తెఱగున
దానిని గ్రహించుటకై చేయుప్రయత్నమే. ఇదంతయు నామ
రూపముల కార్యము. రూపముగల ప్రతివస్తువు : మీ మనస్సులో
నొక భావమును నిర్మించున దంతయు : మాయలోనిదే. దేశకాల
నిమిత్తములకు లోబడిన దంతయు మాయలోనిదే కదా!

భగవంతునిగూర్చి ప్రాచీనకాలమున నుండిన యాశయములకు
మరలవత్తము. అవి ఏమయ్యెను? శాశ్వతప్రేమమయుడు—స్వార్థరహి
తుడు, సర్వశక్తిసంపన్నుడు—అగు పురుషు డొకడు లోకమును పరిపా
లించుచున్నాడను విషయముకూడ కొంతకాలమునకు సంశయ

గ్రస్త మయ్యెను. ధర్మమూర్తియు, ప్రేమమూర్తియు, అగు భగవంతు డుండుట నిజమైనచో, తన సంతానమగు జీవకోట్లు— మానవులు, ఇతరప్రాణులు — కోటానుకోట్లు మరణించుచుండుట అతనికి కనబడదా, అని తత్త్వజ్ఞుడు ప్రశ్నించెను. లెక్కలేని యితరప్రాణులను హింసింపక, ఈ లోకమున నొక్క ప్రాణియైన క్షణకాలము జీవించుట సాధ్యమా? వేలకొలది సూక్ష్మజీవులను నశింపజేయక మీ రొక్కసారియైన ఊపిరి పీల్వగలరా? కోట్లకొలది జీవముల నాశమే మీ జీవనమున కాధారము. మీ జీవితములోని ప్రతిక్షణమును, మీ ఊర్పులలో ఒక్కొక్కటియు, వేలకొలది జీవులకు మరణము! మీరు కదలినను మెదలినను, కోట్లకొలది జీవములు నశించుచున్నవి. మీరు తిను ప్రతి కబళముతోను, కోట్లకొలది జీవములను చంపుచున్నారు. అవి ఏల చావవలెను? అవి క్షుద్రజీవులుగదా అను వెఱ్ఱివాద మొకటి వాడుకకెక్కినది. కాని అది నిజమేనా? మానవు డధికమో, చీమ అధికమో ఎవరికి తెలియును? ఇందులోని సత్యాసత్యముల నెవరు నిరూపింపగలరు? ఈ ప్రశ్నను అటు ఉంచి, అవి అతిక్షుద్ర జీవులని ఒప్పుకొన్నను, అవి యేల చావవలెను? క్షుద్రము లైన కొలది అవి జీవించుట మఱియు ముఖ్యమగును గదా! వాని జీవనము ఇంద్రియములలోనే అగుటచే వాని కష్టసుఖానుభూతులు మనవానికన్న వేయిరెట్లధికము. కడుపునిండించుకొనుటలో కుక్కలకు, తోడేళ్లకు, ఉండు హర్షపారవశ్యము మనకు ఉండునా? మనశక్తికి ముఖ్య విహారభూములు బుద్ధియు ఆత్మయు నెట్లో, అట్లే వాని శక్తికి విహారభూములు ఇంద్రియములు. వానికి ఇంద్రియములే సర్వస్వము. అందు వానికి సివ మెత్తిపోవును. మానవజాతి యెన్నడు నెఱుగని మహాసంతుష్టి నవి అం దనుభవించును. అట్లే వానికి అందు కలుగు బాధకూడ అపారము. సంతుష్టి ఎంత అధికమో, బాధకూడ అంత అధికము. మృగముల సుఖానుభూతి మనదానికన్న అంత అధికమైనచో, వాని వ్యథానుభూతికూడ

అంత యధికముగా నుండునని ఏర్పడుచున్నది. ఎన్నిరెట్లో అధిక మనికూడ చెప్పవచ్చును. అనగా, మనుష్యుని మరణ యాతనకన్న ఇతరప్రాణుల మరణయాతన వేయిరెట్లధికము. కాని, మనము వానిని వధింతుము. పాపము, వాని కింత తీవ్ర వేదన కలిగించుచున్నామే అని ఏ మాత్రము చింతింపము. ఇది మాయ. మానవుని బోలు సగుణదైవ మొకడు కల డనియు, అతడే ఈప్రపంచము నంతయు నిర్మించె ననియు, తలచుచో, కీడులోనుండి మేలు కలుగునను వాదము అంగీకరింప బడదు. వేనవేలు మేళ్లు రానిమ్ము. కాని అవి కీడులో నుండి ఏలరావలెను? అది అంగీకరించితిమేని, నా పంచేంద్రియ సుఖముకై నేను ఇతరుల గొంతులు కోయవచ్చును గదా! కీడులో నుండి మేలు ఏల రావలె నను ప్రశ్నకు సమాధానము లేదు. సమాధానము చెప్పుట అసాధ్యమని హిందూతత్త్వశాస్త్రములు అంగీకరించినవి.

వేదాంతమతమువలె నిరంకుశధైర్యసాహసములతో సత్యాన్వేషణ మొనర్చిన మత మింకేదియు కానరాదు. దాని గమనము నేదియు నిరోధింపలేదు. సత్యము పలుకగోరువారి నెల్ల అణచివేయ జూచు మతాచార్యవర్గము లేకపోవుట ఆ అన్వేషణమున కెంతయు సహకరించెను. మా దేశములో మతప్రచారకుల కెప్పుడును పరిపూర్ణస్వాతంత్ర్యము కలదు. అచట పూర్వాచారముల అధికారమంతయు సాంఘికజీవనముమీదనే. మీ పాశ్చాత్య దేశమున సాంఘికస్వాతంత్ర్యమునకు మేరలేదు. సాంఘికాచారవిషయమున హిందూదేశములో కఠినమగు కట్టడ కలదు. కాని మతాభిప్రాయాల విషయమున ఎట్టి అడ్డంకులును లేవు. ఇంగ్లాండులో ఎవరే బట్టలు తొడుగుకొన్నను, ఎవరేమి తిన్నను, అడుగువారు లేరు. కాని గుడికి పోవుట తప్పనిండు, వెంటనే అతడు ప్రజానిందపాలగును. మీరు మతవిషయమున సాంఘికాచారమును పాటించి, దాని ననువర్తింపవలెను. ఆపిదప

దాని సత్యమునుగూర్చి మీ యిచ్ఛవచ్చినట్లు విచారించుకొన వచ్చును. హిందూదేశమున నెవ్వడైన మఱియొక కులమువాని యింట భోజనము చేసినచో, సంఘ మంతయు వానిపై బడి వాని నణచివేయును. వస్త్రధారణవిషయమునకూడ, తన పూర్వికుల రీతి ననుసరింపనివాని గతి కూడనట్లే. మొదటి రైలుబండిని చూచుటకై గ్రామాంతరము వెళ్లినవా డొకడు వెలివేయబడెనట! మతవిషయమున మాత్ర మెట్టి నిర్బంధమును లేదు. నాస్తికులు, అనాత్మవాదులు (మెటీరియలిస్ట్సు) బౌద్ధులు, ప్రక్క-ప్రక్కనే నివసింతురు. వివిధమతములవారు, వివిధాశయములవారు, క్రొత్త క్రొత్తలగు త్రోవలు బట్టు ఊహలు—అభావ్యములైనవికూడ— కలవారును, ఇరుగు పొరుగులనుందురు. అన్ని మతముల ప్రచారకులును తమతమ మతములను బోధించి, అనుచరులను సంపాదించుకొనుచుందురు. దేవాలయద్వారముల చెంతనే అనాత్మవాదులు నిలుచుండి తమయభిప్రాయములు వెల్లడించుచుందురు. ఎవ్వరును వారి తెరువుపోరు.

బుద్ధుడు మిక్కిలి వృద్ధుడై మృతినొందెను. ఆయన జీవితమును ఆసక్తితో చదువు నా మిత్రు డొక అమెరికాదేశస్థుడు, భౌతికశాస్త్రవేత్త కలడు. అతనికి బుద్ధుని మరణరీతి రుచింపలేదు : సిలువమ్రానిమీదగదా అట్టివారు మరణింపవలెను? ఎంత వెఱ్ఱిభావము! హత్య చేయబడుటే గుఱుతా, గొప్పతనమునకు! ఇట్టి తలంపులు హిందూదేశమున నెన్నడును లేవు. మహాపురుషుడగు బుద్ధుడు హిందువుల దేవతలను, జగదీశ్వరునికూడ, తెగడుచు దేశమంతటను పర్యటించెను. కాని పండుముసలియగుదనుక—ఎనుబదేండ్లు— బ్రదికెను. దేశములో సగముభాగమును తన మతమునకు త్రిప్పుకొనెను.

ఇక చార్వాకమతము. ఆ మతస్థులు ఈ 19-వ శతాబ్దమున నైనచో బహిరంగముగా బోధ చేసియుండజాలరు. అంత

అసభ్యరూపమున అంత ఘోరరీతిని, వారు అనాత్మవాదమును బోధించిరి. మతమంతయు అసంబద్ధ ప్రలాపమయమనియు, అది మతాచార్యుల కుతంత్రఫలమనియు, మూఢులు, వంచకులు, రాక్షసులు వేదములను కల్పించిరనియు, భగవంతుని ఉనికియు, నిత్యమగు ఆత్మ ఉనికియు కల్లయనియు, వారు ప్రతి పట్టణమున కేగి, ప్రతి దేవాలయమునొద్దను నిరాఘాటముగా బోధింపగల్గిరి. ఆత్మయనున దొకటి ఉన్నచో, మరణానంతర మది ఆలుబిడ్డలయందలి మమతచే ఏల తిరిగిరాదు? ఆత్మయనునది ఉన్నచో, దానికి మరణానంతరముకూడ మమకారము నిలిచి యుండవలెననియు, అది మంచి వస్త్రములను, చక్కని భోజనమును, కోరుచుండుననియు, వారి తలంపు! ఇట్టి బోధలు చేయుచుండినను, ఈ చార్వాకుల జోలికెవ్వరును పోలేదు.

ప్రథమము నుండియు హిందూదేశమున మతస్వాతంత్ర్యము మహోజ్జ్వలముగ ఉండెనని మీరిందుచే గ్రహింపగలరు. స్వాతంత్ర్యము లేనిచో అభివృద్ధి అసంభవమని జ్ఞప్తి యుంచుకొనుడు. గురుపదవికి గల స్వాతంత్ర్యమును మీ చేతులలో నుంచుకొని, మీ యిష్టానుసారముగా ఇతరులను త్రోవచూపి నడిపించుచున్నచో, వారు అభివృద్ధి నొందుదురనియు, ఆ యభివృద్ధికి మీరు తోడ్పడగలరనియు, ననుట అర్థరహితము. అది అపాయకరమగు బొంకు. లక్షోపలక్షల జనుల అభివృద్ధి నిది నాశనముచేసినది. మానవులకు స్వాతంత్ర్యజ్యోతి ఉండుగాక. వారికి త్రోవ చూపుటకు సమర్థమైన దది యొకటే.

మా హిందూదేశములో ఆధ్యాత్మికవిషయములందు స్వాతంత్ర్య మిచ్చితిమి. నేటికిని మా మతభావనలో అపారమగు ఆధ్యాత్మికశక్తికలదు. ఆ స్వాతంత్ర్యమునే మీరు సాంఘికవిషయములలో ఇచ్చితిరి. తత్ఫలముగా మీకు అత్యద్భుత

మగు సాంఘికవ్యవస్థ లభించినది. మేము సాంఘికాభివృద్ధి కను కూలించు స్వాతంత్ర్యము నీయలేదు. అందుచే మా సాంఘికస్థితి గిటకబాఱియున్నది. మీరు మత విషయములం దెప్పుడును స్వాతంత్ర్య మిచ్చి ఎఱుగరు. అంతేకాక, ఖడ్గములతో, తుపాకులతో, మీ మతాశయము నితరమతస్థులలోనికి బలాత్కారముగా ఎక్కించితిరి. కావున మీయూరోపుదేశీయుల మనసులలో మతధర్మాభివృద్ధి గిడసబాఱి క్షీణరూపముననున్నది. మా దేశములో సంఘమునకు సంకెళ్లను వదలింపవలెను. మీ దేశములో ఆధ్యాత్మిక పరిణామమునకు సంకెళ్లను వదలింపవలెను. అట్లు జరిగినచో మానవుడు అత్యద్భుతవికాసముతో అభివృద్ధి నొందగలడు. మానవుని ఆధ్యాత్మిక, నైతిక, సాంఘికాభివృద్ధులలో ఐక్యభావ మొకటి కలదని మనము గ్రహింతుమేని, ఆస్తికధర్మమనునది, దాని సంపూర్ణార్థమున, మన సంఘమంతటిలో ప్రవేశించి, మన జీవితకార్యము లన్నిటిలో కానిపించుచుండవలెనని ఎఱుగగలము. వేదాంతజ్ఞానదృష్టితో విచారించినయెడల, విజ్ఞానశాస్త్రము లన్నియు ఆస్తికధర్మమునకు వ్యక్తరూపములేయని తెలియవచ్చును. ప్రపంచమున గల సర్వమును అట్టిదేయనియు తెలియవచ్చును.

ఈ స్వాతంత్ర్యవాతావరణమున నిర్మింపబడిన శాస్త్రములను రెండు శాఖలుగా విభజింపవచ్చును. ఒకటి అనాత్మవాదపరము, ఆక్షేపమయము; రెండవది ఆస్తికము, నిర్మాణపరము. అది ఏమి చిత్రమోకాని, ప్రతిదేశమందును ఈ రెండుపక్షములు కానిపించుచున్నవి. సాంఘికదురాచార మొకటి కలదనుకొనుడు. దాని నొక పక్షమువారు అతి తీవ్రముగా ఖండించి దానిపై అగ్నివర్షము కురిపింతురు. తమ అభిప్రాయమే సరియని వారికిగల విశ్వాసము మొండిపట్టుదల క్రిందికిగూడ దిగును. ప్రతిసంఘమునను ఇట్టి తీవ్రవాదులగు మూర్ఖు లుందురు. ఈ మూర్ఖాపవాదములందు పెక్కుతడవలు స్త్రీలుకూడ చేరుదురు. భావావేశము

స్త్రీలకు నైజముకదా. ఇట్లు ఉద్ఘోషించువారి కందఱికిని కొందఱు అనుచరులు లభింతురు. పడగొట్టుట సులభమైనపని. మూర్ఖావేశపరులు దేనినైన పడగొట్టగలరు. కాని నిర్మాణకార్యము వారి కంతగా తెలియదు. వారు లోకమునకు మంచి చేయుచున్నామని తలతురు గాని వారు చేయు అపకారమే అధికము. సాంఘిక వ్యవస్థానిర్మాణ మొక్కదినమున పూర్తియయినదికాదు గనుక అట్టిదానిని మార్పవలెనన్నచో, దానిలోగల దోషమునకు కారణము కనుగొని దానిని తొలగింపవలెను. దూషణమాత్రమున నది తొలగిపోదు. దోషమూలమును సంస్కరించినచో, దోషము తనంతట తానే తొలగిపోవును. దానిని తెగడుచు ఎంతగా ఘోషించినను ఫలముకలుగదు. అపకారరూపమగు ఫలము మాత్రము కలుగగలదు. ఈ మూర్ఖావేశపరు లొకపక్షమువారు.

రెండవ పక్షమువారు ప్రేమసానుభూతిపూరితహృదయులు. అగాధ పరిశ్రమచేసి మూలకారణమును కనిపట్టవలెనని వీ రెఱుగుదురు. వీరే మహాపురుషులు: సాధుసత్తములు. లోకములోని ప్రతి మతకర్తయు "పూర్వమతప్రవక్తల బోధను పరిపూర్ణమొనర్చుటకై నా రాక, దానిని కూలద్రోయుటకు కాదు" అని ప్రకటించుకొన్న విషయమును మఱవరాదు. అనేకు లీ మాటల కపార్థముచేసికొని, లోకప్రీతి నార్జించుకొనుటకై వారు తమ ఉత్తమాదర్శములను పోకడపెట్టి లోకదురాచారము లంగీకరించి రనుకొనిరి. తమకు సత్యమని తోచినవిధమున మాటలాడుటకును, ప్రవర్తించుటకును, ధైర్యముచాలక, పిఱికితనము చూపి రనువారును కలరు. కాని ఇది పొరపాటు. లోకజనులు తమ బిడ్డలనియే ఆ మహనీయుల భావన. వీరియెడల వారి హృదయములు ప్రేమతో నిండి తొలకాడుచుండెను. ఆ మహాప్రేమకు గల అపారశక్తి ఈ మూర్ఖచిత్తుల కెట్లు తెలియగలదు? అనంతసానుభూతితో, అనంత సహనముతో నిండిన హృదయములుగల ఆ మహాపురుషులే లోక

మనకు నిజమైన తంత్రములు, నిజమైన దేవతలు. వారు దేనినైన సహింతురు. దేనినైన ఓర్తురు. మానవసంఘము ఎట్లు అభివృద్ధినొందునో వారెఱుగుదురు. అందుకు అనువగు సాధనములను వారు శాంతముతో, మెలమెల్లగా, జాగ్రత్తతో, ప్రయోగించుచుండిరి. తెగనాడక, వెఱపింపక, ప్రేమతో, పదిలముగా పట్టుకొని, ఒక్కొక్క మెట్టెక్కించి పైకి తెచ్చుటే వారనుసరించిన మార్గము. అట్టివారే ఉపనిషత్కర్తలు. మనుష్యులఆశయములు నైతికముగా ఉన్నతక్షేత్రము నందిన వనియు, అందుచే భగవంతునిగూర్చిన పూర్వభావము లిప్పుడు వికృతములుగా నుండు ననియు, వారెఱుగుదురు. నాస్తికులబోధలలోకూడ ఎంతో సత్యము—బంగరుముద్దలవంటి సత్యము—కలదనియు వారెఱుగుదురు. కాని, ఈ మణుల నొకటిగా కూర్చిన దారమును త్రెంపి, గగనమార్గమున నెక్కడనో ఒక నూత్నసంఘమును నిర్మింపజూచువారు యత్నసిద్ధినొందజాలరనికూడ వారెఱుగుదురు.

మనము క్రొత్తనిర్మాణములు చేయము. స్థలములు మాత్రము మార్తుము. అచటి దిచట, ఇచటి దచట, ఉంతుమే గాని క్రొత్తగా కల్పించుట మనకు శక్యముకాదు. విత్తనము నెమ్మదిగను, క్రమక్రమముగను, కదా చెట్టగును. ఇది జ్ఞప్తియుంచుకొని మనము సత్యసాధనార్థము కృషిచేయుచు, లభించినసత్యము ననుసరించుచు, ఉండవలయును. క్రొత్త సత్యములను కల్పింపజూడరాదు. కావున ప్రాచీనకాలపు ఋషులు భగవంతుని గూర్చిన ప్రాతభావా లప్పటి కాలమున కనుకూలింపవని తెగడక, వానియందుగల సత్యమును పరిశోధించి వేర్పఱుపజూచిరి. తత్ఫలమే వేదాంతవిద్య. తొల్లిటి అనేకదేవతలనుండి, ఆ పిమ్మటి ఏకైకమూర్తియగు జగదీశ్వరునినుండి, ఇంకను మిక్కిలి అభ్యున్నతమగు నిర్గుణబ్రహ్మమును వారు కనుగొనిరి. ప్రపంచమంతటియందును ఐక్యమును కన్గొనిరి.

ఈ భేదమయప్రపంచములో గల సర్వవస్తువులందును సమానముగా నిలిచియుండు సర్వభూతాంతరాత్మయగు ఆ యొక్కని: మరణోన్ముఖమగు ఈ అనిత్యప్రపంచమున నుండు ఆ నిత్యపరిపూర్ణజీవి నొక్కని: అచేతనమును, అవిద్యామయమును, అగు ఈ ప్రపంచమున జ్ఞానతేజోమయుడగు ఆ చైతన్యమూర్తి నొక్కని: ఎవ్వడు కనుగొనునో వానిదే శాశ్వతశాంతి! అది మఱెవ్వరికిని ఎవ్వరికిని లేదు.



## మాయ, ముక్తి

(తే 22-10-1896 దినాడు లండనులో ఉపన్యస్తము)

"చనుదెంతు మిటకు వెనువె! న్కాన రేఁగెదు కీర్తి తెరల కైవడి" "ట్రెయిలింగ్-క్లౌడ్స్-ఆఫ్-గ్లోరి-డు-వి-కమ్" వర్డ్స్ వర్త్ అని యొక ఆంగ్లమహాకవి పల్కి-యున్నాడు. కాని అందఱమును "కీర్తి తెరల కైవడి" వచ్చుచున్నామా? ఎందఱమో "నీలిపొగల కైవడి" గదా వచ్చుట! కాని ఎట్లువచ్చినను, మనకీ ప్రపంచరంగము యుద్ధభూమి. యుద్ధము చేయుటకే మన మిటకు వచ్చునది. ఏడ్చుచు ఇచటికి వచ్చి, శక్తికొలది పోరాడి, జీవితమహాసముద్రములో నొక త్రోవ కల్పించుకొని, ముందు వెనుకల నెన్నో యుగములు వ్యాపించు అనంతకాలములో సాగి పోవుచుందుము. ఇట్లుండగా మరణ మరుదెంచి మనల నిట నుండి కొనిపోవును. పోరాటములో గెలిచినది ఓడినది మనకు తెలియదు. ఇది మాయ.

పసితనమున 'ఔ నని పని యెంచు, ఔ నన భువి మించు' అనుకొనుట కడు ప్రబలము. కన్నులు తెఱచిన పసిపాపనికీ ప్రపంచ మంతయు స్వర్ణమయము. అతని ఇచ్ఛ కడ్డు లేదు. కాని అతడు ఎదుగుకొలది, ప్రకృతి వజ్రకఠినమగు గోడయై, అడుగడుగునకు అడ్డుతగిలి స్వేచ్ఛా ప్రవర్తనమును నిరోధించును. భేదించు ఉద్దేశముతో దాని నెన్నిసార్లు ఎదుర్కొ-నినను, నిష్ప్రయోజనము. వయసుముదురుకొలది, ఆదర్శముకూడ దూర మగుచున్నది. ఇంతలో మరణ మరుదెంచును. విడుదలయు అరుదెంచునేమో! ఇది మాయ.

భౌతికశాస్త్రజ్ఞు డొకడు కలడు. అతని జ్ఞానతృష్ణ అపారము. దానిని తీర్చుకొనుటకై, అత డెంత త్యాగమునైన చేయును. ఎట్టి పాటులనైన పడును. ప్రకృతి గర్భములోని అగాధభాగములనుకూడ పరిశోధించి, తద్రహస్యముల నెన్నిటినో కన్గొనును. కాని ఈ శ్రమ మంతయు ఎందుకు పడినట్లు? అందుకై అతనిని శ్లాఘించుటేల? ఆ శ్లాఘుకత డెట్లు తగును? మానవశక్తి కతీతములగు కార్యముల నెన్నిటినో మూఢము, అచేతనము అగు ప్రకృతి చేయుటలేదా? మహాబలిష్ఠమగు పిడుగు నది ఎంత దూరమైనను విసరగలదు. మానవు డొకడు ఆ పనిలో వేయవవంతు చేసినను, మన మతని నపారముగా నుతింతుము. ఏల? ప్రకృతిని—మృతమును — మూఢమును— జడమును—అనుగమించినందుకా నుతి?

భూమికిగల ఆకర్షణశక్తి ఎంతటి ఘనపదార్థరాశినైన తునాతునకలుగా ఛేదించి వేయగలదు. కాని అది జడము. జడపదార్థమును అనుకరించుట అంత ఘనకార్యమా? కాని మన మందఱము పరిశ్రమించుట అందుకొఱకే. ఇది మాయ.

మానవుని ఆత్మను అతని ఇంద్రియములు బలాత్కారముగా బయటికి లాగుచున్నవి. సుఖానందములు లేనిచోట అతడు వానికై వెదకులాడుచున్నాడు. ఇది వెఱ్ఱి, ఇది నిరర్థకము, సుఖ మిచటలేదు అని యుగయుగములుగా మనము వినుచున్నాము. కాని ఆ పాఠము మన మనస్సుల కెక్కదు. స్వానుభూతిచేతగాని మన మది నేర్చుకోజాలము. కాని స్వప్రయత్న మొకటి చేసినవెంటనే దెబ్బపడినది. అప్పటికైన బోధమైనదా? లేదు. మంటలోనికి దుముకు రెక్కలపురుగువలె మాటిమాటికి మన మీ ఇంద్రియభోగములలోనికి దుముకుచున్నాము. సంతుష్టిలభించును అను ఆశ నశింపదు. నూత్నోత్సాహముతో మరలమరల యత్నించుచుందుము. మాటిమాటి కిట్లు మోసపోయి, జవసత్త్వములు ఉడిగి, మరణింతుము. ఇది మాయ.

బుద్ధికథయు ఇదే. జగద్రహస్యములను తెలిసికోవలెనని మన వాంఛ. వానిని గూర్చిన విచార మెప్పటికిని మాన జాలము. అవి తెలిసితీఱు నను కొందుము. తెలియకపోవునని నమ్మనేరము. కాని కొన్ని అడుగులు సాగుటతోడనే, కాలము అను ఆద్యంతరహితమగు గోడ అడ్డుతగులును. అది దాట శక్యముకానిది. మఱికొన్ని అడుగులు సాగినచో, అనంతా కాశము అను మఱియొక గోడ ఎదుర్కొనును. అదియు దాట శక్యముకానిదే. ఇదంతయు కార్యకారణములు అను గోడలలోపల చిక్కుపడియుండును. వీనిని దాటి మనము పోజాలము. కాని ప్రయత్నములు మానము. మానుట మనకు తరముకాదు. ఇది మాయ.

మన మెల్లప్పుడును — శ్వాసము పీల్చినప్పుడెల్ల, గుండె కొట్టుకొనినప్పుడెల్ల, శరీరములో నేమాత్రమైనను కదలిక కలిగి నప్పుడెల్ల—స్వేచ్ఛాపరుల మనుకొనుచుందుము. కాని ఆ క్షణము ననే అది అసత్యమని తెలియవచ్చుచుండును. మనము దాస్య బద్ధులము. మన శరీరములు, మనస్సులు, తలంపులు, భావములు: అన్నియు ప్రకృతియొద్ద వెట్టిచాకిరిచేయుట కేర్పడిన బానిసలు. ఇది మాయ.

తన బిడ్డ అత్యద్భుతప్రతిభాసంపన్నుడై జన్మించెనని, అంత లోకోత్తరశిశు వెన్నడును పుట్టలేదని ప్రతి తల్లియు తలంచును. ఆమె ఆత్మ అంతయు ఆ బిడ్డయందే మగ్నమై యుండును. వాడు పెరిగి పెద్దవాడై, త్రాగుడు మరగి, మృగ ప్రాయుడై, ఆమెను హింసింపవచ్చును. కాని వాడు హింసించు కొలది ఆమెప్రేమ అధిక మగుచుండును. అది అస్వార్థమగు మాతృప్రేమ యని లోకము ప్రశంసించును. కాని నిజమునకు ఆమె ఆజన్మదాసి. ఆ దాస్యమునుండి తప్పించుకొనుట ఆమెకు అశక్యము. వేయిమాఱు లా భారము నామె వదల్చుకొన

గోరును. కాని అది అసాధ్యము. తన అశక్యతను పుష్పరాశితో కప్పివైచి, దాని నద్భుతప్రేమరాశి యనును. ఇది మాయ.

మన మందఱ మిట్లే ప్రవర్తించుచుందుము. తనకు మాయను చూపుమని నారదు డొకసారి శ్రీకృష్ణుని ప్రార్థించెనట. కొన్నాళ్లపిదప శ్రీకృష్ణు డొక యెడారికి పోవుచు, నారదుని తన వెంట రమ్మనెను. కొన్నిమైళ్లునడిచిన పిదప "నాకు దప్పి యగుచున్నది. కొంచెము నీరు తెమ్ము" అని నారదు నడిగెను. తెచ్చుట కతడు బయలువెడలెను. చెంతనున్న యొక పల్లెకు పోయి నీటి కొఱ కొకయింటి తలుపు తట్టెను. జగన్మోహనాంగియగు నొక యెల జవ్వని తలుపు తెఱచెను. ఆమెను చూచుటతోడనే తనప్రభువు దప్పిగొని నీటికై వేచియున్న మాటనే మఱచి, దాహముచే నత డొకవేళ మరణించు నని కూడ మఱచి, నారదు డా బాలికతో సల్లాపము లాడుచు కూర్చుండెను. ఆ దిన మంతయు తన ప్రభునియొద్దకు పోలేదు. మఱునాడుకూడ మరల వచ్చి సరససల్లాపములందే కాలము గడపెను. ఈ ఇష్టాగోష్ఠులుసాగుకొలది వారొండొరులయెడమరులు గొని, తండ్రి అనుమతితో పెండ్లియాడి బిడ్డలను గనిరి. పండ్రెండేండ్లు గడచినవి. మామ మరణించెను. ఆ స్త్రియంతయు వారికి సంక్రమించెను. భార్య, బిడ్డలు, భూములు, పశువులు, మున్నగాగల సకలసంపద ననుభవించుచు, నారదుడు మిక్కిలి సుఖజీవనము చేయుచున్నా ననుకొనెను. ఇట్లుండగా చేరువనున్న యేఱు ఒకటి పొంగి మహాప్రవాహమై, గ్రామమును ముంచివైచెను. ఇండ్లు కూలినవి. ప్రవాహము మానవులను, పశువులను, కొట్టుకొనిపోయి ముంచివేసెను. సర్వము ఆ ప్రళయజలరాశిలో చిక్కి తెప్పలు తేలుచుండెను. నారదుడు ప్రాణములు దక్కించుకొనుటకై పాఱిపోవలసివచ్చెను. భార్య నొకచేత, ఇరువురు బిడ్డల నొకచేత, పట్టుకొని, భుజముపై నొకబిడ్డ నెక్కించుకొని, అత డా మహాప్రవాహమును దాటుచుండెను. కాని ఆ ప్రవాహపు

ఉరవడి కాగక, పట్టుతప్పి, భుజముమీది బిడ్డ జాఱిపడి కొట్టుకొనిపోయెను. నిరాశాగ్రస్తుడై నారదుడు విలపించెను. ఆ బిడ్డను కాపాడుకొను యత్నములోనుండగా చేతనున్న బిడ్డలు జాఱిపోయిరి. చివరకు భార్యకూడ, యావచ్ఛక్తితో పట్టుకొని యున్నను, ఆగక ప్రవాహామువాత బడిపోయెను. నారదుడు గట్టుపై పడి ఘోరశోకావేశపరవశుడై ఏడ్చుచు, మొత్తుకొను చుండెను. వెనుకనుండి మృదుస్వరమున "కుమారా, ఏవీ నీళ్లు? నీళ్లు తెత్తునని వెళ్లితివి. నీ రాకకై నిరీక్షించుచున్నాను. అఱగంట దాటినది" అను మాటలు వినవచ్చెను. "అఱగంటయేనా?" అని నారదు డాశ్చర్యముతో పల్కెను. అతని మానసమున పండ్రెండేండ్లు గడచినవి. కాని ఆ చరిత్రమంతయు జరిగినది అఱ గంటలోనే! ఇది మాయ. ఈ మాయ ఏదో ఒకరూపమున మనలనందఱిని ఆవరించుకొని యున్నది. ఇది గ్రహించుటకు శక్యముకాని ఘోరస్థితి. ఎంత బోధించినను దీనిని నమ్మువారు అరుదు. అన్ని దేశములలోను ఇంతే. స్వానుభవముచేత కను గొన్నగాని, మానవులిది నమ్మజాలరు. దీని కర్థమేమి? ఇదంతయు నిరర్థకము, కావున ఘోరము అని.

అన్నిటికిని కాలము తీఱును. కాల మన్నిటిని శిక్షించును. ఏదియు దానిని ప్రతిఘటింపజాలదు. పుణ్యాత్ములను, పాపాత్ములను; భూపులను, కాపులను; సురూపులను, కురూపులను: అందఱి నది మ్రింగివేయును. ఎవ్వరిని విడువదు. దాని దెసకే సర్వము పర్విలిడుచున్నది: మన జ్ఞానము, మన కళలు, మన శాస్త్రములు—సర్వమును. ఆ మహాప్రవాహము నెవ్వరును అరి కట్ట జాలరు; ఒకక్షణమాత్రము ఆపలేరుకూడ. విషూచ్యాది క్రూరవ్యాధులు గ్రామముపై బడి నరబలులు గొనుచుండునప్పుడు ఆ ఘోరదృశ్యమును చూడజాలనివారు త్రాగుట, ఆవేశముతో చిందులుత్రొక్కుట, ఇత్యాదులచే స్మృతి తప్పి మొద్దువాఱి పోవు నట్లు, మనమును సర్వవిధములగు ఇంద్రియభోగములలోబడి ఈ

అనివార్యవినాశకారియగు కాలమును మఱవజూతుము. ఇది మాయ.

ఈ విపత్తు నెదుర్కొనుటకు రెండు మార్గములు చూపబడినవి. అం దొకటి అంద తెలిసినదే. అంద అవలంబించునదే: "కాలము తప్పనిదే కావచ్చును. కాని దానిని లక్ష్యము చేయకుము. మన లోకోక్తి ననుసరించి దీప మున్నప్పుడే వెదకికొనుము. లభ్యములగు సుఖములనన్నిటిని చూఱగొనుచుండుము. చేయగల దంతయు చేయుచుండుము. దృష్టి నెప్పుడును జీవితసుఖములవైపుననే, ఆసగొలుపు విషయములమీదనే, అభివృద్ధిదెసనే, మరల్పుము, ఎన్నడేనియు జీవితదుఃఖములనుగూర్చి తలంపకుము." ఈ బోధలో కొంత సత్యము కలదుగాని, అపాయముకూడ కలదు. దీనికి కార్యోత్సాహము నిచ్చు ప్రభావము కలదు. నెగ్గుదమను నమ్మకమును, విస్పష్టమగులక్ష్యము గల్గియుండుటయు, జీవితమున నెంతయో ఉపయుక్తములు. కాని వానిలో కొంత అపాయము కూడ కలదు. జీవితమున కతిముఖ్యమగు పోరాటమును — అసలు దక్క, మనచేతగాదని — మానుకొందుమేమో అనునదియే ఆ అపాయము. "ప్రపంచ మెట్లు నడిచినను సరే, దాని నంగీకరించుచుండుడు. మీచేత నైనంత ప్రశాంతముగా, సుఖముగా, కూర్చుండి ఈక్లేశముల నన్నిటిని సంతృప్తితో భరింపుడు. మీపై బడు దెబ్బలను పుష్పములుగా భావించుకొనుడు. మిమ్ము బానిసలమందగా ఇటు నటు తఱిమినను, మేము స్వేచ్ఛాపరులమే అనుకొనుచుండుడు. రేయుంబవళ్లు ఇట్టి బొంకులతో మిమ్ము మోసపుచ్చుకొనుచు, ఇతరులను మోసపుచ్చుచు, ఉండుడు. సుఖముగా జీవించుట కిది యొక్కటే మార్గము" అనుబోధలో ఈ అపాయమే కలదు. ఇట్లు కాలము గడపువారినే "బ్రదుకనేర్చినవారు" అందురు. లోకమున ఈ మార్గ మీ 19-వ శతాబ్దమున వర్ధిల్లినట్లుగ నెన్నడును వర్ధిల్లలేదు. లోక మిప్పటి యంత ఘోరవిపత్తుల నెన్నడు ఎఱుగదు. ఇప్పుడున్నంత

పోటాపోటీ ఎన్నడును లేదు. తోడి మానవులయెడ మానవు లింత క్రూరత నెన్నడును చూపి యెఱుగరు. కావుననే ఈ "బ్రదుకనేర్చువిధము" ఇంత వ్యాప్తిలోనికి వచ్చుట, ఇంత ప్రబలముగా బోధింపబడుట. కాని ఈ మార్గము జయింపజాలదు. అపజయమే దీని గతి. క్రుళ్లు వాసన గొట్టు మృగకళేబరమును పూలతో కప్పిపెట్టుట నిరుపయోగము గదా! అది ఎన్నాళ్లు జరుగును? పూవులు త్వరితముగనే వాడిపోవును. అప్పటి కా కళేబరము మొదటికన్న చెడియుండును. మన జీవితముల విషయము కూడ ఇంతే. చీము కాఱుచుండు మన పురాతనవ్రణములను బంగరు తగడుతో కప్పిపెట్టవచ్చును. కాని కొన్నాళ్లకు ఆ తగడు తీసివేయవలసిరాదా? అప్పు డా వ్రణము చూచుటకే సాధ్యము కానంత అసహ్యరూపముతో బయలుపడును.

అట్లైన, ఇక మార్గమే లేదా? మనము మాయకు దాసులము, మాయలోనే పుట్టి, మాయలోనే జీవించుచున్నా మనుట నిజమే అయినను, విముక్తిమార్గము, ఆసపాటు కాధారము, లేనే లేదా? ఈ లోకము; మన "కీర్తి తెర" లనబడువాని సొబగు; మన మనోబుద్ధులు : ఇవన్నియు చెఱసాలలే యనుట యుగయుగములుగా తెలిసిన సత్యమే. ఎప్పుడో ఒకప్పుడు తన అంతరాత్మలో ఈ సత్యమును పొడగాంచని మానవుడే లేడు. వృద్ధజనుల కిది ముఖ్యముగా తెలిసియుండును. వారి కొక జీవితకాలపు పూర్ణానుభవము కలిగియుండును గదా! అందుచే ప్రకృతిచేయు వంచనలకు వారు సులభముగా మోసపోరు. స్థితిగతులన్నియు ఇట్లున్నను; ఈ భయంకరసత్య మంద తెలిసినదే ఐనను; ఈ వ్యథల, ఈ కష్టముల, బాధ తప్పించుకో జాలనిదే యైనను; బ్రదుకుచావులకు భేదమేలేదని చెప్పదగిన ఈ లోకముననే, అన్ని యుగములందును, అన్ని దేశములందును, ప్రతిహృదయములో నిగూఢవాణి యొకటి నెమ్మదిగా—కాని సుస్పష్టముగా—ఇట్లు పలుకుచుండును : "ఈ నా మాయ అలౌకి

కము, అత్యద్భుతము. అది సత్త్వరజస్తమోగుణములతో కూడి నది. దానిని దాటుట అత్యంతకష్టము. కాని నను శరణుచొచ్చు వారు ఈ సంసారవాహినిని తరింతురు''; ''కష్టజీవితములు గడ పుచు, తమ భారములను మోయజాలక క్రుంగిపోవుచుండువారు అందఱును నాయొద్దకు రండు. నేను మీకు విశ్రాంతి చేకూ ర్చెదను''. ఆ వాణియే మనలను ముందుకు నడపుచున్నది. యుగ యుగములుగా నది మన కందఱికిని వినవచ్చుచున్నది. అంతయు కోలుపోయినట్లు తోచి, ఆసలన్నియు అడుగంటి, స్వశక్తిపై గల విశ్వాస మంతయు అంతరించి, ఎటు చూచినను అపజయమే కాన వచ్చునప్పుడు, జీవిత మంతయు శిథిలరూప మొందినప్పుడు— ఆ మహాక్లిష్ట సమయమున—ఈ వాణి వినవచ్చును. దీనినే ఆస్తిక ధర్మవాణి యందురు.

ఇప్పుడు తేలిన విషయమిది: ఒక పక్షమువారు ''ఇదం తయు అర్థరహితము; మాయ అని పల్కుదురు. కాని ఆ వెంటనే ''ఈ మాయకు ఆవల విముక్తిమార్గముకలదు'' అను మిక్కిలి ధైర్యోత్సాహమూలమగు సందేశము నిత్తురు. రెండవ పక్షమువారు ''బ్రదుకనేర్చిన బుద్ధిమంతులు''. ''ఆస్తికధర్మము (రిలిజన్): ఆధ్యాత్మికచింతనము: ఇట్టివన్నియు అసంబద్ధ ప్రలాపములు. వానితో మీ తలలు బ్రద్దలుకొట్టుకొనకుడు. ఈ ప్రపంచములో ఎన్నో లోపములు కలవు నిజమే. కాని అందే నివసించి, దానివలన లభించు సుఖము నంతయు అనుభవించుచుం డుడు'' అని వీరు బోధింతురు. దీని కర్థ మేమనగా: 'కపట ముగా, మోసముగా, బొంకులతో, జీవింపుడు; బాధ నంతయు ఎట్లో కప్పివైచుకొనుచుండుడు. అంతయు నశించి, అంతయు అతుకులమయమే అగువఱకు, మీ జీవితమునకు అతుకులు వేసి కొనుచు పోవుచుండుడు. ఇదియే బ్రదుకనేర్చిన విధము.' ఈ మార్గముతో తృప్తిచెందువారు ఆస్తికధర్మమువంక నెప్పటికిని కన్నెత్తిచూడరు. ఈ ప్రపంచస్థితియెడ, మనజీవితములయెడ,

గాఢమగు అసంతృప్తి; ఈ అతుకుల బ్రతుకునెడ మిక్కుటమగు ద్వేషము; మోసమునెడ, బొంకులయెడ అగ్గలమగు అసహ్యత : ఇవి కలిగినప్పుడే ఆస్తికధర్మజీవన మారంభమగును. బోధి వృక్షము క్రింద తపమొనర్చుచున్నప్పుడు బుద్ధభగవానుని కొకసారి మనోనిశ్చయము సడలి, పూర్వజీవితమువంకకు బుద్ధి తిరిగెను. సత్యాన్వేషణము చాలించి; ప్రపంచవృత్తి నవలంబించి; కపట జీవనము చేయుచు; వస్తువులను అసత్యనామములతో పేర్కొనుచు; కల్లలతో ఇతరులను మోసపుచ్చుచు, తాను మోసపోవుచు; ఉండుటయేగదా సామాన్యప్రపంచజీవనవైఖరి. అట్టి బ్రతుకు తుచ్ఛమని ఆయనకు తోచెను. కాని గత్యంతరము స్ఫురింపలేదు. అప్పుడా పురుషసింహము తన మనోదార్బల్యమును జయించి, "అజ్ఞానకూపమున కూలి, వ్యర్థముగా జీవించుటకన్న మరణించుట మేలు; ఓటమినొంది బ్రదుకుటకన్న యుద్ధభూమిలో చచ్చుట మేలు" అని పల్కెను. ఇట్లు చెప్పగల్గిన ధీరుడే ఆస్తిక ధర్మజీవనము నవలంబింపగలడు. ఇట్టి బుద్ధియే ఆస్తికధర్మజీవనమునకు ఆధారము. ఈ నిశ్చయము పూనినవాడు సత్యమార్గమును—భగవత్ సాక్షాత్కారమార్గమును—పట్టినట్టే. ఈ మార్గమును పట్టుటకు ప్రథమప్రేరణము ఈ దృఢనిశ్చయమునుండియే బయలువెడలును : 'ఆటంకముల నన్నిటిని పడ నడచి, గమ్యమునకు త్రోవ కల్పించుకొనెదను; సత్యము నెఱిగెదను; ఆ యత్నమున ప్రాణములనైనను కోలుపోయెదను.' ఈ ప్రపంచజీవనము నిస్సారము. ఇప్పటికే ఇది కొంత నశించినది. దినదిననాశమొందుచున్నది. నేడు ఆశావాదియై ముద్దులొలుకుచున్న యువకుడు రేపటి కప్పటికే ముదిమిచే క్రుంగిపోయినాడు. నేడు చక్కగా వికసించియున్న పుష్పములు రేపటి మంచుకు వాడిపోయినట్లు, మన ఆసపాటు, సుఖములు, ఆనందములు : అన్నియు నశించిపోవునవే. ఇదియే ప్రపంచజీవనవిషయము. ఇది యొక వైపు. ఇక రెండవవైపున సంసారతాపత్రయమును, ప్రపంచ

మును, అన్నిటిని జయించిన ఆనందము. ఈ రెండవవైపు చేరుట మానవులకు సాధ్యమే. అనగా, విజయమును, సత్యమును, ఆస్తిక ధర్మమును, సాధించుటకై యత్నింప సాహసించువారు సరియైన త్రోవనే పట్టినారు. "నిరాశ చెందకుడు. త్రోవ మిక్కిలి కష్టమైనదే. కత్తివాదరమీాద నడచుట వంటిది. కాని అధైర్య మొందకుడు. లెండు, మేలుకొండు, ఆదర్శమును గమ్యమును సాధింపుడు" అని వేదములు బోధించుచున్నవి.

లోకముననుండు వివిధమతములందును ఒక్క మూలాశయమే కలదు. సంసారమునుండి తప్పించుకొని విముక్తినొందుటే ఆ మూలాశయము. ప్రాపంచికజీవితమునకును, ఆస్తికధర్మజీవితమునకును, పొత్తుకుదుర్చు నుద్దేశము వానికి లేదు. ఈ రెంటి నంటగట్టిన బంధమును ఛేదించివైచి, ఆస్తికధర్మము స్వాతంత్రముగా, తన ఆదర్శముమీాదనే ఆధారపడి, నిలుచునట్లు చేయుటే వాని ఉద్దేశము. మతము లన్నియు బోధించు లక్ష్య మిదియే. ఈ వివిధమతలక్ష్యములను — పరిపక్వదశయం దున్నవిగాని, కేవలము ప్రాథమికదశయం దున్నవిగాని—సమరసపఱచి, వానియన్నిటికిని ఉమ్మడియైన ఆధారమును బహిరంగపఱచుటే వేదాంతమునకు ఉద్దేశము. కేవలము వెఱ్ఱిగా తోచు మూఢవిశ్వాసమునకును, అత్యున్నతతాత్త్వికసిద్ధాంతమునకును, గమ్యము ఒక్కటే. రెండును తొలగింపజూచు చిక్కు ఒక్కటే. ప్రకృతినియమబద్ధుడు కానట్టి ముక్తపురుషుని తోడ్పాటు కైకొనుటలో ప్రాయికముగా అన్నియు ఏకీభవించును. ఈ ముక్తపురుషుడు సగుణదైవమా, మనవంటి మఱొకమానవుడా, పురుషుడా, స్త్రీయా, రెండును కానట్టి తృతీయప్రకృతియా, అను విషయమునుగూర్చి వాదము లనంతముగా చెలరేగినవి. భావభేదము లపారముగా కలిగినవి. కాని మూలాధార మొక్కటియే. ఈ మతములలో ప్రత్యక్షముగా పరస్పరవిరుద్ధములైన వెన్నియో కలవు.

కాని, వాని యన్నిటిలో నొక ఐక్యబంధము స్వర్ణసూత్రమువలె కానిపించుచుండును. వేదాంతమత మీ స్వర్ణసూత్రమును కని పట్టి, దానిని క్రమక్రమముగా మనకు దృష్టిగోచర మొనర్చు చున్నది. అన్నిమతములును మోక్షలక్ష్యము వైపుననే సాగు చున్నవి అనునదే ఈసామాన్యధర్మములలో మొదటిది.

మన సుఖములు; మన దుఃఖములు; మన కష్టములు; మన పోరాటములు : వీని అన్నిటి నడుమ మనము మోక్షమార్గము ననే పయనించుచున్నా మనుట యొక వింతవిషయము. "ఈ ప్రపంచ మెట్టిది? ఇది దేనిలోనుండి ఉద్భవిల్లెను? దేని లోనికి పోవుచున్నది?" అను సమస్య బయలువెడలెను. దాని కీ సమాధాన మీయబడెను: "ముక్తత్వములో ఉద్భ విల్లెను; ముక్తత్వములో విశ్రమించియున్నది; ముక్తత్వములో లయించును." ఈ ముక్తతను మనము విడనాడజాలము. అది లేనిచో, కర్మాచరణము అసాధ్యమగును. జీవించుటకూడ అసాధ్యమగును. మనము దాస్యబద్ధులమని, మనకు స్వేచ్ఛా ప్రవృత్తి లేదని, ప్రకృతి ప్రతిక్షణము మనకు తెలుపుచున్నది. కాని స్వతంత్రుల మను తలంపు కూడ మన కప్పుడే కలుగు చుండును. ప్రతిక్షణము మాయ దెబ్బలుకొట్టి మనము బద్ధులమని నిరూపించుచుండును. కాని ఆ దెబ్బతోనే, ఆ బద్ధుల మను తలంపుతోనే, మనము స్వతంత్రులమను తలంపుకూడ తోచును. ఆ స్వతంత్రతను ప్రత్యక్షపఱచుకొని కార్యరూపమున చూప జాలము గాని, ఆ తలంపు మనలో సందడించుచునే యుండును. ప్రపంచములోగల సర్వమతములును దీనిని ప్రకటించి యున్నవి. మతములందు మాత్రమే కాదు — మత మను మాటకు సంకుచితార్థము కల్పించుకొనకుడు — సాంఘికజీవన మంతటిలోను, ఈ స్వాతంత్ర్యము ప్రకటితమగుచుండును. లోకమున బయలుదేఱు ఉద్యమము లన్నిటి కాధారభూత

మగు మూల మిదియే. ''కష్టజీవితములు గడపుచు తమ భారములను మోయజాలక క్రుంగిపోవుచున్నవా రందఱును నా యొద్దకు రండు'' అన్న వాక్కు ప్రతివానికిని – వా డది ఎఱిగి యున్నను ఎఱుగకున్నను — వినవచ్చియే యున్నది. ఏ భాష లోనో, ఏ రూపముననో, ఈ మోక్షప్రదానవాక్కు మన కంద ఱికిని అందియే యున్నది. ఆ వాక్కువలననే మన మీ లోకమున జన్మించితిమి. మన జీవితవ్యాపారము లన్నియు, ఉద్యమము లన్నియు, అందుకొఱకే. అందఱమును మోక్షోన్ముఖులమై పరుగు లిడుచున్నాము. అందఱను—ఎఱిగియో, ఎఱుగకో—ఆ వాక్కు ననుసరించుచున్నాము. గ్రామములలోని పసిబిడ్డలు వేణుగోపా లుని గానముచే ఆకర్షింపబడినట్లు, మన మందఱము ఆ వాక్కు లోని మాధుర్యముచే ఆకర్షింపబడి, కారణ మెఱుగకే దాని ననుసరించుచున్నాము.

ఆ వాక్కు ననుసరించునప్పుడు మనము నీతిపరుల మగు చున్నాము. మనుష్యాత్మలుమాత్రమే కాదు దాని నాలకించినది. సర్వజీవులును — అతిక్షుద్రములుకూడ — దాని నాలకించి దాని దెసగా పర్వులిడుచున్నవి. ఆ సందడిలో కొన్ని యొకటిగా కూడి; కొన్ని తమ త్రోవ కడ్డములుగానున్న ఇతరములను నెట్టివైచి; పరుగెత్తును. ఆ వాక్కును చేరబోవు ఉన్మత్తావేశఫలమే యీ ప్రపంచమంతయు : ఈ పోటీలు, ఈ సుఖములు, ఈ మరణ ములు. ప్రకృతి ధర్మము వ్యక్తమగు రూపము ఇదియే.

వెంటనే ఏ మగును ? దృశ్యమంతయు మాఱిపోడ గును. మాయతోడి పోరాటమువలన బీభత్సయుద్ధరంగ ముగా కానిపించిన ఈ లోకమే సుఖముగను, అందముగను, కానిపించును. ప్రకృతి నిక దూషింపము. అది ఘోరమైనదని, నిరర్థకమైనదని, పల్కము. ఇక ఏడ్వ నవసరము లేదు, మొత్తు కొన నవసరము లేదు. ఆ వాక్కును గ్రహించుటతోడనే, ఈ అల్ల

కల్లోలమునకు కారణము తెలిసిపోవును. ఈ పోరాటము, ఈ పోటీలు, ఈ ఆరాటము, ఈ క్రూరత, ఈ క్షుద్రభోగములు, ఈ క్షుద్రసుఖములు : ఇవన్నియు ఈ ప్రపంచధర్మమున సహజములే అనియు, అది అట్లుండుట అవసరమే అనియు గ్రహింతుము. ఈ ఉపద్రవము లేనిచో ఆ వాక్కు నెవరు విందురు? మన మెఱిగినను, ఎఱుగకున్నను, అదియేగదా మన జీవితలక్ష్యము! మానవజాతి అంతయు, ప్రకృతియంతయు, స్వాతంత్ర్యము కొఱకే పోరాడుచున్నది. సూర్యబింబ మా గమ్యమువైపుకే సాగుచున్నది. దానిచుట్టు ప్రదక్షిణించుచుండు భూమికిని, భూమి చుట్టు తిరుగుచుండు చంద్రమండలమునకును, అదియే గమ్యము. గ్రహసంతతి అచటికే సాగుచున్నది. వాయు వచటికే వీచుచున్నది. సర్వము ఆ లక్ష్యమును చేరుటకే పోరాడుచున్నది. సిద్ధపురుషుడా వాక్కున కభిముఖుడై పోవుచున్నాడు. అతనికి గత్యంతరము లేదు. కావున నతడు స్తోత్రార్హుడు కాడు. పాపిష్ఠుని విషయముకూడ అంతే. దయాపరుడు సూటిగా నచటి కరుగుచున్నాడు. అతనిని ఆపుట అసాధ్యము. లోభికూడ అచటికే పోవుచున్నాడు. లోకోపకారదీక్షాపరుని హృదయమునగూడ ఆ వాక్కే ధ్వనించుచున్నది. దాని నతడు నిరోధింపజాలడు. దానివైపున నతడు పోయియే తీఱవలెను. కేవలము సోమరిపోతగువానివిషయముకూడ అదియే. ఈ పయనములో ఒక్కొక్కని తొట్రుపాటు ఎక్కువగాను, ఒక్కొక్కనిది తక్కువగాను, ఉండును. తక్కువయైనచో సజ్జను డనియు, ఎక్కువ యైనచో దుర్జను డనియు, అందుము. మంచిచెడుగులు ప్రత్యేకవస్తువులు కానేకావు. రెండును ఒక్క వస్తువే. ఆ వస్తువు కానిపించుటలో గల ఎక్కువతక్కువలకే ఆ పేళ్లు.

కావున ఈ ప్రపంచమునంతయు రిపాలించునది వ్యక్తమైన మోక్షశక్తియేకదా. మనకు ప్రస్తుతము విచారణీయాంశమగు ఆస్తికధర్మవిషయమున ఈ సత్యము అనాదినుండియు

ప్రకటింపబడుచున్నది. కేవలప్రాథమికదశయం దుండు మతమును కై కొందము. అందు మృతులైన పితరులనో, బలిష్ఠులును క్రూరులును అగు దేవతలనో, ఆరాధించుచుండిరి. ఆ పితరులయందును, దేవతలయందును, గల ముఖ్యవిశేష మేమి? వారు ప్రకృతికన్న అధికులనియు, దాని ఆజ్ఞకు బద్ధులు కారనియునే కదా? ప్రకృతిని గూర్చి వారి జ్ఞాన మతిస్వల్పము నిజమే కాని, తాము గోడలగుండ దూఱి పోజాలరు, ఆకసమున కెగురజాలరు. వా రా పనులను చేయగలరు. తాత్త్వికముగా దీని కర్థమేమి? వారికి స్వాతంత్ర్యముకలదు, తా మెఱిగిన ప్రకృతికన్న వారు శక్తిమంతులనియే కదా! ఇంకను ఉన్నతులను ఆరాధించువారి విషయమునగూడ ఇదియే వర్తించును. ప్రకృతినిగూర్చిన భావన విశాల మగుకొలది, దానికన్న అధికమగు ఆత్మనుగూర్చిన భావనకూడ విశాలమగుచు పోయిపోయి, చివరకు దేవు డొక్కడే అను మతముగా పరిణమించును. ఆ మతము ప్రకారము మాయ (ప్రకృతి) కలదు, ఆ మాయను ఏలువా డొకడు కలడు.

ఈ ఏకేశ్వరభావ ముదయించుటతోడనే వేదాంత విచారము ప్రారంభమగును. కాని వేదాంతమునకు మఱికొంత వివరణము కావలెను: 'ఈ మాయారూపముల కావల నొక పురుషుడు కలడు; అతడు మాయకన్న నధికుడు; దానికధీనుడు కాడు; అతడు మనల నాకర్షించుచున్నాడు; మన మతనిని చేరబోవుచున్నాము' అనున దంతయు బాగుగనే ఉన్నది. ఇది యుక్తికి విరుద్ధముకూడ కాదు. కాని ఆ పురుషుని గూర్చిన భావ మింకను విస్పష్టముగా ఏర్పడలేదు. బూజరబూజరగా నున్నది. ఇట్టి భావమే "ఈశ్వరా, నీకు మఱింత దాపు" అను మా స్తోత్ర గీతికలో కలదు. వేదాంతికూడ ఆ గీతికను ఆమోదించును గాని, "నీకు" అను మాటను "నాకు" అని అతడు మార్చును. 'గమ్యము దూరస్థము; అది ప్రకృతి కావలనున్నది; అచ్చటి

నుండి మనలనాకర్షించుచున్నది' అని తలంచుట అతనికి సమ్మతము కాదు. గమ్యమహత్త్వమేమియు తగ్గింపకయే దానిని మఱిమఱి చేరువకు దీసికొని రావలెను. స్వర్గలోకమున నున్న దేవుడు ప్రకృతిలోనికి రావలెను; ప్రకృతిలోనికి వచ్చిన దేవుడు ప్రకృతియే కావలెను; ప్రకృతిరూపుడైన దేవుడు మానవశరీరగర్భగృహము లోనికి రావలెను; గర్భగృహము లోని దేవుడు చివరకు గర్భగృహమే అయి, ఆత్మయు మానవుడును కావలెను. ఇంతటితో వేదాంతబోధ అంతమగుచున్నది. ఇంతకు మించి అది బోధించున దేమియు లేదు: తత్త్వ జిజ్ఞాసువు లీ పేర్కొనబడిన చోటు లన్నిటిలో నన్వేషించుచున్న దేవుడు మన హృదయములందే కలడు. మీ రా వాక్కును సరిగనే విన్నారుగాని అది ఎచ్చటినుండి వచ్చినది సరిగా తెలిసికొనజాలకపోతిరి. ఆ మోక్షాదర్శము సత్యమైనదేకాని ఆ వాణి మీలోనిదై యుండగా, బయటిదని భావించి పొరపడితిరి. దానిని దగ్గఱకు తెచ్చుకొండి. అప్పు డది ప్రథమము నుండియు మీలోనే — మీ ఆత్మకు ఆత్మయై — ఉండినదని మీకు తెలియవచ్చును. మీకు ముక్తి స్వభావసిద్ధము. అనగా, మీరు నిత్యముక్తులు. మాయ మి మ్మెప్పుడు బంధింప లేదు. ప్రకృతికి మీపై నెప్పుడును అధికారము లేదు. వెఱపుగొన్న పసిబిడ్డవలె అది మీ గొంతు పిసుకుచున్న దని కలగంటిరి. ఈ వెఱపులోనుండి విముక్తి నొందుటే పరమార్థము. ఈ పరమార్థమును బుద్ధిగతము చేసికొన్న చాలదు. అనుభవసిద్ధము చేసికొనవలెను. ప్రత్యక్షపఱచుకో వలెను. ఈ ప్రపంచ మెంత స్పష్టముగా కనిపించుచున్నదో అంతకన్న స్పష్టముగా అది కనిపింప వలెను. ముక్తులమని అప్పటికి స్పష్టమగును. అప్పటికిగాని కష్టము లన్నియు తీఱవు; హృదయసంశయము లన్నియు నశింపవు; వంకర లన్నియు చక్కపడవు; అనేకత్వము, ప్రకృతి, అను భ్రాంతులు పోవు. అప్పుడు మాయ భయంకరస్వప్న

రూపమై యుండుటమాని మనోహరరూపము ధరించును; ఈ భూలోకము చెఱసాలగా నుండుటమాని, క్రీడారంగముగా కనిపించును; అపాయములు, కష్టములు, వ్యథలు: వాని సత్యరూపమగు భగవంతుడుగనే తోచును. సర్వమునకు యథార్థమూలమై అతడు నిలిచియుండుననియు, అతడే ఏకమును, సత్యమును, అగు ఆత్మయనియు మనకు తెలియవచ్చును.



# బ్రహ్మము, జగత్తు

(1896 లండనులో ఉపన్యాసము)

బ్రహ్మము (అఖండము) ప్రపంచముగా ఎట్లు మాఱెను? అత్యంతక్లిష్టమగు ఈ ప్రశ్న అద్వైతవేదాంతమును గ్రహింప బూనువారి నందఱి నెదుర్కొనును. ఎప్పుడును బయలుదేఱుచు, ఎప్పటికిని నిలిచియుండు ప్రశ్న యిది. నే డీ ప్రశ్ననుగూర్చి విచారించెదను. విషయము సుబోధముగా నుండుటకై నేను గీచిన ఈ రేఖాకృతిని చూడుడు. ఇందు (అ) అనునది బ్రహ్మము. (ఆ) అనునది జగత్తు. బ్రహ్మము ప్రపంచముగా మాఱినది. ప్రపంచమనగా భౌతికప్రపంచము మాత్రమే కాదు. మానసి కాధ్యాత్మికప్రపంచములు, ఊర్ధ్వలోకములు, అధోలోకములు — ఇంతేల? ఏమేమి కలదో అదంతయు, ఈ ప్రపంచ శబ్దములో చేరును. మనస్సు ఒక మార్పునకు పేరు. శరీర మింకొక




మార్పునకు పేరు. ఇ ట్లిన్నియో మార్పులు కలవు. ఈ మార్పు లన్నిటి కూడికయే ప్రపంచము. ఈ బ్రహ్మము (అ) దేశ కాల నిమిత్తముల (ఇ) ద్వారా వచ్చుటచే ప్రపంచముగా (ఆ) మాఱి నది. ఇదియే అద్వైతములోని మూలభావము. దేశకాలనిమిత్త ములు అను గాజుపలకద్వారా మనము బ్రహ్మమును చూతుము. ఆ పలక క్రిందినుండి అతడు ప్రపంచముగా కానిపించును. అఖండు నిలో దేశకాలనిమిత్తములు లేవని ఇందుచే వెంటనే స్పష్టపడును. అచట మనస్సు (అనగా భావన) లేదు. కావున కాలము అను భావ మెట్లుండగలదు? బాహ్యభేద మేమియు కానరాదు గనుక దేశభావముకూడ ఉండనేరదు. మనకుగల చలనభావముగాని,

నిమిత్తభావముగాని, కేవలపదార్థము (ఒక్కటియే అయిన దాని) లో ఎట్లుండగలుగును? బ్రహ్మము — భ్రంశమునొంది అందమా? — జగత్తుగా అయినపిదప గాని, నిమిత్తభావము కలుగనేరదనియు, మన ఇచ్ఛ, కోరికలు, మున్నగున వెల్ల ఆ పిదపనే కలుగ గలవనియు, ఖండరూపుడగుటకుముం ది వేవియు ఉండజాల వనియు, మనము గ్రహించి సుస్థిరముగా జ్ఞప్తి పెట్టుకో వలెను. షోపన్‌హోరు రచించిన తత్త్వగ్రంథములో వేదాంత మతమున కపార్థము కలదని నా యభిప్రాయము. దాని ప్రకారము "ఇచ్ఛ" సర్వశక్తిమంతము. "ఇచ్ఛ" నతడు పరిపూర్ణుని స్థాన మున నిలిపినాడు. కాని అది యెట్లగును? ఇచ్ఛ మార్పు లొందు నది. ఇంద్రియార్థములకు లోనైనది. దేశకాల నిమిత్తాల మీాది రేఖ కావల చలనము, మార్పులు, ఉండనేరవుకదా! ఆ రేఖ యడుగుననే బాహ్యచలనముగాని, ఆంతరచలనముగాని ఉండగలవు. కావున ఆ పైభాగములో ఇచ్ఛ ఉండజాలదు. అనగా ప్రపంచము ఇచ్ఛ వలన కలిగెననుట అసంభవము. మన శరీరధర్మమును విచారించినను, ఇచ్ఛ అన్ని చలనములకు కారణ భూతము కాదుగదా. ఈ కుర్చీని జరుపు చున్నాను. ఈ చలన మునకు నాఇచ్ఛయే కారణము. అదియే రెండవచివరను కండర చలనముగా గోచరించుచున్నది. కుర్చీని కదలించిన శక్తియే హృదయము, శ్వాసకోశములు మున్నగువానినికూడ ఆడించు చున్నది. కాని అచట ఇచ్ఛకు స్థానమే లేదు. ఈ రెండు చలన ములకు మూలమైన శక్తి ఒక్కటే అని ఒప్పుకొనినచో, చైతన్య క్షేత్రమున కెగసినపిదప అది ఇచ్ఛానామ మొందునుగాని, అంతకు ముందు దానికా పేరిడుట పొరపా టనుట స్పష్టము. షోపన్‌హోర్ కల్పించిన తత్త్వమత మీా ప్రమాదమువలన నెంతోగందరగోళము నొందినది.

ఒక రాయి పడును. ఏల పడినది అని మన మడుగు దుము. ప్రతిసంఘటనమున కొక కారణ ముండవలె ననునట్టి

ఊహాయే కదా ఇట్లు ప్రశ్నించుటకు మూలము ? ఈ విషయమును మీ మనస్సులకు బాగుగా విశదపఱచు కొనుడు : కారణవిచారణ మెప్పుడు చేసినను, 'ప్రతి కార్యమున కొక కారణ ముండితీఱును ; అనగా, ఆ కార్యమునకు ముందు దానికి కారణభూతమైన మఱొక కార్యము జరిగి యుండవలెను' అని మన మూహించుచున్నాము. ఈపూర్వాపరత్వ సంబంధమునే నిమిత్తతాన్యాయము (లా ఆఫ్ కాజేషన్) అందురు. ప్రపంచమున ప్రతిదియు వరుసగా కార్యరూపమును, కారణ రూపమును, పొందుచుండు నని దీని భావము. ప్రతిదియు తన పిమ్మట జరిగిన కొన్నిటికి కారణము, తనకు ముందు జరిగిన ఏదో ఒక దానికి తాను కార్యము. ఈ నిమిత్తతాన్యాయము ననుసరించియే మన ఆలోచన యంతయు నడుచును. ప్రపంచములో గల ప్రతినలుసునకును — అది దేనిదైన కానిమ్ము — తక్కిన నలుసు లన్నిటికిని సంబంధము కలదని మన నమ్మకము. ఈ నమ్మక మెట్లు ఉత్పత్తిల్లె నను విషయమునుగూర్చి చాల చర్చలు జరిగినవి. యూరపుఖండములోని సహజ జ్ఞానవాదులు (ఇన్‌ట్యూయిటివ్ ఫిలాసఫర్స్) మానవుని కిది స్వతస్సిద్ధ మనిరి. ఇతరు లిది అనుభవప్రాప్త మనిరి. కాని విషయము పరిష్కారము కాలేదు. దీనినిగూర్చి వేదాంతసిద్ధాంత మేమియో ముస్ముందు చూడగలము. కాని మీ రీ క్రింది విషయమును మొదట గ్రహింపవలెను : ''ఏల'' అని ప్రశ్నించుటకు మూలము మన చుట్టుగల సర్వమునకు పూర్వము కొన్ని ఉండెననియు, పిమ్మట కొన్ని వచ్చుననియు మనకుగల నమ్మకమే. ఆ ప్రశ్నకు మూలమగు మఱొక నమ్మక మేమనగా : 'ఈ ప్రపంచమునగల సర్వవస్తువులును పరస్పరసాపేక్షములు ; మఱి దేనితోను సంబంధము లేక స్వతంత్రముగానుండువస్తువే లేదు' అని. ఒకదానిపై వేఱొకటి ఆధారపడియుండునను సూత్రము సమస్తవిశ్వమందును పరిఢవిల్లుచున్నది. కావున ''పరిపూర్ణ వస్తువు ఎటు కలిగెను ?''

దానికీ హేతువేమి? అను ప్రశ్నలు ఎంత అసంగతములో చూడుడు. ఆ వస్తువుకు మఱొక వస్తువుతో సంబంధము కలదనియు, ఇది దానిపై ఆధారపడి ఉన్నదనియు, భావించి, ఆ పరిపూర్ణవస్తువును ప్రపంచక్షేత్రమునకు దింపుట కాదా ఇది? అఖండునిలో దేశకాలనిమిత్తములు లేవు. అతడు కేవలుడు (ఏక), అద్వితీయుడు. స్వయంభవ మగు వస్తువునకు కారణ ముండదు. సర్వస్వతంత్రవస్తువునకు కారణ ముండదు. ఉండెనేని అది స్వతంత్ర మెట్లగును? సంబద్ధ మగునుగదా? ఇతరముతో సాపేక్షత గల వస్తువు స్వతంత్రము కానేరదు. కావున అఖండవస్తువు ఖండ మెట్లయ్యెనను ప్రశ్నయే అసంగతము: దాని యందు తన్ను తానే ఖండించుకొనుదోషము కలదు. ఈ సూక్ష్మభావవిచారమును వదలి సామాన్యతార్కికదృష్టితో విచారింతము. 'పరిపూర్ణవస్తువు అపరిపూర్ణ మెట్లయ్యెను' అను ప్రశ్నకు సమాధానము లభించిన దనుకొండు. అప్పుడు పరిపూర్ణవస్తువు పరిపూర్ణముగనే ఉండునా? అదియు అపరిపూర్ణమే అయిపోయినది! సామాన్యభాషలో ''ఎఱుక'' అనుమాట కర్థ మేమి? మన మనస్సున కవగతపడుట అనియేగదా. మనస్సున కవగతపడక మించియుండునది ''ఎఱుక'' ఎట్లగును? పరిపూర్ణవస్తువు మనస్సున కెఱుకపడినచో అది మనస్సుచేత పరిమితమై యుండవలెను. అట్లైనచో అది ఇంకను పరిపూర్ణ మెట్లగును? పరిమితవస్తువులుమాత్రమే మనస్సున కవగతపడును. కాన, 'పరిపూర్ణు నెఱుగుట' అను వాక్యమే అసంబద్ధము. దానియందే భావవిరుద్ధత కలదు. కావుననే ఈ ప్రశ్నకింతవఱకు సమాధానము లభింపలేదు. లభించినచో పరిపూర్ణుడే నిలువడు. మానవబుద్ధిలో ఇమిడిన దేవుడు మనవలె పరిమితుడైన మానవు డగునుగాని ఇంకను దేవుడుగ నుండునా? అతని నెఱుగుట అసాధ్యము. అత డెప్పుడును అజ్ఞేయుడే.

కాని అద్వైతమతప్రకార మతడు 'జ్ఞానాతీతుడు' ఈ మహత్తరవిషయమును మనము గ్రహింపవలెను. అజ్ఞేయవాదులు

కూడ భగవంతుడు అజ్ఞేయుడందురు. వారి భావము సరియే అని మీరు తలంపరాదు. ఈ దృష్టాంతమును చూడుడు: ఈ కుర్చీ మనకు తెలియుచున్నది. ఇది జ్ఞాతము. ఆకసమున కావల ఏమి కలదో, అచట మానవు లుందురో ఉండరో, అను విషయము అజ్ఞేయముగా నుండవచ్చును. ఈ యర్థమున భగవంతుడు జ్ఞాతుడు కాడు, అజ్ఞేయుడు కాడు. అతడు "జ్ఞాతము" కన్న అధికుడు. భగవంతుడు 'అజ్ఞాతుడు', 'అజ్ఞేయుడు' అనుటకు సరియైన అర్థమిది. కొన్ని విషయములనుగూర్చి "ఇవి 'అజ్ఞాతములు', 'అజ్ఞేయములు' అందుమే", ఆ యర్థము కాదు. భగవంతుడు "జ్ఞానాతీతుడు". ఈ కుర్చీ జ్ఞాతవస్తువు. కాని భగవంతుడు దీనికన్న నెన్నోరెట్లధికుడు. ఏలన, ఆయనయందే, ఆయన ద్వారానే, ఈ కుర్చీ ఉనికి మనకు జ్ఞాతమగును. జ్ఞానమంతటికిని ఆయన సాక్షి, నిత్యసాక్షి. మన మేమి ఎఱిగినను; ఆయనయందే, ఆయన ద్వారానే ఎఱుగవలెను. అతడు మన ఆత్మసారము. ఈ "అహము" నకు, ఈ "నేను" కు అతడే సారము. అహంతయందే, మన కేది తెలియవచ్చినను! అహంత మూలముగనే గదా, అనగా, మీ రేది ఎఱిగినను, బ్రహ్మమునందే, బ్రహ్మము మూలముగనే, ఎఱుగవలెను. ఈ కుర్చీని భగవంతునందే, భగవంతుని మూలముగనే, ఎఱుగవలెను. కావున భగవంతు డీ కుర్చీకన్న మన కెన్నోరెట్లు దగ్గఱ. కాని ఎన్నోరెట్లు ఉన్నతుడుకూడ. అతడు జ్ఞాతుడు కాడు, అజ్ఞాతుడును కాడు. కాని రెంటికన్న అపారముగా అధికుడు. అతడే మీ ఆత్మ. "ఆ శుభమూర్తి ఈ ప్రపంచమున నిండియుండనియెడల, ఇం దెవ్వడైన ఒక్క క్షణమాత్రము జీవింపగలడా? ఒక్కమారైన ఊపిరి పీల్వగలడా?" అతనియందే, అతనిద్వారానే, గదా మనము జీవించుచున్నాము, ఊపిరి పీల్చుచున్నాము. అత డెచ్చటనో నిలిచి నా నాళములలోని రక్తమును ప్రవహింపజేయుచున్నా డని కాదు దీని అర్థము. అతడు దీని యంతటికిని

మూలసత్త్వమని, నా ఆత్మ కతడే ఆత్మయని దీని కర్థము. అతని నెఱుగుదుమని మీరు చెప్పనే చెప్పజాలరు. అట్లనుట అపచార ప్రాయమగు అసత్యము. మీరు మీలోనుండి బైటికి పోజాలరు గాన మీ రతని నెఱుగుట అసాధ్యము. జ్ఞానము విషయీకరణము. ఇందు కుదాహరణము : జ్ఞప్తిచేసికొనునప్పుడు మన మెన్నో వస్తువులను మనలోనుండి బైటికివిసరి విషయీకరించుచు (దృశ్యవస్తువులుగాచేసికొనుచు) ఉందుము. జ్ఞప్తియంతయు, నేనుచూచిన నే నెఱిగిన వస్తువులన్నియు, ఉండునది నా మనస్సులోనే. ఆ వస్తువుల ఆకృతులు, అవి కల్పించిన భావములు, నా మనస్సునందే ఉన్నవి. వానిని గూర్చి తలంప నెంచుచో, వానిని గ్రహింప నెంచుచో, నా ప్రథమ కార్యము ఆ ఆకృతులను, ఆ ముద్రితభావములను, ప్రక్షేపించుటయే. భగవంతుని విషయమున ఈ విషయీకరణము అసాధ్యము. మన ఆత్మకు సారభూతుడగు వానిని ప్రక్షేపించు టెట్లు? "నీ ఆత్మకు మూలమగు అతడే సత్యము. అతడే ఆత్మ; శ్వేతకేతూ, నీవే అది" అను అత్యంత గంభీర సత్యము ఉపనిషత్తులో కలదు. "నీవే భగవంతుడవు" అను వాక్యమున కిదియే అర్థము. అతని నితరవిధముగా నిర్వచించుట అసాధ్యము. తండ్రిగా, సోదరుడుగా, ప్రాణమిత్రుడుగా, వర్ణింపజూచువా రెల్ల విషయీకరణప్రమాదము పాలగుచున్నారు. సర్వమున కతడు అనంతవిషయి (ఎటర్నల్ సబ్జెక్ట్) నే నీ కుర్చీని చూచుచున్నాను. కావున దీనికి నేను విషయిని (ద్రష్టను). అట్లే భగవంతుడు నా ఆత్మకు నిత్యవిషయి, నిత్యద్రష్ట. మీ ఆత్మలకు సారభూతు డగువానిని, సర్వమునకు మూల సత్యమగువానిని, విషయీకరించి, ఇతరవస్తుభావముతో చూచు టెట్లు? కావున, నే నిప్పటికే చెప్పినట్లు "అతడు జ్ఞేయుడు కాడు, అజ్ఞేయుడును కాడు; కాని రెంటికన్న అపారముగా అధికుడు." మన ఆత్మయే అతడు; అనగా అతడును మనమును ఒకటియే. కావున మన కతడు జ్ఞేయుడు కాడు, అజ్ఞేయుడును

కాదు. జ్ఞేయు డేల కాడనగా, మీరు మీ ఆత్మను బైటికి తీసి దృశ్యవస్తువుగా చేసికొనజాలరు గనుక. అది మీరే యైనప్పుడు, దానిని విడదీయు టెట్లు? అజ్ఞేయుడేలకా డనగా, మీకన్న మీకు తెలిసిన వస్తు వేది కలదు? మీ జ్ఞాన మంతటికిని కేంద్రస్థాన మాత్మయే గదా. ఇదే అర్థమున భగవంతుడు అజ్ఞేయుడు గాడు, జ్ఞాతుడును కాడు, కాని రెంటికన్న అత్యధికుడు. భగవంతు డనగా సత్యమైన మన ఆత్మయేకదా.

ఇప్పటికేర్పడ్డవిషయము లేమనగా: 'మొదటిది, "అఖండవస్తు వెట్లు కలిగినది అను ప్రశ్నలో తన్నుతానుఖండించుకొను దోషము కలదు." రెండవది, అద్వైతవేదాంతమునగల భగవంతునిగూర్చిన భావము మనమును అతడును అభిన్నుల మనియు, అందుచే మన మతనికి ఇతరత్వ మాపాదించి, విషయీకరింప నేరమనియు. మన మది ఎఱిగియున్నను, ఎఱుగకున్నను, అతనిలోనే మన జీవనము, అతనిలోనే మన వ్యాపారములు. మన మెప్పు డేమి చేసినను, అతని ద్వారానే.' ఇక దేశకాలనిమిత్తము లనగా నేమో విచారింతము. అద్వైత మనగా ఏకత్వము: ఉండున దొకవస్తువే, రెండవ దేదియు లేదు. కాని ఈ దేశకాలనిమిత్తము లావరించుటవలన అద్వయుడు బహురూపుడై కానిపించుచున్నాడను వాదముకలదు. కావున నిప్పుడు రెండువస్తువు · లేర్పడుచున్నవి: అఖండుడు, మాయ (దేశకాలనిమిత్తముల సమష్టి నామము). ఈ రెండువస్తువు లున్నవను మాట చాలసత్యముగనే తోచును. కాని రెండు అనుట ఎట్లు పొసగునని అద్వైతి ప్రశ్నించును. బ్రహ్మము వలె సర్వ స్వతంత్రమై ఏ శక్తికిని లొంగకుండు రెండు వస్తువు లేవి? అట్లుం డుట సాధ్యమా? దేశకాల నిమిత్తములకు స్వతంత్రమగు అస్తి త్వము కలదా? కాలమున కట్టి ఉనికి లేనే లేదు. మనస్సు లోని ప్రతిమార్పుతోను అది మాఱుచుండును. కలగాంచువాని కొక్కొకసారి యెన్నో యేండ్లు గడపినట్లు తోచును. ఒక్కొక్క-

సారి యెన్నో మాసము లొక్క నిమేషమాత్రముగా తోచును. అనగా, కాలము మన మనోవృత్తులపై నాధారపడినది. ఒక్కొక సారి కాలస్ఫూర్తియే నశించుటకూడ గలదు. దేశముకూడ అట్టిదే. అది ఏమైనది మన మెఱుగజాలము. అది అనిర్వాచ్య మనియు, ఇతరవస్తువులపై ఆధారపడని ప్రత్యేకపు ఉనికి దానికి లేదనియు, మాత్రము మన మెఱుగుదుము. నిమిత్తత కూడ ఇట్టిదే.

దేశకాలనిమిత్తములు మూటిలోను ఒక విశేషము కలదు. ఇతరవస్తుసంబంధములేని ప్రత్యేకపు ఉనికి వానిలో దేనికిని లేదు. ఏ రంగు లేక, ఏ హద్దులు లేక, పరిసర వస్తువులతో సంబంధము లేక, యుండు దేశమును ప్రత్యేకించి భావింప గలరేమో ప్రయత్నించి చూడుడు. అది మీవలన కాని పని. రెండు హద్దుల నడిమిదిగనో, మూడు వస్తువుల మధ్య నిమిడినది గనో, భావింపవలసివచ్చును. ఏదో ఒక వస్తువుతో సంబంధము కల్పించినగాని దానికి ఉనికియే ఉండదు. కాలము విషయముకూడ ఇంతే. రెండు సంఘటనలను కైకొని, ఇది ముందు ఇది వెనుక అని సంబంధపఱచిన గాని, కాలము రూపుదాల్పదు. దేశ నిర్ణయ మునకు బాహ్యవస్తుసంబంధ మెట్లవసరమో, కాల నిర్ణయ మునకు రెండుసంఘటన లట్లే అవసరము. ఇక నిమిత్తతకు దేశకాలములతో అవినాభావసంబంధము కలదు. స్వతంత్రమగు ఉనికి లేమియే ఈ మూటిలో గల ప్రత్యేకధర్మము. ఈ గోడకు, ఈ కుర్చీకి, గల ప్రత్యేకఅస్తిత్వముకూడ వీనికి లేదు. అన్నిటి నావరించి యుండియు, తాక నలవిగాని నీడల వంటి వవి. వానికి వాస్తవమగు ఉనికిలేదు నిజమే గాని, అవి లేవు అనగలమా? వాని ద్వారానే గదా ఈ వస్తుప్రపంచ మంతయు మనకు గోచరించుచున్నది! ఇప్పుడు తేలిన మొదటి విషయ మేమనగా, ఈ దేశకాల నిమిత్తతలసంయోగమునకు అస్తిత్వము గాని, అనస్తిత్వముగాని లేదనుట. రెండవవిషయ మిది యొక్కొక్కప్పుడు అదృశ్యమగు

ననుట. ఇందు కొక ఉదాహరణము. సముద్రముపై నొక తరంగము కలదు. అది సముద్రమునకన్న భిన్నము కాదని మనకు నిస్సంశయముగా తెలియును. కాని దానిలో "తరంగము" అను భిన్నతకూడ కలదు. ఈ భేదమునకు మూల మేమి? నామరూపములే: అనగా మనస్సులోని భావమును, ఆకారమును. కాని తరంగరూపమును సముద్రమునుండి ప్రత్యేకపఱచి భావింపగలమా? భావింపనేలేము. సముద్రమునకును దానికిని అవినాభావసంబంధము కలదు. తరంగము అణగిన క్షణముననే రూపమునశించును. కాని ఆ రూపము భ్రాంతిజనితము కాదు. తరంగము ఉండినంతకాలము రూపము ఉండినది. కావున అది చూడక తప్పినదికాదు. ఇది మాయ.

ఇట్లే ఈ ప్రపంచ మంతయు నొక రూపవిశేష మనవచ్చును. నిర్గుణబ్రహ్మమే సముద్రము. మీరు, నేను, సూర్యమండలములు, నక్షత్రమండలములు, మున్నగా గల వన్నియు, ఆ సముద్రతరంగవిశేషములు. ఈ తరంగములు (సముద్రమునుండి) భిన్నములుగా కాన్పించుట కేమి కారణము? రూపమే. ఆ రూపము దేశకాలనిమిత్తములచే కల్పింపబడినది. వీని యన్నిటికిని ఆ తరంగమే ఆధారము. తరంగము అణగుటతోడనే అవి అదృశ్యములగును. ఈమాయను ఏ మానవుడు విడనాడునో వానికది అదృశ్యమగును. అతడు అంతట ముక్తుడగును. ఈ పోరాట మంతయు దేశకాలనిమిత్తములను—ఇవియే మన విముక్తిమార్గము నెల్లప్పుడును అడ్డగించునవి — అంటిపట్టుకొని యుండు అభ్యాసమును జయించుటకే. పరిణామవాదము అన నేమి? దానిలోని రెండు అంగము లెవ్వి? అంతర్నిహితమగు మహామహత్త్వము కలదై, తన మహత్త్వమును వ్యక్తరూప మొందింప యత్నించుచుండు అపరిమితశక్తి యొకటి; పరిసర సన్నివేశములు ప్రతికూలములగుటచే ఆ ప్రయత్నములను విఫలమొనర్చుచుండు సందర్భములు

రెండవది. ఈ పరిసరస్థితులపై విజయము సాధించుకొనుటకా శక్తి వేర్వేఱు శరీరములను దాల్చుచుండును. కీటాణువు (అమీబా = ప్రాథమికదశలోని సూక్ష్మజీవి) ఈ పోరాటములో ఆగజాలక మఱొకశరీరము నంది, కొన్ని నిరోధములను జయించును. అటు పిదప మఱొక శరీరమును, ఆ పిదప నింకొకశరీరమును, ఇట్లు వేర్వేఱు శరీరములు ధరించుచు పోయి పోయి, చివరకు మానవుడగును. ఈ పరిణామవాదము నింతటితో ఆపక, దాని తార్కిక పరమావధికి కొనిపోయినచో, ఆ సూక్ష్మాతి సూక్ష్మజీవి రూపము నుండి మనుష్యరూపమువఱకు పరిణమించిన ఆ మహాశక్తి, ప్రకృతి కల్పించు అంతరాయము లన్నిటిని కాలక్రమమున విజయవంతముగా నెదుర్కొని, చివరకు ప్రకృతిపరిసరముల నన్నిటిని తప్పించుకొని, విముక్త మగునుగదా! ఈ భావము నాధ్యాత్మికభాషలో తెలిపినచో, "ప్రతి కర్మమునకు విషయము, విషయి అను రెండు అంగములుండును; జీవితమునకు ఏకైకలక్ష్యము విషయికి విషయముపై పూర్ణాధికారము కల్పించుటే" అని యగును. ఇందు కొక ఉదాహరణము: న న్నొకడు కసరి మాటలాడుటచే నా మనస్సు నొచ్చుకొన్నది. అప్పుడు నే నేమిచేయుదును? పరిసర సన్నివేశము లెట్టివైనను, నొవ్వకుండు శక్తిని ఆర్జించుకొనుటకై ప్రయత్నింతును. అప్పుడు వాని యిచ్చవచ్చినట్లు వాడు మాటలాడుకొ వచ్చును. నేను చలింపను. విజయార్థమై మన మందఱము చేయు సాధన యిట్టిదే. నైతికప్రవర్తన మనగా నేమి? విషయికి పరమాత్మతో సామరస్యము కల్పించి, అనిత్యప్రకృతిదాస్యమునుండి విముక్తినొందుబలము నతనికి చేకూర్చుటేగదా. ఈ ప్రకృతి అనంత వస్తువుకాదు గనుక, మన పరిసరముల నన్నిటిని మనము జయింపగల దినము వచ్చియే తీఱుననుట మా వేదాంతమత సిద్ధాంతము.

మనము గ్రహింపవలసిన మఱియొక విషయము కలదు. ప్రకృతి అనంతముకాదని మన కెట్లు తెలియును? తత్త్వవిచార

మూలమున మాత్రమే మన కది బోధపడును. పరిచ్ఛిన్నమైన అఖండపదార్థమే ఈ ప్రకృతి. కావుననే దీని కాద్యంతములు కలవు. అందుచే ఈ పరిసరముల నన్నిటిని మనము జయించు దినము వచ్చియే తీఱవలెను. కాని జయించుట యెట్లు? మనచుట్టు గల వస్తుకోటి నంతయు జయించుట సాధ్యమా? కాదు, అది అసంభవము. నీటిలోని తన శత్రువర్గమునుండి చేఱు చేప తప్పించుకొన జూచును. ఆ కోరిక నది యెట్లు సాధించుకొనును? రెక్కలుగల పక్షిగా పరిణమించుటవలన, తన పరిసరములగు నీటినిగాని, గాలినిగాని మార్చుటవలన కాదు. అనగా, మార్పు ఎప్పుడును విషయియందే కలుగవలెను. లోకమున గలుగు పరిణామక్రమము నంతయు విచారించిచూచినచో, విషయిలో కలుగు మార్పువలననే ప్రకృతిపై విజయము చేకుఱుచుండునని తెలియవచ్చును. ఈ ధర్మము నైతికజీవితమునకును, ఆస్తిక ధర్మజీవితమునకును, కూడ అన్వయించును. కీడుపైని విజయమున కంతయు విషయిలో కలిగిన మార్పే కారణముగా నుండును. కావున అద్వైతవేదాంతము మానవుని ఆంతరంగిక పరివర్తనమునకు అత్యంత ప్రాముఖ్యమిచ్చుచున్నది. దురాకృతములు, క్లేశములు, అనుటంతయు అర్థరహిత ప్రసంగము. అవి మీా వెలుపల లేవు. కోపమున కేమాత్రమును తావీయకుండునంతటి మనోదార్ఢ్యము నాకున్నచో, నాకు కోపమెన్నడును రానేరదు. అట్లే ద్వేషమున కభేద్యుడనై యున్నచో నాకెన్నడును ద్వేషము కలుగజాలదు.

కావున 'మన పరిసరములను జయించు టెట్లు?'' అను పై ప్రశ్నకు ''మన ఆంతరంగిక బలమునకు పరిపూర్ణత చేకూర్చుకొనుట'' అనియే సమాధానము. ఆధునిక పరిశోధనలతో — భౌతికమార్గముననను, ఆధ్యాత్మికమార్గముననను — ఏకీభవించుచు, వానిని మించి మఱికొన్ని అడుగులుకూడ వైచినది అద్వైతమత

మొక్కటియే యని నేను చెప్ప సాహసించుచున్నాను. అందుచేతనే ఆధునికశాస్త్రజ్ఞులకా మతము నెడ మిక్కిలి ఆదరము కలదు. తొల్లిటి ద్వైతమతములు వారిని తృప్తిపఱుపలేదు. వారి పరీక్ష కవి ఆగకపోయినవి. మనుష్యునకు విశ్వాస ముండవలె ననుట నిక్కమే! కాని కేవల విశ్వాసము చాలదు. బుద్ధి సంయుక్తమైన విశ్వాస మవసరమైనది. ఇప్పుడు — ఈ 19-వ శతాబ్దాంతమున — తమ అనాది సిద్ధమతమునకు సంబంధింపని మతములెల్ల అసత్యములు అని బుద్ధిపాటవముగలవా రెవ్వరును చెప్పరు. ఇట్టి అపరిపక్వ భావముల నిప్పటికైన విసర్జింపవలెను. ఈ హితోపదేశము మీ దేశమునకే గాక అన్ని దేశములకును అన్వయించును. అన్నిటికన్న నెక్కువగా మా దేశమున కన్వయించును. అచట ఈ అద్వైతమతమును జనసామాన్యమునకు అందనీయలేదు. మొదట అది కొందఱు తాపసులకు లభించెను. వారు దాని నరణ్యములలో తాము నిర్మించుకొన్న ఆశ్రమములకు కొనిపోయిరి. దాని కందుచే "ఆరణ్యక తత్త్వశాస్త్రము" అను నామము సిద్ధించినది. దైవానుగ్రహమువలన బుద్ధు డవతరించి దానిని జనసామాన్యమునకు విచ్చలవిడిగా బోధించెను. దేశజనులందఱును దాని నంగీకరించి బౌద్ధులైరి. కాలాంతరమున నాస్తికులును, అజ్ఞేయవాదులును, బయలువెడలి జనులకు మతిభ్రష్టత కల్పించుటచే, అనాత్మవాద పరమై కూలిపోవ నారంభించిన దేశమును మరల అద్వైత మతమే పునరుద్ధరించినది.

కావున అద్వైతమతము అనాత్మవాదకూపమునుండి హిందూమతమును రెండుసార్లు సంరక్షించినది. ఈ అనాత్మవాదము బుద్ధుని రాకకు ముందు భయంకరవ్యాప్తి నొంది యుండెను. ఈకాలపు అనాత్మవాదముకన్న అది యెంతో ఘోరము, ఎంతో వికృతము. ఇప్పటి అనాత్మవాదులకును నాకును ఒక విధ

ముగు ఏకీభావము కలదు. కలది ఒక్క వస్తువనియే నామతము కూడ : అది ఆత్మయని నా వాదము, భౌతిక (జడ) పదార్థమని వారి వాదము. మనకుగల విశ్వాసము, ఆస్తికత : సర్వమును, జడపదార్థము నుండియే కలిగెనని వారును, బ్రహ్మము నుండియే కలిగెనని నేనును చెప్పుదుము. బుద్ధుని పూర్వపు అనాత్మవాదమున ఇంతమాత్రపు అనుకూలతకూడ లేదు. "తినుడు, త్రాగుడు, ఉల్లాసముగా బ్రదుకుడు. భగవంతుడు లేడు, ఆత్మ లేదు, పుణ్యలోకము లేదు. ఆస్తికధర్మము దుష్టులగు మతాచార్యులును, పూజారులును కల్పించిన బూటకము" అనునది వారి బోధ. "బ్రతికినంత కాలము సాధ్యమైనంత సుఖమనుభవింపవలెను. అప్పు తెచ్చియైనను తినుచుండవలెను. అప్పు తీర్పక పోయినను, పోనిండు". ఈ మత మపారముగా వ్యాపించిపోయినది. దాని కిప్పటికి "లోకాయతదర్శనము"* అని పేరు. బుద్ధుడు వేదాంతమతమును బహిరంగపఱచి, జనులకు బోధించి, హిందూదేశమును కాపాడెను. ఆయన నిర్యాణానంతరము వేయిసంవత్సరములకు తొంటి దుఃస్థితియే మరల దాపురించెను. అప్పటి బౌద్ధమతములో వెంగలి మూకలు, సామాన్యప్రజలు, ఇబ్బందులో ఉండుటచేతను, వారిలో నెక్కువపాలు అజ్ఞానమున మునిగియుండుటచేతను, బౌద్ధమతము కాలక్రమమున చెడుత్రోవలలోబడి గుణహీన మయ్యెను. బౌద్ధమతమున దేవుడుగాని, జగత్పరిపాలకుడుగాని లేకపోవుటచే, జనులు క్రమక్రమముగా వారి తొల్లిటి దేవుండ్లను, తొల్లిటి పిశాచములను, తొల్లిటి భూతములను, మరల బయటకు తీసి, బౌద్ధమతము పేరిటనే "కలగూరగంప" యైన బీభత్సమతము నొకదానిని ఆచరణలోనికి తెచ్చిరి. అగ్రజాతులలో విచ్చలవిడి నడతగాను, హీనజాతులలో మూఢవిశ్వాసరూప

* చార్వాకులకు "లోకాయతు" లను నామాంతరముకలదు. "లోకమున వ్యాప్తిగాంచిన మతము" అగుటచే లోకాయతదర్శనమను నామము వచ్చినది.

మునను, అనాత్మవాద మతము మరల వ్యాప్తమయ్యెను. అంతట శంకరాచార్యు డవతరించి, వేదాంతమతమునకు మరల ప్రాణము పోసి, దానికి హేతుబద్ధరూపము కల్పించెను. ఉపనిషత్కర్తలు తమ అభిప్రాయముల కంతగా కారణములు వివరింప లేదు. వేదాంత మతమును నైతికదృక్పథమునుండి చూచి బుద్ధుడును, వైజ్ఞానిక దృక్పథమునుండి చూచి శంకరుడును, తమ బోధలు కావించిరి. శంకరాచార్యు డా మతమును అతిజాగ్రత్తతో పరిశీలించి, వాదము లన్నిటికిని కార్యకారణరూపసంబంధమును కన్గొని, దానిని విపులీకరించి, అత్యద్భుతమగు అద్వైతమతమును లోకుల యెదుట పెట్టెను.

యూరోపులో నిప్పుడు అనాత్మవాదము వ్యాప్తిలో నున్నది. ఈ సంశయాత్ములు వినాశ మొందకుండ మీరు వారికై భగవంతుని ప్రార్థింపవచ్చును. కాని వా రంత మాత్ర మున జంకి లొంగిపోరు. హేతువాదముగాని వారిని తృప్తి పఱపదు. యుక్తియుక్తమగు మత మొక్కటే మీ దేశము నుద్ధ రింపగలదు. తార్కికబుద్ధికి ఆగగలమతము — అభిన్నత్వమును, ఏకత్వమును, నిర్గుణత్వమును బోధించు మతము — అద్వైత మొక్కటే. ఆస్తికత క్షీణత నొంది, అధర్మము అభి వృద్ధినొంద నారంభించునప్పు డెల్ల, ఈ అద్వైతమత మరు దెంచును. కావుననే యూరోపు అమెరికాఖండములలో నది నాటుకొనినది.

అద్వైతవేదాంతమునుగూర్చి ఇంకొకమాట చెప్పెదను. తొంటికాలపు ఉపనిషత్తులలో అత్యున్నత కవితా మహా త్త్వము కలదు. మహితభావసందీపిత కవితచే మానవులకు దివ్యభావోద్వేగము కలుగునని ప్లేటో చెప్పియున్నాడు. కావుననే కాబోలు, కవితామూలమున లోకమును దివ్యభావప్రదీప్త మొనరించుటకై, మానవాళికి — సత్యమును జూపుటకై మహర్షులు, మానవాతీతులై మంత్రద్రష్టలై, యథార్థద్రష్టలై

యొప్పిరి. వా రెన్నడును ఉపన్యసింపలేదు, దార్శనిక విచార ములు చేయలేదు, గ్రంథములు రచింపలేదు. కాని వారి హృదయములనుండి మనోహరగానరస ముబికి వెల్లి విరియు చుండెను. బుద్ధుని హృదయము విశ్వమానవకల్యాణాత్మకము. ఆయన ఓరిమి మేరలేనిది. ఆయన బోధించినది జనసామాన్య మునకు ఆచరణయోగ్యమైన తేటతెల్లమగు మతము. దాని నాయన ఇంటింటికి గొంపోయెను. శంకరాచార్యుని బుద్ధిపాటవము వర్ణనాతీతము; ఆయన తార్కికశక్తి అత్యంత తీక్ష్ణము. విశ్వమానవ ప్రేమకారుణ్యములతో పొంగారు బుద్ధుని హృదయము, తేజోదుర్నిరీక్ష్యమగు శంకరునిబుద్ధి, నేడు వియ్య మందవలెను. ఆ సంబంధమువలన అత్యున్నత తత్త్వజ్ఞానము వెలువడగలదు. అప్పుడు భౌతికశాస్త్రములకును ఆస్తికధర్మమున కును వైరమునశించి, సఖ్యము చేకుఱగలదు. కవిత్వమునకును, తత్త్వశాస్త్రమునకును, చెలిమి కలుగగలదు. భావికాలపు మత మిదికాగలదు. దీనికి మనము రూపేర్పఱింపగలిగితిమేని, ఆ మతము సార్వకాలికమై, సార్వలౌకికమై, నిలిచియుండుట నిస్సంశయము. ఆధునికభౌతికశాస్త్రము లిప్పటికే చాలవఱకు త్రోవను పట్టిన వగుటచే, వాని కిట్టి మతము మాత్రమే సమ్మతము కాగలదు. లోకములోని సర్వవస్తువులును ఒక్కశక్తిదాల్చిన వ్యక్తరూపములే అని భౌతికశాస్త్రజ్ఞు డన్నప్పుడు, ఉపనిషత్తులలో ప్రతిపాదింప బడిన భగవంతుడు మన జ్ఞప్తికి రాడా? "జగత్తులో ప్రవేశిం చిన ఒక్క అగ్నియే అనేక రూపము లొంది కానిపించు తెఱగున, ఆ సర్వభూతాంతరాత్మ యొక్కటే ఇన్ని యాత్మలుగా భాసించు చున్నది. అంతటితో అది ముగిసిపోక, ఇంకను అనంతముగనే మిగిలియున్నది." భౌతికశాస్త్రమే త్రోవను సాగుచున్నదో తెలిసినదిగదా. తత్త్వశాస్త్రముద్వారా హిందూజాతి మన శ్శాస్త్రాంశములను హృదయంగమ మొనరించుకొనిరి. యూరోపు దేశస్థులు బాహ్య (జడ) ప్రకృతితో నారంభించి పరిశీలనము చేసిరి.

కాని ఇప్పుడు వారును అదే నిశ్చితార్థమునకు వచ్చిరి. అనగా, మానసికపరిశోధనద్వారా మనము చివరకు ఆ యేకత్వమును, ఏ విశ్వాత్మని, ఏ సర్వాంతర్యామిని, ఏ సర్వవస్తుసత్త్వమును, ఏ సర్వ వస్తు సత్యమును, ఏ నిత్యముక్తుని, ఏనిత్యానందుని, ఏ నిత్యుని, చేరుదుమో, భౌతికశాస్త్రపరిశోధనల ద్వారాకూడ మన మా ఏకత్వమునే చేరుదుము. అఖిలప్రపంచమూలమగు నొక్క శక్తియే సకలచరాచరరూపమున కానిపించుచున్నదనియు, మానవజాతి నడుచునది విముక్తిమార్గమునగాని దాస్యమార్గమున కాదనియు, భౌతికశాస్త్రములు బోధించుచున్నవి. మానవుడు నీతిమార్గమున నేల నడువవలెను? ఆ మార్గము బంధవిమోచనమునకును, అవినీతి మార్గము దాస్యమునకును గొనిపోవును గనుక.

అద్వైతమతములో మఱొక విశిష్టత కలదు. అది విధ్వంసనమార్గము నెప్పుడును పట్టి యెఱుగదు. ఇంకొక అద్భుత విశేష మేమనగా: "ఎవ్వరికైనను—అజ్ఞానముచే క్షుద్రరూపారాధనలం దాసక్తులైనవారికైనను — వారి విశ్వాసములను చలింపజేయరాదు. చలింపజేయుటకు మాఱు, వారిని క్రమక్రమముగా ఉన్నతమార్గములు పట్టునట్లు చేయవలెను. ఇతడని అతడని చూడక, భేదములు పాటింపక, అందఱికిని తోడ్పడుచుండవలెను" అను బోధ. అద్వైతమున ప్రతిపాదింపబడిన దైవము సమష్టి స్వరూపుడు. సర్వమును ఆ దైవములోనివే. ప్రతిమానవునికి అనుకూలించు విశ్వజనీనమతము నన్వేషించువారు కొన్ని మతములను మాత్రమే దృష్టిపథమున నుంచుకోరాదు. సర్వమతములును అందు చేరునట్లు చూడవలెను. అనగా, అది ప్రాథమికములు మొదలు పరిపక్వములవఱకు, అన్ని తరగతుల మతములకును అన్వయించు సమష్టిస్వరూపము కలదిగా నుండవలెను.

ఈ ఆశయము మఱి యే యితరమతమునందును స్పష్టముగా కానరాదు. ఆ మతము లన్నియు అంశములే, సమష్టిస్వరూప

మొందుటకై పాటుపడుచున్నవే. అంశముల యునికి ఈ సమష్టిత్వముకొఱకే. కావున అద్వైతమత మెప్పుడుగాని హిందూదేశములోగల వివిధభిన్నమతములతో కలహింపలేదు. ఆ దేశములో ఇప్పు డెందఱో ద్వైతులు కలరు. వారి సంఖ్యయే అత్యధికము. బుద్ధిపరిణతి నొందనివారి కా మతమే కదా సరియని తోచును! 'ప్రపంచము అనుట కదియే గదా సులభమును, స్వాభావికమును, సామాన్యబుద్ధిగోచరమును అగు అర్థము. కాని అద్వైతులకు వారితో కలహము లేదు. ఈశ్వరుడు జగత్తు బైట నెక్కడనో పుణ్యలోకమున నున్నాడని ద్వైతియు, తన ఆత్మయే ఈశ్వరుడు, ఆయన దూరగతు డనుట అపచారమని, దోషభూయిష్టప్రసంగమని అద్వైతియు, పల్కుదురు. అద్వైతికి భేదభావమే దుస్సహము. సమీపవస్తువు లన్నిటికన్న ఆయన సమీపస్థుడు. "ఏకత్వము" అనుటకన్న ఆ సామీప్యమును తెలుపగల మాట ఏ భాషలోను లేదు. తక్కిన ఆశయములన్నియు అతనికి అసంతృప్తికరములే. కాని ద్వైతి కిట్టి తలంపు ఘోరాపచారముగను, దుస్సహముగను తోచును. అయినను, అద్వైతి ద్వైతితోకలహింపడు. ఇతరాభిప్రాయములుండుటసహజమే అనియు, ఆ త్రోవ సరియైనదే యనియు, అతడు తలచును. 'ద్వైతి కనేకత్వము కన్పించియే తీఱవలెను. అదియే అతనికిస్వాభావికము. కావున నతని నట్లే చూడనిమ్ము' అని అద్వైతి తలంచును. అతని వాదము భిన్నమైనను, అతడుకూడ తన గమ్యమునకే గదా పయనించుచున్నాడు! ద్వైతి ఇ ట్లేమాత్రమును తలపడు. అతని దృక్పథము నుండి ఇతరభావము లన్నియు తప్పులే. ద్వైతులందఱును—ప్రపంచములో నెక్కడివా రైనను—సగుణబ్రహ్మమునే నమ్ముదురు. ఇందు వింత యేమి కలదు? ఆ దైవమునకు కేవలమానవలక్షణములే. ఆ మహాప్రభు డొకనియెడ సుముఖుడు, మఱొకని యెడ విముఖుడు. అకారణముగా నత డొక్కొక్కనియెడ, ఒక్కొక్కజాతియెడ, పక్షపాతము వహించి, వారిని తన యను

గ్రహమున ముంచి తేల్చును. ఇందుచే భగవంతునికి కొందఱు ఇష్టు లుందురని ద్వైతికి నమ్మకము కలుగును. తా నందులో నొకడు కావలెనని అతనికి కోరిక. "మా దేవునికి మాపై అనుగ్రహము. మా మతమును నమ్మినవారికిగాని ఆయన అనుగ్రహము లభింపదు" అను నాశయ మించుమించు అన్ని (ద్వైత) మతములందును కలదు. దైవానుగ్రహ మొందు నదృష్టముతో జన్మించిన యేకొలదిమందియో తప్ప తక్కినవారు తలక్రిందుగా తపస్సుచేసినను తరింప జాల రను దృఢవిశ్వాసము గల ద్వైతులు కూడ కొందఱు కలరు. "తరింపగోరువారికి మా మత మొక్కటే మార్గము" అను విశ్వాసము కొద్దిగనో గొప్పగనో ప్రకటింపని ద్వైతమత మొక్కటియైనను లేదని పందె మొడ్డి వచింపవచ్చును. కావుననే ద్వైతమతము లొండొంటితో నిరంతర యుద్ధములు సల్పుచుండుట. ఇట్లుండకపోవుట స్వభావవిరుద్ధము గదా! మఱొక విషయము. ద్వైతులు పామరజనుల నుబ్బించి లోకాదరణ మందుట వాడుక. తమకు కొన్ని అసాధారణాధికారములు, ప్రత్యేకమైన హక్కులు కల వనుకొనుట వారి కిష్టము. చేత బెత్తముపట్టుకొని, కొట్టుటకు సిద్ధముగానుండు భగవంతు డొక డున్నగాని, మానవులు నీతిపథమున నడవజాలరని ద్వైతి తలచును. ఆలోచించుకొలేని పామరజనులు ప్రాయికముగా ద్వైతులు గనే ఉందురు. ఎన్నో వేలేండ్లు పాప మీ సామాన్య జనులు ప్రతిదేశమునందును హింసల పాలయియున్నారు. కావున "తరించుట" అను మాటకు హింసాభయవిముక్తి యనియే వారి యర్థము. "ఏమీ! మీ మతమున సైతాను లేడా? అదెట్లు సాధ్యము?" అని అమెరికా దేశ క్రైస్తవ మతప్రచారకు డొకడు నన్నడిగెను! కాని ప్రపంచమున జన్మించిన లోకోత్తరపురుషు లందఱును అత్యున్నతమగు నిర్గుణదైవమునే అవలంబించిరి. "నేనును, నా తండ్రియు అభిన్నులము" అని పల్కిన మహాపురుషుని శక్తియే లక్షోపలక్షుల జనులకు సంక్రమించినది. ఎన్నో

వే లేండ్లుగా అది నీతిపథమునే చూపుచున్నది. ఆ మహనీయుడు అద్వైతి కావున దయామయుడై యుండెను అని మన మెఱుగుదుము. సగుణదైవమునకన్న పైమెట్టు కెక్కలేని పామరులతో ఆయన "పుణ్యలోకమున నుండు మీ తండ్రిని ప్రార్థింపుడు" అనెను. అంతకన్న కొంత ఉన్నతాశయము గ్రహింపగలవారితో "నేను లత (తీగ) ను, మీరు దాని ఉపశాఖలు (రెమ్మలు)" అనెను. కాని ఎవరిముందు తన తత్త్వమును చాల వఱకు వ్యక్తపఱచెనో ఆ శిష్యులకు "నేనును నా తండ్రియు అభిన్నులము" అను పరమసత్యము నెఱిగించెను.

బుద్ధభగవానునికి ద్వైత దైవములందే మాత్రమును ఆదరములేదు. ఆయన అనాత్మవాది యనియు, నిరీశ్వరవాది యనియు అందురు. కాని ఆ మహాత్ముడు క్షుద్రజీవియగు నొక మేకను సంరక్షించుటకై తన శరీరము నర్పింప సమకట్టెను! ఆయన జగతియందు విస్తరింపజేసిన నైతికధర్మము లత్యున్నతములు. అంతకన్న ఉదారధర్మము లే దేశమునను లేవు. ఎచ్చట పుట్టిన నీతిశాస్త్రమైనను, ఆ మహనీయుని దివ్యతేజములోని కిరణము వంటిదే. ప్రపంచచరిత్రములో అత్యద్భుతమును అగు నూతనయుగ మిప్పుడు ప్రారంభమైనది. ఇప్పటి బుద్ధిపరిపాకము నెవ్వరును నూఱేండ్లక్రిందటకూడ, కలలోనైన, చూచియుండరు. ఇప్పటి వైజ్ఞానిక కల్లోలపరంపర నెవ్వరును ఏబదేండ్లక్రిందటకూడ, కలలోనైన, చూచియుండరు. ఇట్టి ఈ యత్యద్భుతపురోగమనకాలమున, ప్రపంచములోని విశాలహృదయములను సంకుచితపఱచి, స్వల్పపరిమితులలో నిముడునట్లు చేయుట సాధ్యమా? ఇట్లు చేయజూచుట వారిని మృగప్రాయులుగను, బుద్ధివివేకరహితులగు పామరులుగను, చేయుటే. వారి నైతికజీవమును నశింపజేయుటే. అపారహృదయవైశాల్యముతో అత్యున్నతబుద్ధిపాటవము, అనంతకారుణ్యముతో అనంతజ్ఞానము,

సమ్మేళన మొందుటే ఇప్పు డావశ్యకము. భగవంతుని కీ మూడు లక్షణములు మాత్రమే కలవని వేదాంత సిద్ధాంతము : అఖండసత్త (ఉనికి), అఖండచిత్తు (జ్ఞానము), అఖండానందము. ఈ మూడును అభిన్నములని వేదాంతవాదము. చిదానందములులేని సత్త, చిత్తు లేని ఆనందము, ఆనందములేని చిత్తు, ఉండుట అసంభవము. కావున అఖండసచ్చిదానందముల సమ్మేళనమే మనకు కావలసినది. అదియే మన ఆదర్శము. వీని సమత్వము వలయును, అసమత్వము కాదు. శంకరుని బుద్ధియు, బుద్ధుని హృదయమును, సమ్మేళన మొందుట సాధ్యమే. మన మెల్లర మా యత్యద్భుతాదర్శమును, ఆ యుదారాశయసిద్ధిని సాధింప యత్నింతుముగాక అనుటే నా యాశయము.



# "ఈశావాస్యమిదగ్ం సర్వమ్"

(1896 లండనులో ఉపన్యాసము)

మన జీవితములు చాలవఱకు కడలేని విపత్తులలో మునిగి యుండు ననియు, ఆ స్థితిని మార్చుట మన కశక్యమనియు, ఇప్పటికే కన్గొనియున్నాము. ఈ దుఃస్థితిని సరిపఱచుటకై మన మనాదికాలము నుండియు పోరాడుచున్నాము. కాని సర్వము యథాపూర్వముగనే జరుగుచున్నది. ప్రతిక్రియలు సంపాదించు కొలది, దురవగాహములగు క్రొత్త విపత్తు లలముకొనుచుండును. ఈ కష్టములనుండి తప్పించుకొనుట కొక్క మార్గమే కలదని అన్ని మతములును ఒక దైవమును ప్రతిపాదించుటకూడ మన మెఱుగుదుము. ఈ కాలపు "బ్రదుకనేర్చిన బుద్ధిమంతుల" మాట విని ప్రపంచస్థితికి లొంగి ఎట్లో కాలము గడపుకొనుచున్నచో నిష్కృతి లభించదా? అప్పటికిని ఆపదలే మన గతియని మతములు హెచ్చరించుచున్నవి. మతములబోధ యేమనగా: "ఈ ప్రపంచమున కతీతమగున దొకటి కలదు. ఈ పంచేంద్రియజీవితమే, ఈ భౌతిక ప్రపంచజీవితమే, సర్వము అనుట తప్పు. అది యొక స్వల్పాంశము మాత్రమే: అందును స్థూలదృష్టికి తోచు ఉపరిభాగము మాత్రమే. దీనికి మూలమును, దీని కతీతమును, అయి అఖండపరతత్త్వము కలదు. అందు ఆపద లుండవు." దీనిని కొందఱు దైవము, కొందఱు అల్లా, కొందఱు జిహోవా, కొందఱు జోవ్ మున్నగు పేళ్లతో సూచింతురు. వేదాంతి దీనిని బ్రహ్మ మనును.

"మీ రీ శరీరములను చాలించుట మంచిది" అనియేనా మతముల బోధ? పైకి అట్లే తోచును. "ఈ లోకమున గల క్లేశములకు ప్రతిక్రియ ఏమి?" అను ప్రశ్నకు చెప్పబడు సమాధానము "జీవితమును విడనాడుడు" అను నభిప్రాయమునుగల్గించును.

వెనుకటి ఒక కథ చెప్పిన ట్లున్నది ఈ ప్రతిక్రియ. "ఒకని తలపై దోమ వ్రాలెను. వాని మిత్రుడా దోమను చంపుటకై యొక దెబ్బ వేసెను. ఆ దెబ్బకు దోమయేకాక మనుష్యుడుకూడ చచ్చి పోయెనట!" ఈ ప్రతిక్రియలోకూడ ఇట్టి అర్థమే స్ఫురించు చున్నది. జీవితము వ్యథామయము. లోకము అసుఖమయము. బుద్ధి తెలిసినవా డెవ్వడును ఇది కాదనజాలడు.

కాని దీనికి మతములు బోధించు ప్రతిక్రియ యెద్ది? ఈ ప్రపంచ మసత్య మనియు, సత్యమగు ప్రపంచ మొకటి దీని కతీత మైనది కలదనియు కొందరందురు. చిక్కంతయు ఇచ్చటనే. ఈ ప్రతిక్రియ సర్వనాశ మొనర్చునదిగా నున్నది. అట్టిది ప్రతిక్రియ యెట్లు కాగలదు? ఇది తప్పినచో త్రోవయే లేదా? ఈ ప్రశ్నకు వేదాంతము చెప్పు సమాధాన మేమనగా: "మతము లన్నియు చేయు బోధ సత్యమే; నిర్దుష్టమే. కాని దానిని సరిగా అర్థము చేసికోవలెను." అనేకులు దీని నపార్థము చేసికొందురు. మతములలో గల అస్పష్టత యిందుకు కొంత కారణమే గాని, నిజమగు లోపము హృదయబుద్ధుల సమ్మేళనము లేమి. హృదయ మత్యంత మహనీయము. జీవితములోని ముఖ్య ప్రేరణల కదియే ఉత్పత్తిస్థానము. దైవసంపద కది పీఠము. బుద్ధి పరిపూర్ణముగానుండి హృదయము లేకుండుటకన్న, కొంచె మైనను హృదయ ముండి, బుద్ధి బొత్తిగా లేకుండుటయే నూఱింతలు శ్రేష్ఠమని నా అభిప్రాయము. హృదయముగలవాడు బ్రదుకగలడు, అభివృద్ధి నొందగలడు, కాని హృదయశూన్యుని కెంత బుద్ధి యున్నను, అతడు శుష్కజీవియై మరణించును.

కాని హృదయప్రేరణలనే ఆధారముగాగొని జీవించువాడు పెక్కు కడగండ్లపాలగును. గోతులలో కూలు నవకాశము లతనికి మెండు. కావున బుద్ధికూడ దానితో కూడియుండవలెను. అట్లని, హృదయమును తృప్తిపఱచుటకై బుద్ధిగాని, బుద్ధిని తృప్తి

పఱచుటకై హృదయముగాని, అకృత్యముల నంగీకరింపరాదు. ప్రతివాడును అనంతమగు తార్కికబుద్ధితోపాటు అనంతమగు హృదయవైశాల్యసానుభూతులనుకూడ సాధించుకొనవలెను.

ప్రపంచములో మన మార్జించుకొనవలసినవాని కేమైన మితికలదా? ప్రపంచము అనంత మగుటచే, అనంతమగు సాను భూతికిని, అనంతమగు సంస్కృతికిని, అనంతమగు తార్కికశక్తికిని ఈ లోకమున తావుకలదు. కావున అవి అనంతముగా వచ్చు చుండుగాక! మనలో నెల్లప్పు డవి సమాంతరరేఖలబోలె ప్రక్క ప్రక్కల నడుచుచుండుగాక!

ప్రాయికముగా మతములన్నియు ఈ విషయమును గ్రహిం చినవిగాని, అన్నియు ఒక్క ప్రమాదమునకే గుఱియగుచున్నవి. అన్నియు హృదయమునకును, చిత్తవృత్తులకును, అత్యంతప్రాము ఖ్యము నిచ్చును. ''ప్రపంచము దోషమయము. కావున దానిని పరిత్యజింపుము'' అనునదియే బోధ. అది మహానీయము. అది యొక్కటియే సరియైన బోధ. సత్యమును గ్రహించుటకు అసత్య మును విడనాడవలయు ననుట నిర్వివాదాంశము. మంచిని కోరు వార మందఱమును చెడుగును విడనాడవలయు ననుటయు, జీవమును కోరువార మందఱమును మరణప్రాయములను విడనాడ వలె ననుటయు, ఇట్లే నిర్వివాదాంశములు.

నిజమేకాని, ఈ బోధ కర్థము ఇంద్రియజీవితమును విడనాడు మనియే అయినచో, మనకు ఇం కేమి మిగులును? మన మెఱిగిన జీవిత మీ ఇంద్రియజీవితమే గదా! జీవిత మనగా ఇం కేమైన అర్థము కలదా? దీనిని త్యజించిన, ఏమి మిగులును?

వేదాంతములోని ముఖ్యతత్త్వవిచారభాగమునకు వచ్చి నప్పుడు మన కీ విషయము ఇంతకన్న చక్కగా విశదము కాగలదు. ఇప్పటి కీ మాటమాత్రము చెప్పెదను: ఈ సమస్యకు యుక్తి యుక్తమగు పరిష్కారము వేదాంతమున మాత్రమే కలదు.

వేదాంతము బోధింపజూచు పాఠమునుగూర్చి మాత్ర మిచట చెప్పెదను. ప్రపంచమును దైవముగనే చూడవలె ననునదే ఆ పాఠము.

వేదాంతము ప్రపంచమును తూలనాడుననుట నిజము కాదు. వైరాగ్యాదర్శము ఆ మతములో పరమావధి నందినది. ఇది మరెందును కానరాదు. కాని మూలవిధ్వంసకములగు శుష్కమార్గముల నది బోధింపదు. "ప్రపంచము దైవస్వరూపము. మన కన్నులకు, మన సామాన్యబుద్ధికి, తోచు ప్రపంచమును విడనాడి, దాని యథార్థరూపము నెఱుగుడు, దానిని దైవముగా చూడుడు. అది దైవమే." అనునదే వేదాంత బోధ. అత్యంతప్రాచీనమగు ఉపనిషత్తొకటి "ఈశావాస్యమిదగ్ం సర్వం" (ఈ జగత్తులో నుండు సర్వమును ఈశ్వరునితో ఆచ్ఛాదింపవలెను) అను బోధతోనే ప్రారంభమగుచున్నది.

ఈ ఆచ్ఛాదించు టెట్లు? నిరాధారమగు ఆశలను కల్పించుకొనుటచే కాదు; కల దోషములను చూడకుండుటచే కాదు; వాస్తవముగా సర్వమునందును దైవమును చూడవలెను. ఇదియే ప్రపంచమును విడనాడుట. అప్పు డేమి మిగులును? దైవమే. దీని యర్థ మేమి? నీ భార్యను విడనాడ బని లేదు. ఆమె యుండవచ్చును, కాని ఆమెలో దైవమును చూడవలెను. "మీ బిడ్డలను విడనాడుడు" అనగా నేమి? కొందఱు మృగప్రాయులవలె వారి నింటినుండి తఱుమగొట్టుటా? కానే కాదు. అట్లు చేయుట రాక్షస కార్యము, ఆస్తికధర్మము కాదు. నీ బిడ్డలందు దైవమును చూడు మనియే ఆ బోధ కర్థము. ప్రతి విషయమునను ఇట్లే ఆచరింపవలెను. జీవమునందు, మృత్యువునందు; సుఖమునందు, దుఃఖమునందు : అన్నిటియందును దైవము సమముగ నిలిచియుండును. జగత్తంతయు దైవమయము. కనులు విప్పి చూచినచో ఆయనను దర్శింపగలరు. ఇదియే

వేదాంతబోధ. మీ రూహించిన జగత్తును త్యజింపుడు. ఆ ఊహ నిరాధారమైనది. మిక్కిలి అసంపూర్ణమగు మీ అనుభూతి, మీ అసమగ్రతార్కికశక్తి, మీ లోపములు : ఇవియే ఆ ఊహ కాధారములు. కావున దానిని త్యజింపుడు. మనబుద్ధిలో ఇంతకాలముగా నిలిచియున్న జగత్తును, అత్యాసక్తితో మన మంటిపట్టుకొనియున్న జగత్తును, మనము కల్పించుకొన్న అసత్యజగత్తును, త్యజింపుడు. కన్నులు విప్పుడు. మీ రనుకొనుచుండిన రూపమున నది యెప్పుడును లేదని కన్గొనుడు. అది యొక స్వప్నదృశ్యము, మాయ. నిజముగా ఉండినది దైవమే. బిడ్డలోనున్న దతడే, భార్యలోనున్న దతడే, భర్తలోనున్న దతడే; సజ్జనులలోనున్న దతడే, దుర్జనులలోనున్న దతడే; పాపములోనున్న దతడే, పాపిలోనున్న దతడే; జీవములోనున్న దతడే, మృత్యువులోనున్న దతడే.

ఈ సిద్ధాంతము మిక్కిలి అపూర్వముగను, మిక్కిలి ఆశ్చర్యకరముగను తోపవచ్చును. కాని వేదాంతమతము దానిని స్థాపించి, బోధించి, వ్యాపింపజేయ జూచుచున్నది. ఆ మతము బోధించు సత్యములలో నిది మొదటిది.

జీవితములోగల అపాయములను, అశుభములను, మన మీ మార్గముచే తప్పించుకోగలము. కోరికలు త్యజింపుడు. మన కష్టము లన్నిటికి మూల మవియే. కోరిక తీరనిచో మనోవ్యథ; కోరిక లేనిచో, వ్యథకూడ లేదు. అపార్థముకలుగకుండుటకై నా యభిప్రాయమును కొంచెము విశదీకరించెదను. గోడలకు కోరికలు లేవు, వ్యథలును లేవు. నిజమే కాని, అవి పరిణామ మొందు వస్తువులు కావుగదా. ఈ కుర్చీకిని కోరికలులేవు, బాధలును లేవు. కాని, కుర్చీ యెప్పటికిని కుర్చీయే. సుఖానుభూతిలో దివ్యత్వము కలదు. దుఃఖానుభూతిలోకూడ దివ్యత్వము కలదు. కీడువలన కూడ ఉపయోగము కలదని చెప్పవచ్చును. దుఃఖానుభూతికికూడ

నీతిబోధక ప్రభావము కలదని మన మెఱుగుదుము. చేసిన పను లెన్నిటికో మనము పశ్చాత్తాప మొందుదుము. కాని వానివలన మన కెట్టి గుణపాఠములు లభించినవి! నామట్టుకు నేను కొన్ని సత్కార్యములు చేసినందు కెంత సంతసింతునో, అనేకదుష్కార్యములు చేసినందుకుకూడ అంత సంతసింతును. సరియైన త్రోవ నప్పుడప్పుడు నడిచినందుకు నాకు సంతోషము. పెక్కుతడవలు తప్పుత్రోవల బడ్డందుకుకూడ సంతోషమే. అవన్నియు నా కత్యుత్తమపాఠములు కఱపినవిగదా! నేను చిన్ననాటినుండియు తలచిన తలపులయొక్కయు, చేసిన చేతలయొక్కయు సమష్టి ఫలమునే ఇప్పటి నేను. ప్రతితలంపు, ప్రతిచేత, దానిదానిఫలములను కలిగించినది. నా అభివృద్ధి మొత్తము ఆ ఫలములే.

కోరికలు కోరుట మంచిదికాదని మనమందఱ మెఱుగుదుము. కాని కోరికలు త్యజించుట అనగా ఏమి? జీవితము జరుగుటెట్లు? కోరికనే గాక మనుష్యునిగూడ నశింపజేయు ఆత్మహత్యారూపమగు బోధకదా యిది! కాదు. దాని సరియైన యర్థ మిది: ఆస్తి ఉంచుకోవలదనికాదు బోధ, ఆవశ్యకములైన వస్తువులుంచుకోవలదనికూడ కాదు. అనావశ్యకములైనను, హాయిగొల్పెడు వస్తువు లుంచుకొనుటకుకూడ ఆక్షేపము లేదు. వలయు వస్తువుల నన్నిటిని—ఇంక ఇతరములనుకూడ—ఉంచుకోవచ్చును. కాని సత్యము నెఱిగి ఆచరింపుడు. ధన మెవ్వరిదిని కాదు. ఒక వస్తువు మీ సొంతమనిగాని, దానియందు మీకుకూడ కొంత భాగము కలదనిగాని, భావింపకుడు. మీ రెవరు, నే నెవడను, ఇతరు లెవరు? సర్వము ఈశ్వరునిదే. సర్వమునందు ఈశ్వరు నుంపుమని గదా ఉపనిషత్తు బోధ! మీ రనుభవించు సంపదయందు భగవంతుడు కలడు. మీలో అంకురించు కోరికయం దతడు కలడు. ఆ కోరిక తీర్చుకొనుటకై మీరు కొను వస్తువులం దతడు గలడు. మీ ఒప్పుల పచ్చడములం దతడు కలడు. మీ విన్నాణపు

తోడవులం దతడు కలడు. ఈ మార్గమున పడవలెను మీ తలపులు. ఈ దృష్టితో చూడ నారంభించుటతోడనే, ప్రపంచ మంతయు క్రొత్తరూపు దాల్చును. మీ ప్రతిచలనమందును, మీ సంభాషణమందును, మీ రూపమందును, సర్వమందును, ఈశ్వరు నుంచితిరేని, దృశ్య మంతయు మాఱి, ప్రపంచము కష్ట భూయిష్ఠ రంగముగా కానిపించుటకు మాఱు స్వర్గలోకమై పోవును.

"ఈశ్వరరాజ్యము మీలో నున్నది" అని జీససు పలికి యున్నాడు. వేదాంతబోధయు అదియే. లోకగురువులందఱును అట్లే చెప్పుదురు. "చూచుటకు కన్నులున్న వారందఱును చూతురు గాక! విన చెవులుండువా రందఱును విందురుగాక!" మన మెన్నాళ్లనుండియో వెదకు సత్యము మనలోనే కలదనియు, ఎప్పుడును అచటనే ఉండినదనియు, వేదాంతము చాటుచున్నది. అజ్ఞానాంధులమై, అది పోయినదని భ్రమసి, ఏడ్చుచు, ఆర్చుచు, ప్రపంచమంతయు వెదకి శ్రమించితిమి. కాని ఆ సత్యము మొదటి నుండియు మన హృదయములందే నివసించియుండెను. అచటనే దానిని కనుగొననగును.

"ప్రపంచమును త్యజింపుడు" అను వాక్యమును మామూలువాడుకలోగల అపరిపక్వార్థమున గ్రహించితిమేని, మన మే పనిని చేయక, ఏమియు తలపక, మట్టిముద్దలవలె చేష్టలుదక్కి పడియుండవలెను. సర్వమును నియతివశమనెడి నమ్మకముగలవారమై, ప్రకృతిధర్మమునకు దాసులమై, సర్వకాల గతులకు విధేయులమై, ఇటునటు త్రిప్పటులొందుచుండవలెను. కాని దాని యర్థ మదికాదు. మనము కార్యమగ్నులమై యుండవలెను. వ్యర్థవాంఛలకు లోబడి అంతటను త్రిమ్మరు చుండు సామాన్యమానవులకు "కర్మ" మనగా నేమియో ఎట్లు తెలియగలదు? విషయలోలుడై, చిత్తవృత్తులచే ఇటునటు బలాత్కారముగా లాగబడువాడు, కర మన నేమియో ఎట్లు

గ్రహింపగలడు? నిష్కాముడై కేవలము అస్వార్థపరుడై యుండు వానికే కర్మాచరణము సాధ్యము. ఉద్దేశ మేమియు లేనివాడే కర్మాచరణ యోగ్యుడు. సాధింపదగిన స్వలాభ మేమియు లేని వాడు చేయునదే కర్మము.

పటములోని చిత్రమును చూచి ఆనందించున దెవరు: అమ్మువాడా, చూచువాడా? అమ్మువాడు "జమాకర్చు" లెక్కలు చూచుకొనుచు, తనకు మిగులున దెంతయో తేల్చుకొనుచు, ఆ పటమును అమ్మినచో తనకు వచ్చు లాభము నెన్నుకొనుచు, ఉండును. వాని బుద్ధి యంతయు అందే నిలిచియుండును. అతని చెవి ఏలపు పాటలమీదను, దృష్టి ఏలపు సుత్తిమీదను, ఉండును. పాట ఎంత త్వరితముగా పెరుగుచున్నదో వినుటయం దతడు మగ్నుడై యుండును. కొను నుద్దేశము, అమ్ము నుద్దేశము లేక, అచటికి వచ్చి ఊరక పటమును చూచువాడు దాని సౌందర్యమున కానందించుచుండును. అతనిదే ఆనందానుభూతి! ఈ జగత్తంతయు ఒక చిత్రపటము. కోర్కులన్నియు నశించినప్పుడు గాని, మానవులు దానిచే ఆనందము పొందజాలరు. అప్పు డీ అమ్మకములు, ఈ కొనుగోళ్లు, ఈ వెఱ్ఱి స్వామ్యభావములు, నిలిచిపోవును. అప్పిచ్చువాడు, కొనువాడు, అమ్మువాడు, అదృశ్యులైనప్పు డీ అత్యంత మనోజ్ఞమగు ప్రపంచచిత్రముమాత్రము నిలిచియుండును. ఈశ్వరునిగూర్చి ఈ క్రింది దానికన్న ఎక్కువ హృదయంగమమైన భావమును నే నెచ్చటను చదివియుండలేదు: "అతడు మహాకవి, అనాదికవి; జగత్తంతయు అతడు నిరవధి కానందమున రచించిన కావ్యము. అందు శ్లోకములు కలవు; ఛందోబద్ధములగు అంత్యప్రాసగీతికలు కలవు; లయతాళబద్ధములగు గేయములు కలవు." నిష్కాముల మైనప్పుడు మన మీ ఈశ్వరనిర్మితజగత్కావ్యమును చదివి ఆనందింపగలము. అప్పుడు సర్వము దైవమయ మగును. వెలుతురు సోకమిచే అపవిత్రములుగా నిన్నాళ్లు భావింపబడుచుండిన మూలలు, సందులు,

గొందులు, చీకటి కోనలు, అప్పుడు దివ్యతేజోమయము లగును. అవన్నియు వాని వాస్తవస్వరూపములతో చూపట్టును. అప్పు డీ ఏడ్పులు, అర్పులు బాలక్రీడ లనియు, వానిని మనము ప్రేక్ష కులమై చూచుచుంటిమనియు, గ్రహించి మన ప్రవర్తనములకు మనమే నవ్వుకొందుము.

కావున మీ కర్మము లొనర్చుచుండుడని వేదాంతము బోధించును. త్యాగమే — ఇంద్రియగోచరమగు ఈ అసత్య ప్రపంచపు త్యాగమే—కర్మరహస్యమని అది మొదటనే బోధిం చును. ఆ బోధ కర్థమేమి? సర్వత్ర భగవంతుని చూచుచుండు డనియే. అట్లు చూచుచు, కర్మము లొనర్చుచుండుడు. నూఱేండ్లు జీవింపగోరుడు. ఐహికవాంఛలన్నియు కలిగియుండినను, ఆక్షేపము లేదు. కాని కోరికలకొక దివ్యతనుకలిగించుకొనుడు. పరోపకారపరా యణమును, ఆనందమయమును, నిరంతరకార్యాచరణమగ్నమును అగు దీర్ఘజీవితము వాంఛింపుడు. ఇట్లొనర్చితిరేని, మీకు విమోచనమార్గము లభించును. వేఱు మార్గములేదు. సత్య మెఱుగక, నిరర్థకములగు ఐహికభోగములలో కూలిపోయిన వాని పతనమే గతి. వాని కెన్నటికిని ఆదర్శసిద్ధి లభింపదు. అట్లుగాక, ప్రపంచము నెప్పుడు శపించుచు, అడవుల కేగి, శరీరము నుపేక్షించి, ఉపవాసములచే ప్రాణములు కొద్దికొద్దిగా తీసికొనుచు, హృదయమును రసహీనమగు ఎడారిగా మార్చు కొని, సానుభూతికి స్వస్తిచెప్పి, కఠినుదనమునకును, నిర్దాక్షిణ్య మునకును, ఎరవైనవాడుకూడ దారితప్పినవాడే. ''అతి'' సర్వత్ర వర్జింపవలసియుండగా, సరియైనత్రోవను విడిచి ఒకచివర కొకరును, రెండవ చివర కింకొకరును పోయినారు. ఇరువురును త్రోవతప్పిన వారే. ఇరువురకును గమ్య మసాధ్యమే.

కావున ప్రతివస్తువునందును భగవంతు నుంచి, ప్రతివస్తువు నందును భగవంతుడు కలడని గుర్తించి, కర్మాచరణ నిమగ్నులై

యుండుడని వేదాంతము బోధించును. నిరంతరము కార్యాచర ణాసక్తులై యుండుడు. కాని ఈ జీవితమును దివ్యమని భావించి, దైవముగనే ఎంచి, ఇదే మన కర్తవ్యమనియు, ఇది తప్ప మనకు కోరదగిన దేదియు లేదనియు, ఎల్లప్పుడు విశ్వసించియుండుడు. అన్ని వస్తువులలో ఈశ్వరుడుండగా, అతనికై మఱొకచోటికి వెళ్లనేల? ప్రతికర్మములోను, ప్రతితలంపులోను, ప్రతిచిత్తవృత్తి లోను, అత డిప్పటికే కలడు గదా! ఈ విషయ మెఱిగి పనులు చేసికొనుచుండవలెను. త్రోవ ఇదొక్కటే. వేఱుత్రోవ లేదు. ఇట్లు చేసినయెడల, కర్మఫలములు మనలను బంధింపవు. నిరర్థక వాంఛలే మన కష్టములకు, వ్యథలకు, మూలములని మన మిప్పటికే ఎఱుగుదుము. కాని వానిని దివ్యీకరించి, దైవసంబంధముచే వానిని పవిత్రము లొనర్చినచో, ఇక నవి కష్టములుగాని, వ్యథలుగాని, కల్పింపవు. ఈ రహస్య మెఱుగువఱకు మానవుల కీ ప్రపంచము ఆసురముగనే తోచును. తమ లోపలను, తమ చుట్టుపట్టులను, సర్వత్ర అనంతమగు ఆనందనిధి కలదని ఎందఱో ఎఱుగరు. వా రింతదనుక దానిని కన్గొనలేదు. ఆసురప్రపంచ మనగా నేమి? "అజ్ఞానమే" అని వేదాంత మొసగు సమాధానము.

మహోత్తరనదీతీరమున గూర్చుండి మనము దప్పికచే చచ్చుచున్నాము! అన్నరాశి ప్రక్కనే కూర్చుండి ఆకటిచే చచ్చుచున్నాము! ఆనందమయజగత్తు ఇచటనే కలదు. కాని అది మనకు కనిపించుటలేదు. అహోరాత్రములు మనము దాని యందే నివసించుచున్నాము. కాని అది మనకన్నుల కానందమయము కానట్లు కనిపించుచున్నది. మతము లీ వింతను పరిశోధించి దానిని మనకు తేటపఱుపజూచును. ఈ ఆనందమయ ప్రపంచముకై అన్ని హృదయములును ఉవ్విళ్లూరుచున్నవి. సర్వదేశప్రజలును దానికొఱకే వెదకుచున్నారు. సర్వమతముల కిది యేకైకలక్ష్యము. కాని ఒక్కొక్క మతలక్ష్య మొక్కొక్క భాషలో

తెలుపబడినది. ఈ భాషాభేదమువలననే లక్ష్యభేద మున్నట్లు తోచుట. ఒక రొకభాషలో నొకవిధమున, మఱొక రింకొక భాషలో, ఇంచుక భేదముగా, తెలిపియున్నారు. కాని అందఱి లోపలి భావ మొకటియేనేమో!

ఈ సందర్భమున ఇంక కొన్ని ప్రశ్నలుకూడ ఉప్పతిల్లు చున్నవి. మాటలు చెప్పుట మిక్కిలి సులభము. 'సర్వపదార్థము లందును, సర్వస్థలము లందును, భగవంతుని చూచినవెంటనే ఈ ప్రపంచము ఆనందమయ మగును' అను భావమును నేను చిన్న నాటినుండి వినుచున్నాను. కాని, లోకముతో కలిసి, నాలుగు దెబ్బలు తిన్న వెంటనే, ఆ భావము అదృశ్యమగును. సర్వజను లందును దేవుడు కలడని తలంచుచు, నేను వీథిలో నడుచు చున్నాను. బలిష్ఠు డొకడు వచ్చి నన్ను పడగెంటును. నేను నేలగూలి, చప్పున లేచి, మోము జేవురింప, వానిని పడగొట్ట జూతును. దేవత్వభావ మదృశ్యమైనది. నేను కోపావేశపరవశుడ నైతిని. సర్వము మఱచితిని. ఈశ్వరునికి బదులు భూతము ప్రత్యక్షమైనది. 'అందఱియందును ఈశ్వరుని చూడు' డను మాట చిన్ననాటినుండియు వినుచున్నాము. అందఱిలోను, అన్నిటిలోను, ఈశ్వరుని చూడు డనియే సర్వమతముల బోధ కూడ. బైబిలు క్రొత్తనిబంధనలో ఏసుక్రీస్తిట్లు బోధించి యున్నాడుగదా. మన మందఱ మీ బోధ నెఱుగుదుము గాని, దానిని కార్యరూపమున బెట్టజూచుటలోనే చిక్కు. ఈసోపు నీతికథల (ఈసోపు ఫేబుల్స్) లో నొక కణితి తన ప్రతిబింబము నొక చెఱువులో చూచుకొని "నా శక్తి యెంత అపారమో చూడుము. నా తల యెంత యద్భుతముగ నున్నదో, నా కాళ్లెంత బలిష్ఠములో, నే నెంత త్వరితముగా నడువగలనో చూడుము" అని తన పిల్లతో ప్రగల్భము లాడుచుండును. ఇంతలో దూరమున కుక్కల యఱపు విని, అది అపారవేగముతో పాఱిపోవును. కొన్నిమైళ్లిట్లు పరుగిడి, రోజుచు, రొప్పుచు, తిరిగివచ్చును.

ఈ వింతచర్య కా పిల్ల యర్థ మడుగగా, "నాకు చాల శక్తి కలదు నిజమేకాని, కుక్కల యఱపు వినవచ్చుతోడనే, నా ధైర్యము సడలిపోవును" అని యది బదులుచెప్పెను. మన విషయముకూడ ఇట్టిదే. మన మానవత్వ మెంతో మహితమైనదని మన తలంపు. మనము బలవంతులమని, ధీరులమని, భావించుకొని గొప్ప లక్ష్యములను సాధింప గోరుదుము. కాని క్లిష్టసందర్భము లెదుర్కొని సత్యనిష్ఠను పరీక్షింప నారంభించినప్పుడును, హృదయప్రేరణలు నియమభంగమునకు పురికొల్పునప్పుడును — ఈ కుక్కయఱపులు వినవచ్చినప్పుడు — కథలోని కణితి తెఱగు మన కాపాదిల్లును. అగుచో, ఈ బోధ లన్నిటి ఫల మేమి? అపారమగు ఫలము కలదు. పట్టుదల వదలక చేయు ప్రయత్న మెప్పుడును విజయ వంత మగు ననుటే ఆ ఫలము. ఒక్క దినమున ఏదియు సాధించుట అసాధ్యము.

"ఈ ఆత్మనుగూర్చి మొదట వినవలెను. పిదప మననము చేయవలెను. పిదప ఎడతెగక ధ్యానింపవలెను." ప్రతివానికిని— నేలపై ప్రాకు క్రిమికికూడ—వినీలాకాశము కానిపించును. కాని అది ఎంతదూరము! అట్లే మన లక్ష్యముకూడ. అది అపార దూరము. నిజమే! కాని దానిని పొందియే తీఱవలె ననుటగూడ నిజమే. లక్ష్యమునుమాత్రమే కాదు పొందవలసినది; పరమ లక్ష్యమునుగూడ. అనేకులు లక్ష్యమేదియులేక, చీకటిలో వలె జీవితములు గడపుచున్నారు. లక్ష్యసహితు డొక వేయితప్పు లొనర్చిన లక్ష్యరహితు డేబదివేల తప్పు లొనర్చుననుట నిస్సంశ యము. కావున లక్ష్య మొకదానిని కలిగియుండుట ముఖ్యము. ఈలక్ష్యమునుగూర్చి సాధ్యమైనంత వినవలెను; నిరంతరశ్రవణ ముచే అది మన హృదయములో ప్రవేశింపవలెను; మన బుద్ధి కెక్కవలెను; రక్తనాళములలో దూఱవలెను; ప్రతిరక్తబిందువు నందును స్పందింపవలెను; ప్రతిరోమకూపమునకు వ్యాపింపవలెను. అంతట దానినిగూర్చి మనము ధ్యానింపవలెను. "హృదయము

భావభరితమైనప్పుడు నోరు మాటాడును.'' హృదయము భావ బంధురమైనప్పుడు హస్తముకూడ పనిచేయును.

మనలను కర్మాచరణమునకు పురికొల్పునవి భావములే గనుక మనస్సు నత్యున్నతభావములతో నింపించుకొనుడు. ప్రతిదినము వానినిగూర్చి వినుచుండుడు. ప్రతినెల వానినిగూర్చి తలంచుచుండుడు. అపజయములను లక్ష్యము సేయకుడు. అవి కలుగుట చిత్రమా? జీవితమున కలంకారప్రాయములు గదా అవి? అవి లేని జీవిత మెంత మందముగా నుండును! ఈ పోరాటములే జీవితమునకు స్వారస్య మిచ్చునవి! అవియే జీవితసారభములు! కావున ఈ పొరపాట్లను, ఈ పోరాటములను, లక్ష్యపెట్టవలదు. గోవు అసత్యమాడదు నిజమే. కాని అది ఎప్పటికిని గోవే, మానవుడు కాజాలదు. కావున అపజయములచే నిరుత్సాహమందకుడు. లక్ష్యసిద్ధికై వేయిసార్లు పోరాడుడు. వేయిసార్లును ఓటమియే ప్రాప్తించెనేని, ఇంకొకసారి మరల ప్రయత్నింపుడు. అన్నిటియందును దైవమును చూచుటే ఆదర్శము. కాని మీ రన్నిటియందు చూడజాలరేని, మీ కత్యంతప్రియమగు నేదో యొక వస్తువునందు మొదట చూడుడు. ఆ పిదప మఱొక దానిలో; అంతట ఇంకొకదానిలో. ఇట్లు క్రమవ్యాప్తి నొందింప వచ్చును. ఆత్మకు జీవితపరిమితి లేదు. దాని జీవిత మనంతము. కావున కాలము చాలదని భీతిలక, సావకాశముగా, ఉద్యమము సాగింపుచుండుడు. కార్యసిద్ధి చేకూరగలదు.

''ఏకమగు ఈ ఆత్మకు మనోజవమునకన్న ఎక్కువ జవము కలదు. అది దేవతలకు సయితము అప్రాప్యము. మనస్సునకు దురవగాహము. అది కదలుటవలననే సర్వము కదలును. సర్వమున కదియే ఉనికి. అది చలించును, చలింపదు. అది దూరమును, దగ్గఱయు. అది సర్వమునకు అంతరమునను బాహ్యమునను కూడ కలదు. అన్నిటిని నిండియుండును కూడ. సర్వభూతములం దా ఆత్మనే, ఆ ఆత్మయందే సర్వభూతములను,

చూచువాడు ఆత్మ కెన్నడును దూరస్థుడు కానేరడు. జీవకోట్లన్నియు, ప్రపంచ మంతయు, ఆత్మలోనివిగా కన్గొనినప్పుడే మానవునికి పరమసత్యము సిద్ధించినట్లు. అతని కిక మోహములు లేవు. జగత్తులో ఈ ఏకత్వమును కన్గొనినవాని కిక శోక మెట్లుండ గలదు?''

వేదాంతమతమున గల మహావిశేషములలో ఈ సర్వజీవైక్యత — ఈ సర్వైక్యత — యొకటి. అజ్ఞానమే తాపత్రయమూల మనియు, భిన్నత్వభావమే — మానవులందఱు భిన్నులు, జాతులన్నియు భిన్నములు, భూమండల చంద్రమండలములు భిన్నములు, పరమాణువు లన్నియు పరస్పరభిన్నములు—అను ఈ భిన్నత్వభావమే అజ్ఞాన మనియు, అది నిరూపించును. ఈ భేదభావమే మన తాపత్రయకారణము. ఈ భిన్నత్వము లేదనియు, అది అసత్యమనియు, వేదాంతము పల్కుచున్నది. పైకిమాత్రమే ఈ భిన్నత్వము. గర్భమున ఐక్యమే కనిపించును. మానవులొండొరులకు; జాతు లొండొంటికి; ఉన్నతులకు, హీనులకు; ధనికులకు, బీదలకు; దేవతలకు, మానవులకు; మానవులకు, జంతుజాలమునకు: సర్వమునను ఐక్యమే కలదని కనిపించును. అగాధపరిశీలన చేసినచో, సర్వపదార్థములును ఆ ఒక్కని వివిధరూపములేయని తెలియవచ్చును. ఈ ఐక్యభావమును గ్రహించిన వాని కిక మోహభ్రాంతులు లేవు. అతడెట్లు భ్రాంతుడు కాగలడు? సర్వమునందు గల సత్యము, సర్వమునందు గల నిగూఢరహస్యము, అతనికి తెలిసిపోయినదిగదా. అతని కిక తాపము లెట్లుండ గలవు? కోరిక లేమి యుండగలవు? సర్వమునందు గల సత్యము ఆ మూలసత్యమే, ఆ పరమాత్ముడే, ఆ సర్వైక్యత్వమే, ఆ అఖండసత్తయే, ఆ అఖండచిత్తే, ఆ అఖండానందమే అని అతడు గ్రహించినాడుగదా. అచట మరణములేదు, వ్యాధిలేదు, దుఃఖములేదు, తాపములులేవు, అసంతృప్తిలేదు. సర్వము

పరిపూర్ణైక్యము, పరిపూర్ణానందము. అతడిప్పు డెవనికై దుఃఖించును? పరమసత్యములో మరణము లేదు, తాపములు లేవు. అందు ఎవరికొరకు దుఃఖించుట? ఎవరియెడ సానుభూతి చూపుట? సర్వము నతడే నిండియున్నాడు: ఆ శుద్ధుడు, ఆ అకాయుడు, ఆ నిరవయవుడు, ఆ అపాపవిద్ధుడు, ఆ కవి, ఆ మనీషి, ఆ స్వయంభువు, ఆ కర్మఫలప్రదాత! ఈ అజ్ఞలోకమునకు—అవిద్యామాయా రూపమగు ఈ లోకమునకు—నిజమగు ఉనికి కలదనుకొని దాని నుపాసించువారు చీకటిలో అల్లాడుచున్నారు. జీవితకాలమంతయు ఈ లోకములోనే గడపి, దీనికన్న ఉన్నతము, దీనికన్న శ్రేష్ఠము, అగునదొకటి కలదని తెలిసికొననివారు అంతకన్న కటికి చీకటిలో అల్లాడుచున్నారు. కాని ఈ ప్రకృతిరహస్యము నెఱిగినవాడు, ప్రకృతి నాధారము చేసికొని ప్రకృతి కతీతమగు వస్తువును కన్గొనినవాడు, అమృతుడగును (మరణమును దాటును); ప్రకృతి కతీతమగు వస్తువుయొక్క తోడ్పాటుతో నిత్యానందప్రాప్తి నందును.

'పూషా (సూర్యుడా), నీ హిరణ్మయ (బంగారు) బింబముతో పట్టిన నీలోని సత్యమును, తెర తొలగించి దృష్టిగోచర మొనరింపుము. నీలో నివసించియుండు సత్యమును నే నెఱుగుదును. నీ రశ్మియొక్కయు, నీ దివ్యత్వముయొక్కయు, వాస్తవికార్థము నాకు తెలియును. నీలోనుండి దీపించు ఆ వస్తువు నే నెఱిగినదే. ఆ సత్యమును నేను చూచుచున్నాను. ఆ సత్యమే నాయందును కలదు. నేనే ఆ సత్యమును.''



# అపరోక్షానుభూతి

(లండనులో ఉపన్యాసము ; 29-10-1896)

మిక్కిలి తేటతెల్లముగా నుండియు, మిక్కిలి భావరామణీయకత గల ఉపనిషత్తులలో కఠోపనిషత్తు ఒకటి. సర్ ఎడ్విన్ ఆర్నల్డ్ దానిని (సీక్రెట్ ఆఫ్ డెత్) (మృత్యురహస్యము) అను పేర ఆంగ్లీకరించియున్నాడు. మీలో కొందఱు దానిని చదివియుందురు. ఆ యుపనిషత్తులో కొంతభాగము నేనాడు మీకు చదివి వినిపింతును. లోకోత్పత్తిని, లోకసృష్టిని, మూలముగా గొని చేసిన బాహ్యవిచారమువలన పారమార్థికతత్త్వ మేమియు తెలియరానందున, ఆంతరంగికప్రపంచముదెస బుద్ధి మరల్పవలసి వచ్చెనని మన కిప్పటికే తెలియును. సరిగా అచ్చటనే, అనగా మానవుని ఆంతరంగిక ప్రకృతివిచారముతోడనే, కఠోపనిషత్తు ప్రారంభమగుచున్నది. బాహ్యప్రపంచము నెవరు సృజించిరి? అది ఎట్లుత్పత్తియయ్యెను? అని పూర్వపు విచారము. మానవుడు జీవించుటకు, చరించుటకు, ఆధారభూతమైన దతనిలో ఎద్ది? అతని మరణానంతరము అది ఏమైపోవును? అనునది ఇప్పటి విచారము. ఆదిమతత్త్వవేత్తలు భౌతికవస్తువిచారమూలమున పరాత్పరవస్తువును గ్రహింపజూచిరి వారి విచారణ లోక జగదీశ్వరు నందుకొని, అంతకుమించి పైకి పోజాలకపోయినవి. ఆ జగదీశ్వరుడు సర్వవిధముల మానవునికన్న ఉన్నతుడు. కాని సర్వవిధముల మానవుడే. కావున నతడు పరమసత్యముగా అంగీకరింపబడలేదు. సత్యములో నొక అంశముగా నుండునేమో అనుకొనిరి. మన మీ జగత్తును మానవదృష్టితో చూచుచున్నాము. కావున ఈ జగత్తున కాధారభూతుడగు మన దైవము కూడ మానవబుద్ధికల్పితుడే.

తత్త్వవిచారము చేయగల గోవొకటి కలదనుకొనుడు. ఆ గోవుకు దైవాన్వేషణబుద్ధి కలిగినచో, దాని కొక గోజగత్తు స్ఫురించును. ఆ జగత్తుకు కారణభూతుడును గోబుద్ధికల్పితుడే. గోవుకు మన దైవము కన్పించుట అసంభవము. మార్జాలములు తత్త్వవిచార మారంభించెననుకొనుడు. వాని కొక మార్జాలజగత్తు కానిపించును. జగత్ సమస్య కొక మార్జాలసమాధానము నవి కల్పించును. ఆ జగత్తొక మార్జాలపతి పరిపాలనములో నుండును. అట్లే మన మానవ సమాధానముకూడ సమగ్రము కాజాలదు. మన జగద్భావమే అసమగ్రము. అహంభావపూరితుడై మానవు డెన్ని ప్రగల్భము లాడినను, నిజ మిదియే. బాహ్యవిచార మూలమున జగత్సమస్యకు లభించు సమాధానమునందు ఈ మహా లోపము కలదు: మనకు గోచరించునది మన ప్రత్యేక జగత్తు; సత్యమునుగూర్చి మనకుమాత్రమే ఏర్పడిన భావము. ఆ సత్యము ఇంద్రియగోచరము కానిది; బుద్ధిగోచరముకూడ కానిది. పంచేంద్రియములు గలవారి కీ జగత్తులో నెంత గోచరింపగలదో, అంతే మన మెఱుగు జగత్తు. మఱొక ఇంద్రియము లభించె నేని, మన కీ జగత్తంతయు మాఱిపోవును. సూదంటురాయివలె ఆకర్షించు శక్తిగల యింద్రియ మొకటి కలిగెనేని, మన మిప్పు డెఱుగని, ఎఱుగజాలని, కోటానుకోట్ల శక్తులు మన కింద్రియ గోచరము కావచ్చును. మన ఇంద్రియముల శక్తి స్వల్పము, మిక్కిలి పరిమితము. ఆ స్వల్పపరిమితులలోపలనే మనము జగత్తనుకొనునది ఇమిడియుండును. ఆ స్వల్పజగత్సమస్యనే మన దైవము తీర్చును. పరిపూర్ణజగత్సమస్య అట్లే నిలిచి యుండును. కాని బుద్ధిమహితుడగు మానవు డింతటితో ఊరకుండక, సర్వ జగత్తుల కొక్కుమ్మడిగా అన్వయింపగల సమాధానమును — సురనరాది సర్వభూతకోటి ఒక్కటనే ఉండు జగత్తును, ప్రకృతి వికారము లన్నిటి కన్వయించు సమాధానమును, సాధింప జూచును.

అనగా, ఏ జగత్తునందు సర్వజగత్తులు కలవో, ఆ జగత్తును కనుగొనుట మన ప్రథమకార్యము. ఏ పదార్థము ఈ వివిధక్షేత్రములలో గల జగత్తు లన్నిటికి సామాన్యమై యున్నదో — అది ఇంద్రియగోచర మైనను, కానిదైనను—ఆ పదార్థమును కనుగొనవలెను. ఊర్ధ్వలోకములకును, అధోలోకములకును, సామాన్యధర్మ మని నిష్కర్షగా తెలియదగిన దేదైన నొక్కటి లభించినను, మన సమస్య పరిష్కారమైనట్లే. ఉనికిగల సర్వము ఒకే మూలము నుండి ఉత్పత్తి యైయుండవలెనని కేవలము హేతుబద్ధవాదము వలన స్థాపింపగల్గినను, మనము కొంత దారిలో పడినట్లే. కాని మన మెఱిగిన ఈ దృశ్యజగత్తు మూలముననే మన సమస్యా పరిష్కారము కాజాలదనుట నిస్సంశయము. మనకు గోచరించునది సృష్టిలో నొక భాగము మాత్రమే కదా!

అగాధపరిశోధన మొక్కటే కార్యసాధకము కావచ్చునని తేలుచున్నది. కేంద్రమునకు దూరముగానుండువఱకు వ్యత్యాసములు, వైషమ్యములు అధికముగా నుండుననియు, కేంద్రమును సమీపించుకొలది ఐక్యభావ మధికమగుచుండుననియు, పూర్వపరిశోధకులు కన్గొనిరి. వలయమధ్యమును (సెంటర్ ఆఫ్ ది సర్కిల్) సమీపించు కొలది కిరణరేఖలు (రేడియై) అన్నియు కలిసి ఏకీభవించు కేంద్రమును (సెంటర్) సమీపింతుము. అట్లే దానికి దూరమగుకొలది కిరణరేఖల కొంటొంటికి గల దవ్వు అధికమగుచుండును. బాహ్యప్రపంచము మూలసత్యమున కపార దూరమున నున్నది. కావున ఇంద్రియములకు పరస్పరభిన్నములుగాతోచు దృశ్యము లన్నియు ఏకీభావము వహించి కానిపింపగల ప్రదేశము అందులో నుండజాలదు. మన మెఱుగు బాహ్యజగత్తు విశ్వసృష్టిలో నొక స్వల్పాంశము మాత్రమే. ఇతరాంశములు — ఒక దానికన్న నొకటి ఉన్నతక్షేత్రములలో — కలవుగదా: మానసికము, నైతికము, వైజ్ఞానికము. ఒక్క అంశమును మాత్రమే కైకొని తత్సాహాయ్యమున సర్వమును

అవగతపఱచుకొనుట కేవలము అసంభవము. ఈ విభిన్న క్షేత్రము లన్నిటికిని మూలకేంద్ర మని చెప్పదగిన స్థాన మేదియైన కలదా అని కనుగొని, ఆ కేంద్రమునుండి సమస్యను పరిష్కరింప జూడ వలెను. ఇదియే చేయవలసిన పని. ఆ కేంద్ర మెక్కడ? మన యందే. ప్రాచీనమహర్షులు మిక్కిలి అగాధపరిశోధనలుచేసి మానవాత్మయొక్క గర్భాంతరాళముననే విశ్వజగత్కేంద్ర మిమిడియున్న దని గ్రహించిరి. ఈ క్షేత్రములన్నియు ఆ కేంద్ర స్థానమునకై పునకే ఆకర్షింబడుచుండును. అనగా, అన్ని క్షేత్ర ముల కదియే కూడలి. కావున ఆ చోట సుప్రతిష్ఠితుల మైన గాని సర్వమున కన్వయించు సమాధానమును కన్గొనజాలము. బాహ్య జగత్తు నెవరు నిర్మించిరి అను ప్రాథమికప్రశ్న మంత ప్రసక్తము కాదనియు, అది పరిష్కారమైనను నిరుపయోగమనియు, తెలిసి పోయెను.

ఈ విషయమును కఠోపనిషత్తు మిక్కిలి ఆలంకారికముగు భాషతో బోధించుచున్నది. పూర్వకాలమున నొక మహాధనికు డుండెను. అత డొక యాగ మొనర్చెను. తనకుగల సర్వము నిచ్చి వేయుట ఆ యాగములోని నియమము. కాని ఈ కర్త సత్య శీలుడు కాడు. ఆ యాగ మొనర్చిన గౌరవమే అతడు కోరినది. అందుచే తన కక్కఱలేని వ్యర్థవస్తువులు మాత్రము — గొడ్డు పోయిన ఆవులను, గ్రుడ్డి, కుంటి, ముసలి వానిని మాత్రము — ఇచ్చివేయుచుండెను. అతనికి నచికేతు డను కుమారు డొకడు కలడు. తండ్రి వక్రప్రవర్తనమును, నియమభంగమును, అతడు గ్రహించెను గాని, తెలుపు టెట్లు? హిందూబాలబాలికలకు తల్లి దండ్రులు ప్రత్యక్షదైవములు. అందుచే బాలుడు తండ్రి నత్యంత భక్తితో సమీపించి, మిక్కిలి వినయముగా, "న న్నెవరి కర్పింతువు? నీకు గల సర్వస్వము నిచ్చివేయవలెను గదా యీ యాగ నియమమును చెల్లించుటకు!" అని యడిగెను. తండ్రి మిక్కిలి వెక్కసపడి "బాలకా! ఇదేమి ప్రశ్న? తండ్రి తన కుమారునే

ఇచ్చివేసికొనుననా?'' అనెను. కాని నచికేతు డూరకుండక రెండవ సారి, పిదప మూడవసారికూడ, ఆ ప్రశ్నమునే అడిగెను. తండ్రి కోపోద్దీపితుడై ''నిన్ను మృత్యువునకు (యమునకు) ఇచ్చు చున్నాను'' అనెను. బాలకు డంత యము నొద్దకు వెళ్లెను. మృతులైన మానవులలో యముడు ప్రథముడు. అతడు స్వర్గ లోకమునకేగి పితృదేవతల కతిథియయ్యెను. మృతినొందు సజ్జను లందఱు అతనియొద్ద కేగి చాలకాలము నివసింతురు. ఆయన బహుపరిశుద్ధుడు, బహుపావనుడు, సుగుణసౌశీల్యములు కల వాడు. యము డను పేరే ఇందుకు నిదర్శనము. కావున ఈ బాలు డాయనలోకమున కరిగెను. అప్పుడు యము డింటలేడు. దేవతలు సయితము కొన్నివేళలందు ఇళ్లలో నుండరు. బాలుడు మూడు నాళ్లు వేచియున్న పిదప యముడువచ్చెను.

''బుధవరేణ్యా! నమస్కారార్హుడవగు అతిథివి. మూడునా ళ్లిచట వేచియుంటివి. అందును ఉపవసించితివి. నా అభివాదనము లందుము. నాకు శుభ మగుగాక! నేను ఇంటలేనందుకు చింతిల్లు చున్నాను, కాని ఆ లోపము నిప్పుడు సవరించెదను. ఒక్కొక్క నాటికొక్కొక్క వరము వంతున మూడువరములు కోరుకొనుము'' అని పల్కెను. అందుపై బాలుడు ''నా తండ్రికి నాపైగల కోపము శమించుగాక! నీవు నన్నిచటినుండి పంపినప్పు డతడు నన్ను గ్రహదృష్టితో అంగీకరించుగాక! ఇది నా మొదటివరము'' అనెను. యము డీవరమును పూర్తిగా ప్రసాదించెను. స్వర్గ ప్రాప్తి కలిగించు నొకానొక విద్యను బోధింపుమనుటయే రెండవ వరము. అత్యంత ప్రాచీనకాలములో—వేదములలోని సంహితా భాగమున — తేజోమయశరీరముకలిగి పితరులతో జీవించు స్వర్గ లోకపుభావ మొకటి కలిగియుండెనని మన మెఱుగుదుము. కాల క్రమమున ఇతరభావము లుత్పన్నమయ్యెను కాని అవి తృప్తికర ములుకాలేదు. అంతకన్న ఉన్నతభావము లవసరమయ్యెను. స్వర్గలోక జీవనములో భూలోక జీవనమునకన్న అంతగా అధి

క్యము కానిపింపలేదు. పరిపూర్ణారోగ్యము, అపారసంపద, 'కోరి నన్ని ఇంద్రియభోగములు, వజ్రసమానమగు శరీరము, జాడ్యము లెన్నడు రాకుండుట : ఇంతకన్న ఆధిక్యమేమైన కలదా? అది ఈ భౌతికలోకమే కాని, ఇంతకన్న కొంతనాజూకైనది! ఈ బాహ్య భౌతికలోకము మన సమస్యాపరిష్కారమున కుపకరింప దని ఇప్పటికే చూచియున్నాము. కావున స్వర్గలోకముకూడ ఉపకరింపజాలదు. ప్రకృతివికారములలో భౌతికపదార్థమయము లత్యంతస్వల్పము. అందు అత్యధికభాగము భౌతికమే కాదు. కావున ఈ మన లోకమెట్లు మన సమస్యాపరిష్కారమున కసమర్థమో, అట్లేభౌతిక పదార్థనిర్మితమగు ఎట్టి మహాలోక మైనను, అసమర్థమే యగును.

మన జీవితగమనవైఖరిని నిర్ణయించుటలో మన భావము లకును చిత్తవృత్తులకును గల ప్రాముఖ్యము బాహ్యప్రపంచ వికారములకు లేనేలేదు. మన ఆంతరంగిక ప్రపంచమంత అనం తము! అందు నిరంతర మెంతో పని సాగుచుండును. అందుతో పోల్చిచూచిన, ఇంద్రియకల్పన లతి క్షుద్రములుగా తోచును. పంచేంద్రియగోచరజగత్తే సర్వజగత్తు అను ప్రమాదమున బడియే సంహితలు స్వర్గము నాదర్శభూమిగా చేసినవి. కావుననే అవి సర్వజనామోదమునొందలేదు. కాని, నచికేతుని రెండవ వరము ఈస్వర్గమును చేకూర్చు క్రతువు నొకదానిని నేర్పు మనియే. ఈ క్రతువులచే దేవతలు ప్రీతులై స్వర్గము నిత్తురని వేదములలో నొక భావము కలదు.

సర్వమతగ్రంథములు పరీక్షించినచో, అనాదిసిద్ధమైన వాని కన్నిటికి పవిత్రత ఆరోపింపబడుచుండునని తెలియవచ్చును. కాగితము చేయనేరని పూర్వకాలమున మనవారు వాడుచుండిన భూర్జపత్రము లిప్పుడు పూజ్యభావ మొందినవిగదా! అట్లే పూర్వకాలమున వాడుచుండిన వంటపాత్రలవిషయము కూడ.

హిందూదేశములో ఈ ఆచార మత్యంతవ్యాప్తిలో నున్నది. రెండు కొయ్యల (అరణుల) ఒరపిడిచే అగ్నిని కల్పించు తొమ్మిది పదివేలేండ్లనాటి ఆచారము నిప్పటికిని అనుసరింతురు. యజ్ఞయాగాదులం దితరమార్గములు నిషిద్ధములు కూడ. ఆసియాఖండపు ఆర్యులలోని రెండవ శాఖవారు విద్యుల్లతనుండి అగ్నిని సేకరించుకొను ప్రాచీనాచారమును పాటించుచున్నారు. క్రొత్త మార్గము లేర్పడ్డ పిదప కూడ ఈ ప్రాతవిధులు పూజ్యభావముతో ననుసరింపబడును. అట్లే హీబ్రూజాతివా రిప్పుడు కాగితము వాడువా రయ్యును, వారి పూర్వికులనాటి తోలు కాగితము నిప్పుడును పూజ్యభావముతో చూతురు. సర్వజాతు లిట్లే చేయుదురు. ఇప్పుడు పవిత్రములుగా ఎన్నబడు నన్ని యాచారములును పూర్వసిద్ధములు. వైదికక్రతువు లట్టివే. కాలక్రమమున ఉత్తమమార్గములు లభించి, భావములు కూడ ఉన్నతము లయ్యెను గాని, ఈ ప్రాచీనాచారము లట్లే నిలిచియుండెను. ఏవో కొన్నిసందర్భములలో ఆచరింపబడుచు పవిత్రభావము నార్జించుకొనెను.

పిదప కొంద ఱీ క్రతువులు జరుపుటే వృత్తిగా పూనిరి. వారే ఋత్విజులు. వారి కిదియే బ్రదుకుదెరువు. వా రెంతో ప్రచారము చేసి యీ క్రతువులకు వ్యాప్తికల్పించిరి: 'ఆహుతుల పరిమళముచే ఆకర్షింపబడి దేవతలు దిగివత్తురు; యాగముచే లభింపరాని కామ్యవస్తువులే లేవు; ఒక్కొక విధమగు వేదిక నిర్మించి, కొన్ని మంత్రము లుచ్చరించుచు, కొన్ని ఆహుతు లర్పించినచో, ఈప్సితార్థములన్నియు దేవతలు ప్రసాదింతురు.' కావుననే స్వర్గప్రాప్తినిచ్చు క్రతువును తెలుపుమని నచికేతుడు కోరుట. యము డీ వరమును కూడ నిరభ్యంతరముగా ప్రసాదించి, అది నచికేతుని పేరనే వాడుకలోనికి వచ్చునట్లుకూడ వర మిచ్చెను.

ఇక మూడవ వరము. దీనితోనే ఉపనిషత్తు నిజముగా ప్రారంభమగును. "ఒక సంశయము కలదు, మనుష్యుడు మరణించినప్పుడు అతడు కలడని కొందఱును, లేడని కొందఱును, చెప్పుదురు. నిజము నీయొద్ద నెఱుగగోరుదును. ఇదియే నా మూడవ వరము" అని బాలుడు పల్కెను. మొదటి వరములను సిద్ధముగా నిచ్చిన యము డీ వరమును విని భీతిలి యిట్లనెను: "ఈ ధర్మము సులభముగా తెలియదగినది కాదు. దేవతలుకూడ ము న్నీ విషయములో సంశయగ్రస్తులై యుండిరి, దీనికై నిర్బంధింపక, మఱొకవరము కోరుకొనుము."

కాని బాలుడు దృఢనిశ్చయముతో ఇట్లనెను: "నీవు చెప్పినట్లు ఇది సులభముగా తెలియదగని ధర్మమే. దేవతలుకూడ దీని విషయమున సంశయగ్రస్తులనుటయు నిజమే. కాని ఈ విషయమున నాకు నీయట్టి బోధకుడు ఇంకెవ్వరు లభింపగలరు? దీనికి తుల్యమగు అన్యవరముకూడ ఏదియు లేదు."

యము డిట్లనెను: "శతాయుష్కులగు పుత్త్ర పౌత్త్రులను, పశుసమృద్ధిని, ఏనుగులను, ధనమును, అశ్వములను, కోరుకొనుము. కావలసినంత భూమి, సంపద, కోరుకొనుము. ఇచ్ఛవచ్చినంత దీర్ఘజీవితము కోరుకొనుము. విత్తమునకును, చిరజీవితమునకును, తుల్య మని నీకు తోచిన మఱేదియైన కోరుకొనుము. లేక దిగంతరాజ్యాధిపతి వగుము. సర్వ కామోపభోగము లనుభవించునట్లు చేయుదును. భూలోక దుర్లభము లగు కోరిక లన్నియు కోరుకొనుము. మానవులకు లభ్యముకాని స్త్రీరత్నములను, రథములను, వాద్యములను నీ భోగార్థ మిచ్చుచున్నాను. కాని మరణానంతరవిషయమునుగూర్చి ప్రశ్నింపకుము."

నచికేతు డిట్లు బదులు పల్కెను: "నీవు పేర్కొన్న భోగము లన్నియు నేడున్న రే పుండనివి. ఇంద్రియముల తేజస్సంతయు ముదిమికి బలియగును. అతి దీర్ఘజీవితముకూడ

స్వల్పమే. కావున నీ అశ్వములు, నీ నృత్యగీతములు, నీవే ఉంచుకొనుము. మనుష్యుడు విత్తముచే నెన్నటికి తృప్తినొందడు. నీ దర్శన మబ్బినవారు విత్తము నుంచుకొనగలరా? మా జీవితము నీ యిచ్ఛ కధీనము. నేను కోరిన వరమునే నాకు ప్రసాదింపుము.''

యము డీ పల్కులకు సంతసించి యిట్లనెను: ''శ్రేయస్సు (మోక్షప్రదమగు పరమసత్యజ్ఞానము) వేఱు, ప్రేయస్సు (ఇహపరసుఖాన్వేషణము) వేఱు. ఇవి కేవల విరుద్ధగమ్యము లగుటచే, ఈ మార్గము లాశ్రయించు మానవుల పరిశ్రమలు భిన్నములుగా నుండును. శ్రేయోమార్గమును పట్టినవాడు సాధు వగును. ప్రేయోమార్గమును పట్టినవాడు పరమార్థము నందజాలడు. ఈ రెండు మార్గములును మనుష్యు నాకర్షింప జూచును. ధీరుడు (బుద్ధిశాలి) రెంటిని పరీక్షించి గుణాగుణవివేచన మొనర్చి, శ్రేయోమార్గమునే వరించును. మందుడు యోగక్షేమాసక్తుడై ప్రేయోమార్గమును వరించును. నీవు చక్కగా ఆలోచించి, ప్రియములును, ప్రియరూపములును, అగు కామ్యవస్తువులను త్యజించి ప్రాజ్ఞత చూపితివి.'' యము డంత నచికేతునకు ఆత్మవిద్య బోధింప నారంభించెను.

వేదకాలమున నీతివైరాగ్యాదర్శము లెంత ఔన్నత్యము నందియుండెనో కాని, భోగాసక్తిని జయించినవారి యందు తప్ప సత్యము దీపింపజాలదని సిద్ధాంతీకరించియుండిరి. వ్యర్థములగు ఈ ఇంద్రియభోగవాంఛలు మనలో నిరంతరము ఘోషించుచు, మనస్సును వెలికీడ్చున ట్లున్నంతకాలము; ఏదో యొక క్షుద్రరూపముకో, రసముకో, స్పర్శకో, మనము ప్రతిక్షణము దాస్యము చేయుచున్నంతకాలము; ఎన్ని ప్రగల్భము లాడినను, సత్యము మన హృదయములం దెట్లు ప్రదీప్తము కాగలదు?

యము డిట్లు చెప్పెను: ''ధనమోహముచే మూఢత్వ మొందిన పామరునికి అనంతరజీవిత మనున దొకటి కలదనియే

స్ఫురింపదు. 'ఉండునది యొక్కటే లోకమే; మఱొకటి లేదు' అని తలచువాడు మాటిమాటికి పుట్టుచు చచ్చుచుండును. ఈ సత్యమును గ్రహించుట బహుకష్టము. నిరంతరము వినుచుండియు, అనేకులిది గ్రహింపజాలరు. ఏలన ఇందు నేర్పువాడును, నేర్పబడువాడును, అసామాన్యులుగా నుండవలెను. గురువొక్కడు ఆశ్చర్యమగు నేర్పుగలవాడు లభించిన చాలదు. ఆశ్చర్యమైనవాడుగాని దానిని గ్రహింపజాలడు. లేనిపోని హేతువాదములచే మనస్సును కలవరపెట్టుట నిష్ప్రయోజనము. అది సత్యము: తర్కవాదముల కవకాశమిచ్చు విషయము కాదు; తర్కమునకు అందునట్టి విషయముకూడ కాదు. ప్రతిమతమువారును 'విశ్వసించుట' అవసరమని బోధింతురు. "గ్రుడ్డి (కారణ విచారముచేయని) నమ్మకము" విధింతురు. గ్రుడ్డి నమ్మకము ఆక్షేపణీయమే గాని పరిశీలించి చూచినచో, దానివెనుక మహాసత్యము కానిపించును. ఆమాటకు నిజమైన యర్థము మనకిచట తెలియగలదు. ఈశ్వరుడు హేతువాదములకు అందువాడు కాడు కావున లేనిపోని వాదములతో మనస్సును కలవరపెట్టరాదు. సత్యము అనుభవవేద్యముగాని, వాదములచే నిర్ణయించునది కాదు. చర్చలు, తర్కములు, గోచరవిషయములమీద ఆధారపడియుండును. అట్టి విషయములు లేనప్పుడు చర్చలకు, తర్కములకు, ఆధారమే లేదు. గోచరమైయున్న కొన్ని విషయముల నొండొంటితో పోల్చుటనే తర్కించుట యందురు. ఆ విషయములు లేనిచో, తర్కముకూడ ఉండజాలదు. ఆ విషయములు బాహ్యప్రపంచములోనివే కావలసిన అవసరము లేదు కదా! ఆంతరంగిక ప్రపంచములోనివి కూడ కావచ్చును. రసాయనశాస్త్రజ్ఞుడు కొన్ని ద్రవ్యములతో కొన్ని ఫలితములొందును. మీరు వానిని చూతురు, గ్రహింతురు. ఆ సత్యములపై మీ రసాయనవిషయక వాదములు నిర్మించుకొందురు. భౌతికశాస్త్రజ్ఞుల, ఇతర శాస్త్రజ్ఞుల, విషయముకూడ ఇంతే. జ్ఞానమంతయు జ్ఞాత (ఎఱుగ

బడిన) విషయములపై నిలుచును. అట్టి జ్ఞానముమీాదనే మన వాద నిర్మాణము. కాని, అదేమి చిత్రమో, మానవకోటిలో చాలభాగము — ముఖ్యముగా ఈ కాలమున — ఆస్తికధర్మ విషయమున అట్టి జ్ఞానము కలుగుట అసంభవమనియు, కావున వ్యర్థవాదములే మనకు గల ఆధారమనియు, తలంతురు. వ్యర్థ వాదములచే మనస్సును కలవరపెట్టరాదని అందుచేతనే ఇచట చెప్పుట. ఆస్తికధర్మాచరణ మనగా సత్యానుభూతి గాని వాగ్వి వాదములు కావు. మన ఆత్మలను పరిశోధించుకొని అచట ఏమి కలదో కనుగొనవలెను; ఆ కనుగొన్న దానిని గ్రహింపవలెను; గ్రహించినదానిని అనుభూతము చేసికొనవలెను. ఆస్తికధర్మ మనగా అది. వాదోపవాదము లెన్నియైనను ఆస్తికధర్మమును కల్పింపజాలవు. భగవంతుడు కలడా లేడా అను ప్రశ్నను తార్కిక వాదమూలమున పరిష్కరించుట అసాధ్యము. కలడనుటకును లేడనుటకును కూడ వాదము లుండును. కాని దేవు డుండెనేని, ఆ ఉనికి మన హృదయములందే అనుట స్పష్టము. ప్రపంచము కలదా లేదా అను వాద మింకను పరిష్కారము కాలేదు. అది కేవలము భావమయమే అను వారికిని (ఐడియలిస్టుస = ఆదర్శవిజ్ఞాన వాదులు) వస్తుజాల మంతయు కలదు అను వారికిని (రియ లిస్టుస = ప్రత్యక్షవాదులు) వాదము లింకను అనంతముగా చెల రేగుచునే ఉన్నవి. కాని ప్రపంచము కలదనియు, జరుగుచున్న దనియు, మన మెఱుగుదుము. మాటల అర్థమును మార్చుటే మనము చేయుపని. అట్లే జీవితసమస్య లన్నిటి విషయమునగూడ, జరుగుచుండు స్థితిని మఱవరాదు. బాహ్యావస్తుపరిశోధకులవలె మనము ఆంతరంగికవస్తుపరిశోధనలు కావించి కొన్ని సత్యములను గ్రహింపవలెను. వాని ఆధారముతోనే ఆస్తికధర్మ నిర్మాణము చేయవలెను. మతములలో గల ప్రతి అకారణ సిద్ధాంతమును విశ్వసింపవలె నను విపరీతవాదము అంగీకరింపదగనిది. మానవ బుద్ధికి కొంత గౌరవము కలదుగదా! అట్లు నమ్మ మనువాడు తన

ఆత్మగౌరవమును కోల్పోవును. నమ్మికలేని మీరు మీ ఆత్మ గౌరవమును కోల్పోవుదురు. ''మానసికపరిశోధనచే, ఈ యీ సత్యములు మేము కనుగొంటిమి'' అని చెప్పు నధికారము ప్రపంచములోని జ్ఞాన సిద్ధులకు మాత్రమే కలదు. మనమును అట్లు చేసి ఆ సత్యములను నమ్మవచ్చును. అంతకుముందు నమ్మ నవసరము లేదు. ఆస్తికధర్మములో గల బల మింతయే. కాని ఆస్తికధర్మము నాక్షేపించువారిలో నూటికి తొంబదితొమ్మండ్రు తమ మనస్సులను పరిశోధించుకో లేదనియు, ఆ సత్యములు కను గొను యత్నము లే చేయలేదనియు మీరు జ్ఞప్తి పెట్టుకోవలెను. కావున వారి వాదములను కేవలనిరాధారములుగా త్యజింప వచ్చును. సూర్యు డున్నాడని నమ్మువారందఱు బుద్ధిహీనులని యొక గ్రుడ్డివాడు పల్కినచో, ఆ పల్కుల నెవ రైన ఆద రింతురా?

ఈ అపరోక్షానుభూతిభావము మహనీయమైనది. మనము నేర్వవలసినది; వదలకూడనిది. ఆస్తికధర్మము గ్రంథములవలన గాని, దేవాలయములందుగాని లభింపదని గ్రహించుదనుక మత ములలోగల కలకలములు, పోరాటములు, భేదభావములు, నశింపవు. ఆస్తికధర్మ మొక అనుభూతి. దేవుని, ఆత్మను, ప్రత్య క్షముగా చూచినవానికే అది లభించినది. తన మతగ్రంథముల నన్నిటిని ముఖస్థము చేసికొని, అవిరామప్రవాహముగా ఉపన్య సింపగల అత్యున్నత క్రైస్తవమతాచార్యునకును, తుచ్ఛుడై విద్యాగంధమెఱుగని అనాత్మవాదికిని, నిజమైన భేద మేమియు లేదు. మన మందఱము నాస్తికులమే. ఆ సత్యము నంగీకరింతుము గాక! మత భావము బుద్ధికి సమ్మత మైనమాత్రమున మన మాస్తికధర్మ మవలంబించుచున్నా మనుట పొరపాటు. క్రైస్తవుల మనువారికి, మహమ్మదీయుల మనువారికి, లేక యే యితరమతావ లంబుల మనువారికి, అందఱికిని ఇది అన్వయించును. ఏసు క్రీసు కొండపై చేసిన బోధ (సెర్ మెన్ ఆన్ ది మౌంట్) లోని సత్యము

ననుభూతము చేసికొన్నవాఁడా క్షణముననే భగవంతుఁడుగా మాఱిపోవును. కాని ఎన్నోకోట్ల క్రైస్తవులు ప్రపంచములో కలరట. దీని అర్థమే మనగా, మానవజాతి భవిష్యత్కాలమున నెప్పుడో ఆ బోధ ననుభూత మొనర్చుకొనునేమో కాని, ప్రస్తుతము రెండు కోట్లలో నొకఁడైన నిజమగు క్రైస్తవుఁడు లేఁడు.

అట్లే హిందూదేశములో ముప్పదికోట్ల వేదాంతులు కలరందురు. కాని ఇందులో వేయింటి కొక్కఁడైన నిజమగు ఆస్తిక ధర్మానుభూతి కలవాఁ డున్నచో, ఈప్రపంచ మెంతో మాఱిపోయి యుండును. మన మందఱము నాస్తికులమే. కాని నాస్తికుఁడ నని నిజమాడినవానితో యుద్ధమునకు దిగుదుము. మన మందఱము చీకటిలో నున్నాము. మతము లనునవి బుద్ధిగోచరమాత్రములు; పొల్లు మాటలు; అర్థరహితములు! చక్కఁగా ఉపన్యసింపగల వానిని మన మాస్తికధర్మపరు డందుము. కాని అది కాదు ఆస్తికధర్మము. "పదముల కూర్పులో అద్భుతపు పొందిక; శ్రోతల కావేశము గొల్పు వాక్చాతుర్యము; శాస్త్రపాఠములకు వివిధాన్వయము లనుసంధించు శక్తి: ఇవన్నియు విద్యాధికుల కానందముగొల్పు జిత్తులే కాని, ఆస్తికధర్మపరత్వ నిదర్శనములు కావు." మన ఆత్మలలో సత్యానుభూతి ప్రారంభమైనప్పుడుగాని ఆస్తికధర్మము ప్రవేశింపలేదు. అప్పుడే ఆస్తిక ధర్మసూర్యోదయము. అప్పుడుగాని మనము నీతిపరులము కాజాలము. ప్రస్తుతస్థితిలో మనము మృగములకన్న అంతగా ఎక్కువ నీతిపరులము కాము. సంఘములోగల శిక్షాస్మృతులే మనల నదపులో నుంచుచున్నవి. "చోరులను శిక్షింపము" అని సంఘము నేఁడు ప్రకటించెనేని, మన మందఱ మొకరి యింటిపై నొకరు పడి దోచుకొందుము. పోలీసువాఁడు మనలను నీతిపరుల నొనర్చుచున్నాఁడు. సంఘములో పేరుప్రతిష్ఠలకొఱకే మన నీతి ప్రవర్తనము. నిజమునకు మృగములకన్న మన మెక్కువ నీతి

పరులము కాము. ఈ మాటలో నెంతో సత్యము కలదని మన హృదయము తెలుగును. కావున మనము వంచకులము కాకుందుముగాక. మనము ఆస్తికధర్మపరులము కామనియు, ఇతరులను హీనులుగా చూచు నధికారము మనకు లేదనియు, ఒప్పుకొందుముగాక. మన మందఱము సోదరులము, ఆస్తిక ధర్మానుభూతి కలిగినప్పుడు మనము నీతిపరుల మగుదుమనియు ఒప్పుకొందుము గాక.

మీరు చూచిన దేశము నొకరి బలాత్కారముచే చూడ లేదని చెప్పినను, చూచినసంగతి మీ హృదయాంతరాళమున నెలిగియేయుండునుగదా! ఈ బాహ్యప్రపంచముకన్న ఎంతో స్పష్టముగా ఆస్తికధర్మము, భగవంతుడు, మీకు కానిపించియుండెనేని, వానియందు మీకుగల విశ్వాసమును చలింపజేయుట సాధ్యమా? మీకు యథార్థ విశ్వాసము లభించినదని అప్పుడు చెప్పవచ్చును. "ఆవగింజపాటి విశ్వాసమైన గలవాడు" అను మీ బైబిలులోని మాటల కిదియే అర్థము. అప్పటికి మీకు సత్యమెఱుకపడును. మీరే సత్యముగా నైతిరి గదా!

"ఆస్తికధర్మమునుగూర్చి ప్రసంగించుటంతయు నిష్ప్రయోజనము. దాని ననుభవసిద్ధము చేసికొనుడు." అనునే వేదాంత ముఖ్యసూత్రము. కాని ఇది బహుకష్టసాధ్యము. మన హృదయాంతరాళములలో నివసించు ఆ పురాణ పురుషుడు అణువు గర్భములో దాగియున్నాడు. ఋషులతనిని అంతరవలోకన (ఆత్మవిచార) శక్తిచే గ్రహించి, కష్టసుఖములకును, ధర్మాధర్మము లనబడువానికిని, సుకృత దుష్కృతములకును, అస్తిత్వానాస్తిత్వములకును, అతీతులైరి. అతనిని చూచుట అనగా పరమార్థమును చూచుటే. అగుచో, స్వర్గవిషయ మేమి? అసుఖస్పర్శలేని సుఖమే స్వర్గభావము. అనగా, మానవునికి జీవితసుఖములన్నియు కావలయును, కాని జీవితదుఃఖము లే మాత్రమును

వలదు. ఎంత అనుకూలమైన భావము! ఎంత సహజమైనది! కాని ఇది కేవలము భ్రాంతిజనితము. కేవలము మంచి, కేవలము చెడ్డ, అనునవి లేనే లేవు.

రోముపట్టణపు ఒక ధనికుని కథ మీరందఱు విని యేయుందురు. తన ఆస్తిలో పదిలక్షల పౌనులు (సుమారు ఒకటిన్నఱకోటి రూపాయలు) మాత్రము మిగిలియున్నదని అతని కొకనాడు తెలిసెను. వెంటనే అతడు "అయ్యో, రేపు నా గతి యేమి!" అని ఆత్మహత్య చేసికొనెనట. అతనికి పదిలక్షలు మాత్రమే వుండుట పేదఱికము ననుభవించుట! సుఖ మన నేమి, దుఃఖమన నేమి? అది నిరంతరము రూపుమాయుచుండు వస్తువు. చిన్ననాడు నాకు పెట్టెగుఱ్ఱపుబండి తోలుట పరమార్థము. ఆ భావ మిప్పుడు మాఱిపోయినది. ఎప్పటి సుఖమును నమ్ముకొని మనము నిలబడవలెను? ఈ విషయమును అర్థముచేసికొనుటకై మనమందఱము శక్తివంచన లేక ప్రయత్నించవలెను. ఇది మనస్సులను అవలీలగా తనపిడికిలినుండి వీడునదికాదు. కావునదీనిని చక్కగా గ్రహించుట చాల ముఖ్యము. సుఖమను మాటకు ఒక్కొక్కరి కొక్కొక్క అర్థము పొడగట్టును. ప్రతిదిన మొక నల్లమందుగడ్డ మ్రింగినగాని సుఖింపజాలనివాని నొకని నే నెఱుగుదును. వాడు వాంఛించు స్వర్గము నల్లమందుమయమైనది కావచ్చును. కాని నా కది దుష్టస్వర్గము. అరేబియాదేశకావ్యములలో వర్ణింపబడిన స్వర్గములో మనోహరవనవాటికలును, తన్మధ్యమున నదీప్రవాహము లును, కానవచ్చుచుండును. మాదేశములో మితిమీఱిన జలసమృద్ధి కలదు. వఱదలలో పెక్కుగ్రామములు మునిగిపోవుచుండును; వేనవేలు జీవములు నశించుచుండును. కావున నా స్వర్గలోకములో వనములు, నదులు, ఉండవు. కొద్దిపాటి వానలు గల స్వర్గమును నేను వాంఛింతును. మనల నాహ్లాదపఱచు వస్తువు లెప్పుడును మాఱుచుండును. వయసువాడు కలగాంచు స్వర్గలోకమున వాని కొక చక్కని భార్యయుండును.

వాడే ముదుసలియైనపిదప భార్య అక్కఱలేదు. ఎవ రెవరి స్వర్గము వారివారి అక్కఱల కనురూపమై యుండును. అక్కఱల తోపాటు స్వర్గముకూడ మాఱుచుండును. ఇంద్రియభోగములే పరమార్థముగా గలవారు కోరు స్వర్గము మనకు లభించెనేని, మన మభివృద్ధి నొందజాలము. ఆత్మకు అంతకన్న ఘోరశాపము తగుల జాలదు. కొంచెముసేపు ఆడి, కొంచెముసేపు ఏడ్చి, అంతట పడి చచ్చుట— కుక్కవలె! ఇంతేనా మనకు సాధ్యము? ఇట్టి విషయములు కోరువారు మనుష్యజాతి నెట్టి ఘోరశాపము పాలుచేయుచున్నారు! యథార్థసుఖము నెఱుగక, ఈ ప్రాపంచిక సుఖములకై ఆరాటపడువారు చేయున దిదియే. తత్త్వశాస్త్ర ములు బోధించునది యథార్థసుఖము నెఱుగుమని గాని, సుఖ మును పరిత్యజింపుమని కాదు. నార్వేదేశస్థుల స్వర్గము భయంకర యుద్ధభూమి. అందఱును ఓడిన్ (వారి ముఖ్యదైవము) ఎదుట కూర్చుండుదురు. ఒక అడవిపందిని వేటాడి, పిదప యుద్ధములో నొకరినొకరు చీల్చి చెండాడుకొందురు. ఏదో వింత విధమున గాయము లన్నియు కొంతసేపటికి మానిపోయి అందఱు నొక పెద్ద చావడిలో చేరుదురు. అచ్చట పంది కాల్చి పక్వముచేసి పెట్ట బడియుండును. అందఱును స్వేచ్ఛగా తిని త్రాగి సుఖింతురు. ఆ పంది మరల బ్రదికి మఱునాటి వేటకు సిద్ధముగా నుండును. ఇది చాలవఱకు మన స్వర్గమువంటిదే. దానికన్న దుష్టము కాదు —మన భావము లొకవేళ కొంత ఎక్కువ నాజూకైన వేమో. నార్వేవారి కెట్లు ప్రతిదినము వేటాడి చంపి తినబడు అడవిపంది మఱునాటి వేటకును, అనుభూతికిని, సజీవమై యుండునో అట్లే మనమును అడవిపందులను వేటాడి, పిదప సర్వభోగమయ మగుచోటికి పోగోరుదుము.

వృద్ధిక్షయములు లేక నిత్యముగా నుండు సుఖ మొకటి— పరమసుఖము — కలదని తత్త్వశాస్త్రసిద్ధాంతము. మనమిచట గాంచు వేడుకలు, ఉల్లాసములు, ఆ సుఖమే కాజాలవుగాని, సుఖ

మొక్కటియే యనియు, ఈ జీవితములో కానవచ్చు ప్రతిసుఖ లేశము ఆ పరమసుఖములోని అంశమే యనియు, వేదాంతము చెప్పును. ప్రతిక్షణమును మన మా పరమసుఖమునే అనుభవించు చున్నాము గాని, అది ప్రచ్ఛన్నమై (కప్పబడుపడి), సరిగా గ్రహింపబడక, వికారరూపమున కానవచ్చుచుండును. ఎచ్చ టెచ్చట ఇష్టసిద్ధిజరుగునో, సుఖమగ్నత కానవచ్చునో, ఆనందము గోచరించునో—చివరకు చోరునకు చౌర్యమువలన కలిగిన సుఖ మైనను — అచ్చట నంతయు ఆ పరమసుఖమే ప్రకటితమగు చున్నది. కాని కప్పబడి, వివిధములగు అన్యవిషయములతో కలిసిపోవుటచే తేటదనము కోలుపోయి, తప్పుగా గ్రహింపబడు చున్నది. దానిని సరిగా గ్రహింపగోరువారు త్యాగమార్గమును పట్టవలెను. అజ్ఞానమును విడువవలెను. అసత్యముగా నుండుదాని నంతయు విడువవలెను. అప్పుడు సత్యము గోచరింప నారంభ మగును. సత్యము అనుభవసిద్ధమైనపిదప మొదట త్యజింపబడిన వస్తువు లన్నియు నూత్నరూపములతో, నూత్నవిధమున, కానిపిం చును. వానియందు దైవత్వము తోచును. అప్పు డవి పరిశుద్ధ ములును, మహోదాత్తములును, అగుటచేత వాని యథార్థరూప మును మనము గ్రహింప గల్గుదుము. కాని, సత్య మొక్కసారి, ఒక్కక్షణ దర్శన మొసగిన పిదపనే, ఇట్లు గ్రహించుట సాధ్య మగును. వానిని మొదట పరిత్యజింపవలెను; పిదప నవి- దైవాకృతితో — మరలవచ్చును. మన యారాధన నపేక్షిం చును, మన తాపములను, దుఃఖములను, క్షుద్రసుఖములను : అన్నిటిని విడనాడవలెను.

''సర్వవేదములు దేనిని వచించుచున్నవో, సర్వతపస్సులు దేనిని ప్రకటించుచున్నవో, దేనిని వాంఛించి నరులు బ్రహ్మచర్య మాచరింతురో, దానిని నీ కొక్కమాటలో చెప్పెదను. అది 'ఓమ్.' '' ఈ ఓంకారమును వేదము లపారముగా ప్రశంసించు

ననియు, అది అత్యంత పవిత్రముగా పరిగణింపబడుననియు మీా రెఱుగగలరు.

"శరీరపతనానంతరము మానవు డేమగును?" అను ప్రశ్నకు యముఁ డిప్పుడు సమాధాన మిచ్చుచున్నాడు: "ఈ జ్ఞానికి జననమరణములు లేవు. అతడు దేనినుండియు ప్రభవింపలేదు. ఏదియు అతనినుండి ప్రభవింపలేదు. ఈ అజుడు (పుట్టుకలేనివాడు) నిత్యుడు, శాశ్వతుడు, అగు పురాణ పురుషుడు, శరీరము నశించినప్పుడు కూడ నశింపడు. చంపుచున్నట్లు హంత (చంపువాడు) తలంచినను, హతుడు (చంపబడువాడు) చచ్చుచున్నట్లు తలంచినను, ఉభయులు చక్కగా నెఱుగరు. ఆత్మ చంపదు, చంపబడదు." ఎంత మహోన్నత సిద్ధాంతము! ప్రారంభముననున్న విపశ్చిచ్ఛబ్దమును గమనింపుడు. ఆత్మ నిత్యబుద్ధము (జ్ఞానమయము), నిత్యశుద్ధము అని వేదాంత బోధ. ఈ లక్షణములు కొన్ని భూతములలో దీప్తిమంతములై ప్రకాశించుచుండును, కొన్నిటిలో మందములుగా తోచుచుండును. భూతముల కొండొంటికి గల భేద మిదియే. మానవులొక్కొక్కరికిని, మానవులకును ఇతరభూతములకును, కలది "ప్రకారభేదము" కాదు, "పరిమాణభేదమే." అనగా, జాతిభేదమే మాత్రమును లేదు. లోపలనుండు శక్తి పైకి గోచరించుటలో గల హెచ్చుతక్కువలందే భేదము. నిత్యానందము, నిత్యశుద్ధము, నిత్యపరిపూర్ణము అగు ఆ అఖండవస్తువే ప్రతివానికిని మూలము; ప్రతివానియందు గల సత్యము. పుణ్యాత్ములందును, పాపాత్ములందును; సుఖజీవులందును, దుఃఖజీవులందును; సురూపులందును, కురూపులందును; మానవజాతియందును, మృగజాతులందును: సర్వత్ర దీపించుచుండునది ఆ ఆత్మయే, ఆ పరంజ్యోతియే. దాని ప్రకాశము వ్యక్తమగుటలో పరిమాణభేదములుండును. అదియే ఈ భేదము లన్నిటికి కారణము. కొందఱిలో

ఇది ఎక్కువగాను, కొందఱిలో తక్కువగాను, కానిపించును. కాని, ఈభేదములచే ఆత్మలో ఎట్టిమార్పులును కలుగవు. వస్త్రధారణవైఖరిచే ఒకరిశరీరములో ఎక్కువభాగము, మఱియొకరి శరీరములో తక్కువభాగము, కానిపించినమాత్రమున వారి శరీరములు మార్పుచెందునా? మఱొక విషయము నిచట జ్ఞప్తి యుంచుకొనుట మంచిది: వేదాంతమతమం దెచ్చటను మంచిచెడుగుల ప్రస్తావమే లేదు. అవి భిన్నవస్తువులు కావు. ఒకే వస్తువు. పరిమాణభేదములచే దానికా పేర్లు వచ్చును. నేడొకవస్తువును నేను సుఖప్రద మందును. రేపు నా స్థితిగతు లభివృద్ధి నొందినప్పుడదే వస్తువును అసుఖప్రద మందునేమో! చలిపోగొట్టి సుఖమునిచ్చు అగ్నియే మనలను భస్మీకరింపవచ్చును. ఆతప్పు అగ్నిదా? ఆత్మ పరిశుద్ధము, పరిపూర్ణముఅగుటచే, దుష్కృతము లొనర్చువాడు తనయెడ తానే అసత్యప్రవర్తన మొనర్చుకొనుచున్నాడు. అతడు తన స్వభావమునే ఎఱుగడు. హంతకునియందు కూడ పరిశుద్ధాత్మ నిలిచియే యుండును, చావదు. అట్లు ప్రవర్తించుట వానిలోపము. తన పరిశుద్ధాత్మను గోచరింపజేయు శక్తి వానికి లేకపోయెను. దానిని కప్పిపెట్టుకొనెను. తన్ను చంపుచున్నారనుకొను వానిలోకూడ ఆత్మ చావదు. అది నిత్యము. దానిని చంపుట, నశింపజేయుట, అసాధ్యము. "అణువుల (అత్యంతస్వల్పవస్తువుల) కన్న ఎంతో అణీయము (చిన్నది), మహిత (మిక్కిలిపెద్ద) వస్తువులకన్న ఎంతో మహీయము (పెద్దది) అయి పరమాత్మ మనుష్యులహృదయ గుహాంతరాళమున నిహితుడై యున్నాడు. పాప(వాంఛా) రహితులు శోకములులేనివా రగుటచే, దైవానుగ్రహమువలన అతనిని దర్శింతురు. ఆత్మ శరీరములం దవస్థితుడై యుండియు అశరీరుడనియు, దేశస్థితుడైనట్లు కానిపించుచుండియు దేశాతీతుడనియు, పరిపూర్ణుడనియు, సర్వగతుడనియు, ఎఱిగి ధీరులు వీతశోకులై యుందురు."

"ఈ ఆత్మ వాక్ఛక్తిచేతగాని, మేధామహనీయత (బుద్ధి బలము) వలనగాని, వేదాధ్యయనమువలనగాని, లభ్యముకాదు." ఇది మిక్కిలి సాహససిద్ధాంతము. మన ఋషుల బుద్ధిప్రచారము నిరంకుశవిజృంభణము కలదనియు, నిర్భయముగా వా రెంత నూత్నసత్యమునైనను ప్రకటింతు రనియు, ఇప్పటికే చెప్పియుంటిని. క్రీస్తుమతస్థులు తమ బైబిలు నాదరించుటకన్న ఎన్నోరెట్లు ఉన్నతమైన భావముతో హిందూదేశములో ఈ వేదము లాదరింపబడునని మీరు జ్ఞప్తియుంచుకోవలెను. సత్యావిష్కరణ (రెవలేషన్)మనగా ఒక మానవుడు దైవప్రేరితుడై తెలిపిన సత్యమని మీ అర్థము. వేదములో ఉండుటచే ఈ పదార్థము లన్నియు కలిగినవని హిందూదేశీయుల భావము. 'సృష్టియంతయు వేదములందు, వేదమూలమున, కలిగినది. జ్ఞాన మనబడున దంతయు వేదములందు కలదు. అందలి ప్రతివాక్య పవిత్రము, నిత్యము : ఆత్మవలె నిత్యము, ఆద్యంతరహితము. సృష్టికర్త భావ మంతయు ఈ గ్రంథమున నున్నదనవచ్చును.' వేద మీ దృష్టితో ఆదరింపబడును. ఒక కార్యము నైతిక మను టేల? వేదము లట్లు పల్కును గనుక. ఒక కార్యము అనైతిక మనుటేల? వేదము లట్లు పల్కును గనుక. ఇట్లుండియు ఈ ఋషులు వేదాధ్యయన మెంత చేసినను, పరమసత్యము తెలియరాదనిరి. ఎంత సాహసము! "ఈ పరమాత్మ డెవనియెడల సంప్రీతు డగునో ఆ మానవుని కతడు వివరించుకొనును." అతనికి పక్షపాతభావము కలదా అను ఆక్షేపణవచ్చునని యము డిట్లు విశదీకరించుచున్నాడు : "దుశ్చరితులకు, అశాంతమానసులకు, సత్యజ్యోతి ఎన్నటికిని గోచరింపదు. ఇంద్రియనిగ్రహమును, త్రికరణశుద్ధిని, సత్యసందీప్తహృదయముగలవానికి నిర్దిష్ట కర్తవ్య నిర్వహణమున సిద్ధహస్తుడైనవానికి సాధించినవానికి మాత్రమే ఈ ఆత్మ సాక్షాత్కరించును."

ఈ చక్కని ఉపమానమును చూడుడు. ఆత్మను రథిగను, శరీరమును రథముగను, బుద్ధిని సారథిగను, మనస్సును పగ్గములుగను, ఇంద్రియములను గుఱ్ఱములుగను భావించుకొనుడు. ఎవని గుఱ్ఱములు బాగుగావశ్యములై యుండునో, ఎవని పగ్గములు దృఢములై సారథి (బుద్ధి) చేతికి బాగుగా స్వాధీనములై యుండునో, వాడు గమ్యమగు విశ్వాత్మకపదము చేరును. కాని ఎవని గుఱ్ఱములు (ఇంద్రియములు) వశ్యములుకావో, ఎవ్వని పగ్గములు (మనస్సు) చక్కగా నడుపబడుటలేదో, వాడు నశించును. సర్వభూతములందు నిగూఢమై యుండు ఆత్మ ఇంద్రియదృష్టికి ప్రకాశింపదు. నిర్మలము, కుశాగ్రతీక్ష్ణము, అగు బుద్ధిగల సూక్ష్మదర్శులకుమాత్రమే అది గోచరించును. శబ్ద స్పర్శరూపరసగంధముల కతీతమై, అవ్యయమై, నిత్యమై, అనాద్యనంతమై, ప్రకృతికికూడపరమై (అతీతమై) యుండు ధ్రువపదార్థము నెవడు సాక్షాత్కరించుకొనునో, వాడు మృత్యుముఖమునుండి విమోచనమందును. కాని ఇది అత్యంత దుర్గమమార్గము ; కత్తివాదరపై నడచుట వంటిది ; మిక్కిలి దూరము; అపాయకరము. కాని నడుముగట్టి ముందంజ వేయుడు. ఉస్సురుస్సురనకుడు. నిరుత్సాహము చెందకుడు, లెండు, నిదుర మేలుకొండు, గమ్యము లభించువఱకు ఆగకుడు!

అపరోక్షానుభూతియే ఉపనిషత్తు లన్నిటిలో గల కేంద్రభావము. ఎన్నియో సమస్యలు మనలను—ముఖ్యముగా ఆధునిక కాలపువారిని—ఎదుర్కొనుచుండును. 'ఇది ఎట్లు ఉపయుక్తము?' అను ప్రశ్న ఇప్పుడు ప్రతివిషయమును గూర్చియు బయలుదేఱుచుండును. ఇతర ప్రశ్నలుకూడ ఎన్నియో ఉండును. ఈ ప్రశ్నములను పరిష్కరించుటలో మన జీవితమున నిప్పటి కేర్పడియున్న భావసంసర్గము లెంతో ప్రబలమగు పాలు వహించును. ఈ భావసంసర్గములు (అసోసియేషన్ ఆఫ్ ఐడియాస్) మన మనస్సులపై

నిరంకుశపరిపాలన మొనర్చుచుండును. చిన్ననాటినుండియు సగుణ బ్రహ్మమునుగూర్చియు, మనస్సుయొక్క వ్యక్తిత్వమును గూర్చియు, వినుచున్నవారి కీ భావములు మిక్కిలి కటువుగను నిష్ఠురముగను తోచును గాని, వా రవి చక్కగా ఆలకించి విచారించినచో, అవి వారి జీవితములలో కలిసిపోయి, భయ పడుపకుండును. "వేదాంతము ఎట్లుపయోగకరము?" అనునది సామాన్యముగా నడుగబడు ముఖ్య ప్రశ్నములలో నొకటి. ఆ ప్రశ్న కొక్కటే సమాధానము. ప్రయోజనవాదులు (యుటిలి టేరియన్స్) మానవులకు సుఖాన్వేషణ మంచిదే అనుచున్నారు గదా! అగుచో, ఆధ్యాత్మిక చింతనచే సుఖమొందువా రావిధ మగు సుఖమునేల అన్వేషింపరాదు? అనేకులకు ఇంద్రియభోగ ములు సుఖప్రదములు గనుక వారు వాని నన్వేషింతురు. కొందఱి కవి రుచింపక ఉత్తమసుఖములం దాసక్తి యుండును. కుక్క సుఖ మంతయు కూడుసీళ్లయందే. భౌతికపరిశోధకు డొకడు సర్వమును వీడి, పర్వతాగ్రమున నివసించి, యొక నక్షత్రస్థానమును పరీ క్షించుచుండును. వాని కందుచే కలుగు ఆనందమును కుక్క గ్రహింపగలదా? అది వానిని చూచి పిచ్చివాడని నవ్వవచ్చును. పాప మీ పరిశోధకుడు నిఱుపేదయై, వివాహమాడక, మిక్కిలి నిరాడంబరముగా జీవించుచున్నాడేమో. కుక్క వానిని పరిహ సింపవచ్చును. కాని దాని కత డిట్లు సమాధానము చెప్పును: "నీ సుఖ మంతయు ఇంద్రియములందే. ఆ సుఖము నీ వనుభవిం తువు. అంతకు మించి నీ వేమియు నెఱుగవు. కాని నా కిది మహానందమునిచ్చు జీవితము. నీ సుఖమును నీ యిచ్చవచ్చిన ట్లనుభవించు అధికారము నీకున్నచో, నాకును అట్టి అధికారము కలదు." ప్రపంచము నంతయు మన భావక్షేత్రమునకు దించి, ప్రపంచ మంతటికిని మన బుద్ధిని ప్రమాణ మొనర్పజూచుటయే ఇందు గల ప్రమాదము. మామూలు ఇంద్రియవిషయములు నీ కత్యంత హర్షమును గూర్పవచ్చును. నా కట్లు కూర్పకపో

వచ్చును. నీ మార్గమే సరియైనదని నీవు వాదింతువేని, నేను కాదందును. సాంసారికహితవాదికిని (వరల్డ్లి యుటిలిటేరియన్ = ఉపయోగమే ఆదర్శముగాగల లౌకికునికిని) ఆస్తికధర్మాచరణునకును ఇదియే భేదము. మొదటివాడు "నే నెంత సుఖపడుచున్నానో చూడుము, ద్రవ్యము సంపాదించుకొనుచున్నాను, ఆస్తికధర్మవిషయమునే నేను పెట్టుకొనను, దానిని సాధించుట చాలకష్టము, అది లేనందున నేను హాయిగా ఉన్నాను" అనును. ప్రయోజనలక్ష్యము గలవారికి — వారికి మాత్రము — ఇది బాగైనదే. కాని ఈ ప్రపంచము ఘోరమైనది. తోడి లోకులను బాధింపక యెవ డెంత సుఖము పొందినను, అవశ్యము పొందనిండు. కాని అతడు నాయొద్దకు వచ్చి "నీవుకూడ నావలెనే ప్రవర్తింపవలెను. అట్లు చేయవేని నీవు మందమతివనిపించుకొందువు" అని చెప్పినచో, నే నీ సమాధానము చెప్పుదును : "నీవు పొరపడుచున్నావు. ఆ వస్తువులు నీకు చాల సుఖప్రదములు కావచ్చును గాని, నాకవి ఏ మాత్రమును గిట్టవు. ధనము సంపాదించుటే గమ్యముగా జీవింపవలసినచో, జీవితము నిస్సారమగును. అంతకన్న చచ్చుట మేలు." ఆస్తికధర్మపరు డిచ్చు సమాధాన మిది. అసలు సత్యమే మనగా, ఈ క్షుద్రవిషయములతో సంబంధము వదలుకొన్నవారికే ఆస్తికధర్మజీవనము సాధ్యము. ప్రతివాడును వానిని మొదట ననుభవింపవలెను. అవి పూర్తిచేసికొన్నపిదపగాని, రెండవ ప్రపంచము పొడచూపదు.

ఇంద్రియభోగములనుగూర్చి కొందఱికి మఱొకభావము కూడ కలదు. అసలు కల్పించి తప్పుత్రోవకు లాగు అపాయకరమగు భావ మిది. ప్రాచీనకాలమునుండి ప్రతి మతమునందును ఈ భావము కానిపించును. కాలపరిపాకమున జగత్తులో గల అసుఖము లన్నియు నశించి, సుఖములు, భోగములు, మాత్రమే మిగిలి, ఈ భూలోకము స్వర్గలోకముగా మాఱిపోవు నట!

నే నిది విశ్వసింపను. భూలోక మెప్పటికిని ఇట్లే ఉండును. ఇట్లనుట మిక్కిలి భయంకరమేగాని, నాకు గత్యంతరము లేదు. ఈలోక ములోని అసుఖరాశి జీర్ణించిన కీళ్ల వాతము వంటిది. శరీరములో నొక భాగమునుండి తఱిమినయెడల అది మఱొక భాగమునకు పోవును. అచ్చటనుండి తఱిమిన నింకొకచోట బాధింపనారంభించును. ఏమి ప్రతిక్రియలు చేసినను అది నిలిచియే ఉండును. ఆదిమకాలమానవు లడవులలో నివసించుచు, ఒకరినొకరు తినుచుండిరి. ఈ కాల మున నొకరినొకరు తినరు; ఒకరినొకరు మోసముచేయుదురు. ఎన్నో దేశములు, ఎన్నో పట్టణములు, ఈ మోసములచే అధో గతిపాలగుచున్నవి. ఇది అభివృద్ధియా? లోకాభివృద్ధి యనబడు నది వాంఛాభివృద్ధియే అని నా భావము. వాంఛలే—ఈ యాచక బుద్ధియే— క్లేశము లన్నిటికిని కారణమని నా దృఢవిశ్వాసము. యాచకునకు చూచినదానిపై నెల్ల వాంఛ. అత డెప్పుడును ఏదో యొక దానికై యాచించుచుండును. అతని వాంఛలకు అంతము లేదు. వాంఛలు తీరు నవకాశము పదింతలు పెరిగినచో, వాంఛల బలము నూఱింతలు పెరుగును. లోకమున గల సుఖరాశియు, అసుఖరాశియు, ఏ కాలమున చూచినను ఇంచుమించు సమము గనే ఉండును. సముద్రములో లేచు ప్రతి అలయు, ఒక పల్లము నెచ్చటనో కల్పించియే యుండును. ఒక మనుష్యునికి సుఖము కలిగినచో, మఱియొక మనుష్యునికి—లేక యొక జంతువునకు— అసుఖము కలిగియే యుండవలెను. మనుష్యుల సంఖ్య పెరిగి పోవుచున్నది. జంతువులలో కొన్నిజాతులసంఖ్య తఱిగి పోవు చున్నది. మనము వానిని చంపి, వాని విహారభూమి నాక్రమించి, వాని జీవనాధారములను నిర్మూలించుచున్నాము. ఇదియేనా సుఖాభివృద్ధి? బలిష్ఠజాతులు బలహీనజాతులను బలిగొను చున్నారు. కాని బలిష్ఠజాతికి సుఖము చేకూరినదా? లేదు. వా రొకరినొకరు చంపుకొన నారంభింతురు. ఈ భూలోక మెట్లు స్వర్గము కాగలదో నాకు తోపకున్నది. యథార్థస్థితి ఇందుకు

విరుద్ధము. యుక్తియుక్తముగా ఆలోచించినను, అది అసంభవ మనియే తోచును.

సమగ్రత్వము పరిపూర్ణమందుగాని కానరాదు. మనము స్వభావసిద్ధముగనే పరిపూర్ణులము. ఆ పరిపూర్ణతను వ్యక్తపఱచుటకే మన ప్రయత్నము. మీరు, నేను, సర్వభూతములు, దానిని వ్యక్తపఱచుటకే యత్నించుచున్నాము. ఈ భావమువఱకు చిక్కులేమియు లేవు. కాని దీని యాధారముతో జర్మన్ తత్త్వవిచారపరు లొక విపరీతవాదమును తెచ్చుచున్నారు. ఈ వ్యక్తీకరణమట క్రమక్రమసమగ్రతనంది, చివరకు పరిపూర్ణమై, మనలను పరిపూర్ణుల నొనర్చునట! పూర్ణాభివ్యక్తి (పెర్ఫెక్ట్ మానిఫెస్టేషన్) అనగా నేమి? పరిమితముకానిది పరిపూర్ణము. పరిమితభావముకలది వ్యక్తీకరణము. అనగా మనము పరిమితులము కానట్టి పరిమితుల మగుదుము! పరస్పరవిరుద్ధభావముల సమ్మేళనము! పసిబిడ్డల కిది సుఖము నీయవచ్చును. వారి నవి సంతృప్తి పఱచవచ్చును. కాని వారి మనస్సులు అసత్యభావములతో నిండి కలుషితములై పోవును. ఆస్తికధర్మాభివృద్ధి కిది ప్రతికూలించును. కాని స్థానభ్రష్టతవలననే యీ భూలోకజీవనము దాపురించిన దనియు, మనుష్యుడనగా పతితుడైన భగవంతుడే అనియు, ఆదాం పతనమొందెననియు, మన మెఱుగుదుము. మనుష్యత్వ మనునది భ్రష్టదశయని బోధింపని మతమే ఈ కాలమున లేదు. పాటు నొందిమనము మృగదశకు వచ్చితిమి. ఇప్పుడు మరల పైకెగ బ్రాకుచున్నాము. చివరకు దాస్యవిముక్తి నొందగలము. కాని ఇక్కడ నున్నంతకాలము పరిపూర్ణత్వమును సమగ్రముగా వ్యక్తపఱుపజాలము. అందుకై ఎంతో పాటుపడుదుముగాని, ఇంద్రియబద్ధులమై యున్నంతకాలము పరిపూర్ణతను వ్యక్తపఱచుట అసంభవ మని తెలిసిపోవు దినము వచ్చితీఱును. ఇచ్చటినుండి అప్పుడు మరలి మన పూర్వపరిపూర్ణత్వముదెస ప్రయాణింప నారంభింతుము.

ఇదియే త్యాగమార్గము. మనము ప్రవేశించిన మార్గమున కెదుటిత్రోవ పట్టుటయే త్యాగమార్గము పట్టుట. నీతిశాస్త్రము లా వెంటనే ప్రారంభమగును. నీతిశాస్త్రము లన్నిటికి మూలసూత్ర మేది? ''నాఽహం, త్వమసి'' (నేను కాదు, నీవు). బాహ్యజగత్తునకు వ్యక్తపఱచుకొను యత్నమున సర్వమూలమగు పరిపూర్ణమే ఈ ''నేను''గా పరిణమించుచున్నది. అట్లుత్పత్తియైన యీ ''నేను'' (అహమ్) ఈ స్వల్ప (పరిమిత) స్థితి నుండి ఎగసి తన యథార్థ తత్త్వమగు పరిపూర్ణములో చేరిపోవలెను. ''సోదరా, నేను కాదు నీవు'' అన్నప్పు డెల్ల నీ వల్లెగసిపోవ ప్రయత్నించుచున్నావు. కాని, ''నీవు కాదు నేను'' అన్నప్పు డెల్ల ఇంద్రియప్రపంచముద్వారా పరిపూర్ణుని వ్యక్తపఱుపజూచు ప్రమాదములో పడుచున్నావు. అందుచే పోరాటములు, ఆరాటములు, ఉప్పతిల్లును. కాని, కొన్నాళ్లకు త్యాగబుద్ధి వచ్చితీఱును— శాశ్వతత్యాగబుద్ధి. క్షుద్ర ''అహము'' అంతరించినది: 'ఈ స్వల్ప జీవితముపై ఇంత ఆసక్తి యేల? ఇందో, ఎందో, బ్రదికి సుఖము లనుభవించు వ్యర్థవాంఛలు మరణమును తెచ్చును.'

మృగములనుండి మానవులు పరిణమించి రనినచో, భ్రంశ మొందిన మానవులు మృగములైరని యనరాదా? కాదని మీ కెట్లు తెలియును? జీవులు క్రమోన్నతములై, అతిస్వల్పములు మొదలు అతిమహితములవఱకు చూపట్టుచుండుటే కదా పరిణామవాదమున కాధారము? గమన మెప్పుడును క్రిందినుండి పైకే గాని, పైనుండి క్రింది కెప్పుడు నుండదని దీనినిబట్టి ఎట్లు తేలుచున్నది? రెండు విధముల వాదములును చెల్లును. రెండు వైపుల మార్పులు — ఒకదాని పిదప రెండవది — జరుగుచున్న వనియే నా నమ్మకము. సంకోచము (ఇన్వాల్యూషన్) లేని వ్యాకోచము (ఇవొల్యూషన్) ఎట్లుండగలదు! ఉత్తమజీవితముకై మనకు గల కాంక్ష ఉన్నత జీవితమునుండి భ్రంశమొందితిమని సూచించు

చున్నది. సూక్ష్మాంశభేద మేమైన ఉండునేమో కాని, మొత్తమున కిది సత్యమే కావచ్చును. కాలపరిపాకమున మనమందఱము పరిపూర్ణత నందుదుము కాని, ఈ పరిమిత జగత్తును త్యజించిన గాని అది జరుగదని క్రీస్తు, బుద్ధుడు, వేదాంతము ఐక్యకంఠముగా చెప్పుచున్నవి. నే నది దృఢముగా విశ్వసించుచున్నాను. ఈ జగత్తు తుచ్ఛము. దానిని గొప్పచేసి చెప్పినచో, అదియొక బీభత్స వికృతరూపమనియు, సత్యమునకు నీడవంటిదనియు, అనవచ్చును. సత్యమే మనకు గమ్యము. త్యాగ మచటికి మార్గము. మన జీవితమున కది మూలాధారము. స్వార్థభావము లేని క్షణములందే మనము సత్యజీవితసుఖమును, మనలోని దివ్యత్వమును, చవి చూచుచున్నాము. క్షుద్రమును, భిన్నతారూపమును, అగు ఈ "అహము" అంతరింపవలెను. మనము సత్యమునం దున్నా మనియు, ఆ సత్యమే దైవమనియు, అతడే మన యథార్థతత్త్వ మనియు, అత డెప్పుడును మనలో, మనతో, ఉన్నాడనియు, మన కప్పుడు బోధపడును. అతనియందు మనము జీవింతుముగాక! అతనియందు సుప్రతిష్ఠితుల మగుదుముగాక! అదియే ఆనందస్థితి. ఆత్మక్షేత్రమున జీవించు జీవితమే జీవితము. ఆ అనుభూతి నొందుటకు మన మెల్లరమును ప్రయత్నింతుముగాక!



# నానాత్వములో ఏకత్వము

(లండనులో ఉపన్యాసము : 3-11-1896)

"స్వయంభువు (బ్రహ్మ) ఇంద్రియములను బహిర్గతములగునట్లు చేసినాడు. కావున మానవుడు బాహ్యాలోకమును చూచునుగాని అంతరాత్మను చూడడు. అమృతత్వమును (మోక్షమును) అభిలషించిన ధీరుడొకడు ఆవృత్తచక్షుడై (చూపు లోనికిత్రిప్పి) ప్రత్యగాత్మను (తనలోని యాత్మను) దర్శించెను." వేదములలో మొదట కానవచ్చునది బాహ్యావస్తువిచారమే యని ఇప్పటికే తెలిపియున్నాను. 'వస్తువుయొక్క తత్త్వము (సత్యము) బాహ్యాలోకమున (బహిరవలోకనమున) కానరాదు. అందుకు అంతరవలోకనము (ఆత్మవిచారము) ఆవశ్యకము' అను నూత్న భావము పిదప గోచరించెను. ఆత్మను సూచించుట కిచట నుపయోగింపబడిన శబ్దము మిక్కిలి భావవ్యంజకమైనది: "లోపలికేగినవాడు; మనలోగల అగాధసత్యము; హృదయకేంద్రము; బహిర్గతమగు సర్వమునకును ఉత్పత్తిస్థాన మనదగిన మూలగర్భము; మనోబుద్ధులు, ఇంద్రియములు, మున్నగునవన్నియు దేనినుండి వెడలిన కిరణముల వంటివో ఆ మధ్యగత సూర్యమండలము." "అల్పబుద్ధులు, మూఢులు, బాహ్యాకామముల ననుసరించుచు వితతమగు (మిక్కిలి వ్యాప్తిగల) మృత్యుపాశములో చిక్కుపడి పోవుదురు. కాని ధీరులు అమృతత్వము నెఱిగి ఈ అధ్రువ (అనిత్య) వస్తుప్రపంచ జీవితములో ధ్రువ (నిత్య) పదార్థముకై వెదకులాడరు." ఇందు ఆ పైభావమే — అనిత్య వస్తుమయమగు ఈ బాహ్యాలోకమున నిత్యుని చూచుటయు, కన్గొనుటయు, అసంభవము అనుభావమే — స్పష్టపఱుపబడినది. నిత్యమగు పదార్థమందే నిత్యునికై అన్వేషింపవలెను. మనకు గల నిత్యపదార్థము మనలోపలనుండు ఆత్మయొక్కటియే.

శరీరము, మనస్సు, భావములు, మన చుట్టు చూపట్టు ప్రపంచము: ఇవన్నియు అనిత్యములే. ఈ సర్వమునకును స్వామి; హృదయాంతరాళమున నుండు నిత్యజాగరూకుడు; సర్వసాక్షి; మానవుని ఆత్మ: అత డొక్కడే నిత్యుడు. కావున ఈ అఖిలవిశ్వమునకు కారణభూతుడగు ఆ నిత్యు నన్వేషించువా రచటికే పోవలెను. అచటగాని అతడు కానరాడు. "ఇచట ఏదికలదో, అచటకూడ అదియే కలదు. అచట నుండునదే ఇచటకూడ కలదు. నానాత్వమును చూచువాడు మాటిమాటికి మృత్యువువాతపడుచుండును." ఆదిమకాలమున జనులు స్వర్గమున కేగ వాంఛించుచుండిరని మన మెఱుగుదుము. తాము నివసించుచుండిన జగత్తు వారికి అసంతృప్తికరముగా తోచెను. అందుచే "మరణానంతరము శోకరహితము, హర్షమయము అగుచోటికి ఏగుదుము" అని వారు తలచుట సహజమే గదా. ఇట్టి స్థలము లనేకములను కల్పించుకొని వానికి స్వర్గములని పేరిడిరి. వారి బుద్ధికి అవి శాశ్వతసుఖావాసములు; అచట మనశ్శరీరములు దృఢములు, వ్యాధిరహితములు; పితరులతో కూడిన నివాసము. కాని తత్త్వవిచారము ప్రారంభ మవుటతోడనే ఇవన్నియు అసంభవములగు వెఱ్ఱియూహలని తెలిసిపోయెను. "పరిపూర్ణత్వ ముండు స్థలము" అనుటలో భావవిరుద్ధతాదోషము కలదుగదా. స్థలము ఆద్యంతసహితము, పరిపూర్ణత్వము ఆద్యంతరహితము. కావున ఈ భావము పరిత్యజింపవలసివచ్చెను. ఆ స్వర్గములలోని దేవత లొకప్పుడు మానవులుగా నుండి సత్కర్మాచరణఫలముగా దేవతలైరనియు, దేవత్వము లన్నియు వేర్వేఱు స్థితులు వేర్వేఱు పదవులు అనియు, వేదములలో పేర్కొనబడిన దేవత లెవ్వరును శాశ్వత జీవులు కారనియు, వారికి తెలియవచ్చెను.

ఇందుకు నిదర్శనము: ఇంద్రుడు, వరుణుడు అను పేళ్లు గల పురుషులు లేరు. అవి దిక్పాలకవర్గములోని పదవుల పేళ్లు. తొల్లిటి ఇంద్రుడును, ఇప్పటి ఇంద్రుడును భిన్నులు. అప్పటి

యింద్రుడు మరణించినపిదప భూలోకమునుండి మఱొక డా పదవి నధిష్ఠించెను. అట్లే దేవత లందఱును. అవన్నియు అధికారపదవుల పేళ్లే. దేవతాపదవి నధిరోహించు నర్హత నార్జించిన మానవాత్మలకు ఈ పదవులు కాలక్రమమున లభించుచుండును. కాని ఆ దేవత లందఱు మరణించువారే. ప్రాచీనమగు ఋగ్వేదమున అమరశబ్దము (మృతిలేనివారు) ఈ దేవతలనుగూర్చి వాడబడినది. కాని అమరత్వము దేశకాలాతీతమనియు, భౌతికరూపములకు— ఎంత సూక్ష్మము లైనను — ఇది అన్వయింపదనియు, కనుగొని ఈ శబ్దము వాడుట మానుకొనిరి. భౌతికరూప మెంత సూక్ష్మమైనదిగ నుండినను, అది దేశకాలములందే ఉద్భవించి యుండవలెను. ఏలనన, రూప మేర్పడుటకు వలయు సామగ్రి 'దేశము'న కలదు. దేశసంబంధము లేని రూపము నూహింప యత్నింపుడు. మీ కది అసాధ్యము. రూపనిర్మాణమునకు వలయు సామగ్రిలో 'దేశ' మొకటి అని చెప్పవచ్చును. దానియందు నిరంతరపరిణామము కలదు. దేశకాలములు మాయలోనివి. ఈ భావమే ''యదేవేహ తదముత్ర'' (ఇచట ఏది కలదో అచట కూడ అదియే కలదు) అను శ్రుతివాక్యములో తెలుపబడినది. అనగా, అచటి దేవతలును ఇచట వర్తించు ప్రకృతిధర్మములకు బద్ధులై యుండవలెను : మాటిమాటికి లయమొందుచు, పునరుద్భవమొందుచు ఉండవలెను. భౌతికపదార్థమునకు వివిధరూపములు కల్పించి మరల రూపుమాపుచుండుటే ప్రకృతిధర్మము పుట్టినదంతయు గిట్టవలెను. కావున స్వర్గము లుండెనేని అచటకూడ ఈ ధర్మము వర్తించును.

ఈ లోకములో సుఖము నెప్పుడును దుఃఖము నీడవలె అనుసరించుచుండును. జీవమునకు నీడ మరణము. ఇవి అవిభాజ్యములు. ఏలనన ఈ చావుబ్రదుకులు, ఈ కష్టసుఖములు, ఈ కీడుమేళ్లు, పరస్పరవిరుద్ధములు కావు. భిన్నములును కావు. ఒకే పదార్థముయొక్క రెండు రూపములు. మేలుకీళ్లనునవి

పరస్పరసంబంధము లేక శాశ్వతముగా నిలిచియుండు రెండు ప్రత్యేక వస్తువులు అనెడి భావము ఏ మాత్రము ఆదరింపదగినది కాదు. ఒకే వస్తువుయొక్క భిన్నరూపము లవి. ఆ వస్తువే ఒకసారి మేలుగను, ఒకసారి కీడుగను కానిపించును. మేలుకీళ్లకు "ప్రకార" (జాతి) భేదము లేదు. "పరిమాణ" భేదము మాత్రమే కలదు. తీవ్రతా పరిమాణమందే ఆ భేదము. సుఖాసుఖానుభూతులను కలిగించున దొకే నరములకూడలిగదా. ఆ నరములు చెడియుండెనేని, ఏ అనుభూతియు కలుగజాలదు. సుఖానుభూతి రాజాలనిచో అసుఖానుభూతియు రాజాలదు. అవి రెండును భిన్నములు కాకపోవుటే ఇందుకు కారణము. ఒకసారి సుఖము కలిగించు వస్తువే ఇంకొకసారి అసుఖము కలిగించును. ఒకరికి సుఖము కలిగించు వస్తువే మఱొకరికి అసుఖము కలిగించును. మానవునకు సుఖమిచ్చు జంతుమాంస మా జంతువునకపారబాధ కలిగించుటచే కదా లభించినది. సర్వత్ర సుఖమే కలిగించు వస్తు వేదియు లేదు. ఒకనికి సంతుష్టియైన నింకొకని కసంతుష్టి. ఇట్లే దీనినడక. కావున లోకమున నిట్టి ద్వంద్వములు కల వనుభావమే నిరాకరింపబడుచున్నది. దాని ఫలమేమి? లోకములోని కీడంతయు నిర్మూలమైపోయి మంచి మాత్రము మిగులుకాల మెన్నటికిని రాజాలదని నా కడచిన ఉపన్యాసములో చెప్పితిని. మీలో కొందఱికా మాట అసంతృప్తికరముగను, భయావహముగను, తోచియుండవచ్చును కాని నే నేమి చేయగలను? అది పొరపాటైనచో, ఒప్పుకొనుటకు నేను సంసిద్ధుడను. కాని అది పొరపాటు అని సకారణముగా తెలుపబడువఱకు, పొరపాటు అని నాకు తేటపడువఱకు, దానిని నేను మార్చుకొనజాలను.

"పరిణామక్రమమున ఈ లోకములో గల చెడుగంతయు నశించుచురాగారాగా, కొన్ని కోట్ల సంవత్సరముల కది పూర్తిగా నశించి, మంచిమాత్రము మిగులు కాలము వచ్చితీఱునుగదా"

అని యాక్షేపకులు వాదింపవచ్చును. ఈ వాదము నిర్దుష్టముగను బలిష్ఠముగను తోచును. ఇది సత్యమైనచో, నేనును ఎంతో సంతసింతును. కాని ఇందొక పొరపాటు కలదు. ''లోకములోని మంచిచెడుగుల పరిమాణము సుస్థిరముగా స్థాపింపబడియున్నది'' అను అపోహపై ఈ వాద మాధారపడియున్నది. ఒక సుస్థిర పరిమాణము (నూఱు అందము) గల చెడుగు, ఒక సుస్థిర పరిమాణముగల మంచి, కలదనియు, చెడుగు దినదినక్షయ మంది మంచి మాత్రము మిగులుచుండుననియు, ఇందు ఊహింపబడు చున్నది. ఈ ఊహ కేమైన ఆధారము కలదా? ''చెడుగు దిన దినాభివృద్ధి నొందుచున్నది, మంచికూడ అభివృద్ధినొందుచున్నది'' అనిగదా ప్రపంచచరిత్రము తెలుపుచున్నది! ప్రాథమికదశయం దున్న మానవుని కై కొందము. వానిది అడవిలో నివాసము. వాని సుఖానుభవశక్తి స్వల్పము. వ్యథానుభవశక్తియు స్వల్పమే. ఆ వ్యథ యంతయు ఇంద్రియక్షేత్రమందే. కడుపు నిండకపోయిన యెడ వానికి క్షోభ. కడుపార అన్నము పెట్టి, స్వేచ్ఛగా తిరిగి వేటాడనిండు వానికి పరమానందము. వాని సుఖక్షేత్ర మెట్లు ఇంద్రియములో, వ్యథాక్షేత్రముకూడ ఇంద్రియములే. వానికి జ్ఞానాభివృద్ధి యయ్యెనేని, వాని సుఖ మధికమగును. బుద్ధిక్షేత్రము కూడ ఇప్పుడు లభించుటచేత, ఇంద్రియసుఖము వైజ్ఞానిక సుఖముగా పరిణమించినది. మనోహరకావ్యము నిప్పుడు చదివి ఆనందింపగలడు. గణితసమస్యలలో బుద్ధి మగ్నము కాగలదు. కాని ఇందుతోపాటు నరములు సున్నితము లగుటచేత, వైజ్ఞానిక వ్యథాస్పర్శకూడ వాని నిప్పుడు వేధింపగలదు. పూర్వము, ఆటవికస్థితిలో, వానికి క్షేత్రమునుండి వ్యథ లేదు. ఒక చిన్న ఉదాహరణము కై కొందము. థిబెట్ దేశములో వివాహాచారము లేదు. అనుమానములు, అసూయలుకూడ లేవు. కాని వివాహస్థితి ఉత్తమ మనుటకు సందియములేదు. సౌశీల్యసంపద కలిగించు అద్భుతానందమును, పతివ్రతామణియగు భార్యవలన భర్తకును,

ఏకపత్నీవ్రతుడగు భర్తవలన భార్యకును కలుగు మహానందమును భిజెటుజను తెలియగరు. కాని భార్యాభర్తలలో నొకరు నీతిబద్ధులై సౌశీల్యము పాటించుచుండి రెండవవారు అవినీతిపరులై యున్నచో కలుగు దుర్భర మనోవ్యథలు, అసూయలు, హృదయసంతాప ములుకూడ వా రెఱుగరు. వారి కొక పక్షమున సుఖానుభూతియు ఒకపక్షమున దుఃఖానుభూతియు కలిగినది.

మీ దేశమును కైకొందము. అంత ధనసమృద్ధిగల దేశము జగత్తులో మఱొకటి లేదు. అంతభోగపరాయణ మైన దేశము కూడ లేదు. కాని అంతటి దౌర్భాగ్యము, అంతటి తీవ్రహృదయవేద నలు, మఱెక్కడనైన కలవా? అచట నెందఱు మతిభ్రష్టులున్నారో అందఱింకెచ్చటనైన కలరా? మీ కోరిక లత్యంతబలిష్ఠములును, అత్యంతతీవ్రములును అగుటయే యిందుకు కారణము. మిక్కిలి "దర్జా" గా, మహావైభవముతో, జీవించి తీఱవలెను. తన అదృష్టపు పంటగా హిందూదేశీయుడు భావించునంత అపారద్రవ్య మును మీరు జీవితవైఖరికై యొక్క సంవత్సరములో వెచ్చింతురు. అంతవైభవోపేతమగు జీవనముగాని మీ సాంఘిక ప్రమాణమునకు చాలియుండదు. అట్టి మీకు నిరాడంబరజీవన మునుగూర్చిన బోధ యెట్లుపకరింపగలదు? సాంఘికరథము సాగి పోవుచున్నది. అనాథయువతుల కన్నీళ్లు వఱదలై పాఱవచ్చును. అనాథశిశువులు గుండెలుపగుల నేడ్వవచ్చును, కాని దాని గమ నము ఆగునా? అంతటను ప్రపంచస్థితి ఇదియే. మీ భోగాను భవశక్తి అభివృద్ధి నందినది కావున మీ సంఘ మితరసంఘముల కన్న ఎంతో విన్నాణము కలిగియున్నది. మీ భోగ్యవస్తువు లనేకములు. అన్ని భోగ్యవస్తువులు లేనివారి కన్ని మనో వేదనలుకూడ నుండవు. ఈ వాదమును మీ రెంతదూరమైన సాగింపవచ్చును. మీ బుద్ధిలోని గమ్యము మున్నత మగుకొలది, మీ సుఖానుభవ మధిక మగుచుండును. మీ దుఃఖానుభవము కూడ తీవ్రత నొందుచుండును. ఈ రెండును ఒండొంటికి నీడల

వంటివి. చెడుగులు తొలగింప బడుచున్న మాట నిజమే కావచ్చును. కాని అట్లైన, మంచికూడ నశించుచుండవలెను కదా. నిజమునకు చెడుగు అపారముగా పెరుగుచు, మంచి తఱిగిపోవుచున్న దనవలె నేమో! మంచి పదింతలు పెరిగినచో, చెడుగు నూఱింతలు పెరుగును. ఇది మాయ; ఆశావాదముగాని నిరాశావాదము గాని కాదు. ఈ లోకము కేవలము సంతాపపూరితమని వేదాంతము బోధింపదు. అది అసత్యబోధ యగును గదా. అది సుఖపూరిత మనియు, సర్వఫల ప్రదాయక మనియు, వర్ణించుట కూడ అసత్యమే అగును. కావున ఈ లోకము కేవలము సుఖమయము: అంతయు పూవులు, పాలు, తేనె అని బాలురకు బోధింపరాదు. అదంతయు మన స్వప్నదృశ్యము. కాని, ఒకడింకొకనికన్న ఎక్కువ అగచాట్లపాలై యున్నమాత్రమున, లోకము కేవలవ్యథామయ మనుటయు తప్పే. ఈ ద్వంద్వభావమే, ఈ కీడుమేళ్లకూడికయే, మన మెఱుగు ప్రపంచము. ''ఈ కీడుమేళ్లు భిన్నవస్తువు లనియు, ప్రత్యేకమూలములు కలవనియు, భ్రమింపవలదు. తరతమభేదములతో, వేషభేదములతో కానిపించుచు, ఒకే మానసమున భిన్నానుభూతులుకల్గించు ఏకైకవస్తు వని గ్రహింపుడు'' అని వేదాంతము బోధించును. అనగా, వేదాంతముయొక్క ప్రథమప్రయత్నము ఈ బాహ్యవస్తువులలో ఏకత్వమును కన్గొనుట: వ్యక్తరూపము లొందుచుండు ఆ యేకైకసత్యమును—ఆ రూపము లెంత పరస్పరభిన్నములుగా తోచినను, వాని యన్నిటికిని మూలమగు ఆ యేకైకసత్యమును — కన్గొనుట. ఇరువురు దేవుండ్లు — ఒక శుభుడు, ఒక అశుభుడు—కలిసి లోకమును నిర్మించిరనియు, అందలి మంచి యంతయు శుభదేవుని కార్యమనియు, చెడుగంతయు అశుభదేవుని కార్యమనియు, ప్రాచీన పారసీకుల సిద్ధాంతము. ఎంత అపరిపక్వవిశ్వాసము! ఇది వెఱ్ఱిభావమని ప్రత్యక్షముగనే తెలియుచున్నది. ఇది నిజమైనచో, ప్రతిప్రకృతిధర్మములో రెండు భాగములుండ

వలెను : ఒక భాగము నొక దేవుడు తీర్చి వెళ్లిపోవును; పిదప రెండవభాగమును రెండవదేవుడు వచ్చి తీర్చును. ఇరువురికిని కార్యభూమి ఒకేలోకము. ఒకభాగమునకు మంచి, ఇంకొకభాగమునకు చెడుగు చేయు ఆ దేవుండ్లిరువురును ఒద్దికగనే ఉందురట! ఇది మిక్కిలి అపరిపక్వరూపమగు భావము. ద్వంద్వభావమింతకన్న అపరిపక్వరూప మొందజాలదు. ఇంతకన్న ఉన్నతము, ఇంతకన్న గంభీరము అగు మఱొకభావము కలదు. లోకము కొంతవఱకు మంచిది, కొంతవఱకు చెడ్డది అనునదే ఆ భావము. ఆ భావముకూడ పై విధమున విచారించినచో యుక్తియుక్తముకాదని తేటపడును. ఇక ఐక్యధర్మభావ మొక్కటియే మిగులును. మన కాహారము సమకూర్చున దదే. అనేకుల కాకస్మికమరణములను, ప్రమాదజనితమరణములను సమకూర్చునదికూడ అదియే.

అనగా, ఈ లోకము ఆశావాదమున కాధారభూతమైనది కాదు; నిరాశావాదమున కాధారభూతమైనదియు కాదు. ఆ రెంటియొక్క కలయిక. ప్రకృతిపై మోపబడు నింద యంతయు నిజమనకు మనదే యని ముమ్ముందు తెలియవచ్చును. కాని వేదాంతమింతటితో ఊరకుండక, తప్పించుకొను మార్గమును మనకు బోధించును. ఉండు కీడును లేదనుట దాని మార్గమే కాదు. ఉన్నదాని నేమాత్రము దాపక, కలస్థితి నంతయు అది ధీరతతో పరిశీలించును. అది నిరాశనొందునది కాదు. సత్యము బుద్ధికి అందదని జంకదు, లభించిన ప్రతిక్రియల నది వజ్రగాఢమగు పునాదిపై నిలుపజూచును. బిడ్డయొక్క నోటిని మూసి, ప్రస్తుత మది నమ్మి మోసపోయియుండు బొంకులతో దాని కన్నులు కప్పియుంచు మార్గమును వేదాంత మవలంబింపదు. నా చిన్ననాడొక యువకుని తండ్రి గతించెను. అనేకులను పోషించుభారమతనిపై బడెను. ఇంట నేమియు లేదు. తండ్రి మిత్రు లేమియు ఆదుకొన రైరి. అట్టి దుర్దశలో నత డొక క్రైస్తవబోధకుని

యొద్దకు పోగా, "ఇదంతయు మంచిదే. భగవంతుడు సర్వమును మన మేలుకొఱకే కల్పించుచుండును" అని యా బోధకుడు పల్కెను. కాలిక (చాలకాలముగా నిలిచియున్న) వ్రణమును బంగరు తగడుతో కప్పియుంపజూచు పూర్వకాలపుపద్ధతి యిది— అసమర్థతను, అజ్ఞతను, సూచించునది. యువకు డీ హితోపదేశమును విని వెళ్లిపోయెను. ఆఱుమాసములపిదప ఆ బోధకునకొక శిశువు పుట్టెను. ఆ యనుగ్రహముకై దైవమునెడ తన కృతజ్ఞత వెల్లడించుట కత డొక విందుచేసి దాని కా యువకుని కూడ ఆహ్వానించెను. ఆ సందర్భమున చేసిన ప్రార్థనలో "భగవదనుగ్రహముకై వందనము లర్పింపుడు, అనుగ్రహించు భగవంతునకు ధన్యవాదములు సమర్పింపుడు" అని బోధకు డనెను. అప్పు డా యువకుడు లేచి "ఆపుము. ఇది అశుభసంఘటనము" అనెను. "ఎట్లు?" అని బోధకు డడుగగా, అత డిట్లు బదులుచెప్పెను: "మా తండ్రి మరణించినప్పుడు, అశుభముగా కానిపించినను అది శుభమే అంటివి. కావున ఇప్పు డిది శుభముగా కానిపించినను, నిజముగా అశుభమే." లోకులయొక్క తాపత్రయమును తీర్చు విధ మిదియా? కరుణాపరిపూర్ణచిత్తులై, నిర్భాగ్యులను ఆదుకొనుచుండుడు. వారి క్లేశములను కప్పిపెట్టి అవి లేనట్లు ప్రవర్తింపకుడు. ఈ లోకమును చక్కపఱచుట అసాధ్యము. దానికి అతీతులు కండు.

ఈ లోకము మంచిచెడుగుల కలయిక. మంచి యెచ్చట నున్నను, చెడుగు దానిని వెంటనంటియుండును, కాని యీ వ్యక్తరూపముల కన్నిటికి, ఈ విరుద్ధభావముల కన్నిటికి, మూలమై ఆ ఐక్యము నిలిచియున్నదని వేదాంతము కనుగొన్నది. "చెడుగును త్యజింపుము; మంచినికూడ త్యజింపుము" అని దానిబోధ. అట్లు చేసినచో, ఏమి మిగులును? వాని రెంటికిని వెనుక, రెంటికిని మూలమై యుండున దొకటి కలదు. అది మీ సొంతవస్తువు. అదియే మీరు — నిజమగు మీరు. ప్రతిచెడుగున కది

అతీతము? ప్రతిమంచికికూడ అది అతీతమే. అదియే మంచి చెడుగులుగా గోచరించునది. మొదట దానిని కనుగొనుడు. అప్పుడుగాని మీకు నిజమగు ఆశాశీలత కలుగదు. ఏలనన, అప్పుడు సర్వమును మీకు వశవర్తియగును. ఈ వ్యక్తరూపములను మొదట అదపులోనికి తెచ్చుకొనుడు. అప్పుడు మీలోని సత్యవస్తువును వ్యక్తపఱచు శక్తి మీ స్వాధీనమై యుండును. మొదట ఆత్మసామ్రాజ్యము నార్జించుకొనుడు. రెండు. స్వతంత్రులు కండు. ప్రకృతిధర్మములు వర్తించు ఆవరణమును దాటిపొండు. వానికి మీపై నిరంకుశాధికారము లేదు. అవి మీలోని అంశములే. కావున వానిని దాటుట సుసాధ్యము. మీరు మొదట గ్రహింపవలసిన విషయ మేమనగా: ఈ ప్రకృతికి మీరు దాసులు కారు. ఇప్పుడు కారు సరేకదా పూర్వ మెన్నడును కారు, ముందెన్నడును కాబోరు. ఈ ప్రకృతి అనాద్యనంతముగా కానిపించినను, నిజమున కది కేవలము పరిమితము. మహాసముద్రములో నొక నీటిబొట్టు వంటిది. మీ ఆత్మయే ఆ మహాసముద్రము. సూర్యచంద్రనక్షత్రములకన్న మీ రతీతులు. మీ అనంతత్వముతో పోల్చిచూచిన అవి నీటి బుడగలవంటివి. ఈ సత్యమును గ్రహింపుడు. మీ రంతట మంచిచెడుగులు రెంటిని నియమింపగలరు. మీ దృక్పథ మంతయు అప్పుడు మాఱిపోవును. "మంచి యెంత మనోజ్ఞము! చెడు గెంత అద్భుతము!" అని యప్పుడు మీరు ముక్తకంఠముతో ప్రకటింతురు.

ఇదియే వేదాంతబోధ. వెట్టి చికిత్సల నది చేయ నొల్లదు. వ్రణమును బంగరు తగడుతో కప్పియుంచి, అది రేగినచో మఱికొంత తగడు కప్పుట దాని మార్గముకాదు. "జీవిత మనునది గాఢసమస్య. నిర్భయులై దాని నెదుర్కొని, అది వజ్రకఠినముగానున్నను త్రోవచేసికొని చొరబాఱుడు. మీ ఆత్మ అంతకన్న బలిష్ఠము అని యెఱిగి ధీరతతో ప్రవర్తింపుడు" అని దానిబోధ. క్షుద్రులగు దేవుండ్లపై నది బాధ్యత నుంపదు. మీ యదృష్టము

నకు మీరేగదా కర్తలు. మీరే కారకులు మీ వ్యథలకు. మంచిచెడుగులను నిర్మించినది మీరే. చేతులతో కన్నులు మూసి కొని చీకటి అనుచున్నారు. చేతులు తీసివేయుడు. వెలుగును చూడుడు. మీరు స్వయంప్రకాశులు. ఇప్పటికే పరిపూర్ణులు. "నానాత్వమును చూచువాడు మాటిమాటికి మృత్యువు వాతపడు చుండును" అను శ్రుతివాక్యము మన కిప్పుడు అర్థమగును. అఖండవస్తువును చూడుడు. ముక్తులు కండు.

దానిని చూచు టెట్లు? మన మనస్సెంతో భ్రాంతము, ఎంతో బలహీనము, ఎంతో పరాధీనము. కాని అదియే బలిష్ఠము కాగలదు. మరణపరంపరలనుండి మనలను రక్షింపగల ఆ జ్ఞానము యొక్క, ఆ అఖండపదార్థముయొక్క క్షణదర్శనము నప్పు డది పొందగలదు. పర్వతముపై కురిసిన వర్షము చఱియలనంటి వేర్వేఱుముఖములుగా ప్రవహించు తీరున, మీ కీ లోకమున కానిపించు బలములు (శక్తులు) అన్నియు ఆ అఖండపదార్థము నుండి వచ్చినవే. మాయమీద పడి అది నానాత్వ మొందినది. నానాత్వము దెస పర్వులిడకుడు, అఖండము దెస కేగుడు. "సచరము లన్నిటియందును, పరిశుద్ధవస్తువు లన్నిటియందును, అతడు కలడు. అతడు జగత్తున నిండియున్నాడు : యజ్ఞమున గలడు; ఇంటికి వచ్చిన అతిథియందు గలడు; మానవులందు, జలమునందు, మృగములందు, సత్యమునందు గలడు. అతడు మహాపురుషుడు. ఏకమగు అగ్ని ఈ భువన (లోక) మందు ప్రవే శించి, వివిధరూపములకు ప్రతిరూపమై ఎట్లు కానిపించుచున్నదో, ఏకమగు వాయు వీ భువనమందు ప్రవేశించి వివిధ (ప్రాణి) రూపములకు ప్రతిరూపమై ఎట్లు కానిపించుచున్నదో, అట్లే సర్వభూతాంతరాత్మయగు ఈ ఆత్మ ఇన్ని భిన్నరూపములతో కానిపించుచున్నది." ఈ ఏకత్వమును గ్రహించినప్పుడే మీ కిది సత్యమగును. అంతవఱకు కాదు. అప్పు డంతయు

ఆశాశీలతయే. అంతటను అతడే కానిపించును గదా! ఇప్పు డొక సంశయము కలుగగలదు : 'ఆ పరిశుద్ధుడు, ఆ ఆత్మ, ఆ అఖండుడు, ఈ సర్వమందును ప్రవేశించినా డనుమాట సత్య మైనచో, అతడు తాపముల పాలగు టేల? దీనదశ నందు టేల? అపరిశుద్ధు డగు టేల?' అత డట్లగుట లేదని ఉపనిషత్తు చెప్పు చున్నది: "సర్వలోకచక్షువగు (సర్వజీవుల చూపునకాధారమగు) సూర్యుడు జీవుల కన్నులలో గల దోషములచే ఎట్లు లిప్తుడు (దోషయుక్తుడు) కాడో, అట్లే ఆ సర్వభూతాంతరాత్మ లోకదుఃఖ ములచే లిప్తుడు కానేరడు." వ్యాధిచే (కామిలరోగము) నాకు సర్వము పచ్చగా కనిపింపవచ్చును. సూర్యు డందుచే బాధితు డగునా? "ఆతడు కేవలుడు, సర్వకర్త, సర్వనియామకుడు. తన ఏకత్వము నతడు బహుత్వ మొనర్చును. ఏ ధీరులు (బుద్ధిశాలురు) అతనిని తమ ఆత్మస్థునిగా (ఆత్మకు ఆత్మగా) చూతురో వారిదే శాశ్వతసుఖము. మఱెవ్వరిదిని కాదు. ఈ అనిత్య జగత్తులో ఆ నిత్యుని, ఈ అచేతనజగత్తులో ఆ ఏకచైతన్యమును, ఈ నానాత్వములో ఆ ఏకత్వమును : అతనిని ఎవరు తమ ఆత్మల కాత్మగా కనుగొందురో, వారిదే శాశ్వత సుఖము. మఱెవ్వరిదిని కాదు. ఈ బాహ్యజగత్తులో, ఈ సూర్యులలో, ఈ చంద్రులలో, ఈ నక్షత్రములలో, అతనిని కన్గొను టెట్లు? ఆ చోటెని సూర్య చంద్రనక్షత్రములు వెలిగింపజాలవు. విద్యుత్ (మెఱపుల) కాంతు లచట భాసింపవు. ఇక ఈ అగ్ని విషయము చెప్పవలెనా? అతని ప్రకాశము ననుసరించియే ఈ సర్వము ప్రకాశించును. అతని కాంతి నాధారముచేసికొనియే ఇవి వెలుగుచున్నవి. వాని అన్నిటి ద్వారా వెలుగున దతడే." మఱొక మనోహరమగు ఉపమానము కూడ కలదు. హిందూదేశమున నుండు మఱ్ఱిచెట్టును మీలో కొందఱు చూచియుందురు. అది ఒక వేరులోనుండి పుట్టి పరిసర ములందు ఊడలతో వ్యాపించునుగదా! బ్రహ్మమే మఱ్ఱిచెట్టు. ఈ సర్వమున కతడే మూలము. అతడు వ్యాపించి ఈ జగత్తయి

నాడు. ఎంత దూరము వ్యాపించినను, ప్రతి కొమ్మ, ప్రతి ఊడ, పరస్పరసంబంధముగలదే.

వేదములలోని బ్రాహ్మణములలో పెక్కు స్వర్గములు పేర్కొనబడియున్నవి. కాని తాత్త్వికభాగమగు ఉపనిషత్తులలో స్వర్గప్రస్తావమే లేదు. సుఖము ఏ స్వర్గములో వెదకినను లభింపదు. అది యుండునది ఆత్మలోమాత్రమే. ఎన్ని స్థలములలో వెదకిన నేమి ఉపయోగము? సత్యానుభూతియొక్క తారతమ్యములు తెలుపు ఈ ప్రకరణమును చూడుడు : "స్వప్నములో వస్తువులు కానిపించునట్లు పితృలోకములో సత్యము కానిపించును." కలలో వస్తువు లెట్లు కొంత అస్పష్టముగా కానిపించునో అట్లే సత్యము కూడ అచట అస్పష్టముగా కానిపించును. గంధర్వలోక మను మఱొక స్వర్గము కలదు. అచట ఇంతకన్న అస్పష్టత. నీటిలో కానిపించు ప్రతిబింబమువంటిది అచటి సత్యానుభూతి. బ్రహ్మలోక మనునది హిందువుల స్వర్గము లన్నిటిలో ఉన్నతమైనది. అచట సత్యము వెలుగునీడలవలె చాలవఱకు విస్పష్టముగా కానిపించును. కాని అచటకూడ పూర్ణస్పష్టత లేదు. పరిపూర్ణస్పష్టతతో అది కానిపించునది మన ఆత్మలందు మాత్రమే. అచటనది అద్దములోని ప్రతిబింబమువలె సమగ్రమై, విస్పష్టమై, తేటయై, కనుపట్టును. కావున అత్యున్నతస్వర్గ ముండునది మన ఆత్మలందే. వేదాంతమతప్రకారము మానవాత్మతో సమమగు దేవాలయము లేనే లేదు. అన్ని స్వర్గములకన్న అది శ్రేష్ఠము. ఏలనన ఈ జీవితములోవలె, మన ఆత్మలలోవలె, సత్యమును ఇంత విస్పష్టముగా ఏ స్వర్గములోను, ఎచ్చటను, మనము గ్రహింపజాలము. స్థలముల మాఱుపువలన విస్తారము ఫలము కలుగదు. కొండగుహలందు నివసించినచో అనుభూతి స్పష్టతర మగునని నాకు హిందూదేశములో తోచినది. అది పొరపాటని పిదప తెలిసికొంటిని. అంతట అరణ్యావాసము స్ఫురించెను. ఆ పిదప కాశిలో నివాసము. కాని, అంతటను ఒకే చిక్కు. మన లోకమును

మనమే కదా నిర్మించుకొనునది. నేను చెడ్డవాడ నైనచో నాకు లోక మంతయు చెడ్డదే. ఉపనిషత్తు ఇట్లే పల్కుచున్నది. ఈ సత్య మన్ని లోకములకును వర్తించును. మరణించి స్వర్గమున కేగినచో అచటకూడ నా స్థితి యిట్లే ఉండును. నేను పరిశుద్ధుడ నైనగాని, గుహలు, అడవులు, కాశి, స్వర్గలోకము: ఇవేవియు ఉపకరింపవు. నా అద్దమును పరిశుద్ధ మొనర్చుకొంటినేని, ఎచట నున్నను ఒకటే. సత్య మచ్చటనే సహజస్వరూపమున లభించును. కావున ఇచటికి, అచటికి, పరుగిడుచు, శక్తిని వ్యర్థవ్యయము చేసికొనుట నిష్ప్రయోజనము. అద్దమును శుభ్రపఱచుటయందా శక్తిని వినియోగించితిమేని, ఆదర్శసిద్ధి కలుగును. ఇదే భావము మరల చెప్పబడినది: "అతని నెవ్వరును చూడజాలరు. అతని రూప మెవ్వరికిని దృష్టిగోచరము కాదు. మనస్సునకే, విశుద్ధ మనస్సునకే, అతడు గోచరించునది. అతనిని చూచినవారికి అమృతత్వసిద్ధి లభించును."

వేసవిలో నేనిచ్చిన రాజయోగోపన్యాసములు విన్నవారు నేనప్పుడు ఇంకొక విధమగు యోగమునుగూర్చి బోధించితినని ఎఱుగుదురు. ఇప్పటి యోగము ఇంద్రియనిగ్రహసంబంధమైనది. ఇంద్రియములు ఆత్మకు పూర్తిగా లొంగిపోయి, మనస్సును చలింపజేయు శక్తిని కోల్పోయినపుడు యోగసిద్ధి లభించినట్లే. హృదయమున నెలకొనియుండు వ్యర్థకామము లన్నియు ఎప్పుడు నాశమొందునో అప్పుడు మర్త్యుడు అమృతుడగును. ఈ శరీరముతోడనే బ్రహ్మైక్యము నొందును. హృదయగ్రంథులన్నియు ఎప్పుడు భేదిల్లిపోవునో, అప్పుడు మర్త్య డమృతుడై ఈ శరీర ముండగనే బ్రహ్మైక్య మందును." ఈ భూలోకమున నుండగనే ఇది జరుగును. మఱెక్కడనో కాదు.

ఈ సందర్భమున రెండు మాటలు చెప్పవలసియున్నది. ఈ వేదాంతమతము, మా దేశపు ఇతర తత్త్వవిద్యలు, మన యిచ్చటి కష్టసుఖముల ప్రసక్తినే పెట్టుకొనక, ఎప్పుడో భవిష్య

త్తులో రాబోవు విషయములనుగూర్చి విచారించునని అనేకులు చెప్పుదురు. ఈ భావ మేమాత్రమును సరికాదు. మా దేశపు వేదాంతవిషయ మేమియు ఎఱుగనివారును, తద్బోధ గ్రహింపజాలని మూఢులును చెప్పు మాట యిది. నిజ మిందులకు ప్రత్యక్ష విరుద్ధము. ఇతరలోకములకు పోవు మాటయే మా వేదాంతులకు గిట్టదు. వా రా లోకములను చిన్నచూపుతో జూతురు. అచటి జీవితము కేవలము మూడునాళ్ల ముచ్చట యనియు, అచటి నవ్వులు, ఏడ్పులు, మరణముతో అంత మొందుననియు వారు చెప్పుదురు. బలహీనులమై యున్నంతవఱకు మన కీ అనుభవములు తప్పవు. సత్యమనున దంతయు ఇచటనే కలదు. అదియే మన ఆత్మ. మఱియొక విషయముకూడ మిక్కిలి నొక్కి చెప్పబడుచున్నది : మనకు రావలసియున్న అనుభవములను ఆత్మహత్యమూలమున తప్పించుకొనజాలము. కాని అనుసరింపవలసిన మార్గము నెఱుగుట కష్టము. మీ పాశ్చాత్యులవలె మా హిందువులుకూడ అభ్యాసయోగ్యమార్గములనే పట్టుదురు. కాని జీవితమునుగూర్చి మన దృక్పథములు భిన్నములు. మంచి ఇల్లు, మంచి బట్టలు, మంచి భోజనము, మంచి వైజ్ఞానికసంస్కృతి: ఇత్యాదులే ఇం దొకరికి పరమార్థము. జీవిత మను మాట కిదియే వారి యర్థము. ఇందు అభ్యాసయోగ్యతపై దృష్టి కలదనుట నిస్సంశయము. హిందువునకు ప్రపంచజ్ఞాన మనగా ఆత్మజ్ఞానము : ఆధ్యాత్మికజ్ఞానము. అట్టి జీవితమునందే అతని యానందము. అమెరికాలో నొక అజ్ఞేయవాది యుండెను. అతడు సజ్జనుడు, చక్కని వక్త. ఆస్తికధర్మజీవనము నిష్ప్రయోజనమని అతని బోధ. ఇతర లోకముల నొందుటకై ఆరాటపడవలదని చెప్పుచు అతడు ఈ ఉపమానము వాడును : "ఇచట నొక నారింజపండు కలదు. దానిలోని రసమును మనము వడియ పిండుకోవలెను." నే నొకసారి అతనితో ని ట్లంటిని : "మీతో నేను పూర్తిగా ఏకీభవింతును. నాయొద్దకూడ నొక పండు కలదు. దానిని వడియబిండు

కొనుటయే నా కోరికకూడ. మనకు గల భేదము పండ్లలోనే. మీది నారింజ, నాది మామిడి. ఈ లోకములో జీవించి, కడుపార తిని, త్రాగి, కొంచెము భౌతికశాస్త్రజ్ఞాన మార్జించిన చాలునని మీ భావము. కాని ఆ భావ మందఱికి రుచించు ననుటకు మీ కేమి అధికారము కలదు? నాకది ఏ మాత్రము గిట్టదు. పండు భూమిపై ఎట్లు పడునో, విద్యుత్తరంగము నా నరముల నెట్లు చలింపజేయునో తెలిసికొనుటయే నా పనియైనచో, నేను ఆత్మ హత్య చేసికొందును. వస్తుహృదయాంతరాళమును, వస్తుమూల తత్త్వమును, గ్రహింపవలెనని నా వాంఛ. మీరు గ్రహింపజూచు నది జీవముయొక్క వ్యక్తరూపములను; నేను గ్రహింపజూచునది జీవమునే. దానిని గ్రహించి స్వర్గనరకలోకాదిపురాతనభావములను విడుతును—ఈ లోక మే భావమున కలదో ఆ భావమున నవికూడ కలవు. కాని, వానినిగూర్చిన భావములను — మనస్సునుండి తఱిమివేయు మని మా వేదాంతము నాకు బోధించుచున్నది. జీవముయొక్క హృదయమును, దాని మూలసత్త్వమును, దాని యర్థమును నేను గ్రహింపవలెను. జీవముయొక్క వ్యాపారములు, జీవముయొక్క వ్యక్తరూపములు మాత్రము తెలిసిన నాకు తృప్తి లేదు. ప్రతివిషయమునకు "ఏల?" అను మూలకారణము నాకు వలయును. "ఎట్లు?" అనుదానిని బాలురు విచారించుకొందురు గాక! మీ దేశస్థు డొకడు చెప్పినట్లు 'చుట్ట త్రాగునప్పుడు నే నొక పుస్తకము వ్రాసితినేని, అది చుట్టయొక్క శాస్త్రముగా నుండును.' భౌతికశాస్త్రబుద్ధి ఉత్తమమైనదే, గౌరవింపదగినదే. ఆ పరిశోధనలు ఫలవంతము లగుగాక! ఆ పరిశోధకులకు దైవము తోడ్పడుగాక! కాని 'అదియే సర్వము' అనుట మౌఢ్యము. జీవితముయొక్క ఉద్దేశము నెఱుంగబూనుట; ఈ సృష్టితత్త్వమును పరిశోధించుట: ఇదిగదా ముఖ్యము. మీరు సేకరించిన జ్ఞాన మంతయు అర్థరహిత మనియు, ఆధారరహిత మనియు, నేను వాదింపవచ్చును. జీవముయొక్క వ్యక్తరూపములను మీరు పరి

శోధించుచున్నారు. ''కాని జీవమనగా నేమి''అను ప్రశ్నకు మీరు సమాధాన మీయజాలరు! అవశ్యముగా మీ పరిశోధనలు మీరు సాగించుకొనుడు. నన్ను మాత్రము నా త్రోవను పోనిండు.''

అభ్యాసయోగ్యమార్గము ననుసరించుటయే నా సంకల్పము కూడ. అందుకు సందేహము లేదు. మీ పాశ్చాత్యుల దొక్కరిదే అభ్యాసయోగ్యమార్గ మనుట అర్థరహిత ప్రసంగము. మా దొక త్రోవ, మీ దింకొక త్రోవ. అంతే భేదము. ఎన్నో రకముల మానవులు కలరు, ఎన్నో రకముల మనస్సులు కలవు. సత్యారాధనకై ఆజన్మము ఒంటికాలిపై నిలవవలసివచ్చుచో, అట్లు నిలుచువారు మా దేశమున నుందురు. ఎచ్చటనో ఒక అడవి మనుష్యుల దేశమున ఒక బంగారుగని కలదని మీ పాశ్చాత్యులకు తెలిసినచో, అన్ని అపాయములకు తెగించి, వేనవేల జను లచ్చటికి పోవుదురు. ఆ బంగా రెవరో ఒకరికే లభించు టెఱిగియు, అందఱును ఆశచే అచటికి పోవుదురు. తమకు ఆత్మలు కలవని వారు వినియున్నారు గాని, వానిని ప్రార్థనాలయాధికారుల సంరక్షణక్రింద నుంతురు. ప్రాచ్యదేశీయుడు అడవిమనుష్యులుండు చోటికి పోవుట అపాయకరమని మానుకొనును. కాని యొక మహాపర్వతాగ్రమున నొక సిద్ధపురుషుడు కలడనియు, అతడు తన కాత్మజ్ఞానము ప్రసాదింపగలడనియు తెలిసినచో, అతడు చావుకు కూడ తెగించి అతనియొద్ద కేగజూచును. ఈ రెండు తెఱగుల వారును అభ్యాసయోగ్యమార్గములనే పట్టుచున్నారు. జీవిత మంతయు ఈ లోకముననే ఇమిడియున్నట్లు భావించుటయే పొరపాటు. క్షణభంగుర మగు ఇంద్రియభోగాసక్తి మీది. అది కేవల మనిత్యము, నిరంతర క్లేశమూలము. నాది శాశ్వతశాంతి మూలము.

మీ భావము తప్పు అని నే ననను. అవశ్యము మీరు దాని ననుసరింపుడు. దానిచే ఎంతో మేలు, ఎంతో సుఖము, కలుగ వచ్చును. కాని నా భావమును తప్పు అనకుడు. అదికూడ

ఒక విధమున అభ్యాసయోగ్యమే. మీదే అభ్యాసయోగ్యమార్గ మను వాదము యుక్తియుక్తము కాదు. మీదొక విధమున అభ్యాసయోగ్యము, నా దింకొకవిధమున అభ్యాసయోగ్యము. ఎవరి మార్గమును వా రనుసరింతుముగాక! మన ఇరువుర దృక్పథ ములనుండియు అభ్యాసయోగ్యమగు నొకేమార్గమును అందఱము ననుసరించిన నెంత బాగుగా నుండును! భౌతికశాస్త్రమార్గము నను, ఆధ్యాత్మికమార్గమునను కూడ అభ్యాసయోగ్యమార్గ మవలంబించువారు కొందఱు కలరు. కాలక్రమమున మానవు లందఱు నట్టి రెండుమార్గములలోను సమాభివృద్ధి చూపుదురని నా ఆశ. నీరు సలసల కాగనారంభించినప్పుడు మొదట నొక బుడగ, పిదప ఇంకొకటి, అంతట మఱొకటి, పైకి లేచును. కొంతసేపటి కీ బుడగలన్నియు ఏకమై మహాసంచలనము చూపట్టును. లోకముకూడ అట్టిదే. ప్రతి మనుష్యుడు ఒక బుడగ. జాతులు పెక్కుబుడగల వంటివి. ఈ జాతులు క్రమక్రమ ముగ కలియుచున్నవి. ఇట్లు జరుగగా జరుగగా, భిన్నత్వము నశించి, మన మందఱము చేరబోవు ఆ ఏకత్వము గోచరించు దినము వచ్చితీఱునని నా విశ్వాసము. ప్రతివాడును భౌతికలోక మందును, ఆధ్యాత్మికలోకమందును కూడ అభ్యాసయోగ్యమగు మార్గము ననుసరించును. అప్పు డా ఏకత్వము, ఏకత్వమాధు ర్యము, లోకమునంతయు ఆవరించును. మానవజాతియంతయు ఒక్కుమ్మడిగా జీవన్ముక్తి నందును. మన పరస్పర ద్వేషముతో అసూయతో, ప్రేమతో, సహకారముతో, ఆ గమ్యస్థానము చేరుటకే మన మందఱము పోరాడుచున్నాము. మహావాహిని సముద్రముదెసకు ప్రవహించుచున్నది. మనల నందఱిని అది ఈడ్చు కొని పోవుచున్నది. గడ్డిపోచలవలె, కాగితపు ముక్కలవలె మన మిటునటు అగమ్యముగా కొట్టుకొని పోవుచున్నను, చివర కెల్లర మా చైతన్యానందసాగరమును చేరుట తథ్యము.



# ఆత్మ ముక్తి

(లండనులో కావింపబడిన ఉపన్యాసము ; 5-11-1896)

మన మింతకుముందు కఠోపనిషత్తులోని బోధను గ్రహింప జూచుచుంటిమి. ఇప్పు డంతకన్న మిక్కిలి ప్రాచీనమైన ఛాందోగ్యోపనిషత్తును పరిశీలింతుము. కఠోపనిషత్తులోని భాష ఇంతకన్న కొంత ఆధునికము, కొంత క్రమబద్ధము. ప్రాచీనోపనిషత్తులలో కానిపించు భాష వేదమంత్రభాషవలె అత్యంతప్రాచీనరూపమైనది. మఱియు వానిలో వట్టి పనికిమాలిన విషయము లెన్నెన్నిటో మధ్య అక్కడక్కడ నొక్కొక్క సారభూతమగు ముఖ్యవిషయము కనిపించుచుండును. వేదభాగములు రెంటిలో నొకటగు కర్మకాండముయొక్క ప్రభావముచేత కాబోలు, ఈ ప్రాచీనోపనిషత్తు సగమునకు పైగా కర్మకలాపవిషయములతో నిండియున్నది. కాని వీనిని పఠించుట ఒక రీతిగా అత్యంతోపయుక్తము. ఎట్లనగా, మన కిందుచే ఆధ్యాత్మికభావముల పరిణామక్రమము బోధపడును. అంత ప్రాచీనములు కాని ఉపనిషత్తులలో ఆధ్యాత్మికభావములు ఏర్చి కూర్చి యొక్కటిగా ప్రదర్శింపబడి యుండును. ఉపనిషత్తులలో కడపటి దనదగిన భగవద్గీత నిందు కుదాహరణముగా కైకొనవచ్చును. అందు కర్మకలాపముల ప్రస్తావమే లేదు. ఉపనిషత్తులు అనెడి పూదోట నంతటిని వెదకి సేకరించిన సత్యముల నొకటిగా చేర్చి రచించిన సొబగులీను పూబంతి వంటి దది. కాని, ఆధ్యాత్మికభావములు ఎట్లుత్పత్తియైనది, ఎట్లు అభివృద్ధి నొందినది, మనము దానిమూలమున కనుగొనజాలము. వేదపరిశోధన మొక్కటిమాత్రమే అందు కుపకరించునది. అనేకు లీ విషయము నిప్పటికే తెలిపియున్నారు. ఆ గ్రంథము లింతవఱకు ఏ మాత్రము రూపుచెడక ప్రథమరూప

మునసే నిలిచియున్నవి. లోకములో ఇంత కాలము మార్పు లొందక నిలిచియున్న గ్రంథ మింకేదియు లే దనవచ్చును. అవి అత్యంతపవిత్రము లను భావమే వాని సురక్షితస్థితికి కారణము. ముఖ్యములు, అముఖ్యములు; అత్యున్నతములు, అతిసామాన్యములు; అత్యుదాత్తములు, అతిస్వల్పములు: అగు భావములు వానియందు ప్రక్కప్రక్కనే కానిపించుచుండును. వానిలో నెవ్వరును వ్రేలుపెట్ట సాహసింపలేదు. ఎందఱో భాష్యములు రచించిరి. దుర్బోధములుగా నుండు ఘట్టముల కెట్లో అన్వయములు కుదుర్పజూచిరి. అత్యద్భుతములగు నూత్నభావముల నా ప్రాచీనవాక్కులలో నుండి వెలికి తీయజూచిరి. అతిసామాన్యవాక్యములకుకూడ ఆధ్యాత్మికార్థములు కల్పింపజూచిరి. కాని మూలము నెవ్వరును తాకలేదు. కావున చారిత్రకపరిశోధనకవి అత్యద్భుతముగా ఉపకరించును. ఆధ్యాత్మికభావము లభివృద్ధి నొందినకొలది ప్రతిసంఘమువారును తమ మత శాస్త్రములందు కాలానుగుణమగు మార్పులు చేసికొని రని మన మెఱుగుదుము: ఇచ్చట నొక మాటలో కొంచెము మార్పు, అచ్చట నొక మాటకు బదు లింకొకమాట — ఇట్టి మార్పులు చేయబడినవి. ఇట్టి మార్పులు వేదవాఙ్మయమున జరిగినట్లు లేదు. జరిగినను, కనుగొనుటకు శక్యముకానంత కొంచెముగానే జరిగినది. ఇది మనకు మిక్కిలి అనుకూలవిషయము. అందలి భావములను వాని ప్రాథమికార్థములలో పరిశోధింప గలము. ఆ భావము లెట్టి మార్పు లొందుచు అభివృద్ధి నొందెనో, భౌతికభావము లెట్లు కాలక్రమమున సూక్ష్మములు, సూక్ష్మతరములు, అగు ఆధ్యాత్మికభావములుగా పరిణమించెనో, చివర కత్యున్నతవేదాంతరూపము నందెనో, మనము గ్రహించు నవకాశము కలదు. పూర్వపు ఆచారమర్యాదలుకూడ వివరింపబడియున్నవి; కాని, ఉపనిషత్తులలో అవి అంతగా లేవు. అందలిభాష అపూర్వము, సంక్షేపరూపము, జ్ఞప్తి కనుకూలించునది.

విషయ మంద తెటిగినదే అను భావముతో దానిని జ్ఞప్తికి తెచ్చు సాధనములుగా మాత్రమే, ఆ గ్రంథకర్త లీ సూచనా రూపవాక్యములను సంజ్ఞలుగా వ్రాసియుంచిరి. ఒక కథను వివరించుచున్నా రనుకొందము. వినువా రందఱి కది తెలిసినదే యని వారి యూహ. ఇందుచే మనకు చాల ప్రయాస కలుగుచున్నది. అప్పటి జనశ్రుతు లిప్పు డించుమించుగా నశించినవి. కొంచెము ఏవైన మిగిలియున్నను, అవి అతిశయోక్తిచే నెంతో విపరీతరూప మొందినవి. కావున ఆ కథల సరియైన యర్థమును మనము గ్రహించు మార్గమే లేదు. వాని కెన్నెన్నియో నూతనార్థములు కల్పింపబడెను. పురాణయుగమునాటికే అవి కవుల భావములతో నిండిన పద్యరూప మొందినవి. పాశ్చాత్య దేశములందు రాజకీయపరిణామక్రమములో చూపట్టు ముఖ్య విశేషమే హిందూదేశపు ఆధ్యాత్మిక పరిణామక్రమమున చూపట్టుచున్నది. మీ పాశ్చాత్యులు నిరంకుశపరిపాలనము నోర్వజాలరు. తన యిష్టప్రకార మెవ్వడేని మిమ్ము పరిపాలింపకుండ మీరు చూచుకొందురు. ప్రజాప్రభుత్వము దెసను, ప్రజాస్వాతంత్ర్యము దెసను, మీ భావములు క్రమోన్నతరూపమున నభివృద్ధి నొందుచున్నవి. ఇదే మార్పు మా హిందూదేశపు ఆధ్యాత్మిక జీవన పరిణామములో తోచుచున్నది. ఎందఱో దేవుండ్లు పోయి ఒకే జగదీశ్వరు డేర్పడెను. ఉపనిషత్తులలో ఆ ఏకేశ్వరునిపై కూడ తిరుగుబాటు! తమ భవిష్యత్తును శాసింపగల లోకపాలకు లనేకులు కల రను భావమే కాదు వారికి దుస్సహమైనది. ఈ జగత్తు ఒక్కరి పరిపాలనలో నున్న దను భావముకూడ దుస్సహమయ్యెను. మొదట మనకు తట్టునట్టి విశేష మిది. ఈ స్వేచ్ఛాభావము క్రమాభివృద్ధినంది పరమోచ్ఛస్థితిని పొందినది. ఇంచుమించు అన్ని ఉపనిషత్తులలోను చివరి భాగమున ఈ పరమోచ్ఛస్థితి కనుపట్టుచున్నది. జగదీశ్వరుడు పదభ్రష్టు డగుటయే యీ పరమోచ్ఛస్థితి. సగుణదైవ మంతరించి నిర్గుణు డుత్పన్నమగును.

దైవ మిప్పు డొక వ్యక్తిగతపురుషుడు కాడు. మునుపటివలె లోకము నేలు మహోన్నతుడును, మహామహిమాఢ్యుడును అగు మానవుడుకూడ కాడు. ఇప్పు డతడు సర్వభూతరూపములతో కానిపించుచు, సర్వజగత్తునందు అంతర్వ్యాప్తమై యుండు నొక తత్త్వమయ్యెను. సగుణమును, వ్యక్తిరూపమును, అగు దైవమును నిర్గుణముగను, తాత్త్వికముగను, చేసినవారు మానవు నొక వ్యక్తిగా నుంచుట అసంగతము గదా! అందుచే వ్యక్తిగత మానవుడుకూడ నుఱుమాడబడెను. తాత్త్వికమానవు డేర్పడెను. వ్యక్తిగతమానవుడు ప్రకృతి కల్పితుడు. ఆ వ్యక్తి కధిష్ఠానమై మానవతత్త్వము కలదు. అనగా, రెండువైపులనుండి యొకేసారిగా వ్యక్తిత్వములు నుగ్గాడ బడుచున్నవి. తత్త్వము సమీపింపబడుచున్నది. వ్యక్తిగతదైవము తాత్త్వికదైవముదెసకును, వ్యక్తిగత మానవుడు తాత్త్వికమానవుని దెసకును, సాగుచున్నాడు. పిదప ఇంకను ఉన్నతభావము లేర్పడెను. ఈ తాత్త్విక దైవమొక రేఖగను, తాత్త్వికమానవు డొక రేఖగను సాగుచుపోయి, క్రమక్రమముగా ఈ రెండురేఖలును కలిసి యొకటయ్యెను. ఉపనిషత్తులలో ఈ పరిణామక్రమము వివరింపబడినది. తత్త్వమసి (అది నీవే) అనునది ప్రతి ఉపనిషత్తుయొక్క చివరి మాట. ఒక్క నిత్యానందతత్త్వము తప్ప నింకేమియు లేదు. అదియే యీ నానాత్వముగా వ్యక్త మగుచున్నది.

ఉపనిషత్తు లీ సిద్ధాంతముతో తమ కార్యమును ముగించుకొనెను. అంతట తత్త్వవిచారపరులు ప్రవేశించిరి. పై మూలభావమునకు సూక్ష్మాంశవివరణ మొనర్చుటే వారి పని. వారి ననేకసమస్య లెదుర్కొనె ననుట చిత్రమా? నిర్గుణపరతత్త్వము ఒక్కటి తప్ప వేఱేమియు లేదనియు, అదియే ఈ నానారూపములతో గోచరించు చున్నదనియు అంగీకరించినచో, ఏకత్వము బహుత్వముగా ఎట్లైనది? ఈ సమస్యయే అపరిపక్వరూపమున ప్రతిమానవహృదయమునందును అనాదిగా కలుగుచున్నది. కీడు

మొదలగున వెట్లు పుట్టినవి అనునదే ఈ సమస్యయొక్క అపరి పక్వరూపము. లోకములో కీడనునది యేల కలదు? దానికి మూలకారణ మేమి? ఆ ప్రాతప్రశ్నయే యిప్పుడు సంస్కారము నొంది యీ నిగూఢరూపముతో ఆవిర్భవించినది. మన అసుఖ మునకు కారణ మేమి అను ప్రశ్న ఇంద్రియవేదికనుండి అడుగ బడుటకు మాఱు తత్త్వవిచారవేదికనుండి అడుగబడుచున్నది: అఖండసచ్చిదానందవస్తు వీ భేదమయప్రపంచరూపము నెట్లు పొందినది? ఈ ప్రశ్నకు సమాధానము మన కిప్పటికే పరిచితమై యున్న మాయావాదము. హిందూదేశ మొసగిన సమాధానము లలో అత్యుత్తమమైన దిదియే: ఈ ఏకవస్తువు నిజముగా అనేకము కాలేదు, తనకు స్వాభావికమగు అఖండత్వము నే మాత్రమును కోలుపోలేదు. ఈ అనేకత స్థూలదృష్టికే గాని, నిజమునకు కాదు. మనుష్యుడు సాకారుడుగా కనుపట్టినను, నిజమున కతడు నిర్గుణ తత్త్వమే. భగవంతుడు పురుషుడుగా కనుపట్టినను, నిజమున కతడు నిర్గుణతత్త్వమే.

ఈ సమాధానములో భావతారతమ్యములు కలవు. తత్త్వజ్ఞుల కేకీభావము కుదురలేదు. మాయావాదమును కొందఱు అంగీకరింపరు. 'అనేకు లంగీకరింపరు' అనవలెనేమో! వీరే ద్వైతులు. వీరి ద్వైతము అపరిపక్వరూపమైనది. వీరు ఈ విచార మును మూలముననే ఖండింపజూతురు. ప్రశ్నమునకే అవకాశ మీయరు. వా రిట్లు చెప్పుదురు: ఈ ప్రశ్న వేయుటకుగాని, దానికి సమాధానము కోరుటకుగాని మీ కధికారము లేదు. అది ఈశ్వరేచ్ఛ. దానికి మనము లొంగియుండవలెను. నోరెత్తరాదు. మన ఆత్మలు స్వతంత్రములు కావు. మన మేమి చేయునది, ఏమి అనుభవించునది, మన కేమి లభించునది: సర్వము దైవ మిప్పటికే నిర్ణయించియున్నాడు. వచ్చు విపత్తులను ప్రశాంత బుద్ధితో ననుభవించుటే మన ధర్మము. అట్లు చేయమేని ఇంకను ఘోరకష్టములు విధింపబడును. ఇది మీ కెట్లు తెలియునని

అడిగినచో, వేదము లట్లు చెప్పుచున్న వందురు. వారి ప్రమాణ ములను, ఆ ప్రమాణములకు వారు కల్పించు అర్థములను, అంగీకరించి ఆ ప్రకారము నడుచుకొనుట మన విధియందురు.

మాయావాదము నంగీకరింపకయు, మధ్యస్థులై యుండు వారు కొందఱు కలరు: 'ఈ సృష్టి యంతయు ఈశ్వరుని శరీర ముగా భావింపదగు నని వారి వాదము. ఆత్మలన్నిటికిని, ప్రకృతి కంతటికిని, ఆయనయే ఆత్మ. జీవుల ఆత్మలు దుష్కృతముచే ముడుచుకొని పోవును. ఆత్మ లిట్లు ముడుచుకొనిపోవుటచే వారి ప్రభావము సన్నగిల్లుచుండును. మరల సత్కార్యములు చేసి నప్పుడుగాని అవి విరివినొందవు.' హిందూమతము లన్నిటియందును ఒక సామాన్యభావముకలదు. లోకమునగల అన్ని మతములలోను ఈ భావము కలదనియే నా విశ్వాసము. కొన్ని మతములవారి కిది తెలిసియుండును. కొందఱికి తెలియకుండవచ్చును. అంతే భేదము. మానవుని దివ్యత్వ మనునదే ఈ భావము. 'జీవాత్మ అనునది ఎట్టిది? దానికిని భగవంతునికిని గల సంబంధమేమి?' అను విషయ మున మతభేదములు కలవు. కాని స్వభావసిద్ధముగా అది పరిశుద్ధ మనియు, పరిపూర్ణమనియు, బోధింపని మత మీ లోకములో నొక్కటికూడ లేదు. పురాణకథారూపముననో, నీతికథారూపముననో, తత్త్వసిద్ధాంతరూపముననో, ఈ భావము ప్రతిమత మందును చూపట్టుచున్నది. స్వాభావికముగా అది ఆనందమయము, శక్తిమంతము; దౌర్బల్యము నెఱుగదు, దుఃఖము నెఱుగదు. ఈ దుఃఖమనునది యెట్లో వచ్చినది. అపరిపక్వమతము లిది కీడు యొక్క మూర్తీభావమనియో, పిశాచమనియో, అహ్రిమన్ (పారసీకుల దుష్టదైవము) అనియో సమాధానము చెప్పవచ్చును. కొన్ని మతములు దేవుడును, దయ్యమును, కలిసిన యొక భూత మును నిర్మించి, అది నిర్హేతుకముగా కొందఱికి సుఖము, కొందఱికి దుఃఖము, కల్పించుచుండు ననవచ్చును. ఇంకను బుద్ధిపరిపాకము గల మఱికొందఱు మాయావాదమును తేవచ్చును. ఇ ట్లెంద

తెందఱో ఎన్నెన్నివిధముల సమాధానములో చెప్పవచ్చును. కాని ఒక్కవిషయము మాత్రము విస్పష్టముగా తేలుచున్నది. అదియే మనకు ప్రసక్తము. ఈ తత్త్వభావములు, మతములు, వైజ్ఞానిక వ్యాయామమాత్రములే, మనస్సుతో చేయు బొమ్మరవిద్యల వంటివే గాని వేఱుకావు. ప్రతిదేశములోను, ప్రతిమతములోను గల మూఢవిశ్వాసభావరాశినుండి విస్పష్టమై, దేదీప్యమానమై, కానవచ్చు మహత్తరభావము 'మానవుడు దైవమే, దివ్యత్వమే మన స్వభావము' అనునదియే.

ఆ దివ్యత్వము కాక మఱేమి కానవచ్చినను, అది వేదాంత పరిభాషలో 'అధ్యాస' అనబడునదే. ఏదియో అధ్యస్తమైనది; కాని ఆ దివ్యస్వభావ మెన్నటికిని నశింపదు. మహాపాపిష్ఠునియందును, మహాసిద్ధపురుషునియందును, అది సర్వదా నిలిచియుండును. దానిని ఉద్ధరింప (మీఁదికెత్త) వలెను. పిదప నది స్వయంసిద్ధముగనే దీపించును. మనము కోరినగాని అది వ్యక్తము కానేరదు. చెకుముకిరాతియందును ఎండుకట్టెయందును అగ్ని కలదనియు, ఒరపిడిచేతగాని అది బైటికి రాదనియు, మన పూర్వికు లెఱిగియుండిరి. అట్లే ముక్తత్వరూపమును, పరిశుద్ధత్వరూపమును అగు ఈ అగ్ని ప్రతి ఆత్మకును స్వభావసిద్ధము. అది ఆత్మయొక్క గుణము కాదు. గుణము లార్జించుకొన శక్యమైనవి కావున కోల్పోవ శక్యమైనవియు. ఆత్మయు ముక్తత్వమును అభిన్నములు; ఆత్మయు సత్తయు (అస్తిత్వము) అభిన్నములు; ఆత్మయు చిత్తు (జ్ఞానము) అభిన్నములు. సచ్చిదానందము ఆత్మకు స్వాభావికము, దాని "జన్మహక్కు." ఇంద్రియగోచరవస్తువు లన్నియు దాని వ్యక్తరూపములు. కొన్ని వస్తువులలో అది మందముగను, కొన్నిటిలో దీప్తిమంతముగను, వ్యక్తమగును. మరణముకూడ ఈ నిత్యసత్తయొక్క వ్యక్తరూపమే. జననమరణములు, స్థితిక్షయములు, హానివృద్ధులు, ఆ ఏకత్వము (సత్త) యొక్క వ్యక్తరూపములే. జ్ఞానవిషయముకూడ ఇట్టిదే. పామరత్వరూపమున గోచ

రించునది, పాండిత్యరూపమున గోచరించునది, ఆ 'చిత్తు' యొక్క, ఆ జ్ఞానసత్త్వముయొక్క, వ్యక్తరూపములే. ఈ ద్వంద్వములకు గలది ప్రకార (జాతి) భేదము కాదు; పరిమాణ (తరతమత్వ) భేదమే. మన కాళ్లక్రింద ప్రాకు క్షుద్రకీటకములకును, లోకమున నుద్భవింపగల మహోన్నత మేధాసంపన్నునికిని కలది కూడ జాతి భేదము కాదు. తరతమత్వ భేదమే. ఈ జీవితములోని భోగము లన్నియు—అత్యంత హేయములుకూడ—ఆత్మసత్త్వమగు ఆ బ్రహ్మానందముయొక్క, ఆ ఏకత్వముయొక్క, వ్యక్తరూపములే యని వేదాంతతత్త్వవిచారపరుడు ధీరతతో పల్కును.

వేదాంతభావము లన్నిటిలో ఇది అత్యంతముఖ్యమైనది. మతము లన్నియు ఈ భావము నంగీకరించుచున్నవని నా విశ్వాసము. ఇట్లిప్పటికే చెప్పియుంటిని. అట్లంగీకరింపని మతము నొక్కదానినైన నే నెఱుగను. సర్వ మతములలో భాసించుచుండు సార్వలౌకికభావ మిది యొక్కటే. బైబిలు నుదాహరణముగా కైకొందము. దాని ప్రకారము ప్రథమమానవుడు (ఆదాం) పరిశుద్ధుడుగా నుండి దుశ్చరితముచేత ఆ పరిశుద్ధతను కోలుపోయెను. దీని యర్థ మేమి? ఆదిమ మానవస్వభావము నిర్దుష్టమనియేకదా వారి అభిప్రాయము? ఇప్పుడు మనలో కానవచ్చు కల్మష మంతయు, దుర్బలత్వ మంతయు, ఆ స్వభావముపై నేర్పడిన అధ్యాసనములు. ఆ పూర్వనిష్కల్మషస్థితి మరల రావచ్చుననియు —తప్పక రాగల దనియు—క్రైస్తవులు నమ్ముచున్నారు. వారి అనంతరచరిత్రముచే నిది స్పష్టమగుచున్నది. బైబిలు ప్రాత, క్రొత్త, నిబంధనల చరిత్ర మంతయు ఇదియే. మహమ్మదీయులు కూడ ఇట్లే ఆదామును, అతని పారిశుద్ధ్యమును నమ్మెదరు. మహమ్మదుద్వారా ఆ పారిశుద్ధ్యము మరల లభించుమార్గ మేర్పడినదని వారి నమ్మకము. బౌద్ధులుకూడ నిట్లే. నిర్వాణ మను స్థితిని వారు నమ్మెదరు. అది ఈ భేదమయప్రపంచమున కతీతమగు స్థితి. వేదాంతులు బ్రహ్మ మనునది దీనినే. మనము

కోలుపోయిన ఆ నిర్వాణమును పునర్లభ్య మొనర్చుకొనుటే బౌద్ధ మతముయొక్క మూలభావము. 'మన సొత్తుకాని దేదియు మనకు లభింపదు' అను బోధ ప్రతిమతములోను కలదు. ఈ జగత్తులో మన మెవ్వరికిని ఋణపడియుండము. మన "జన్మహక్కు" కొఱకే మనము సలుపు పోరాటము. ఈ భావము నొక గొప్ప వేదాంతి "స్వారాజ్యసిద్ధి" అను తన గ్రంథపు పేరులోనే అద్భుత ముగా వ్యక్తపఱచియున్నాడు. ఆ రాజ్యము మనది. దానిని కోల్పోయితిమి. మరల గెలుచుకోవలెను. ఇది కేవల భ్రాంతిజనిత భావ మనియు, మన రాజ్యమును కోల్పోవనే లేదనియు మాయా వాది పల్కును. అతనికిని ఇతరులకును ఇంతే భేదము.

"ఈ రాజ్యము మొదట మనదే. పిదప దానిని కోల్పోయి తిమి" అనువఱకు మతము లన్నిటిలో ఏకీభావము కలదు గాని, దానిని మరల సాధించుకొను మార్గమును గూర్చిన బోధలు మాత్రము భిన్నములు. కొన్ని కర్మము లాచరించి, కొన్ని విగ్రహ ములకు కొంత ద్రవ్యము సమర్పించి, కొంత ఆహారనియమము పాటించి, జీవితవైఖరి నొకవిధమున దిద్దుకొన్నచో, ఆ రాజ్యము పునర్లభ్యమగునని యొకబోధ. ప్రకృతి కతీతుడగు నొక పురుషు నికి సాష్టాంగప్రణామ మొనర్చి, విలపించుచు, క్షమాపణ వేడు కొనినచో, లభ్యమగునని మఱొకబోధ. మనఃపూర్తిగా ఆ మహా పురుషుని ప్రేమించినచో లభ్యమగునని ఇంకొక బోధ. ఈ వివిధబోధలును ఉపనిషత్తులలో కలవు. ఈ ఉపన్యాసము నడచు కొలది మీ కీ విషయము తెలియవచ్చును. కాని చివరది, అన్నిటిలో మహనీయమైనది, అగు బోధ రోదనము కేవల మనా వశ్యక మని. 'ఈ కర్మాచరణశ్రమ మేల? రాజ్యపునఃప్రాప్తి విషయమునుగూర్చిన చింతయేల? రాజ్యమును మీరు కోల్పోవ లేదు. కోల్పోవని దానికై అన్వేషింతురా? మీ రిప్పటికే పరి శుద్ధులు, ఇప్పటికే ముక్తులు. ముక్తులమని భావించుకొనినచో

మీ రీ క్షణముననే ముక్తులు ; బద్ధులమని భావించుకొనినచో, మీరు బద్ధులే.' ఇది మిక్కిలి సాహసికవాక్యము. నేను జంకు గొంకులు లేక మాట్లాడ వలసియుండునని ఈ ఉపన్యాసారంభమునందే చెప్పియుంటిని. మీ కిప్పుడు పై వాక్యము వెఱపుగొలుపునేమో కాని, దానినిగూర్చి మనన మొనర్చి, దాని ననుభూతము చేసికొంటిరేని, నా మాట సత్యమేయని మీకు తెలియవచ్చును. ముక్తి మీకు స్వాభావికము కానిచో, మీ రేమిచేసినను ముక్తులు కానేరరు. మొదట ముక్తులుగా నుండి, ఆ ముక్తి నెట్లో కోల్పోయితి రనుకొండు. దాని యర్థము మీరు మొదట కూడ ముక్తులు కారనియే. ముక్తులుగా నుండినచో, ఆ ముక్తి ఎట్లు నశింపగలదు? ముక్తవస్తువు బద్ధముగా నెట్లు మాఱగలదు? నిజముగా నిప్పుడు బద్ధమే అయినచో, మొదట నది ముక్తమై యుండె ననుట భ్రాంతి.

ఈ రెండు పక్షములలో దేని నవలంబింతువు? ఆత్మ స్వతస్సిద్ధముగా శుద్ధము, ముక్తము, అంటివా, లోకములో ఏదియు దానిని బద్ధముగా, పరిమితముగా, చేయజాలదని యేర్పడి తీఱును. లేక, ప్రకృతిలో నేదైన దానిని బంధింపగలిగినచో, అది ముక్తము కాదనియు, ముక్త మనుమాట భ్రాంతిజనితమనియు తేలును. కావున మనకు ముక్తి సాధ్యమైనచో, ఆత్మ స్వాభావికముగనే ముక్త మని యేర్పడుచున్నది. ఇది నిస్సంశయము. ఇట్లు కాక పోవుట అసంభవము. ముక్త మనగా ఇతరవస్తువులపై ఆధారపడనిది అని గదా అర్థము? ఇతరవస్తు వేదియు దానిలో మార్పులు కలిగింప జాలదని కదా! ఆత్మ స్వయంభవము. మనకు గల మహత్తరభావము లన్నిటికి ఈ విషయము మూలకారణము. స్వాభావసిద్ధముగనే ఆత్మ ముక్త మని, అనగా ఇతరవస్తు వేదియు దానిపై అధికారము నెఱపజాలదని, అంగీకరించినగాని, అది అనశ్వరమని (మరణములేనిదని) స్థాపింపజాలము. ఏదో యొక బాహ్యకారణముయొక్క ఫలమేకదా మరణము? విషము

త్రాగితిని, చచ్చితిని. అనగా, బాహ్యకారణమగు విషమునకు నా శరీరము లోబడు నన్నమాట. కావున ఆత్మ ముక్త మనుట నిజమైనచో, అది బాహ్యకారణమగు దేనికిని లోబడ దనియు, కావున మరణింపజాలదనియు, తేలును. ఆత్మ నిమిత్తత్వ న్యాయమునకు, అనగా ఈ మాయకు, అతీతమై యున్నగాని, అది ముక్తము, అనశ్వరము, ఆనందమయము, కానేరదు. ఈ రెండు పక్షములలో నీవు దేని నవలంబింతువు? మొదటిది భ్రాంతియందువా, రెండవది భ్రాంతియందువా? రెండవదే భ్రాంతి యని నా నిశ్చితాభిప్రాయము. నా చిత్తవృత్తులకు, నా లక్ష్యములకు, అదియే ఎక్కువ అనురూపము. నేను స్వతస్సిద్ధముగా ముక్తుడనని నాకు పూర్తిగా తెలియును. కావున ఈ దాస్యము సత్యమనియు, ముక్తత భ్రాంతియనియు నే నెట్లంగీకరింపగలను?

ఈ చర్చ ఏదో యొక రూపమున తత్త్వశాస్త్రములన్నిటిలో కానవచ్చును. మిక్కిలి ఆధునికము లగువానియందుకూడ ఇది చూపట్టుచున్నది. రెండుపక్షములు కలవు: "ఆత్మ యనునదే లేదు. ఆ భావమే భ్రమ. భౌతికపదార్థ పరమాణువు లిటునటు తఱచు చరించుచు, శరీరము, మెదడు, అను సంయోగములను కలిగించును. తత్ఫలమే యీ ఆత్మ భ్రాంతి. ఈ పరమాణువులు కంపించుచు, చలించుచు, నిరంతర సంచారములు చేయుచుండుటచే ముక్తిభ్రాంతి కలుగుచున్నది" అని ఒక పక్షమువారి వాదము. బౌద్ధులలో కొన్ని తెగలవారి దీ భావమే. దీనిని విశదీకరించుటకు వా రీ యుదాహరణము నిచ్చుచుండిరి: ఒక దివ్వటీని గిరగిర అతివేగముగా త్రిప్పినచో, ఒక తేజశ్చక్రము కానవచ్చును. ఆ చక్రము నిజముగా కలదా? దివ్వటి ప్రతి క్షణమునను తిరుగుచున్నదికదా! మనము పరమాణు సముదాయ మాత్రులము. ఆ పరమాణువు లతివేగముగా తిరుగుచుండుటచే నిత్యమగు నొక ఆత్మ యున్నదను భ్రమ కలుగుచున్నది. "భౌతికపదార్థ మనునది నిజముగా లేనే లేదు. భావపరంపరా

గమన మది యున్నదను భ్రాంతిని కలిగించును'' అని రెండవ పక్షమువా రందురు. నీ వే పక్షము నవలంబింతువు? ''ఆత్మ కలదు, భౌతికపదార్థమే లేదు'' అను పక్షమునే కదా. రెండు పక్షముల వాదము లొకేరీతివి. కాని ఆత్మపక్షపువాదము లొకింత ప్రబలములు, ఏలనన, భౌతికపదార్థము అనబడున దేమైనది ఎవ్వరు నెఱుగరుగదా. మనకు అనుభవజ్ఞానము కలుగునది మనలను గూర్చియే. తన వెలుపలి భౌతికపదార్థమును అట్లు అనుభూతము చేసికొన్నవానిని నే నెన్నడును చూడలేదు. తనలోనుండి బైటికి దుముకు శక్తి ఎవ్వరికిని, ఎన్నడును, కలుగలేదు. కావున ఆత్మపక్ష వాదమునకు భౌతికపదార్థపక్షవాదమునకన్న కొంచె మధికబలము కలదు. ఇంకొక కారణము. ఆత్మవాదము ప్రపంచముయొక్క ఉనికిని విశదీకరించును. అనాత్మవాద మట్లు చేయదు. కావున భౌతికపదార్థపక్షపు వాదము యుక్తియుక్తము కాదు. తత్త్వ శాస్త్రము లన్నిటియొక్క నిగ్గు తేల్చి పరిశీలించినచో, అవన్నియు పై రెంటిలో నొక పక్షము నవలంబించు నని తెలియగలము. కావున ఇచటకూడ ఎక్కువ నిగూఢరూపమున, ఎక్కువ ఆధ్యాత్మికరూపమున, ఆ ప్రాతసమస్యయే—ఆత్మయొక్క సహజపరిశుద్ధతను, సహజముక్తిని గూర్చిన సమస్యయే — కానవచ్చుచున్నది. ఒక పక్షమువా రీ ఆత్మను, రెండవ పక్షమువారు మన దాస్యమును భ్రమ యందురు. మేము నిస్సంశయముగా రెండవ పక్షములో చేరి దాస్యమే భ్రమ యందుము.

మనము బద్ధులము కామనియు, ఇప్పటికే ముక్తులమనియు, వేదాంతసిద్ధాంతము. ఇది యటుండ, బద్ధుల మని చెప్పుటయు, తలచుటయు, అపాయకరము. నేను బద్ధుడను, నేను బలహీనుడను, నేను అసహాయుడను, అన్నతోడనే నీ గతి మూడినది. నీవు మఱొక క్రొత్త సంకెలను తగిలించుకొనుచున్నావు. అట్లు పలుక వలదు, అట్లు తలపవలదు. ఒక మనుష్యుడు అడవిలో నివసించుచు

చేయుంబవల్లు శివోఽహం, శివోఽహం (నేను శివుడను) అను చుండువాడట. ఒకనా డొక పులి వానిపై బడి లాగుకొని పోయెనట. ఏటికి ఆవలిగట్టువా రిది చూచుచుండిరి. పులి నోట జిక్కియున్నను, నోరాడుచున్నంతదనుక, నతడు శివోఽహం అనుచునే ఉండెనట. అట్టివా రనేకులు కలరు. తమశరీరములను కోసి ముక్కలుచేయుచున్న శత్రువుల నాశీర్వదించినవారు కలరు. "నే నతడను, నే నతడను, నీవును అతడవే, నేను శుద్ధుడను, పరిపూర్ణుడను, నా శత్రువు లందఱును అట్టివారే. నీ వతడవు. నేనును అతడనే": ఇది ధీరత. కాని ద్వైతమతములలో మహా నీయములు, అద్భుతములు, అగు విషయములు కలవు. ప్రకృతికి భిన్నుడగు సగుణదైవపుభావము ఇం దొకటి. మన మతనిని భక్తిప్రేమలతో నర్చింతుము. ఈ భావ మొక్కొక్కసారి మిక్కిలి ఆప్యాయకరముగా నుండును. కాని ఆ ఆప్యాయత స్వాభావికము కా దనియు, మత్తుమందులు కల్పించు ఆప్యాయత వంటిదనియు, వేదాంతము పల్కును. ఈ లోకములో నేడు— మునుపు ఎప్పటికన్న — ముఖ్యముగా కావలసినది బలమై యుండగా, ఇందుచే కాలక్రమమున బలహీనత కలుగును. లోకములో గల తాపత్రయ మంతటికిని బలహీనతయే కారణ మని వేదాంతమనును. సర్వవ్యథల కదియే ఏకైక కారణము. బలహీనులము గనుకనే కడగండ్లపా లగుచున్నాము. బలహీను లము గనుకనే మనము బొంకుట, చంపుట, ఇతరాపరాధములు చేయుట. బలహీనులము గనుకనే మన దుఃఖములు, మరణములు. మనకు బలహీనత కల్పించునదేదియు లేనిచో, మరణములు, దుఃఖములు ఉండవు. భ్రాంతియే మన వ్యథలకు కారణము. ఈ భ్రాంతిని త్యజింపుడు, ఈ సర్వము అదృశ్యమగును. ఇందుకు సందేహమే లేదు. ఈ ఆధ్యాత్మికచర్చలను, అచ్చెరువుగొల్పు ఈ మానసిక వ్యాయామ విద్యావినోదములను, దాటి చివరకు మన మత్యంతస్పష్టమగు ఈ అద్వైతమతభావమును చేరుదుము.

అద్వైతవేదాంతము సత్యమును మిక్కిలి స్పష్టముగా తెలుపును. సత్యమును అంతకన్న స్పష్టముగా తెలుపుట సాధ్యము కాదు. హిందూదేశములోను, ఇతరదేశములలోను, ద్వైతబోధ చేయబడియుండుట మహాప్రమాదకార్యము. తత్ఫలముగా, జనుల బుద్ధి మూలతత్త్వములమీదికి పోవుటకుమాఱు, మిక్కిలి చిక్కగా నుండు తత్సాధనమార్గములమీద నిలిచెను. అనేకులకు అందలి నిగూఢ ప్రతిపాదనములు—వైదాంతికములును, తార్కికములును—భయంకరములై యుండెను. అట్టి దుర్గమమార్గములు జన సామాన్య మనుసరింపజాలదనియు, సామాన్య దైనిక జీవితమున కవి అనర్థములనియు, అట్టి వేదాంతము పేర నియమబద్ధజీవితపు బిగి సడలి, స్వేచ్ఛాప్రవర్తనము చెలరేగుననియు, వారు తలంచిరి.

కాని అద్వైతమతబోధలో ఇట్టి అపాయ మేమాత్రము లేదని నా భావము. అది అవినీతిని గాని, దౌర్బల్యమును గాని, కలిగింపదు. కలిగింపక పోవుట మాత్రమే కాదు. వానిని పోగొట్టుటకు తత్సమానమగు అమోఘప్రతిక్రియ ఇంకేదియు లేదు. ఈ మాట నిజమైనచో, చెంతనే ప్రవహించుచుండు జీవనదిలోని దివ్యజలమును వదలి జనులు రొచ్చుకాలువ నీటిని త్రాగుచున్నారు. ఇది చూచి మన మూరకుండవచ్చునా ? అద్వైతబోధలు నిర్మలములను మాట నిజమైనచో, ఈ క్షణముననే వానిని లోకమున కేల బోధింపరాదు ? లోకు లందఱికిని — జన్మించిన ప్రతిమానవునికి ; పుణ్యమూర్తులకు, పాపమూర్తులకు ; స్త్రీలకు, పురుషులకు, శిశువులకు ; పురము నేలువారికి, వీథు లూడ్చువారికి — ప్రతివారికి, ఈ క్షణముననే పిడుగులుపోలు నుడువులతో ఏల బోధింపరాదు ?

ఇది అణపరాని మహోద్యమ మని మీ కిప్పుడు తోపవచ్చును. మీలో అనేకు లిది విని బెదరిపోవచ్చును. ఇందుకు కారణము పూర్వస్థితియందు మన కుండు మూఢవిశ్వాసమే కాని

వేఱుకాదు. వివిధదుష్టపదార్థములను, జీర్ణముకాని ఆహారములను తినుటచేత, పస్తులుపడి మాడుటచేత మంచి యాహారము భుజించు శక్తి నశించును. మనము చిన్ననాటినుండియు బలహీనత కల్పించు మాటలు వినుచున్నాము. దయ్యముల ఉనికి తమకు నమ్మకము లేదనువా రనేకులు కలరు. కాని చీకటిలో కొంచెము ఒడలు జలదరింపనివా రనేకులు లేరు. ఇందుకు మూఢవిశ్వాసమే కారణము. సైతాను లేదన్నచో, మతమే నశించు ననుకొనువా రీ దేశమున కలరు. సైతాను లేని మత మెట్లుండగలదని నన్ననేకు లడిగిరి. మనకు త్రోవచూపువా డొకడు లేని మతము ఉండ గలుగునా? పరిపాలకు డొక డుండనిచో మన మెట్లు జీవింపగలుగు దుము ? పరిపాలింపబడుచుండు భావము మనకు అలవాటైపోయినది. కనుక మనము పరిపాలన నపేక్షింతుము. ఒకనిచే ప్రతిదినము చీవాట్లు తినుచున్నట్లు తోచినగాని మనకు హాయిగా నుండదు. ఇదంతయు ఆ మూఢవిశ్వాసమే! కాని ఈ స్థితిమాఱి తీఱును. మీ కిప్పు డది భయంకరముగా తోచినను, కాలము మాఱిపోవు ననుట నిజము. అప్పుడు మనలో ప్రతివారును ఇప్పటి స్థితిని జ్ఞప్తికి తెచ్చుకొని, పరిశుద్ధమును నిత్యమును అగు మన ఆత్మ నావరించియుండిన మూఢవిశ్వాసము లన్నిటిని తలచి, మనలో మనమే నవ్వుకొందుము. "నేను ముక్తుడను, ఎప్పుడును ముక్త డనుగనే ఉంటిని; ఎప్పటికిని ముక్తుడనుగనే ఉందును" అని మన మప్పుడు హర్షముతో, ధీరతతో, త్రికరణశుద్ధితో, మాటిమాటికి పల్కుదుము. ఈ అద్వైతభావము వేదాంతమువలన కలుగును. ఈ భావ మొక్కటియే శాశ్వతముగా నిలిచియుండదగినది. శాస్త్రములను రేపు నశింపనిండు! ఈ అద్వైతభావము మొదట హీబ్రూజాతికి స్ఫురించిననేమి, ఉత్తరధ్రువవాసులకు స్ఫురించిన నేమి? అది ఎవరికి అక్కఱ? ఇది సత్యమగు టొక్కటే ముఖ్యము. సత్యము సనాతనము (ఎప్పుడును ఉండునది). తా నొకరి సొమ్ము కాదని సత్యమే తెలుపుచున్నది. ఈ ఏకైకసత్యము నెఱుగుటకు

మానవులకు, మృగములకు, దేవతలకు, సమానమగు అధికారము కలదు. వారందఱును దానిని కైకొందురుగాక. జీవితమును వ్యథామయము చేసికొను టేల? సర్వవిధమూఢవిశ్వాసములకు జను లేల ఆహుతి కావలెను? వారిలో ఇరువదిమందియైన తమ మూఢవిశ్వాసములను త్యజించునెడల నేను పదివేల జన్మములైన ఎత్తుదును. అద్వైతసత్యమును తెలిపినచో జనులు భీతిల్లుదురు. అది మీ దేశములో మాత్రమే కాదు. ఆ మతమునకు పుట్టినిల్లైన మా దేశమునకూడ అంతే. "లోకమును త్యజించి, అడవులలో నుండు సన్న్యాసులకీ భావము యోగ్యము. వారికే ఇది అనుకూలము. కాని మా బోటి సామాన్యగృహస్థులకు కొంచెము దైవభీతి, కొంచెము కర్మకలాపము అవసరము" అని ఈ రీతిగా వారు మాట్లాడుదురు.

ద్వైతభావములు లోకమును చాలకాలము పరిపాలించినవి. తత్ఫలమే ఇది. మఱొకమార్గ మేల త్రొక్కి చూడరాదు? అద్వైతభావము అన్నిమనస్సుల కెక్కుటకు కొన్ని యుగములు పట్టుననుట నిజమే. కాని వెంటనే ఏల మొదలుపెట్టరాదు? మన జీవితకాలమున ఇరువదిమంది కిది బోధించితిమేని, మనము ఘనకార్య మొనర్చినట్లే.

"నేను పరిశుద్ధుడను, ఆనందమయుడను" అని చెప్పుట సులభమే కాని, ఆ మాట కనుగుణముగా నడచుకొనుట చాల కష్టము. ఇది నిజమే. అద్వైతభావప్రచారమున కిది ప్రతిబంధకముగా వర్తించును కూడ. కాని ఆదర్శసిద్ధి సుసాధ్యమా? ప్రతి పసిబిడ్డకును ఆకసము కనుపట్టుచుండును. కాని ఎంతో దూరమున. దూర మను కారణమున ఆకసమును చూడరాదా? మూఢవిశ్వాసముల దెస కేగుటయే మంచిదా? అమృతము లభింపనిచో విషమును త్రాగ జెల్లునా? సత్యానుభూతి వెంటనే లభింప దను కారణమున అంధకారములో నల్లాడి, దౌర్బల్య మూఢవిశ్వాసములకు లొంగిపోవుట ఉపయోగకరమా?

ద్వైతమతరూపములు పెక్కింటికి నా కాక్షేపము లేదు. వానిలో ననేకములు నా కిష్టములు కూడ. కాని దౌర్బల్యభావము లుపదేశించు బోధ లన్నిటిని నే నాక్షేపింతును. భౌతికశిక్షగాని, వైజ్ఞానికశిక్షగాని, ఆధ్యాత్మికశిక్షగాని, పొందుచుండు ప్రతి పురుషుని, ప్రతిస్త్రీని, ప్రతిశిశువును, నే నొక ప్రశ్న అడుగుదును. ఒకే ప్రశ్న : "నీకు బలముకలదా? బలము నీ బుద్ధికి గోచరించు చున్నదా?" బలము నీయగలిగినది సత్యమొక్కటియే అని నే నెఱుగుదును. కావుననే ఈ ప్రశ్న. సత్య మొక్కటియే జీవము నీయగలదు. సత్యముదెస పయనించు చుండుటచే తప్ప మఱెట్లును బలము చేకూరదు. బలము చేకూరిన పిదపగాని సత్యము అందు పాటులోనికి రాదు. మనస్సును దుర్బల మొనర్చి, మూఢవిశ్వాస పూరితముగా చేసి, నిరుత్సాహపఱచి, దానిని సర్వవిధములగు అసాధ్యవిషయములదెస, మర్మపుకిటుకులదెస, వెఱ్ఱిభావములదెస, పఱపు మతము లన్నియు నా కసమ్మతములు. అవి అపాయకరము లని నా విశ్వాసము. ఆ మతములు శుభప్రదములు కావు. అవి మనోవ్యాధిని, మనోదౌర్బల్యమును కలిగించును. ఆ దౌర్బల్య కారణమున మనస్సు కాలక్రమమున సత్యమును గ్రహించి, సత్యమార్గమున జీవించు శక్తిని చాలవఱకు కోలుపోవును. కావున మన కతిముఖ్యముగా కావలసినది బల మొక్కటియే. భవరోగ మునకు బలమే ఔషధము. ధనికులు పీడించునప్పుడు బీదలకు ఉండవలసిన ఔషధము బలము. విద్యావంతుడు పీడించునప్పుడు పామరులకు ఉండవలసిన ఔషధము బలము. ఇతర పాపులు పీడించునప్పుడు పాపులకు ఉండవలసిన ఔషధము బలము. ఈ అద్వైతభావమువలె మనకు బలమిచ్చున దింకేదియు లేదు. ఈ అద్వైతభావమువలె మనలను నీతిపరుల నొనర్చున దింకేదియు లేదు. బాధ్యతయంతయు మన నెత్తిమీదనే పడిన దను భావము కలిగినప్పుడుగాని మనము పరిపూర్ణశక్తితోను, పరిపూర్ణబుద్ధితోను కార్యనిర్వహణ మొనర్పము. మి మ్మొక ప్రశ్న అడిగెదను. ఒక

కసుగందుబిడ్డను మీ చేతులలో నుంచితి నేని, మీ రెట్లు ప్రవర్తింతురు? 'తాత్కాలికముగా మీ జీవితమంతయు మాఱిపోవును' అని పందెమొడ్డి చెప్పగలను. మీ రెట్టివారైనను, ఆ తరుణమున స్వార్థరహితు లగుదురు. భారమంతయు మీపై బడినతోడనే మీ దుష్టస్వభావమును విడనాడుదురు. తాత్కాలికముగా మీ శీలమే మాఱిపోవును. కావున భారమంతయు మనపై బడినప్పుడు మన అత్యున్నతశక్తియు, మన అత్యున్నతసౌశీల్యమును, ప్రదర్శితమగును. దేవులాడుచు పోయి చేరుట కెవ్వరును లేనప్పుడు: నిందలు మోపుటకు దయ్యము, భూతము, ఏదియు లేనప్పుడు: మన భారములు మోయు సగుణదైవ మెవ్వరును లేనప్పుడు: బాధ్యత యంతయు మనమీదనే పడినప్పుడు: మనలో గల మహోన్నతి అంతయు బైటికి వచ్చును—"నా విధికి నేనే కర్తను, నాకు వచ్చు శుభము నేను తెచ్చుకొనునదే. నాకు వచ్చు అశుభము కూడ నేను తెచ్చుకొనునదే, పరిశుద్ధుడను నేనే. ఆనందాత్ముడను నేనే." ఇందుకు విరుద్ధములగు భావములన్నియు మనము త్యజింపవలెను. "నాకు మృత్యువు లేదు; శంక (భయము) లేదు; నాకు జాతిభేదము లేదు; నాకు మాతాపితలు లేరు; సోదరులు లేరు; మిత్రులు లేరు; శత్రువులు లేరు; నేను సచ్చిదానందరూపుడను; నేను శివుడను, నేను శివుడను. పాపపుణ్యములు, సుఖదుఃఖములు నన్ను బంధింపవు; తీర్థములు, వేదములు, యజ్ఞములు నన్ను బంధింపజాలవు; నాకు ఆకలిదప్పులు లేవు; ఈ దేహము నాది కాదు; ఈ శరీరమునకు కలుగు వ్యాధిజీర్ణతలు నన్ను బంధింపవు: నేను సచ్చిదానందరూపుడను, నేను శివుడను, నేను శివుడను."

మనకు ఉండవలసిన ప్రార్థన మిదియొక్కటియే అని వేదాంతము చెప్పుచున్నది. "నేనే శివుడను" అని మనము భావించుకొనవలెను; ఇతరులకు జెప్పవలెను. గమ్యస్థానమును చేరు మార్గ మిది యొక్కటియే. నిరంతర మిట్లు చేయుచున్నచో,

బలము లభించును. మొదట తేడబడువాడుకూడ క్రమాధిక బలము నొందును. ''నేను శివుడను'' అను వాణి కూడ క్రమాధిక బలము నొందును. చివర కీ సత్యము మన హృదయముల కెక్కి, మన రక్తనాళములలో ప్రవహించుచు, మన యావచ్ఛరీరములో చొచ్చి వ్యాపించును. సత్యదీప్తులు అధికాధికముగా దేదీప్యమానము లగుకొలది, భ్రాంతి మోహములు అదృశ్యము లగును. ఇట్లు జరుగగా జరుగగా, సర్వము అదృశ్యమై, సూర్య డొక్కడే ప్రకాశించుచుండు కాలము వచ్చును.



# విశ్వతత్త్వ దర్పణము

## బ్రహ్మాండము

(న్యూయార్క్ ఉపన్యాసము : 19-1-1896)

మనచుట్టును పుష్పములెంతయో మనోహరముగా గోచరించుచున్నవి. ప్రాతఃకాలమున నుదయించు సూర్యుడు సౌందర్యమును గ్రక్కుచుండును. సృష్టి మనోహర కాంతులను ప్రసరించుచుండును. ఈ విశ్వమంతయు కడు రమణీయముగ గాన్పించుచున్నది. నరుడు ఈ పుడమిని జననమందినది మొదలు ఈ సౌందర్యమునెల్ల అనుభవించుచున్నాడు. పర్వతము లెంతయు గంభీరములై, గౌరవభాజనములై చూపట్టును. కడలిని జేరు కాంక్షతో కడువడిగ ప్రవహించు మహానదులును, తెరువుగానరాని మరుభూములును, అంతులేని మహాసముద్రములును, నక్షత్ర సంశోభితనీలాకాశమును : ఇవన్నియు భక్తినుప్పతిల్లజేయుచు మహనీయములై, మనోహరములై యొప్పుచున్నవి. సత్తావిష్ట ప్రకృతి యని మనము పేర్కొనునది మానవుని స్మృతిని దాటిన ప్రాచీనకాలమునుండియు నరహృదయమున నంకితమగుచునే యున్నది. నరునిసంకల్పము నది పరివర్తనము గావించుచునే యున్నది. అందుకు ప్రతిక్రియగనే "ఇవన్నియు నేమి? ఎచ్చోటి నుండి కలుగుచున్నవి?" అను విచారణ బయలుదేరినది. మానవుని రచనలలో మహాపురాతనములగు వేదములలోని ప్రాచీనభాగముల నిర్మాణకాలమందు సహితము ఈ ప్రశ్న వెలువడియేయున్నది. "ఇదంతయు నెందుండి పుట్టుచున్నది? అస్తిత్వముగాని నాస్తిత్వము గాని లేక, అంధకార మంధకారమున నడగియున్న కాలమున ఈ విశ్వమును ఆవిష్కృతిగావించిన దెవరు? ఎట్లావిర్భవింప జేసిరి? దీనిరహస్యము నెరింగినవారెవ్వరు?" అను శంక కలిగెను.

ఆశంకయే నేడు మనకును విచారణాంశ మగుచున్నది. ఈ ప్రశ్నకు లక్షలకొలదిగ సమాధానములు కూర్పబడియున్నవి. అయినను నింకను కోటిపర్యాయము లీప్రశ్నకు సమాధానము చెప్పవలసియేయుండును. ఇట్లనుటచేత పూర్వపుసమాధానము లన్నియు వ్యర్థములయ్యెనని భావముకాదు. ఈ ప్రశ్ననుగూర్చి వెలువడిన ప్రతిసమాధానమునందు కొంత సత్య మిమిడియే యున్నది. కాలక్రమమున నీ సత్యము బలము గూర్చుకొనుచు బోవుచున్నది. ఈ ప్రశ్నకు భారతదేశతాత్త్వికుల గ్రంథముల నుండి నేను సంగ్రహింపజాలిన సమాధానమును ఆధునికవిజ్ఞానాను సరణముగా నిప్పుడు మీయెదుట దెలుప బ్రయత్నింతును.

ప్రశ్నలలోనికెల్ల నత్యంతపురాతనమగు ఈ ప్రశ్నయందలి కొన్ని యంశము లిదివరకే పరిష్కారము చేయబడియున్నవి. అందు మొదటివిషయము "అస్తిత్వముగాని నాస్తిత్వముగాని లేని కాలమొకటి కల" దనుట. అనగా నీ విశ్వము లేనికాలముగలదు. సముద్రములు మహాసముద్రములు గలిగి, నదులు పర్వతములు పట్టణములు గలిగి, పల్లెలు గలిగి, మరియు నరసంఘములు జంతు సంతానములు వృక్షవర్గములు పక్షిజాతులు ఈగ్రహములు ఈ జ్యోతిర్మండలములు ఇంతేల సృష్టియందలి అనంతనానాత్వము గలిగి జెన్నారు మన భూమాతయే లేనికాలము సయితము కలదట! ఈమాట తథ్యమేనా? దీనినెటులు పరిష్కారము చేయగలిగిరో కనుగొన యత్నింతము. చుట్టును మనుజునకు గాన్పించు నీ ప్రకృతి యొక్క తత్త్వమెట్టిది? ఒక మొక్క నుదాహరణముగ దీసి కొందము. నరుడొకగింజను నేలలోబెట్టును. కొంతకాలమున కొక మొలక తలజూపి నెమ్మదిగా పైకి వెడలుచున్నది. ఇంకను పెరిగి పెరిగి మహావృక్షమగుచున్నది. తుదకది చచ్చును. గింజ మాత్రము మిగులును. ఇట్లొక చక్రమేర్పడుచున్నది. అది గింజనుండి బయలుదేరి, చెట్టైనది. తుదకు గింజరూపమున న స్థ

మించినది. ఒక పక్షిని జూడుడు. అనేక గ్రుడ్డునుండి పుట్టును. కొంత కాలము జీవించును. మరణించును. కొన్ని గ్రుడ్లను తన వెనుక విడిచిపోవును. అవి ముందు రాబోవుపక్షులకు బీజములై యొప్పుచున్నవి. మృగములవిషయమును నిట్లే యున్నది. నరుని విషయముకూడ నిట్లేయున్నది. సృష్టియందలి ప్రతిదియు నేదో బీజమునుండి, యేదో యంకురమునుండి, అనగా నేదో యొక సూక్ష్మతరరూపమునుండి బయలుదేరి క్రమముగా స్థూలతరరూపములనుదాల్చి ప్రవర్ధనమగును. ఆ విధముగా కొంతకాలము గడపి తిరిగి మొదటి సూక్ష్మతరరూపమునకు మరలి, యంతరించును. రమణీయమగు సూర్యకిరణములకు నాట్యరంగమై యొప్పు వర్ష బిందువు సముద్రమునుండి యావిరిరూపమున పైకిలాగబడు చున్నది. గాలిలో నూర్ధ్వముగా బోయిపోయి యచ్చట నీరుగా మారి ఈ వర్షబిందురూపముం దాల్చి నేలరాలుచున్నది. మరల నది యావిరిరూపమును దాల్చును. ప్రకృతిలో మనచుట్టును గాన్పించు ప్రతివస్తువును నిట్లే వర్తించుచుండును. ఈ మహా పర్వతములు హిమప్రవాహములయొక్కయు నదులయొక్కయు రాపిడికి లోనగుచున్నవి. ఆ రాపిడి వలన నెమ్మదిగనైనను తప్పక నలియగుచుండును. ఈ జలధారలు వానిని పొడిచేసి, యిసుకగ మార్చి సముద్రములోనికి లాగికొనిపోవును. సముద్ర గర్భమున నీ యిసుక పొరలు పొరలుగా పేరుకొని, గట్టిపడి శిలాకృతి దాల్చును. క్రమక్రమముగ నివి కొండలుగ నేర్పడి భావి సంతతివారికి మరల పర్వతములరూపమున ప్రత్యక్షమగును. ఇంకొకసారి అవి నలిగి పొడియైపోవలసియేయుండును. ఇట్లీ చక్రము తిరుగుచుండవలసినదే. ఇసుకనుండి మహాపర్వతములు ప్రభవించును. అవి తిరిగి యిసుకగ మారుచుండును.

ప్రకృతియొక్క ఆద్యంతము లొకేతీరున బరగుట సత్యమగు నేని — మనయనుభవమున దీనికి భిన్నత్వము గోచరించుటలేదు

గదా—ఒక్క చిన్న యిసుకరేణువుయొక్క సృష్టియందు వర్తించు విధానమే మహత్తరములగు సూర్యగోళములను తారకలను సి విశ్వమునంతను సృష్టించుటలో అనువర్తించుననుట తథ్యమయ్యె నేని: అణువుయొక్క నిర్మాణము ననుసరించియే విశ్వమంతటి యొక్క నిర్మాణమన బరగునేని: ఈ యఖిలవిశ్వము నొకే నియ మముతోడ నిర్మింపబడియుండుట నిజమగునేని: ఇంక, వేదములు ఘోషించురీతిని "ఒక్క మృత్పిండముయొక్క తత్త్వమును దెలిసి కొంటిమా విశ్వములోని మృత్తికారాశి యంతటియొక్క తత్త్వమును దెలిసికొనినట్లే" యగును. ఒక్క చిన్న మొక్కను దీసికొని దాని జీవనరహస్యమును గనిపెట్టితిమా, విశ్వమునంతను గ్రహింప గల్గుదుము. ఒక్క యిసుకరేణువుయొక్క గుట్టును దెలిసికొనిన యెడల, విశ్వముయొక్క గుట్టంతయు తెలిసిపోవును. ఈ సూత్ర మునే దృశ్యప్రపంచమంతటికిని ననువర్తింపజేసినయెడల, సమస్త మునకును ఆద్యంతములు దాదాపుగా నొకేతీరుననుండునని సులభ ముగ గ్రహింప గలుగుదుముగదా. ఇసుకనుండి కొండలుపుట్టి తిరిగి యిసుకగ మారుచున్నవి. నదు లావిరిమూలమునబుట్టి మరల నావిరి యగుచున్నవి. చెట్లు గింజలవలన నుద్భవమయి తుదిని గింజలుగా నంతమొందుచున్నవి. నరజీవి నరజీవకణములనుండి యావిర్భవించి కడపట నరజీవకణములందే యంతము గాంచును. జగత్తు అంతయు — నక్షత్రములు గ్రహములు సహా — నొక సూక్ష్మతరమగు వాయురూపమునుండి కలిగినదే. దానిలో మరల లయమందవలసినదియే. దీనినుండి మనము నేర్చుకొనవలసినదేమి? ఈ దృశ్యమగు స్థూలరూపము ఫలిత మనియు, సూక్ష్మతరరూపము దీనికారణమనియునేగదా! వేలకొలదిసంవత్సరములకు బూర్వము తత్త్వశాస్త్రములకు మూలపురుషుడగు కపిలమహర్షి విలయ మనగా కార్యరూపమున గోచరించునదే తిరిగి కారణరూపమును పొందుటే యని ఋజువుచేసియున్నాడు. ఇక్కడ నున్న యీ బల్లను నాశనముచేసినయెడల నది తనకు మూలకారణమైన

సూక్ష్మతరరూపమును తిరిగి పొందును. అనగా ఏ అణువుల సంఘాతము మనమిప్పుడు బల్లయని పిలుచుచున్నట్టి ఆకారముగ నేర్పడెనో, ఆ అణువులు తమ సూక్ష్మస్వరూపమును మరల దాల్చును. ఒక మనుష్యుడు మరణించునప్పుడు తానే భూతములతో నీ శరీరమును గూర్చుకొనెనో యా భూతములు తమతమ స్వస్వరూపములను దిరిగి పొందును. ఈ భూమి నశించునెడల దాని రూపము నొసగిన భూతములు స్వస్వరూపములను తిరిగి పొందును. విలయ మనగా నిదియే. కార్యము తిరిగి కారణరూపమును పొందుటే. కాబట్టి కార్యమనునది — అనగా ఫలితముగా నేర్పడినది — మొదటి కారణమే యనియు వేఱుకాదనియు దెలిసికొనుచున్నాము. కారణమే వేఱొక యాకారమునంది, కార్యమై కానిపించును. ఈ యద్దమనునది కార్యము. దీనికి కారణమున్నది. ఆ కారణమే కార్యమగు అద్దము రూపమున వ్యక్తమగుచున్నది. కొంత భౌతికపదార్థమును, నిర్మాణకుని హస్తములందలి శక్తియు గూడి మన మిప్పుడు అద్దమని పిలుచు రూపమేర్పడుటకు "ఉపాదాన" "నిమిత్త" కారణములగుచున్నది. శిల్పిహస్తమునందలి కౌశలము ఈ యద్దములో ఆశ్లేషశక్తిరూపమున (అనగా అంటుకొనియుండు శక్తి—ఎడ్ హిషన్—రూపమున) నున్నది. అదిలేనియెడల ఈ యద్దమునందలి రేణువులన్నియు వేని కవి విడిపోవును. కాచమను పదార్థమును ఈ యద్దమందున్నది. ఈ సూక్ష్మతరకారణములు క్రొత్తగ దాల్చిన దృశ్యరూపమే ఈ యద్దము. ఈ యద్దమును భిన్నముచేసినయెడల దానియందలి ఆశ్లేషశక్తి వెడలిపోయి తన మూలశక్తిలో చేరుకొనును. దీనియందలి కాచరేణువులు ఇంకొక నూతనాకృతిగ నేర్పడువఱకట్లే నిలిచియుండును.

కావున కార్యము తన కారణమునుండి భిన్నమగునది కాదని తెలిసికొంటిమి. ఈ కార్యమనునది కారణముయొక్క-

ప్రతిరూపమే. అనగా కారణముయొక్క స్థూలతరాకారమే. కావున మనము చెట్లు, మృగములు, మనుజులు అని పేర్కొను వేర్వేఱురూపములన్నియు లేచుచు, పడుచు, అనంతముగా పునః పునరావృత్తి నందుచుండుననియు తెలియవచ్చును. బీజమునుండి చెట్టువచ్చును. చెట్టునుండి బీజము కలుగును. అది తిరిగి చెట్టు రూపమును దాల్చును. ఇట్లే జరుగుచుండును. దీని కంతము లేదు. నీటిచుక్కలు పర్వతసానువులలోబడి దొర్లుచుబోయి సముద్రమున జేరుచుండును. అవి తిరిగి యావిరిరూపమున బైకిలేచును. పర్వతములపైన వర్షరూపమునబడి, యింకొకసారి సముద్రమున జేరును. ఇట్లు సర్వరూపములును లేచుచు బడుచు చక్రాకృతితో సాగుచుండును. ఎల్లజీవులవిషయముకూడ నిదియే. మనము చూడజాలునట్టియు తాకగలట్టియు విననోపునట్టియు నూహింపగలట్టియు సమస్తము నిట్లే వర్తిలుచున్నది. నరుని శరీరమందలి యుచ్ఛ్వాసనిశ్వాసలవలె మన తెలివికి గోచరించు సర్వమును నిదేరీతిని వర్తించుచున్నది. అలలు లేచుచు గ్రుంకుచు మరల లేచుచు గ్రుంకుచు నుండు తీరున సృష్టియందుగల సర్వమును వర్తించుచుండును. పైకిలేచు ప్రతి తరంగము నంటి యొక పల్లమును ఏర్పడును. ప్రతిపల్లమునకు ననుసరణముగ నొక యల యేర్పడును. ఏకైకధర్మము సర్వత్ర వర్తించుటచే, ఈ జగమునంతటి నొక్క సమష్టివస్తువుగ భావింతుమేని, ఈ నియమము చెల్లతగియే యుండును. ఈ జగత్తంతయుగూడ తన కారణరూపము నెప్పుడో తిరిగి పొందవలసియే యుండును. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, భూమి, శరీరము, మనస్సు మఱియు నీ విశ్వమునగల సర్వమును సూక్ష్మతరములగు తమతమ కారణరూపములను మరల పొందవలసియే యున్నవి. అదృశ్యములు కావలసినవియే; అనగా విలయమును బొందవలసినవే. కాని ఆ సూక్ష్మతరాకారమునందు, అనగా తమ కారణ స్వరూపమున, నిలిచియే యుండును. ఈ సూక్ష్మాకారములు తిరిగి క్రొత్తప్రపంచములు,

క్రొత్తసూర్యులు, క్రొత్తచంద్రులు, క్రొత్తనక్షత్రములు నై స్థూల రూపములదాల్చి బయల్పడగలవు.

ఇవి యీ రీతిగ లేచుచు పడుచు నుండుటనుగూర్చి మఱొక రహస్యమును గ్రహింపవలయును. విత్తు చెట్టువలన గలుగుచున్నది. అది తిరిగి తత్‌క్షణమే చెట్టుకాదు. కొంతకాలము నివృత్తిస్థితిలో నున్నట్లు నిలిచియుండును. లేక సూక్ష్మదశయందు అవ్యక్తరూప ప్రవృత్తి కలిగియుండును. ఆ విత్తు భూమిలోనున్నప్పుడు కొంత పనిచేయును; కొన్ని విభాగములుగ విడిపోవును. విచ్ఛిన్నమగునని చెప్పవచ్చును. ఇట్లది విచ్ఛిన్నమగుస్థితినుండియే నిర్మాణకర్మ ప్రారంభము కావలసియుండును. అదే రీతిని విశ్వమంతయును నదృశ్యమై అవ్యక్తమై సూక్ష్మాకారమున కొంతకాలము పని చేయవలయును. ఆ దశనే విలయ మందురు. దానినుండియే నూతనావిష్కరణము రావలసియుండును. ఇట్లొకసారి విశ్వ మంతయు నిమ్నదశనుబొంది సూక్ష్మతరమగు అవ్యక్తదశయందు మొదట కొంతకాలము గడపి తిరిగి బహిర్గతమై దృశ్యమగు కాలము వచ్చును. ఈ కాలమంతటిని ఒక "కల్ప" మందురు. ఆధునికుల కీ సందర్భమున నొక క్లిష్టమగు శంక వొడముచున్నది. సూక్ష్మాకారములు చాల నెమ్మదిగ వివృతి (వికాసము) నందుచు క్రమక్రమముగ స్థూలతరాకృతులను దాల్చుచుండును గదా. కార్యకారణములు అభిన్నములనియు కారణముయొక్క రూపాం తరమే కార్యమనియు గ్రహించితిమి గదా. కావున నీవిశ్వమంతయు శూన్యమునుండి కలిగె ననజాలము. కారణము లేక యేదియు నుద్భవము కాజాలదనియు, కారణమే రూపాంతరమునంది కార్య మగుచుండుననియు మన మెఱుగుదుముగదా.

అటులైనచో "ఈ విశ్వమంతయు దేనినుండి యుద్భ వించుచున్నది? దేనినుండి యీ నరరూపము కల్గుచున్నది?" అనిన "తత్పూర్వమున నుండియున్న సూక్ష్మతరాకృతినుండి"

యనవలయును. దేనినుండి చెట్టుపుట్టుచున్నది? విత్తునుండియే కదా! ఈ చెట్టంతయు నొకవిత్తునందిమిడియున్నది! అది బహిర్గతమై దృశ్యరూపము దాల్చును. అదేరీతిని విశ్వమంతయు సూక్ష్మతరాకృతినున్నతన స్వస్వరూపమునుండియే వెలువడివచ్చి యీ వ్యక్తరూపమును దాల్చిన దనవలయును. మరల నిదెప్పుడో తనసూక్ష్మతరాకృతిని బొంది యాపిమ్మట తిరిగి స్థూలతరదృశ్య రూపమును తాల్చును. కావున సూక్ష్మాకృతులు క్రమేణ స్థూల తరాకృతులను దాల్చును, ఒక హద్దునుజేరి, తదనంతరము వెనుకకు దిరిగి సూక్ష్మతరాకృతులను పొందుచుండును. ఈ తీరున సూక్ష్మతరాకృతులు స్థూలతరాకృతులుగ మారుచు బోవుటను, అనగా తమతమ అవయవస్ఫూర్తిని గూర్చుకొనుచు బోవుటను, ఆధునికులు !"పరిణామము" (యెవెల్యూషన్) అనుపేర వ్యవహరించుచున్నారు. ఇదంతయు సత్యమే ; నిస్సందేహముగా సత్యమే. మన మనుభవపూర్వకముగ గ్రహించుచున్న విషయమే. వివేకవంతు డెవడును పరిణామవాదులతో దగవులాడబోడు. కాని మన మింకొక విషయమునుకూడ గ్రహింపవలసి యున్నది. ఇంకొక యడుగు ముందుకు బోవలసియున్నారము. అదేది? ఆ "పరిణామ" మనెడు "వివృతి" (యెవెల్యూషన్) తత్పూర్వపు "సంవృతి" (ఇన్‌వెల్యూషన్) నుండి రావలసియుండు ననిగుర్తింపవలెను. విత్తు చెట్టునకు జనకస్థానమగుననుట సరియేకాని మున్నొకచెట్టావిత్తునకు జనకస్థానమై వెలసెనని గ్రహింపవలయును. పెద్దచెట్టు సూక్ష్మరూపముననున్న విత్తునుండి వచ్చుచున్నది. సరే! ఆవిత్తు, పూర్వము ముడుచుకొనిపోయిన అనగా 'సంవృతిని' పొందిన యొక పెద్దచెట్టుయొక్క రూపాంతరమేసుడీ! ఈ జగత్తంతయు సూక్ష్మతరాకృతిగల విశ్వవ్యాపి జగత్తునందుండియున్నదే. నరరూపముగ వికాసమును పొందనున్న చిన్న జీవకణము (శుక్లబిందువు) 'సంవృతి' దాల్చిన యొకనరుడేసుడీ! ఆతడే తిరిగి 'వివృతి'నంది, నరరూపమున ప్రత్యక్షమగుచున్నాడు. ఈ విషయమును స్పష్ట

ముగ గ్రహించినయెడల "పరిణామవాదుల"తో మనకు వైరమే లేదు. ఏలయందురా, వారీయంశము నంగీకరించినయెడల, వారు మతవిధ్వంసకులగుటకు మారుగ, మతమున కెంతయు బలమును గూర్చినవారగుదురు.

సరే! శూన్యమునుండి యేదియు రాజాలదనుట రుజువైనది. ప్రతిదియు అనాదికాలమునుండియును ఉన్న దేయనవలయును. ఇంకను అనంతకాలము నుండబోవునదియే. కాని, దానిగతి పరంపరగా సంభవించుచుండు నిమ్నోన్నతదశల బొందుచు, తరంగపు నడకవలె జరుగుచుండును; సూక్ష్మతరరూపములతో వెనుకకు బోవుచు, స్థూలతరరూపములతో ముందుకు వచ్చుచు నుండును. ప్రకృతియందెల్లెడలను సంవృతియు వివృతియు నిరంతరము సంభవించుచునేయుండును. అత్యంతక్షుద్రజీవి మొదలుకొని యుత్తమోత్తముడగు సిద్ధపురుషుని వఱకును నడుమగలుగు పరిణామపరంపర యంతయు ముందొక దానియందు సంః నంది నిగూఢమై యుండవలయును. ఆ సంవృతి దేనిది? అను శంక బయలుదేరును. ఏది సంవృతినందినది? "బ్రహ్మము" అనెదమేని "అట్లనుట సరిగాదు" అని పరిణామవాది యడ్డుపెట్టును. ఎందువలననో చూతము. "బ్రహ్మము చిద్రూపమని యందురు గదా! 'పరిణామ' యాత్రయందు జాలదూరము గడచినమీదటగాని చిత్తు (తెలివి) అనునది చూపట్టుటలేదు. నరునందును, కొన్ని యుత్తమజాతి జీవులందును మాత్రమే, తెలివి గోచరించుచున్నది. మఱియు నీ తెలివి లోకమున ఉత్పన్నమగుటకు లక్షలాది సంవత్సరములు పట్టెను" అని వాని వాదము. 'పరిణామ' వాది చెప్పు ఈ యాక్షేపణ నిరాధారమని మనసిద్ధాంతమును బట్టియే తెలిసికొనగలము. చెట్టు విత్తునుండి పుట్టి తిరిగి విత్తునందు ముగియుచున్నదిగదా. ఆదియు అంతమును నొకటే యగుచున్నవి. ఈ భూమి తన "యుపాదానకారణము" నుండి

వెలువడి తిరిగి దానిలోనే విలీనమగుచున్నది. కాన 'ఆది' తెలిసినయెడల 'అంతము' తెలిసినట్లగుచున్నది. మఱియు 'అంతము' తెలిసిన 'ఆదియు' తెలిసె ననవచ్చును. అట్లయినచో చిన్న యేకకణజీవి (ప్రోటోప్లాసమ్) మొదలు ప్రపూర్ణతనందిన నరసత్తమునివఱకును గల అవిచ్ఛిన్న జీవయాత్రలో తుదిని పరిపూర్ణుడగు నరసత్తముడు కలడు గాన ఆదిని సయితము అతడుండియే తీరవలయును. కాబట్టి ఆ యేకకణజీవి యీ మహా విజ్ఞాన సంపన్నుడగు పురుషుని సంవృతరూపమే యై యుండవల యునుగదా! మన కది కానరాదు గాని, ఆ సంవృత జ్ఞానరాశియె యిప్పుడు ప్రపూర్ణుడై వెలయు నరసత్తము డగువఱకును వివృతి నందుచు వచ్చినది. గణితశాస్త్రానుగుణ్యముగ నీ యంశమును ఋజువు చేయవచ్చును. మొత్తముమీద శక్తిరాశి శాశ్వతముగ నొక్కటై హెచ్చుతగ్గులు లేకయుండు నను శాస్త్రసిద్ధాంతము సత్యమైనచో, ఒకయంత్రమునందు ముందుగా పెట్టియుండని దేనినిగాని యీ యంత్రమునుండి పొందజాలమనుట నిజము. ఒక యింజనునుండి మనము పొందజాలు కర్మ (పని) అంతయు బొగ్గు నీరు రూపమున దాని యందుంచినంతయే యగును గాని యిసు మంతయు హెచ్చుగాని తగ్గుగాని కాజాలదు. నేనిప్పుడు చేయ జాలు పనియంతయు గాలి అన్నము మొదలగు రూపములతో నాయం దిడుకొన్నదానికి సరిపోవలసినదే. జరుగున దేమన రూపాంతరమొందుట, వ్యక్తమగుట మాత్రమే. ఈ విశ్వము యొక్క సంపదను గణితము వేయునప్పుడు ఒక్కనలుసు జడపదార్థమునుగాని ఒక్కతులము శక్తినిగాని కల్పన చేయజాలము. మఱియును అందున్న యొక్కనలుసు పదార్థమునుగాని యొక్క తులము శక్తినిగాని తఱిగింపజాలము. అగుచో ఈ తెలివి యనున దెక్కడిది? అది యేకకణజీవియందు లేనిచో, ఎప్పుడో యొకప్పు డది హఠాత్తుగ, శూన్యమునుండి వచ్చియుండవలెను. ఇది వెఱ్ఱిమాటయగునుగదా! కాన నిప్పుడు తేలిన పర్యవసాన మిది :

ప్రపూర్ణ నరసత్తముడును, ముక్తపురుషుడును, దివ్యత్వమును సాధించిన మానవాగ్రణియు, ప్రకృతిబంధముల దాటిపోయి సర్వమున కతీతుడై తరించినట్టియు, జననమరణ ద్వారమున నింక పరిణామపరంపరలో దగులనట్టియు, క్రైస్తవులచేత "క్రీస్తుపురుషు" డనియు, బౌద్ధులచేత "బుద్ధభగవాను" డనియు, యోగిజనము చేత "జీవన్ముక్తు" డనియు పిలువబడు మహనీయుడగు పురుషోత్తము డీ "పరిణామపరంపర"కు అనగా "వివృతి" రేఖకు ఒక కొనయం దిప్పుడు నిలుచువాడే పూర్వ మొకప్పుడు "సంవృతి" నంది రెండవకొనయం దొక యేకకణజీవిగా నిలిచెనని నిస్సంశయముగా తేలుచున్నది.

ఈ వాదమును విశాలవిశ్వము కంతకును ననువర్తింప జేసితి మేని, జగత్తున కాదికారణమును సృష్టికర్తయు నై ఘనవిజ్ఞానరాశి కలదని తేలును. మానవున కీ జగత్తును గురించి లభించిన అత్యంత సిద్ధభావన ఏది? అది "విజ్ఞానరాశి" అనియే. ఒకభాగమున కును, మఱొకభాగమునకును అనుసంధానమునుగూర్చు విజ్ఞాన మనియే. ప్రాచీనులు సృష్టి విధాన సిద్ధాంతరూపమున ప్రకటింప ప్రయత్నించిన దీ "విజ్ఞానరాశి"నే. కావున సర్వమునకు మూలాధారము విజ్ఞానమే. ఆదిని ఈ విజ్ఞానము "సంవృతమై" యుండును; తుదిని "వివృతి" నంది చూపట్టును. ఈ విశ్వమున జూపట్టు విజ్ఞానరాశియంతయు మున్ను సంవృతినంది, యిప్పుడు వివృతినందు చున్న విశ్వవిజ్ఞానరాశియే. ఈ విశ్వవిజ్ఞానరాశినే మేము భగవంతుడనుచున్నాము. దానిని మీరింకేపేరు పెట్టియైన బిలువుడు. ఆదిని ఈ అనంత విశ్వవిజ్ఞానరాశి కలదనుట నిస్సంశయము. ఈ విశ్వవిజ్ఞానరాశి సంవృతమగుచు వివృతమగుచు నుండును. ప్రపూర్ణుడై, తేజరిల్లు క్రీస్తుపురుషుడును, బుద్ధపురుషుడును అగువఱకు "వివృతి" జెందుచుండును. పిమ్మట నది తనకారణరూపము దెస మరలి చివరకు ఆ స్థితినందును. మనమతగ్రంథములన్నింటను అందువలననే "భగవంతునియందే జనించుచు వానియందే చరిం

చుచు వానియందే జీవించుచుందు'' మని వక్కాణింపబడుట. మనము భగవంతునిలోనుండి వెలువడివచ్చి తిరిగి భగవంతుని లోనికి జొచ్చుచుందుమని సర్వమతగ్రంథములును బోధించుటకు కారణమిదియే. వేదాంతపరిభాషను జూచి వెఱగుపడకుడు. పరిభాషాపదములకే భీతిచెందుదురేని, మీరు తత్త్వవిదులు కానోపరు. అనంతమగు నీ ''విశ్వవిజ్ఞానరాశి''నే మతశాస్త్రకర్తలు ''భగవంతు''డని పేర్కొనిరి.

''భగవంతుడు భగవంతుడనుచు తాతలనాటి పదమునే పల్మరు నీ వేల వాడుచున్నాడ'' వని నన్ననేకులు ప్రశ్నించుచుందురు. మనకార్యమునకది శ్రేష్ఠతమమైనది. అంతకుమించిన శ్రేష్ఠతరపదము కానరాదు. మానవకోటియొక్క ఆశలు, ఈప్సితములు, ఆనందము, సర్వమును ఆ శబ్దమునందు కలకాలముగా కేంద్రీకరింపబడియున్నవి. ఆ శబ్దరాజమును మన మీనాడు మార్చివేయుట సుసాధ్యముకాదు. ఇటువంటి శబ్దములను వాని భావమును బాగుగ ననుభవమునకు దెచ్చుకొని వానియర్థమును బూర్ణముగ గ్రహించిన మహర్షులు మొదట కల్పనచేసిరి. అవి సంఘమున వాడుకలోనికి రాగారాగా పామరజనుల నోటపడి వానియర్థము, వానిమహిమ తఱిగిపోయెను. ''భగవంతు'' డను పదము నరుని స్మృతికిమీరిన బహుపురాతన కాలమునుండి వాడుకలోనున్నది. విశ్వవిజ్ఞానరాశి యంతయు నీ శబ్దమువలన సూచితమగును. అత్యుత్తమమును అత్యంతపావనమును నగు సర్వమును ఈ పదము స్ఫురింపజేయును. ఎవడో యొక పిచ్చివాడు తగదన్న మాత్రమున మనము దానిని లాగిపారవేయవలయునందురా? ఇంకొకడువచ్చి ''నా మాటను స్వీకరింపు'' డనును. మరల నింకొకడువచ్చి ''నా మాటను గైకొను'' డనును. ఇట్టి పిచ్చివాండ్రమాటల కంతముండదు. వాని నామోదించుటకన్న మీరీ పురాణపదమునే ప్రయోగించుచుండుట శ్రేయము. దానిని ఇప్పు డావరించియున్న మూఢభావములను దొలగించి, దాని సరియైన

భావమును గ్రహించి, సార్థకముగ ననుభవమునకు దెచ్చుకొని యీ ప్రాచీనశబ్దమునే యుపయోగము చేయుచుందురుగాక. భావసంసర్గనియమముల (లాస్ ఆఫ్ అసోసియేషన్) మహిమ మీ రెఱుగుదురేని, ఈ శబ్దము లత్యంత ప్రభావాన్వితములు, ఉదాత్తములు నగు అసంఖ్యాక భావములతోడి సంసర్గము కలవని మీకు తేటపడును. ఈ పదములను లక్షలకొలది జనులు ప్రయోగించి సంభావించియున్నారు. అత్యున్నతములును శ్రేష్ఠతమములును నగు భావనలను వానియం దనుసంధానముచేసి యున్నారు. వివేకజనకమగు సర్వమును, ప్రేమాస్పదమగు నఖిలమును, మానవప్రకృతియందుగల గంభీరమును ఘనమును నగు సకలమును ఈ శబ్దములం దిముడ్పబడియున్నది. ఇట్లనుసంధింపబడిన పవిత్రభావములకు సంజ్ఞలై పరగు శబ్దములను ఇప్పుడు త్రోసివేయుట పొసగదు. భగవంతు డీప్రపంచమును సృజించెనని చెప్పుట మాత్రమున ఈ భావములను సర్వమును మీకు వ్యక్తము చేయజూచినయెడల మీకేమియు నర్థమేకాజాలదు. అయినను నెంతయో పెనగులాడియు మనము చివర కాయనకడకే, ఆ పురాణపురుషునికడకే, ఆ పరాత్పరునికడకే వచ్చి చేరితిమి.

జడపదార్థమనుడు, సంకల్పమనుడు, శక్తియనుడు, విజ్ఞానమనుడు, మఱి యిట్టి యే పేరునైన బెట్టి పిలువుడు, విశ్వశక్తి తాల్చు ఈ రూపములన్నియు విశ్వవిజ్ఞానరాశియొక్క వ్యక్తరూపములుమాత్రమేయని మనకిప్పుడు తెలిసినది. దానినే మన మిక పరమేశ్వరుడను నామముతో వ్యవహరింతుముగాక! మీరు చూచునట్టియు స్పృశించునట్టియు ఆలకించునట్టియు — చెప్పనేల ఈ జగత్తంతయు—వాని నిర్మాణమే; ఇంకను కొంచెము నిర్దుష్టముగ జెప్పుచో వాని "సృష్టి" (బహిర్గతస్వరూపము) అనవలయును; ఇంకను నిర్దుష్టముగ వచింపనెంచుచో ఈ సర్వమును పరమాత్మయే అనవలయును. సూర్యుడుగా ప్రకాశించునదియు,

తారలుగా మెఱయునదియు, ఆయనయే. మన భూదేవియు ఆయనయే. మహాసముద్రమును ఆయనయే. వర్షరూపమున చల్లగ వర్షించునదియు ఆయనయే. మనము శ్వాసించు వాయువు ఆయనయే. మనశరీరమునందు శక్తిరూపమున ప్రకటితమగునదెల్ల ఆయనయే. ఈ వినవచ్చు ప్రసంగము, ప్రసంగించు పురుషుడును, కూడ ఆయనయే. ఇచ్చో గూర్చుండి వినునదియు ఆయనయే. నేను నిలుచు పీఠమునైత మాయనయే. మీా ముఖముల జూచుటకై నాకు దోడ్పడు వెలుతురు ఆయనయే. ఆయనయే యీా సర్వమును! ఆ ఆత్మయే యీా జగమునకు ఉపాదానకారణమును నిమిత్తకారణమును గూడ నైయున్నాడు. చిన్న జీవకణమున సంవృతి నందియుండునది యాయనయే. రెండవకొనను వివృతి నంది పురుషోత్తముడై చూపట్టునదియు ఆయనయే. అతిసూక్ష్మమగు నణువునం దణగియుండునది యాయనయే. మఱియు ఆయనయే నెమ్మది నెమ్మదిగ తనమహిమను ప్రకటనముచేయుచు తుదిని తన్నుతానే చేరును. ఈ బ్రహ్మాండముయొక్క రహస్యమిదియే. ''నీవు పురుషుడవు; నీవు స్త్రీవి, నీవు యౌవనోద్రేకమున ధీరత్వమున దిరుగాడునది. కఱ్ఱపై నూతగొని తడబడుచు నడయాడు ముసలివి నీవే. నీవు సర్వోపగతుడవు; ఓ ప్రభూ! సకలమును నీవే.'' ఈ బ్రహ్మాండతత్త్వమును గూర్చి నరునిబుద్ధికి తృప్తినొసగజాలు వివరణ మిదియొక్కటే కలదు. వేయేల! మన మా బ్రహ్మమునందు జనించుచున్నాము; ఆ బ్రహ్మమునందే చరించుచున్నాము; మఱియు నా బ్రహ్మమునందే లయమును బొందుచున్నారము.



# విశ్వతత్త్వ దర్పణము

## పిండాండము

(న్యూయార్క్ ఉపన్యాసము : 26-1-1896)

సహజముగ నరునిహృదయము వెలుపలికి జనుటకై, అనగా శరీరమును దాటి యింద్రియములద్వారమున బయటికి బోవుటకై ఉద్యమించునో యనునటుల దోచును. కన్ను చూడగోరును. చెవి వినగోరును. అట్లే ఇంద్రియములన్నియు బాహ్యప్రపంచమును స్పృశింపగోరును. స్వభావసిద్ధముగనే ప్రకృతిసౌందర్యములును, ప్రకృతిమహిమలును, మొదట నరుని దృష్టి నాకర్షించినవి. నరునిహృదయమున ప్రప్రథమమందు జనించిన ప్రశ్న యీ బాహ్యప్రపంచమును గురించియే. దాని రహస్యమును కనుగొనుటకొఱకే ఆకాశము, నక్షత్రములు, గ్రహములు, భూమి, నదులు, పర్వతములు, సముద్రము మొదలగువానినిగూర్చి విమర్శనలు సాగినవి. ఈ జ్ఞానపిపాసతో దేవులాడిన మానవహృదయము మొదట బాహ్యప్రపంచమునందలి ప్రతిదాని నాశ్రయించి వట్టి ప్రయాసలుపడిన విషయమును అన్ని ప్రాచీనమతములును సూచనగ దెల్పుచునే యున్నవి. నదీదేవతయొకటి, ఆకాశదైవమొకటి, మేఘాలదేవుడొకడు, వానలవేల్పొకడు — ఇట్లెందఱో యుండిరి. బాహ్యజగమునగల ప్రతిదియు—మన మిప్పుడు ప్రకృతిశక్తులనెడు సర్వమును — రూపకల్పనము చేయబడి నరాకృతుల దాల్చి యిచ్ఛాస్వరూపములుగనో దైవతములుగనో, స్వర్గము నుండి దిగివచ్చు దేవదూతలుగనో భావన చేయబడెను. ఈ యన్వేషణము లోతునకు పోయినకొలదిని ఈ బాహ్యమూర్తులు నరునిహృదయమును తృప్తిపఱుపజాలవయ్యెను. తుదకీ విచారణ అంతర్ముఖమై నడచినది. నరుడు తన ఆత్మను గూర్చియే

పూనెను. వాని పృచ్ఛ బ్రహ్మాండమును విడిచి పిండాండముపైకి దిరిగినది. వాని అన్వేషణము బాహ్యప్రకృతిని పరిశీలించుటమాని అభ్యంతరప్రకృతిని పరిశీలించుటకు పూనుకొనెను. నాగరికాభివృద్ధి లభించినకొలదిని, ప్రకృతి పరిశోధనము గాఢతరమై సాగినకొలదిని, జ్ఞానము వికసించినకొలదిని, అభ్యంతర నరునిగూర్చిన విమర్శన హెచ్చుగ నడచినది.

నేడు మనము సాగించు విచారణ నరుని ఆంతర్యమును గూర్చినది. ఈ యభ్యంతర మానవుని గూర్చిన సమస్యవలె మఱే ప్రశ్నయు నరునిహృదయమునకు సన్నిహితముగాని, ప్రియముగాని కాజాలదు. ఎన్నివేలసారులో, ఎన్నెన్ని దేశములందో, యీ సమస్య వెలువడుచు వచ్చినది. ఋషులు, రాజన్యులు, ధనికులు, దరిద్రులు, పుణ్యాత్ములు, పాపాత్ములు, వీరువారననేల ప్రతిపురుషుడును, ప్రతిస్త్రీయు, పదేపదే యీ ప్రశ్న నడుగుచునే యున్నారు. "క్షణభంగురమైన ఈ నరజీవితమున శాశ్వతమై నిలుచున దేమియు లేదా ? ఈ శరీరము మృతినందుతఱి మరణింపని దేదియు నుండదా ? ఈ తనువు కూలి మట్టిలో గలియునప్పుడు సజీవమై మిగిలియుండున దేమియు లేదా ? ఈ దేహమును దహించి భస్మముచేయు నగ్నినుండి తప్పించుకొని బ్రతికియుండున దేమేని కలదా ? ఉండుచో, దానిగతియేమి ? అదెక్కడికి బోవును ? మొదట అదెందుండి కలిగినది ?" ఇట్టిప్రశ్న లనేకపర్యాయము లడుగబడుచువచ్చినవి. ఈ సృష్టి నిలిచియుండునంతకాలము, జిజ్ఞాస చేయుటకు నరుని మెద డున్నంతవఱకు, ఈ విచారణ సాగుచునేయుండును. అయినను సమాధానమేమియు వచ్చుట లేదనదగదు. ప్రతిపర్యాయమును సమాధానము వచ్చుచునే యున్నది. కాలము గడచినకొలదిని ఈ సమాధానములకు బలము చేకుఱుచునేయుండును. సహస్రాబ్దములకు పూర్వమే ఈ ప్రశ్న కొకేసారిగా సమాధానము చెప్పబడినది. మఱియు కాలము గడచినకొలదిని ఆ సమాధానము తిరిగి తిరిగి చెప్పబడుచునే

యున్నది. క్రొత్త క్రొత్త సాదృశ్యములు చూపబడుచునే యున్నవి. మనబుద్ధి కెప్పటి కప్పుడు నచ్చునటుల ఈ విషయము విశదీకరింపబడుచునే యున్నది. కాన మనమిప్పుడు చేయవలసిన దేమన ఆ సమాధానమును పునఃస్మరణచేయుటే ? సర్వాంకషము లగు ఈ సమస్యలను గురించి నూతన విజ్ఞానమును గూర్పగలనని నేను నటించుటలేదు. ప్రాచీనులు కనుగొనిన సత్యమునే యీ కాలపువారిభాషలో మీయెదుట నుంచెదను. పూర్వీకుల భావములను నవీనులభాషలో ననువదించెదను. తత్త్వవిదుల భావములను సామాన్యప్రజల మాటలతో చెప్పెదను. దేవతల భావములను మానవవచనములతో పునర్వచించెదను. నరునికి తెలియు నిమిత్తము భగవంతుని భావములను సామాన్యజనుల వాడుక పదములతో చెప్పెదను. ఈ భావము లెందుండి వెలువడెనో ఆ దివ్యాంశ ప్రతినరునందును గలదు కావున ప్రతివారును దీనిని గ్రహింపజాలుదురు.

నేను మీ వైపు జూచుచున్నాను. ఈ దృశ్యమున కెన్ని విషయము లవసరమో చూడుడు! మున్ముం దీ కన్ను లుండవలయును. తక్కిన అవయవములందు నా కే కొఱతయు లేకున్నను నా కీ కన్నులు లేనియెడల నేను మిమ్మును జూడజాలను. రెండవది నయనేంద్రియ ముండవలయును. పైకి గాన్పించు ఈ కన్నులే నయనేంద్రియములు కావు. అవి చూచుట కనుకూలించు ఉపకరణములు మాత్రమే. వాని వెనుక నిజమగు నింద్రియము లుండును. అవి మేదస్సున ఒక కేంద్రమునందుండును. ఆ కేంద్రము చెడినచో, నరున కెంత శక్తిమంతములగు కన్నులుండుగాక, యేమియు కనబడదు. కాబట్టి సత్యమగు నయనేంద్రియమైన ఆ కేంద్రముండు టవసరము. ఇట్లే మన యింద్రియము లన్నింటి విషయమును గ్రహింపవలయును. వెలుపల కాన్పించు ఈ చెవి, ధ్వనితరంగములను కేంద్రమున జేర్చునిమిత్తమై లోపలికి గొని

పోవు నుపకరణముమాత్రమే. కాని ఇంతటితో సర్వము ముగియ లేదు. మీరొక పుస్తకాలయమున గూర్చుండి చాల శ్రద్ధతో నొక పుస్తకమును జదువుకొనుచుంటిరనుకొనుడు! అప్పుడు గడియారము కొట్టు గంటలు మీకు వినరావు. ధ్వనియా యున్నది; వాయుతరంగములును ఉన్నవి. మీ చెవియు కేంద్ర మునుగూడ నున్నవి. ధ్వనితరంగములు చెవి ద్వారమున కేంద్ర మునకు జేర్పబడుచునేయుండును. అయినను మీ కేమియు వినబడదు. ఇందు కొఱత యేమి? మనస్సక్కడ లేదు. కావున ఇంకొకటి, మూడవదికూడ అవసరమని తెలుచున్నది. మనస్సు కూడ గావలయును. మొదట వెలుపలి ఉపకరణము, పిమ్మట ఈ బాహ్యోపకరణము కొనివచ్చు తరంగములు చేరు కేంద్రము నుండవలయును. ఈ అంతరింద్రియము మనస్సుతో ననుసంధించి కూడ నుండవలయును. మనస్సు అప్పుడు కర్ణేంద్రియముతో గూడి యుండనియెడల ఆ యింద్రియమును, వెలుపలి చెవియు, ధ్వనితరం గములను స్వీకరించుగాక! ఆ ధ్వనియొక్క అనుభవము మాత్రము కలుగజాలదు. ఈ మనస్సు సయితమొక వాహకముమాత్రమే సుడీ! మన స్సీ యనుభూతవిషయము నింకను కొంతదూరము తీసికొనిపోయి బుద్ధికి నివేదింపవలయును. ఈ బుద్ధి తనకు జేరిన దానిని ఇట్టిదని నిర్ణయించు సమర్థతగలిగియుండును. కాని, అప్పటికిని కార్యము పూర్ణముకాదు. బుద్ధి ఈ అంశమును గొని పోయి శరీరమున సర్వాధికారియై సింహాసనమున గూర్చుండి యుండు జీవాత్మకు నివేదింపవలసి యుండును. ఇట్లీ బుద్ధి తననిర్ణ యమును వాని యెదుట నివేదించినప్పు డేమిచేయవలయునో యేమిచేయదగదో తెలుపు ఆజ్ఞ ఆ జీవాత్మనుండి వెలువడును. అంతట ఈ యాజ్ఞ మరల అదే వరుసను మొదట బుద్ధికిని అందుండి మనస్సునకును తరువాత కేంద్రమునకును గొనిపోబడును. ఆ పిమ్మట కర్ణేంద్రియము దానిని వెలుపలి యుపకరణమునకు జేర్చును. అప్పుడుగాని ఆ అనుభవము పూర్తి కాజాలదు.

ఈ యుపకరణములు బాహ్యశరీరమున, అనగా స్థూల శరీరమున నుండును. మనస్సును, బుద్ధియు, అందు లేవు. అవి ఆంతర్యమున నుండును. హైందవతాత్త్వికులచేత సూక్ష్మశరీర మనియు, క్రైస్తవుల పరిభాషయందు పారమార్థిక (స్పిరిచ్యుయల్) శరీరమనియు, పేర్కొనబడు నొక శరీరము మనలో నుండును. ఆ సూక్ష్మశరీరము స్థూలశరీరమునకన్న ఎంతో సూక్ష్మమైనది కాని అదియు జీవాత్మ కాదు. జీవుడు వీని కతీతముగ నుండును. కొలది వత్సరముల కీ బాహ్యస్థూల శరీరము నశించును. ఏస్వల్పపు ప్రమాదమైనను దీనిని భిన్నముచేసి నాశనముగావింపగలదు. సూక్ష్మశరీరము అంతసులభముగా నాశనమునొందునది కాదు. అయినను అది కొన్ని కొన్ని యెడల వృద్ధిక్షయములుపొందుట కలదు. వృద్ధాప్యమున మనస్సు ఎట్లు పటుత్వమును కోల్పోవునో, శరీరము దృఢముగ నున్నయెడ అదెట్లు దృఢముగనుండునో, మందులు మాకులు దానినెట్లు మార్చునో, బాహ్య సంఘటనలవలన అదెట్లు చలించుచుండునో, మఱియును అదెటుల బాహ్య ప్రకృతియందు పరివర్తనము కల్పించుచుండునో మనము చూచుచున్నాము. ఈ స్థూలశరీరమునకు వృద్ధిక్షయములున్నటులనే మనస్సునకును వృద్ధిక్షయములు కలవు. కావున మనస్సయితము జీవుడు కాజాలదు. జీవాత్మ వృద్ధినందునది కాని, క్షీణించునదిగాని కాదు. "మన కీసంగతి యెట్లు తెలియును? మనస్సునకు ఆవల వేఱొకటిగలదనియే మన కెటుల తెలియనగును?" అందురేమొ. స్వయంప్రకాశకమగునట్టియు, ఎఱుక కాధారమగునట్టియు, విజ్ఞానము మూఢమై జడమైయుండు పదార్థముయొక్క లక్షణము కాజాలదుగదా! విజ్ఞానము స్వభావసిద్ధముగాగల జడ పదార్థ మెన్నడును కాన్పింపలేదు. మూఢమును జడమునగు పదార్థరాశి యేదియు స్వయంప్రకాశకముకాజాలదు. జడపదార్థమును ప్రకాశింపజేయునది విజ్ఞానమే. ఈ భవన మిచ్చట గోచరించుట విజ్ఞానద్వారముననే. ఏదోవిజ్ఞానము దీనిని నిర్మించి

యుండినగాని యీ మందిర మిక్కడ మందిరరూపమున పొడ గట్ట జాలదు. ఈ శరీరమునకు స్వకీయమగు ప్రకాశము లేదు. ఉండెనేని, అది శవమునందును నుండవలయును గదా! మనస్సు గాని పారమార్థికశరీరముగాని స్వయంప్రకాశకములు కావు. వాని యందును జ్ఞానధర్మము లేదు. స్వయంప్రకాశకమగునది అవినాశి. వేఱొకదాని తేజస్సును ఎరువుదెచ్చుకొని ప్రకాశించునది ఒక ప్పుడు ప్రకాశించుటయు మఱొకప్పుడు ప్రకాశింపకుండుటయు సంభవించును. స్వయంప్రకాశియైనదాని వెలుగును రమ్మనునది గాని పొమ్మనునదిగాని యేమి ఉండగలదు? దానికి వృద్ధిక్షయ ముల జేకూర్పజాలున దేముండును? సూర్యుని ప్రకాశమును పొంది వెలుగునదికావున చంద్రబింబమున వృద్ధిక్షయముల జూచు చున్నాము. నిప్పులోవేసి యెఱ్ఱగగాల్చిన యినుపముక్క మెఱ యుచు ప్రకాశించును. కాని దాని ప్రకాశము ఎరువుసొమ్ము కావున అది నమసిపోగలదు. ఇట్లు స్వీయధర్మముగాక యెరువు తెచ్చుకొనబడిన ప్రకాశము మాత్రము నాశనము నొందగలదు.

ఈ స్థూలశరీరమునకు అనగా ఈ బాహ్యాకృతికి స్వీయమగు ప్రకాశము లేదని మన మిప్పుడు గ్రహించితిమి. ఇది స్వయం ప్రకాశికాదు గాన తన్ను తాను తెలిసికొనలేదు. మనస్సుకూడ ఇట్లే తన్ను తాను తెలిసికొనలేదు. ఎందుచేత? అదియు వృద్ధి క్షయములను పొందునదే. అదొకప్పుడు దృఢతరముగను వేఱొ కప్పుడు శుష్కించియు నుండును. ప్రతివిషయము దానిని చలింప చేయగలదు. కాబట్టి మనస్సుద్వారమున ప్రకాశించు తేజస్సు దానిస్వంత మగునదికాదు. సరే! ఆ ప్రకాశ మెవరిది? అది దేనికి స్వధర్మమో దాని దనవలయును. అట్టిది శుష్కించుటగాని నాశన మగుటగాని వృద్ధియగుటగాని నీరసించుటగాని సంభవించదు. అది స్వయంప్రకాశియై వెలుగును. ప్రకాశమే అదై యుండును. ఆత్మకు తెలిసికొనుశక్తి కలదనరాదు. తెలివియే అది. దానికి

ఉనికి (సత్త) కలదనరాదు. ఉనికియే (అస్తిత్వమే) అది. అది ఆనందము ననుభవించు ననరాదు. ఆనందమే అది. ఆనందము ననుభవించునది ఆ యానందము నెరువు తెచ్చుకొనిన దగును. జ్ఞానము ననుభవించునది ఆ జ్ఞానము నెరువుదెచ్చుకొనునదియే అనవలయును. మఱొకదానితో అనుబంధమగు అస్తిత్వము (ఉనికి) కలదానియొక్క అస్తిత్వము ఆభాసమాత్రమే యగును. అది అస్తిత్వమును ప్రతిఫలింపజేయు బింబము మాత్రము కాగల్గును. ఎందెందు గుణములు కనబడునో, ఆ గుణములన్నియును ఒకపదార్థముమీద ప్రతిఫలించినవే సుడీ! కాన ఆత్మకు సత్తు చిత్తు ఆనందము అనెడు గుణములున్నవనియు అనదగదు. ఆత్మయే సత్తు చిత్తు ఆనందమునై యున్నది.

నిశ్శంకముగా దీనినంతను మనమేల యంగీకరింపవలయు నని మీరడుగవచ్చును. "ఆనందము, జ్ఞానము, అస్తిత్వము అనునవి ఆత్మయొక్క స్వధర్మములని మన మెందువలన నంగీకరింపవలయును? వాని నది యింకొకరినుండి పొందునది కాకూడదా?" అని ప్రశ్నింతు రేమో! "శరీరము తన ప్రకాశమును మనస్సునుండి యెరువు తీసికొనునటులనే, ఆత్మయు తనఆనందమును, జ్ఞానమును, సత్తాకమును ఎరువు తెచ్చుకొనునని యేల చెప్పరాదు?" అను వాదమునకు దిగుదురేమో! ఇట్టి వాదమున కంతముండదు. కావున అది అంగీకరింపదగనిది అగుచున్నది. దేనినుండి ఆత్మ వాని నెరువుతెచ్చుకొనునని చెప్పగలము? వేఱొక యాధారము కలదందురేని, దానిని గూర్చియు మరల ఇదే ప్రశ్న బయలుదేఱును గదా? కాబట్టి తుద కేదియో స్వయంప్రకాశి యగు దానిని మనము చేరవలసియుందుము. వాదనను తుద ముట్టించుటకును, తర్కశాస్త్రానుగుణ్యముగ పర్యవసానమును దేల్చుటకును, స్వయంప్రకాశమగు నొక దానిని జేరినతోడనే ఆగవలసియుండును.

కావున నరునకు మొదట బాహ్యావరణమగు ఈస్థూల శరీరము కలదు. రెండవది మనస్సు, బుద్ధి, అహంకారముచేరి యేర్పడు సూక్ష్మశరీరము. ఈ రెంటికిని వెనుక సత్యమగు జీవు డుండును. స్థూలశరీరముయొక్క గుణములు శక్తులు అన్నియు మనస్సునుండి కలుగుననియు, (సూక్ష్మశరీరమగు) మనస్సుయొక్క ప్రకాశము, శక్తులు అన్నియు జీవుడు లేక ఆత్మ వలన నెరవు తెచ్చుకొనబడుననియు ఎఱింగితిమి.

ఇప్పు డీ యాత్మయొక్క స్వభావమునుగూర్చి అనేక ప్రశ్నలు బయలుదేఱగలవు. అది స్వయంప్రకాశియను వాదము నుండియు, సచ్చిదానందములు దాని స్వధర్మములను వాదము నుండియు, ఆత్మయొక్క ఉనికి స్థాపింపబడినయెడల, అది సృజంప బడినది కాదని సహజముగనే తేలును. మఱే యితరసత్తాకము మీదను ఆధారపడక స్వయంప్రకాశియగు సత్తయైన ఆత్మ వేఱొకదానివలన పుట్టునది కాజాలదు. ఆత్మ శాశ్వత సత్తాకము. అది లేనికాలమే లేదు. ఆత్మయే లేకున్న, కాల మెక్కడనుండి వచ్చును? కాలమే ఆత్మయందిమిడియున్నది. అనగా, ఆత్మ యొక్క ప్రభావము తనమీద ప్రసరించినప్పుడు మాత్రమే మన స్సునకు చింతనశక్తి వచ్చును. అప్పుడే కాలభావము కలుగును. ఆత్మయేలేనినాడు చింతనయనునదే యుండదు. చింతనలేకున్నచో కాలమే యుండజాలదుగదా! ఇట్లు కాలమే ఆత్మలోనిదయి యుండగా, ఆత్మయే కాలములోనిదని చెప్పుటపొసగదు. ఆత్మకు జననములేదు; మరణములేదు. కాని ఈ వివిధదశలం దది దీపించుచున్నది. అది క్రమేణా నిమ్న దశలతో మొదలిడి అత్యుత్తమములగు దశలవఱకు నన్నింటిని ప్రదర్శించుచున్నది. ఆత్మ మనస్సుద్వారమున బాహ్యశరీరముమీద ప్రసరించి బాహ్య శరీరద్వారమున దృశ్యప్రపంచమును గ్రహించి తెలిసికొనుచు తన మహిమను ప్రకటించుచున్నది. అదొక శరీరమును గైకొని యుపయోగించుకొనును; ఆ శరీరము జీర్ణమై నిరుపయోగమై

నప్పుడు వేఱొకశరీరమును దీసికొనును. ఇట్లే సదా వర్తించుచుండును.

ఈ సందర్భమున సామాన్యముగా జన్మాంతరసిద్ధాంత మని చెప్పబడు నొకమనోహరసమస్య బయలుదేరుచున్నది. దీనిమాట నెత్తగనే ప్రజలు భీతిల్లుటకలదు. ఈ మూఢభయమెంత గొప్పదిగానుండు ననగా జిజ్ఞాసువులగువారు సయితము తాము శూన్యమునుండి పుట్టినటుల భావించి, తదనంతరము చిత్రమగు తర్కవాదసాహాయ్యమున తామటుల శూన్యమునుండి ప్రభవించినను నిక ముందుమాత్రము శాశ్వతముగ నిలిచియుందు మను సిద్ధాంతమును గూర్పచేయ బ్రయత్నించుదురు. శూన్యమునుండి వచ్చువారు తప్పక శూన్యమునం దంతరింపవలసియే యుందురు. కాని మీరుగాని నేనుగాని మఱెవ్వరుగాని శూన్యమునుండి పుట్టినవారముకాము ; శూన్యమునకై మరలిపోవువారమును గాము. మన మనంతకాలమునుండి వచ్చుచున్నవారమే ; ఇంక శాశ్వతకాలమునుండువారమే. మీయొక్కగాని నాయొక్కగాని అస్తిత్వమును నాశనముచేసి మనలను శూన్యమున గలుపగల శక్తి యీ లోకమునగాని పరలోకమునగాని మఱెందునుగాని లేదు. మఱియు జన్మాంతరసిద్ధాంతము భీతిహేతువు కాకుండుటేగాక మానవసంఘముయొక్క నైతికరక్షణమునకు ముఖ్యాధారమగుచున్నది. జిజ్ఞాసాపరులు తేల్పగల మిగుల సమంజసమగు పర్యవసాన మిదియే. మీ రిక శాశ్వతముగనిలిచి యుండువారైనచో, పూర్వమునందును శాశ్వతమగు అస్తిత్వముకలవారై యే యుండవలయును. ఇంకొకరీతి కాజాలదు. ఈ సిద్ధాంతము నాక్షేపించుటకై సామాన్యముగా దెలుపబడు ఖండనవాదముల గొన్నింటికి సమాధానము దెలిపెదను. అవి కేవలము వెఱ్ఱి ఆక్షేపణములని మీలో కొంద ఱనవచ్చును. అయినను మహాజిజ్ఞాసాపరులు సయితము మిగుల పిచ్చియభిప్రాయములనే వాకొన సిద్ధపడుట కలదు. కావున వానికి సమాధానము చెప్పుటయే మంచిది. తత్త్వ

వేత్తలు సమర్థింపజూడని వెడగుభావన యొక్కటియైన లేదని చక్కగా చెప్పబడినది. ''మన పూర్వజన్మములు మన స్మృతి యందు ఏల లేవు?'' అనునది ఆక్షేపణలలో మొదటిది. ఈజన్మ ములోని గతమునెల్ల మనము జ్ఞప్తి నుంచుకొనగలుచున్నామా? చంటిబిడ్డలుగా నున్నప్పుడు మీరేమేమి చేసితిరో మీలో నెంద ఱికి జ్ఞప్తియున్నది? అంత అతిబాల్యావస్థ యెవనికిని జ్ఞప్తి యుండదుగదా. మీయస్తిత్వము మీ జ్ఞప్తిపై నాధారపడి యుండుననుచో మీ రా బాల్యావస్థ నెన్నడును గడపలేదని యేర్పడునుగదా! కావున మన యస్తిత్వము మన స్మృతిపై నాధారపడియుండుననుట కేవల వివేకహీనభావము. మఱియు గత జన్మముల నేల మనము జ్ఞప్తిలో నుంచుకొనవలెను? అప్పటి మెద డప్పుడేపోయినది. ఛిన్నాభిన్నమైపోయినది. క్రొత్తమెదడొకటి యిప్పు డేర్పడియున్నది. మన స్సీ క్రొత్తశరీరములో నివసించు టకువచ్చుతఱిని పూర్వజీవితములలో నార్జించి కూర్చిపెట్టుకొని తన తోడదెచ్చుకొనిన భావరాశియొక్క ఫలితముమాత్రమే గదా యీ మెదడున గోచరించును!

ఇక్కడ నిలిచియున్న నేను అంతులేని గతకాలము నుండి నా కంటుకొనివచ్చుచున్న సమస్తముయొక్క ఫలమునే యైయున్నాను. ఆ గతమునంతటిని నేను జ్ఞాపకము పెట్టుకొనవలసిన యవసరమేమున్నది? ప్రాచీనకాలపు మహర్షి లేక ద్రష్ట యొకడు, అనగా సత్యమును ప్రత్యక్షముగ నెఱింగిన ప్రవక్త యొకడు, ఏమేని చెప్పునెడల ఈ కాలపువారు చెలరేగి వెఱ్ఱివాడు వెఱ్ఱివా డందురు. కాని హక్సలేయో, టిండాలో, మఱొకరో చెప్పుచున్నారని ఆ మాటనే తెలిపినచో, సత్యమే సత్యమే యందురు; నిర్వివాదముగ నంగీకరింతురు! ప్రాచీన మూఢభావముల స్థానమున వీరు నవీన మూఢభావములను నిర్మించిరి. పురాతన మతాచార్యుల స్థానమున నవీనప్రకృతి శాస్త్రవిదులదెచ్చి నిలుపుదురు. సరే! స్మృతిని గూర్చిన యాక్షేపణ మంతగా పటుతరమైనది కాదని గ్రహించి

తిమి. జన్మాంతరసిద్ధాంతమును ఖండనచేయుటకై తెచ్చు ముఖ్య వాదన యిదొక్కటే యనవచ్చును. గతజన్మల స్మృతి యుండుట మనసిద్ధాంతమున కంతగా ముఖ్యముకాదని కనుగొంటిమి నిజమే; కాని, అట్టిస్మృతిని పొందినవారు కలరనియు, మనలోని ప్రతి వాడును తాను ముక్తినిసాధించు జన్మయందటువంటి స్మృతిని పొందగలడనియు, చెప్పుటకు దగిన యాధారములు సయితము కలవుసుడీ! అప్పుడీ జగత్తు స్వప్నమువంటిదని గట్టిగ తెలిసికొన జాలుదుము. అప్పుడే యీ జగత్తొక నాటకరంగమనియు, మీ రందలి నటులనియు, మీ యంతరాత్మలకు గోచరమైపోవును. పిడుగుబోలు మహాచ్ఛక్తితో వైరాగ్యచింత మి మ్మావహించును. అప్పుడే మీ భోగాసక్తియు, ఈ జీవనమును ఈ సంసారమును బట్టు కొని ప్రాకులాడవలయునను వాంఛయు, తుదముట్ట నశించును. ఎన్నెన్నిసారు లిట్టి జన్మలు మీకు గల్గినవో, యెన్నికోట్ల పర్యా యములు మీకు తండ్రులు తల్లులు కొడుకులు కూతురులు భర్తలు భార్యలు బంధువులు స్నేహితులు సంపదలు అధికారములు ప్రాప్యములగుచు వచ్చెనో, తేటతెల్లముగా మీ మనోనేత్రములకు గోచరించును. సతతము నవి వచ్చుచు బోవుచు నుండునవియే! ఎన్నితడవలో మీరు ఘనతరాశాతరంగముల యున్నతాగ్రము లపై నాట్యములు సలిపియుంటిరి; మరెన్నితడవలో నిరాశలో జిక్కి యధఃపతితులై పోయియుంటిరి! ఈయెల్లవిషయములును మీ స్మృతికి పొడకట్టినప్పుడు మీరు శూరులై నిలువబడి యీ జగత్తు మిమ్ము రౌద్రదృక్కులతో బెదరించుచున్నను మందహాసము చేయజాలుదురు. అప్పుడుమాత్రమే మీరు ధీరులై నిలువబడి "ఓ మృత్యువా! నిన్నుసయితము నేను సరకుగొనను; నిన్ను జూచిన నాకేమి భయము?" అని యెలుగెత్తి పలుకజాలుదురు. ఎప్పుడో యొకప్పుడీ సిద్ధి యందఱకును ప్రాప్తించునదే!

"జీవుని పునరావృత్తిని స్థాపించు ప్రమాణములుగాని, సహేతుకములగు నిదర్శనములుగాని కలవా?" యని మీ రడుగ

వచ్చును. ఇంతవఱకును ఖండనవాదనలు నిరాధారములని తెలుపు యుక్తులుమాత్రము తెలిపియుంటిని. "ప్రత్యక్ష నిదర్శనము లేమేని కలవా?" యందురేని—ఉన్నవి యందును, పటుతరమైనవే కలవు. నరునికిని నరునికిని నడుమ జ్ఞానసముపార్జనశక్తియందు మిక్కుటమగు తారతమ్యము చూపట్టుచున్నది. దానినివిశదీకరించుటకు సమర్థమగు నది యీ జన్మాంతరసిద్ధాంతమునకు మించినది వేఱొకటి లభింప జాలదు. జ్ఞానమును సంపాదించుకొనునప్పుడు మన మనుసరించు అనుక్రమణికను మొదట పరిశీలింతము. నేను వీథిలోనికేగి యొక కుక్కను చూచితి ననుకొనుడు. అది కుక్కయను జ్ఞానము నా కెటుల గలుగుచున్నది? నా కప్పుడు కనబడుదానినిగూర్చి నా మనస్సుతో సంప్రతింపుచేయుదును. అక్కడ రకరకములుగ పేర్చికూర్చియుంచిన నా పూర్వానుభవము లనేకములుండును. క్రొత్త యనుభవ మేదేని కలుగగానే అదివఱకున్న ప్రాతవగు భావచిహ్నరాసులతో సంప్రతించి అదివఱ కక్కడ నున్నవానిలో ఈ క్రొత్తదానితో తుల్యములగు భావచిహ్నములరాశిని వెదకి కనుగొని, తోడనే దీనిని వానితో జేర్చివేయుదును. అప్పుడు నాకు తృప్తికలుగును. అదివఱకే పేరియున్న ఒక భావగణచిహ్నము లతో నిది యేకీభవించుటచేతనే అది "కుక్క" యని నేను గుర్తింపజాలుట. ఈ నూతనానుభవముతో సజాతీయములగు ననుభవములు నాలో లేనియెడల నసంతుష్టి కల్గును. ఒక అను భవము కల్గునప్పుడు దానితో సజాతీయమగు ననుభవము మనలో లేనియెడల నట్టి స్థితిని "ఎఱుగము" అనెదము. అటులగాక దానితో సజాతీయములగు ననుభవములు మనలో గాన్పించునెడల మనకు దృప్తికలుగును. ఈ స్థితిని "ఎఱుక" అనెదము. రేగుపండు నేల రాలుటను మొదట గాంచినప్పుడు నరు డసంతృప్తి జెందినాడు. పిమ్మట కాలక్రమమున నట్టి యనుభవముతో సజాతీయములగు ననుభవములరాశిని కనుగొనినాడు. ఆ యనుభవరాశి యన్ని రేగుపండ్లును నేలరాలునని బోధించినది. అప్పు డతడు దానికి

"గురుత్వాకర్షణ" (గ్రేవిటేషన్) అని పేరిడి తృప్తుడైనాడు. పూర్వానుభవరాశి మనలో నిదివఱకే లేనప్పుడు క్రొత్తయనుభవముల గ్రహించుటే యసాధ్యమను పర్యవసానము దేలుచున్నది. అవి లేనప్పుడు నూతనానుభవమును ఏ గణముతో గూర్చుటకును వీలుకాన్పించదుగదా! బిడ్డ యీ లోకములో పుట్టునప్పుడు పూర్వానుభవచిహ్నశూన్యుడుగ నుండునని యూరపు తత్త్వశాస్త్రవేత్తలు కొంద ఱందురు. అటులగుచో నూతనానుభవములను జేర్చుకొనగలదేదియు తనలో లేనికారణమున వానిబుద్ధి వికసింపజాలదు. మఱియు జ్ఞానోపార్జనశక్తి వేర్వేఱు వ్యక్తులలో వేర్వేఱుదశలం దుండును గదా. అందువలన మనలోని ప్రతివాడును వేర్వేఱు తరగతుల జ్ఞానరాశితో పుట్టుచుండునని స్పష్టమగును. జ్ఞానమును సంపాదించుటకుగల మార్గమొక్కటే: అనుభవస్వీకరణమే. మార్గాంతరము లేదు. మనకున్న యనుభవము ఈ జన్మలో సంపాదింపబడనియెడల, వెనుకటి జన్మలలో సంపాదింపబడియుండవలయును. ఎందుజూచినను మరణభీతి కనబడుచున్నది. ఎందువలననో యోచింపుడు. అప్పుడే గ్రుడ్డునుండి వెలువడిన కోడిపిల్ల డేగ తనవైపున కెగిరివచ్చినయెడల భీతిలి తల్లికడకు బర్విడును. ఇందుకు పూర్వసిద్ధమగు సమాధానాభాసమొకటి కలదు: అది దాని "సహజగుణము" (ఇన్‌స్టింక్ట్) అని చెప్పుదురు. అప్పుడే గ్రుడ్డునుండి వెలువడిన కోడికూనకు చావు అనిన భయమును బుట్టించునది యేది? అప్పుడే పొదిగిన గ్రుడ్డునుండి పుట్టు బాతుపిల్లయైనను నీటిసమీపమునకు వచ్చిన తోడ్తోడనే నీటిలోని కురికి యీదులాడసాగునే! ఎందువలన? అదెన్నడు నీదియుండలేదే! ఇంకొకటి యీదులాడుచుండగా జూచియునుండలేదు! దీనిని సహజప్రవృత్తి యందురు. ఈ శబ్దము మహాగంభీరమగునదే; కాని యిది మనచిక్కును దీర్చుటలేదు. ఈ "స్వాభావికప్రవృత్తి"అనబడు చిత్రవిషయమేమియో విచారింతము గాక! ఒక బాలిక హార్మోనియమును వాయించుట సాధనచేయు

చున్న దనుకొనుడు. ప్రథమమున తాను ప్రేలుపెట్టు ప్రతి బిరడాను శ్రద్ధతో గమనింపవలసినదై యుండును. అట్లు చేయగా చేయగా, కొన్ని నెలలకో, సంవత్సరములకో, ఆమె ప్రేళ్లచలన మప్రయత్నముగా నడువగలిగినది. అప్పు డా నడక 'అంతఃప్రేరణ' ఐన దందుము. మొదట బుద్ధిపూర్వకముగా, ప్రయత్నపూర్వకముగా, జరుపబడిన కార్యము రానురాను బుద్ధియొక్క ప్రయత్నమంతగా లేకుండనే, అనగా 'సహజాతధారణగనే' జరుగుచున్నది. ఇంతటితోనే సర్వమును తెల్లమగుటలేదు. ఇంకను సగము విషయము మిగిలియే యున్నది. 'సహజజ్ఞానము'నుబట్టి యిప్పుడు జరుగునని చెప్పు కార్యములు దాదాపుగా నన్నియు మనయిచ్ఛయొక్క స్వాధీనములోనికి గొనిరాబడగలవు. శరీరమునందలి ప్రతికండరమును ఇచ్ఛకు వశముచేయవచ్చును. ఈ విషయము బాగుగ దెలిసిన యంశమే గదా! ఇప్పు డీ ఇరువైపుల పరిశోధనముచే ఋజువు పూర్తియగుచున్నది. మనము 'అంతర్జాతప్రవృత్తి' అనునది యిచ్ఛాకార్యములయొక్క నిమ్నావస్థ యనవచ్చును. ఈ సాదృశ్యమును సృష్టికంతకును అనువర్తింపజేసితిమేని, సృష్టియంతయు నొకేసూత్రమున కనుసరణముగ జరుగునేని, పశువులందును నరులందునుగూడ 'సహజప్రవృత్తి' యనబడునది యిచ్ఛయొక్క నిమ్నావస్థయే యనవలయును.

బ్రహ్మాండమ నంతటిని గూర్చి విచారించునప్పుడు ప్రతి 'సంవృతి'కిని పూర్వ మొక 'వివృతి'యు, ప్రతి 'వివృతి'కిని పూర్వ మొక 'సంవృతి'యు నుండునని ఋజువు తేల్చిన సూత్రమును ప్రయోగించుదుమేని 'సహజజ్ఞానము' అనునది 'సంవృత విచక్షణ' శక్తి (ఇన్వాల్వ్డ్ రీజన్) యని తేలును. నరులందుగాని, పశువులందుగాని, కాన్పించు 'సహజప్రవృత్తి' పూర్వము గావించిన ఐచ్ఛికకర్మలయొక్క 'సంవృతదశ', అనగా వాని నిమ్నావస్థ యనియు, ఆ ఐచ్ఛికకర్మలును పూర్వానుభవములేక జరిగినవి గావనియు స్పష్టమగును. అనుభవమే ఆ జ్ఞానమునకు మూలము.

ఆ జ్ఞానము నిలిచియున్నది. మరణభీతియు, బాతుపిల్ల నీటిలోదుముకుటయు, నడునియందు సహజముగా జరుగు అనిచ్ఛాపూర్వక కార్యములును, పూర్వానుభవఫలములే. ఇంతవఱకు మన నడక చిక్కులేక సాగినది: ఆధునికశాస్త్రజ్ఞులుకూడ ప్రాచీనఋషుల మార్గము ననువర్తించి మనభావములను బలపఱచుచుండిరి. కాని ఇచట చిక్కొకటి వచ్చుచున్నది. ప్రతినరుడును ప్రతి జంతువును కొంత పూర్వానుభవరాశితో పుట్టుచుండుననియు, మనస్సున జరుగు కార్యములన్నియు పూర్వానుభవముల ఫలితార్థములే యనియు వారొప్పుకొందురు. కాని "ఈ యనుభవము ఆత్మకు జెందినదని చెప్పుటవలన లాభమేమున్నది? అది శరీరమునకు జెందినదే — కేవలము శరీరమునకే చెందినది — అనరాదా? వంశపారంపర్యముగా వచ్చునదనరాదా?" అని వారు ప్రశ్నింతురు. ఇది మనము పరిష్కారము చేయవలయువానిలో తుదియాక్షేపము: 'నేను జన్మించునప్పుడు నాలోగల పూర్వానుభవమంతయు నా పూర్వికులయొక్క గతకాలానుభవరాశికి ఫలమని యేల చెప్ప రాదు? చిన్న ఏకకణజీవియొక్క దశనుండి మానవశ్రేష్ఠుడనగు నవస్థవఱకును నేను పొందిన యనుభవరాశి యంతయు నాలో నున్నదిగదా. అది పరంపరాగతముగ నొకశరీరమునుండి మఱొక శరీరమునకు సంక్రమించుచు వచ్చినది. ఇక కష్ట మెక్కడ నున్నది?' ఈ ప్రశ్న చాల చక్కనిదే; వంశపారంపర్యానుగత ధర్మమునుకూడ మనము కొంతవఱ కొప్పుకొనుచునే యున్నాము. ఎంతవఱ కందురా? శరీరపదార్థ సంగ్రహణమువఱకు మాత్రము. మన పూర్వకర్మల ననుసరించి యొకానొక శరీరములో నొకా నొక జన్మనెత్తుటకు అర్హతనొందుదుము. ఆ శరీరమున కనువగు పదార్థరాశి ఆ యాత్మను తమసంతానముగా బడయుట కర్హత నార్జించుకొనిన దంపతులవలన మాత్రమే లభింపగలదు.

జడపదార్థమునందు మానసికానుభవములు ముద్రితములు కాగలవని, జడపదార్థమునందు మానసికానుభవములు 'సంవృతి'

పొందుట సాధ్యమని, ఊహించుట కేమాత్రము ఆధారములేదు. కాని ఈ కేవలనిర్హేతుకమగు ఊహయే వీరి వంశపారంపర్య వాదమునకు ప్రాపు. నేను మీవంక జూచునప్పుడు నా మనస్స నెడు సరస్సునందు ఒక తరంగము లేచును. అది యడగిపోవును గాని, సూక్ష్మతరాకృతిని దాల్చి యొక ''వాసన'' రూపమున మనస్సున నిలిచియే యుండును. స్థూలశరీరమునందు భౌతికాను భవములు ముద్రితమగుననినచో, మనము గ్రహింపజాలుదుము. కాని శరీరము విచ్ఛిన్నమగునని యొప్పుకొని, మానసికానుభవము లీశరీరమున ముద్రితములై నిలిచియుండుననుట కాధారము కాన్పింపదు. వానిని వహించునదేది? ఒకవేళ ప్రతి మానసికాను భవమును శరీరమున ముద్రితమగు ననియు, ఆదిపురుషుడు మొదలు నా తండ్రివఱకు గల యందఱి 'వాసనలు'ను నా తండ్రి శరీరమునకు సంక్రమించియుండె ననియు నొప్పుకొనిననుగూడ, అవి నాకు సంక్రమించుటెట్లు? శుక్లబిందువువలన నందురా? అదెట్లు కాగలదు? జనకుని శరీరము మొత్తముగా కుమారునికి రాదుగదా. ఒకేదంపతులకనేకులు బిడ్డలు పుట్టుదురు. అప్పు డీ వంశపారంపర్యసంక్రమణ సిద్ధాంతము ననుసరించి వాసనయు వాసనాత్మికద్రవ్యమును నొకటేయగునేని, ఆ దంపతులు తమతమ వాసనలలో కొంత కొంతభాగమును ప్రతికానుపుతోను నష్టపడు చుండవలయును. అటులగాక జనకులు తమవాసనలను సంపూర్ణ ముగా దమ సంతానమునకు సంక్రమింప జేయుదురనినయెడల, మొదటి బిడ్డ పుట్టగానే వారిమనస్సులు వట్టిపోయి శూన్యములు కావలసివచ్చును.

మఱియు నొక్క శుక్లబిందువునందు అనంత కాలమునుండి వచ్చుచున్న మితిలేని వాసనాసమష్టి ప్రవేశింపగలుగునెడల అది ఎచ్చటనుండినది, ఎట్లుండినది? ఇదెంతమాత్రమును సమర్థింప నలవిగాని వాదన. ఈ పదార్థవిజ్ఞానవాదులు (ఫిజిసిస్ట్సు) ఆ బిందు వునందు వాసన లెట్లుండునో, యే భాగమున నిలుచునో, మానసిక

వాసనలు జడపదార్థకణమున జొచ్చి నిదురించుచుండుననుట కర్థమేమో, విస్పష్టముగ ఋజువుచేయువఱకును వారివాదన యంగీకరింపబడజాలదు. ఇప్పటికి తేలినదిది : ఈ వాసనలు మనస్సునందుండును. మనస్సు జనన పునర్జననములు పొందుచు, తనకు మిగుల ననుకూలముగనుండు భౌతిక పదార్థమును (శరీరనిర్మాణార్థము) వినియోగించుకొనును. ఏ విధమగు శరీరము తన కనుకూలమో, అట్టి శరీరపదార్థము లభించువఱకది వేచియుండవలయును. ఇది సులభముగ బోధపడుచున్నది. ఆత్మకు సమకూడు శరీరపదార్థవిషయమున మాత్రమే వంశపారంపర్యసిద్ధాంతము వర్తించునని దీనినిబట్టి తేలుచున్నది. జీవాత్మ జన్మాంతరముల బొందుచు, శరీరము తరువాత శరీరముగా నెన్నింటినో కల్పించుకొనుచుండును. మనస్సున గలుగు ప్రతి సంకల్పమును, మనము చేయు ప్రతికార్యమును, బహుసూక్ష్మరూపమునుదాల్చి అందు నిలిచియుండి, తిరిగి మొలకయెత్తుటకును, క్రొత్తస్వరూపమును దాల్చుటకును, సిద్ధముగ నుండును. నేను మీవైపు చూచునప్పుడు నా మనస్సులో నొకతరంగము కలుగును. అది నా మనస్సున లోతునకు మునిగిపోయి క్రమేణా సూక్ష్మతరాకృతినిదాల్చి పడియుండును. కాని నాశమును పొందదు. తిరిగి యదెన్నడో స్మృతి (జ్ఞప్తి) రూపమున తలచూపుటకు సిద్ధముగ నుండును. ఇట్లనేక భావములు నా మనస్సున పేరుకొని యుండును. నేను మరణించునప్పుడు వీని సమష్టిఫలమగు శక్తి నాపై తనప్రభావమును చూపును. ఈ గదిలో నొక బంతి యున్నదనుకొనుడు. మనమందఱమును తలకొక బల్లచెక్కను దీసికొని యన్నివైపుల నుండియు దాని నిటునటు గొట్టుదుమని భావింపుడు. అప్పుడా బంతి యీగదిలో నొకచోటునుండి మఱొకచోటునకు, దొర్లి దొర్లి, ద్వారము కడకు రాగనే వెలుపలి కెగిరిపోవునుగదా! అది యప్పుడు తనతో నేమితీసికొని పోవుచున్నది? మనమందఱము కొట్టిన దెబ్బల సమష్టిఫలమునే గదా? ఆ సమష్టిఫలమే దాని కా

త్రోవను జూపినది. అటులనే యీ శరీరము నశించునప్పుడు జీవునికి త్రోవజూపునదేమో విచారింపుడు. ఆ జీవి చేసిన కర్మ లన్నింటియొక్కయు, సంకల్పించిన సంకల్పములన్నింటియొక్కయు సమష్టిఫలితమే వానికి దారిజూపును. ఈ సమష్టిఫలితము భవిష్య దనుభవమునకు గావలసిన యింకొక శరీరమును గూర్చుకొను నవసరమును కల్పనచేయు నెడల ఆ జీవుడు తనకు దగిన శరీరమున కనువగు ద్రవ్యమును చేకూర్చుటకు సిద్ధముగా నుండు తల్లిదండ్రుల కడకు బోవును. ఈ రీతిగా జీవుడొక శరీరమునుండి వేఱొక శరీరమునకు యాత్రలు చేయుచుండును. స్వర్గమునకును భూమికిని సంచారములు చేయును; మనుష్యశరీరములను పశుశరీరములను దాల్చుచుండును. ఇట్లతడు తన యనుభవమునంతను పూర్తి గావించుకొని, తన సంచారచక్రమును ముగించుకొనువఱకును జన్మాంతరయాత్రలు చేయుచుండును. తుద కతడు తన స్వరూప మును తెలిసికొనును. తానెవరో గ్రహించును. వాని యజ్ఞానము రూపుమాయును. అతని దివ్యశక్తులు ప్రకాశమునకు వచ్చును. అంత నతడు పరిపూర్ణుడై వెలుగును. ఆ జీవున కా పిమ్మట భౌతిక శరీరముల దాల్చు నగత్యము గాని, సూక్ష్మతర మానసికశరీర ములను వహించు నవసరము గాని యుండదు. అతడు స్వయం ప్రకాశుడై వెలుంగును; ముక్తుడగును. ఇంక వానికి జననము లేదు; మరణమును నుండదు.

మనమిప్పు డింతకు మించిన సూక్ష్మతర వివరణములలోనికి దిగము. జన్మాంతర సిద్ధాంతమునుగురించి యింకొక యంశమును గూడ దెలిపెదను. అది నరుని ఆత్మ స్వాతంత్ర మను వాదము. మనలోపములను పరులపైకి త్రోయు నలవాటు ననుసరింపని వాద మిది యొక్కటియే. మనలోపములను మన మొప్పుకొనము. మననేత్రములు తమను తాము చూచుకొనలేవు. ఇతరుల నేత్రముల నన్నింటిని జూడగలవు. తమ దోషముల నితరులపై బడవేయు నవకాశ మున్నంతవఱకు నరులు తమ నేరముల నంగీకరించుటలో

ప్రాల్మాలుదురు. తమ సహజదోషములను వీలగునంతవఱకు తోడి మానవుల మీదనో, అట్లు పొసగనిచో భగవంతునిమీదనో పడవేతురు. అదియు గాకున్నయెడల 'విధివ్రాత' యను నొక భూతమును సృష్టిచేయుదురు. ఈ 'విధివ్రాత' యెక్కడిది? విధాత యెవరు? మనము నాటిన విత్తు ఫలమునే మన మనుభవింతుము. మన విధివ్రాతకు కర్తలము మనమే! దానికై నిందార్హులగువారు వేఱుగా లేరు. అభినందనముల బడయగలవారును లేరు. గాలి వీచును. ఎవరు తమ పడవల తెఱచాపను విప్పిపెట్టుకొందురో వారు ముందుకుబోదురు. ఎవరు దానిని ముడిచిపెట్టుకొనియుందురో వారా గాలివలని లాభమును బడయజాలరు. అట్లగుట గాలి యొక్క దోషమా? కొందఱు సుఖవంతులు, కొందఱు దుఃఖితులు నగుట కరుణామయుడగు జగత్పతియొక్క లోపమా? వాని కృపానిలయము సదా రేయింబవళ్లు వీచుచునేయున్నది. వాని కరుణ మందగించుటలేదు. మనగతికి మనమే కర్తలము. భగవంతుడు నియమించిన సూర్యుడు బలయుతులకును బలహీనులకునుగూడ వెలుగునిచ్చుచునేయున్నాడు. వానిచే నియమింపబడిన వాయువు పరమసాధువుపైనను పతితునిపైనను నొక్క తీరుననే వీచుచున్నది. ఆయన విశ్వేశ్వరుడు; జగత్పిత; కరుణాసాగరుడు; నిష్పక్షపాతి! మన జీవన క్షుద్రవిషయములను గూర్చి మనము భావనల జేయు తీరున ఆ విరాడ్విశ్వకర్మయు భావనల చేయుచుండు ననుకొంటిరా? భగవంతునిగూర్చి యిటుల తలచుట యెంతయు తుచ్ఛము. ఇచ్చటి మన పెనగులాటలను చావుబ్రదుకులతో సమానముగా తలపోయు కుక్కకూనలవంటి మనము, భగవంతుడును వీనిని మహద్విషయములుగ పాటించి వర్తించుచుండునని మిగుల నవివేకులమై తలంతుము. ఈ కుక్కకూనల చెరలాటము లెంతటివో యాయనకు దెలియును. ఆ దేవదేవుని దండనాధికారిగను, పారితోషికదాతగను చేసి నేరమాయనపై నారోపింపజూచుట మూర్ఖచర్యసుడీ. ఆయన

దండనలు విధించువాడుగాడు; బహుమతుల నొసగువాడునుగాడు. ఆ సర్వేశ్వరుని కృప వెల్లివిరిసి యనంతముగా దశదిశల ప్రవహించుచు సకలజీవులకును, సమస్తప్రదేశములలోను, సర్వకాల సర్వావస్థలయందును, వక్రగతిలేక, ఆశాభంగము గావింపక, సులభ్యంబై పరగుచుండును. దానిని వినియోగించుకొను విధానము మనపై నాధారపడియున్నది. తోడిమానవులనుగాని, భగవంతునిగాని, బ్రహ్మాండమున మఱెవరినిగాని నిందింపబోకుడు. మీ కేదేని దుఃఖము కలిగినప్పుడు మిమ్ము మీరే నిందించుకొనుడు. ఉత్తమతరమార్గము నవలంబించి వర్తించుటకు ప్రయత్నింపుడు.

మన సమస్యాపరిష్కారమున కిదొక్కటే త్రోవ! ఇతరుల నిందించువారి సంఖ్య కటకటా, దినదినము పెరిగిపోవుచున్నది గదా! బుద్ధిహీనులై వారు దుఃఖములచే గుందుచున్నారు. తమ పొరపాటులచేతనే దుర్గతిపాలబడి అయ్యో వీ రితరులను దూరుదురే! ఇట్టివారి దశ బాగుపడజాలదు. అందువలన నేలాటి లాభమును చేకూరబోదు. తమ దోషములను నితరుల నెత్తిపై త్రోసి, పరులను నిందసేయు ప్రయత్నము వీరిని మఱింత బలహీనుల నొనర్చునుసుడీ! కాబట్టి మీ లోపములకై యెవరిని గాని నిందింపజూడకుడు. మీ కాళ్లపై మీరే నిలువబడి మీ బాధ్యతనంతను మీరే వహింపుడు. "నే ననుభవించు దుఃఖము నా కర్మఫలము; అందువలన నిది నాచేతనే నివారింపబడగల దని రుజువగుచున్నది" అనుడు. నేను సృష్టించినదానిని నేను నాశనము చేయగలుగుదును. ఇతరులు సృష్టించినదానిని నే నెన్నడు నాశనము చేయజాలను. కావున మనము సదా ధైర్యమును, బలమును, పూని నిలువబడవలయును. బాధ్యతనంతను మీమీద నిడుకొని మీ గతికి మీరే కర్తలని యంగీకరింపుడు. మీకు గావలయు బలమును సాహాయ్యమును మీలోనే యున్నదిసుడీ! కావున మీ భవితవ్యమును మీరే నిర్మాణముచేసికొనుడు. "గతమును

గతము పూడ్చిపెట్టుగాక!'' అంతులేని భవిష్యత్తు కలదు. మీ ప్రతి వాక్కును, ప్రతి సంకల్పమును, ప్రతి చేష్టయును మీకు కొంత సంచితఫలమును చేకూర్చుచుండును. చెడ్డతలంపులును చెడ్డపనులును పెద్ద పులులవలె పైకి దుముకునని మఱువకుడు. మఱియు నుత్సాహోన్నతికిని అవకాశము కలదు. సత్సంకల్పములును సత్కార్యములును నూఱులకొలదిగను వేలకొలదిగను దేవతాగణముల మహిమతో మిమ్ము సదా రక్షింపగలవను దృఢవిశ్వాసము గలిగి ప్రవర్తింతురుగాక!



# అమృతత్వము

(అమెరికాలోని ఉపన్యాసము)

నేటి ఉపన్యాసవిషయము మానవాత్మయొక్క అమృతత్వమును (నిత్యత్వమును) గూర్చినది. ఈ విషయము విచారింపబడినన్నిసార్లు ఇంకే విషయముకూడ లోకములో విచారింపబడలేదు. ఈ సమస్యను పరిష్కరించుటకై మానవుడు జగత్తును పరిశోధించినన్నిసార్లు ఇంకే సమస్యకై పరిశోధింపలేదు. మానవహృదయమున కింతకన్న ముఖ్యమును, ఇంతకన్న ప్రీతికరమును, అగు సమస్య యింకొకటి లేదు. మన జీవితములతో ఇంతకన్న అభేద్య సంబంధము గల విషయ మింకేదియు లేదు. కవులు, సిద్ధపురుషులు, మతాచార్యులు, మతప్రవక్తలు : దీనిని విచారించిరి. సింహాసనాసీనులైన రాజన్యులు దీనిని చర్చించిరి. భిక్షాటనము చేయు యాచకులు దీనినిగూర్చి కలలు గనిరి. మహోన్నత మానవు లీ విషయములో ప్రసక్తులైరి. అధమాధములుకూడ దీనిపై ఆశచూపిరి. దీనియందలి ఆసక్తి ఇంతదనుక నశింపలేదు. మానవప్రకృతి యుండువఱ కది నశింపదు. నానాబుద్ధు లీ సమస్యను పరిశీలించి నానాసమాధానములు లోకమున కర్పించినవి. ప్రతి చారిత్రకయుగములోను ఈ చర్చను విరమించుకొనినవారు కూడ వేనవేలు కలరు. కాని సమస్యమాత్రము యథాప్రకారము పూర్ణబలముతో నిలిచియేయున్నది. జీవితపు ఆరాటములలో, పోరాటములలో, ఇది మఱపున పడినట్లుతోచును కాని ఇంతలో హఠాత్తుగా ఎవరో ఒకరు మృతి నొందుదురు. మనకు ప్రేమపదమైనవాడు, మిక్కిలి ఆప్తబాంధవుడు, హృదయమును చూఱగొన్నవాడు కొంపోబడును. అప్పు డీ ప్రపంచపు ఘోష, మన ఆరాటములు, పోరాటములు, ఒకించుక సేపు ఆగిపోవును. ''మరణానంతర మేమి కలదు? ఈ ఆత్మ ఏమగును?'' అను పురా

తనప్రశ్న మరల జీవాత్మకు తోఁచును. మానవజ్ఞానమునకు మూలము అనుభవమే. అనుభవమునకు రాని విషయము మన మెఱుఁగజాలము. మన హేతువాదమున కంతయు మూలము అనుభూతవిషయములనుండి ఊహించుకొనబడిన సామాన్యధర్మములు. మన జ్ఞానమున కంతయు మూలము అనుభూత విషయములను సమరసపఱచి నిర్మించుకొనబడిన భావములు. మన చుట్టు గల వస్తుప్రపంచమును చూచినచో గోచరించునది నిరంతరపరిణామమే గదా. బీజములోనుండి మొలక మొలచి, పెరిగి, వృక్షమై, చివరకు మరల బీజ మగును. జంతువు పుట్టును, కొన్నాళ్లు బ్రదుకును, చచ్చును, మరల మొదటికి వచ్చును. మానవుఁడు కూడ ఇంతియే. కొండ మెల్ల మెల్లగా—కాని అనివార్యముగా—తఱిగిపోవును. నదులు మెల్లమెల్లగా—కాని అనివార్యముగా—ఎండిపోవును. వానలు సముద్రమువలన కలిగి మరల సముద్రములోనికే పోవును. ప్రతివిషయమునను ఇట్లే గమనము వలయాకృతితో సాగి, చివరకు ప్రారంభస్థానమునకు వచ్చుచుండును. పుట్టుట, పెరుగుట, బలియుట, క్షీణించుట: ఇవి క్రమము తప్పక, నిష్కర్షగా, ఒకటివెనుకనొకటి కలుగుచుండును. ఇదియే మన నిరంతరానుభవము. కాని వీని యన్నిటికి మూలమై, ప్రాణినామమున బరగు అసంఖ్యాకభూతరాశికి: ఈ లక్షోపలక్షల ఆకృతులకు, మూర్తులకు: ఈ కోటానుకోట్ల భిన్నతలకు — అత్యంత సూక్ష్మమగు అణువు మొదలు ఆధ్యాత్మికసమున్నతి నందిన మానవశ్రేష్ఠుని వఱకు గల భిన్నతకు—మూలమైయుండు నొక ఐక్యము గోచరించును. వస్తుకోటి నొండొంటినుండి విభజించు అడ్డుగోడలు ప్రతిదినము కూలద్రోయ బడుచున్నవి. భౌతికపదార్థ మంతటికి నొక్కే వస్తువు మూలమనియు: ఇన్ని భిన్నరూపములతో, ఇన్ని భిన్నవిధములుగా, అది యొక్కే చైతన్యమును వ్యక్తపఱచు చుండుననియు: ఎడతెగని గొలుసువలె ఈభూతకోటి యంతటిలో ఆ చైతన్య మంతర్భూతమై నిలిచియుండుననియు, ఈ వివిధరూపము

లా గొలుసుయొక్క కొక్కెములవంటివనియు, ఈ కొక్కెము లించుమించు అనంతములైనను ఆ ఒక్క గొలుసువే అనియు, ఆధునిక భౌతికశాస్త్రములు సిద్ధాంతీకరింప మొదలుపెట్టినవి. దీనినే "పరిణామము" లేక "వ్యాకోచము" (యెవల్యూషన్) అందురు. ఇది అత్యంత పురాతనభావము. మానవసంఘు మేర్పడిన ఆదిమకాలమందే ఇది కలిగెను. కాని మానవజ్ఞాన మభివృద్ధి యగుకొలది, ఇది యిప్పుడు మరల పచ్చబడ మొదలిడి, చిగుర్చు చున్నది. పూర్వకాలపువారు "సంకోచము" (ఇన్ వెల్యూషన్) అను దాని యునికిని కూడ కనిపెట్టిరి. ఇప్పటివారు దాని నింకను పూర్తిగా గ్రహింపలేదు. బీజము వృక్షము కాగలదుగాని, ఇసుకకణ మెన్నటికి వృక్షము కాజాలదు. తండ్రియేబిడ్డ యగునది; మట్టిముద్ద బిడ్డ కానేరదు. ఈ వ్యాకోచమునకు మూల మేమి? బీజ మనగా మొదట వృక్షమే గదా. భవిష్యత్కాలమున వృక్ష రూపముతో వ్యక్తమగు విశిష్టలక్షణము లన్నియు ఆ బీజమందు కలవు. అట్లే భవిష్యత్కాలయువకునందును వృద్ధునందును వ్యక్త మగు విశిష్టలక్షణము లన్నియు ఆ బిడ్డయందు కలవు. పిమ్మట చూపట్లు జీవవిజృంభణ మంతయు స్త్రీయొక్క రజోబిందువునందే కలదు. దీనినే పూర్వకాలపు తత్త్వజ్ఞులు "సంకోచము" అనిరి. ఒక వస్తువులో లేని దేదియు దానిలోనుండి వెలువడజాలదు. ఇచ్చటకూడ ఆధునికశాస్త్రములు మనకు సహాకరించుచున్నవి. జగత్తులో దీపించు శక్తియొక్క సమష్టి పరిమాణ మెప్పుడును ఒక్కటిగనే ఉండునని గణితశాస్త్రాను ప్రాణితహేతువాదమువలన మనకు తెలియుచున్నది. జగత్తులోని భౌతికపదార్థము నొక్క పరమాణుమాత్రము, శక్తి నొక స్వల్పాంశమాత్రము మనము తగ్గింపజాలము, హెచ్చింపజాలము. కావున వ్యాకోచమునకు మూలము శూన్యముగా నుండజాలదు. అగుచో దాని మూల మేమి? పూర్వపు సంకుచితపదార్థము. వృద్ధుని సంకుచితస్థితియే శిశువు. వృక్షపు సంకుచితస్థితియే బీజము. బీజపు వ్యాకోచస్థితియే

వృక్షము. భావి జీవపరిణతియంతయు స్త్రీరజోబిందువున నణగి యున్నది. విషయ మిప్పుడు కొంత తేటపడినది. జీవము అవిరామక్రమము గలది అను ప్రథమభావమును దీనితో అనుసంధింపుడు. జీవలక్షణము మొదట అంకురించు జీవాణువు (ప్రోటోప్లాసమ్) నుండి మహోన్నత మానవునివఱకు ఒకే ఎడతెగని గొలుసు: ఒకే అవిరామజీవము. ఇదియే వ్యాకోచము. కాని ప్రతివ్యాకోచమునకు ముందొక సంకోచ ముండవలెను గదా. క్రమక్రమపరిణామ మొందు ఈ జీవమంతయు—ఆద్యరూపమగు జీవాణువునుండి పరిపూర్ణతనందిన మానవునివఱకు పూర్ణత్వ సిద్ధి నందినవానివఱకు గల వివిధరూపము లన్నియు—ఒకే జీవము. ఈ పరిణతరూపప్రభావ మంతయు ఆ జీవాణువులో సంకుచితమై యుండవలెను. ఈ జీవశ్రేణి యంతయు, అవతారమూర్తి సహితము, అందు సంకుచితమై యుండి క్రమక్రమముగా, మిక్కిలి మెల్లగా, పరిణామ మొందుచున్నది. అందీ పూర్ణ పరిణత రూపము కూడ అతిసూక్ష్మాకృతితో నణగియేయుండవలెను. కావున సర్వగత మగు జగన్మయచైతన్యముయొక్క సంకుచిత రూపమే యీ యేకైకజీవము. ఈ గొలుసంతయు. ఈ ఏకైకచిద్రాశి (విజ్ఞానరాశి) యే ఆ జీవాణువునుండి పరిణత మానవునివఱకు క్రమాధికముగా వ్యక్తమగుచున్నది. అది పెరుగు నని కాదు దీని యర్థము. "పెరుగుట" అను భావము నే మీ మనస్సులలో నుండి పాఱదోలుడు. "పెరుగుట"లో బాహ్యవస్తు వొకటి కలదనియు, వెలుపలనుండి ఏదో వచ్చినదనియు తోచును. ప్రతి జీవియందును అంతర్గతుడై యుండు ఆ పరిపూర్ణుడు బాహ్యస్థితిగతులపై ఆధారపడనివాడు అను సత్యమున కీ భావము విరుద్ధము గదా. అది పెరుగజాలదు. అది సర్వదా ఒక్కతీరుననే ఉండెను. కాని (క్రమాధికముగా) వ్యక్తమగుచున్నది.

కారణముయొక్క వ్యక్తరూపమే కార్యము. రెంటికి వాస్తవభేద మేమియు లేదు. ఈ కాచపాత్రమును నిదర్శనముగా

కైకొనుడు. కాచపదార్థముండెను. అదియు, శిల్పియొక్క సంక ల్పమును, కలిసి యీ పాత్రమయ్యెను. ఈ రెండును దానికి (ఉపాదాన, నిమిత్త) కారణములు. ఇవి దానియందు కలవు. సంకల్పము ఏ రూపమున కల దందురా? సంశ్లేషశక్తి (ఎడిసన్) రూపమున కలదు. అం దీ శక్తి లేనిచో, ప్రతి అణువు వేఱువేఱుగా రాలిపోవును. కావున కార్యమనగా రూపులోను, కూరుపు లోను, భేదముగల కారణమే అనుట స్పష్టము. కొంతసేపు కార ణమును మార్చి పరిమిత మొనర్చినచో, అది కార్యమగును. మన జీవభావమున కిది అనుసంధించినచో, జీవాణువునుండి పరిపూర్ణ మానవునివఱకు గల పరిణామపరంపరయంతయు విశ్వవ్యాపి జీవమే కావలయును. మొదట అది సంకుచితమై సూక్ష్మరూప మొందెను. ఆ సూక్ష్మపదార్థము కారణరూప మొంది క్రమాధికముగా పరిణ మించుచు, వ్యక్తమగుచు, స్థూలమగుచున్నది.

అమృతత్వ (నిత్యత్వ) సమస్యను మన మింకను పరిష్క రింపలేదు. జగత్తులో దేనినిగాని నాశన మొనర్చుట సాధ్యము కాదని మనము కనుగొంటిమి. క్రొత్త దేదియు ఇప్పటికి లేదు, ముం దెప్పటికి ఉండబోదు. చక్రము తిరుగుచున్నప్పుడు దాని క్రిందుమీదులు ఒకటిపిదప నొకటి కానిపించుచుండునట్లే, ఒకే వ్యక్తరూపపరంపర మనకు కానిపించుచున్నది. జగత్తుయొక్క గమనమంతయు తరంగరూపమున పైకెగయుచు క్రిందికి పడుచు, మరల ఎగయుచు, మరల పడుచు, ఎల్లప్పుడు నిట్లే సాగుచుండును. ఎన్నో జ్యోతిర్మండలములు సూక్ష్మరూపములనుండి వ్యాకోచతచే క్రమాధికములుగా స్థూలములై, మరల లయమై మొదటి సూక్ష్మ రూపముల నందుచుండును. మరల అందుండి లేచి కొంత కాలము స్థూలదశ నంది పిదప మెల్లమెల్లగా మూలస్థితికి వచ్చుచుండును. జీవ మంతయు ఇట్లే. గోచరరూపమున కెగసిన జీవ మంతయు మరల పూర్వస్థితిలో లీనమైపోవుచున్నది. పోవున దేది? ఆకారమే. అది జీర్ణమైపోవును, కాని మరల ఉద్భవించును. ఒక

భావమున శరీరములు, ఆకారములుకూడ నిత్యములే. అదెట్లు అందురా? పాచికలు పెక్కింటిని తీసికొని క్రింద విడిచినచో, అవి యొకసారి 6, 5, 4, 3 అను సంబంధమున పడు ననుకొనుడు. వానిని చేర్చి తీసికొని మరల మరల క్రింద వైచుచున్నచో ఎప్పుడో యొకప్పు డవి మరల అదే సంబంధమున పడి తీఱును గదా. లోకమున నుండు ప్రతినలుసును, ప్రతిఅణువును, ఒక పాచికగా భావించుకొనుడు. అవి మాటిమాటికి పాఱజల్లబడుచు, కూర్పబడుచు ఉండును. ఇప్పుడు మీకు చూపట్టునది వాని సంయోగ క్రమములలో నొకటి. ఇప్పు డిచట నుండున దొక కాచపాత్ర యొక్క, ఒక బల్లయొక్క, ఒక నీటికుండయొక్క, మఱి కొన్ని వస్తువులయొక్క, ఆకారములు. ఇది యొక సంయోగము. కాలక్రమమున ఇవన్నియు లయించును. కాని అనంతకాలమున నిదే సంయోగ మెప్పుడో మరల రాక తప్పునా? అప్పుడు మీ రిచట నుందురు, ఈ మూర్తియు ఉండును, ఈ ప్రసంగమే ఉండును, ఈ నీటికుండయు ఉండును. పూర్వ మిట్లు సంఖ్యలేనన్నిసార్లు జరిగెను. భావికాలమున మరల నిది సంఖ్యలేనన్నిసార్లు జరుగ గలదు. ఇంతదనుక మనము ప్రసంగించినది భౌతికరూపములను గూర్చి. ఏమి తేలినది? భౌతికరూపసంయోగక్రమములుకూడ అనంతముగా పునరావృత్తి నొందుచుండునని తేలినది.

మన కిప్పుడు అవగాహనకాని కొన్ని విషయము లిందుచే తేటపడును. ఇతరుల పూర్వచరిత్రమును, భవిష్యచ్చరిత్రమును చెప్పగలవారిని మీలో కొందఱు చూచియుందురు. భవితవ్య మిప్పటికే నిర్ణయింపబడియుండనిచో దాని నెవరైన ఎట్లు వివరింప గలరు? పూర్వకర్మములు భవిష్యత్కాలమున ఫలరూపములై మరల చూపట్టును. ఇది మనముకూడ చూచుచున్నాము. షికాగో పురిలోని "ఫెర్రిస్ వ్హీల్"* అను మహాచక్రమును మీ రెఱుగు

* మన తిరునాళ్లలలోని "రంగులరాటము" వంటిది. కాని ఇది పైకి క్రిందికి తిరుగునని తోచుచున్నది.

మురు. ఆ చక్రము తిరుగుచుండును. అప్పుడు దానిలోని అఱ లన్నియు ఒక్కొక్కటే యథాక్రమముగా దృష్టిగోచరమగు చుండును. ఒక జట్టువారు ఆ అఱలలో ఎక్కుదురు. వారు చుట్టు తిరిగినతోడనే మఱొక జట్టువా రెక్కుదురు. ఈ జట్టు ఒక్కొక్కటి ఒక్కొక్క వ్యాకోచావృత్తము వంటిది. అతిక్షుద్రజీవము మొదలు అత్యున్నతమానవునివఱకు గల అన్ని వర్గములు అందు చూపట్టును. ఈ చక్రమున కాధారభూతమగు గొలుసు వంటిది ప్రకృతి. అది అనంతము, సనాతనము. చక్రములోని అఱలు క్రొత్తక్రొత్త ఆత్మల జట్టులు దాల్చు దేహములు, లేక ఆకృతులు, అనవచ్చును. అవి పరిపూర్ణత నందువఱకు పైకి పైకి పోయి పోయి, అంతట చక్రమునుండి వెలికివచ్చును. కాని చక్రము తిరుగుచునే ఉండును. దేహములు చక్రములో నుండువఱకు అవి ఎచటి కేగునది రేఖామాత్రభేదములేకుండ, నిర్దుష్టముగా ముందుగనే కనుగొని చెప్పవచ్చును. కాని ఆత్మలనుగూర్చి ఇట్లు కన్గొని చెప్పజాలము. అనగా, ప్రకృతియొక్క పూర్వోత్తరములను నిష్కర్షగా చెప్పవచ్చును. భౌతికసంఘటనములు నియమిత కాలాంతరక్రమమున మాటిమాటికి కలుగుచుండు ననియు, ఒకే సంఘటనము లట్లు పునఃపునఃప్రదర్శితము లగుచుండు ననియు మన కిప్పుడు తెలియవచ్చినది. కాని ఆత్మయొక్క అమృతత్వము కా దిది. శక్తి ఏదియు నాశ మొందదు. భౌతికపదార్థ మేదియు నిర్మూలము కాదు. అట్లైన అది ఏమగును? మార్పులు చెందుచు ముందుకు వచ్చి, వెనుకకు పోయి, చివరకు తన మూలమును మరల చేరును. గమన మెన్నడును సరళరేఖారూపమున సాగదు. వలయరూపమున సాగును. సరళరేఖను అనంతదీర్ఘ మొనర్చిన, వలయరూప మొందును. కావున ఏ ఆత్మకును శాశ్వతమగు అధోగమనము ఉండనేరదు. అట్లుండుట అసంభవము. ప్రతి వస్తువు వలయగమనమును పూర్తిచేసి మూలమునకు రావలెను. 'మీరు, నేను, ఈ ఆత్మలన్నియు' అనగా నేమి? మన మందరము

సంకుచితదశ నందిన విశ్వచైతన్యము, విశ్వజీవము, విశ్వమానసము యొక్క అంశములమై యుండవలెననియు, ఈ ప్రదక్షిణమంతయు పూర్తిచేసికొని ఆ విశ్వప్రజ్ఞానమును, అనగా దైవమును, మరల చేరవలె ననియు సంకోచవ్యాకోచ విచారసందర్భమున మనము కనుగొంటిమి. ఈ విశ్వప్రజ్ఞానమునే ఈశ్వరు డనియు, భగవంతు డనియు, క్రీస్తు అనియు, బుద్ధు డనియు, బ్రహ్మ మనియు, అందురు. జడవాదులు (మెటీరియలిస్ట్సు) దీనినే భౌతికశక్తి యందురు. అజ్ఞేయవాదులు దీనిని అనంత, అనిర్వాచ్య, సర్వాతీత పదార్థ మందురు. మన మందఱము దాని అంశములము.

ఇది రెండవ భావము. కాని ఇదియు చాలదు. ఇంకను సంశయముల కెడము కలదు. ఏ శక్తికిని నాశము లేదని చెప్పుట మంచిదే. కాని మనకు గోచరించు సర్వశక్తులును, సర్వరూపములును, సమ్మేళనఫలములు (కొన్నిటి కలయికవలన ఏర్పడినవి). మన యెదుట నుండు ఈ మూర్తి అనేకభాగముల కూడికచే ఏర్పడినది. అట్లే మన మెఱుగు శక్తు లన్నియు సమ్మేళన ఫలములే. శక్తి అనునది అనేక శక్తుల సమ్మేళనఫలము, లేక అనేక శక్తుల సమష్టిఫలము, అని భౌతికశాస్త్రజ్ఞులందురు. అగుచో మీ వ్యక్తిత్వ మే మగును? మిశ్రద్రవ్యము లన్నియు నేడో రేపో విచ్ఛిన్నమై వానిలో గల వివిధమూలద్రవ్య (కాంపోనెంటు పార్ట్సు) రూపముల నొందవలెను. జగత్తులోని మిశ్రవస్తువు లన్నియు— భౌతికపదార్థమిశ్రితములు గాని, భౌతికశక్తి మిశ్రితములుగాని— నేడో, రేపో, విచ్ఛిన్నములు కావలసినదే. కారణఫలముగా కలిగిన దంతయు నశించుట సిద్ధము. అది విచ్ఛిన్నమై, చెదరి, తనలో చేరియుండు వివిధాంగములుగా అగును. ఆత్మ యనునది ఒక శక్తి కాదు. భావముకూడ కాదు. అది భావములయొక్క నిర్మాత, భావము కాదు; శరీరములయొక్క నిర్మాత, శరీరము కాదు. ఇ దెట్లు? శరీరము ఆత్మ కాదని మన మెఱుగుదుము. ఏల కాదు? దానికి ఎఱుక (తెలివి) లేదు కనుక. శవమునకు

ఎఱుక లేదు. కసాయి అంగటిలోని మాంసమునకు ఎఱుక లేదు. ఎఱుక అనగా నేమి? ప్రతిక్రియా (రియాక్షన్) శక్తి. దీనిని ఇంక కొంత లోతుకు దిగి విచారింతము. ఇచట నొక కుండ కలదు. దానిని నేను చూచుచున్నాను. ఎట్లు? కుండనుండి వెలుతురు కిరణములు వచ్చి నా కండ్లలో ప్రవేశించును. కంటిపాప పొర (రెటీనా) పై నొక ఆకృతిని కల్పించును. ఈ ఆకృతి మెదడుకు కొంపోబడును. అప్పటికిని కుండ దృష్టిగోచరము కాదు. ఆ కొంపోవు వానిని శారీరశాస్త్రజ్ఞులు స్పర్శనాడులు (సెన్సరీ నెర్వ్స్) అందురు. మెదడులోని ఇంద్రియ కేంద్రము ఆ ఆకృతిని మనస్సునకు నివేదించును. మనస్సు ప్రతిక్రియ ఒనర్చును. వెంటనే కుండ తళుక్కున గోచరించును. ఇంతకంటె సాధారణమగు మఱొక ఉదాహరణము కై కొందము. నా మాటలు మీరతిశ్రద్ధతో వినుచున్నారనుకొనుడు. మీ ముక్కుపై నొక దోమ వ్రాలి, దోమలు కల్పించు మనోజ్ఞానుభూతిని కల్పించుచున్నది. కాని మనస్సు నా మాటలలో వ్యగ్రమై యుండుటచేత, ఆ దోమ సంగతియే మీకు తెలియలేదు. ఇప్పుడేమి జరిగినది? మీ శరీరములో నొక చోట దోమ కుట్టినది. అచట కొన్ని స్పర్శనాడులు కలవు. ఆ అనుభూతి నవి మెదడునకు చేర్చినవి. కాని అది మెదడులోనే నిలిచిపోయినది. మీ మనస్సు అన్యత్ర నిలిచియుండుటచే, అది ప్రతిక్రియ ఒనర్పలేదు. కావున దోమ ఉనికి మీకు ఎఱుకపడలేదు. ఒక క్రొత్త అనుభూతి కలిగినప్పుడు, మనస్సు ప్రతిక్రియ చేయనిచో, ఆ అనుభూతి మన ఎఱుకకు రాదు. ప్రతిక్రియ జరిగిన పిదపనే మన మనుభవింతుము, చూతుము, విందుము. ఈ ప్రతిక్రియతోనే "ప్రకాశము" (సాంఖ్యపరిభాషలోనిమాట) కలుగును. శరీరము ఆ ప్రకాశమును (ఎఱుకను) కల్పింపజాలదు. అనగా, అనుభూతి కలుగుటకు శ్రద్ధ ("గమనము") ఉండుట ముఖ్యము. తా నెన్నడును నేర్చియుండని భాషను ఒక్కొక్కడు కొన్ని విశేషసందర్భములలో మాట్లాడ గల్గియుండె

నట. పసినాడతడు ఆ భాష మాటాడువారితో నివసించియుండె నని పిదప తెలియవచ్చెను. పసినాటి భావములు మెదడులో ముద్రింపబడియుండెను. ఏదో ఒక కారణముచే మానసిక విక్రియ కలిగెను. వెంటనే ఎఱుక చూపట్టెను—అతఁడా భాషను మాటలాడగలిగెను. మనస్సుమాత్రమే చాల దనియు, మన స్సొకరి చేతిలోని ఉపకరణముమాత్రమే అనియు ఇందుచే ఏర్పడినది. ఆ బాలుని మనస్సులో ఆ భాష కలదు. కాని అతఁడా విషయము నెఱుగడు. హఠాత్తుగా నొకప్పుడెఱుగ గలిగెను. మనస్సు కాక మఱొక పురుషుడు కలడనియు, బాలుని పసితనమున ఆ పురుషుఁడా శక్తిని వినియోగించుకొనలేదనియు, బాలుడు పెద్దయైన పిదప ఆ పురుషుఁడా శక్తిని వినియోగించుకొనె ననియు, తెలియుచున్నది. కావున శరీరము మొదటిది. మనస్సు (ఆలోచనా సాధనము) రెండవది. పిదప ఈ మనస్సునకు వెనుకనుండు జీవాత్మ మూడవది. మెదడునందలి పరమాణువులలో కలుగు నొక మార్పే 'ఆలోచన' అనబడునని ఆధునికతత్త్వజ్ఞుల వాదము. కనుక వా రిట్టి సంఘటనములను యుక్తియుక్తముగా సమర్థింపజాలక, అవి జరుగనే లేదనుటకూడ కలదు. శరీరము మాఱినప్పుడెల్ల మెదడు నశించుచుండును. మనస్సునకును, మెదడునకును, సన్నిహితసంబంధము కలదు. ప్రకాశింపజేయునది ఆత్మ. ఆత్మ చేతి ఉపకరణము మనస్సు. ఈ ఉపకరణముద్వారా అది బాహ్యోపకరణమును అందుకొనును. ఇదియే విషయము గోచరించు విధము. బాహ్యేంద్రియములు విషయానుభూతులను స్వీకరించి అంతరింద్రియములకు కొనిపోవును. కన్నులు, చెవులు, మొదలగు బాహ్యేంద్రియములకు గలది ఈ స్వీకరణశక్తియే అనియు, అంతరింద్రియములకు (మెదడులోని ఇంద్రియకేంద్రములకు) మాత్రమే కార్యాచరణశక్తి కలదనియు జ్ఞప్తి యుంచుకొనవలెను. ఈ అంతరింద్రియములు ఆ అనుభూతులను మనస్సునకు నివేదించును. మనస్సు వానిని తన స్థితులలో నొకటగు

చిత్తమునకు చేర్చును. అచట నవి ఇచ్ఛారూపమున వ్యవస్థిత ములగును. ఇవన్నియు కలిసి ఆ అనుభూతులను లోపలనుండు రాజాధిరాజునకు, సింహాసనాధీశునికి, జీవాత్మకు సమర్పించును. ఆయన పరికించి ఆజ్ఞలొసగును. వెంటనే మనస్సు ఇంద్రియముల కును, ఇంద్రియములు శరీరమునకును, వర్తమానము నంద జేయును. నిజమగు జ్ఞాత, పరిపాలకుడు, నియామకుడు, సూత్ర ధారుడు, జీవాత్మయే.

ఆత్మ శరీరము కాదు. ఆలోచనాశక్తి కాదు అని దీనినిబట్టి తెలియుచున్నది. అది సంయుక్తపదార్థముగా నుండ జాలదు. ఏల? మిశ్రితపదార్థములన్నియు ఇంద్రియ గోచరములుగనో, మనోగోచరములుగనో, ఉండవలెను గనుక. చూచుటకు, ఊహించుటకు, శక్యము కానిది; కట్టకట్టియుంచు టకు సాధ్యము కానిది; శక్తి కానిది; భౌతికవస్తువు కానిది; కారణము కానిది; కార్యము కానిది; సంయుక్తపదార్థముగా నుండజాలదు. మన మానసిక ప్రపంచపు అవధులలోనే, మన భావప్రపంచపు సరిహద్దులలోనే సంయుక్తపద్దార్థములయొక్క యేలుబడికలదు. ఆ హద్దులుదాటి వానికి ఉనికిలేదు. నియమములు చెల్లు చోటనే వాని యునికి. నియమాతీతవస్తు వేదైన నున్నచో, అది సంయుక్త పదార్థము కానేరదు. మానవాత్మ నిమిత్తత్వమున కతీతమైనది గాన అది సంయుక్తవస్తువు కాదు. అది నిత్యముక్తము. నియమ బద్ధమైన దంతయు దాని ఏలుబడి లోనిది. అది మృతినొంద జాలదు. విచ్ఛిన్నమై మూలవస్తురూప మొందుటే కదా మృతి. కావున సంయుక్తవస్తువు కానిదానికి మృతి ఎట్లుండగలదు? అది మృతినొందు ననుట అసంబద్ధప్రలాపము.

మన విచార మిప్పుడు క్రమాధికముగా సూక్ష్మతర మగు చున్నది. మీలో కొందఱి కిది వెఱపుగొలుపు నేమో! భౌతిక పదార్థములు, శక్తులు, భావములు, కూడిన ఈ క్షుద్రజగత్తున కతీతమగుటచే ఆత్మ అసంయుక్తవస్తు వనియు, అసంయుక్తమగు

టచే మృతి నొందజాలదనియు కనుగొంటిమి. మృతిలేని జీవ మెట్లుండ గలదు? చావుబ్రదుకు లొకే నాణెముయొక్క ఇరు పక్షములే గదా. చావుకు పర్యాయపదమే బ్రదుకు, బ్రదుకుకు పర్యాయపదమే చావు. ఒక విధముగా గోచరించినప్పుడు దేనిని "బ్రదుకు" అందుమో, దానినే మఱొక విధముగా గోచరించి నప్పుడు "చావు" అందుము. అల పైకిలేచినప్పుడు జీవము, పల్లములో పడినప్పుడు మరణము. కావున మరణాతీతవస్తువు జీవా తీతముకూడ అనుట స్పష్టము. మన మొదటి నిశ్చితాభిప్రాయము (కంక్లూషన్)నిప్పుడు మరల జ్ఞప్తికి తెచ్చుకొనుడు. మానవుని ఆత్మ జగన్మయశక్తియొక్క, అనగా భగవంతునియొక్క అంశమే. అది చావుబ్రదుకుల కతీత మని ఇప్పుడు తేలినది. మీరు జన్మింప లేదు; మృతినొందజాలరు. అగుచో, మనము సర్వదా చూచు చుండు జననమరణముల కర్థమేమి? అవి శరీరమునకుమాత్రమే సంబంధించినవి. ఆత్మసర్వగతము కదా. అ దెట్లు? "ఇచ్చట ఇందఱు కూర్చుండియుండగా ఆత్మ సర్వగత మెట్లు కాగలదు" అని యడుగుదురా? నేనొక మాఱుప్రశ్న వేసెదను. నియమా తీతము, నిమిత్తత్వధర్మమున కతీతము అగుదానిని పరిచ్ఛిన్నము (హద్దులలో ఇమిడినది) గా ఏది చేయ గలదు? ఈ కాచ పాత్రము పరిచ్ఛిన్నము; సర్వగతము కాదు, పరిసరపదార్థరాశి యొక్క ఒత్తిడిచే అది విరివి కాజాలక ఆ రూపమునను న్నది. పరిసరవస్తువులు దానిని నియమించుచున్నవి గాన అది పరి చ్ఛిన్నము. తన్ను నియమించున దేదియు లేనిది, నియమాతీత మైనది, ఎట్లు పరిచ్ఛిన్నము కాగలదు? అట్టిది సర్వ గతమే కావలెను. మీ రీ లోకమం దంతటను ఉన్నారు. అట్లైనచో, నా జననమరణాది సంఘటనముల మాట యేమి? అది అజ్ఞాన ప్రసంగము: చిత్తవిభ్రమము. నీవు జన్మింపలేదు. మరణింపవు. నీ విప్పటికి జన్మింపలేదు. ఇకమీదట పునర్జన్మముగాని, జీవము గాని, శరీరధారణముగాని, మఱేదిగాని నీకు ఉండబోదు. వచ్చుట,

పోవుట అనగా నేమి? ఆ మాటలన్నియు అనాలోచితములు, అర్థరహితములు. మీరు సర్వగతులు. అగుచో, ఈ వచ్చుచు పోవుచు ఉన్న శ్లీల తోచుచున్నది? మన స్వనబడు ఈ సూక్ష్మ శరీరము మాఱుటచే కలుగు చిత్త విభ్రాంతి అది. ఆ మార్పు కలుగుచునే ఉండును. ఆకసము ముం దొక చిన్నమబ్బుతునుక చరించుచున్నది. అది కదలుచుపోగా పోగా, ఆకసము కదలుచున్న దను భ్రాంతి కలుగవచ్చును. చంద్రుని కడ్డముగా మబ్బు పోవుచున్నప్పుడు చంద్రుడు కదలుచున్నట్లు తోచుట లేదా? రైలులో పయనించునప్పుడు భూమి పరుగిడుచున్న దనుకొందుము. పడవలో పయనించునప్పుడు నీరు చరించుచున్న దనుకొందుము. నిజమునకు మీరు వచ్చుటలేదు, పోవుటలేదు. మీకు జన్మములు లేవు, పునర్జన్మములు లేవు. మీరు పరిపూర్ణులు, సర్వగతులు, నిమిత్తత్వమున కతీతులు, నిత్యముక్తులు. ఆ ప్రశ్నయే అప్రసక్తము, అర్థరహితదుష్ప్రసంగము. జన్మము లేనప్పుడు మరణమెట్లు సంభవింపగలదు?

ఇం కొక్క విషయమునుకూడ విచారించిన గాని మనము హేతుబద్ధమగు నిశ్చయమునకు రాజాలము. తత్త్వవిచారపరులు మధ్యేమార్గమున నిలిచిపోరాదు. భీతిలి శరణు వేడరాదు. మనము సర్వనియమముల కతీతులమే అయినచో, సర్వజ్ఞులముగను, నిత్యానందమయులముగను కూడ ఉండవలెను. జ్ఞాన మంతయు, శక్తి యంతయు, ఆనందమంతయు, మనలో నుండవలెను. ఔను, సత్యమే. జగత్తులో నీవు సర్వగతుడవును, సర్వజ్ఞుడవును అగు పురుషుడవే. కాని అట్టివారు అనేకు లుండగలరా? కోటాను కోట్ల సర్వగతులుండుట సాధ్యమా? అసంభవము; ఉండజాలరు. అగుచో, మన మందఱ మే మగుదుము? మీరెల్లరు నొక్కరే. ఒకే ఆత్మ కలదు. ఆ ఒక్క ఆత్మ మీరే. ఆత్మ యనునది ఈ స్వల్పపరిమితప్రకృతి వెనుక నిలిచియున్నది. ఒక్క వస్తువు మాత్రమే కలదు. ఒకే సత్త. అది నిత్యానందము, సర్వగతము,

సర్వజ్ఞము, అజము, అమరము. "అతని కట్టడిచేతనే ఆకసము విశాలవ్యాప్తమై యున్నది; గాలి వీచుచున్నది; ఎండ కాయుచున్నది; అందఱును జీవించుచున్నారు. ప్రకృతిలోని సత్యమతడే. అతడు నీ ఆత్మకు ఆత్మ. అంతేకాదు; నీవతడవే. నీవును అతడును అభిన్నులు". ఇరువు రున్నచోటనెల్ల భయము కలదు, అపాయము కలదు, సంఘర్షణ కలదు, కలహము కలదు. అంతయు ఆ ఒక్కడే అయినప్పుడు, ఎవరిని ద్వేషించుట, ఎవరితో కలహించుట? అంతయు అతడే అయినప్పుడు ఎవరితో మీరు పోరాడగలరు? ఇది జీవముయొక్క యథార్థతత్త్వమును, అస్తిత్వముయొక్క యథార్థతత్త్వమును వివరించుచున్నది. ఇదియే పరిపూర్ణత, ఇదియే దైవము. నానాత్వము కనిపించుచున్నంతవఱకు మీరు భ్రాంతిలో నున్నారు. "ఈ నానాత్వమయజగత్తులో ఆ కేవలుని, ఈ వికారమయజగత్తులో ఆ నిర్వికారుని, తన ఆత్మస్థునిగ, తన ఆత్మగనే, ఎవడు చూచునో, వాడు ముక్తుడు, వాడు అదృష్టశాలి, వాడు గమ్యమును చేరినాడు." కావున నీవు అతడవే అని ఎఱుగుము. నీవే జగదీశ్వరుడవు—"తత్త్వమసి." నేను పురుషుడను, నేను స్త్రీని; ఆరోగ్యవంతుడను, రోగిని; బలవంతుడను, బలహీనుడను; ద్వేషించుచున్నాను, ప్రేమించుచున్నాను; నాకు కొంచెము శక్తికలదు: ఇట్టి భావములు కేవల భ్రాంతిజనితములు. వానిని పాఱద్రోలుము. నీ బలహీనతకు కారణమేమి? నీ భయమునకు కారణ మేమి? జగత్తులో నుండు వాడవు నీ వొక్కడవే. నిన్ను భయపఱచున దేమి కలదు? కావున లేచి నిలువుము. ముక్తుడవుకమ్ము. బలహీనత కల్పించు తలపులు, పలుకులుతప్ప లోకములో వేఱు కీడేదియు లేదని తెలియుము. బలహీనతను, భీతిని, కల్పించుదానినే కీడుగా భావించి అట్టి దానిని చేరనీయ కుండుము. నిన్నేమి భయపఱుపగలదు? సూర్యబింబములు నేలపైడుల్లిపడినను, చంద్రబింబములు తుత్తునియలై ధూళ్యవలుంఠితములైనను, గ్రహమండలము లన్నియు విధ్వం

సముతెనను, నీకేమి ? మహాశిలవలె నిశ్చలుడవై నిలువుము. ఆత్మవు, జగదీశ్వరుడవు. "నేను అఖండ త్తను, అఖండచిత్తును, అఖండానందమను, నేనే అతడను" అని పల్కుము. బోనును తుత్తినియలొనరించి యీవలకు లంఘించు సింహామువలె నీ బంధమును త్రెంచుకొని శాశ్వతముక్తినందుము. నీ వేల భీతిలు చున్నావు ? వెనుకంజవేయుచున్నా వేల ? అజ్ఞానము, భ్రాంతి తక్క మఱేమియు నిన్ను బంధింపజాలదు. నీవు శుద్ధుడవు, నిత్యానందమూర్తివి.

మీరు పాపు లని పల్కువారు మూఢులు, అవివేకులు. వారిమాట నమ్మి మీ రొక మూలలో కూర్చుండి విలపింతురు. మిమ్ము పాపు లనుట అవివేకము, దుర్మార్గము, కేవలము మోసము. మీ రందఱును భగవత్స్వరూపులే. భగవంతునిచూచి మానవు డని పల్కకుడు. ధీరులైతిరేని, ఆ ఆధారమున నిలువుడు. మీ జీవిత మంతయు తదనుకూలముగా నిర్మించుకొనుడు. ఎవ్వరైన మీ గొంతుకోసిరేని వలదనకుడు. మీరే కదా దానిని కోసికొనుచున్నది ? నిఱుపేద కొకనికి తోడ్పడితిరేని, అందుకై ఏ మాత్రమును గర్వింపకుడు. మీ కది ఆరాధనము ; గర్వకారణము కాదు. జగత్తంతయు మీరే కదా ? మీరు కానివా డెచ్చటనైన ఒక్కడు కలడా ? నీవు జగదాత్మవు, నీవే సూర్యుడవు, నీవే చంద్రుడవు, నీవే నక్షత్రకోటివి. అంతటను ప్రకాశించునది నీవే. జగత్తంతయు నీవే. ఎవరిని ద్వేషింతువు ? ఎవరితో కలహింతువు ? కావున నీవే అతడ వని ఎఱిగి, నీ జీవితమంతయు త దనుగుణముగా ఏర్పఱచుకొనుము. ఇది ఎఱిగి జీవితము ని ర్మేర్ప ఱచుకొనువాడు అంధకారములో నెన్నడును అల్లాడడు.



# ఆత్మ

## (అమెరికాలోని ఉపన్యాసము)

మీలో అనేకులు మోక్షమూలరు (మాక్సు ముల్లరు) గారు వ్రాసిన ''వేదాంతోపన్యాసత్రయము''ను జదివి యుందురు. ఆ వేదాంతశాస్త్రమునుగూర్చియే జర్మనుభాషలో ఆచార్య డ్యూసేనుగారు రచించిన గ్రంథమును మీలో కొందఱు చదివి యుందురు. హిందువుల మతాదర్శములనుగూర్చి పాశ్చాత్యదేశములలో వ్రాయబడు వ్రాతలలోను, ఉపదేశింపబడు బోధలలోను, హిందువుల మతాభిప్రాయములందలి సిద్ధాంత మొకటిమాత్రము ఎక్కువగా ప్రస్తావనబడయుచున్నది. అది 'జీవేశ్వరులు అభిన్నము' అను పక్షపువారియొక్క సిద్ధాంతమగు ''అద్వైతవాదము''. ఆ ఒక్కసిద్ధాంతమునందే వేదములయొక్క బోధలన్నియును ఇమిడియున్నట్లు భావింపబడుటయు గలదు. కాని హిందువుల సిద్ధాంతములు చాలగలవు. ఇతరసిద్ధాంతముల నవలంబించు వారితో పోల్చిచూచినయెడల, ఈ అద్వైతవాదుల సంఖ్య అల్పమన నోపును. బహుపురాతన కాలమునుండియు భారతదేశమున అనేక మతసంప్రదాయములు ప్రచారములోనున్నవి. ఫలాని సంప్రదాయమువారు ఫలాని సిద్ధాంతములను అంగీకరింప వలయును అని నిర్ధారణచేయుటకై నిర్ణయింపబడిన, లేక ఆమోదింపబడిన, గురుపీఠముగాని, సంఘముగాని, హిందూదేశమున నెన్నడును నుండియుండలేదు. కావున ప్రజలు తమతమ సంప్రదాయములను తామే నిర్ణయించుకొనుటకును, తమతమ సిద్ధాంతములను తామే ఏర్పఱచుకొనుటకును, తమతమ శాఖలను తామే నిర్మించుకొనుటకును, పూర్ణస్వేచ్ఛగలవారై యుండిరి. అందువలననే భారతదేశము పూర్వమునుండియు నానామతసంప్రదాయములతో నిండియుండుట సంభవించినది. ఈనాడు భారతదేశ

మున ఎన్నివందల మతసంప్రదాయములున్నవో చెప్పలేము. క్రొత్తవనేకము ప్రతిసంవత్సరమున తలయెత్తుచుండును ; భారత దేశమున జూపట్టు మతప్రచారమునకు అంతమే కానరాదు.

వివిధములగు ఈ సంప్రదాయములను ఆస్తికములనియు నాస్తికములనియు మొదట రెండు ముఖ్యభాగములుగ విభజింపవచ్చును. హిందూమతమునకు మూలగ్రంథములగు వేదములను సనాతన ధర్మప్రతిపాదకములని అంగీకరించు వానిని ఆస్తికములనియు, వేదములను నిరాకరించి యితరప్రమాణములపై నాధారపడువానిని నాస్తికము* లనియు భారతదేశమున పేర్కొందురు. ఈ కాలమున నుండు నాస్తిక హైందవ సంప్రదాయపరులలో జైనులును బౌద్ధులును ప్రధానులైయున్నారు. ఆస్తికమతములలోను గూడ కొందఱు వేదములు తర్కవిమర్శనమునకు అతీతములగు ప్రమాణములని వాదించువారును, మఱికొందఱు వానిని తర్కవిమర్శనమునకు నిలుచునంతవఱకే అంగీకరించి, తదితర భాగములను త్రోసివేయవలయునని వాదించువారును కలరు.

ఆస్తిక శాఖలలో సాంఖ్యులు, నైయ్యాయికులు, మీమాంసకులు అను మూడు తెగలలో మొదటి ఇరువురు తత్త్వదార్శనికవాదులైనను, ప్రత్యేకశాఖా సంప్రదాయములను నెలకొలుపలేదు. ఉత్తర మీమాంసకులు లేక వేదాంతులు అనబడు శాఖవారే యిప్పుడు భారతదేశము నాక్రమించియున్నారని చెప్పవలెను. వారి సిద్ధాంతమునే వేదాంత మందురు. హైందవ తత్త్వశాస్త్రము (దర్శనము) లన్నియు వేదముల తుదిభాగము (వేదాంతము) లగు ఉపనిషత్తులనుండియే ఉద్భవములైనవి. అయినను ఇతరప్రమాణముల గైకొనక, యీ వేదాంతముపైననే ఆధారపడి తమ ఉపాసనావిధులను, తత్త్వశాస్త్రమును నిర్మించు

* ఈ విభజనలో ''నాస్తిక'' శబ్దమునకు ''ఈశ్వరుని యునికి నమ్మని'' అని అర్థము కాదు.

కొనబూనిన అద్వైతులే వేదాంతులను పేరును తమ ప్రత్యేక నామముగ గైకొనియున్నారు. కాలక్రమమున వేదాంతము విజయవంతమైనది. భారతదేశమున నిప్పుడుగల సంప్రదాయములన్నియు, వేదాంతమతశాఖలలో దేనినో యొకదాని ననుసరించునవే. అయినను ఈ సంప్రదాయముల కేకీభావము లేదు.

వేదాంతులలో మూడు ముఖ్య మతశాఖలవారుకలరు. ఒక్కవిషయమున వీరంద ఱేకీభవింతురు. అందఱును భగవంతుడు కలడని విశ్వసింతురు. అందఱును వేదములు ఈశ్వరప్రోక్తములని నమ్మెదురు. కాని క్రైస్తవులును మహమ్మదీయులును నమ్మెతీరున కాదు. వీరియర్థము వేఱు. వేదములు భగవద్విజ్ఞానమును ప్రకటించుననియు, భగవంతుడు సనాతనుడగుటచే వాని విజ్ఞానము కూడ అట్లే సనాతనము గాన వేదములును సనాతనములనియు వీరియభిప్రాయము. మఱొక విషయమునను వీరికి ఐకమత్యముకలదు. సృష్టి చక్రాకృతిని (ఇన్ సైకిల్స్) నడుచుననుటలో ఏకీభవింతురు. ఈ సృష్టియంతయు ఒకప్పుడు దృశ్యమగుచు మఱొకప్పుడు అదృశ్యమగుచు వచ్చును. సృష్టి యొకప్పుడు ఆవిష్కృతమై (ప్రొజెక్టెడ్) క్రమక్రమముగా స్థూలతరాకృతులను దాల్చుచుబోయి, లెక్కకు మీరిన కాలమునకు పిమ్మట, మరల సూక్ష్మతర రూపముల నందుచు విచ్ఛిన్నమై యడగిపోవును. అంతట కొంత విరామకాల మేర్పడును. ఆ పిమ్మట, తిరిగి దృశ్యరూపము దాల్చుట కారంభించి, పూర్వపుతీరుననే వర్తింపసాగును. ప్రకృతి శాస్త్రజ్ఞులచే 'ఈథరు' అని పిలువబడు దానిని బోలునట్టి 'ఆకాశ' మను ద్రవ్యమొకటియు, 'ప్రాణ' మను శక్తి యొకటియు, కలవని వారు చెప్పెదురు. ఈ "ప్రాణము" యొక్క స్పందనము (వైబ్రేషన్ = చలనము) వలన ఈ జగమంతయు కల్పితమగుచున్న దందురు. కల్పాంతమున ఈ సృష్టియంతయు క్రమక్రమముగ సూక్ష్మతరరూపముల దాల్చి తాల్చి ఆకాశమున కలిసిపోవును. ఆకాశమును చూచుటకుగాని స్పృశించుటకుగాని శక్యము

కాదు. కాని దానినుండియే సమస్తమును సృష్టింపబడుచున్నది. మనకు ప్రకృతిలో గాన్పించు గురుత్వాకర్షణము (గ్రావిటేషన్), వికర్షణము (రిపల్షన్) ఆలోచనాగతి, భావగతి, నాడీచలనము మున్నగు వేర్వేఱు శక్తులన్నియు ప్రాణశక్తియందు గలిసిపోవును. అప్పుడు ప్రాణశక్తియొక్క స్పందనము నిలిచిపోవును. తదనంతర కల్పారంభ సమయమువఱకును అదట్లు నిష్పందనస్థితి యందుండును. తరువాత ఆ ప్రాణశక్తి మరల స్పందింప నారంభించును. క్రమక్రమముగా దాని స్పందనము ఆకాశమునందు ప్రతిఫలింప నాయా రూపములన్నియు వెనుకటి తీరున వెలువడును; అనగా ఆవిష్కృతిని పొందును.

మొదట మీకు నేను తెలుపనెంచినది ద్వైతసిద్ధాంతమును గుఱించి. దీని ప్రకారము ఈ జగమును సృష్టించి దీనిపాలనకర్తయై వెలయు దేవుడు ప్రకృతికిని జీవునికిని ఎల్లప్పుడును వేఱుగనే యుండును. దేవుడు నిత్యుడు; ప్రకృతియు నిత్యపదార్థమే; జీవులును నిత్యులే. ఇందు ప్రకృతియు జీవులును వికారముల బొందుచు రూపాంతరముల దాల్చుచుందురు. దేవుడు మార్పుల నందడు. దేవుడు సగుణుడు; అనగా ఆయనయందు గుణములు కలవు. అట్లనుటచేత వాని కొక శరీరము నున్నదని భావింప తగదు. ఆయన మానవలక్షణములతో నొప్పును; అనగా, కృపాళుడు, న్యాయశీలుడు, శక్తిమంతుడు, స్తోత్రార్హుడు, ప్రేమాస్పదుడు, ప్రేమజూపువాడు, అని వర్ణించుటకు దగినవాడు. ఇంతేల, ఆయన 'నరదైవతము' అననొప్పును. కాని ఎంతటి నరవరునితో బోల్చినను ఇంకను ఘనతరుడై వెలుంగును. నరులందుగల దుర్గుణము లేవియు ఆయనయం దుండవు. వా రాయనను 'అనంతకల్యాణ గుణసాంద్రుడు' అని వర్ణింతురు. ద్రవ్యశూన్యముగ సృష్టినిజేయ వీలుకాదు గనుక ప్రకృతి యను మూలద్రవ్యమునుండి ఆయన జగమును నిర్మాణము చేయుచుండును.

పరమాణువాదు (ఆటొమిస్టు స్) లనబడు ద్వైతులు కొందఱుకలరు. వీరు వేదాంతులుకారు. ప్రకృతి అనంతసంఖ్యాకములగు పరమాణువుల సంఘాతమనియు, భగవత్సంకల్పము వానిపైన ప్రతిఫలింపగనే సృష్టి ప్రారంభమగుననియు వీరి సిద్ధాంతము. వేదాంతులగు ద్వైతులు వీరివాదము నంగీకరింపక, పరమాణువాదము తర్కవిమర్శనకు నిలుచునది కాదందురు. పరమాణువులు అనునవి క్షేత్రగణితమందలి బిందువుల (పాయింట్స్) బోలు, విభజింప శక్యముగాని, పరిమాణశూన్యములగు చిన్న నలుసులు. ఇట్లు ఖండింప వీలుగాని, పరిమాణములేని, నలుసులను అనంతముగా దీసికొని, కూర్చినప్పటికిని అట్లే యుండునుగదా! అవిభాజ్యవస్తువులు ఒక్క విభాజ్యవస్తువుగా గూడజాలునా? సున్నల నెన్నింటిని ఒండొంటితో జేర్చినను సంఖ్యాపరిమాణ మేర్పడునా? అటులనే అంతర్భాగములుగాని, పరిమాణముగాని, లేని పరమాణు సముదాయముతో జగత్తును నిర్మాణము చేయుట అసంభవము. కావున వేద ప్రామాణికులగు ద్వైతులు అవ్యక్తమై, అవర్ణనీయమై, పరగు ప్రకృతి అనునది కలదనియు దానితో భగవంతుడు విశ్వసృష్టిని చేయుచుండుననియు వాదింతురు. భారతీయులలో గరిష్ఠసంఖ్యాకులు ద్వైతులు. సామాన్యముగా మానవుని స్వభావము ద్వైతభావమునుమించి పైకి పోజాలదు. పుడమినిగల జనులలో నూటికి తొంబది తొమ్మండుగురికి, మతమేమైన కలదందుమేని అది ద్వైతమతమే! యూరపునందును, ఆసియా పశ్చిమభాగమునందును గల మతములన్నియు ద్వైతసంప్రదాయకములే. అటులగాక తప్పదు. సామాన్య నరుడు స్థూలాకృతిలేని దేనినిగాని భావన చేయజాలడు. అట్టివాడు తనబుద్ధికి గ్రాహ్యమగుదానినే అంటిపట్టుకొనియుండ నభిలషించును. అనగా ఉన్నత పారమార్థిక భావములను సయితము, తానున్న క్షేత్రమునకుదింపి, ఊహ చేయును. సూక్ష్మతమ భావములను సయితము స్థూలములుగ నొనర్చినప్పుడే అతడేమేని గ్రహింపజాలుట. ప్రపంచమున నెచ్చోట

నైనను, సామాన్యునికిగల మత మిటువంటిదే. ఒక రాజో, మహా దైశ్వర్యాధికార సంపన్నుడగు చక్రవర్తియో మైు తమకు దూర ముగా నుండువానినిగా దేవుని భావనచేసి వారు విశ్వసింతురు. అయినను వా రాయనను ఈ లోకమందలి చక్రవర్తు లందఱికంటె పవిత్రునిగ నొనర్తురు, అన్ని సద్గుణములను వాని కారోపింతురు. దుర్గుణముల నన్నింటిని వానినుండి దూరముచేయుదురు! కాని కీడులేని మేలు ఉండగలుగునా? చీకటి అను భావము నెఱుగనిచో వెలుగును భావించుట శక్యమా?

అనంతకళ్యాణగుణసాంద్రుడును, న్యాయశీలుడును, కృపామయుడును అగు భగవంతుని పరిపాలనమున నుండు ప్రపంచమున ఇన్ని చెడుగు లెట్లు సంఘటిల్లినవి అను ముఖ్య శంక ద్వైత మతముల కెల్ల బాధకమైయున్నది. అన్ని ద్వైతమతములందును ఈ శంక తలచూపినది. అయినను దీనికి సమాధానము చెప్పుకొఱకు హిందువులు 'సైతాను' అను పిశాచము నొకదానిని సృష్టిచేయలేదు, ఆ దోషమునంతను నరునిపై వేయుటలో హిందువులందఱును ఏకీభవించుచున్నారు. అది వారికి సహజ కార్యమయ్యెను. ఎట్లన, శూన్యమునుండి లు సృష్టియగుటను వారు విశ్వసింపరని యింతకుపూర్వమే తెలిపియున్నాను. మన మెప్పుడును భవితవ్యమును మన యిచ్ఛవచ్చినట్లు నిర్ణయముచేసికొని అట్లు జీవించుచున్నాముగదా. ప్రతివాడును ప్రతిదినమును మఱునాటి స్థితిని నిర్మాణముచేసికొన యత్నించుచుండును. రేపటిగతి నేడు నిర్ణయించుకొనుచున్నాము. ఎల్లుండి గతిని రేపు నిర్ధారణ జేసికొందుము. ఇట్లు సాగిపోవుచుండును. ఈ వాదనను వెనుకకు మరలించి భూతకాలమునకు అను వర్తింపజేయుటయు సమంజసమే యగును. మన భవిష్యత్తును మన కర్మలచేత నిర్ధరించునెడల, ఈ సూత్రమును భూతకాలమునకుమాత్రము ఎందు కనువర్తింపదగదు? అంతులేని ఒక గొలుసునందు కొన్నిరకముల కడియ

ముల వరుస ఒక నిర్ణీతక్రమమున మాటిమాటికి వచ్చుచుండునని మనకు తెలిసినయెడల, వానిలో నొక కడియముల వరుసను గ్రహించితిమేని, గొలుసు స్వభావమును అంతటిని గ్రహింప గలుగుదుము. అదేతీరున, అనంతముగా సాగివచ్చు కాలమునందు కొంతభాగమును వేఱుచేసి, ఆ భాగమును పరిశోధించి, దాని తత్త్వమును నిర్ధారణ చేయజాలుదుమేని, ప్రకృతి యెల్లెడల ఒకేతీరున నడుచునదైనయెడల, ఆ నిర్ధారణయే, అనంతమై వచ్చు 'కాలము' అనెడు గొలుసునకును వినియోగించును. కొంత మితమగు కాలములో మనగతిని మనము నిర్ణయించుకొనజాలుట సత్యమగునేని, మనము సర్వత్ర చూచుచున్నరీతిని ప్రతిదానికి నొక కారణ ముండితీరవలయు నెడలను, మన యిప్పటిదశ మన పూర్వకర్మసమష్టియొక్క ఫలమే యై యుండవలయు ననుట తథ్యము. కావున నరునిగతిని నిర్ణయించుటకు వేఱొకడు ఉండ వలసిన ఆవశ్యకత కాన్పింపదు. ప్రపంచములో గోచరించు కీడు లకు మనమే కర్తలము. అన్యు లెవరును గారు. ఈ అహితముల నన్నింటిని మనమే తెచ్చిపెట్టుకొన్నాము. దుష్కార్యముల ఫల ముగా దుఃఖము ననుభవించుటను ఎల్లెడల మనము చూచుచునే యున్నాము. కావున ప్రపంచమున ఇప్పుడు కాన్పించు దుఃఖ మున చాలభాగము, నరుని పూర్వదుష్కర్మఫలమే యై యుండితీర వలయును. ఈ సిద్ధాంతము ననుసరించి నరునిదే బాధ్యత. భగవంతుని దోషములేదు. అనంత కృపానిధియగు జగజ్జనకుడు నింద్యుడు కాజాలడు. "మనము నాటిన విత్తనపు ఫలమును మన మనుభవించుచున్నాము."

ప్రతి జీవాత్మయు తుట్టతుదకు మోక్షమును పొంది తీర వలయుననుట ద్వైతమతమునందలి మఱొక విశిష్ట ధర్మసూత్రము. ఒక్క జీవాత్మయు త్రోసివేయబడదు. భిన్న భిన్నావస్థల ననుభ వించుచు, వివిధగతుల సుఖదుఃఖముల గుడుచుచు, ప్రతిజీవుడును తుదకు తప్పక ముక్తుడు గావలసినదే. సరే, దేనినుండి విముక్తి

జగుట? ఈ జగత్తునుండి జీవులందరు విడుదల పొందవలయుననుట సకల హిందూసంప్రదాయములవారును సామాన్యముగ నంగీకరించు భావమై యున్నది. దృశ్యమై, అనుభోక్తమై పరగు ఈ స్థూలజగముగాని, కేవల భావకల్పితమగు వేఱొక జగముగాని, శుభాశుభముల సమ్మిళితమే కావున, ఇందేదియు నిరుపద్రవముగాని, సత్యముగాని కాజాలదు. ద్వైతుల సిద్ధాంతము ప్రకారము జగత్తున కతీతమై కేవలానందమయమును, కేవల సుఖప్రదమును నైన ప్రదేశ మొకటికలదు; అచ్చట జేరినపిమ్మట నిక పుట్టుట గిట్టుటలును జన్మ జన్మాంతరముల యగత్యమును లేకుండ పోవును. ఈ భావన ద్వైతుల కత్యంత ప్రియమైనది. అచ్చోట రోగము లుండవు; చావనున దే యుండదు. నిరంతరానందము చేకూరును. అచ్చటివారు సతతము భగవత్సన్నిధానముననుండి, ఆ సాన్నిధ్య సుఖము ననుభవించుచుందురు. క్షుద్రతమ కీటకము మొదలు అత్యుత్తములగు గంధర్వులు దేవతలు మున్నగువారందఱును, దుఃఖమనునది ఎన్నడును ఘటిల్లజాలని, ఆ పరలోకమున కెన్నడో చేరితీరవలయునని వీరి విశ్వాసము. కాని మన యీ లోకమెన్నడు నంతరింపబోదు. శాశ్వతముగా సాగుచుండవలసినదే. తరంగ రూపమున క్రిందికి అణగుచు పైకి లేచుచు మాత్ర ముండును. కల్పాంతరములు గడచుచున్నను, దీనికంతము లేదు. తరింపవలసినట్టియు, పరిపూర్ణత పొందవలసినట్టియు, జీవులసంఖ్య అనంతముగ నున్నది. కొన్ని జీవులు వృక్షములం దున్నవి. కొన్ని పశువులం దున్నవి. కొన్ని నరులం దున్నవి. కొన్ని దేవతలం దున్నవి. అవన్నియు, ఉత్తమోత్తమ దేవతలం దున్నవి సయితము, అపూర్ణములే; అన్నియు బద్ధజీవులే! ఈ బంధమననేమి? జనన మరణము లందుచుండవలసిన నిర్బంధమే. ఉత్తమదేవతలలో సయితము ప్రతియొకరును మరణముపాల బడక తీరదు. 'దేవతలు' అనగా నేమి? కొన్ని ఉత్తమదశలను, లేక అధికారపదవులను, పొందినవారు అని యర్థము. ఉదాహరణజూడుడు. దేవరాజగు

ఇంద్రు డనగా ఒకానొక ఉద్యోగపదవియందున్న వాడని యర్థము. అత్యుచ్చదశను సాధించిన యొకానొక జీవుడు ఈ కల్పమున ఆ యుద్యోగమును బడసెను; ఈ కల్పాంతమున నతడు తిరిగి నరుడై పుట్టి భూలోకమునకు రావలసినవాడే. ఈ కల్పమునం దత్యంతము యోగ్యుడై వర్తించు మఱొకడు పైకిబోయి, రానున్న కల్పమునం దా యింద్రపదము నధిష్ఠించును. దేవతలందఱిస్థితియు నిట్టిదే. ఆ యుద్యోగపదవులు వంతుల ప్రకారము, కోట్లకొలది జీవాత్మలనుభవించి, తమ యుద్యోగపు గడువు చెల్లిపోగనే క్రిందికి వచ్చి, నరులుగా పుట్టుదురు. స్వర్గలోకముల జేరవలయుననియో, తోడిమానవుల స్తోత్రముల బడయవలయుననియో, ఆశించి సత్కార్యములు చేయుచు, పరోపకారపారీణులై ఈ లోకమున జీవించినవారు, మరణానంతరము తమ సత్కర్మలఫలముగా దేవతలగుదురు. కాని యది మోక్షముకాదు. ఫలాపేక్ష యున్నంతవఱకు మోక్షము చేకుఱబోదు. నరుడు దేనిని కోరుకొనునో, భగవంతుడు దానిని వాని కొసగును. నరు లధికారములను కోరుకొందురు; ప్రతిష్ఠలను కోరుకొందురు; దేవతలై సౌఖ్యముల బడయ గోరుదురు. వారి కోరిక లన్నియు ఫలించును. కాని కర్మఫల మేదియు శాశ్వతముకాదు. కొంత గడువు చెల్లిన పిమ్మట ఆ ఫలము ముగియును. యుగములు గడుచుగాక; ఆ కాలపరిమితి యనంతరమైనను ఫలానుభవము తుదముట్టవలసినదే; దేవతలును దిగివచ్చి మరల నరులై పుట్టి, మోక్షసాధనకై మఱొక అవకాశము నందుదురు. పశువులును ఉన్నతికివచ్చి నరులుగను, దేవతలుగను జన్మింపవచ్చును. అవి తిరిగి నరులుగనో పశువులుగనో పుట్టుటయు ఘటిల్లనగును. వాని భోగాసక్తియు, జీవనపిపాసయు, అహంకృతియు, మమకారబంధనమును వదలిపోవువఱకును అవి యటుల పునరావృత్తి నందుచుండవలసినదే. ఈ అహంకార మమకారములే, నేను నాది యను ఈ భావములే, లోకమందలి అనర్థముల కన్నింటికిని మూలము. 'ఈ సీ బిడ్డ

నీయదేనా?' అని మీరొక ద్వైతవాదిని ప్రశ్నించుచో, "కాదు భగవంతునిది. నాసంపదయు నాది కాదు; భగవంతునిదే" అని ప్రత్యుత్తర మిచ్చును. ఇట్లు సర్వమును భగవంతుని దను భావన నతడు సాధన చేయును.

భారతదేశమందలి ద్వైతమతస్థులు శాకాహారనియమమును నిష్ఠతో పాటింతురు. జీవహింసకూడదని శ్రద్ధతో బోధింతురు. అయినను ఈ విషయమున బౌద్ధుల యభిప్రాయమునకును వీరి భావనకును చాల భేదము కలదు. 'ఏజంతువునుగాని చంపకూడదని నీవేల బోధింతువు?' అని బౌద్ధు నొకని ప్రశ్నించితి రేని, దేని ప్రాణమునుగాని తీయుటకు మన కధికారము లేదని ఆత డనును. సరే; 'నీవేల జంతువధ చేయవు?' అని ద్వైతవాదినడిగితి రేని, 'అది భగవంతుని దగుటచేత' నని యతడు చెప్పును. ఇట్లు "నేను నాది" యను పదములు భగవంతుని పట్లమాత్రమే చెల్లదగునని ద్వైతులు పలుకుదురు. 'నేను' అనగలవాడు భగవంతు డొక్కడే. సర్వమును అతనిది. "నేను, నాది" అను భావనలు తొలగిపోవు దశకు నరుడువచ్చినప్పుడు, అనగా సర్వమును ఆ సర్వేశ్వరున కర్పణము చేయబడినప్పుడు, సకలమును ప్రేమింపగలిగి ప్రతిఫలమును అపేక్షింపకుండ ఒకానొక జంతువు ప్రాణరక్షణార్థము తన ప్రాణమును సయితము అర్పణము గావింప సంసిద్ధుడగు తటిని, వానిహృదయము పవిత్రమగును. అటుల హృదయము పవిత్రమయినప్పుడు ఆ హృదయమున భగవద్భక్తి ఉదయమగును. భగవంతుడొక్కడే ప్రతి జీవాత్మను ఆకర్షింపగల ఏకైక కేంద్రము. "సూదిని మట్టితో కప్పిపెట్టితిరా, సూదంటురాయి దాని నాకర్షింపదు; కాని ఆ మట్టిని తొలగించిన తోడ్తోడనే ఆకర్షింపజాలును" అని ద్వైతవాది పలుకుచుండును. భగవంతుడే సూదంటురాయి; జీవుడే సూది; దుష్కర్మలే దానిని కప్పిపెట్టు మన్ను. జీవాత్మ పరిశుభ్రత చెందిన తత్క్షణమే, అది భగవంతుని వైపునకు సహజముగనే ఆకర్షింపబడును. పిమ్మట నది శాశ్వత

ముగ భగవత్సాన్నిధ్యమున నిలిచిపోవును. కాని సదా వేఱైయే యుండును. సిద్ధాత్మలు తమ యిచ్ఛవచ్చిన రూపముల దాల్ప గల్గును. తమ కిచ్ఛగలిగినయెడల, సిద్ధాత్మలు నూరు శరీరముల ధరింపజాలును. అశరీరిగ నుండగోరు నెడల అటులను నుండజాలును. సిద్ధాత్మ దాదాపుగ సర్వశక్తిమంతమగును. సృష్టిగావించు నధికారము మాత్రము దానికుండదు. ఆ యధికారము భగవంతుని యందు మాత్రమే యుండును. ఎంత పరిపూర్ణుడయినను, వేఱొకడు జగత్పరిపాలన కర్మమును నిర్వహింపజాలడు. ఆ శక్తి భగవంతుని కొక్కనికే యుండును. కాని జీవాత్మలన్నియు సిద్ధిని పొందినప్పుడు శాశ్వతానందమును అనుభవించునవై, సంతత భగవత్సాన్నిధ్యమున నుండగలవు. ఇది ద్వైతుల సిద్ధాంతము.

ద్వైతులు ప్రవచించు భావ మింకొకటి కలదు. 'దేవా! నాకు దీని ననుగ్రహింపుము; దానిని ప్రసాదింపుము' అనుచు ప్రార్థనలను చేయుట వారికి గిట్టదు. అటుల కోరుకొనుట తగదని వారి అభిప్రాయము. ఐహికములగు వరములను కోరుకొనవలసి వచ్చునెడల, తక్కువవారినిచేరి వేడుకొనవలయును. అశాశ్వత ఫలములకై ప్రార్థించునెడల, సామాన్య దేవతలనో, గంధర్వులనో, సిద్ధపురుషులనో గూర్చి, అటువంటి ప్రార్థనలను కావింపవచ్చును. కాని పరమేశ్వరునియెడల కేవలభక్తిమాత్రమే చూపవలసి యుండును. "దేవా! నాకు దీనినొసగుము, దాని నిమ్ము" అని భగవంతుని వేడుట దైవదూషణయగును. ద్వైతులసిద్ధాంతము ప్రకారము, దేవతలలో నొకరినిగూర్చి ప్రార్థించినచో, నరుడు, తన కామ్యార్థముల నెప్పుడో యొకప్పుడు పొందజాలును. కాని మోక్షమును కోరు నతడు భగవత్సేవ చేయవలయును. భారత దేశమున సామాన్యప్రజల మత మిదియే.

వేదాంత తత్త్వముయొక్క యథార్థరూపము విశిష్టాద్వైతు లనబడువారితో ప్రారంభ మగుచున్నది. కార్యము కార

ణమునుండి యెన్నడును భిన్నముకాదు; కార్యమనునది కారణమే వేఱొకరూపము దాల్చుటచేత నేర్పడుచున్నదని వీరివాదము. జగత్తు కార్యము, ఈశ్వరుడు కారణము. కాన జగత్తును, ఈశ్వరుడును, ఏకమే యైయుండవలయును; భిన్నత్వ ముండజాలదు. ఈ జగత్తునకు ఈశ్వరుడే నిమిత్త కారణమును ఉపాదాన కారణమును అను ప్రతిపాదనతో వారి సిద్ధాంతము ప్రారంభమగుచున్నది. బ్రహ్మమే సృష్టికర్త; మఱియు ఆ బ్రహ్మమే ఈ విశ్వమంతయు ఆవిష్కృతి పొందుటకు (వెలువడుటకు) మూలకారణమగు ప్రధానము. 'క్రియేషన్' అను మీ ఆంగ్ల పదమునకు సరియైన పర్యాయ పదము సంస్కృత భాషయందు లేదు. 'క్రియేషన్' అనగా శూన్యమునుండి కల్పింపబడుటయని పాశ్చాత్త్యుల విశ్వాసము. సృష్టి ఆ తీరున జరుగునను సిద్ధాంతము నంగీకరించు తెగవా రెవరును భారతదేశమున ఇప్పుడు లేరు. ఇట్టి విశ్వాసముగల కొందఱు పూర్వమెన్నడో యుండిరటగాని త్వరలోనే వారి నోరు కట్టువడెను. అటువంటి విశ్వాసము గలవారి సంప్రదాయ మేదియు నా కిప్పుడు కాన్పించుట లేదు. సృష్టిశబ్దమునకు మాయర్థము అంతకు ముందున్న వస్తువునే వెలికి ఆవిష్కరించుట. విశిష్టాద్వైతమతము ప్రకారము విశ్వమంతయు బ్రహ్మమేయగును. ఈ జగత్తునకు ఉపాదాన కారణము ఆయనయే. 'సాలెపురుగు గూడు నల్లుకొను దారమంతయు దాని లోపలనుండి వెలువడు వడువున బ్రహ్మమునుండి యీ విశ్వమంతయు ఆవిష్కృతమగుచున్నది' అని వేదమునందు పఠించుచున్నాము.

కార్యము కారణముయొక్క రూపాంతరమే అగునెడల ఒక శంక బయలుదేఱును: అజడమగునట్టియు అఖండజ్ఞాన స్వరూపమగునట్టియు బ్రహ్మమునుండి జడమును నిస్తేజమును మూఢము నగు జగత్తు పుట్టు టెట్లు? కారణము స్వచ్ఛమును పరిపూర్ణమునై యుండగా, కార్యము కేవలము తద్భిన్నముగా నెట్లుండగలదు? దీనికి విశిష్టాద్వైతులు చెప్పు పరిహారమేమి? వారి

నొక విచిత్రసిద్ధాంతము. బ్రహ్మము, ప్రకృతి, జీవుడు, అను మూడును ఒకే సత్త. ఇందు బ్రహ్మము ఆత్మ యనియు, ప్రకృతియు జీవులును ఆ యాత్మకు శరీరమనియు చెప్పవచ్చునని వారి సిద్ధాంతము. నా కొక శరీరమును ఆత్మయు నున్నటుల, ఈ యఖిలవిశ్వమును, సర్వజీవాత్మలును, బ్రహ్మమునకు శరీరము కాగా, తాను ఆత్మలన్నిటికి పరమాత్మయై యొప్పుచున్నాడు. అనగా, బ్రహ్మమే విశ్వమునకు ఉపాదానకారణము. శరీరము మారవచ్చును. యౌవనము, వృద్ధాప్యము, బలము, శోషణము అను అవస్థలు దానికి కలుగవచ్చును. అయినను ఇవేవియు ఆత్మ నంటవు. ఈ శరీరముల ద్వారమున సదా ప్రకాశించుచు, శాశ్వత సత్తాకరూపమున ఆత్మ యథాస్థితిని నిలిచియుండునదే. శరీరములు రావచ్చును, పోవచ్చును. ఆత్మమాత్రము మారదు. అటులనే విశ్వమంతయు భగవంతునకు (బ్రహ్మమునకు) శరీరము. ఈ యర్థమున అది బ్రహ్మమే. కాని విశ్వమున సంఘటిలు వికారములు బ్రహ్మము నంటవు. ఈ ద్రవ్యరాశితో నీశ్వరుడు విశ్వమును రచించును. కల్పాంతమున వాని యీ శరీరము సూక్ష్మతరావస్థనుబొంది సంకోచము నందును. వేఱొక కల్పారంభమున అది మరల వ్యాకోచమును పొందును. అప్పుడు అందుండి యీ లోకములన్నియు పుట్టును.

ద్వైతులును విశిష్టాద్వైతులునుగూడ, ఆత్మ సహజముగా పవిత్రమైనదనియు, తన కర్మచేతనే మలినమగుచున్నదనియు అంగీకరింతురు. ఈ యంశమును ద్వైతులకంటె విశిష్టాద్వైతులు మిగుల మనోహరలీల వచింతురు. ఆత్మయొక్క నిర్మలతయు పూర్ణతయు సంకోచము పొంది, మరల వికసించుచుండునని చెప్పుదురు. మనము పడు శ్రమయంతయు ఆత్మకు సహజలక్షణములగు ప్రజ్ఞానమును, నిర్మలత్వమును, మహిమను, పునఃప్రకటించుకొనుటకే. ఆత్మల కనేక గుణములు గలవు; కాని సర్వాధికార సర్వజ్ఞత్వములు మాత్రము లేవు; ప్రతి దుష్కర్మయు ఆత్మ

యొక్క సహజ తేజమును సంకుచితము చేయును; ప్రతి సత్కార్యమును దానిని వికసింపజేయును. జీవాత్మలన్నియు బ్రహ్మము యొక్క అంశములై యొప్పును. "ఒకే జ్వాలనుండి కోట్లాదిగ సమానలక్షణములతో నొప్పు స్ఫులింగము లెగసివచ్చునటుల అఖండరూపియగు బ్రహ్మమునుండి ఆత్మలన్నియు ఉద్భవించినవి." ప్రతి జీవికిని పరమప్రాప్య మొక్కటియే. విశిష్టాద్వైతుల దేవుడును సగుణుడే; అనంతకల్యాణగుణసముద్రుడు; కాని అతడు ఈ జగమునంతటియందును అంతర్యామియైయుండును. సర్వమునందును సర్వత్ర బ్రహ్మము వ్యాపించియుండును. సమస్తమును బ్రహ్మమనుటలో బ్రహ్మము సర్వోపగతుడనియే వేదముల యభిప్రాయము. భగవంతు డీ గోడయయ్యెనని భావముకాదు; ఈ గోడయందును భగవంతుడు గలడని యర్థము. ఈ విశాలజగమునందొక్క యణువుగాని పరమాణువుగాని భగవంతునిచే పరివ్యాప్తముగానిది లేదు. ఆత్మలన్నియు పరిమితములు; సర్వవ్యాపకత వానికి లేదు. వాని ప్రభావములు వికాసము నొందుటచే అవి పరిపూర్ణతను పొందినప్పుడు వాని కటుపిమ్మట జననమరణము లుండవు. శాశ్వతముగ నవి భగవత్సాన్నిధ్యమున నుండిపోవును.

ఇంక అద్వైతమతమునకు వత్తము. ఏ దేశమునందుగాని, యే యుగమునందుగాని, తత్త్వశాస్త్రమునుండియు, మతమునుండియు, పొడచూపిన అగ్రతమమును, మనోజ్ఞతమమును, అగు ప్రసూనరాజము ఇదియే యని మా యభిప్రాయము. ఇందు నరుని జిజ్ఞాస అత్యుత్తమవిలసనము గాంచినది; కేవలము దురవగాహమని యెంచబడు మర్మముల సయితము ఇది దాటిపోయినది. దీనిని అద్వైత వేదాంతమందురు. ఇది ప్రజాసామాన్య మతమగుట కలవికాజాలనంత దురవగాహమును అత్యున్నతమునై వెలుగుచున్నది. దీనికి జన్మస్థానమగు భారతదేశమునందు సయితము, గడచిన మూడువేల సంవత్సరములనుండియు ఇది ప్రాము

ఖ్యముగాంచి యున్నను, ప్రజాసామాన్యమునందు చొరలేకున్నది. అద్వైత సిద్ధాంతమును గ్రహించుట సర్వ దేశములలోని మహా ధీమంతులగు స్త్రీపురుషులకు కూడ కష్టసాధ్యముగానున్నదని ముందు ముందు మనము తెలిసికొనగల్గుదుము. మనమంత దుర్బలురమైపోయితిమి! అంత యధోగతిలో కూలితిమి! మన ప్రజ్ఞలనుగూర్చి మనమెంతగా ప్రగల్భములు పలికినను, స్వభావము చేతనే మనము అన్యాధారమును అపేక్షింపవలసిన వారముగా నున్నాము. ఎల్లప్పుడును ఏదో యొక ఆధారమునకై దేవులాడు చుండు బక్కచిక్కిన మొక్కలవలె నున్నాము. 'సుఖతరమగు మతమును' ఉపదేశింపుడని నన్నెన్ని యోసారులు అనేకు లడిగి నారు. కాని సత్యమును బోధింపుడని కోరువారు మిగుల నరుదు. ఆ సత్యమును గ్రహింప సాహసించు వారింకను అరుదు. దానిని సంపూర్ణముగ అనుష్ఠించు ధైర్యమును వహించువారు లేనే లేరన వలయును. ఇది వారిదోషముకాదు. బుద్ధిబలమునందుగల లోపము. ఏ క్రొత్తభావమైనను, అందులో ముఖ్యముగా అదొక యుద్దండ భావనమైనయెడల, గొప్ప కలవరమునుకలిగించి మన మెదడున నొక క్రొత్తమార్గమును కల్పింపజూచును. తత్పూర్వపు భావనిర్మాణమంతయు చలించిపోయి, నరుని స్థాయి చెడి పోవును. వా రేదో యొక పద్ధతి కలవడి యుందురుగదా! పురాతన మూఢవిశ్వాస సముదాయము నెంతటినో వా రిప్పుడు అతిక్రమించి రావలసియుందురు. వంశపారంపర్యముగ సాగి వచ్చుచున్న మూర్ఖాభిప్రాయములను, అనగా కుల దురభిమానములను, గ్రామ్య మూఢవిశ్వాసములను, దేశీయ దుర్గర్వములను —వీనినన్నింటిని మించి—ప్రతి నరునందును పాతుకొనియుండు పిచ్చి పిచ్చి నమ్మకముల సమూహములను ఎన్నింటినో, విసర్జింపవలసివచ్చును. అయినను గూడ సాహసించి సత్యాన్వేషణమును బూని, దీక్షవహించి, తుదముట్ట దాని ననువర్తించు ధీరోత్తములు కొంద ఱీ లోకమున జన్మించుచునే యుందురు.

అద్వైతి బోధించునది ఏమి? భగవంతుఁ డొక డుండెనా, అతడు ఈ విశ్వమునకు నిమిత్తకారణమును, ఉపాదానకారణమును నై యుండవలయును. ఆతడు సృష్టికర్తగ నుండుటేగాక, సృష్టియు గూడ తానే. అనగా, ఈ జగత్తుకూడ అతడే. అదెట్లు పొసగును? కేవలము ఆత్మస్వరూపియగు పరబ్రహ్మము జగముగ మారుటయా? అవును. కాని, ఆభాసగామాత్రమే. 'విశ్వము'గా పామరజనులు చూచునది సత్యదృష్టికి లేనే లేదు. మీరును నేనును, మనకు దృశ్యములగు వస్తుజాలము సర్వమును, ఏమిటి? కేవలము భ్రాంతిరూపములు! అఖండమై, ఆనందస్వరూపమై వెలుగు నొక్క వస్తువు తప్ప వేఱేదియు లేదు. ఆ ఒక్క సత్తాకమునందే మన మీ స్వప్నముల నన్నిటిని చూచుచున్నారము. ఆ యేకైక సత్తాకము ఆత్మ. అది అఖండము: సర్వాతీతము. జ్ఞాతమునంతటి కిని అతీతము, జ్ఞేయమునంతటికినికూడ అతీతము. జగత్తురూపమున మనము చూచు సర్వమునందును అది పరివ్యాప్తమై పరగు చున్నది. అది ఒక్కటియే సత్పదార్థము. ఈ బల్ల అదియే. అదియే నా యెదుట గూర్చుండి నా మాట లాలకించు జనము. ఈ గోడయు అదియే. నామరూపములను తొలగించితిరా, ఇక మిగులు సర్వమును అదియే. దానికి వేదాంతి స్త్రీ యని గాని, పురుషుడని గాని, పేరిడడు. ఈ భావములు కల్పితములు. మానవుని మేదస్సుచేత కల్పింపబడిన భ్రాంతులు. ఆత్మయందు స్త్రీపురుషభేదము లేదు. భ్రాంతికి లోబడి పశుప్రాయులై పోయిన వారు స్త్రీయనియు పురుషుడనియు భావనల కల్పించుకొందురు. జ్ఞానసిద్ధులకు స్త్రీపురుషభేదము కానిపింపదు. విశ్వమునకు అతీతు లయి పరగువారికి భేద మెట్లు గోచరించును? ప్రతిజీవియు ప్రతివస్తువును ఇట్టి భేదభావ మేదియు స్ఫురింపజేయనట్టి అత్యుజ్జ్వలమును, నిత్యానందమయమును అగు ఆత్మయే సుడీ! భౌతికము లగు నామమును, రూపమును, మూర్తియును, ఈ విభేదము నంతను తెచ్చిపెట్టుచున్నవి. నామము రూపము అనెడు భేదము

లను రెంటిని తొలగించితిమా, విశ్వమంతయును ఏకమై ప్రకాశించును. రెండు కలవనుటే కల్ల! అంతటను ఒక్కటి మాత్రమే కలదు. మీరును నేనును ఏకమే! ప్రకృతిగాని, భగవంతుడుగాని, జగత్తుగాని ఉన్నవనుమాట అసత్యము. అంతయును ఏకైక సత్పదార్థమే! దానినుండియే నామరూపమూలమున ఇవన్నియు కల్పితములగుచున్నవి. 'జ్ఞాత'ను (అనగా, తెలిసికొనువానిని) తెలిసికొనుటెట్లు? ఆతడు తెలియబడువాడు కాడు. నీ ఆత్మనే నీవు చూచుటెట్లు? కాని, నీ యాకారమునకు ప్రతిబింబము కలిగింపగలవు. అటుల నేర్పడిన ఆ యేకైకసత్యవస్తువగు ఆత్మయొక్క ప్రతిబింబమే ఈ విశ్వము. మంచివియు చెడ్డవియునగు బింబగ్రాహకముల* పైన నేర్పడు ప్రతిబింబములు మంచివియు చెడ్డవియు నగు స్వరూపములుగా గోచరించును. హంతకునియందుండు బింబగ్రాహకము చెడ్డది. కాని అందు ప్రతిబింబించు ఆత్మ మంచిదే. ఋషియందలి బింబగ్రాహకము నిర్మలముగ నుండును. ఆత్మ వస్తుతః నిర్మలమైనది. అద్వితీయమగు సత్తాకమై, క్షుద్రకీటకము మొదలు, శ్రేష్ఠతముడగు సిద్ధపురుషుని వఱకును అందఱియందును ప్రతిబింబించు ఆత్మ ఒక్కటియే సుడీ! ఈ విశ్వమంతయు ఏకైకసత్తాకమే. స్థూలముగను, మానసికముగను, నైతికముగను, పారమార్థికముగను, సర్వవిధములచేతను అది ఒక్కటియే. ఆ ఏకైకసత్తాకమును వేర్వేఱు రూపములతో చూచుచు, దాని యందు ఆయా స్వరూపముల నన్నింటిని కల్పనచేయుచున్నాము. మానవస్వభావముచేత ఆవరింపబడియున్న జీవికి ఆ స్వరూపజాలము మనుజలోకముగ కాన్పించును. అంతకు మించిన ఉన్నత దశయందున్న వానికి అది స్వర్గముగ గోచరింపవచ్చును. ఈ విశ్వమున ఒక్క ఆత్మ మాత్రమే యున్నది; రెండు లేవు. అది వచ్చునది

* బింబగ్రాహకమనగా ప్రతిబింబమును జూపు అద్దము మొదలగు పలక లేక రేకు.

కాదు, పోవునదియు కాదు; పుట్టునది కాదు; గిట్టునది కాదు; పునర్జన్మల నందునదియు కాదు. ఇక, అది మరణించుటెట్లు? వెడలిపోవు టెక్కడికి? స్వర్గలోకములు, భూలోకములు, మఱియు తదితరలోకములు అన్నియు, మనస్సుచేత కల్పింపబడిన బూటకపు రూపములే! నిజముగా అట్టివేవియు ఇప్పుడు లేవు; గతకాలమున నుండినవికావు; భావికాలమున నుండబోవునవియుకావు.

నేను సర్వ వ్యాపిని; సనాతనుడను. నే నెక్కడికి వెళ్లుట? ఇప్పటికే నేను లేని చోటెయ్యది? నేను ఈ 'ప్రకృతి కావ్యమును' పఠించుచున్నాను. పుట తరువాత పుటగా చదివి ముగించి, త్రిప్పివేయుచున్నాను. జీవస్వప్నములు ఒకదానితరువాత నొక టిగా గడచిపోవుచున్నవి. జీవనపు పుట నింకొక దానిని త్రిప్పు నపుడెల్ల మఱియొక జీవనస్వప్నము సిద్ధమగుచుండును. అదియు గడచిపోవును. ఇట్టివి గడచిపోగా పోగా, నా చదువును ముగించి, చదువుట చాలించి, ప్రక్కకు తొలగి నిలుచుందును; పుస్తకము నే విడిచివేతును. అంత సర్వమును తుదముట్టును. అద్వైతి బోధిం చునదేమి? పూర్వముండినట్టియు, ఇక నుండబోవునట్టియు, దేవ తల నందఱిని అతడు పదభ్రష్టులచేసి, ఆ సింహాసనమున మానవుని ఆత్మను ప్రతిష్ఠించును. అది సూర్య చంద్రాదుల కన్న మిన్న యైనది; స్వర్గలోకముల నతిక్రమించి వెలుంగునది; ఈ మహా విశ్వముకంటె నెంతయో ఘనతరమైనది : అని అతడు పల్కును. ఈ మహామానవరూపమున గోచరించు ఈ ఆత్మయొక్క దివ్య వైభవము నే గ్రంథములు, ఏ వేదములు, ఏ శాస్త్రములు, వర్ణింపజాలవు. విరాట్పురుష రూపమున, అనగా పూర్వముండి నట్టియు, వర్తమానమున గల్గునట్టియు, భవిష్యత్తున నుండబోవు నట్టియు, ఏకైకదైవ మతడే. కాబట్టి అట్టి నా ఆత్మను వినా ఎవరిని గాని నేను అర్చింపనొల్లను. "స్వాత్మారాధనమును గావించు కొందును" అని అద్వైతి ప్రవచించుచున్నాడు. నేను నమస్క రించున దెవరికి? నా ఆత్మకే నేను ప్రణామము చేయుదును!

నే నెవరియొక్క అండను కోరబోగలను? ఈ విశాలవిశ్వమున అఖండ బ్రహ్మమునై వెలుంగు నాకెవడు సాహాయ్యము నిడ జాలువాడు? అట్టితలపులు పిచ్చికలలు; వెఱ్ఱిభ్రాంతులు! ఎవరికైనను, ఎన్నడేనియు అన్యుడు అండయై నిలువగలైనా? కల్ల, కల! ఆకాశమునకు ఆవలి ఊర్ధ్వలోకములనుండి తన కేదియో సాహాయ్యము రాగలదని అపేక్షవహించి దేవులాడుచు, మొఱలిడు భీరుడు, ద్వైతవాది, మీకెప్పుడు తటస్థించినను, ఆ ఊర్ధ్వలోకములు సమస్తమును తనలోనివే అని అతడు గ్రహింపజాలకున్నాడని ఎఱుగుడు. ఏ స్వర్గమునుండియో తనకు అవలంబనము రాగలదని అతడు పేరాశపడునుగదా! సరే! అట్టి అవలంబనము, అట్టిసాహాయ్యము, వానికి ప్రాప్తించుననుకొనుడు. అటుల ప్రాప్తించుటయు మన మెఱుంగుదుము. కాని ఆ సాహాయ్యము వానిలోనుండియే సుడీ వానికి లభించుట! కాని అతడు మాత్రము దానిని బాహ్యమునుండి వచ్చుదానిగా భ్రాంతిపడుచుండును. ఒకరోగి మంచములో బడియుండగా ఎవరో తలుపు తట్టినటుల శబ్దము వినవచ్చినది. ఆతడు నెమ్మదిగ లేచి వెళ్లి తలుపు దీసెను. ఎవరును కానరాలేదు. తిరిగి పోయి మంచముపై పరుండెను. ఆ చప్పుడు మరల వినవచ్చినది. ఇంకొకసారి లేచిపోయి తలుపు తెఱచి చూచెను. ఎవరును కాన్పింపలేదు. ఇట్లుకొన్నితడవలు జరిగినది. తుదకది తనగుండెకొట్టుకొనుటచే గల్గిన చప్పుడేయనియు, తలుపు కడ చప్పుడైనటుల తలచుట తన భ్రాంతియే యనియు, అతడు గ్రహించెను. ఈ తీరుననే నరుడు వేల్పులకొఱకు తనకు వెలుపల వ్యర్థముగా వెదకివెదకి, తాను బయలుదేఱిన తావునకే, అనగా తనఆత్మకడకే, మరలివచ్చిచేరును. తాను గుట్టలందును, గుహలందును వెదకులాడు దైవము; ఈ నదియందును, ఆ గుడియందును, మఱియు అర్చనాలయములందును, ఆకసమునందును కనుగొనదలచిన దేవుడు; పరలోకమున ఎక్కడనో కూర్చుండి జగమును పరిపాలించునటుల తాను భావనచేసికొనిన భగవంతుడు;

తన ఆత్మయే అని తుద కతడు తెలిసికొనును. "అహం బ్రహ్మాస్మి! శివోఽహం! నేను బ్రహ్మమును; బ్రహ్మమును నేనే!" నేను ఎనా భగవంతుడు లేడు. క్షుద్రతరమగు ఈ అహము ఎన్నడును ఉండియుండ లేదు.

సరియే కాని "అఖండబ్రహ్మ మిటుల భ్రమలందు ఎట్లు చిక్కుకొనెను?" అనవచ్చును. అతడు భ్రమనొంద లేదు! పరిపూర్ణుడైన బ్రహ్మము స్వప్నముగాంచు టెట్లు పొసగును? అతడెన్నడును స్వప్నముగాంచలేదు. సత్య పదార్థమునకు స్వప్నములుండవు. భ్రాంతి యెట్లుకలిగెనను ప్రశ్నయే అసంగతమైనది. భ్రాంతి భ్రాంతిజనితమేసుడీ! సత్యముప్రకాశించినపిదప భ్రాంతి యుండనేచాలదు. భ్రాంతికి భ్రాంతియే అవలంబనము (అనగా ఆధారము). బ్రహ్మముపై, సత్యముపై, ఆత్మపై భ్రాంతి నిలువ జాలదు. మీ రెన్నడును భ్రాంతిలోపడలేదు. మీలో భ్రాంతి చేరినది. మీకెదురుగా భ్రాంతి నిలిచియున్నది. అదిగో ఒక మేఘము; ఇంకొక మేఘమువచ్చి దానిని నెట్టివేసి ఆ తావున తాను నిలుచుచున్నది. వేఱొకటి వచ్చి దీనిని నెట్టివేయును. స్థిరముగా నిలిచియుండు నీలాకాశమున, వేర్వేఱు రంగుల తోడను, వేర్వేఱు ఆకృతులతోడను మెఱయు మబ్బులు కాన్పించి, స్వల్పకాలముండి, అదృశ్యము లగుచుండును. సుస్థిరమగు నీలాకాశము నిర్లేపమై (వాని కంటుకొనక) సదా ఒక్క తీరుగ నిలిచియుండును! అదే తీరున మీరును సతతము నిర్మలులై, నిత్యపరిపూర్ణులై, ప్రకాశించుచున్నారు. ఈ విశ్వమున ప్రకాశించు దేవతలు మీరే! "దేవతలు" అనుట పొరపాటు. ఇరువు రెచట నున్నారు? ఒకరే గదా! "మీరు, నేను" అనుటే దోషము. "నేను" అనియే అనవలెను. లక్షలకొలదిగనున్న నోరులద్వారమున భుజించునది నేనే! నాకు ఆకలి యెట్లుండును? అనంతములగు చేతులతో పాటుపడునది నేనే! నేను నిష్క్రియుడనై యుండుటెట్లు? ఈ విశ్వజీవనము నంతను గడపునది

నేనే! నాకు మరణ మెక్కడిది? నేను జనన మరణములకు అతీతుడను. నేను మోక్షమునకై వెదకు టెందులకు? సహజము గనే నేను నిత్యముక్తుడను! జగన్నాథుడనగు నన్ను బంధించున దెవరు? లోకములోని వేదశాస్త్రము లన్నియును, ఈ విశ్వమున గల యేకైక అస్తిత్వమననగు నాయొక్క దివ్యవైభవమును ప్రకటింపజూచు స్వల్పపటములవంటివి! కావున ఈ వేదశాస్త్రములు నా కేపాటివి?—అద్వైతమతావలంబి పలుకున దిట్లు.

"సత్యమును గుర్తెఱిగి క్షణములో ముక్తుడవగుము." అప్పుడు చీకటులెల్ల తొలగిపోవును. విశ్వమయుండగు అఖండునితో నరుడు తా నేకమగుట నెఱింగినప్పుడు; అన్యమను భావమే అంతరించినప్పుడు; స్త్రీపురుషులందరును, దేవతలును త్రిదశగణమును సర్వమును, జంతుజాలమును భూజసంతతియు సకలమును, విశ్వమంతయు, ఒక్కటిగ కలసిపోయినప్పుడు: భయమంతయు ఎగిరిపోవును. నాకు నేనే అపాయము చేసికొందునా? నన్ను నేనే చంపుకొందునా? నన్ను నేను హింసించుకొందునా? ఇంక నేను ఎవరిని గుఱించి భయపడుట? నీయెడ నీకే భయముకలుగునా? ఇక దుఃఖమనునది ఉండజాలదు. నాకప్పుడు దుఃఖమును గల్గింపజాలున దేముండును? విశ్వరూపము దాల్చిన సద్వస్తువును నేనే కదా! అప్పుడు మత్సరము లన్నియును అంతరించును. ఎవరియెడ మత్సరము వహించుట? నాయెడనేనా? అప్పుడు దుస్సంకల్పములన్నియు పటాపంచలై చనగలవు; ఎవరిని గూర్చి నేను దుస్సంకల్పములను పూనగలను? నన్నుగూర్చియేనా? నేను వినా విశ్వమున అన్యులు లేరే! సత్యజ్ఞానమునకు ఇదొక్కటే మార్గమని వేదాంతి బోధించుచున్నాడు. భేదభావమును రూపుమాపుడు; అనేకమను భ్రాంతిని నాశముచేయుడు. 'అనేకత్వముతో గోచరించు ఈ జగత్తున ఎవడు ఆ ఏకత్వమునుగాంచగలడో, ఈ జడపదార్థ రాశియందెవడు ఆ యేకైక జ్ఞానస్వరూపిని

గుర్తింపజాలునో, ఛాయా మాత్రమగు ఈ ప్రపంచమున ఎవడు ఆ సత్యబ్రహ్మమును ప్రత్యక్షము చేసికొనునో, ఆతనికి శాశ్వతానందము చేకూరగలదు; మఱెవరికిని గాదు; ఇతరుని కెవనికిని అది చిక్కదు.''

భగవంతుని గుఱించి భారతజిజ్ఞాసువులు అవలంబించిన సోపానత్రయమునందలి ప్రధానాంశము లివి. విశ్వమునకు భిన్నముగానుండు ఈశ్వరునితో వారి జిజ్ఞాస ప్రారంభమయ్యెనని గ్రహించితిమి. విశ్వశరీరముయొక్క బాహ్యభాగమును విడిచి, దాని యభ్యంతరమును ప్రవేశించి — అనగా భగవంతుని విశ్వవ్యాప్తరూపమును చేరి—ఆత్మయే ఆ భగవంతుడనియు, అదియే ఈ జగత్తులో భిన్నభిన్న స్వరూపములతో చూపట్టు ఏకైక వస్తువనియు, గుర్తించుటతో ఈ జిజ్ఞాసకు పర్యవసానము తేలినది. వేదముల పర్యవసానపుబోధ యిది. ఇది ద్వైతముతో ప్రారంభమై, విశిష్టాద్వైత ద్వారమున, పరిపూర్ణాద్వైతమున పర్యవసించుచున్నది. ఈ పర్యవసానమును చేరజాలువారు మిక్కిలి అరుదనియు, దానిని చేరుటటుండ విశ్వసించుటకు సాహసించువారే అరుదనియు, దీనిని అనుష్ఠానమున బెట్టగలవారింకను చాల అరుదనియు మనమెఱుగుదుము. అయినను లోకములోని నీతి కంతటికిని, ధర్మమున కంతటికిని, పారమార్థికత కంతటికిని, వివరణము దీనియందే కలదు. 'పరోపకారము చేయు' మని ప్రతివారును బోధించు టెందుకు? దీని కీలక మెందున్నది? ఉత్తమపురుషు లందఱును విశ్వమానవ సోదరత్వమును బోధించుటకు హేతు వేమి? ఇంకను శ్రేష్ఠులు సర్వ భూతసోదరత్వమును ఉపదేశించుటకు కారణమేమి? ఏల ననగా, నరులు గ్రహించినను, గ్రహింపకున్నను, సమస్తమునకును వెనుకనుండి, మూఢమును వ్యక్తిగతమును అగు అజ్ఞానమంతటి వెనుకనుండి, ఈ అనేకత్వము అసత్యమనియు, విశ్వమంతయు ఏకైకవస్తువనియు, చాటుచు, విశ్వాత్మయొక్క అఖండ తేజము ప్రకాశించుచున్నది.

ఈ తుదిపలుకును అనుసరించి మనకుగల సర్వమును ఒక్క-జగత్తుమాత్రమే యగుచున్నది. దానినే ఇంద్రియములద్వారమున భౌతికపదార్థముగను, బుద్ధిద్వారమున జీవాత్మల సమూహాము గను, పారమార్థిక జ్ఞానద్వారమున బ్రహ్మముగను, ఎఱుంగు చున్నాము. ప్రపంచమున పాప మనియు అశుభమనియు పేర్కొ-న బడు ముసుగులతో తన్ను దాను కప్పుకొను నరున కీ విశ్వము వికారరూపమగు ఘోరవస్తువుగా మారి కానిపించును. భోగము లను వాంఛించు మఱొకని కీ విశ్వమే మారి స్వర్గముగ కాని పించును. ఇంక జ్ఞానసిద్ధుని కీ విశ్వమే అదృశ్యమై తన ఆత్మయే కానిపించును.

వర్తమాన సంఘస్థితినిబట్టి యీ సోపానత్రయము అత్యవ సరము. ఇందొకటి వేఱొకదానిని ఖండనముచేయదు. ఒకటి మఱొకదాని పరిణామముగ నుండును. అద్వైతిగాని, విశిష్టా ద్వైతిగాని, ద్వైతసిద్ధాంతమును అనుచిత మనడు. 'అదియు సత్యదృష్టియే; కాని ఒకింత న్యూనమైనది. అదియు పూర్ణసత్య మునకు మార్గమే.' కావున ప్రతినరుడును తన భావవైఖరి ననుస రించి, ఈ విశ్వమునుగూర్చి తన దృక్పథమునే అవలంబించుట లెస్స. ఎవనికిని అపకృతి సేయకుడు; ఎవని దృక్పథమును భగ్నముచేయకుడు; అతడున్నస్థితిని గ్రహించి, మీకు చేత నగునా వానికి చేయూతనిచ్చి పై మెట్టుకుజేర్పుడు; అంతియెకాని వానికి అవరోధములను గూర్పకుడు; నిర్మూలనకర్మకు గడంగకుడు. ఎప్పుడో యొకప్పుడు అందఱును సత్యస్వరూపమును, అనగా బ్రహ్మమును, పడయుదురు సుడీ! "హృద్గతవాంఛ లడగు తఱిని మర్త్యుడే అమరుడగును." అప్పు డీ నరుడే నారాయణుడగును.



# ఆత్మ : దానిబంధనము, మోక్షము

(అమెరికాలోని ఉపన్యాసము)

జగత్తునందు బ్రహ్మమనబడు ఒక్కసద్వస్తువు మాత్రమే కలదని అద్వైతసిద్ధాంతము. తదితరము సర్వమును అసతు: ఆభాసమాత్రము. మాయయొక్క మహిమచేత ఈ సర్వమును బ్రహ్మమునుండి కల్పితమగుచున్నది. బ్రహ్మమునందు ఐక్యభావమును పొందుటే మనకు పరమగమ్యము. మనమందఱమును, మనలోని ప్రతివ్యక్తియుగూడ, మాయచేత కప్పబడియున్న బ్రహ్మమే — ఆ యేకైక సత్పదార్థమే సుడీ! అజ్ఞానరూపమగు ఈ మాయను తొలగించుకొంటిమేని మన సత్యస్వరూపమును మనము తిరిగి పొందగలము. ఈ సిద్ధాంతము ప్రకారము ప్రతి నరుడును మూడు భాగములతోగూడి యేర్పడుచున్నాడు: (1) శరీరము (2) మనస్సు (లేక అంతఃకరణము) (3) వీని రెంటికిని వెనుక జీవుడు లేక ఆత్మ అనబడువస్తువు. మనస్సు (లేక అంతఃకరణము) ద్వారమున ఈ ఆత్మ శరీరమును నడుపుచు నిజమగు ద్రష్టయు భోక్తయు నైయున్నది. ఈ ఆత్మకు శరీరమనునది బాహ్యకవచమును, మనస్సు అనునది లోపలి కవచమును అయియున్నవి.

నరుని శరీరమునందు భౌతికపదార్థముకానిది ఆత్మ ఒక్కటే. అది భౌతికపదార్థమే కాదు కావున మిశ్రపదార్థమును కాజాలదు. మిశ్రపదార్థముకాదు గావున, కార్యకారణరూపమగు కట్టడులకు లోబడదు. కాబట్టి అది శాశ్వతమైనది. శాశ్వతమగుదానికి ఆదియుండదు. ఏలనన, దేనికి ఆదియుండునో దానికెల్ల అంతమును ఉండితీరును. అది నిరాకారమనియు తేలును. భౌతికపదార్థములేనిది ఆకార మేర్పడజాలదుగదా. మఱియు సాకారమగు సర్వమును ఆద్యంతములు కలిగియే యుండవల

యును. మొదలు లేనట్టియు, తుదిలేనట్టియు, సాకారవస్తువును మనమెవరమును చూచియుండలేదు. ఆకార (రూప) మనునది జడపదార్థము యొక్కయు, శక్తియొక్కయు కలయికచేత ఏర్పడును. ఈ పీఠమున కొక విశిష్టమగు ఆకారము గలదు. అనగా కొంత జడపదార్థముమీద కొంతశక్తి ప్రయోగమగుట వలన ఈ విశిష్టరూప మేర్పడుచున్నది. కాన రూపము అనునది భౌతిక పదార్థము యొక్కయు, శక్తియొక్కయు సమ్మేళనఫలము అనవలయును. ఈ సమ్మేళనము శాశ్వతమైయుండజాలదు. ప్రతి సంశ్లేషణమునకును (అనగా ప్రతిసమ్మేళనమునకును) విశ్లేషము (అనగా విడిపోవుట) తటస్థించు సమయము ఎప్పుడో వచ్చితీరును. కాబట్టి సాకారములగు నవి అన్నియు ఆద్యంతములు కలిగియే యుండును. మన శరీరము నశించునని మనకు తెలియును. దాని కొక ప్రారంభమున్నది, అంతమును ఉండును; కాని ఆత్మ నిరాకారమగుటచేత ఆద్యంతసూత్రము దానికి వర్తింపదు. అది అనంతమగు కాలమున నిలిచియున్నది. కాలము శాశ్వతము. అటులనే ఆత్మయు శాశ్వతము. మరియు అది సర్వవ్యాపిగా నుండవలయును. సాకారమైనదియే స్థలముచే పరిమితమై, హద్దు పెట్టబడును. నిరాకార మగునది స్థలములో పరిమితముకాదు. కాబట్టి మీలోను, నాలోను, ప్రతివానిలోను, ఉండు ఆత్మ సర్వవ్యాపియై యొప్పునని అద్వైతవేదాంతమత సిద్ధాంతము. మీ రిప్పుడీ పుడమియం దున్నటులనే సూర్యునియందును ఉన్నారు. ఈ దేశమున నున్నటులనే అమెరికాయందును నున్నారు. అయినను ఆత్మ పనిచేయునది మనశ్శరీరములద్వారముననే. అవి రెండును గూడియున్నచోటనే ఆత్మయొక్క ప్రభావము గోచరింపగలదు.

మనము చేయు ప్రతి కార్యమును, మనము తలంచు ప్రతి తలంపును, మన మనస్సుమీద ఒకవిధమగు చిహ్నమును అనగా ఒకవిధమగు గుర్తును కలిగించును. ఈ చిహ్నమును సంస్కృత భాషలో 'సంస్కారము' అందురు. ఈ సంస్కారముల మొత్తమే

'వృత్తము' (కారెక్టర్) అనబడెడు మహాశక్తిగ నేర్పడుచున్నది. మానవునియొక్క వృత్తము ఆతడు తనకై తాను నిర్మించుకొనునదే. అది తన జీవితమున ఆత డొనరించిన మానసిక, కాయిక కర్మలయొక్క సమష్టిఫలమై యుండును. ఈ సంస్కారముల సమష్టియే మరణానంతరము వానికి కలుగు గతిని నిర్ణయించునట్టి మహాశక్తి. ఒకడు మరణించు ననుకొనుడు. వాని శరీరము విడిపోయి తిరిగి పంచభూతములలో చేరిపోవుచున్నది. అయినను వాని సంస్కారములు వాని మనస్సున అంటుకొని నిలిచియే యుండును. ఈ మనస్సు బహు సూక్ష్మతర ద్రవ్యములతో ఏర్పడిన దగుటచేత త్వరగా విశ్లేష మొందదు. ద్రవ్యము సూక్ష్మతర మగుకొలది దాని సుస్థిరత అధికమగుచుండును. కాని తుదకీ మనస్సు సయితము విచ్ఛిపోవలసినదే! అట్లగుకొఱకే మన మందఱమును పాటుపడుచున్నాము. ఈ సందర్భములో సుడిగాలియొక్క ఉపమానము మిక్కిలి చక్కనిదని నాకు స్ఫురించుచున్నది. వేఱు వేఱు వాయుప్రవాహములు వేఱువేఱు దిశలనుండివచ్చి ఒక చోటున కూడుకొనును. అటుల కూడుకొను తావున అవి బాగుగ మిశ్రమైపోయి గిరగిర తిరుగుట కారంభించును. ఇటుల తిరుగునపు డవి దుమ్ముతో ఒక ఆకారమును కల్పనచేయును. అప్పుడు చెత్తను కాగితపుముక్కలను ఇంక నిట్టివాని నొకచోటినుండి లాగికొనును. మరల కొలదిసేపటికే వీనిని విడిచివేసి వేఱొక తావునకు పోయి అక్కడ గిరగిర తిరుగసాగును. మరల అక్కడ దొరకిన పదార్థములను లాగుకొని వానితో నూతనాకారములను కల్పనచేయును. సంస్కృతమున 'ప్రాణము' అను సమష్టి నామముతో పిలువబడు శక్తులు ఇదేవిధముగ వర్తించును. అవి ఒక చోట కూడుకొనును. అచ్చటి ద్రవ్యములతో ఒక శరీరమును మనస్సును కల్పనచేసి సాగిపోవుచుండగా, కొంత వడికి ఆ శరీరము రాలిపోవును. అంతట క్రొత్తద్రవ్యములను తీసికొని క్రొత్తశరీరమును కల్పనముచేయును. ఆ శరీరము పడిపోవ నింకొక శరీరము

కల్పనచేయబడుచుండును. ఇట్లు చర్య సాగిపోవుచునే యుండును. ద్రవ్యసహాయము లేనియెడల శక్తికి నడకయే సాగదు. కావున శరీరము పడిపోవునపుడు మనస్సు నిలిచియుండును. సంస్కార రూపమగు ప్రాణము దానిని వేఱొక తావునకు కొనిపోయి, అచ్చటి ద్రవ్యములతో ఒక క్రొత్తసుడిని కల్పించుకొని క్రొత్త వృత్తమును సాగించును. ఈ తీరున అది ఒకచోటినుండి మఱొక చోటునకు పోవుచు, తుదకు శక్తియంతయు ఉడిగిన పిమ్మట అంతము నొంది పడిపోవును. ఈ విధముగ మనస్సు అంతరించి, విచ్ఛిన్నమైపోయి, అందలి సంస్కారము లన్నియు వ్యయమై పోయినప్పుడు మనకు ముక్తి లభించును. ఆ తరుణము వచ్చువఱకును మనము బంధనమున పడియుండవలసినదే. అంతవఱకును మనస్సు అనెడు సుడిచేత ఆవరింపబడి ఆత్మ చిక్కియుండును! ఒకతావునుండి వేఱొక తావునకు ఈడ్వబడుచున్నటుల తలచుచునే యుండును. ఆ సుడి అంతరించునపుడు తాను సర్వవ్యాపి యనియు, ఇచ్చవచ్చిన తావున ప్రకాశింపగలదనియు, తాను నిత్యముక్తమనియు, తన యిష్టము వచ్చినన్ని మనస్సులను, శరీరములను కల్పనచేసికొన గలదనియు ఆత్మ గ్రహించును. కాని అంతవఱకును అది సుడితో తిరుగాడుచుండక తీరదు. ఈ విముక్తికొఱకే మన మందఱమును జీవయాత్రల జేయుచున్నాము.

ఈ గదిలో నొక బంతి ఉన్నదనుకొనుడు. మనమందఱమును ఒక్కొక్క కఱ్ఱనుతీసికొని వందలాదిగా దెబ్బలను కొట్టుచు, దానిని ఒక తావునుండి వేఱొక తావునకు తఱుముచు, అది యీ గదిలో నుండి వెలువడిపోవు వఱకును కొట్టుచునే యుందుమనుకొనుడు. అది ఎంతశక్తితో, ఏ మార్గమున, వెలుపలికి పోవును? ఈ గదిలో నున్నంతవఱకును దానిపైన ప్రయోగింపబడిన శక్తులన్నింటి యొక్క సమష్టిఫలమేగదా ఈ విషయములను నిర్ణయించినది. దానిపైన బడిన ప్రతి దెబ్బయు దాని ఫలితము నిచ్చినదనియే

చెప్పవలసియుండును. ఇదేరీతిగ శారీరకముగగాని, మానసిక ముగగాని, మనము చేయు ప్రతికర్మయు ఒక్కొక్క దెబ్బవంటిదే. నరుని మనస్సే యీ దెబ్బలుతిను బంతి. ప్రపంచమనెడు గదిలో మనము ఎల్లప్పుడును ఇటు నటు ఎగురగొట్ట బడుచున్నాము. ఈ దెబ్బ లన్నింటియొక్క సమష్టి ఫలమే మన మీ లోకము నుండి నిష్క్రమించు మార్గమును నిర్ణయించుచున్నది. బంతి యొక్క వేగమును, దిశను నిర్ణయించునది దానిపై బడునటువంటి దెబ్బలే సుడీ. అట్లే రాబోవు మన జన్మను నిర్ణయము చేయునది ఈ ప్రపంచమున మనము చేయు కర్మసంచయమే. కావున మన యిప్పటి జన్మయు మన పూర్వకర్మలయొక్క ఫలమే అనవల యును. ఇదొక యంశము. తెల్లని కడియమొకటి, తర్వాత నల్లని కడియ మొకటి, మరల తెల్లనికడియము, ఇట్లు వరుసగా తగిలించుచు నిర్మాణముచేసిన ఆద్యంతములులేని గొలు సొక దానిని మీకిచ్చి "ఈ గొలు సెటువంటిది?" అని మిమ్మును ప్రశ్నింతురు అనుకొనుడు. గొలుసు ఆద్యంతములులేక అనంతమై యుండుటచేత, మొదట దాని స్వభావమును నిర్ణయించుటలో మీకు చిక్కు తోచును. కాని నెమ్మదిగ పరిశీలించినమీదట అదొక గొలుసని మీరు గ్రహింతురు. తెల్లని, నల్లని కడియ ములు క్రమముతప్పక ఒకదానిపిదప నొకటి అనంతముగా తగి లించుటచేత అది ఏర్పడినదని మీకు తెలిసిపోవును. ఈ కడియము లలో ఒక్కదానితత్త్వము మీకు తెలిసిన యెడల, అటువంటి కడియములే ఒకదాని వెంట నొకటి క్రమముతప్పక వచ్చుచుం డును గావున ఆ గొలుసుయొక్క గుట్టంతయు మీకు తెలిసినట్లే. భూత భవిష్యద్వర్తమాన కాలములందు మన జన్మలన్నియు అనం తమగు గొలుసుగా ఏర్పడియున్నవి. ఒక్కొక్కజన్మ ఒక్కొక్క కడియ మనవచ్చును. జననము మరణము అనునవి ప్రతి కడియము నకును గల రెండు కొనలు. మన యిచటి ఉనికియు, చేతలును, మరల మరల స్వల్పభేదములతో మాటిమాటికి కలుగుచున్నవి.

కాబట్టి మనము ఈ రెండు కడియములను గ్రహించితిమేని మన మీా ప్రపంచములో నడువవలసియున్న ప్రవేశ నిష్క్రమణద్వారము లన్నియు మనకు తెలిసిపోవును. ఈ ప్రపంచములోని మన యిప్పటి నడత యింతకుపూర్వము మనము నడిచిన నడతలవలననే సరిగా నిర్ణయింపబడినదని తెలియవచ్చును. అట్లే మన పూర్వకర్మలచేతనే యీా ప్రపంచమునకు మనము వచ్చుట తటస్థించినది. ఇప్పటి మన కర్మలయొక్క సమష్టిఫలమును మీాద వేసికొని యెట్లు పోవుదుమో, అటులనే మన పూర్వకర్మలన్నింటియొక్క సమష్టిఫలమును మీాద వేసికొని యిప్పుడు వచ్చియున్నాము. మనలను దీనినుండి వెలుపలికి తీసికొని పోవునదే మనలను ఇందు ప్రవేశపెట్టినది. మనలను ఇందు ప్రవేశపెట్టినదియేది? మన పూర్వకర్మలేగదా. మనలను వెలుపలికి తీసికొని పోవునవేవి? ఇక్కడ మనముచేయు కర్మలే. ఇట్లే సాగివచ్చుచుండును. పట్టుపురుగుగా మాఱు కీటము తన నోటిలోనుండి తీయు దారముచేతనే 'పిసినికాయ' అల్లుకొని, తుద కా 'పిసినికాయ' లోనే తాను చెఱబడునట్లే మన పూర్వకర్మలచే బంధనములను కల్పించుకొన్నాము. మన చుట్టును కర్మజాలము నల్లుకొని దానిలో ఇఱుకుకొనిపోయియున్నాము. కార్యకారణసూత్రమును ప్రయోగములోనికి తెచ్చినది మనమే. దానినుండి యిప్పుడు ఎట్లు తప్పించుకొనుటా యని తపించునది మనమే. చక్రము తిరుగ నారంభించుటకు మనమే కారణభూతులము. దానిక్రింద ఇప్పుడు పడి నలిగిపోవుచున్నదియు మనమే. మన సత్కర్మలచేత, దుష్కర్మలచేత, మనలను మనమే మరల మరల బంధించు కొనుచున్నామని ఈ సిద్ధాంతము బోధించుచున్నది.

ఆత్మ ఎన్నడును రాదు, ఎన్నడును పోదు. ఎన్నడును పుట్టదు; ఎన్నడును చావదు. ఆత్మకు ఎదురుగా ప్రకృతి నడుచుచున్నది; దీని నీడ ఆత్మమీాద పడుచున్నది. అవిద్యావశమున ఈ

ఆత్మ తానే చరించుచున్నటులను, ప్రకృతియే చలింపక నిలిచి యున్నటులను భ్రమించుచున్నది. ఈ భ్రమ ఉన్నంతకాలము ఆత్మ బద్ధమే. తాను కదలునది కాదనియు, తాను సర్వవ్యాపి యనియు, తెలిసికొనినప్పుడు దానికి మోక్షము సిద్ధించును. బంధముననున్న ఆత్మకే జీవుడని పేరు. సూర్యుడు భూమిచుట్టు తిరుగడు. అయినను ఖగోళశాస్త్రాభ్యాసమున అవగాహనసౌక ర్యముకొఱకు సూర్యుడే భూమిచుట్టును తిరుగునని ఊహచేయు దురు. అదేవిధమున ఆత్మ వచ్చుచున్నది పోవుచున్నది అని చెప్పుట భాషా సౌకర్యముకొఱకే అని మనము గ్రహింపవలసి యున్నది. ఇట్లు జీవుడు నిమ్నోన్నత దశలను పొందుచుండును. సుప్రసిద్ధమగు జన్మాంతర సిద్ధాంతము ఇదియే. సృష్టియంతయు ఈ సూత్రముచేత బంధింపబడి నడుచుచున్నది.

ఈ దేశపు ప్రజలు నరుడు పశువునుండి పైకి ఉద్గమనము చేసి, మానవజన్మకువచ్చు ననుమాట ఘోరమని తలతురు. ఎందువలననో ? కోటానుకోట్లుగనున్న యీ పశువులన్నియు చివరకు ఏమికావలయును ? అవన్నియు లెక్కలోనివికావా ? మనకు ఆత్మ అనునది కలదేని, వానికిని ఆత్మకలదు. వానికి ఆత్మ లేదందురా, మనకును లేదు. నరునకు మాత్రమే ఆత్మకలదనియు, తదితర జంతువులకు ఆత్మ లేదనియు చెప్పుట వెఱ్ఱిమాట. పశు వులకంటెను అధములగు నరులను నేను చూచియున్నాను.

నరుని జీవాత్మ తన సంస్కారముల ననుసరించి ఉత్తమ జన్మలను, అధమజన్మలను పొందుచుండును. పైకి క్రిందికి, క్రిందికి పయికి తిరుగునది. కాని అత్యుత్తమ జన్మయగు మానవ జన్మ నుండిమాత్రమే అది ముక్తిని సాధింపగలుగును. మానవజన్మ దేవతల జన్మకంటెను శ్రేష్ఠతరమైనది. అన్ని జన్మలకన్న అది అత్యుత్తమమైనది. నరుడే మోక్షమును సాధింపగలడు. కావున సృష్టిలోని సమస్త జీవులలో అతడే మహోన్నతుడు.

ఈ విశ్వమంతయు బ్రహ్మమందే ఉండి వానినుండి ఆవిష్కృత మగుచున్న దనవచ్చును. వైద్యుతయంత్రమునుండి (విద్యుచ్ఛక్తియంత్రమునుండి) వెలువడు విద్యుచ్ఛక్తి తన ప్రసార చక్రమును పూర్తిగావించి తుదకు ఆ యంత్రముననే ప్రవేశించు తీరున, ఈ జగత్తుకూడ తనయాత్రను ముగించి తనకు మూల కారణమగు బ్రహ్మమునందు ఐక్యము చెందుటకై నడచుచున్నది. ఆత్మయొక్క విషయమును ఇట్టిదియే. అది బ్రహ్మమునుండి ఆవిష్కృతమై వెలువడి వరుసగా ఓషధుల రూపమును, జంతువుల రూపమును, పొందిపొంది, తుదకు మనుష్యాకారమును తాల్చును. ఈ మనుష్యజన్మ బ్రహ్మస్వరూపమునకు అత్యంతము సమీపమైనది. మనము ఎందుండివచ్చితిమో ఆ బ్రహ్మమును తిరిగి పొందుటకే మన ప్రయత్నమంతయు సాగుచున్నది. జనుల కది తెలిసినను తెలియకున్నను విచారము లేదు. ఈ మహావిశ్వము నందు ఖనిజములందుగాని, ఓషధులందుగాని, జంతువులందుగాని, ఎందెందు ఏ చలనము ఏ పోరాటము గలదో అదంతయు ఆ ప్రాప్యస్థానమును చేరి నిశ్చలతను అనుభవించు కొఱకగు ప్రయత్నమే సుడీ. ఒకప్పుడు పరిపూర్ణమగు సమతయుండెను. ఆ సమత చెడినది. అన్ని భాగములును, అన్ని జీవకణములును, అన్ని పరమాణువులును తాము కోల్పోయిన సమతను మరల పొంద వలయునని పెనగులాడుచున్నవి. ఈ తీవ్రయత్నములో అవి కలియుచు, వేఱువిధముగా కూడుచు, అద్భుతములగు ప్రకృతి వికారముల నన్నిటిని కల్పించుచున్నవి. జంతుజాలములోగాని, వృక్షజాతిలోగాని, మఱెచ్చటగాని చూపట్టు పోరాటములు, పోటీలు, సాంఘికసంచలనములు, యుద్ధములు, ఇవన్నియు ఆ సమత్వమును పునర్లభ్య మొనర్చుకొను నిరంతర ప్రయత్నము యొక్క గోచరరూపములే.

పుట్టినది మొదలు మరణించువఱకును సాగు యాత్రకు సంస్కృతభాషలో "సంసారము" అని పేరు. జననమరణ చక్ర

మని దీనిభావము. సృష్టియంతయు, ఈ సంసారచక్రము నందు పడి తిరుగుచు త్వరగనో ఆలస్యముగనో మోక్షమును పొందును. మన మందఱమును తప్పక మోక్షమును పొందునెడల, దానిని సాధించుటకై యీ పెనగులాట యేల అని ప్రశ్నింపవచ్చును. ప్రతివానికిని మోక్షమువచ్చి తీరునెడల, "కదలక మెదలక కూర్చుండి దానికై శాంతముగ వేచియుండుము" అని యనవచ్చును. వేగముగనో నెమ్మదిగనో ప్రతివాడును మోక్షమును పొందుట సత్యమే. ఎవనికిని అంతు లేదు. ఏదియు సర్వనాశనమును పొందదు. ప్రతిదియు తరింపవలసినదే. అటులగునేని మన తీవ్రప్రయత్నమునకు ప్రయోజనమేమి అనవచ్చును. 'మనప్రయత్నము మాత్రమే మనలను ఆగమ్యస్థానమున చేర్పగల సాధన' మనుట మొదటి సమాధానము. 'మన మిటుల ఎందుకు పెనగులాడుచున్నామో మనకు తెలియదు ; అది మనకు విధిగా నేర్పడియున్న' దనుట రెండవ సమాధానము. సరే! "వేలకొలది మానవులలో ఏ కొందఱికి మాత్రమో మోక్షము పొందవలయునను ఉద్దేశము కలుగును." మానవకోటిలో అత్యధిక సంఖ్యాకులు ప్రాపంచిక సంపదలతోనే తృప్తులైయుందురు. అయినను, మెలకువనొంది 'ఈ నాటక మింతటితో సరిపెట్టుదము. ఇది చాలును. ఇక నిందుండి మరలిపోవుదము' అనువారు కొంద ఱుందురు. వీరు బుద్ధిపూర్వకముగ తీవ్రయత్నముల సాగింతురు. తదితరులు కూడ బుద్ధి పూర్వకముగ కాకున్నను, పెనగులాడుచునే యున్నారు సుమీ!

'వైరాగ్యము' అనగా అసత్తును విడిచి సత్తును చేపట్టుట అని అర్థము. ఈ వైరాగ్యమే వేదాంతమతబోధయొక్క ఆద్యంతము. ఇది సాధించినచో గెలుపునొందినట్లే. ఐహికప్రియులగువారు "దీనినుండి వెలువడవలయుననిగాని, పరమగమ్యమును (బ్రహ్మమును) మరల చేరవలయుననిగాని, మనమేల ప్రయత్నము చేయవలయును? అందఱమును బ్రహ్మమునుండియే వచ్చితిమనుకొందముగాక! కాని యిక్కడ సుఖకరముగను హృద్యము

గను ఉన్నదే! కావున ఈ ప్రపంచమునందుండియే సాధ్యమగు నంత సుఖమును ఏల పొందరాదు? దీనిని విడిచిపోవనెంచుట ఎందులకు?'' అని ప్రశ్న వేయుదురు, 'అనుదినము ఈ లోకమున ఎటువంటి అభివృద్ధులు అత్యద్భుతముగ జరుగుచున్నవో చూడుడు! ఎన్నెన్ని భోగ్యములు కల్పితములగుచున్నవో! ఈ లోకము విశేషసౌఖ్యప్రదముగ నున్నది. మన మెక్కడికో వెడలిపోయి, ఇదికాదని దేనికొఱకో పాటుపడుటేల?' అందురు. దీనికి మొదటి సమాధాన మిది. ఈ ప్రపంచము నాశముకాక తప్పదు. ఛిన్నాభిన్నమై పోవలసినదే. అనుభవించిన వానినే చర్వితచర్వణముగా ఇందు మన మనుభవించుచున్నాము. ఇప్పుడు మనము చూచునట్టి విషయము లన్నియు అనేకసారులు పూర్వము మరల మరల జరుగుచువచ్చినవే. మనము నివసించు ఈ భూలోకము అనేక పర్యాయములు సృష్టిమై యున్నదే. పెక్కు సారులు నే నిట్లు కాన్పించి మీతో ప్రసంగించియే యున్నాను. అటుల జరిగియేయుండవలయునని మీకును తెలియవచ్చును. ఇప్పుడు మీరు వినుచున్న ఈ పలుకులనే పూర్వము పలుసార్లు మీరు వినియున్నారు. ఇంకను చాలతడవలు ఇట్లు విననున్నారు. ఆత్మ లెన్నడును మాఱలేదు. శరీరములు మాత్రము నిరంతరము విచ్ఛిన్నములగుచు పునరావృత్తిని పొందుచున్నవి. ఇక రెండవ సమాధానము. ఇవన్నియు కాలనియమానుసారము మాటిమాటికి జరుగుచుండునవే. మూడో నాలుగో పాచికలు మన చేత నున్న వనుకొనుడు. వానిని క్రిందవైచినచో ఒకదానిపైన అయిదు చుక్కలు, ఇంకొకదానిపైన నాలుగు, మఱొకదానిపైన మూడు, వేఱొకదానిపైన రెండు చుక్కలు తిరుగబడినవనుకొనుడు. వానిని మరల మరల క్రిందవైచుచు పోగాపోగా, ఎంత వ్యవధియైనను, అప్పుడప్పుడు మరల ఆ సంఖ్యలే తిరుగబడుచుండుట తప్పదు. ఇది అవాంతరధర్మము. ఆత్మలకును వాని శరీరములకును ఇట్టి స్థితియే సంఘటిల్లుచుండును. ఇంత కాలమునకు ఇది తటస్థించును అను

నిర్ణయము లేకున్నను, ఒకేరీతి కలయికలును ఎడబాటులును సంభవించుచునే యుండును. ఒకేరీతి పుట్టుకలు, తిండ్లు, త్రాగుడులు, తుదిని మరణములు జరుగుచునేయుండును. ఇవియే అనేక ఆవృత్తులుగా మరల మరల జరుగుచుండును. ఈ భూలోకసౌఖ్యములను మించిన దేదియు కొందరికి గోచరింపనే గోచరింపదు. కాని కొందఱు మాత్రము అత్యున్నతముగ నెగిరిపోయి ఈ ఐహిక సుఖములే ప్రధాన పర్యవసానములు కావనియు, ఇవి కేవలము ఆనుషంగికములు (అనగా ఇతరముల ననుసరించివచ్చునవి) అనియు గ్రహింపగల్గుదురు

చిన్నపురుగు మొదలు పురుషశ్రేష్ఠుని వఱకును గల స్వరూపములన్నియు, షికాగోనగరమందలి ఫెర్రిస్‌వ్హీల్ అను బ్రహ్మాండమగు రంగులరాటమున గల ఉయ్యేలలవంటివి. ఈ రాటము నిరంతరము తిరుగుచుండును. కాని దానియందు కూర్చుండువారు మారుచుందురు. ఒకడు ఏదో ఆసనమున కూర్చుండును; ఆ చక్రముతో చుట్టంతయు తిరుగును; ఆపిదప దానిని విడచిపోవును. కాని ఆ చక్రమేమో తిరుగుచునేయుండును. జీవుడొకానొక శరీరమున ప్రవేశించి అందు కొంత కాలము వసించును. అంతట దానిని విడచివేసి మఱొకదానిలోనికి పోవును. దానిని కూడ విడచివేసి వేఱొకదానిలో ప్రవేశించును. ఈ భవచక్రమును (అనగా ఐహికజన్మపరంపరను) పూర్తిగ విడచివేసి, వెడలివచ్చి, దానినుండి ముక్తుడగువఱకును అటుల జీవుడు తిరుగుచు ఉండవలసినదే.

ప్రతిదేశమందును ప్రతియుగమునందును నరజీవితము యొక్క భూతభవిష్యద్వర్తమానముల తెలిసికొనగలుగు మహాచ్ఛక్తులు గలవారుందురు. ఆ రహస్య మిది! ఆత్మ, ఈ కార్యకారణ చక్రమునందు తగుల్కొనియున్నంతవఱకు, తన సహజమగు స్వాతంత్ర్యమును సంపూర్ణముగ కోల్పోక పోయినను –

ముక్తపురుషులగు కొందఱివలె ఈ కర్మచక్రము నుండి జీవాత్మను వెలికితీయుశక్తి కలిగియున్నను — దాని కర్మలు చాలవఱకు ఈ కార్యకారణ పరంపరాధర్మమును అనువర్తించుచునేయుండును. కాబట్టి ఈ కార్యకారణపరంపరను విమర్శింపగల బుద్ధిశాలికి భూతభవిష్యద్వర్తమాన గతులను గ్రహించుటకు అవకాశము గలదు.

కామము (అనగా కోరిక) ఉన్నంతవఱకును కొఱత ఉన్నదనియే తెలియవలెను. ప్రపూర్ణుడైన ముక్తపురుషునికి కోరికలుండజాలవు. బ్రహ్మము దేనినిగాని అభిలషించుట పొసగదు. కోరికలుండిన, అతడు బ్రహ్మముకాడు. పూర్ణుడునుకాడు. కాబట్టి "భగవంతుడు దీనిని వాంఛించును, దానిని వాంఛించును; అప్పుడు కోపించెను, ఇప్పుడు ఆనందించును" అను పలుకులు బాలప్రలాపములు! అర్థహీనములు! కావున మహోపదేష్టలందఱును "దేనినిగాని కోరుకొనకుడు; సకలవాంఛలను విడచివేయుడు; పరిపూర్ణముగ తృప్తులై మెలగుడు" అను ఉపదేశమునే చేసియున్నారు.

పసివాడు బోసినోటితో ప్రాకులాడుచు ఈ లోకమున ప్రవేశించుచున్నాడు. వృద్ధుడును బోసినోటితో ప్రాకులాడుచు ఈ లోకమునుండి వెడలిపోవుచున్నాడు. ఇట్లు ఆద్యంతములు ఒక్కతీరుగ కాన్పించును. కాని ఒకనికి ప్రపంచానుభవము అలవడనేలేదు; రెండవవాడో దానిని పూర్తిగ పొందియున్నాడు. ఆకాశభూతమున (ఈథర్) స్పందనము (చలనము) మిగుల మందముగనున్నప్పుడు, మనము దేనిని గూడ చూడలేము; అంతయు చీకటిగనుండును. ఆ స్పందనము అతి తీవ్రముగ నున్నప్పుడును చీకటియే పర్యవసానము. ఆ ఆద్యంతముల నడుమగల అంతరము ధ్రువములమధ్య నుండునంత (భూమియొక్క ఉత్తరదక్షిణపు కొనలమధ్యనుండు అంతరమంత) అగణితమైనది; అయినను సామాన్యముగ ఆ ఆద్యంతదశలు రెండును సమములుగ కాన్పించును. గోడకు వాంఛితార్థములు లేవు; సిద్ధపురుషునికిని లేవు.

కాని గోడకు వాంఛలను సంకల్పించు శక్తి లేకున్నది; సిద్ధపురుషునకో వాంఛింపదగిన విషయములు లేవు. మెదడు చెడుటచేత ఈ ప్రపంచమున దేనినిగాని అభిలషింపని పిచ్చివాం డుండ వచ్చును; మఱియొకడు అభిలాషాతీతుడై ఉత్తమదశయం దుండ వచ్చును. ఈ రెండు దశలకును మధ్య ధ్రువముల నడుమనున్నంత అంతరమున్నది! ఒకడు పశుదశకు కడుసమీపముననుండ, రెండవ యతడు బ్రహ్మమునకు సన్నిహితుడై యుండును!! ఒకడు బద్ధుడు; రెండవయతడు ముక్తుడు!!!



# మానవుని సత్యస్వరూపము, దృశ్యస్వరూపము

(న్యూయార్క్‌లోని ఉపన్యాసము)

మన మిచ్చట నిలబడియున్నాము. కాని మన దృష్టి యెంతో దూరము—మైళ్ల దూరముకూడ—ముందుకు పాఱుచుండును. మానవుడు బుద్ధి యెఱిగినది మొదలిట్లు చేయుచున్నాడు. అత డెప్పుడును ముందుకు చూచుచుండును. భవిష్యత్తులోనికి చొరబాఱుచుండును. శరీరపతనానంతరము తా నెచటికి పోవు నదికూడ ఎఱుగగోరును. ఈ జిజ్ఞాస తీర్చుటకై యెన్నో ఊహలు చేయబడినవి. ఎన్నో మతములు ప్రతిపాదింపబడినవి. అందు కొన్ని నిరాకరింపబడెను. కొన్ని అంగీకరింపబడెను. భూలోకమున మానవు డుండువఱకు, మానవునికి ఆలోచనాశక్తి ఉండువఱకు, ఇట్లే జరుగుచుండును. ప్రతి మతములో కొంత సత్యము కలదు; సత్యముకాని దెంతో కలదు. హిందూదేశములో ఈ విషయమునుగూర్చి జరిగిన విచారముయొక్క పర్యవసానమును మీ కిపుడు తెలుప ప్రయత్నింతును. హైందవ తత్త్వజ్ఞు లీవిషయమున నప్పటప్పటికి ప్రకటించుచు వచ్చిన వివిధభావములను సమరసపఱుప జూచెదను. మానసికశాస్త్రజ్ఞుల భావములకును, ఆధ్యాత్మికశాస్త్రజ్ఞుల భావములకును, పొందిక కల్పింపజూచెదను. సాధ్యమైనచో, ఈ రెంటిని ఆధునికభౌతికశాస్త్రజ్ఞుల భావములతోకూడ పొందుపఱుప జూచెదను.

ఏకత్వము నన్వేషించుటే వేదాంతశాస్త్రపు పరిశ్రమ మంతయు. హిందువుల బుద్ధి వ్యష్టిసంఘటనములందును, వ్యష్టి విశేషములందును, ఆసక్తము కాదు. దానికి కావలసినది సామాన్య—కాదు, సార్వలౌకిక — ధర్మములు. "ఏది తెలిసినచో, తదితర మంతయు తెలియనగునో" : దాని కొఱకే అన్వే

షణ మంతయు. "ఒక్క మట్టిముద్దను గ్రహించినచో, మట్టి సంబంధమైన దంతయు ఎట్లు గ్రాహ్యమగునో, అట్లు దేని నెఱిగినచో, ఈ అఖిలప్రపంచము ఎఱుకపడునో" : ఆ పదార్థము కొఱకే అన్వేషణ మంతయు. ఈ ప్రపంచమును పరిశోధించినచో, అదంతయు నొకే భౌతికపదార్థముగా తేలునని హిందూతత్త్వజ్ఞుల మతము. దానిని వారు "ఆకాశము" అందురు. శబ్దస్పర్శరూపరసగంధ భావములతో మనకు గోచరించునదంతయు ఆకాశము దాల్చు నొక్కొక్క రూపభేదమే. అది సర్వగతము, సూక్ష్మము. ఘన, ద్రవ,వాయుపదార్థములని; ఆకృతులు, మూర్తులు, శరీరములు అని; భూమి, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు అని : మనము వ్యవహరించునదంతయు ఈ ఆకాశపదార్థ కల్పితమే.

ఈ ఆకాశపదార్థముతో జగత్తు నిర్మించునది ఏ శక్తి ఆకాశముతోపాటు సర్వవ్యాపిశక్తికూడ కలదు. లోకములో కానిపించు శక్తి యంతయు—బలరూపమున గాని, ఆకర్షణరూపమున గాని, చివరకు చింతనరూపమున గాని — ఆ యేక శక్తియొక్క రూపభేదములే. హిందువు లా శక్తిని "ప్రాణము' అందురు. ఈ ప్రాణ మాకాశముతోడి సంయోగమువలన ఈ జగత్తు నంతయు సృజించుచున్నది. ప్రతికల్పాదియందును "ప్రాణము" ఆకాశమనెడు అనంతసాగరములో నిదురపోవుచుండు ననవచ్చును. అప్పుడు దానిలో చలనముండదు. పిదప అది మేలుకాంచి మొదలునప్పుడు—కంపింప నారంభించినప్పుడు — ఈ ఆకాశ సాగరము నుండి గ్రహ మండలములు, సూర్యులు, చంద్రులు, నక్షత్రములు, భూమి, మానవులు, జంతువులు, వృక్షములు, వివిధశక్తులయొక్క గోచరరూపములు, ప్రకృతిరచనావిశేషములు: ఇవన్నియు బయలు వెడలును. కావున వీరి మతప్రకారము వివిధరూపములతో గోచరించు శక్తి కంతటికిని మూల మీ ప్రాణము; వివిధరూపములతో గోచరించు భౌతికపదార్థ మంతటికిని మూల మీ ఆకాశము. ఈ కల్పాంతమున ఘనపదార్థ మనబడున దంతయు కరగి అంతకన్న

సూక్ష్మమగు ద్రవరూపము నందును. అదియు కరగి వాయురూప మందును. అది యింకను సూక్ష్మములును, ఇంకను సమరూపములును అగు వేడిమిసెగలందును, ఆ పిదప సర్వమును మూల పదార్థమగు ఆకాశమందును లీనమైపోవును. ఆకర్షణ (ఎట్రాక్షన్) నిరాకరణ (రిపల్షన్) ములు, చలనము, అనబడున వన్నియు మూలశక్తియగు ప్రాణమందు లయించును. అంతట ఈ ప్రాణము మరల కొంత కాలము నిదురించి, మరల లేచి, మరల ఈ రూపముల నెల్ల ప్రదర్శించి, కల్పాంతమున మరల పూర్తిగా అడగి పోవును. ఇట్లే సృష్టి అడగిపోవుచు, పొడచూపుచు, ముందువెనుకల నడుమ నూగులాడుచుండును. ఆధునిక భౌతిక శాస్త్రపరిభాషలో నిది యొకప్పుడు స్థితిశీలముగను (స్టాటిక్) మఱొకప్పుడు గతిశీలముగను (డైనామిక్) ఉండును. ఒకప్పు డిది ప్రసుప్తము, వేఱొకప్పుడు క్రియాశీలము. అనాదినుండియు ఈ మార్పులు కలవు.

ఈ పరిశీలన మింకను అసమగ్రమే. ఆధునిక భౌతికశాస్త్రజ్ఞులకుకూడ ఇది తెలిసిన విషయమే. వారి యన్వేషణ మింతకు మించి పోజాలదు. కాని అందుచే మన పరిశీలనమేల నిలిచిపోవలెను? దేని నెఱిగినచో సర్వ మెఱుకపడగలదో, ఆ వస్తువును మన మింకను అందుకొనలేదు గదా. మన మిప్పటికి చేసిన పని ఈ జగత్తు నంతయు భౌతికపదార్థము, శక్తి—లేక పూర్వికుల పరిభాషలో ఆకాశము, ప్రాణము — అను రెండు అంగములుగా విభజించుట. ఈ ప్రాణాకాశములకు మూలపదార్థ మేదియో దానిని కనుగొనుట మన అనంతరకార్యము. ఈ రెంటికన్న ఉన్నతమగునది మనస్సు. దాని కివి రెండును అంగములని నిరూపింపవచ్చును. సర్వత్ర వ్యాపించియుండు మననశక్తి యగు మనస్సు (లేక, మహత్తు) లో నుండియే ఇవి రెండును కల్పింపబడినవి. ఈ రెంటికన్న మహత్తు సూక్ష్మతరము. అదియే ఈ రెండుగా చీలునది. ప్రథమమున నుండిన దీ మహత్తే. అది వ్యక్తరూప

మొందినపుడు మాఱి యీ రెండుగా నైనది. ఈ రెంటి కూడి కచే జగత్తంతయు నిర్మింపబడినది.

ఇక మనశ్శాస్త్రమునకు వత్తము. నేను మీవైపు చూచుచున్నాను. కన్నులీ బాహ్యవిషయస్పర్శలను నాకడకు తెచ్చుచున్నవి. స్పర్శనాడులు వానిని మెదడునకు చేర్చును. కన్నులు దృగింద్రియములు కావు. అవి బాహ్యోపకరణమాత్రములు. ఎట్లన, ఈ విషయస్పర్శను మెదడునకు కొనిపోవు స్పర్శేంద్రియము నశించినచో, నాకిరువది కన్నులున్నను, మిమ్ము చూడజాలను. కంటిపాప పొరపై నేర్పడు బింబము ఎంత సమగ్రముగానున్నను, మీరు నాకగపడరు. కావున ఇంద్రియము వేఱు, దాని ఉపకరణములు వేఱు. ఈ ఉపకరణముల (కన్నుల) వెనుక ఆ దృగింద్రియము ఉండవలెను. విషయస్పర్శలన్నిటిసంగతి ఇదే. ముక్కు ఘ్రాణేంద్రియము కాదు. అది ఉపకరణమాత్రము. ఇంద్రియము దాని వెనుక నున్నది. మనకు గల ఐదింద్రియములలోను మొదట భౌతికశరీరములో బాహ్యోపకరణము లుండును. కాని ఇవి చాలవు. నేను మీతో మాట్లాడుచున్నాను. మీరా మాటల నేకాగ్రతతో వినుచున్నారనుకొనుడు. అప్పుడేదో జరుగును. గంట మ్రోగిన దనుకొనుడు. ఆ శబ్దము మీకు వినిపింపక పోవచ్చును. శ తరంగములు మీ చెవిని చేరి గూబను తాకినవి. నర మూ స్పర్శను మెదడునకు కొంపోయినది జరుగవలసిన ప్రక్రియ యంతయు ఇట్లు జరిగినను, మీకా శబ్దమేల వినరాలేదు ? ఏదో కొఱవడినది. మనస్సు ఇంద్రియముతో చేరలేదు. మన స్సింద్రియముతో చేరకున్నప్పుడు ఇంద్రియమే వార్త తెచ్చినను, అది స్వీకరింపదు. ఇంద్రియముతో చేరినప్పుడే అది వార్తలను స్వీకరింపగలదు. కాని ఇంతటితో కార్యక్రమ మంతయు పూర్తికాలేదు. ఉపకరణములు బాహ్యస్పర్శను తేవచ్చును ; ఇంద్రియములు వానిని లోనికి చేర్పవచ్చును ; మనస్సింద్రియములతో చేరియుండవచ్చును ; కాని బోధము (పెర్

సెప్షన్) కలుగకపోవచ్చును. ఇంకొక కార్యము జరుగవలెను. లోపల నొక ప్రతిక్రియ (రియాక్షన్) కలుగవలెను. ఆ ప్రతిక్రియ కలుగుటతోడనే బోధ ముదయించును. బాహ్యావిషయము వార్తా తరంగమును నా మెదడులోనికి పంపును. నా మనస్సు దానిని స్వీకరించి, బుద్ధియెదుట పెట్టును. బుద్ధి తనయందు అతః పూర్వము కలిగియున్న భావాంకముల (ఇంప్రెషెన్స్) తో దానిని వర్గీకరించి ప్రతికారతరంగమును పంపును. ఆ తరంగము తోడనే బోధ మేర్పడును. కాని ఇంకను కార్యక్రమము ముగియ లేదు. ఇం కొక్క కార్యము మిగిలియున్నది. ఇచ్చట నొక ఛాయాగ్రాహక యంత్రము (కెమెరా) కలదనుకొనుడు. అచట నొక పటము (గుడ్డ) కలదు. ఆ పటముపై నొక వస్తురూపమును కల్పింపవలెనని నా ఉద్దేశము. నేనేమి చేయవలెను? వస్తువు యొక్క వివిధ కాంతికిరణము లా యంత్రముగుండా పోయి ఆ పటముపైబడి చేరియుండునట్లు చేయవలెను గదా. ఈ రూప మును గ్రహింప నేర్పడిన వస్తువు నిశ్చలముగా నుండుట కూడ అవసరము. చలించుచున్న వస్తువుపై రూపము నెట్లు కల్పింప గలను? అది నిలుకడయైన వస్తువుగా నుండవలెను. ఏలనన, నేను దానిమీాదికి పఱుపునట్టి కాంతికిరణములు చలించుచుండును. ఈ చలించు కిరణములను చేరదీసి, యొకచోట కూర్చి, వానికి పరస్పర సామరస్యము కల్పించి, సమగ్రపఱచుట స్థిరవస్తువు మీాదనే కదా సాధ్యమగును? మన విషయస్పర్శల సంగతికూడ ఇట్టిదే. ఇంద్రియములు వానిని లోనికి తెచ్చి మనస్సునకడ చేర్పగా, మనస్సు వానిని బుద్ధియెదుట పెట్టును. బుద్ధికి వెనుక స్థిరవస్తు వొకటి లేనిచో, ఈ వివిధస్పర్శచిహ్నములకు అచట పొందిక కుదిరి, ఏకీభావ మేర్పడి, బాహ్యావిషయరూపము నిర్దుష్టముగా నచట చిత్రిత మగుట అసాధ్యము గదా. మార్పుల మఱు మగు మన మనశ్శరీరసంయోగమూర్తిలో ఏకీభావము కల్పించు చుండునదేది? క్షణక్షణము చలనమొందు (మాఱు) చుండు ఈ

వస్తువును మునుపటిదే అని గుర్తింప సాధ్యపఱచునదేద్ది? మన మనస్సులపై ముద్రితములై యుండు వివిధభావచిహ్నములు దేనిపై నొకటిగా కూర్పబడును? ఇంద్రియగోచరవస్తుచిహ్నము లన్నియు దేనిపై కూడి స్థిరముగా నిలిచి, పొందికగల సమష్టిరూపముతో అగపడును? ఈ కార్యము సాధ్యమగుట కొక వస్తు వుండవలెననియు, మనశ్శరీరములతో పోల్చిచూచిన నది నిశ్చలమైనదిగా ఉండవలెననియు, కనుగొనియున్నాము. ఛాయాగ్రాహియంత్రమొక పటముపై గదా రూపకల్పనము నొనర్చును. కాంతికిరణములతో పోల్చిచూచిన ఆ పటము నిశ్చలమైనది కానిచో, దానిపై రూప మేర్పడునా? దీనినిబట్టి తేలిన దే మనగా, మనస్సు ఆకృతులను దేనిపై చిత్రించుచున్నదో, మనోబుద్ధులు కొనితెచ్చు విషయస్పర్శలు దేనిపై నిలిచి వర్గీకరణమొంది సమష్టిరూపము దాల్చునో, అది—ఆ దర్శించు వస్తువు—వ్యక్తిత్వము గలదిగా నుండవలెను. దానిని మానవుని ఆత్మ యందురు.

ప్రాణాకాశములుగా చీలునది విశ్వమానసము (మహత్తు) అనియు, మానసమున కావల మనలో ఆత్మ కలదనియు, కనుగొంటిమి. జగత్తులో విశ్వమానసమునకు వెనుక నొక ఆత్మ (విశ్వాత్మ) కలదు. దానినే దైవమందురు. మానవవ్యక్తిలో నుండుదానిని మానవాత్మ (జీవాత్మ) యందురు. ఈ జగత్తులో, ఈ ప్రపంచవ్యవస్థలో, విశ్వమానస మెట్లు ప్రాణాకాశములుగా వికాసమొందెనో, అట్లే విశ్వాత్మ విశ్వమానసముగా వికసించెనని మన మెఱుగవలెను. వ్యక్తియందు కూడ ఇట్లే జరుగునా? అతని శరీరమును సృజించునదతని మానసమేనా? అతని మానసమును సృజించున దతని ఆత్మయేనా? అనగా, అతని ఆత్మయు, మనశ్శరీరములును, మూడు ప్రత్యేక భిన్నవస్తువులా, మూడును ఒకదానిలోనివేనా, లేక ఒకే వస్తువుయొక్క మూడు భిన్నావస్థలా? ఈ ప్రశ్నకు సమాధానము కనుగొనుటకై మనము క్రమేణ యత్నింతుము. మనకు కానిపించు ఈ బాహ్యశరీరము

లోపల స్పర్శేంద్రియ మనో బుద్ధులును, బుద్ధివెనుక ఆత్మయు, కలవని యిప్పటికి కనుగొంటిమి. ఆత్మ శరీరము కాదనియు, మనస్సుకూడ కాదనియు, మన తాత్కాలిక నిర్ణయము. మత ప్రపంచమున నిచ్చట అభిప్రాయభేదము లేర్పడుచున్నవి. ద్వైత నామమున పరగు మతము లన్నియు ఆత్మ సగుణ మనును. దాని కనేకగుణములు కలవని, మన అనుభూతులన్నియు—భోగములు, కష్టములు, సుఖములు—నిజముగా దానివే అని, బోధించును. ఆత్మ కట్టిగుణము లేవియు లేవనియు, అదినిర్గుణ మనియు, అద్వైతుల మతము.

మొదట ద్వైతులను కైకొని, ఆత్మనుగూర్చియు, దాని అనంతరగతినిగూర్చియు, వారి భావమును తెలుపయత్నింతును. పిదప ద్వైతభావమును నిరాకరించుమతమును విచారించి, చివరకు, అద్వైతమతము చేకూర్చు సామరస్యమును కనుగొన యత్నింతము. జీవాత్మ మనశ్శరీరములకంటె భిన్నము గనుకను, అది ప్రాణాకాశసమ్మేళనఫలము కాదుగనుకను, మృత్యురహితమై యుండవలెను. ఏల? మృత్యువనగా నేమి? మూలవస్తువులుగా చీలిపోవుట. వస్తుసంయోగముచేత కలిగినదానికే కదా ఇట్లు వియోగము కలుగగలదు. రెండు మూడు వస్తువుల కూడికచే కలిగిన వస్తువే వియోగదశలో మూలవస్తువులుగా చీలిపోగలదు. సంయుక్తవస్తువు కాకుండుదానికి వియోగదశ, అనగా మృత్యువు, కలుగనేరదు. అది నిత్యము. అనంతకాల మది నిలిచియే యుండును. అది సృష్టింపబడినది కాదు. సృష్టింపబడిన వస్తువులన్నియు సంయుక్తములే. శూన్యములోనుండి సృష్టి కలుగుట నెవ్వరును చూడలేదు. మన మెఱిగిన సృష్టియంతయు అతఃపూర్వముండిన కొన్ని వస్తువులనుగూర్చి కల్పింపబడిన క్రొత్త రూపములే. కావున అసంయుక్తవస్తువగు జీవాత్మ అనాదిసిద్ధమైనదిగా నుండవలెను. అనంతముగా ఎప్పటికిని ఉండును. శరీరపతనానంతరముకూడ ఆత్మ నిలిచియుండును. వేదాంతమతప్రకారము ఈ

శరీర వియోగకాలమున నరుని జీవశక్తులు మరలి మనస్సులో లీనమగును. మనస్సు ప్రాణములో లీనమగును, ప్రాణము ఆత్మలో చేరును. అంతట జీవాత్మ సూక్ష్మశరీర మనబడు దానితోకూడ (దానిని ఆచ్ఛాదనముగా ధరించియో యన) బయటకు వచ్చును. దానిని మీరు మానసికశరీర మనిగాని, పారమార్థికశరీర మని గాని అనవచ్చును. మానవుని సంస్కారములు దీనిలో నుండును. సంస్కారము లనగా నేమి? మన స్సొక సరస్సు వంటిది. ప్రతి తలంపు ఆ సరస్సునం దొక తరంగ మనవచ్చును. సరస్సులో తరంగము లెట్లు మీది కెగయుచు క్రిందపడి అదృశ్యమగుచు ఉండునో, అట్లే ఈభావతరంగములుకూడ చిత్తమున పొడచూపుచు, అడగిపోవుచు ఉండును. కాని ఆ అడగిపోవుట తాత్కాలికముమాత్రము. అవి క్రమాధికముగా సూక్ష్మములును, సూక్ష్మతరములును, అగును గాని, అన్నియు అచటనే, పిలుపు వినవచ్చినంతనే పై కెగసివచ్చుటకు సంసిద్ధములుగా, అడగియుండును. జ్ఞప్తిచేసికొను టనగా, సూక్ష్మరూపమున నడగియున్న భావములను మరల తరంగరూపమున వెలికి రమ్మని పిలుచుటయే. మనము తలచిన తలపు లన్నియు, చేసిన పను లన్నియు, మనస్సులో నిట్లు సూక్ష్మరూపమున నిలిచియుండును. మానవుడు మృతినొందినప్పుడు ఈ సూక్ష్మచిహ్నములు సమష్టిరూపమున మనస్సులో నుండును. కాని మనస్సు ఈ కవిలె నొక సూక్ష్మపదార్థము (శరీరము) లోని కనిపైవైచును. ఆత్మ ఈ సంస్కారములను, సూక్ష్మశరీరమును, ధరించియోయన బహిర్గతమగును. ఈ వివిధసంస్కారములచే చిహ్నితములైన వివిధశక్తులయొక్క సమష్టిఫలముచే ఆత్మయొక్క అనంతరగతి నిర్ణయింపబడును. మా శాస్త్రములలో ఆత్మకు మూడు వేర్వేఱు గమ్యములు పేర్కొనబడినవి.

ఆధ్యాత్మికోన్నతి గనిన వారు మరణించినప్పుడు, సూర్య కిరణముల వెంట బోయి సూర్యలోక మనబడుదానిని చేరుదురు.

దాని ద్వారా చంద్రలోక మనబడుదానిని, దానిగుండా విద్యుల్లోక మనబడుదానిని చేరుదురు. అప్పటికే పరమసుఖస్థితి (ముక్తి) నందిన మఱొకఆత్మ వారి నచట కలసికొని, లోకము లన్నిటిలో ఉన్నతమగు బ్రహ్మలోకమునకు తోడ్కొనిపోవును. ఈ ఆత్మ లచ్చట సర్వజ్ఞులును, సర్వశక్తిమంతులును అగుదురు. దాదాపు భగవంతునకున్నంత జ్ఞానశక్తులు వారి కలవడును. వారి కచటనే స్థిరనివాసమని ద్వైతులును, కల్పాంతమున వారు బ్రహ్మముతో నైక్యమొందుదురని అద్వైతులును చెప్పుదురు. ఫలాపేక్షతో సత్కార్యము లొనర్చినవారు రెండవతరగతికి చేరుదురు. వీరు మరణించినప్పుడు తమ సత్కార్యఫలముగా చంద్రలోకము అనబడు దానికి కొంపోబడుదురు. అందనేక స్వర్గములుండును. వారి కచట సూక్ష్మశరీరములు — దేవతాశరీరములు — ప్రాప్తించును. వారు దేవతలై స్వర్గసుఖము ననుభవించుచు, దీర్ఘకాల మచట నివసింతురు. తదనంతరము వారి పూర్వకర్మము వారిని మరల ఎదుర్కొని భూలోకమునకు పడద్రోయును. వాయులోక, మేఘలోకాదిమార్గమున వర్ష బిందురూపమున వారు భూలోకమున పడుదురు. అచట వా రేదొయొక ధాన్యములో చేరియుందురు. వారి సూక్ష్మశరీరమునకు వలయు పదార్థము నమర్ప నర్హుడగువా డా ధాన్యమును సకాలమున తినుట తటస్థించును. చివరతరగతి వారు పాపాత్ములు. వారు మరణించినప్పుడు భూతములుగను, పిశాచములుగను, అయి భూమికిని చంద్రలోకమునకును, నడుమ నెచటనో నివసించుచుందురు. ఇందు కొందఱు మానవుల కశాంతి కలిగింతురు. కొందఱు నెయ్యముచూపుదురు. ఇట్లు కొంతకాల ముండినపిదప వారు భూమిపైకూలి జంతువులగుదురు. జంతుశరీరమున కొన్నాళ్లు గడపినపిదప అందుండి విముక్తులై మరల మానవు లగుదురు. వారి కప్పుడు మోక్షసాధనార్థము కృషిచేయుటకు మఱొక అవకాశము లభించును. దీనిని బట్టి తేలినదేమనగా, దాదాపు పరిపూర్ణస్థితి నందుకొన్నవారు —

అతిస్వల్పకల్మషశేషము మాత్రమే కలవారు— సూర్యకిరణమార్గమున బ్రహ్మలోకమున కేగుదురు. మధ్యమస్థితి నందినవారు — స్వర్గకాంక్షతో కొంత సత్కార్మ మొనర్చినవారు — చంద్రలోకములోని స్వర్గముల కేగి దేవతాశరీరము లందుదురు. కాని వారు మరల మనుష్యరూప మొందవలెను. అనగా, పరి పూర్ణత్వ మొందు నవకాశము వారికి మరల నింకొకసారి లభించును. మిక్కిలి పాపిష్ఠులుగా నుండినవారు భూతపిశాచములై ఆపిదప మృగములు కావలసియుందురు. అంతటమరల మానవులై సిద్ధత్వమును సాధించుటకు మఱొక అవకాశము గాంతురు. భూలోకమును కర్మభూమి యందురు. మానవుడు సత్కార్మముగాని దుష్కార్మముగాని యొనర్చు చోటిదియే! స్వర్గకాంక్షతో సత్కార్మమొనర్చి దేవత్వ మొందినవాడా దేవతాశరీరముతో దుష్కార్మము పోగుచేసికోజాలడు. భూలోకమున నొనర్చిన సత్కార్మఫలమనుభవించుటే అచట జరుగు పని. ఆ సత్కార్మము వ్యయమగుటతోడనే తన పూర్వజీవితపు దుష్కార్మసంచయముయొక్క సమష్టిబల మెదుర్కొని అతనిని మరల భూలోకమునకు దిగద్రోయును. అట్లే పిశాచములైనవారు ఆదశలో క్రొత్త కర్మమునుకూర్చుకొననేరరు. పూర్వదుష్కార్మఫలముల ననుభవించుటే అపుడు జరుగునది. వారు పిదప జంతుశరీరములతో నున్నప్పుడు జరుగునది కూడ ఇదియే. ఆ దశయు అంతమొందినపిదప వారును మానవులగుదురు. సత్కార్మములకు పారితోషికరూపముననుు, దుష్కార్మములకు శిక్షారూపమునను, కలుగు జీవితదశలు నూత్నకర్మమును కూర్ప సమర్థములు కావు ఆ కర్మఫలముల ననుభవించుటకు మాత్రమే ఆ దశలు కలుగును. మిక్కిలి అసాధారణరూపములగు సత్కార్మములును, దుష్కార్మములును, అతి త్వరితముగా ఫలమిచ్చును. ఎట్లనగా జీవితకాలమున నంతయు దుష్కార్యములే చేయుచుండినవాడు ఏదో యొక్క సత్కార్య మొనర్చెనేని, ఆ సత్కార్యఫలము వెంటనే కలుగును. కాని ఆ ఫలాను

భూతి ముగియుటతోడనే అతని దుష్కార్యఫలములుకూడ అనుభవమునకు వచ్చును. సగటున జీవితవైఖరి మంచిదికాకపోయినను, కొన్నిసత్కార్యములను, కొన్ని మహాకార్యములను, చేసినవారు దేవతలగుదురు. కాని కొన్నాళ్లా దేవతాశరీరములతో నుండి, దేవతాశక్తులనుభవించినపిదప, వారు మరల మానవులు కావలసియుండును. సత్కర్మబల మిట్లు వ్యయమగుటతోడనే తొంటి దుష్కర్మ మనుభవమునకు వచ్చును. మిక్కిలి అసాధారణ దుష్కార్యము లొనర్చినవారు భూతపిశాచశరీరములు ధరింపవలసి వచ్చును. ఆ దుష్కర్మఫల మంతయు అనుభుక్తమైనపిదప వారార్జించుకొనియున్న కొద్దిపాటి సుకృతముచే వారు మరల మనుష్యత్వ మందుదురు. బ్రహ్మలోకమునకు (ఆ లోకము ప్రాప్తించినవారికి పునఃపతనముగాని పునరావృత్తిగాని లేవు.) పోవు మార్గమునకు దేవయాన మనియు, స్వర్గలోకమునకు పోవుమార్గమునకు పితృయానమనియు పేళ్లు.

కావున వేదాంతమతప్రకారము సర్వభూతములలో మానవుడు శ్రేష్ఠుడు. కర్మక్షేత్రమగు ఈ భూలోకము సర్వలోకములలో శ్రేష్ఠము. ఇదియేకదా పరిపూర్ణత్వమొందు మహావకాశమును మానవునకు కల్పించునది. దేవతలు, దేవతలనుడు, ఊర్ధ్వలోకవాసులనుడు (ఏంజెల్సు) వారందఱును మనుష్యత్వ మందినగాని పరిపూర్ణులు కాజాలరు. ఇదియే మహాకేంద్రము, అద్భుత సమస్థితి, అద్భుతావకాశము— ఈ మానవ జీవితము.

తత్త్వశాస్త్రములలోగల రెండవ దృక్పథము నిప్పుడు పరికింతము. నే నిప్పుడు వివరించుచుండిన ఆత్మవాదమును బౌద్ధమతస్థులే మాత్ర మంగీకరింపరు. "ఈ మనశ్శరీరములకు మూలమగు వస్తు వేదో యొకటి కలదని ఊహించు టేల? భావప్రచారమున కీ అడ్డు కల్పించు టెందుకు? మనశ్శరీరములతోకూడిన ఈ మూర్తికాక మఱొక మూడవవస్తువు— ఈ ఆత్మ—కూడ కల

దని యేల అంగీకరింపవలెను? దానితోపనేమి? ఈ మూర్తిని గ్రహించుటకు వలయున దంతయు దానిలోనే లేదా? మూడవ వస్తువు నొకదాని నేల క్రొత్తగా తెచ్చి పెట్టుకోవలెను?'' అని వారి వాదము. ఈ వాదములు, ఈ తర్కము, బలిష్ఠములు. బాహ్య పరిశోధన కీ మూర్తి స్వయంబోధకముగనే కానవచ్చును. మన మనేకులమట్లు తలతు మనుట మాత్రము నిస్సంశయము. అగుచో, మన శ్శరీరములు రెంటికి భిన్నమై, రెంటికి వెనుక నిలిచి, రెంటికి మూలాధారమై, ఈ ఆత్మ యొకటి కలదని ఏల చెప్పవలెను? మనశ్శరీరములు మాత్రమే ఉండుగాక. నిరంతరపరిణామము (మార్పు) చెందుచుండు భౌతికపదార్థప్రవాహము పేరు శరీరము. నిరంతరపరిణామ మొందుచుండు చైతన్య (ఎఱుక) ప్రవాహము, లేక భావపరంపరాప్రవాహము, పేరు మనస్సు. బాహ్యదృష్టి కీ రెండును ఒకటిగా చూపట్టుటకు కారణమేమి? ఈ ఐక్యము నిజముకా దనుకొందము. మండుచుండు దివ్వటీ నొకదానిని వేగముతో గిరగిర త్రిప్పుము. చక్రాకృతిగల మంట కనిపించును. నిజమున కా చక్రము లేదు. కాని దివ్వటీయొక్క అవిరామపరిభ్రమణము ఆ చక్రభ్రాంతిని కల్పించుచున్నది. అట్లే ఈ జీవితములో ఐక్యము లేదు. అవిరామముగా, అపార వేగముతో, ప్రవహించుచుండు భౌతికపదార్థరాశి అది. ఈ పదార్థములరాశి నంతయు మన మొకేవస్తు వనవచ్చును. అంతియే. మనస్సు విషయముకూడ అట్టిదే. భావము లన్నియు పరస్పరభిన్నములు. ఐక్య భ్రాంతి కల్పించునది ప్రవాహవేగమే. కావున మూడవ వస్తువుతో అవసరము లేదు. జగ త్తంతటిలో కానిపించు ఈ మనశ్శరీరదృశ్యమే నిజముగా నుండునది. దీని కాధార మని మఱొకవస్తువును ప్రతిపాదింపకుము. ఈ బౌద్ధమత భావమును ఈ కాలమున కొన్నిమతములవారు, కొన్ని మతశాఖలవారు, అవలంబించి, ప్రతివారును అది క్రొత్త భావమనియు, తామే దానిని సృజించిరనియు చెప్పుకొను చున్నారు. బౌద్ధతత్వ

శాస్త్రము లనేకములలోని కేంద్రభావ మిది : 'ఈ జగత్తు స్వయం సాహాయ్యకము. దీని కొక మూలాధారమును కల్పింపజూచుట కేవలము అనావశ్యకము. ఈ ఇంద్రియగోచర ప్రపంచము వినా ఇంకేమియు లేదు. ఈ ప్రపంచమున కాధారభూతముగా నొక దానిని భావించుట నిష్ప్రయోజనము. గుణసముదాయమే ఈ సర్వమును. ఏదో ఒక వస్తువు కలదనియు, ఈ గుణములు దానికి సంబంధించినవనియు అహోహపడ నేల? వస్తు వేదో కలదను భ్రాంతికి కారణము గుణములయొక్క వేగవంతమగు పరస్పర వినిమయము (మార్పు) లే కాని, వాని వెనుక సుస్థిరవస్తు వొకటి కలిగియుండుట కాదు.' ఈ వాదములలో కొన్ని అత్యద్భుతములు; మన సామాన్యానుభవమున కనురూపములై యుండుటచే అవి ఎల్లరకు నచ్చును. నిజమునకు కోటి కొక్కరైన ప్రకృతిదృశ్యములుకాక వే ఱేదైన భావింపగలరా? జనసామాన్యమునకు ప్రకృతి ఎప్పుడును మాఱుచు, వేగముగా తిరుగుచు, కూడుచు, కలిసిపోవుచు, ఉండు పరిణామరాశిగనే తోచును. దీని వెనుక నుండు నిశ్చలసముద్రముయొక్క క్షణదర్శనభాగ్యమైన కలవారు మిక్కిలి అరుదు. జనసామాన్యమున కీ జగత్తు నిరంతరచలనమయమే, భీషణ కల్లోలరాశియే. మన కిప్పుడు రెండు వాదములు కానిపించుచున్నవి. మనశ్శరీరములకు మూలమై, నిర్వికారము సుస్థిరము అగు వస్తు వేదో కలదని యొకవాదము. నిర్వికారతగాని, సుస్థిరతగాని ఈ జగత్తులో లేనేలేదు, సర్వము మార్పులమయము. మార్పులుతప్ప నింకేమియు లేదు : అనునది రెండవ వాదము. ఈ భిన్నభావముల పరిష్కారము తత్త్వవిచారములోని ఆవలిమెట్టగు అద్వైతమతములో కలుగుచున్నది.

ఈ సర్వమునకు మూలమైన వస్తు వొకటి కలదు. అది నిర్వికారము (మార్పు లెఱుగనిది) అను ద్వైతవాదము నద్వైతమత మంగీకరించును. మార్పులులేని వస్తు వొకటి లేనిచో

మార్పు అను భావమునే మనము గ్రహింపజాలము. అంతగా మాఱని వస్తు వొకదాని నెఱిగినప్పుడే మనకు వస్తువులోని మార్పు గోచరమగును. అంతకన్న తక్కువగా మాఱు మఱొక వస్తువుతో పోల్చినప్పుడీ వస్తువుకూడ ఎక్కువ మార్పులు కలదిగనే గోచరించును. ఇట్లు పోగా పోగా, చివరకు మార్పులకే లోనుకాని వస్తు వొకటి ఉండి తీఱవలెనని మన మంగీకరింపక తప్పదు. ఈ వ్యక్తప్రపంచమంతయు నొక కాలమున అవ్యక్త స్థితిలో, నిశ్చలముగా, నిశ్శబ్దముగా, ఉండియుండవలెను. భిన్న ముఖముల నాకర్షించు పరస్పర విరుద్ధశక్తుల సంఘర్షణఫలమే ఆ నిశ్చలత్వము అప్పుడే శక్తియు గోచరరూపమున నుండదు. సమస్థితి (ఈక్విలిబ్రియం) చెదరినప్పుడే గదా శక్తి గోచరరూమునకు వచ్చును? ఆ సమస్థితికి మరల వచ్చుటకే జగత్తు అవిరామముగా పర్యాలిడుచున్నది. ఇంతకన్న నిస్సంశయముగా మనమే విషయము నెఱుగము. నిర్వికారవస్తు వొకటి కలదని ద్వైతులు చెప్పు మాట నిజమే; కాని అది మనస్సు కాదు, శరీరము కాదు, రెంటికిని భిన్నమగు మూలపదార్థము అనుట మాత్రము పొరపాటు. ఈ ప్రపంచమంతయు మార్పుల రాశి అను బౌద్ధవాదము నిస్సంశయముగా సత్యమే. ఏల నన నే నీ ప్రపంచమునకన్న వేఱైయుండు నంతవఱకు, నేను వెనుక నిలుచుండి యెదుటనుండు నొక వస్తువును చూచుచున్నంతవఱకు చూచువాడు చూడబడునది, అను రెండు వస్తువు లుండువఱకు ఈ ప్రపంచము మార్పులుగలదిగనే — ఎల్లప్పుడు మాఱుచుండునదిగనే — కానవచ్చును. యథార్థస్థితి యేమనగా, ఈ లోకములో వికారత కలదు, నిర్వికారతయు కలదు. ఆత్మ, మనస్సు, శరీరము మూడు ప్రత్యేకవస్తువులు కావు. ఈ మూడును గల మూర్తి ఏకవస్తువు. మనశ్శరీరములుగా, మనశ్శరీరముల కతీతముగా, కానిపించున దొకే వస్తువు. కాని అది ఏక కాలమున ఈ మూడుగా నుండదు. శరీరమును చూచు వానికి మనస్సు

నామరూపములు, లేక యూరపుదేశమువా రనునట్లు "దేశ కాల నిమిత్తత్వములు"—— ఈ అఖండపరిపూర్ణవస్తువునుండి, ఈ ఏకత్వమునుండి, ఈ ప్రపంచనానాత్వమును కల్పించి దృష్టిగోచరము చేయుచున్నది. వాస్తవముగా ఈ ప్రపంచ మా యేకపదార్థమే. పరమసత్యములు రెండుకలవని భావించుటంతయు పొరపాటే. ఏక వస్తువే కలదని ఎఱుగుటే నిజము నెఱుగుట. భౌతిక క్షేత్రమునను, మానసిక క్షేత్రమునను, ఆధ్యాత్మిక క్షేత్రమునను, ఈ సత్యము అనుదినము స్థాపింపబడుచున్నది. మీరు, నేను, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, ఒకే భౌతికపదార్థసాగరములోని వేర్వేఱు బిందువుల వేర్వేఱుపేళ్లనియు, ఈ పదార్థరాశి యొక్క రూపము నిరంతర పరిణామ మొందుచున్నదనియు, నేడు నిరూపింపబడినది. సూర్యునిలో కొన్నిమాసముల క్రిందట నుండిన శక్తిలో నొక స్వల్పాంశము నేడు మానవునిలో నుండవచ్చును; రేపొక జంతువులో, ఆ మఱుదిన మొకవృక్షములో, నుండవచ్చును. అది సర్వదా వచ్చుచు, పోవుచు, ఉన్నది. ఇదంతయు ఒకే అఖండమును అనంతమును, అగు పదార్థరాశి. దానిలో భేదములు కల్పించునది నామరూపములే. అం దొక చుక్కను సూర్యుడని, ఇంకొక చుక్కను చంద్రుడని, వేఱొకచుక్కను నక్షత్రములని, మఱొకదానిని మనుష్యుడని, ఇంకొకదానిని జంతువని, వేఱొకదానిని వృక్షమని, ఇట్లు అనంతనామములతో వ్యవహరించుచుందుము. ఈ పేళ్లన్నియు కృత్రిమములే; సత్యదూరములు. ఇదంతయు నిరంతరపరిణామ మొందు ఒకే పదార్థరాశి గదా. మఱొక దృక్పథమునుండి ఈ ప్రపంచమే ఒక భావసముద్రమనియు, అందు మన మొక్కొక్కర మొక్క మనస్సను పేరుగల బిందువువంటి వార మనియు, చెప్పవచ్చును. నీ వొక మనస్సువు, నే నొక మనస్సును, ప్రతిమానవుడును ఒకమనస్సు. ఇంతే కాదు. మన కన్నులు భ్రాంతిరహితము లైనప్పుడు, మనస్సు నిర్మలమైనప్పుడు, జ్ఞానదృక్పథమునుండి మన కీ ప్రపంచమే నిత్య

శుద్ధము, నిర్వికారము, అనశ్వరము, అగు అఖండ పరతత్త్వముగా కానిపించును.

అగుచో, ద్వైతులు ప్రతిపాదించు సాంపరాయ (మరణానంతర) గతి విషయ మేమగును? మృతినొందిన మానవుడు స్వర్గమునకో, మఱేలోకమునకో పోవుననియు, పాపిష్ఠులు పిశాచములు, జంతువులు, అగుదురనియు, ఇంకను ఇట్టి వేవేవియోవారు చెప్పుదురు గదా? వచ్చువారు లేరు, పోవువారు లేరు, అని అద్వైతి పల్కును. నీ వెట్లు రాగలవు, ఎట్లు పోగలవు? నీవు పరిపూర్ణమవుగదా. నీవు పోవుట కే చోటు కలదు? ఒక బడిలో కొందఱు బాలబాలికల పరీక్ష జరుగుచుండెను. పరీక్షకుడు లేని పోని కఠిన ప్రశ్న లడిగెను. "ఈ భూమి ఏల పడిపోక నిలిచి యున్నది?" అనునది అం దొక ప్రశ్న. గ్రహమండలము యొక్క ఆకర్షణశక్తియో, మఱేదో వారికి దురవగాహముగా నుండు విషయ మాతని మనస్సులో నుండెను. బిడ్డలలో ననేకులా ప్రశ్నమునే అర్థముచేసికొనజాలక ఏవేవియో వెఱ్ఱిమొఱ్ఱి సమాధానములు చెప్పిరి. కాని అం దొక బుద్ధిశాలినియగు బాలిక "అది ఎక్కడ పడగలదు?" అని మాఱుప్రశ్న వేసెను. పరీక్షకుని ప్రశ్నయే అర్థరహితము. అనంత జగత్తులో క్రిందుమీదులు లేవు. సంబంధభావము వర్తించుచోటనే క్రిందుమీదు లుండ గలవు. అట్లే ఆత్మవిషయమునుగూర్చి మాటలాడునపుడు జననమరణవ్యవహారమే అర్థరహితము. పోవువా రెవరు, వచ్చువా రెవరు? నీ వెచ్చట లేవు? నీ వాక్రమించియుండని స్వర్గ మెచ్చట కలదు? జీవాత్మ సర్వగతము. అది ఎచ్చటికి పోగలదు? ఎచ్చటికి పోలేదు? అది అంతటను కలదు. కావున పరిపూర్ణత్వ మొందిన వారికి ఈ శిశుస్వప్నము; ఈ జననమరణములు, స్వర్గములు, ఉన్నతలోకములు, అధోలోకములు అనెడు భ్రాంతి: వెంటనే అదృశ్యమగును. దాదాపు పరిపూర్ణదశకు వచ్చినవారికి భ్రాంతి

బ్రహ్మలోకమువఱకు గల దృశ్యము లన్నియు చూపి అదృశ్యమగును. అజ్ఞానులకు మాత్ర మది నిలిచియుండును.

స్వర్గమున కేగుట, మృతినొందుట, జన్మించుట, అను వానిని లోకమంతయు నమ్ముటకు కారణ మేమి? నేనొక గ్రంథమును చదువుచున్నాను. ఒక్కొక్క పుటను ముగించి మఱొకపుట త్రిప్పుచున్నాను. ఇంకొక పుటవచ్చును. అదియు త్రిప్పుచున్నాను. మాఱుపుచెందునదేది? వచ్చునది పోవునది ఏది? నేను కాదు, పుస్తకము. ఈ ప్రకృతి యంతయు ఆత్మ చేతిలోని పుస్తకము. ఒక్కొక్క అధ్యాయము చదువబడి త్రిప్పివేయబడుచున్నది. అప్పుడప్పు డొక్కొక్క దృశ్యము కానిపించుచుండును. అదియు చదివి త్రిప్పబడును. అంతట మఱొకటి వచ్చును. కాని ఆత్మలో మాఱు పేమియు లేదు. అది నిత్యము. మాఱునది ప్రకృతి, మానవుని ఆత్మ కాదు. అది ఎన్నడును మార్పు నొందదు. జననమరణములు ప్రకృతిలోనివి; నీలోనివి కావు. కాని పామరులు భ్రాంతి నొందుదురు. తిరుగునది సూర్యుడు, భూమి కాదు అని యెట్లు భ్రమపడుచున్నామో, అట్లే మృతినొందునది మనము, ప్రకృతి కాదు, అని భ్రమపడుచున్నాము. కావున ఇవన్నియు భ్రమలు. పరుగిడునది పొలములు, రైలు కాదు, అని యెట్లు భ్రమపడుచున్నామో, అట్లే ఈ జననమరణవిషయమున కూడ భ్రమపడుచున్నాము. ఒక్కొక్క మానసికస్థితియందుండు మానవుల కీ ప్రపంచము ధాత్రీ సూర్యచంద్ర నక్షత్రములుగా తోచును. అదే మానసికస్థితియందున్నవా రందఱికి నట్లే తోచును. మీకును నాకును నడుమ—వివిధక్షేత్రములలో—లక్షోపలక్షల జీవులు కలరు. వారు మనలను చూడజాలరు, మనము వారిని చూడజాలము. మన మానసికస్థితిలోనే, మన ముండు క్షేత్రములోనే ఉండువారుమాత్రమే మనకు కనిపింతురు. ఒకే శ్రుతి యందుండు వాద్యము లొండొంటిని అనుకరించును. "మానవశ్రుతి" అనబడునది మాఱినచో, మానవు లిక నిచట

గోచరింపదు. ''మానవలోక'' మంతయు అదృశ్యమై ఇం కేదో యొక దృశ్యము వ్యక్తమగును. అది దేవతలు, దేవతాలోకము కావచ్చును: లేక పాపులకు పిశాచములు, పిశాచలోకము కావచ్చును. కాని ఇవన్నియు వేర్వేఱు దృక్పథములనుండి కానిపించు ఒకే లోకము. మానవక్షేత్రమునుండి ఇది ధాత్రీ సూర్యచంద్ర నక్షత్రాదులు; పాపక్షేత్రమునుండి ఇదియే నరకలోకము; స్వర్గ కాంక్షగలవారి కిదియే స్వర్గము. సింహాసనస్థుడగు నొక దేవుని మ్రోల నిలిచి అతనిని కీర్తించుచుండుటే జీవితపరమార్థముగా గలవారికి మరణానంతర మాదృశ్యమే కానిపించును. వారి కీ లోకమే విశాలస్వర్గముగా మాఱిపోవును. ఱెక్కలుగల నిలింపులు అచ్చట ననేక జాతులవా రుందురు. గద్దెపై నొక దేవుడు కూర్చుండియుండును. ఈ స్వర్గము లన్నియు మానవకల్పితములు. కావున ద్వైతి చెప్పున దంతయు నిజమైనను, అది కేవల స్వకల్పితము అని అద్వైతి చెప్పును. ఈ లోకములు, భూతపిశాచములు, దేవతలు, సూక్ష్మశరీరధారణములు, పునర్జన్మములు: ఇవన్నియు పురాణకథలు. ఈ మనుష్యజీవితముకూడ అట్టిదే. ఈ జీవిత మొక్కటే సత్య మనుకొను మహాప్రమాదమునకు మనుష్యు లందఱును లోనగుచున్నారు. ఇతరవిషయములు పురాణకథ లన్నప్పుడు వా రామాటను బాగుగనే గ్రహింతురు. కాని, తమ నమ్మకములుకూడ అట్టివేయని వా రంగీకరింప నొల్లరు. ఈ కానిపించున దంతయు కేవల కల్పితకథ. మన మీ శరీరములము అనుటకన్న పెద్ద బొంకు లేదు. మన మెన్నడును శరీరములుగా నుండలేదు. ఎన్నటికిని ఉండబోము. మనము మానవమాత్రులమే అనుటకన్న పెద్దబొంకు ఉండబోదు. జగదీశ్వరు డనగా మనమేగదా. ఈశ్వరునారాధించుటలో మన మెప్పుడును మనలో డాగియుండు ఆత్మనే ఆరాధించుచుంటిమి. ''నేను ఆజన్మ (పుట్టుకతోనే) పాపిని, ఆజన్మదుష్టుడను'' అనుట కంటె ఘోరమగు అసత్యమును నీవు పల్కజాలవు. ఇతరుని పాపిగా

తలచువాడే పాపి. ఇచట నొక పసిబిడ్డ కలదనియు, నీవీ మేజాపై నొక పైకపుమూట నుంచితివనియు భావింపుము. ఆ మూట నొక చోరుడు తీసికొనిపోయినా డనుకొనుము. బిడ్డ కేమియు విశేషము జరిగినట్లు గోచరింపదు. బిడ్డలోపల చోరుడు లేడు కావున వెలుపలకూడ చోరుడు లేడు. లోకములో నీచత కానిపించునది పాపాత్ములకు, నీచులకు; సజ్జనులకు కానిపింపదు. కావుననే పాపాత్ముల కీ లోకము నరకరూపమునను, కొంతవఱకు సజ్జను లైనవారికి స్వర్గరూపమునను, పరిపూర్ణత్వ మొందినవారికి భగవత్సాక్షాత్కారముగను, తోచును. పరిపూర్ణస్థితి ప్రాప్తించినప్పుడుగాని కన్నుల కడ్డుపడియున్న తెర పడిపోదు. మానవు డప్పుడు పరిశుద్ధుడును, నిర్మలుడును, అగును. అతని కప్పుడు సర్వమును క్రొత్తరీతిగా గోచరించును. లక్షోపలక్షల సంవత్సరములుగా తన్ను వేధించుచుండిన దుస్స్వప్నములన్నియు మాపగును. తాను మానవుడనియో, దేవతయనియో, భూతమనియో తలంచుకొనుచుండినవాడు, అధమస్థితియందో, ఉన్నతస్థితియందో, ఈ భూమిలోనో, స్వర్గములోనో, మఱెచ్చటనో, జీవించుచున్నట్లు తలంచుకొనుచున్నవాడు, తాను నిజముగా సర్వగతు డనియు, కాలమంతయు తనలోనిదిగాని తాను కాలములోనివాడు కాడనియు, స్వర్గములన్నియు తనలోనివి కాని తాను స్వర్గము లోనివాడు కాడనియు, మానవులచే అనాదికాలమునుండి ఆరాధింపబడుచుండిన దేవతలందఱు తనలోనే కలరనియు, తాను వా రెవ్వరిలో లేడనియు గ్రహించును. దేవతలను, భూతపిశాచములను, మానవులను, వృక్షజాతులను, జంతువులను, శిలలను ఇట్లన్నిటిని కల్పించినది తానే అని అతనికి తెలియవచ్చును. మానవుని యథార్థతత్త్వము స్వర్గమునకంటె ఉన్నతమనియు, మన జగత్తుకంటె సమగ్రమనియు, అనంతకాలమునకంటె అనంతమనియు, సర్వవ్యాప్తమగు ఆకాశమునకంటె నధికవ్యాప్తమనియు, అతని కప్పుడు వ్యక్తమగును. అప్పుడుకాని మానవుడు భయరహితుడు

కాడు, ముక్తి నందడు. భ్రాంతిమోహములన్నియు అప్పుడు సమసిపోవును. తాపములన్నియు అదృశ్యమగును. భయము లన్నియు శాశ్వతముగా అంతరించును. జననము నిష్క్రమిం చును; దానితోనే మరణమును నిష్క్రమించును. దుఃఖము లెగిరిపోవును, వానితో సుఖములును ఎగిరిపోవును. భూలోకము లదృశ్యమగును, వానితో స్వర్గలోకములును అదృశ్యమగును. శరీరములు మాయమగును. వానితో మానసమును మాయ మగును. అట్టివాని కీ జగత్తంతయు అదృశ్యమగు ననవచ్చును. విరుద్ధశక్తుల కవిరామముగా జరుగుచుండిన సంఘర్షణ మంతయు నొకేసారిగా నిలిచిపోవును. ప్రాణాకాశములుగా, ప్రకృతిసంఘ ర్షణములుగా, ప్రకృతిగా, స్వర్గములుగా, ధరిత్రులుగా, వృక్ష ములుగా, జంతువులుగా, మనుష్యులుగా, దేతలుగా, గోచరించు చుండిన దంతయు రూపుమాటి ఒకే అనంతమును, అఖండమును, అవికారమును, అగు అస్తిత్వముగా అయిపోవును. తానే ఆ అస్తిత్వమని ప్రాజ్ఞుడు గ్రహించును. "రంగురంగుల మబ్బులు ఆకసము నెదుటికి వచ్చి, ఒకక్షణముసే పచటనుండి మాయమై పోవునట్లు" ఈ భూలోకములు, స్వర్గలోకములు, చంద్రుడు, దేవతలు, సుఖములు, దుఃఖములు, ఈ ఆత్మయెదుట కానిపిం చును. కాని ఈ దృశ్యము లన్నియు కడచిపోయి, అనంతమును అవికారమును అగు వినీ లాకాశముమాత్రమే మిగిలియుండును. ఆకాశ మెన్నటికిని మార్పు నొందదు. మార్పు లొందునవి మబ్బులే. ఆకాశము మాఱిన దనుకొనుట పొరపాటు. మనము అపరిశుద్ధులమని, పరిమితులమని, భిన్నులమని, అనుకొనుట పొర పాటు. పారమార్థికమానవుడా ఏక, అఖండ సత్తా స్వరూపుడు.

రెండు ప్రశ్న లిప్పుడు బయలుదేఱుచున్నవి. మొదటిది: "ఇదొక మతము. ఒక తత్త్వశాస్త్రభావము. కాని దీనిని సాధిం చుట శక్యమా?" అనునది. శక్యమే. భ్రాంతిని నిశ్శేషముగా

జయించినవారు కొంద ఱీలోకమున ఇప్పటికిని జీవించియున్నారు. జయించుటతోడనే వారు మరణింతురా? మన మనుకొనునంత శీఘ్రముగా మరణింపరు. రెండు చక్రము లొక యిరుసు కొయ్యతో కూడి నడుచుచున్నవి. అం దొక చక్రమును పట్టుకొని ఆ యిరుసుకొయ్య నొక గొడ్డటితో తెగకొట్టినచో, నేను పట్టుకొన్న చక్రము మాత్రమే ఆగిపోవును. రెండవది పూర్వ వేగబలముచే కొంతదూరము పోయి అంతట పడిపోవును. ఒక చక్ర మీ పరిశుద్ధపరిపూర్ణవస్తువు: ఈ ఆత్మ. రెండవచక్ర మీ మనశ్శరీరము లనెడు బాహ్యభ్రాంతి. ఈ రెండును కర్మ మనెడు ఇరుసుకొయ్యతో కూడియున్నవి. వీనికి గల సంబంధమును భేదించునది జ్ఞాన మనెడు గొడ్డలి. ఆత్మచక్రము నడక మానును. తనకు రాకపోకలు, జననమరణములు, కలవనియు, తాను ప్రకృతి యనియు, తనకు లోపములు, కోరికలు, కలవనియు తలచుట మానును. కాని మనశ్శరీరము లనెడు రెండవ చక్రము పూర్వ కర్మప్రభావముచే కొంతకాలము జీవించును. ఆ బలము నశించినపిదప—ఆ కర్మఫలమంతయు అనుభవింపబడినపిదప— అవి పడిపోవును. అంతట ఆత్మకు విమోచనము కలుగును. ఇక స్వర్గమునకు పోవుట, మరల జన్మించుట లేదు. బ్రహ్మలోకమున కైనను, మఱి యే ఉన్నతలోకమున కైనను, పోవుటయు లేదు. అత డెచటినుండి రాగలడు, ఎచటికి పోగలడు? ఈ జీవితముననే ఈ స్థితినందినవాడు, ఈ ప్రపంచమును సాధారణరూపమున కాక సత్యరూపమున నొక్క-క్షణకాలమైనను చూడగలిగినవాడు, జీవన్ముక్తు డనబడును. ఈ జీవన్ముక్తదశ నొందుటే వేదాంతి యొక్క- లక్ష్యము.

నే నొకసారి హిందూదేశ పశ్చిమప్రాంతమున సముద్రతీరపు ఎడారిప్రదేశములో ప్రయాణించు చుంటిని. ప్రయాణమంతయు కాలినడకనే. ఎన్నినాళ్లో ఆ యెడారిలో నడిచితిని. చక్క-ని చెఱువులు, వాని చుట్టు వృక్షపంక్తులు, తలక్రిందుగా ప్రతిబింబించి

కనులపండువొనరించు ఆ వృక్షచ్ఛాయలు దినదినము చూచి అబ్బుర పడుచుంటిని. "ఎంత అద్భుతముగా నున్నది! ఇది ఎడారిప్రదేశమట!" అని తలచు చుంటిని. మనోజ్ఞములగు ఆ చెఱువులు, చెట్లు, మొక్కలు, చూచుచు దాదాపొక నెలనాళ్లు నడిచితిని. ఒకనాడు దప్పిగొని, దాహము తీర్చుకొనగోరి, ఒక నిర్మలమనోహరజలాశయముకడ కేగ జూచితిని. కాని సమీపించినంతనే అది అదృశ్యమైనది! నేను పుస్తకములలో చదువుచుండిన యెండమావు లివియే యనియు, ప్రతిదిన మీ యెండమావులను చూచుచుండియు కనుగొనక పోయితిననియు నా కప్పుడు తళుక్కున స్ఫురించెను. మఱునాడు మరల నడక సాగించితిని. చెఱువు మరల పొడచూపినది. కాని అది చెఱువు కాదు, ఎండమావులు, అను ఎఱుకకూడ దానితోనే పొడచూపెను. ఈ జగత్తు విషయముకూడ ఇట్టిదే. జగత్తనెడు ఈ ఎండమావులలో మనము అందఱము దినదినము, నెలనెల, ఏటేట, పయనించుచున్నాము. కాని ఎండమావులని యెఱుగము. ఈ అజ్ఞాన మొకనాడు చెదరిపోవును. కాని అది మరలవచ్చును. పూర్వకర్మబలముచే ఈ శరీరము నిలిచియుండవలెను. కావున ఎండమావులు మరల పొడచూపును. కర్మబంధ ముండునంత కాల మీ జగత్తు మనలను విడువదు. స్త్రీలు, పురుషులు, జంతువులు, తరులతాదులు, అనురాగములు, బాధ్యతలు : ఇవేవియు విడువవు. కాని వానికి మునుపటి బలము ఉండదు. నూతనలబ్ధమైన ఈ జ్ఞానముచే కర్మబలము తఱిగిపోవును. దానిలోని విషము విఱిగిపోవును. అది యిప్పుడు మాఱురూపు నొందినది. ఏలనన దాని గుట్టు తెలిసిపోయినదను భావముకూడ మనకిప్పుడు కలదు. సత్యమునకును ఎండమావులకును గల అపారభేద మిప్పుడు ఎఱుకపడినది గదా.

ఈ స్థితి లభించినప్పుడు ప్రపంచము మునుపటిదిగా నుండదు. కాని యిందు కొంత అపాయముకూడ కలదు. "నేను

పుణ్యపాపముల కతీతుడను ; కావున నీతిధర్మములు నాయెడ వర్తింపవు; నేను నా యిష్టానుసారము ప్రవర్తింపవచ్చును'' అని ఈ వేదాంతము నాధారముజేసికొని పల్కువారిని మనము ప్రతి దేశమందును చూచుచున్నాము. ''నేను బద్ధుడనుకాను. నేను భగవంతుడను. నన్ను యథేచ్ఛముగా నడువనిండు'' అని పల్కు అవివేకు లెందఱో ఈ దేశములో నిప్పుడుకూడ కలరు. ఇట్టి పల్కులు నింద్యములే కాని, భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక నియమము లన్నిటికిని ఆత్మ అతీతమనెడు మాటమాత్రము నిజమే. నియమములకు లోబడుటంతయు దాస్యస్థితి. నియమములు దాటిన పిదపనే మోక్షము. ముక్తి ఆత్మకు స్వతస్సిద్ధము, దాని ''జన్మహక్కు'' అనుటకూడ నిజమే. సత్యమగు ఆ ముక్తి భౌతిక పదార్థరూపమగు తెరద్వారా ప్రకాశించి అసత్యమగు మానవ స్వేచ్ఛా (ఫ్రీ విల్) రూపముతో కానిపించును. జీవితములో ప్రతిక్షణము మనకు స్వేచ్ఛ కలదని తోచును. ఆ భావము లేనిది మన మొక నిమేషకాలమైన జీవింపజాలము, మాట్లాడజాలము, ఊపిరి పీల్పజాలము. కాని కొంచెము ఆలోచించి చూచినచో, మనము యంత్రమాత్రులమే అనియు, స్వేచ్ఛారహితులమనియు, తెలిసిపోవును. ఇందులో నిజమేది ? స్వేచ్ఛాభావము భ్రాంతియా ? స్వేచ్ఛాభావము భ్రాంతియని ఒకపక్షమువారును, దాస్యభావము భ్రాంతియని రెండవపక్షమువారును వాదింతురు. ఇట్లు జరుగుట కేమి కారణము ? మానవుడు నిజముగా స్వతంత్రుడే. పారమార్థిక మానవుడు స్వతంత్రుడుగ నుండియే తీఱవలెను. ఈ మాయా ప్రపంచములోనికి, ఈ నామరూపములలోనికి, వచ్చినప్పుడే అతడు బద్ధుడగుచున్నాడు. స్వతంత్రేచ్ఛ (ఫ్రీ విల్) అను మాటయే తప్పు. ఇచ్ఛకు స్వతంత్రత ఉండనేరదు. ఎట్లుండ గలదు ? పారమార్థిక మానవుడు బద్ధుడైనపిదపనే ఇచ్ఛ జన్మించునది. అంతకుముందు కాదు. మానవుని ఇచ్ఛ బద్ధము. ఆ ఇచ్ఛకు మూలాధారమైనవస్తువు నిత్యముక్తము. కావున ఈ

బద్ధదశలోకూడ—అనగా, భూమిపై మానవజీవితములో, లేక స్వర్గమున దేవతాజీవితములో—మన దివ్యస్థితికి స్వాభావికమగు ముక్తి జ్ఞప్తిలో నిలిచియుండును. మరల దాని నందుకొను కొఱకే మన మందఱము — ఎఱిగి కొందఱము, ఎఱుగకయే కొందఱము—పరిశ్రమించుచున్నాము. ఆత్మస్వాతంత్ర్యము-ముక్తి—సాధించుకొన్నవానిని నియమము లెట్లు బంధింపగలవు ? ఈ జగత్తులోని నియమ మేదియు అతనిని బంధింపజాలదు. జగత్తే అతనిది గదా!

అతడే జగత్తంతయు. జగత్తంతయు అతడే అనియైన ననవచ్చును. లేక అతనికి జగత్తే లేదు అనవచ్చును. అట్లగుచో, అతని కీ క్షుద్రభావములు—స్త్రీపురుష భావములు, దేశభావము—ఎట్లుండగలవు ? నేను పురుషుడను, నేను స్త్రీని, నేను బిడ్డను — ఇట్టి పల్కు లత డెట్లు పల్కగలడు ? అవి కల్లలు కావా ? కల్లలని అత డెఱుగును. ఇవి పురుషుల హక్కులు, ఈ యితరములు స్త్రీల హక్కులు అని అత డెట్లనగలడు ? ఎవ్వరికిని హక్కులు లేవు. అసలు వేర్వేఱుగా నెవ్వరును లేరుగదా. పురుషుడు లేడు, స్త్రీ లేదు. ఆత్మకు స్త్రీత్వ పురుషత్వాదులు లేవు. అది నిత్య శుద్ధము. నేను స్త్రీని, నేను పురుషుడను, మాదీ దేశము, ఆ దేశము, అనుట కల్ల. జగత్తంతయు నా దేశమే. అదంతయు నాదే. దానిని నా శరీరముగా ధరించియున్నాను. కాని ఈ ఉన్నత భావములు ప్రకటించుచునే లోకులకు నీచాతి నీచములుగా తోచు అసహ్యకార్యములు చేయువారు కలరు. ఇట్లేల చేయుచున్నారని వారి నడిగినచో, అది మన భ్రాంతియనియు, తాము తప్పు చేయ నేరరనియు, వారు బదులు చెప్పుదురు. వారి మాటలు పరిశీలించి విషయనిర్ధారణ చేయు టెట్లు ? ఏ ప్రమాణమును బట్టి ఆ ప్రమాణము నిప్పుడు వివరింతును ?

మంచిచెడుగులు రెండును ఆత్మయొక్క పారి పార్శ్వక ప్రదర్శనములే అయినను చెడుగు వెలుపలి పొర,

పుణ్యపాపముల కతీతుడను; కావున నీతిధర్మములు నాయెడ వర్తింపవు; నేను నా యిష్టానుసారము ప్రవర్తింపవచ్చును'' అని ఈ వేదాంతము నాధారముజేసికొని పల్కువారిని మనము ప్రతి దేశమందును చూచుచున్నాము. ''నేను బద్ధుడనుకాను. నేను భగవంతుడను. నన్ను యథేచ్ఛముగా నడువనిండు'' అని పల్కు అవివేకు లెందఱో ఈ దేశములో నిప్పుడుకూడ కలరు. ఇట్టి పల్కులు నింద్యములే కాని, భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక నియమము లన్నిటికిని ఆత్మ అతీతమనెడు మాటమాత్రము నిజమే. నియమములకు లోబడుటంతయు దాస్యస్థితి. నియమములు దాటిన పిదపనే మోక్షము. ముక్తి ఆత్మకు స్వతస్సిద్ధము, దాని ''జన్మహక్కు'' అనుటకూడ నిజమే. సత్యమగు ఆ ముక్తి భౌతిక పదార్థరూపమగు తెరద్వారా ప్రకాశించి అసత్యమగు మానవ స్వేచ్ఛా (ఫ్రీ విల్) రూపముతో కానిపించును. జీవితములో ప్రతిక్షణము మనకు స్వేచ్ఛ కలదని తోచును. ఆ భావము లేనిది మన మొక నిమేషకాలమైన జీవింపజాలము, మాట్లాడజాలము, ఊపిరి పీల్పజాలము. కాని కొంచెము ఆలోచించి చూచినచో, మనము యంత్రమాత్రులమే అనియు, స్వేచ్ఛారహితులమనియు, తెలిసిపోవును. ఇందులో నిజమేది? స్వేచ్ఛాభావము భ్రాంతియా? స్వేచ్ఛాభావము భ్రాంతియని ఒకపక్షమువారును, దాస్యభావము భ్రాంతియని రెండవపక్షమువారును వాదింతురు. ఇట్లు జరుగుట కేమి కారణము? మానవుడు నిజముగా స్వతంత్రుడే. పారమార్థిక మానవుడు స్వతంత్రుడుగ నుండియే తీఱవలెను. ఈ మాయా ప్రపంచములోనికి, ఈ నామరూపములలోనికి, వచ్చినప్పుడే అతడు బద్ధుడగుచున్నాడు. స్వతంత్రేచ్ఛ (ఫ్రీ విల్) అను మాటయే తప్పు. ఇచ్ఛకు స్వతంత్రత ఉండనేరదు. ఎట్లుండ గలదు? పారమార్థిక మానవుడు బద్ధుడైనపిదపనే ఇచ్ఛ జన్మించునది. అంతకుముందు కాదు. మానవుని ఇచ్ఛ బద్ధము. ఆ ఇచ్ఛకు మూలాధారమైనవస్తువు నిత్యముక్తము. కావున ఈ

బద్ధదశలోకూడ—అనగా, భూమిపై మానవజీవితములో, లేక స్వర్గమున దేవతాజీవితములో—మన దివ్యస్థితికి స్వాభావికమగు ముక్తి జ్ఞప్తిలో నిలిచియుండును. మరల దాని నందుకొను కొఱకే మన మందఱము — ఎఱిగి కొందఱము, ఎఱుగకయే కొందఱము—పరిశ్రమించుచున్నాము. ఆత్మస్వాతంత్ర్యము—ముక్తి—సాధించుకొన్నవానిని నియమము లెట్లు బంధింపగలవు? ఈ జగత్తులోని నియమ మేదియు అతనిని బంధింపజాలదు. జగత్తే అతనిది గదా!

అతడే జగత్తంతయు. జగత్తంతయు అతడే అనిమైన ననవచ్చును. లేక అతనికి జగత్తే లేదు అనవచ్చును. అట్లగుచో, అతని కీక్షుద్రభావములు—స్త్రీపురుష భావములు, దేశభావము—ఎట్లుండగలవు? నేను పురుషుడను, నేను స్త్రీని, నేను బిడ్డను — ఇట్టి పల్కులత డెట్లు పల్కగలడు? అవి కల్లలు కావా? కల్లలని అత డెఱుగును. ఇవి పురుషుల హక్కులు, ఈ యితరములు స్త్రీల హక్కులు అని అత డెట్లనగలడు? ఎవ్వరికిని హక్కులు లేవు. అసలు వేర్వేఱుగా నెవ్వడును లేరుగదా. పురుషుడు లేడు, స్త్రీ లేదు. ఆత్మకు స్త్రీత్వ పురుషత్వాదులు లేవు. అది నిత్య శుద్ధము. నేను స్త్రీని, నేను పురుషుడను, మా దీ దేశము, ఆ దేశము, అనుట కల్ల. జగత్తంతయు నా దేశమే. అదంతయు నాదే. దానిని నా శరీరముగా ధరించియున్నాను. కాని ఈ ఉన్నత భావములు ప్రకటించుచునే లోకులకు నీచాతి నీచములుగా తోచు అసహ్యకార్యములు చేయువారు కలరు. ఇట్లేల చేయుచున్నారని వారి నడిగినచో, అది మన భ్రాంతియనియు, తాము తప్పు చేయ నేరరనియు, వారు బదులు చెప్పుదురు. వారి మాటలు పరిశీలించి విషయనిర్ధారణ చేయు టెట్లు? ఏ ప్రమాణమును బట్టి ఆ ప్రమాణము నిప్పుడు వివరింతును?

మంచిచెడుగులు రెండును ఆత్మయొక్క పారి పార్శ్వక ప్రదర్శనములే అయినను చెడుగు పార

మంచి లోపలిపొర. ఈ రెండవది పారమార్థిక మానవు నకును, ఆత్మకును, సమీపస్థము. కావున 'చెడుగు' పొరను భేదించినవాడుగాని మంచితెరను చేరజాలడు. ఆ రెండుతెరలను భేదించినవాడే ఆత్మను చేరగలడు. ఆత్మను చేరినవాని కేమి అంటుకొనియుండును? కొంచెము కర్మ: పూర్వజీవితబలములో మిగిలియున్న యొక స్వల్పాంశము. కాని అదంతయు మంచికి సంబంధించినదే. దుష్కర్మబలమంతయు అనుభవింపబడి సమసి పోయినగాని, పూర్వకల్మషము లన్నియు నిశ్శేషముగా దగ్ధమైపోయినగాని, ఎవ్వడును సత్యమును చూచి అనుభూతము చేసికొనజాలడు. అనగా, ఆత్మస్థుడై సత్యానుభూతి నొందినవాని కింకను అంటుకొని యుండునది పూర్వపు సత్సంస్కారములలో మిగిలియున్నభాగము: సత్కర్మబలము. అట్టివాడు ఈ శరీరమున జీవించి నిరంతరకార్యమగ్నుడై యున్నను, పరోపకార కార్యములే చేయును. అతనినోట వచ్చుమాటలన్నియు స్వస్తివాచక రూపములే; అతని హస్తములు సత్కార్యములే చేయును; అతని మనస్సు యోగ్యములగు తలపులనే తలచును; అత డెచటికి పోయినను, అతని ఉనికియే సర్వజనశుభంకరము. శుభముయొక్క మూర్తీభావమే అతడు. అట్టివాడు, తన సాన్నిధ్యమాత్రముననే పరమదుశ్చరితుని గూడ సాధుసత్తమునిగా మార్చగలడు. అతడు మౌనముగా నున్నను, అతని ఉనికియే మానవజాతికి మంగళాశాసనముగా వర్తించును. అట్టివా రపకారమేదైన చేయగలరా? దురితము లొనర్పగలరా? సత్యానుభూతికిని, శుష్కప్రసంగములకును ధ్రువముల కున్నంత భేదము కలదని మీరు జ్ఞప్తిలోనుంచుకొనవలెను. వట్టి మూఢులుకూడ మాటలు చెప్పగలరు. చిలుకలుకూడ మాట్లాడగలవు. మాట్లాడుటయు అనుభూతినొందుటయు కేవలభిన్నవిషయములు. వేదాంతములు, మతములు, చర్చలు, గ్రంథములు, వాదములు, గుళ్లు, తెగలు: ఇవియు ఇట్టివియు కొన్నివిధముల మంచివే.

కాని సత్యానుభూతి కలిగినప్పు డివన్నియు జాఱిపోవును. దేశపటములు మంచివే కాని, దేశము నే ఒకసారి చూచి, పిదప పటమునుచూచిన, ఎంత భేదము కనిపించును! కావున సత్యమును చవిచూచినవారికి, తార్కికవాదోపవాదములు, మానసిక వ్యాయామవిద్యలు కావలెనా సత్యమును గ్రహించుటకు? అది వారి ప్రాణములకు ప్రాణము, వారు ప్రత్యక్షముగాచూచి, అనుభవించిన వస్తువు. కేవలస్పర్శమాత్రజ్ఞానము కాదది, అంతకంటె అధికము. నీ కది ఉపనిషదృషులు చెప్పినట్లు "హస్తామలకము" (చేతిలోని ఉసిరికకాయ)గా నున్నచో, "ఇదిగో అది" అని నీవు చెప్పగలవు గదా. అట్లే సత్యముయొక్క అపరోక్షానుభూతికలవారు "ఇదే ఆత్మ" అని పల్కుదురు. నీవు వారితో సంవత్సరములతరబడిగా వాదింపవచ్చును. కాని వారు నిన్ను చూచి చిఱునగవు నవ్వుదురు. నీ మాటలన్నియు పసిబిడ్డయొక్క పిచ్చిమాటలుగా భావింతురు. బిడ్డ నట్లే మాట్లాడ నిత్తురు. వారు సత్యమును చవిచూచి పరిపూర్ణులైరి. నీ వొక దేశమును చూచియుంటి వనుకొమ్ము. నీ యొద్ద కొకడు వచ్చి ఆ దేశము లేదని వాదింప నారంభించును. అత డట్లు అనంతకాలము వాదించినను, నీ వతనినిగూర్చి ఏమి తలతువు? అతడు పిచ్చి ఆసుపత్రికి పంపదగినవా డనియే కదా! కావున జ్ఞానసిద్ధు డిట్లనును: "ఈ చిన్నచిన్న మతములనుగూర్చి లోకములో జరుగు ప్రసంగము లన్నియు అసంబద్ధప్రలాపములు. అపరోక్షానుభూతియే బ్రహ్మవిద్యకు ప్రాణము, మూలసత్త్వము". బ్రహ్మవిద్య ననుభూత మొనర్చుకొన వచ్చును. నీ వందుకు సిద్ధముగా నున్నావా? నీ కది కావలయునా? వలయునన్నచో లభించును. అప్పుడు నీది నిజముగా ధర్మసందీప్త జీవన మగును. నీవు అపరోక్షానుభూతి నొందుదనుక నీకును నిరీశ్వరవాదులకును భేదము లేదు. నిరీశ్వరవాదులు నిష్కపటులు.

కాని బ్రహ్మవిద్యయందు నమ్మకము కలదని చెప్పుచు, దాని ననుభూతి మొనర్చుకొన యత్నింపనివాడు కపటి.

"అపరోక్షానుభూతి కలిగిన పిదప నేమి జరుగును?" అనునది రెండవ ప్రశ్న. ఈ జగత్తంతయు ఏకవస్తువే అనియు, మనమే ఆ అఖండపరమాత్మ యనియు కనుగొంటి మనుకొనుడు. ఈ ఆత్మ తప్ప వేఱేదియు లేదనియు ఈ వివిధరూపములతో గోచరించుచుండున దదియే యనియు కనుగొంటి మనుకొనుడు. ఆ పిదప మన కేమి జరుగును? పనులన్నియు మానుకొని, ఒక మూలకు పోయి అచట కూర్చుండి మృతినొందుదుమా? "అది లోకమున కెట్లుపకరించును?" ఆ ప్రాతప్రశ్నయే! మొదటి సంగతి, లోకమున కేల ఉపకరింపవలెను? అట్లు చేయవలె ననుట కేమైన కారణము కలదా? అది లోకమున కెట్లుపకరించునని ప్రశ్నింప నెవరికైన అధికారము కలదా? ఆ ప్రశ్న కర్థమేమి? పసిబిడ్డ కొకనికి పంచదారచిలుకలు కావలెను. మీరు విద్యుచ్ఛక్తినిగూర్చి పరిశోధన లొనర్చుచున్నా రనుకొనుడు. ఆ బిడ్డ వచ్చి "ఈ పరిశోధనలచే పంచదారచిలుకలు లభించునా?" అని యడిగినచో, లభింపవని మీరు బదులిడుదురు. అట్లైనచో ఇ వేమి ప్రయోజన మని బిడ్డ పలుకును. అట్లే మనుష్యులు "ఇది లోకమున కెట్లుపకరించును? దీనిచే మాకు ద్రవ్యము లభించునా?" అని అడుగుదురు. "లభింపదు." "అట్లైన దీనిలో ఏమి గుణము కలదు?" లోకమున కుపకరించుట అనగా జనుల అర్థ మిది. కాని బ్రహ్మవిద్యానుభూతి లోకమున కత్యంతము ఉపకరించును. ఆ అనుభూతి కలిగినచో, ఒక్క వస్తువు మాత్రమే కలదని యెఱిగినచో, ప్రేమప్రవాహమూలము లెండిపోవుననియు, జీవితము శూన్యాకృతి దాల్చు ననియు, తమకు ప్రేమపదములగు సర్వము ఇహపరలోకములనుండి శాశ్వతముగా అదృశ్యమైనట్లు ఏర్పడు ననియు జనులు భీతిల్లుదురు. లోకములో మహత్తరకార్యములు నిర్వహించినవా రందఱును తమ వ్యక్తిత్వములయెడ కేవల

ముపేక్షాభావము చూపినవారే గదా అని వారించుకేనియు విచారింపరు. తనకు ప్రేమపదమగు వస్తువు నీచముకాదు, క్షుద్రముకాదు, అనిత్యముకాదు అని యెఱిగి ప్రేమించువానిదే ప్రేమ. తనకు ప్రేమపద మగు వస్తు వొక మట్టిపెళ్ల కాదనియు, ప్రత్యక్షదైవమే అనియు, ఎఱిగి ప్రేమించువానిదే ప్రేమ. భార్యకు భర్తయెడగల ప్రేమ అతనిని భగవత్స్వరూపునిగా భావించినప్పు డధికమగును. భర్తకు భార్యయెడ గల ప్రేమ ఆమె భగవత్స్వరూపిణి అని యెఱిగినప్పు డధికమగును. తల్లికి బిడ్డలయెడగల ప్రేమ వారిని భగవత్స్వరూపులుగా భావించునప్పు డధికమగును. భగవంతుడే తన గర్భశత్రురూపము దాల్చి యున్నాడని యెఱిగినవా డా శత్రువును ప్రేమించును. సాధుపురుషరూపమున నున్నది భగవంతుడే అని ఎఱిగినవాడు ఆ సాధుపురుషుని ప్రేమించును. అతడే ఘోర పాతకి యగు నతనినికూడ ప్రేమించును. ఏలనన, ఆ పాతకి రూపమునకుకూడ మూల మా భగవంతుడే అని అత డెఱుగును. క్షుద్రమగు అహంభావము ("నేను" అను భావము) నశించి, తత్స్థానమున భగవంతు డెవనియందు సుప్రతిష్ఠితుడై యుండునో, అట్టివానికి లోకము నుత్పాతలూగించు శక్తి కలుగును. జగత్తంతయు అతనికి క్రొత్తరూపు దాల్చి కానిపించును. బాధలు, తాపములు, అదృశ్యము లగును. ప్రయాసము లుండవు. పట్టెడన్నముకై అనుదిన మగచాట్లు పడి, పోరాడి, పోటీలు చేయవలసియున్న చెఱసాలగా నిప్పు డుండు లోకము అప్పుడు క్రీడావిహారభూమిగా మాఱిపోవును. రమణీయరూపము దాల్చును. అట్టి అనుభూతిని సాధించినవానికే "ఈ లోక మెంత చక్కనిది!" అను అధికారము కలదు. ఈ లోకము కేవలము మంచిది అను అర్హత అతనికి మాత్రమే కలదు. ఈ యనుభూతిచేత లోకమునకు కలుగు మహోపకార మిది : లోక మిప్పటి ఒరయికలతో, సంఘర్షణములతో, సాగిపోవుచుండుటకు బదులు, మానవు లందఱు ఈ మహాసత్యములో

నొక లేశాంశమునైన ననుభూతము చేసికొనినచో, లోకస్వరూపమే మాఱి, అది వివాదరంగముగా, యుద్ధభూమిగా నుండక, శాంతినికేతనమై తేజరిల్లును. ప్రతివాడును రెండవవానిని వెనుకకునెట్టి తాను ముందుకు పోవజూచు ఈ పోటీ, ఈ వేగిరపాటు— కేవల మనుచితమును, నీతిబాహ్యమును, అగు వేగిరపాటు— లోకమునుండి అదృశ్యమగును. దానితో ప్రయాసము లన్నియు అంతరించును. ద్వేషము లన్నియు అంతరించును. ఈర్ష్యాసూయ లన్నియు అంతరించును. దురాకృత మంతయు నొకేసారిగా అంతరించును. అప్పు డీ భూమి దేవతావాసమగును. ఈ భూమియే స్వర్గ మగును. అప్పుడు—దేవతలు దేవతలతో ఆటలాడు చున్నప్పుడు: దేవతలు దేవతలతో గూడి పనులొనర్చు నప్పుడు: దేవతలు దేవతలను ప్రేమించునప్పుడు—ఈ లోకమున కీ డెట్లుండ గలదు? దివ్యానుభూతివలన కలుగు మహోపకార మిది. మానవ సంఘములో మీ కిప్పుడు కానిపించున దంతయు, అప్పుడు మాఱి, మఱియొక రూపమును దాల్చును. మానవునం దప్పుడు మీకు లోపములు కానిపింపవు. ఇది ప్రథమలాభము, మహనీయ మైనది. ఎవరైన—స్త్రీగాని, పురుషుడుగాని—తప్పు చేసినచో, వారిని చులకనగా, తిరస్కారదృష్టితో చూడరు. రాత్రివేళల వీథుల కెక్కుటకై సంశయింపని అభాగినులను కులీనస్త్రీలుకూడ తృణీకరింపరు. వారియందుకూడ భగవంతుడే కానిపించునుగదా అప్పుడు! అసహనము, దండనము, మనస్సునకే తోపవు. అవన్నియు అదృశ్యమై ప్రేమము—మహోన్నతప్రేమాదర్శము— పరిపూర్ణబలముతో సుప్రతిష్ఠితమగును. మానవజాతి నప్పుడు సరియైన త్రోవలో నడుచునట్లు చేయుటకు కొరడాలును, బెత్తములును కావలసియుండునా!

లోకమున నుండు స్త్రీపురుషులలో నొక దశలక్షాంశము కూరుచుండి "ఓ మానవులారా, ఓ జంతువులారా, ఓ ప్రాణికోటు

లారా, మీ రందఱును ఆ అద్వయునియొక్క, ఆ సజీవదైవము యొక్క, ఆ ఈశ్వరునియొక్క, ప్రత్యక్షస్వరూపములు'' అని కొన్నినిమిషములపాటు పల్కుచుండినచో, ఈ లోక మంతయు ఒక అఱగంటకాలములో మాఱిపోవును. ప్రతిచోటను ఘోర ద్వేషరూపమగు అగ్నివర్షము కురిపించుచుండుటకుమాఱు, ఈర్ష్యాపకారరూపము లగు భావప్రవాహములను లోకములోని కనుపుచుండుటకు మాఱు, ప్రతిదేశమందలి జనులు ఈ సర్వము అతడే యని తలతురు. మీరు చూచునది, తలంచునది, అంతయు అతనినే. మీలో దోష మున్నగాని మీకు దోష మెట్లు కనుపట్టును? మీ హృదయాంతరాళమున చోరుడు కూర్చుండి యున్నగాని మీకు చోరు డెట్లు కనుపట్టును? మీరు హంతకు లైనగాని, మీకు హంతకు డెట్లు కనుపట్టును? సజ్జనులు కండు, దురితము మీ కదృశ్యమగును. జగ త్తంతయు ఈ రీతిగా మాఱిపోవును. సంఘమునకు కలుగు మహోపకార మిది. మానవ వ్యవస్థకు కలుగు మహోపకార మిది. ప్రాచీనకాలమున హిందూ దేశములో నక్కడక్కడ నొక్కొక్కరి కీ భావములు స్ఫురించుచు వచ్చెను. వారిలో కొంద ఱీ భావముల ఫలరూపపర్యవసానమును కూడ కనుగొనిరి. కాని మతగురువులకు బుద్ధివైశాల్యము లేమి చేతను, దేశము పరాధీనమై యుండుటచేతను, ఇంక ఇతర కారణములచేతను, ఈ భావములు ప్రచారము నొందలేదు. కాని అవి అద్భుతసత్యములు. అవి ఆచరింపబడుచోట్లనెల్ల మానవుడు దివ్యత్వము నొందినాడు. అట్టి దివ్యపురుషులలో నొకరి స్పర్శచే నా జీవిత మంతయు మాఱిపోయినది. ఆ మహనీయునిగూర్చి రేపటి ఆదివారమునాడు మీ యెదుట ప్రసంగింతును. ఈ భావములు లోక మంతట వెదజల్లు కాలము సమీపించుచున్నది. మఠములలోపలనే నివసించియుండుటకు మాఱు, తత్త్వశాస్త్రములలో నడగి విద్వాంసులకు మాత్రమే అందుబాటులో నుండుటకు మాఱు, కొన్ని తెగలయొక్కయు, ఒక కొలదిమంది విద్యార్థికుల

యొక్కయు, సొంతసొమ్ముగా నుండుటకు మాఱు, అది లోకమున దిగంతములవఱకు విచ్చలవిడిగా వెదజల్లబడును. అప్పు డది సర్వ జనులకు—సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము అగును. అప్పు డది ప్రపంచవాతావరణమందంతటను నిండి వ్యాపించును. అప్పుడు మనము పీల్చుగాలికూడ ప్రతిస్పంద నముతో "తత్త్వమసి" (అది నీవే) అని పల్కుచుండును. వేనవేల సూర్యమండలములతో కూడిన ఈ అఖిలప్రపంచము, మాట్లాడగల ప్రతిభూతము మూలమున, ఐక్యకంఠ్యముగా "తత్త్వమసి" అని పల్కుచుండును.



# విశ్వమతదర్పణము

(కాలిఫోర్నియా : 28-1-1900)

నరు డనేకవిషయములను గూర్చి పరిశీలనలు చేయుచున్నాడు. వానియన్నిటిలోను ''ఆత్మదర్శనము'' నకై చేయబడు పరిశీలనము ప్రియతమమైనది. ఆత్మ, భగవంతుడు, మోక్షము, అనువానిని గూర్చిన జ్ఞానమును సాధించుకొనుటకై గావించినంతటి ప్రయత్నమును మానవుడు వేఱొకవిషయమునుగూర్చి చేసియుండ లేదు. మన నిత్యకృత్యములందును, మన కోరికల సాధించుకొనుట యందును, మన వృత్తులయందును, మఱియు నితర రూపములగు మన ప్రయత్నములందును, మనమెంత తీవ్రముగా చిక్కుకొని పెనగులాడుచున్నను, ఒక్కొకప్పుడు ఇవన్నియు చివాలున ఆగి పోవుట సంభవించును. మనస్సు స్తంభించును. ఈ ప్రపంచపు వ్యావృత్తులను దాటిన పిమ్మట, ఈ జన్మను విడిచిన పిమ్మట, ఏమగు ననుప్రశ్న మనయెదుట గోచరించును. ఒక్కొకప్పుడు మనస్సు మన యింద్రియానుభవములను దాటిపోయి, అతీంద్రియ లోకపు జాడలను గాంచగల్గును. అంతట ఆ లోకమునుగూర్చి పూర్తిగా ఎఱుగవలె నను వాంఛ కలుగును. ఇచ్చట అచ్చట అనక, అన్ని దేశములందును, అన్ని కాలములందును, అన్ని జాతులవారియందును ఇట్టిది తటస్థించుచునే యున్నది. నరుడు ప్రస్తుతజీవితమును దాటిన పిమ్మట పరమం దేమి కలదా యని యెఱుగగోరి విచారణలు సాగించుచునే యున్నాడు : వికాసమును పొంద నభిలషించుచున్నాడు. మానవజాతియొక్క సభ్యత, నాగరికత, పరివర్తనము, వికాసము అనునవి యెంతవఱకు సాగి వచ్చినవో నిర్ణయించుటలో ఈ పరమార్థ విచారము, ఈ ఆత్మ పరిశీలనము మాత్రమే ప్రమాణములుగ గ్రహింపబడుచున్నవి.

వివిధ జాతులందు జరిగిన సంఘ సంస్కారప్రయత్నములను ఆయా జాతుల సంఘనిర్మాణమునుబట్టి గ్రహింపగలము. అటులనే ఆయా మతస్థులొనరించిన పారమార్థికములగు ప్రయత్నములను గూడ ఆయా మతసిద్ధాంతములనుబట్టి తెలిసికొనగలము. వివిధములగు సాంఘికసంస్థలు ఒండొంటిని ఖండనములు గావించుకొనుచు, పోరాటములు సలుపుకొనుచు, ఉన్నటులనే, వేర్వేఱు మతములును పరస్పరము ఆక్షేపణలు చేసికొనుచు, దూషించుకొనుచు ఉన్నవి. ఒక్కొక సాంఘికసంస్థకు జెందినవారు తాము మాత్రమే సజీవులై నిలిచియుండ నర్హులని చెప్పుచు, తమకు చేతనైనంతవఱకు బలహీనుల నణగద్రొక్కుటే తమ ధర్మముగా ఆచరింపజూతురు. సరిగ నిట్టి పోరాటమే దక్షిణాఫ్రికాలో నేడు ఘోరముగ సాగుచున్నది. అటులనే ప్రతి మతశాఖయు తానొక్కటి మాత్రమే ప్రపంచమున నిలిచియుంట అర్హత కలదని వాదింపదొడగును. ఈ కారణముచేతనే, మతమునకు మించి మానవశ్రేయస్సునొడగూర్చిన దేదియు లేకున్నను, మతమునకు మించి ఘోరకార్యములకు గారణమయినదికూడ ఏదియు కాన్పించుటలేదు. పుడమిని శాంతియు ననురాగమును వర్ధిలజేయు వానిలో మతమునకు సాటిరాదగిన దేదియు లేదు. అటులయ్యును క్రూరములగు వధలకు మూలములగు వానిలోను మతమునకు సాటిరాదగినది వేఱొకటి లేకున్నది. సర్వమానవసోదరత్వమును వ్యక్తము చేయుటలో మతమును మించిన దేదియును లేదు. మఱియు నరునికిని నరునికిని మధ్య విద్వేషము పురిగొల్పి క్రూరకర్మముల జేయించుటలోను మతమునకు మించినదేదియు లేదు! వివిధ ధర్మప్రతిష్ఠాపనలను, మఱియు మనుజులకొఱకేగాక పశుపక్ష్యాదుల కొఱకు సయితము, వైద్యచికిత్సాలయములను నెలకొలిపించినది మతమే; అనేకసారులు పుడమిని రక్తప్రవాహములలో ముంచి లేవనెత్తినదియు మతమే! అయినను, దీనికంతకును మూలమైన నరుని జిజ్ఞాసాప్రవాహము కలదని మన మెఱుగుదుము.

నిరంతరభేదముల గల్పనజేయుచు ద్వేషముల బురికొల్పుచునుండు ఈ భిన్న సంప్రదాయముల నడుమ సమరస భావమును చేకూర్చుటకై ప్రయత్నించినట్టియు, ఇప్పుడు ప్రయత్నించుచున్నట్టియు, బోధకులు, తత్త్వజ్ఞులు, పరిశోధకులు, గురువులు, సామాజికులు, దేశ దేశములందును గలరు. కొన్ని కొన్ని దేశములలో మాత్రమే వీరు పడుపాటులు ఫలించినవి. కాని సమష్టిని ప్రపంచమునంతటిని గూర్చి విచారించినయెడల అవి వ్యర్థము లై పోయినవి.

అన్ని సంప్రదాయములును సమముగ మనవలసినవే యని బోధించు మహాపురాతనమతసంప్రదాయములు కొన్ని గలవు. ప్రతి సంప్రదాయమునందును నొక పరమగమ్యము కలదనియు, దానియందు నాటుకొనిన పరమాదర్శ మొకటి ఉన్నదనియు, కాబట్టి అది లోకకల్యాణమున కత్యవసరమే యనియు, వాని యభిప్రాయము. ఈ కాలమునందును నిటువంటి భావములు కలవు. వానిని ఆచరణలో పెట్టు ప్రయత్నములు అప్పుడప్పుడు జరుగుచున్నవి. ఆ ప్రయత్నము లొక్కొకసారి మనము కోరునంత తీవ్రములు కాకుండును. అంత సమర్థతతో నిర్వహింపబడుట లేదు. ఇంతేకాదు. వాని ఫలముగా మన పోరాటములు కొన్నియెడల ప్రబలుటకూడ కలదు.

సిరసిద్ధాంత విచారము నింతట నాపి సామాన్యానుభవ దృష్టితో ఈ విషయమును పరిశీలింతము. ప్రపంచమునగల ప్రతి గొప్పమతమునందును మహత్తర ప్రాణశక్తి యొకటి గలదని మన మంగీకరింపక తప్పదు. మే మొప్పుకొనమని కొంద ఱనవచ్చును. మా కది స్పష్టమగుట లేదనవచ్చును. కాని అజ్ఞాన మొక ప్రమాణము కాజాలదు. 'ఈ ప్రపంచములో ఏమి జరుగుచున్నదో నే నెఱుగను. కాబట్టి ప్రపంచమున జరుగుచున్నవనబడు విషయములు జరుగుట లేదు' అని వాదించు వానిని క్షమింపజాలను.

ప్రపంచమునగల గొప్ప మతములలో నేదియు అంతరించి పోవుట లేదని లోకములోని మతభావప్రచారమును గమనించు వారికి స్పష్టమే. అంతరింపకపోవుటే గాదు; ప్రతిదియు ప్రవర్ధనము గాంచుచున్నది. క్రైస్తవుల సంఖ్య పెరుగుచున్నది. మహమ్మదీయుల సంఖ్య హెచ్చుచున్నది. హిందువుల సంఖ్య వృద్ధియగుచున్నది. యూదియామతస్థుల సంఖ్యయు ప్రవర్ధనము గాంచుచున్నది. వారు ప్రపంచమంతటను నిప్పుడు వ్యాపించుచున్నారు.

పురాతన మహామతములలో నొక్కటి మాత్రము క్షీణించినది. అది జొరాస్టరు మతము: ప్రాచీన పారసీకుల మతము. మహమ్మదీయులు పరిష్యాదేశముపై దండెత్తినప్పుడు ఆ పారసీకులలో సుమా రొక లక్షమంది హిందూదేశమునకు పారిపోయి అచట చేరిరి. కొందఱు తమ దేశములోనే నిలిచిపోయిరి. అచ్చట నిలిచినవారు మహమ్మదీయుల నిరంతరపీడన వలన క్షీణించిరి. ఇప్పుడు వారిసంఖ్య యే పదివేలో యుండును. హిందూదేశమున వా రెనుబదివేలవఱకు నున్నారు. వారి జనసంఖ్య పెరుగుటలేదు. వారికొక యనర్థము కలదు. వారు అన్యమతములవారిని తమలో కలుపుకొనరు. సపిండులలో వివాహసంబంధములు చేసికొను దురాచారమును వారిని క్షీణింప జేయుచున్నది. ఈ జొరాస్టరు మతము తప్ప తక్కిన పురాతన మతములన్నియు సజీవములై యుండి వృద్ధిపొందుచునే యున్నవి. ప్రపంచమున గల గొప్ప మతములన్నియును చాల పురాతనము లైనవనియు, అందేదియు ఆధునికకాలమున ప్రతిష్ఠింపబడినది కాదనియు, ప్రపంచమునగల మతములన్నియు గంగానది యూఫ్రటిసునది యను రెండునదుల మధ్యనున్న ప్రదేశమునందే ఉద్భవించినవనియు మఱవరాదు. గణ్యతకు దగిన మత మొక్కటేనియు యూరపుఖండమున బుట్టియుండలేదు. అమెరికా ఖండమునందును బుట్టియుండలేదు. ప్రతిమతమును ఆసియాఖండమునందు,

పైన పేర్కొనబడిన ప్రదేశమునందే జననము గాంచియున్నది. ఉత్తమార్గాతగల దేదియు నాశనముకాదని ఆధునిక ప్రకృతి శాస్త్రవేత్తలు చెప్పుదురు. ఆ సూత్రము నంగీకరించి మతములను బరీక్షించితిమేని, ఈ మతము లన్నియు ప్రజల కుపయోగకరములే గావున సజీవములై నిలిచియున్నవని అంగీకరింపవలయును. అనేకులకు శుభప్రదములు గనుకనే అవి నిలిచియున్నవి. మహమ్మదీయులవిషయము చూడుడు; దక్షిణ ఆసియాలో వారెట్లు వృద్ధియగుచున్నారో! ఆఫ్రికాలో దావానలము లీల వారి మతమెట్లు వ్యాపించుచున్నదో! మధ్యఆసియాలో బౌద్ధమత మెడతెగక వర్ధిలుచున్నది. యూదియా మతస్థులవలె హిందువులును అన్యమతస్థులను తమ మతములో జేర్చుకొనరు. అయినను ఇతర జాతులవారు హిందూమతము నవలంబించుచు, హిందువుల యాచారములను సంప్రదాయములను అనుసరించుచు, హిందువుల జీవనమార్గముల ననుసరించుచున్నారు! క్రైస్తవమతము వ్యాప్తి గాంచుట యందఱకును తెల్లమే. కాని ఆ మతవ్యాప్తికై కావింపబడు పరిశ్రమకు దగినంత ఫలముమాత్రము చేకూరుటలేదు. వారవలంబించు విధానమున పెద్దలోప మొకటి కలదు. పాశ్చాత్య సంప్రదాయములందెల్ల ఆ లోపమే కాన్పించుచున్నది. సాధనయంత్రమే తొంబదిపాళ్ల శక్తిని దిగమ్రింగుచుండును. అనగా, యంత్రసమృద్ధి మిక్కిలి మితిమీఱియున్నది. ఆసియాఖండవాసులు ఉపదేశ కార్యమునకు మొదటినుండియు అలవడియున్నారు. క్రొత్త క్రొత్త సంస్థలు నిర్మించుటలోను, సంఘములు నెలకొలుపుటలోను, సేనలతో దాడివెడలి సామ్రాజ్యములు సంస్థాపించుటలోను, పాశ్చాత్యులు మేటులే! కాని మతబోధలు సలుపుటలో వారాసియాఖండ వాసులకు దీటు రాజాలరు. ఆసియావారి కది మొదటినుండియు అభ్యాసము. దాని మార్గము వారెఱుగుదురు. కావున వారు యంత్రాడంబరము పొంత బోరు.

ఈ నాటి మానవజాతి చరిత్రయందు దీ యంశము గమనింప వలసినది: గొప్పమతములన్నియు స్థిరములై నిలిచి ప్రవర్ధనము గాంచుచున్నవి. ఇందు కొక కారణము కలదనుట స్పష్టము. ఈ మతము లన్నిటిలో నొక్కటిమాత్రమే నిలిచియుండి తక్కిన వన్నియు నాశనము కావలసిన వని సర్వజ్ఞుడును, కృపానిధియు, నగు విధాత భావమైనచో, ఎన్నడో అటుల జరిగియుండును. మతము లలో నొక్కటిమాత్రమే సత్యమును, తక్కినవన్నియు నసత్య ములు నైనయెడల ఆ యొక్కటిమాత్రమే నిలిచియుండి, తక్కినవి మన తాతలనాడే నశించియుండును. అయినను అట్లు జరుగలేదు. మతములన్నియు ఒక్కొకప్పుడు వృద్ధిలో నుండును, ఒక్కొ కప్పుడు మందగించును. ఈ ఒక్కవిషయము నాలోచించి చూడుడు. మీ దేశములో ఆఱుకోట్ల కెక్కువ జనసంఖ్య కలదు. వారిలో ఏ మతమునైన నవలంబించువారు రెండుకోట్లు మాత్రమే! వృద్ధియనునది సుస్థిరదశ కాదని దీనినిబట్టి స్పష్టమగు చున్నది. పరిశీలించినచో ప్రతిదేశమునను మతము లొక్కొకసారి పురోభివృద్ధిదశలోను, ఒక్కొకసారి క్షీణదశలోను ఉండునని తెలియుచున్నది. నిరంతరము శాఖాసంప్రదాయములు బయలు దేఱు చుండును. సత్యమంతయు నొక్క మతమందే యున్న దను వాదము నిజమేయై, ఆ సత్యము నంతటిని భగవంతు డొక్క పుస్తకమున నిమిడ్చిపెట్టి వారి కిచ్చియున్నయెడల, ఇన్ని సంప్ర దాయము లెట్లు పుట్టగలవు? ఒక్క పుస్తకము నాధారము చేసి కొనియే శాఖాంతరము లనేకములు బయలు వెడలుచున్నవిగదా! భగవంతుడు ఏవియో కొన్ని గ్రంథములందే సత్యమునంతను వ్రాసిపెట్టిన యెడల, వాని నాధారము చేసికొని పోరాటములు సలుపుకొనుటకై వానిని మన కిచ్చియుండడు గదా! భగవంతుడు సత్యము నంతటిని నొక్క గ్రంథమున నిమిడ్చి పెట్టుటయు లాభ దాయకము కాదు సుడీ. ఆ పుస్తక మెవరికిని అర్థమై యుండదు. ఉదాహరణకుగాను బైబులు నాధారము చేసికొని యెన్ని మత

శాఖలు పుట్టినవో విచారింపుడు. ప్రతి శాఖయు ఒక్కొక్క వాక్యమును దీసికొని, తన స్వంత వ్యాఖ్యానము చెప్పుచు, తన వ్యాఖ్యయే సత్యమనియు, తదితరులు చెప్పు అర్థము తప్పనియు వాదించుచుండును. ప్రతి మతమందు నిటులనే తటస్థించుచున్నది. మహమ్మదీయులలోను, బౌద్ధులలోను, శాఖాభేదము లెన్నియో పుట్టినవి. హిందువులందుగల భేదములు వందలకొలదిగ నున్నవి! పారమార్థికవిషయములలో మానవజాతి నంతటిని ఒక్కరీతి భావనాపద్ధతికి దీసికొనివచ్చుటకగు ప్రయత్నములన్నియు వ్యర్థము లయినవి, మఱియు వ్యర్థము లగుచున్నవి, ఇంకముందు నటులనే వ్యర్థములు కాగలవు అని తెలుపుటకే మీకీ సంగతులు చెప్పినది. ఈ దినములందు నయితము, నూతనసిద్ధాంతము నొకదానిని బోధించు గురువు, తన శిష్యులను విడిచి పదిక్రోసులదూరము పోవుటలోపలనే, యా శిష్యు లిరువది శాఖాంతర సిద్ధాంతముల సృష్టించుచుండుట అనుభవసిద్ధము. సర్వకాలములందు నిటులనే జరుగుచుండును. లోకమున నందఱిని ఒక్కరీతి భావనాపద్ధతికి కట్టిపెట్టుద మనుట పొసగని పని. ఈ మాట తథ్యము. భిన్నత్వమును ప్రతిపాదించినందుకై భగవంతుని నే నెంతయు గొనియాడుదును. నే నేమతమును గాని ఖండించువాడనుగాను. మతాంతరము లుండుట నాకిష్టము! అవి యింకను వృద్ధియగుగాక యని నా కోరిక. ఏలయందురా వినుడు. మీరును, నేనును, ఇక్కడివా రందరమును ఒకే సంకల్పము కలవార మయితిమా, మనము భావనచేయగల సంకల్పములే యుండజాలవు. రెండుమూడు శక్తులకు పోరాటము సాగినగాని చలన మనున దుండజాలదు. భావ భేదము వలన మాత్రమే సంకల్పమనునది సంభవమగును. మన యందఱి సంకల్పము లేకమైనయెడల, మన మొకరి ముఖముల నొకరు భావశూన్యబుద్ధులతో చూచుకొనుచు, ప్రదర్శనశాలలం దుంచబడు ఈజిప్టుదేశపు రక్షితశవములమాడ్కి గూర్చుండవలసిన వార మగుదుము. మనస్థితి అంతకుమించి యుండదు. సజీవమై

వడిగ బాఱునట్టి ప్రవాహమునందే సుడులేర్పడగలవు. నిలుకడ గల్గి మురుగుచుండు నీటిలో సుడులు గలుగనేరవు. అటులనే మతములు మృతము లయినప్పుడే, అందుండి శాఖాంతరములు బయలుదేఱుట మానును. అప్పుడు భూస్థాపితశవములలోవలె వానిలో అఖండశాంతియు, సమరసతయు వర్ధిల్లగలదు. అంతియ కాని, మానవజాతి సంకల్పములు చేయుచుండునంతకాలము మతాంతరములు వెలువడక మానవు. వైవిధ్యము జీవచిహ్నము; అది యుండవలసినదే సుడీ! నరు లెంద ఱున్నారో అన్ని శాఖాంతరము లుండుగాక యని నా కోరిక! అప్పుడు ప్రతివానికిని వాని కనువగు ప్రత్యేకవిధానము లభింపగలదు; మతసాధనయం దతడు తన ప్రత్యేకమార్గము ననుసరింపగలడు.

ఈ స్థితి యిప్పు డుండనే యున్నదనవచ్చును. మనలోని ప్రతివాడును తన ప్రత్యేకమార్గము ననుసరించియే సంకల్పములు చేయుచున్నాడు; కాని స్వాభావికమగు ఈ మార్గమున కెల్లెడలను అడ్డులు కల్పింపబడుచునే యున్నవి. ప్రత్యక్షముగా ఖడ్గప్రహారము లిప్పుడు లేవన్నమాటేగాని యితర బాధకములు సంఘటిల్లుచునే యున్నవి. న్యూయార్కులోని బోధకప్రముఖు డొక డేమి చెప్పెనో తెలియునా? ఫిలిప్పైన్ ద్వీపస్థుల నోడించి స్వాధీనపఱచుకొనవలె నట! ఏల? వారికి క్రీస్తుమతము బోధించుట కది యొక్కటియే మార్గము కాబట్టియట! వా రిప్పటికే క్యాథొలిక్ క్రైస్తవులు. కాని వారిని ప్రెస్బిటేరియను క్రైస్తవులుగా మార్పవలెనట! అందుకై ఈ రక్తపాత మహాపాతకమును తమదేశీయు లొడిగట్టు కొనవలెనట! ఎంతఘోరము! ఇత డా దేశములోగల మహావిజ్ఞులలో, అత్యుత్తమ బోధకులలో నొకడు. అట్టివాడు ఇట్టి దుర్బోధ లొనర్ప లజ్జింపకున్నాడు! సభ్యు లా ప్రసంగమును కరతాళ ధ్వనులతో నామోదించు చున్నారు! ప్రపంచ మెంతటి దుఃస్థితిలో కూలియున్నది! ఇదియా నాగరికత? పులులును, నరమాంస

భక్షకులును, రాక్షసులును, ప్రాచీనకాలపునాటి మూఢజనులును రక్తపిపాసచే గావించిన క్రూరకార్యములకు వీరిచర్యలు తీసిపోవు! ఆ ఘాతుక కార్యములే నవ్యతర సిద్ధాంతములతో, నవ్యతర నామముల దాల్చి బయలుదేఱినవి. పూర్వము ఒక్కొక సంప్రదాయ మవలంబించువారు అన్యసంప్రదాయావలంబులను ముక్కలు ముక్కలుగ ఖండించుటయు, జీవములతో తగులబెట్టుటయు జరుగుచుండెను. ఆ క్రౌర్యమే, ఆ ఘాతుక స్వభావమే, నూతనస్వరూపమున నిప్పుడు బయలుదేఱినది. ఆ స్వభావము మాత్రము చావలేదు. అవకాశము లున్నయెడల వెనుకటి నీచరూపములనుగూడ దాల్పగలదు. ఖడ్గప్రయోగములు, అగ్ని ప్రయోగములు, హత్యలు: వీనితో తులతూగు ఘోరకార్యములే యీనాడు జరుగుచున్నవి. పరమతద్వేషము, సాంఘికదౌర్జన్యము, వర్ణభేదము, జాతిబహిష్కారము ఎన్నెని ప్రయోగింపబడుచునే యున్నవి. ప్రతివాడును తమ యూహలనే భావన చేయవలయు నని గదా వీ రిట్లు ఘోరకార్యముల జేయుట! అట్టి భావైక్య మెందు కుండవలయునో నాకు తోచుటలేదు. నేనే వివేకినైతినేని, భిన్నములగు భావపరంపర లున్నందుకు సంతసింపవలసినది. సమాధిలోని పీనుగులవలె పుడమిలో మనమందరమును వసించుట నా యభిమతము కాదు. మనుష్యోచిత జీవనము గడుపువా రుండు ప్రపంచమున బ్రతుకవలయునని నేను కోరెదను. బుద్ధిమంతులకు భేదాభిప్రాయము లుండక తీరదు. అభిప్రాయభేదములే ఆలోచనా గతి కలదనుటకు ప్రథమ నిదర్శనము. నేను యోచనాపరుడనే నైతినేని భావభేదములుగల జిజ్ఞాసాపరు లుండుచోటనే నివసింప నిచ్ఛగింతును.

అట్లైన యెడల, భిన్న భిన్నములగు ఈ భావనలన్నియు నెట్లు సత్యములు కాగలవని మీరు ప్రశ్నింపవచ్చును. ఒక విషయము సత్యమైనయెడల దానికి విరుద్ధముగ నుండు విషయము అసత్యము కావలయునుగదా; పరస్పర భిన్నాభిప్రాయములు

వీక కాలమున ఎట్లు సత్యములు కాగలవనవచ్చును. దీనికి సమాధానము చెప్పెదను. కాని, ముందుగ మిమ్ము నే నొక ప్రశ్న నడిగెదను. ప్రపంచములో వేర్వేరు మతములన్నియు నిజముగా పరస్పర విరుద్ధములుగ నున్నవా? ఏ మహాసంకల్పముల బాహ్యరూపముల గూర్చియో నే నడుగుటలేదు. ఆ యా మతములవా రుపయోగించు దేవళములు, భాషలు, పుస్తకములు, కర్మకలాపములు, మంత్రతంత్రములు వీనినిగుఱించి నేనడుగుట లేదు. ప్రతి మతముయొక్కయు అంతరాత్మను గూర్చి యోచన చేయుడు. ప్రతిమతముయొక్క బాహ్యస్వరూపమునకు వెనుక నిగూఢమై యొక ఆత్మయుండును. ఈ ఆత్మ స్వరూపము మఱొక మతముయొక్క ఆత్మ దాల్చు స్వరూపమునకు భిన్నముగ గాన్పింపవచ్చును. అయినను అవి పరస్పర విరుద్ధములైనవా? లేక పరస్పర సంపూర్ణములైనవా యని పరీక్షింపుడు. నా బాల్యమునుండియు ఈ ప్రశ్ననుగూర్చి విచారణ సలుపుచు, నా జీవితమునంతను దీని పరిశీలనకే అర్పణచేసియున్నాను. నేను తెల్పగల్గిన పర్యవసానములు మీకును సహకారములు కావచ్చును. కావున వానిని మీకు నివేదింప బూనితిని. వివిధమతములును పరస్పరము వైరము కలవికావు; మఱియు పరస్పరము సహకారము సల్పునవియుగూడ నగు సుడీ! ప్రతిమతమును, ఆ యఖండైకసత్యముయొక్క ఒక్క అంశను జేపట్టి దానిని నిరూపణము చేయుటకును, దానిని ఆదర్శముగ బ్రకటించుటకును, సర్వశక్తిని వినియోగించి పాటుపడుచుండును. సిద్ధాంతము తరువాత సిద్ధాంతముగా గ్రొత్తవి వచ్చి చేరుచుండునేగాని, అవి ప్రాత వానిని తిరస్కరించుటలేదని నా యభిప్రాయము. క్రొత్త సిద్ధాంతములు బయలుదేరును: ఒక మహాసంకల్పము చేకొని దానికి స్వరూపసంకల్పనము చేయును. ఈ క్రొత్త ఆదర్శములు పూర్వపువానికి తోడ్పై వానితో చేరుచుండవలయును. ఇది మానవజాతియొక్క పురోగమనమునకు నిదర్శనము. మనుజు డెన్నడును అసత్యమునుండి బయలుదేరి

త్యమును చేరుకొనుటలేదు సుడీ! సత్యమునుండి సత్యముకడకే పయనము చేయుచున్నాడు — అల్పతరసత్యమునుండి గురుతర సత్యము వైపుగా నడుచుచున్నాడు! అంతియకాని అసత్యమునుండి సత్యమునకై వచ్చుటలేదు. కొడుకు తండ్రిని మించినవాడు కావచ్చును. అంతమాత్రముచేత తండ్రి శూన్యబుద్ధియని వాదింప దగదు. తండ్రియొక్క శక్తియు మఱికొంతయు చేరి తనయుడుగా రూపాంతరము పొందవచ్చును. నీవు పసివాడవుగ నున్నప్పటికంటె నిప్పుడు నీ విజ్ఞానము అధికమైనయెడల వెనుకటి దశ నిప్పుడు తిరస్కారముతో జూతువా? ఆ పూర్వదశను శూన్య మందువా? నిర్జీవమందువా? నీ ప్రస్తుతదశ ఆ పసితనపుదశకు మఱికొంత విజ్ఞానమును జేర్చుటచేతనే యేర్పడినది సుమా!

ఇంకను చూడుడు. ఒకేవిషయమును మనము వేరేరు దృక్పథములనుండి విచారింపవచ్చును. ఆ దృక్పథములు పరస్పరము విరుద్ధములుగ నుండవచ్చును. కాని అవన్నియు సూచించున దొకేవస్తువును. ఒకమనుష్యుడు సూర్యునివైపునకు ప్రయాణము చేయుచున్నా డనుకొనుడు. అతడు చాల మజిలీలకడనుండి సూర్యుని ఫోటోగ్రాఫులను దీసె ననుకొనుడు. వానియొద్ద సూర్యుని ఫోటోగ్రాఫులు చాల చేరును. వాని నన్నిటిని నెదుట బెట్టుకొని చూచినచో ఏ రెండును పూర్ణముగ నొకతీరున నుండవు. అయినను అవన్నియు ఒక్క సూర్యుని బొమ్మలే అని మన మెఱుగుదుము. వేర్వేఱు దృక్పథములనుండి తీయుటచేత భేదించినవి. ఒక దేవాలయమునకు వేర్వేరు మూలలనుండి ఫోటోగ్రాఫులను దీసినయెడల నవన్నియు భిన్నములుగనే యుండును. వేర్వేరు దృక్పథములనుండి తీయుటే కారణము. దేవాలయము ఒక్కటే. ఈతీరుననే మన మొకే సత్యమును వేర్వేరు దృక్పథములనుండి చూచుచున్నాము. మన జన్మ, మన విద్య, మన సహవాసములు, మన స్థితిగతులు, మన దృక్పథ ములందు భేదమును చేకూర్చుచున్నవి. కాని మన మందఱమును

చూచున దొక్క సత్యమునే. మన పరిస్థితుల ననుసరించి సత్యమును దర్శించుచున్నాము. మన హృదయములతో దానికి వన్నెలను గల్పనచేయుచున్నాము. మన బుద్ధులతో దానికి వేర్వేఱు అర్థముల జెప్పుచున్నాము. మన మనస్సులతో దాని ప్రయోజనములను నిర్ణయించుకొనుచున్నాము. ఎవరికి సంబంధించినంతవఱకే వారు ఆ సత్యమును గ్రహించుచున్నారు. ఎవరి శక్తికి చాలినంతవఱకే వారు దానిని అర్థముచేసికొనగల్గుచున్నారు. ఇందువలననే ఒక నరునికి మఱొకనరునికి మధ్య అభిప్రాయ భేదములు — ఒక్కొకయెడ ప్రత్యక్ష విరుద్ధాభిప్రాయములుకూడ — చూపట్టుట! అయినను మనమందరము ఆ విశ్వజనీనమగు మహాసత్యమునకు సంబంధించియున్నవారమే!

కాబట్టి ఈ మతములన్నియు భగవత్సంకల్పము ననుసరించు వేర్వేఱు మహాశక్తులే; మానవజాతికి మేలుగూర్చునవే! వీనిలో నేదియు నాశనము కాజాలదు. దేనినిగాని నాశనమొందింపలేమని నా అభిప్రాయము. మీరు ప్రకృతిలోని ఏ శక్తినిగాని నాశనము చేయజాలరు. అట్లే పారమార్థిక మహాశక్తులలో దేనినికూడ నశింపచేయజాలరు. ప్రతిమతమును సజీవముగ నున్నదని మీరు గ్రహించియున్నారుగదా! ఒక్కొక కాలమం దది వెనుకబడవచ్చును, ముందుకు బోవచ్చును. ఒక్కతఱి నొకదానిశోభ తొలగవచ్చును; మఱొక కాలమున అది నవ్యతరశోభతో ప్రకాశింపవచ్చును. కాని దానియందలి ఆత్మ స్థిరముగనే నిలిచియుండును. దాని కెన్నడును నాశనములేదు. ప్రతి మతమును ప్రకటించు ఆదర్శము శాశ్వతమగునదియే. అనగా ప్రతిమతమును ప్రజ్ఞతో తన యాత్రను సాగించుచునే యున్నది.

మఱియు ప్రతిదేశమందును తత్త్వవిచారపరులుగాని ఇతరులుగాని దేనికొఱకై కలవరించుచున్నారో, ఆ విశ్వమతము కూడ ఇదివఱకే యేర్పడియున్నది, సంసిద్ధముగనే యున్నది.

విశ్వభ్రాతృత్వ మిదివఱకే ఎట్లు ఏర్పడియున్నదో, అదే రీతిని విశ్వమతమును ఏర్పడియే యున్నది. దేశదేశములు తిరిగినవారు మీలో నున్నయెడల, వారికి ప్రతిదేశమునందును సోదరసోదరీ మణులు కాన్పించియే యుందురు. నాకట్టివారు ప్రపంచమం దంతటను గాన్పించుచున్నారు. భ్రాతృత్వ మెన్నడో ఏర్పడియే యున్నది. అయినను అనేకులు దానిని చూడగల శక్తిలేక, భ్రాతృబృందములను నూతనముగా సమకూర్తుమని యఱచుచు, ఉన్న దానిని విచ్ఛిన్నము చేయుచున్నారు. విశ్వమతముకూడ ఇదివఱకే ఏర్పడియున్నది. పీఠాధిపతులును, వివిధమతములను బోధించుటే తమ కృత్యముగా ప్రచారము సల్పువారును, కొన్ని నిమిషములపాటు తమ యుపదేశములను గట్టిపెట్టినయెడల ఆ విశ్వమతము స్పష్టముగ మూర్తీభవించి మనకు గోచరము కాగలదు. స్వలాభార్థమై వీరు దానిని కలచివేయుచున్నారు. మతగురువు లన్నిదేశములందును మిగుల పూర్వాచారపరాయణు లయియుంట మన మెఱుగుదుము. వారట్లుండుట ఎందులకు? నిజముగా ప్రజకు మార్గదర్శకులై వఱలు ఉపదేశకులు చాల నరుదు. ఈనాటి గురువు లనేకులు ప్రజల ననువర్తించి మెలగు చున్నారు. వారు ప్రజలకు దాసులుగను బానిసలుగను వర్తించు చున్నారు. జను లొకదానిని శుష్కమన్నచో, వారును దానిని శుష్కమందురు; నలు పన్నచో, వారును నలు పందురు. జనులు ముందడుగు వేసిన, వారును ముందడుగు వేయుదురు. అప్పుడు వారు వెనుకబడియుండ వీలులేదు. కావున మీరు బోధకులను నిందించుటకు ముందు—ఇప్పు డదియేకదా ఆచారము—మిమ్మును మీరే నిందించుకొనవలయును. మీ కేది యర్హమో అదే మీకు సంప్రాప్తించుచుండును. నవ్యతరములును నుత్కృష్టములు నగు భావనల మీ కుపదేశించి మీకు పురోభివృద్ధి కల్పింపబూను ఉపదేష్టగతి యేమగునో విచారించితిరా? అట్టివానికి బహుశః అన్నవస్త్రములు కఱవగును; వానిబిడ్డ లన్నములేక మాడుదురు.

మీవలెనే మీ బోధకులును ప్రపంచధర్మములకు లోబడినవారు. మీరు ముందుకు సాగుచున్నచో, వారును "సరే ముందుకు పోదము" అనుచుందురు. కాని ఈ రీతిని ప్రజాభిప్రాయము ననుసరించి తిరుగుళ్లువడని మహాత్ములు కొందఱు గలరు. వారు సత్యద్రష్టలు; వారు సత్యమునే పాటింతురు; వారిని సత్యము బంధించివేసినది; సత్య మావేశించినది; వారు ముందునకు సాగి పోక నిలువజాలరు. వారికి వెనుకచూ పనునది యుండదు. వారు ప్రజలకు భయపడరు. వారి లక్ష్య మంతయు భగవంతుని మీదనే యుండును. భగవంతుడు వారియెదుట దివ్యజ్యోతియై వెలుగు చుండును; వా రా జ్యోతి ననువర్తింతురు.

అమెరికాదేశమున నే నొక "మార్మను" జాతి పెద్ద మనుష్యుని గలిసికొంటిని. ఆయన నన్ను తన మతమున గలుపు కొన యత్నించినాడు. నే నిట్లంటిని: "మీ భావముల యెడల నాకు మిగుల నాదరము కలదు. కొన్ని యాశయములందు మాత్రము భేదాభిప్రాయ మున్నది. నేను సన్న్యాసాశ్రమమును స్వీకరించినవాడను. మీరో, బహుభార్యల స్వీకరింప నంగీకరించు వారు. సరే కాని, మీరు మతబోధ చేయుటకు భారతదేశము కేలరారు?" అందుమీద ఆయన మిగుల వెఱగంది "ఏమేమీ! మీకు వివాహమే గిట్టదా? ఇంకను నన్ను మీ దేశమునకు రమ్మందు రేల? మేము బహుభార్యా స్వీకారమును బోధింతుమే!" అనెను. నే నిట్లంటిని: "కానిండు. ఎటువంటి మతభావములనైనను మా దేశీయులు చక్కగ నాలకింతురు. మీరు భారతదేశమునకు రావలయుననియే నా కోరిక. ఏలనందురా? మొదటిది మతాంతర శాఖ లుండుట నా కిష్టము. రెండవది, భారతదేశములో నిదివఱకున్న మతాంతర శాఖలతో దృప్తిపడనివా రనేకులు గలరు. ఈ అసంతృప్తివలన వా రే శాఖలోను ప్రవేశింపకున్నారు. బహుశః మీ కెటువంటివారు కొందఱు చిక్కవచ్చును."

మతశాఖలు పెరిగిన కొలదిని ప్రజలు మతాభిమానులగుటకు

హెచ్చుగ నవకాశములుండును. భోజనశాలలలో వివిధభోజ్యము లుండును గాన ప్రతివాడు నచ్చట తన యభిమానభోజ్యములను సుష్ఠుగా భుజించుట కవకాశముగలదు. అట్లే హెచ్చు ప్రజలు పరమార్థచింత చేయుటకు మార్గమేర్పడవలె నన్నచో, ఎన్ని మతశాఖలు ప్రబలిన నంతమంచిది. ప్రజలకు మతమనిన ఇష్టము లేకపోలేదు. నే నది నమ్మను. ప్రజాబుద్ధికి హితమగు మతము నుపదేశించు బోధకులు లేకున్నారు. నాస్తికుడనియు పాషండు డనియు నింక నేమేమియో పేరులతో నిప్పుడు దూషింపబడు నరుడే, వాని కనువగు మతధర్మమును బోధ చేయగల సత్యద్రష్ట లభించినచో, ఆ సంఘములో గలవా రందఱికన్న మహాపార మార్థికుడు కావచ్చును. మన పద్ధతి నవలంబించియే మనము భుజింపగలము. ఇందుకు నిదర్శనము, మా భారతీయులు వ్రేళ్లతో తిందురు. మా వ్రేళ్లు పాశ్చాత్యుని వ్రేళ్లవలెకాక మా యిష్టాను సారము వంగును. మీరు వాని నట్లు ఉపయోగింపజాలరు. ఒకనికి ఆహారము పెట్టినంతనే చాలదు. అది వాని కలవడిన మార్గముననే భుజించుట కనుకూలము లుండవలెను. అట్లే మీకు పారమార్థిక బోధ చేసిన జాలదు. దానిని మీ మార్గముననే బోధింపవలయును. అవి మీ భాషలో—మీ ఆత్మలకు గ్రాహ్యమగు భాషలో—నుండ వలెను. అప్పుడే మీకు సంతృప్తి చేకూరును. నా భాష నెఱిగి దానిమూలమున నాకు తత్త్వోపదేశము చేయగలవాడు లభించు నప్పుడు నా కది వెంటనే అవగాహము కాగలదు. నాయం దది శాశ్వతముగా నిలువగలదు. ఇదొక ముఖ్య విషయము.

కావున మనుజుల బుద్ధులు వేర్వేఱు దశలలో నుండు ననియు, వేర్వేఱు విధములైనవనియు, తెలియవచ్చుచున్నది. మతము లెంత మహాభారమును వహింపవలసియున్నదో యోచిం పుడు. ఒకడు కొన్ని సిద్ధాంతములను తెచ్చి సర్వమానవజాతికిని అవియే అనుకూలింపవలయునని పట్టుపట్టి వాదించును. భగవంతుని జంతు ప్రదర్శనారామమగు ఈ ప్రపంచములో నత డొక చిన్న

పంజరమును చేత బట్టుకొని ప్రవేశించి "భగవంతుడు, ఏనుగు, ప్రతిజీవియు ఈ పంజరములో నిముడవలయును. ఏనుగును ముక్కలు ముక్కలు చేసియైనను దీనిలో నిమిడ్చితీరెదను" అనును. కొందఱు కొన్ని సదభిప్రాయములను గూర్చుకొని యొక సమాజము నెలకొల్పి, అందఱును దానిలో చేరవలసిన దందురు. "అందఱికిని ఇందు చోటుచాలదే!" "చాలక పోనిండు. వారిని ఖండ ఖండములుగ నఱికియైనను ఇందు బ్రవేశపెట్టుడు. ఎట్లో ఇందు జొచ్చిన జాలును. అటుల ప్రవేశింపకపోయిరా, వారికి నరకమే ప్రాప్తి" అందురు. "ప్రజలు మనమాటల నాలకింప రేమి? కారణమేమై యుండును?" అని కొంచెము నిదానించి విచారణచేయజాలు మతబోధకునిగాని మతాధిపునిగాని నేను గాంచి యుండలేదు. అట్లు విచారించుటకుమాఱు "ప్రజలు మిగుల దుర్మార్గు"లని నిందించుచుందురు. "ప్రజలు నా మాటెందుకు వినలేదు? వారు సత్యధర్మమును గ్రహించునట్లు నే నేల చేయలేక పోతిని? వారిభాషలో నే నేల మాట్లాడ జాలకపోతిని? వారి కండ్లు తెఱచుట నా కేల సాధ్యముకాలేదు? కారణమేమి?" అని ఆ బోధకు లెన్నడును ఆత్మవిమర్శన చేసికొనరు. వారి అవివేకమే ఇందుకు కారణము. ప్రజలు తమ మాటవినని దోషమంతయు తమదేయని ఆ బోధకు లెఱుగవలెను. కాని వారు దానినంతయు ప్రజలమీదనే పెట్టుదురు. ప్రతివానిని తమ మతశాఖలోనికి ప్రవేశపెట్ట జాలునంత విశాలముగా తమ బోధను మార్చుకొను యత్నమును వీ రెన్నడును చేయరు.

సంకుచితభావము లింతగా నుండుటకు కారణము మన కిప్పుడు సులభముగా తెలియుచున్నది: అంశము తానేపూర్ణము నను చుండును; స్వల్పపరిచ్ఛిన్న వస్తువు తానే అఖండము నను చుండును. కొన్నినూర్ల సంవత్సరములక్రిందటనే మితప్రజ్ఞాన్వితము లగు మానవుల మేదస్సులనుండి యుద్భవమైన క్షుద్రమతశాఖలు

అపారమగు బ్రహ్మజ్ఞానమును సంపూర్ణముగ గ్రహించినట్లు గర్వాంధకారముతో పలుకుచున్నవి. ఇందువలన నరులెంతటి గర్వాంధులో తెలిసికొనవచ్చును. వారి బోధలు, వారి వాదనలు, వ్యర్థములగుచుండుట ఆశ్చర్యమా? భగవత్కృపవల్ల అవి ఎన్నటికిని నిష్ప్రయోజనము లగుచుండగలవు. ఇట్టి మార్గము ద్రొక్కిన వారిలో మహమ్మదీయులు మిక్కిలి విజయమునందిరి. వారొక చేతిలో ఖురానును, రెండవచేతిలో ఖడ్గమును, దాల్చి మత బోధకు గడంగిరి. "ఖురాను నంగీకరింతువా, మరణము నంగీకరింతువా?" రెండేమాటలు! వారికెట్టి అద్భుత విజయము చేకూరినదో చరిత్ర తెలుపుచున్నది. ఆరుశతాబ్దముల కాలము వారికేదియు నడ్డురాజాలదయ్యెను. కాని ఆ పిమ్మట వా రాగిపోవలసి వచ్చెను. అట్టి పద్ధతుల నవలంబించు ఇతర మతములకును ఇదే స్థితి ప్రాప్తింపగలదు. మనము పసిబిడ్డలవంటి అజ్ఞులము. మనుజ స్వభావము నెప్పుడును మఱచుచుందుము. జీవితారంభమున మన కసాధారణమగు నదృష్టము చేకూరునని భ్రమించు చుందుము. మన కా విశ్వాస మప్పుడు దేనివలనను తొలగదు. ముసలివార మయినప్పుడుమాత్రము ఆ విశ్వాసము మటుమాయ మగును. మతముల నడకయు నిటులనేయున్నది. ప్రథమ దశ యందు మత మొకింత ప్రచారము పొందుటతోడనే, కొలది సంవత్సరములలో నరునిస్వభావము పూర్తిగ మార్చివేయవచ్చునను విశ్వాసము గలుగును. బలాత్కార మతస్వీకారము కొఱకు వధలును, మారణకర్మలును సాగును. తుద కన్నియు నిష్ఫలములని తేలును. అప్పుడు వారికి విషయ మొకింత బోధపడ నారంభించును. ఆ మతములు తమ సంకల్పము కొనసాగించు కొనజాలక పోవుటచే ఎంత మేలుకలిగినది! ఆ తెగల దుర్భావోద్రేకమే సంపూర్ణ విజయము నందినయెడల లోక మిప్పు డేస్థితి నుండెడిదో యోచనచేయుడు: నరు డెక్కడ నుండెడివాడో! భగవదనుగ్రహమువలన నట్టి యుద్రేకమున కపజయములు

వాటిలినవిసుడీ! అయినను ప్రతి మతమందును మహాసత్య మొకటి యిమిడియుండును. అది యొక గొప్ప పరమావధికై పాటుపడును. ఒక మహోత్తమ సూత్రమును ప్రచారమునకు తెచ్చియుండును. దాని కది ఆయువుపట్టు. నాకొక కథ జ్ఞాపకమునకు వచ్చు చున్నది. ప్రజలను బీభత్సముగ నానా చిత్రవధల గావించు కొన్ని భూతము లుండెడివట. వాని ఆయువుపట్టులు కొన్ని పక్షు లందు దాగియుండెడివట. ఈ రహస్యము వెల్లడిగాక, ఆ పక్షులు క్షేమముగ నున్నంతవఱకును, ఈ భూతములకు చా వనునది లేదు. మనలో ప్రతివానికిని అట్టిపక్షి యొక టున్నదనవచ్చును. మన ఆత్మ దానియం దుండును. అనగా ప్రతిమనుజునకును నొక జీవితాదర్శ ముండును; ఒక జీవితకర్తవ్య ముండును. ప్రతి నరు డును ఏదోయొక ఆదర్శమునకు, ఏదోయొక కర్తవ్యమునకు, మూర్తీభావముగ నుండును. మీ కెట్టి అవాంతరమైన వచ్చుగాక. ఆ ఆదర్శమునకు, ఆ కర్తవ్యమునకు, భంగము లేనంతకాలమును మీ రెట్లో బ్రదికియే యుందురు. ధనము రావచ్చును, పోవ చ్చును; ఆపదలు అద్రి సమానపరిమాణము లందువఱకు వచ్చు చుండవచ్చును. కాని వానికి భంగము రానిచో, మీ కేదియు జావును దెచ్చిపెట్టజాలదు. మీరు వృద్ధులై నూరేండ్లు నిండిన వారు కావచ్చును. అయినను మీ కర్తవ్యము మఱపునబడక, మీ హృదయములం దవి యౌవనముతో నున్నంతకాలము మీకు చావులేదు. కాని ఆ ఆదర్శము భగ్నమయ్యెనా, ఆ కర్తవ్యము హానినొందెనా, మిమ్ము నేదియు రక్షింపజాలదు. జగత్తులోని ద్రవ్య మంతయు, అధికారమంతయు, మిమ్ము కావజాలవు. జాతు లనగా ప్రత్యేకవ్యక్తుల సముదాయము లేగదా! కావున ప్రతిజాతియు సర్వ జాతిసమితియం దేదోయొక విద్యుక్తధర్మమును నిర్వహింపవలసి యుండును. ఆయాధర్మము నా జాతి నిలువబెట్టి యుండునంతకాల మును దానికి నాశనము లేదు. కాని అది స్వధర్మమునువీడి అన్య ధర్మమునకు బాల్పడెనా, నాటితో దాని యాయువు ముగియును.

మతముల స్థితియు నిట్టిదే. పురాతన మతములన్నియు ఈ ప్రపంచమున నాశమందిపోక నిలిచియున్నందున, వాని నియుక్త మహాధర్మము నవి చెక్కుచెదరక పాలించుచున్నవని తెలిసికొన వచ్చును. అవి ఎన్ని పొరపాట్లు పడియున్నను, వాని కెట్టి యవాంతరములు కలిగియున్నను, ఎన్ని కలతలలో నవి చిక్కియున్నను, వానియం దెట్టి వ్యర్థ భావములు చేరియున్నను, వాని హృదయము పరిపూర్ణారోగ్యముతో, పూర్ణబలముతో, స్పదించుచున్నది. తా మే ధర్మమును సాధించుటకై పుట్టిరో, ఆ ధర్మమును అవేవియు కోలుపోవలేదు. ఆ ధర్మమును పరిశీలించుట మనోహరకార్యము. !మహమ్మదీయ మతమునే తార్కాణముగ దీసికొందము. క్రైస్తవులకు మహమ్మదీయ మతముపై నెంత ద్వేషముకలదో అంత ద్వేష మింకే మతముపైని లేదు. అంత నికృష్టమత మింకేదియు లేదని వారిభావము. అయినను, ఒకడు మహమ్మదీయుడు కాగానే ఎట్టిభేదమును పాటింపక మహమ్మదీయులందఱును వాని కాప్తులై వానిని కౌగిలించుకొందురు. మఱే యితర మతస్థులు అట్లుచేయరు. అమెరికాలో కడు హేయముగా నెంచబడు "అమెరికను ఇండియను" జాతివాడు, మహమ్మదీయుడైనయెడల టర్కీసుల్తానంతటి వాడును వానితోడ విందారగించుటకు సంసిద్ధముగ నుండును. వానికి తెలివితేటలుండవలయును గాని, ఆతడు పొందజాలని పదవి యుండదు. అమెరికాలో శ్వేతజాతీయుడును నీగ్రోజాతివాడును గలిసి సరసను మోకరించి దైవప్రార్థన చేయు క్రైస్తవాలయమును నేనింతవఱకు చూడలేదు. ఈ యంశమును సమాలోచనము చేయుడు: మహమ్మదీయ మతమున ఆ మతస్థులందఱును సర్వసములుగ జూడబడుదురు. ఆ మతమునందుగల విశిష్టధర్మ మది. ఖురానులో జాలచోట్ల విషయలోలతను ప్రోత్సహించు నంశములు గలవు. వానిని మీరు సరకుగొనదగదు. మహమ్మదు మతమునకు జెందినవా రెల్లరును ఒక్క భ్రాతృవర్గమని ఆచరణరూపమున బోధించుటకై ఆ మతము

ఉద్భవమైనది. ఆ మతమున కది ఆత్మ! స్వర్గము, జీవాత్మ మున్నగు వానినిగూర్చి ఆ మతము బోధించు విషయము లంత ప్రధానములు గావు. అవన్నియు కాలక్రమమున వచ్చి చేరినవి.

ఇట్లే హిందువులయం దొక విశిష్టజాతీయాదర్శముగలదు. పారమార్థికతయే అది. ప్రపంచమున మఱేమతమునగాని, ఏ శాస్త్రములందుగాని, "బ్రహ్మమును" నిర్వచించుటకై భారతీయు లెంత మేధాశక్తిని ధారవోసిరో అంత ప్రజ్ఞను వినియోగించినవారు లేరు. ఐహికస్పర్శచే నిసుమంతయు కలుషితము కాకుండునట్లు వారు ఆత్మాదర్శమును నిర్వచింపజూచిరి. ఆత్మ దివ్య స్వరూపమై వెలుగవలసినదే! ఆత్మను ఆత్మగా భావనచేయుచో దానికి నరత్వ మాపాదింప దగదు. సర్వైక్యభావమును గూర్చియు, సర్వవ్యాప్తమగు పరబ్రహ్మముయొక్క అపరోక్షానుభూతిని గూర్చియు, బోధించినది హిందూమతమే. భగవంతు డెక్కడనో స్వర్గమున వసించునను ప్రాథమిక బోధలన్నియు అజ్ఞాన జనితములని వారి అభిప్రాయము. అవి కేవలము మానవ సులభ భావనాశక్తివలన కల్పితమైనవే! బ్రహ్మమును నరరూపమున భావనచేయువారి యొక్క ఆరోపణలే! స్వర్గమంతయు ఇచ్చటనే, ఇప్పుడే, యున్నది. అనంతకాలములో ప్రతిక్షణమును మఱొక క్షణమున కెంత యోగ్యత కలదో అంత యోగ్యతగలదియే! మీకు భగవంతునిపై విశ్వాసము పూర్తిగా గలదేని, మీ రీ క్షణమున వానిని దర్శింపగలరు. మనకు కొంత అపరోక్షానుభూతి లభించినప్పుడుమాత్రమే మతమనునది ప్రారంభమగుచున్నదని హిందువుల యభిప్రాయము. మత మనగా కొన్ని ధర్మసూత్రములందు విశ్వాసము దెల్పుట కాదు; వానిని మానసికముగ నంగీకరించుటయు గాదు; బహిరంగముగ నమ్మకమును బ్రకటించుటయు కాదు. భగవంతుడున్నచో, "నీవు వానిని జూచితివా?" లేదేని, భగవంతుడు గలడని నమ్ముటకు నీ కర్హత యేమున్నది? భగవంతుని ఉనికిని

గూర్చి సంశయము కలదేని, వానిని జూచుటకై నీవేల పాటుపడవు? ఈ ప్రపంచమును త్యజించి, ఆ యుద్యమమునకు నీ జీవితమును బూర్ణముగ నేల అర్పణముచేయవు? వైరాగ్యము, పరమార్థ చింత, యను రెండు మహద్భావములు హిందూదేశమున గలవు. భారతభూమి యీ రెండు విశిష్టభావములను హృదయమున హత్తుకొని యుండుట చేతనే ఆ దేశమునగల లోపము లన్నియు నుపేక్షింపదగిన వగుచున్నవి.

క్రీస్తు మతమునందును బోధింపబడిన మూలభావమిదియే! "అప్రమత్తుడవై యుండుము; ప్రార్థనలు సలుపుచుండుము; స్వర్గ రాజ్యము చేరువలోనున్నది". అనగా మీ హృదయములను పవిత్రవంతములుగ నొనర్చుకొని సంసిద్ధముగ నుండుడని యర్థము. ఈ మూలభావ మెన్నడును నశింపలేదు. క్రీస్తు మతావలంబులు మిగుల నంధకార నిమగ్నులై యుండిన దినములందు సయితము, క్రైస్తవులు మూఢవిశ్వాసములందు మునిగియుండు దేశములలో సయితము, క్రైస్తవులు పరోపకారముచేయుచు, వైద్యాలయముల నెలకొలుపుట మున్నగు ధర్మకార్యముల గావించుచు, తమ ప్రభునిరాకకై నిరంతరము నిరీక్షించుచు నాయత్తపడుచుండిరని మీ రెఱుగుదురు. క్రైస్తవులీ విశిష్టాదర్శము నంటి యుండునంతకాలమును వారి మతము స్థిరముగ నిలిచియే యుండ గలదు.

ఈ సందర్భమున నా కొక యూహ తట్టుచున్నది. అయ్యది కేవలస్వప్నప్రాయపు టాశ కానోపు. ఈ లోకమున నెన్నడేని అది ప్రత్యక్షానుభవమునకు వచ్చునో రాదో తెలియదు. కేవల ప్రత్యక్షానుభవాంశములనే పట్టుకు ప్రాకులాడి చచ్చుటకంటె కొన్నియెడల స్వప్నముల గాంచుటయు నుత్తమ కార్యమే. అయోగ్యములగు యథార్థాంశములకంటె స్వప్నద్యోతకములగు నూర్జిత ధర్మములుత్తమములే యగును. కావున, మన మటువంటి స్వప్నము నొకదాని నిప్పుడు గాంతుముగాక.

చిత్తవృత్తులం దనేక భేదములుండుట మీ రెఱుగుదురుగదా. కొందఱు ప్రత్యక్షానుభవములను మాత్రమే పాటించి, సామాన్య హేతువాదమునే నమ్ముకొని వర్తించువారు. విగ్రహములన్నను కర్మకలాపములన్నను వారికి విశ్వాసముండదు. బుద్ధిగమ్యములును, విస్పష్టములును, నిస్సంశయములు, నగు విషయములే వారికి కావలెను. అట్టివి మాత్రమే వారికి సంతుష్టి నొసగజాలును. ఇక ''ప్యూరిటనులు''ను, మహమ్మదీయులును గలరు. వారు చిత్రపటములనుకాని, విగ్రహములనుకాని తమ యారాధనమందిరములలోనికి రానీయరు. మఱికొందఱు—వీరు కళాభిమానులు, రసపిపాస గలవారు. రేఖల విన్యాసము, ఆకృతుల సొంపు, రంగులు, పూవులు, రూపములు వీరికి ప్రియముగూర్చును. వీరికి మైనపువత్తులు, జ్యోతులు, కర్మకలాపనిర్దిష్టములగు వివిధోపకరణములు, పూజాద్రవ్యములు, భగవత్సాక్షాత్కారమున కావశ్యకములని తోచును. కొందఱు కేవలము బుద్ధిపాటవముచేత బ్రహ్మము నెట్లు చేరజూతురో, అట్లే వారు రూపధ్యానముచే నతనిని బ్రత్యక్షము చేసికొనజూతురు. ఇక, భక్తిపరాయణులు కలరు. వారి యాత్మలు సదా భగవంతునికై తపించుచుండును. భగవదారాధనము, భగవత్సంకీర్తనము తప్ప వేఱొండుచర్య వారికి తోపదు. మఱియు, ఈ పైవా రెవరితోడను జేరక వారిని హేళనము చేయుచుండు దార్శనికులు కలరు. ''ఈ యవివేక కార్యము లేమి? బ్రహ్మమునుగూర్చి యిట్టి క్షుద్రభావనలు తగునా?'' యని వారు ఖండనవాక్కు లాడుచుందురు.

వీ రెల్లరును ఒకరినిజూచి యొకరు నవ్వుచుండ వచ్చును. కాని ప్రతివానికిని ఈ ప్రపంచమున స్థానము కలదుసుడీ. భిన్నభిన్నములగు ఈ మనోవృత్తులన్నియు, రకరకములగు ఈ మార్గములన్నియు అవసరములే యగును. ఆదర్శప్రాయమగు మత మెన్నటికేని కలుగుచో, అది వీరికందఱకును నుపకరించునదిగ నుండజాలునంత విశాలమును ఉదారమునునై యుండ

వలయును. అది తత్త్వజ్ఞునకు దార్శనిక పుష్టినిచ్చునదిగ నుండ వలయును. కర్మకలాపాభిమానికి మహాద్భుతరూపకల్పనవలన తోచు సమస్తమును కల్పించునదిగ నుండవలయును. భక్తిపరాయణునకు భక్తిరసమును గ్రోలనిచ్చునదిగ నుండవలయును, కవివరునకు హృదయాకర్షకమై నవ్యతర భావసంపద నొడగూర్చునదిగ నుండవలయును. అటువంటి మహోదారమగు మతమును నిర్మింపవలయునన్న, వివిధ మతములును జననముగాంచిన ప్రాచీనతమ కాలమునకుపోయి, ఆయామత సిద్ధాంతముల నన్నింటిని లోగొనవలసి యుండును.

అనగా, మన సాంకేతికపదము "స్వీకరణము"గా నుండవలెను; "త్యజించుట" కాజాలదు. స్వీకరణమనగా "సహిష్ణుత" కాదుసుడీ! తఱుచుగా సహిష్ణుత యనునది ఈశ్వరదూషణప్రాయమైనది. నా కట్టి సహిష్ణుతయందు విశ్వాసములేదు. నే నేల సహిష్ణుత జూపవలయును? సహిష్ణుత యనగనే ఒకరు తప్పుత్రోవ ద్రొక్కుచున్నారనియు, అయినను నేను వారిని మననిచ్చుచున్నాననియు, నర్థమగును. మనము ఇతరులను బ్రతుకనిచ్చువారమా! అట్లనుట భగవద్దూషణకాదా? ఇంతవఱకు నున్న మతములనన్నింటిని నే నంగీకరించి, ఆదరించుచు, ఆయా మతావలంబు లందఱితోడను గూడి నేను భగవదారాధన గావింతును. వా రేయే తీరుల నర్చనల సలుపుదురో ఆయాతీరుల నేనును సలుపుదును. మహమ్మదీయుని మసీదున కేగుదును. క్రైస్తవుని అర్చనాలయమునకు బోయి శిలువ మ్రోల మోకరింతును. బౌద్ధాలయమునకరిగి యచ్చట బుద్ధునియొక్కయు, "ధర్మము" యొక్కయు శరణ మర్థింతును. ప్రతివాని హృదయమునందును వెలుగుచున్న దివ్యజ్యోతిని వీక్షింప బ్రయత్నించు హిందువులతోగూడి తప మొనరించుటకై వనముల కేగెదను.

ఇంతేకాక ఇంకను భావికాలమున ప్రభవము కానున్న మతములను సయితము స్వీకరించుటకై నా హృదయమును

సంసిద్ధముగ నుంతును: ప్రజ్ఞానభరితమైన భగవంతుని గ్రంథము ముగిసెనందుమా, లేక సంతతధారగా వాని దివ్య మహాత్త్వము ప్రకటితమగుచునే ఉన్నదందుమా? అది మహాద్భుతమగు గ్రంథము. బైబులు, ఖురాను, వేదము మున్నగు శాస్త్ర గ్రంథములన్నియు, ఆ దివ్యగ్రంథమున నొక్కొక పుటయే యగును సుడీ! అనంతసంఖ్యాకములగు పుట లింకను ప్రకటితములు కావలసియున్నవి. అందుకై ఆ గ్రంథము సదా తెఱచియే యుంతును! మనము వర్తమానమున నిలిచియున్నాము. అనంతమగు భవిష్యత్కాలమును నిరీక్షించుచుందుము. భూతకాలమున జరిగినదానినెల్ల నాదరించి, వర్తమానకాలమున లభ్యమౌ తేజము నుపభోగించుచు, భావికాలమున రానున్న వెలుగు నంతటిని లోగొనుటకై నా హృదయ కవాటముల నన్నింటిని దెఱచియుంచెదను. గత కాలమునాటి ప్రవక్తల కందఱకును నా నమస్కృతుల నర్పింతును; ఇప్పటివారందఱకును వందనము లాచరింతును; ఇకముందు ప్రభవింపనున్నవారికై కరముల మోడ్చి మ్రొక్కులిడుదును!



# విశ్వమతాదర్శము

(వేర్వేఱు తెఱగుల బుద్ధులకును, మార్గములకును అనుకూలించునట్టిది)

మన యింద్రియములకు గాని, మనస్సునకు గాని, గోచరించు ప్రతివిషయమందును రెండు శక్తుల ప్రభావము చూపట్టుచుండును. ఈ శక్తులు పరస్పరవిరుద్ధములు. ఒక దాని గుణము నొకటి విఘాత మొనర్చునవి. మన ఇంద్రియ గోచరప్రపంచమందును, మనోగోచరప్రపంచమందును, నిరంతరము చూపట్టుచుండు ద్వంద్వత్వమున కిదియే కారణము. బాహ్యలోకమున వీని ప్రభావము ఆకర్షణ (అట్రాక్షన్) నిరాకరణ (రిపల్షన్) ములుగను, కేంద్రాభిముఖ (సెంట్రిపిటల్) కేంద్రవిముఖ (సెంట్రిఫ్యూగల్) గమనములుగను, ఆంతరంగికలోకమున రాగద్వేషములుగను, మంచిచెడుగులుగను, వ్యక్తమగుచుండును. కొన్ని వస్తువులకు మన మనుకూలింతుము, కొన్నిటికి ప్రతికూలింతుము. మన కొక వస్తువు అనుకూలము, ఒకటి ప్రతికూలము. కేవలమకారణముగా మనల నెన్నియో సారు లొక్కొక్క రాకర్షించినట్లుతోచును. అట్లే ఒక్కొక్క రే మాత్రమును గిట్టకుందురు. ఈ విషయ మంద ఱెఱిగినదే. కార్యక్షేత్రము ఉన్నత మగుకొలది ఈ విరుద్ధశక్తుల బలముకూడ ప్రచురముగను, విస్పష్టముగను, కానిపించుచుండును. మన భావక్షేత్ర మందును, జీవితక్షేత్ర మందును, అత్యున్నతస్థాన మాక్రమించు మతవిషయమున ఈ రెండు శక్తుల ప్రభావ మత్యంతప్రకటరూపమై యుండును. మానవుల కింక నే క్షేత్రములందును కానరాని అపారప్రేమభావములు మతమూలమున నుద్భవిల్లినవి. ఇంక నే క్షేత్రమునందును కానరాని ఘోరాతిఘోర ద్వేషభావములుకూడ మత మూలముననే ఉద్భవిల్లినవి. ప్రపంచము మున్నెన్నడు వినియెఱుగని మహోదార శాంతిసందేశములు మతప్రవక్తల యొద్దనుండి బయలు

చేసినవి. మున్నెన్నడును కని విని యెఱుగని భీషణనిందారూప విషవర్షములుకూడ బోధకుల యొద్దనుండియే వెలువడినవి. మతముయొక్క ఉద్దేశము ఉన్నత మగుకొలది, దాని వ్యవస్థ పరిణతి నందుకొలది, దాని కార్యకలాపవిధానములుకూడ విశిష్టత నొందుచుండును. మతప్రేరణలవలె లోకమును రక్తసముద్రములలో ముంచిన ప్రేరణ లింకేవియును లేవు. కాని అన్ని దీనజన శరణాలయములు, అన్ని చికిత్సాశాలలు లోకమున నే యితర ప్రేరణలవలనను స్థాపింపబడలేదు. మానవక్షేమముకొఱకే కాక, నోరులేని అతిహీనజంతువుల క్షేమముకొఱకుకూడ, సదుపాయము లేర్పడుటకు కారణభూతమైన మానవప్రేరణలలో మత ప్రేరణలకే అగ్రస్థానము. మతోత్సుకత్వమువలన కలుగునంత క్రౌర్యము మఱి దేనివలనను కలుగదు. మతోత్సుకత్వమువలన కలుగునంత దయాళుత్వముకూడ మఱి దేనివలనను కలుగదు. ఇంతవఱ కిట్లే జరుగుచున్నది. ఇకమీద కూడ ఇట్లే జరుగునని నమ్మదగును. కాని ఈ కలకలములు, ఈ సంక్షోభములు, ఈ పోటీలు, ఈ పోరాటములు, మతముల యెడల మతశాఖల యెడలగల ఈ ద్వేషములు, ఈర్ష్యలు : ఈ యన్నిటి మహా కోలాహలమంతయు మునిగిపోవునంతటి గంభీరనినాదముతో శాంతి సామరస్యములు సమస్తవసుంధరయందు ప్రకటించు మహత్తర శక్తిమంతములగు వాక్కు లప్పుడప్పుడు వినవచ్చుచుండును. ఆ శాంతిసామరస్యము లెన్నటికైన సిద్ధించునా?

ఈ మతమహారణరంగమున కెప్పటికైనను అవిచ్ఛిన్న సామరస్యముయొక్క యేలుబడి ప్రాప్తించునా? ఈ పంతొమ్మిదవ శతాబ్దపు చరమభాగమున సామరస్యసమస్యకు లోక మత్యంత ప్రాముఖ్య మిచ్చుచున్నది. ఎన్నో ప్రణాళికలు నిర్మింపబడుచున్నవి. వానిని ఆచరణలో పెట్టు ప్రయత్నములు జరుగుచున్నవి. కాని యిది ఎంత కష్టకార్యమో మన మెఱుగుదుము. జీవన

మునకై పడు పాట్లు మితిమీఱి పోవుచున్నవి. వాని తీవ్రత నుపశమింపజేయుట దాదాపు అసాధ్యముగా తోచుచున్నది. ఈ యత్నమున మానవుల నరములు తెగిపోవునంత భారమునకు లోనగుచున్నవి. జీవితముయొక్క భౌతికక్షేత్రముననే—బాహ్యా భాగమున, స్థూలదృష్టికి గోచరించు విషయములలోనే — శాంతి సామరస్యములు నెలకొల్పుటెంత కష్టమై యున్నయెడల, మానవుని ఆంతరంగికప్రకృతియందు వానిని కలిగించుట ఇంకను వేయి రెట్లుకష్టము గదా! మనము చిక్కుకొనియుండు వాగ్జాలము (మాటలు అను వల) లో నుండి మీ రొకసారి బైటికి రండు. ప్రేమ, శాంతి, కారుణ్యము, సానుభూతి, సమదృష్టి, సర్వజన సౌభ్రాత్రము : మున్నగు మాటలు మనము పసితనమునుండి వినుచున్నాము. కాని ఆ మాటలు మనకు అర్థరహితములై పోయినవి. కేవలము చిలుకపలుకుల వంటివిగానైనవి. మనకిది అలవాటు. ఇప్పుడు తప్పించుకొనజాలము. ము న్నీ భావములను తమ మనస్సులలో అనుభూతము చేసికొన్న మహాత్ములు ఈ మాటలు కల్పించిరి. వాని యర్థ మా కాలమున అనేకులకు తెలిసియుండెను. పిదప పామరజను లీ మాటలు కైకొని, వానితో ఆటలాడ సాగిరి. వారి చేతులలో ఆస్తికధర్మము అనుష్ఠింపవలసినదిగా నుండుటకు మాఱు కేవల శబ్దక్రీడామాత్ర మయ్యెను. ''మా తండ్రి మతము'', ''మా తెగవారిమతము'', ''మా దేశమతము'' మున్నగు మాటలు వాడుకలోనికి వచ్చినవి. తమ దొక మతమని చెప్పుకొనుట దేశభక్తినిదర్శనమాత్రముగా పరిణమించెను. దేశభక్తి కేవలపాక్షికము గదా. మత సామరస్యము కల్పించు టెన్నడైన దుర్లభకార్యమే. అయినను ఆ సమస్యనే మన మిప్పుడు విచారింతము.

ప్రతిమతమునందు—అనగా సుప్రతిష్ఠ మహామతములలో ప్రతిదానియందు — మూడు అంగము లుండునని మన మెఱుగుదుము. మొదటిది తత్త్వశాస్త్రము. ఇం దా మతముయొక్క

మూలభావములు, లక్ష్యము, తత్సాధన మార్గములు, విశదీక రింపబడియుండును. రెండవది పురాణ వాఙ్మయము. ఇది స్థూలరూపమును దాల్చిన తత్త్వశాస్త్రమనవచ్చును. ఇందు మానవులయొక్కయు, ప్రకృతి కతీతులగు పురుషులయొక్కయు, జీవితములు తెలుపబడియుండును. ఈ జీవితము లించుమించు కల్పితములే యని చెప్పవచ్చును. తత్త్వశాస్త్రములందు నిగూఢముగా నున్న భావము లీ కథారూపమున సుబోధము లగును. మూడవ అంగము కర్మకలాపము. ఇది పైదానికన్న స్థూలరూపమైనది. ఇందు విగ్రహములు, కర్మములు, అంగన్యాసములు, పుష్పములు, ధూపములు, మున్నగు ఇంద్రియగోచరవిషయము లనేకములుండును. ఇట్టి వన్నియు చేరినదే కర్మకలాపము. సుప్రసిద్ధ మతము లన్నిటిలో ఈ మూడంగము లుండును. కొన్నిటిలో ఒక అంగమునకు, మఱికొన్నిటిలో ఇంకొక అంగమునకు, ప్రాముఖ్య మీయబడియుండును. మొదటిదగు తత్త్వశాస్త్రవిషయము నిప్పుడు విచారింతము. ప్రపంచ మంతటికిని వర్తించు తత్త్వశాస్త్ర మొకటి ఏదైన కలదా? ఇంకను లేదు. మతములన్నియు తమతమ సిద్ధాంతములను ప్రకటించి అవియే సత్యము లని వాదించును. ఇట్లు వాదించుటేకాక, ఆ సిద్ధాంతములను విశ్వసింపనివారేదో ఘోరప్రదేశమునకు పోవలసియుండుననికూడ భావించును. కత్తిదూసి బలాత్కరించియైన తమ సిద్ధాంతముల నితరులు నమ్మునట్లు చేయు మతములుకూడ కలవు. ఇందుకు కారణము దౌష్ట్యము కాదు. ఇది మానవబుద్ధికి కలుగు నొక విధమగు వ్యాధి. స్వమతమందు మితిమీఱిన మూఢవిశ్వాసము, వితండవాదము, ఈ వ్యాధికి లక్షణములు. ఈ మూర్ఖవిశ్వాసపరులు మిక్కిలి నిష్కపటులు. ఇతరమానవులలో అంత నిష్కాపట్యముండదు. కాని వీరు తమ బాధ్యతల నే మాత్రము ఎఱుగరు. ఈ విషయమున వీరు లోకమునగల పిచ్చివా రందఱివంటి వారే. మిక్కిలి అపాయకరములైన వ్యాధులలో నిది యొకటి. మానవప్రకృతియం

దుండు దౌరాత్మ్యము నంతయు ఇది మేలుకొల్పును. క్రోధమును చెలరేగజేయును. భావావేశ తీవ్రతచే నరములు దుర్భరస్థితికి వచ్చునట్లు చేయును. మానవులు వ్యాఘ్రములుగా మాఱిపోవుదురు.

పురాణవాఙ్మయవిషయముననైన పరస్పర సామ్యము కలదా? సామరస్యము కలదా? సర్వమతసమ్మతి గాంచిన పురాణ వాఙ్మయ మేదైన కలదా? లేనేలేదు. మతము లన్నిటికి వేర్వేఱు పురాణవాఙ్మయములు కలవు. కాని ప్రతి మతము వారును తమతమ పురాణకథలు కల్పితములు కా వందురు. దృష్టాంతమూలమున ఈ విషయమును గ్రహింపజూచెదము. నే నిపుడు మతవిమర్శరూపముగ మాటాడుచున్నానని అపార్థము చేసికొనకుడు. ఇది కేవలము దృష్టాంతార్థమే. దేవుడు పావురపు రూపమును దాల్చి భూమికి దిగెనని క్రైస్తవుల నమ్మకము. వారి కది నిజముగా జరిగిన సంఘటనము ; కట్టుకథ కాదు. దేవుడు గోరూపమున గోచరించునని హిందువుల నమ్మకము, కాని క్రైస్తవులు దీనిని మూఢవిశ్వాసమనియు, పురాణకథామాత్రమనియు, అసత్యమనియు, తెగడుదురు. ఇటునటు దేవదూతలు నిలిచియుండు పెట్టె గర్భగృహమున నుంపదగు ప్రతీకము(భగవంతునిచిహ్నము) అనియు, జెహోవా కిది సమ్మతమనియు, యూదుల భావము. కాని ఆ ప్రతీకమునే సుందర స్త్రీరూపముననో, సుందర పురుషరూపముననో నిర్మించినయెడల "ఇది విగ్రహము. సైప రానిది. దీనిని నుఱుముచేయుడు" అందురు. పురాణవాఙ్మయ విషయమున మనకు గల ఏకీభావ మిది! "మా మతప్రవక్త ఫలాని అద్భుతకృత్యము చేసెను" అని యొకడు చెప్పినచో, అది కేవల మూఢవిశ్వాసమని ఇతరు లందురు. ఇట్లనువారే తమ మత ప్రవక్తల కంతకంటె యద్భుతకృత్యముల నారోపింతురు. అవి మాత్రము చారిత్రకసత్యము లని వారి నమ్మకము! పురాణ వాఙ్మయమునకును చారిత్రకవాఙ్మయమునకును వీరి బుద్ధిలోగల

సూక్ష్మభేదమును గ్రహింపగలిగిన వారిని నే నింతవఱకు చూడ లేదు. నిజమునకు ఈ కథ లన్నియు—ఏ మతమునకు సంబంధించినవైనను—పురాణకర్తలచేత కల్పింపబడినవే. అచ్చటచ్చట ఒకించుక చారిత్రకసత్యము వానిలో కలిసియుండవచ్చును.

ఇక కర్మకలాపవిషయము. ప్రతిమతమువారికిని ఒక్కొక్క విధమగు కర్మకలాప ముండును. అది మాత్రమే పవిత్రమనియు, తక్కిన మతములలోని కర్మకలాప మంతయు ఘోరమూఢ్యరూపమనియు, వారు భావింతురు. ఒక తెగవా రొక చిహ్నము నర్చించినచో, ఇంకొక తెగవారు దాని నపారముగా తెగడుదురు. సామాన్యరూపమగు చిహ్నము నొకదానిని కైకొందము. లింగము (పురుషుని అంగము) నిస్సంశయముగా స్త్రీపురుషవిభేద సూచకచిహ్నమే. కాని కాలక్రమమున ఆ భావము మఱపునబడి, ఇప్పు డది సృష్టికర్తకు చిహ్నమైనది. ఈ చిహ్నమును పూజించు జాతుల కా మొదటి అర్థమే స్ఫురింపదు. వారి కది భగవచ్చిహ్నమే. కాని వేఱొక జాతివారికి, వేఱొక మతము వారికి అందు పురుషుని అంగము తప్ప వేఱేమియు కానిపింపదు. అందుచేత వారు దాని నపారముగా దూఱుదురు. కాని వారు చేయు కార్యములలో లింగార్చకుల కత్యంత హేయములుగా తోచునవి కొన్ని యుండవచ్చును. ఇందుకు నిదర్శనముగా హిందువుల లింగాకారమును, క్రైస్తవుల "శాక్రమెంట్" సంస్కారమును కైకొని విచారింతము. క్రైస్తవులకు లింగాకార మసహ్యము. హిందువులకు శాక్రమెంట్ అసహ్యము. ఈ సంస్కారము—ఒకానొక సత్పురుషుని గుణములు తమ కలవడుటకై అతనిని చంపి, అతని మాంసము తిని, అతని రక్తము త్రాగుట—నరమాంసభక్షకులు (కానిబల్స్) చేయు పని యని హిందువు లందురు. అడవిమనుష్యులలో కొన్ని తెగలందు గల ఆచార మిది. ధైర్యసాహసములు గలవా డొక డుండెనేని, వా రతనిని

చంపి, అతని గుండె కాయను భక్షింతురు. అందుచే అతని ధైర్యసాహసములు తమకు లభించునని వారి విశ్వాసము. క్రైస్తవ భక్తాగ్రేసరులలో నొకడగు సర్ జార్జ్ లబ్బక్ కూడ ఈ క్రైస్తవాచారమునకు మూల మీ నరమాంసభక్షకు లగు అడవిమనుష్యుల భావమే అని అంగీకరించి యున్నాడు. కాని క్రైస్తవజన సామాన్య మి దింతమాత్రమును ఒప్పుకొనరు. దాని యర్థ మేమిగానుండునని వా రాలోచింపనే ఆలోచింపరు. వారి కది యొక పవిత్రకృత్యము, అంతయే! అనగా, కర్మకలాపవిషయమున గూడ సర్వమతామోద మొందిన చిహ్న మేదియు లేదు. ఇక సార్వలౌకికత యెచ్చట గలదు? సార్వలౌకికరూపమత మొకటి యుండుట ఎట్లు సాధ్యమగును? కాని అట్టి దిప్పటికే కలదు. అది ఏదియో ఇప్పుడు విచారింతము.

సర్వజనసౌభ్రాత్రమును గూర్చి మన మెల్లప్పుడును వినుచున్నాము. సంఘము లన్నియు దాని ఆవశ్యకతను గూర్చి ఘోషించుచున్నవిగదా. పురాతనకథ యొకటి నా కీ సందర్భమున తలపునకు వచ్చుచున్నది. హిందూ దేశములో మద్యపానము మిక్కిలి ఆక్షేపణీయము. ఇరువురు సోదరులచట నొకనాటి రాత్రి రహస్యముగా త్రాగుటకు సంకల్పించిరి. వారి గదికి మిక్కిలి చేరువున మఱొకగదిలో వారి పినతండ్రి నిద్రించుచుండెను. ఆయన పూర్వాచారపరాయణుడు. కావున త్రాగుటకుముందు వా రొకరితో నొకరు "మన మేమాత్రము చప్పుడు చేయరాదు. చేసినచో పినతండ్రి మేలుకొనును" అని చెప్పుకొనిరి. త్రాగు కాలమున వా రొకరికంటె నొకరు బిగ్గరగా "చప్పుడు చేయకుము, పినతండ్రి మేలుకొనును" అని అఱవసాగిరి. ఈ ఘోష అధికము కాగా, పినతండ్రి మేలుకొని ఆ గదిలోనికి వచ్చి అంతయు కన్గొనెను. ఆ త్రాగిన సోదరులవలె మన మందఱము కాంక్షించునది "సర్వజన సౌభ్రాత్రము! మనమందఱము సమానులము. కావున ఒక తెగగా ఏర్పడుదము" అని ఘోషించుచున్నాము.

తెగ యేర్పడుటతోడనే సమానత్వము నాక్షేపింతుము. అంతటితో ఆ సమానత్వ మంతరించును. మహమ్మదీయులు సర్వజనసౌభ్రాత్రమునుగూర్చి ప్రసంగింతురు. కాని చివర కది యెట్లు పరిణమించును? మహమ్మదీయేతరు డెవనికేని ఆ సోదరసంఘములోనికి ప్రవేశము లభింపదు. ఎవ్వడైన ప్రవేశింప జూచెనేని వాని ప్రాణములు దక్కవు. క్రైస్తవులుకూడ సర్వజనసౌభ్రాత్రమునుగూర్చి ప్రసంగింతురు. కాని క్రైస్తవేతరులుమాత్రము ఘోరనరకమునకు — నిరంతరభీషణాగ్నికీలలలో ప్రాణులు వేపబడు లోకమునకు—పోవలెను!

సర్వజనసౌభ్రాత్రముకొఱకును, సర్వజనసమత్వము కొఱకును, మన మీ లోకమున చేయు అన్వేషణ సాగునదిట్లే. ఈ ప్రసంగములు వినవచ్చు తావులలో మీ రొకింత మౌనము వహించి, కొంచెము జాగ్రత్తగా ఉండుట మంచిది. ఏలనన ఈ మాటలాడువా రనేకులలో అత్యంతస్వార్థపరత్వము దాగియుండును. "చలికాలములో నప్పుడప్పు డొక మబ్బు కన్పించి భీకరముగా గర్జింపసాగును. కాని అది ఏమాత్రము వర్షింపదు. వర్షకాలమేఘము శబ్దింపదు గాని లోకమును జలరాశిలో ముంచివైచును." అనగా నిజముగా కార్యశూరులగువారును, త్రికరణశుద్ధిగా సర్వజనసౌభ్రాత్ర భావము కలవారును, దానినిగూర్చి అంతగా మాటాడరు. దాని పేరిట చిన్నచిన్న తెగలు నిర్మింపరు. కాని వారి చర్యలు, వారి ఉద్యమములు, వారి జీవితమంతయు, వారికిగల సర్వజనసౌభ్రాత్రభావమును, విశ్వమానవప్రేమసానుభూతులను, వెల్లడించుచుండును. వారి భావములు ప్రకటింపబడునది వాగ్రూపమున కాదు : చర్యారూపమున, జీవితరూపమున. లోకము శుష్కవాగ్విజృంభణముతో నిండి తొనకిపోవుచున్నది. మన కిప్పుడు కావలసినది ప్రగల్భములు కొంచెము తగ్గుట, కార్యాచరణము కొంచెము హెచ్చుట.

మతము లన్నిటికి సామాన్యమగు సార్వలౌకికలక్షణములు కన్గొనుట దుర్లభమని మన మిప్పటికి కన్గొంటిమి. కాని అట్టివి కలవని మన మెఱుగుదుము. మన మందఱము మానవులమే కాని, అందఱము సమానులమా? కానేకాదు. సమానుల మని ఎవరందురు? పిచ్చివాండ్రు. బుద్ధివిషయమున, శక్తివిషయమున, శరీరవిషయమున, మన మందఱము సమానులమా? ఒకని కెక్కువ శరీరబల ముండును. ఒకని కెక్కువ బుద్ధిబల ముండును. అందఱము సమానుల మైనచో, ఈ భేదము లెట్లేర్పడినవి? వీని నెవరు కల్పించిరి? మనమే. ప్రభావవిషయమున, బుద్ధిబలవిషయమున, దేహబల విషయమున, మన కొక్కొక్కరికి భేదము లుండుటవలన మనము అసమానులమై యుండుట తప్పినదికాదు. అట్లయ్యును, సర్వసమత్వసిద్ధాంతము మనకు హృదయామోదకరమై యున్నది. మన మందఱము మానవులము. కాని కొందఱము పురుషులము, కొందఱము స్త్రీలము. ఇతడు నలుపు, అతడు తెలుపు. కాని అందఱు మానవులే. అందఱియందు నొకే మానవత్వము కలదు. మన ముఖములు వివిధరూపములు. ఏ రెండును ఒకటిగా నుండవు. కాని అందఱము మానవులమే. ఈ ఐక్యభావము, ఈమానవత్వము, అనునది ఎచట నున్నది? ఒక పురుషుడో, స్త్రీయో, ఎఱ్ఱగనో, నల్లగనో, నాకు కానిపించును. కాని ఈ ముఖము లన్నిటిలో మానవత్వము అను నొక సామాన్యధర్మము కలదని నే నెఱుగుదును. అది నా చేతికి దొరకదు, నా ఇంద్రియములకు గోచరింపదు, నాకు సాక్షాత్కరింపదు. కాని అది కలదని నేను నిస్సంశయముగా నెఱుగుదును. సర్వమానవసామాన్యమైనది, మానవత్వమనునది, ఒకటి కలదనుటకంటె నాకు నిస్సంశయముగా తెలిసిన విషయమే లేదు. ఈ సామాన్యమానవధర్మభావమూలముననే నేను మిమ్ము స్త్రీలుగ, పురుషులుగ, చూచుట. అట్లే ఈ విశ్వమత మనునది ఈశ్వరరూపమున లోకములో గల నానామతములలో దూఱి యుండును.

అది శాశ్వతస్థాయియై యున్నది. ఇట్లే ఎప్పటికిని ఉండితీఱును. "ఈ ముత్యము లన్నిటిలో దూఱియుండు సూత్రమును నేను." ఒక్కొక్క మతమో, మతశాఖయో, ఒక్కొక్క ముత్యము. అట్టివి ఈ వేర్వేఱు ముత్యములు. వీనియన్నిటియందు దూఱి యుండు సూత్రమే ఈశ్వరుడు. కాని మానవజాతిలో నధిక భాగమున కీ సంగతియే తెలియదు.

నానాత్వములో ఏకత్వమే జగన్నిర్మాణక్రమములోని మూల సూత్రము. మన మందఱము మానవులమే కాని అందఱిలో పరస్పరభిన్నత కలదు. మానవత్వములోని అంశములుగా మన మిరువుర మొకటే. కాని ఫలాని పేరు గలవాడు అనుటలో భిన్నులము. పురుషుడవుగా నీవు స్త్రీకంటె భిన్నుడవు. మానవు డవుగా నీవును ఆమెయు ఒకటే. మానవుడవుగా నీవు జంతువు కంటె భిన్నుడవు; కాని ప్రాణికోట్లుగా స్త్రీలు, పురుషులు, జంతు వులు, చెట్లు, చేమలు, అన్నియు నొక్కటే. ఉనికిగల వస్తువుగా నీవును, ఈ అఖిలజగత్తును ఒక్కటే. ఈశ్వరుడు సర్వగతుడు (అంతట నుండువాడు). ఆయనయే జగత్తులో గల పరమైక్య స్వరూపుడు. ఆయనలో మనమందఱము ఒక్కరమే. కాని గోచర రూప మొందునప్పు డెల్ల ఈ భిన్నత ఉండక తప్పదు. కర్మాచరణ రూపమున మన బలము గోచరించు నప్పు డెల్ల ఈ వేఱుతీరు ఉండియే తీఱును. ఇప్పుడు తేలిన దే మనగా, మానవజాతి యం తయు ఒకే సిద్ధాంతసముదాయమును, అనగా, ఒకే తత్త్వశాస్త్ర మును అంగీకరించుట అను అర్థములో విశ్వమత మనునది కేవల మసంభవము. అది ఎన్నటికి సిద్ధింపదు. అందఱి ముఖము లొకే రీతిగా నుండు కాల మెన్నటికిని రాబోదు. సార్వలౌకికపురాణ వాఙ్మయ మొకటి ఏర్పడునని భావించినచో, అదియు అసంభ వమే. సార్వలౌకికకర్మకలాప మేర్పడుటకూడ అట్టిదే. అట్టి స్థితి యెన్నటికిని కలుగబోదు. ఒకవేళ కలిగినచో ప్రపంచము లయ

మొందును. భిన్నత్వము గదా జీవలోకపు మూల ధర్మము! మనకు రూపము లెట్లేర్పడినవి? భిన్నత వలననే. పరిపూర్ణసమత్వము—భేదము లను మాటయే లేనిది—అనగా మనకు వినాశకాలమే. వేడిమికి సహజమగు సమగ్ర సమవ్యాప్తిని ఈ గదిలోని ఉష్ణరాశి సాధించుకో గలిగెనేని, ఆ వేడిమి అభావము (లేకపోవుట) నందిన దనియే చెప్పవచ్చును. జగత్తులో చలన మెట్లు సాధ్యమైనది? సమత్వము చెడుటచేతనే. ఈ జగత్తు లయించినప్పుడు గాని అభిన్నతారూపమగు ఐక్యము సిద్ధింపజాలదు. అంతవఱకది అసంభవము అంతేకాదు. అట్టి ఐక్యము కలుగుట అపాయకరముకూడ. ఎల్లర మొకే విధముగా తలంపవలెనని మన మాసింప కూడదు. అట్లయ్యెనేని, తలంచుటకు తలంపులే ఉండవు: విచిత్రవస్తుప్రదర్శనశాల (మ్యూసియమ్) లోని ఈజిప్టు దేశపు రక్షితశవములు (మమ్మీస్) వలె భావశూన్యబుద్ధులతో మన మొకరినొకరము చూచుకొనుచుందుము. ఈ భేదములే, ఈ భిన్నత్వమే, మనలోని పరస్పరసమత్వ నష్టమే, మన అభివృద్ధికి మూలసత్త్వము, మన ఆలోచనాశక్తికి మూలసత్త్వము. ఈ అసమత్వము శాశ్వతముగా నిలిచియుండుట అత్యావశ్యకము.

అగుచో, విశ్వమతాదర్శ మనుటలో నా భావమేమి? ప్రపంచములోగల జనులందఱు అంగీకరించు ఒకే తత్త్వ శాస్త్రముగాని, ఒకే పురాణవాఙ్మయముగాని, ఒకే కర్మకలాపముగాని ఏర్పడవలెనని కాదు నాభావము. ఈ ప్రపంచము — ఎన్నియో అంతశ్చక్రములు, ఎన్నియో బహిశ్చక్రములు కలిగి, అత్యంత దురవగాహముగా, అత్యద్భుతముగా, నడుచుచుండు ఈ యంత్రరాశి—నడుచుచుండవలెనని నే నెఱుగుదును. అట్లైనచో, మన కర్తవ్యమేమి? ఈ యంత్రమును కిఱకిఱ లాడకుండ, మృదువుగా, నడుచునట్లు చేయవచ్చును; రాపిడి తగ్గింపవచ్చును. ఎట్లు? మార్పులు ప్రకృతికి సహజ మని గుర్తించుటచేత. స్వభావసిద్ధమగు మన ఐక్యము నెట్లు గుర్తించితిమో అట్లే మార్పులనుకూడ

గుర్తింపవలెను. సత్యమును లక్షరూపములుగా తెలుపవచ్చునవియు, అందు ప్రతిరూపము దాని కది సత్యముగనే ఉండునవియు, మనము నేర్చుకొనవలెను. ఒక వస్తువును నూఱు భిన్న దృక్పథములనుండి దర్శించినను, ఆ వస్తువులో భేద మేమియు కలుగదనియు, అది యథాపూర్వముగనే ఉండుననియు గ్రహింపవలెను. ఇందు కుదాహరణముగా సూర్యబింబమును కైకొందము. ఉదయమున ప్రొద్దుపొడుపువేళ దాని నొకడు భూమిపైనుండి చూచును. ఒక గొప్ప గోళాకృతి కనిపించును. అత డంతట ఛాయాగ్రహణయంత్రము నొకటి చేతబూని సూర్యుని కభిముఖుడై పయనించును. త్రోవలో నచ్చటచ్చట ఛాయాచిత్రములు తీసికొనుచు పోయి చివరకు సూర్యబింబమును చేరును. ఈ చిత్రములన్నియు పరస్పరభిన్నములుగనే ఉండును. వేర్వేఱు సూర్యబింబముల చిత్రముల నతడు తెచ్చినాడని తోచును. కాని అతడు మార్గములో నక్కడక్కడ నిలిచి, ఆ ఒకేసూర్యబింబము యొక్క ఛాయనే గ్రహించినాడని మన మెఱుగుదుము. ఈశ్వర విషయముకూడ ఇట్టిదే. ప్రతి తెగ, ప్రతి ఆత్మ, ప్రతి జాతి, ప్రతి మతము, ఎఱిగియో, ఎఱుగకో ఈశ్వరుని దెసకే ఎగబ్రాకుచున్నది. కొందఱిది తత్త్వశాస్త్రోక్తమార్గము: అందును కొందఱిది పరిపక్వ రూపమైనది, కొందఱిది అపరిపక్వ రూపమైనది. కొందఱిది పురాణ సూచితమార్గము: అందును కొందఱిది అత్యుత్తమ రూపమైనది, కొందఱిది అత్యధమ రూపమైనది. మఱికొందఱిది కర్మమార్గము: అందును కొందఱిది ఉన్నత వినిర్మల రూపమైనది, కొందఱిది దురాచారదూషిత రూపమైనది. కాని అందఱి పయనము ఆ దెసకే. మానవునికి లభించు సత్యదర్శనమంతయు ఆ ఈశ్వరుని దర్శనమే, మఱెవ్వరిది కాదు. మన మందఱము పాత్రలు చేత పట్టుకొని నీళ్లు తెచ్చుకొనుటకై ఒక చెఱువుకు పోయితి మనుకొనుడు. ఒకరిచేత గిన్నె, ఒకరిచేత తపిలె, ఒకరిచేత బొక్కెన—ఇట్లు వేర్వేఱు పాత్రము లుండును.

ఎవరి పాత్రతో వారు నీరు ముంచుకొందుము. మన పాత్రల ఆకారమునేగదా మన నీరు పూనును? గిన్నె గలవాని నీరు గిన్నె రూపమును, తపిలె గలవాని నీరు తపిలె రూపమును — ఇట్లు వేర్వేఱు రూపములు పూనును. కాని అందఱిచేతివి నీళ్లే. మఱే మియు కాదు. మతవిషయముకూడ ఇట్టిదే. మన బుద్ధులీ పాత్ర ములవంటివి. మన మందఱము ఈశ్వరసాక్షాత్కారార్థము యత్నించుచున్నాము. ఈ వేర్వేఱు పాత్రములలో నిండియుండు నీటివంటివాడు ఈశ్వరుడు. ప్రతిపాత్రమందు ఆ పాత్రరూపమున ఈశ్వరుడు సాక్షాత్కరించును. కాని ఆయన ఒక్కడే. ప్రతి వారు చూచినది ఆ ఈశ్వరునే. విశ్వమతము నిట్లు తప్ప మనము సాధించుకొన జాలము.

మతసామరస్యసాధన కిదంతయు భావరూపమున నిర్దుష్టముగనే తోచుచున్నది గాని, దీనిని క్రియారూపమున బెట్టు మార్గ మేదైన కలదా? సర్వ మతములయొక్క ఈశ్వర భావములు సత్యములే యని మిక్కిలి ప్రాచీనకాలముననే అంగీక రింపబడెను. సర్వమతసామరస్య రూపమార్గము నొకదానిని కని పట్టి, అన్ని మతములవారు పరస్పరసఖ్యముతో నొకటిగా కూడి ఆ మార్గము ననుసరించునట్లు చేయుటకై, ఇండియా, అలెగ్జాం డ్రియా, యూరపు, చీనా, జపాను, థిబెట్ దేశములలోను, కడపట అమెరికాలోను, ఎన్నో నూర్ల ప్రయత్నములు చేయ బడినవి. కాని అవన్నియు విఫలములైనవి. ఇందుకు కారణము అనుష్ఠానయోగ్యమగు మార్గ మేదియు కల్పింపబడకపోవుటయే. లోకములోగల మతము లన్నియు సరియైనవే యని ఎందఱో అంగీకరించిరి. కాని అవన్నియు తమతమ వ్యక్తిత్వములు కోలుపోకయే సంయోగించు (ఒకటిగా చేరిపోవు) ఆచరణసాధ్య మార్గము నెవ్వరును సూచింపలేదు. ఆచరణ సాధ్యమార్గ మొక్కటే కలదు. ప్రతి మతమువాడును తన వ్యక్తిత్వమును కోలుపోకయే, తక్కిన అన్నిమతములవారితో తా నేకీభవింపగల

విషయముల నెఱుగవలెను. కాని ఇప్పటికి ప్రయోగింపబడిన సర్వమార్గములును, మతములలోగల భిన్నభావము లన్నిటిని పొందిక చేయు నుద్దేశమును ప్రకటించియు, నిజమునకు అన్ని మతములవారి నొక కొన్ని సిద్ధాంతములకు బద్ధుల నొనర్పజూచి నవి. ఈ ప్రయత్నముల ఫలముగా క్రొత్త తెగ లేర్పడినవి; కలతలు, పోరాటములు, పరస్పర సంఘర్షణములు చెలరేగినవి.

నాది కూడ నొక చిన్న ప్రణాళిక కలదు. అది ఉపయోగించునో ఉపయోగింపదో కాని, చర్చకై మీకు నివేదింతును. ఆ ప్రణాళికలోని ప్రథమవిషయము "విధ్వంసమొనర్పకుడు" అను నీతిని మానవులకు జ్ఞప్తిచేయుట. విధ్వంసన మార్గము లవలంబించు సంస్కర్తలు లోకోపకారులు కారు. కలదానిని తునుమాడకుడు. కూల్పకుడు, కాని సంపూర్ణము చేయుడు. చేతనైనచో సహాకరింపుడు; లేనిచో, చేతులు ముడుచుకొని నిలువబడి చూచుచుండుడు. ఉపకారము చేయక పోయిన పోనిండు, అపకారము మాత్రము చేయవలదు. మానవుని అకృత్రిమ విశ్వాసముల నే మాత్రము చెఱుపవలదు. ఇక రెండవది. మానవుని ప్రస్తుతస్థితిని గ్రహించి అతని నచ్చటినుండి చేయూతనొసగిపైకి లేవదీయుడు. సర్వమతముల కీశ్వరుడే కేంద్రమను మాట నిజమేని, మనలో ప్రతివాడును ఆయనదెస కేదో యొక కిరణరేఖా (రేడియస్) మార్గమున పోవుచున్నమాట నిజమేని, మన మందఱ మా కేంద్రమును చేరుదు మనుట నిస్సంశయము. కిరణరేఖ లన్నియు కలియు ఆ కేంద్రమున మనకు గల భేదము లన్నియు సమసిపోవును. అచ్చట చేరువఱకు భేదము లుండియేతీఱును. ఈ కిరణరేఖలన్నియు చేరున దొక్క కేంద్రము ననే. తమతమ సహజశక్తులనుబట్టి యొక డొక కిరణరేఖామార్గమును బట్టును, మఱొక డింకొక కిరణరేఖామార్గమును పట్టును. ఎవ రెవరము వారివారి త్రోవల ననుసరించి ప్రయాణము సాగించితి మేని, అందఱము తప్పక కేంద్రమునుచేరుదుము. "అన్ని

మార్గములు రోముపురికే పోవును''* గదా! మనలో ప్రతివాడును తన నైసర్గికశక్తి ననుసరించి ఎదిగి, వికాసమునొందుచున్నాడు; కాలపరిపాకమున పరమసత్యము నెఱుగ గలడు. నిజమునకు మానవుడు తనకు తానే గురువై బోధించుకొనవలెను. నీవేమి చేయగలవు? నే నేమి చేయగలను? పసిబిడ్డకైన నీవు బోధింపజాలుదువా? చాలవు. బిడ్డ తనంతట తానే నేర్చుకొనును. అవకాశములు కల్పించుట, ఆటంకములు తొలగించుట: ఇంతే నీవు చేయవలసిన పని. మొక్క పెరుగును. పెరుగునట్లు చేయునది నీవా? చుట్టు కంచె కట్టి, పశువులు మేసిపోకుండ చేయుటే నీ కర్తవ్యము. మొక్క తనంతట తానే పెరుగును. ప్రతివాని యొక్క ఆధ్యాత్మికాభివృద్ధివిషయముకూడ ఇంతయే. నీ కెవ్వరును బోధింపజాలరు. నీ కెవ్వరును ఆధ్యాత్మికజ్ఞానము నీయజాలరు. నీకై నీవే ఆర్జించుకోవలెను. నీ అభివృద్ధి నీ లోపల నుండియే రావలెను.

బాహ్యగురు వేమి చేయగలడు? ఆటంకములు కొంతవఱకు తొలగింపగలడు. అతడు చేయవలసిన దంతియే. కావున చేతనైనచో, సహకరింపుడు, కాని కూలద్రోయకుడు. మానవుల కాధ్యాత్మికదృష్టి కల్పింపగల మనుకొంటిరా? అది అసాధ్యము. మీ ఆత్మ తప్ప మీకు వేఱు గురు వెవ్వరును లేరు. ఇందువలన ఏమి ఏర్పడుచున్నది? మానవులలో ఎన్నెన్నియో భిన్నప్రకృతులు కానిపించుచుండును. మనస్సులు, అభిరుచులు, వేనవేలు కలవు. వాని నన్నిటిని సామాన్యధర్మానుసారముగా సమగ్రవిభజనచేయుట అసాధ్యము. కాని మన ప్రకృతకార్యమునకు వారిని నాలుగు తరగతులుగా విభజించిన చాలును. చుఱుకుదనముగలిగిన కార్యదీక్షాపరుని దొక తరగతి. పని చేయుటయే

* రోముసామ్రాజ్య ముండిన పురాతనకాలమున పుట్టిన లోకోక్తియిది. రోముపురియొక్క ప్రశస్తిని సూచించునది. ''రోముపురికే'' అనుటకు మాఱు ''ఈశ్వరునికడకే'' అన్నచో మన కిచట ప్రసక్తమగుభావము వచ్చును.

అతని కిష్టము. అతని కండరములలోను నరములలోను అపార శక్తి కలదు. కార్యాచరణమే అతని అభీష్టము. చికిత్సాలయములు నిర్మింపవలెను; జనోపయుక్తములగు మేనిచేతలు (బావులు త్రవ్వించుటవంటివి) చేయవలెను; వీథులు వేయవలెను; ప్రణాళిక లేర్పఱుపవలెను; వానిని జరుపవలెను. భావోద్రేకపరు డింకొక తరగతికి చెందినవాడు. మహనీయత్వము నెడ, సౌందర్యము నెడ, అతని కపారప్రీతి. మానసమున సౌందర్యభావములు కల్పించుకొని అతడు చొక్కిపోవును. ప్రకృతిసౌందర్యముల కతడు ముగ్ధుడగును. ప్రేమను, ప్రేమాధీశ్వరుని, అత డారాధించును. అన్ని కాలములనాటి మహాత్ముల యెడ, మతప్రవక్తల యెడ, భగవదవతార మూర్తుల యెడ, అతని హృదయము ప్రేమామృతముతో పొంగిపోవును. క్రీస్తు, బుద్ధుడు, చారిత్రకపురుషులేనా అనెడు సంశయ మతనిని బాధింపదు. వారియునికి యుక్తియుక్తముగా నిరూపింపబడినదా లేదా అనెడువిషయ మతని కక్కఱలేదు. ఏసుక్రీస్తు ''కొండమీది బోధ'' చేసిన దే నా డని గాని, శ్రీకృష్ణుడు జన్మించిన దేముహూర్తమున ననిగాని, అతడు తెలిసికొన గోరడు. అతని బుద్ధి యంతయు వారి వ్యక్తిత్వమహత్త్వముల మీద, వారి ప్రేమస్వరూపముల మీద, లగ్నమై యుండును. అతని ఆదర్శ మట్టిది. ప్రేమపూరితునియొక్క, భావావేశపరుని యొక్క, స్వభావ మిది. అంతశ్శక్తిసాధకుడు (మిస్టిక్) ఇంకొక తరగతివాడు. తన్ను తానే పరీక్షించుకొనుట, తన మనోవ్యాపారములను గ్రహించుట, తనలో నే యే శక్తులు ప్రవర్తించుచున్నవో కనుగొనుట, వాని నుపయోగింప నేర్చుకొనుట, వానిని తన స్వాధీనములోనికి తెచ్చుకొనుట : ఈ కార్యములం దతడు ఆసక్తుడై యుండును. ఇట్టిది అంతశ్శక్తిసాధకుని మానసము. వేదాంతి ఇంకొక తరగతివాడు. అతడు సర్వమును వివేక మను త్రాసులో తూచును. బుద్ధిబలముతో నతడు మానసమున కందని తత్త్వజ్ఞానాతీత క్షేత్రమునకు కూడ పోజూచును.

ఈ వివిధరీతి మనస్సుల నన్నిటిని తృప్తిపఱుచు శక్తిగల మతము గాని మానవజాతిలో నత్యధికభాగమున కుపక రింపదు. ఆ శక్తి లోపించినచో, ఇప్పటి తెగ లన్నియు పాక్షికములు (ఒక పక్షమునకుచేరినవి) అగును. ప్రేమభావావేశ బోధక మతము నవలంబించువారి యొద్ద కేగితి ననుకొనుము. వారు పాడుదురు, విలపింతురు, ప్రేమ బోధింతురు. నీవు వారితో "మిత్రమా, ఇదంతయు మంచిదే కాని, నా కింతకన్న బలిష్ఠపదార్థము — కొంత యుక్తియుక్తమైనది, తత్త్వరూపమైనది — కావలెను. నేను విషయము నొక్కొక్కటిగా, సకారణముగా, తెలిసికొన గోరెదను" అంటివేని, వారు నిన్నుచటినుండి గెంటివేయుదురు. గెంటివేయుటే కాదు. చేతనైనచో మఱొక ప్రదేశమునకు గెంటివేతురు. అనగా ఆ మతమువారు భావావేశస్వభావము గలవారికి మాత్రమే తోడ్పడగలరు. ఇతరులకు తోడ్పడకపోవుటేకాక వారిని మట్టుపెట్టజూతురు. ఇంకను పరమహేయ విషయ మేమనగా, వారి చిత్తశుద్ధిని కూడ శంకింతురు. ఇక తత్త్వవేత్త లన్ననో, వారు హిందూదేశముయొక్కయు, ప్రాచ్య ప్రపంచముయొక్కయు జ్ఞానోత్కర్షమును ప్రశంసించుచు, సామాన్యజనులకు నోరుతిరుగని మాటలతో, భీకరశబ్దాడంబరముతో, ప్రసంగింతురు. కాని నాబోటి పామరుడు వారియొద్దకు పోయి "ఏదైన బోధించి నాకు ఆధ్యాత్మికభిక్ష పెట్టగలరా?" అని అడిగినచో, వారు వెంటనే తృణీకారరూపమగు చిఱునగవుతో ఇట్లందురు: "నీ బుద్ధివికాసము మా దానికన్న ఎంతో తక్కువ. ఆధ్యాత్మికవిషయములు నీ కెట్లు బోధపడగలవు?" ఈ తత్త్వవేత్త లెక్కడనో అంతరిక్షమున కెగసికూర్చుందురు. 'ఇచ్చటి నుండి వెడలి పొమ్మనుటయే వారు చేయు బోధ. ఇక అంతశ్శక్తిసాధకులు. వా రేవేవియో నిగూఢవిషయములనుగూర్చి మాట్లాడుచుందురు: వివిధ క్షేత్రములందు జీవించుట, మనస్సు యొక్క వివిధావస్థలు, మనోబల మేమేమి సాధింపగలిగినది,

ఇట్టివి వారి ప్రసంగాంశములు. సామాన్యజను డొకడు వారి యొద్దకు పోయి "నేను చేయగల ఉపయోగకార్య మేదైన తెలుపుడు, నాకు దీర్ఘాలోచనలు చేయు అభ్యాసము లేదు. నా కర్హమైన దేదేని సెలవిండు" అని అడిగెనేని వారు తిరస్కార సూచకమగు చిఱునగవుతో నిట్లందురు : "ఈ మూఢుని మాటలు వినుము. ఇతడు కేవలము అజ్ఞుడు, నిరర్థక జీవి." లోకమం దంతయు ఇట్లే జరుగుచుండును. ఈ భిన్నమతములలో గల తీవ్ర వాదప్రకాశకుల నొక గదిలో వేసి బిగించి, వారి అవజ్ఞబంధుర మందహాసముల (సొగసైన వెక్కిరింతల) ఛాయాచిత్రము నొక దానిని తీసికొనవలెనని ఉబలాటపడుచుందును.

ఇప్పటి మతస్థితి, లోకస్థితి, ఇది. నేను వ్యాప్తి నొందింప దలచినది అన్ని విధములగు మనస్సులకు సమసమ్మతముగా నుండు మతము : ఎంత వేదాంతపరమో, అంత భావావేశానుకూలము, ఎంత అంతశ్శక్తిసాధకప్రియమో, అంత కార్యాసక్తయోగ్యము. కళాశాలలనుండి వచ్చు శాస్త్రవేత్తలు, భౌతికతత్త్వజ్ఞులు అగు అధ్యాపకులకు హేతువాదము కావలెను. వారిని తనివితీర జర్చింప నీయవలెను. కొంత దూరము సాగినపిదప హేతుత్వమును విడ నాడినగాని సాగుట అసాధ్యమని వారికే తోచును. !"ఈ ఈశ్వర భావము, మోక్షభావము, మూఢవిశ్వాసజనితములు. వానిని విడనాడుడు" అని వా రందురు. నే నందుకు "తత్త్వజ్ఞశేఖరా! ఈ నీ శరీరము అంతకన్న మూఢవిశ్వాసజనితము. దీనిని విడనాడుము. భోజనమున కింటికి గాని, నీ అధ్యాపకపీఠమునకు గాని పోవలదు. నీ శరీరమును పరిత్యజింపుము, అట్లు చేయజాలవేని శరణ మర్థించి కూరుచుండుము" అని బదులుచెప్పుదును. ఈ లోక మంతయు ఏకవస్తువు, జగత్తులోనుండున దొకే వస్తువు, అనెడు తత్త్వశాస్త్రబోధ ననుభూత మొనర్చుకొన సహాకరింప జాలిన దానినే కదా "బ్రహ్మవిద్య" అనదగును. అంత

శ్శక్తి సాధకుడు వచ్చినచో, అతనికి స్వాగతమర్పించి మనఃపరిశీలన విధులు చెప్పుటే కాక, అవి అతనియెదుట ననుష్ఠించి చూప వలెను. భావావేశస్వభావము గలవాడు వచ్చెనేని, మనమును ఈశ్వరభావావిష్టులమై అతనితో కూడ నవ్వవలెను, ఏడ్వవలెను; "ప్రేమ మధువును గ్రోలి ఉన్మత్తులము కావలెను". కార్యదీక్షా పరుడు వచ్చెనేని, అతనితో కూడి మనమును మన పరిపూర్ణ శక్తితో పనిచేయవలెను. ఇట్టి సంయోగమందు విశ్వమతమున కత్యంతసన్నిహితరూపమగు ఆదర్శము కానిపించును. ఈ నాల్గు అంగములును సమ పరిమాణములతో, పరిపూర్ణరూపమున, ప్రతి మనస్సునందును ఉండునట్లు మానవజాతి నిర్మింపబడియున్నయెడల ఎంతచక్కగా నుండెడిదో! ఇది మానవపరిపూర్ణత్వమునుగూర్చిన నా ఆదర్శము. ఈ అంగములలో ఏయొకటి రెండు మాత్రమే కలవారిది పాక్షికస్వభావమని నా అభిప్రాయము. ఈ లోక మంతయు ఇట్టి పాక్షికస్వభావము గలవారితోనే నిండియున్నది. వారు నడుచు మార్గ మొక్కటే వారికి తెలిసినది. తదితరము లన్నియు వారికి ఘోరములు, అపాయకరములు. ఈ నాల్గుమార్గ ములందు సమస్థితి కలిగియుండుటే నా మతాదర్శము. మా హిందూదేశమున "యోగము" (కూడిక) అనబడుదాని మూలమున అట్టి ఆదర్శమతము సిద్ధింపగలదు. కార్యశూరుడీ యోగముచే మానవునకును మానవలోకమునకును కూడిక సాధించును. అంతశ్శక్తిసాధకుడు దీనిచే తన పరాప్రకృతికిని అపరాప్రకృతికిని కూడిక సాధించును. ప్రేమసాధకుడు దీనిచే తనకును ప్రేమమయుడగు ఈశ్వరునికిని కూడిక సాధించును. వేదాంతి ఇందుచే అస్తిత్వ మంతటియొక్క కూడికను సాధించును. ఈ నాలుగు యోగ మార్గములకు సంస్కృతమున వేర్వేఱు పేళ్లు కలవు. ఇట్టి కూడికను సాధించువానిని "యోగి" యందురు. కార్యశూరుడు 'కర్మయోగి', ప్రేమమార్గానుసారి 'భక్తియోగి', అంతశ్శక్తి సాధకుడు 'రాజయోగి', తత్త్వమార్గసాధకుడు 'జ్ఞానయోగి'.

యోగి యను మాట యీ అందఱి కన్వయించును.

ఇప్పుడు మొదట రాజయోగమును కైకొందము. రాజయోగ మనగా—మనస్సును స్వాధీనపఱచుకొనుటనగా—ఏమి? యోగశబ్దమునకు మీ దేశములో నెన్నోవిధముల పైశాచికభావములతో సంబంధము కల్పింపబడినది. అది కేవలము నిరాధార మని ఎఱుగుదురు గాక! ఈ యోగములలో దేనిలోను స్వబుద్ధిని పరిత్యజింపవలసిన అవసరము లేదు; ఇతరులచేత మోసపోవ నవసరము లేదు; మీ బుద్ధిని ఎట్టి మతాచార్యులకుగాని స్వాధీనపఱుప నవసరము లేదు; ఒక మానవాతీతునికి లొంగియుండ నవసరము లేదు. ప్రతి దానియందును మీరు మీ బుద్ధిమీదనే ఆధారపడి యుండవలెను. దానినే మాత్రము విడువక అంటిపట్టుకొనియుండవలెను. సర్వభూతములకును మూడు తెఱగుల జ్ఞానోపకరణములు కలవు. మొదటిది సహజజ్ఞానము. ఇది జంతువులం దత్యంతపరిణత రూపమున కానవచ్చును. జ్ఞానోపకరణములన్నిటిలో ఇది అధమమైనది. రెండవది సకారణ విచారశక్తి. ఇది మానవులందు పూర్ణపరిణతరూపమున కానవచ్చును. సహజజ్ఞానము మిక్కిలి అసమగ్రరూపమైనది. జంతువుల కార్యాచరణావరణము మిక్కిలి పరిమితము. ఆ పరిమితావరణమందే సహజజ్ఞానము వర్తింపగలదు. మానవునిలో ఈ సహజజ్ఞానము చాలవఱకు విచారశక్తి రూపము నొందియుండును. అతని కార్యాచరణావరణముకూడ విశాలత నొందియుండును. కాని ఈ విచారశక్తికూడ మిక్కిలి అసమగ్రప్రభావముకలదే! అది యొక్కింత దూరమువఱకే పోగలదు. ఆ మీద పోజాలక నిలిచిపోవును. ఆ హద్దును మీఱి దానిని సాగింప జూచినచో, ఎంతో గందరగోళము కలుగును. విచారము సంగతముగా నుండక అసంగతరూపమును దాల్చును. తార్కిక మార్గము తిన్నగా సాగక వలయాకృతిని ధరించి మరలమరల మొదటికే వచ్చుచుండును. మన విషయజ్ఞానమునకు మూలమగు వస్తువులను—భౌతికపదార్థమును, శక్తిని — ఇందు కుదాహరణ

ముగా కైకొందము. భౌతికపదార్థ మనగా నేమి? శక్తి తన బల మును దేనిపై ప్రయోగించునో అది. శక్తి యనగా నేమి? భౌతిక పదార్థముపై నేది తన బలమును ప్రయోగించునో అది. ఈ చిక్కు చూచితిరిగదా—ఈ అరఘట్ట (ఏతము) చలనమును. ఒక భావ మున కింకొక భావ మాధారము. దానికి మరల మొదటి దాధా రము! కార్యకారణరూపవిచార మొక దాటరాని మహాప్రతి బంధము నెదుర్కొనును. అప్పు డది గత్యంతరములేక ఆగి పోవును; కాని అవల నుండు అనంత పరతత్త్వక్షేత్రమును చేర వలెనని ఆతురపడుచుండును. అనంతపరిపూర్ణ మందలి యొక చిన్న భాగము మానవచైతన్య వీథికి ప్రక్షిప్తమై మన మింద్రియములతో చూచు, మనస్సుతో భావించు, ఈ ప్రపంచముగా కానిపించు చుండును. చైతన్యమనెడు వలలో తగుల్కొనియున్న ఆ పరిమి తావరణము లోపలనే, మన సకారణవిచారముయొక్క ప్రచా రము. మన మా ఆవరణమును దాటిపోవుట కేదో సాధన ముండ వలెను. ఆ సాధనమునే ఈశ్వరప్రేరితజ్ఞానము (ఇన్స్పిరేషన్) అందురు. అనగా మనకు గల జ్ఞానసాధనములు మూడు: సహజ జ్ఞానము, యుక్తియుక్తవిచారము, ఈశ్వరప్రేరితజ్ఞానము. ఇందు మొదటిది జంతువులది, రెండవది మానవులది, మూడవది దివ్య పురుషులది. కాని యీమూటి అంకురములు కొద్దిగనో గొప్పగనో వికసించి, ప్రతి మానవునందును కానవచ్చును. ఇవన్నియు అంకుర రూపమున నుండిననే గదా పరిణతరూపము నందగలవు? మఱి యొక విషయముకూడ జ్ఞప్తిలో పెట్టుకొనవలెను. ఇం దొకదాని పరిణతరూపమే మఱొకటి. కావున నవి పరస్పరవిరుద్ధములుకావు. యుక్తి యొక్క పరిణతరూపమే ఈశ్వరప్రేరితజ్ఞానము. కావున నిది దానిని సంపూర్ణత నొందించును గాని ఖండింపదు. యుక్తికి అందని విషయములను ఈశ్వరప్రేరితజ్ఞానము బయలుపఱచును. అవి యుక్తికి విరుద్ధములుగా నుండవు. వృద్ధదశ శిశుదశకు పరిణత రూపమా, విరుద్ధరూపమా? కావున అపరిపక్వరూపసాధనమును

పరిపక్వరూపసాధనముగా భ్రాంతినొందు అవకాశము కలదు. ఇది మఱచిపోక జాగ్రత్తగా నుండవలెను. సహజజ్ఞాన మెన్నియో సార్లు దివ్యప్రేరితజ్ఞానముగా లోకము నెదుట ప్రదర్శింపబడును. భవిష్యద్విషయజ్ఞానమును గుఱించిన నటనలు ఈ మూలముననే కలుగుచున్నవి. మూఢులు, చిత్తచాంచల్యపీడితులు, తమ బుద్ధి వైకల్యమంతయు దివ్యజ్ఞానమని భ్రమించి మానవులు తమ్మనుస రింపవలె ననుకొందురు. పరస్పరవిరుద్ధములును, అసంగతములును, అగు అర్థరహితబోధ లీ లోకములో చేయబడుచుండుటకు మూలము మతిభ్రష్టు లాడు అసంబద్ధప్రలాపములను దైవప్రేరిత ములుగా ప్రదర్శింప జూచుటే.

యుక్తివిరుద్ధము కాకుండుటే సత్యబోధకు మొదటి తార్కాణము. ఈ మూలసూత్రము ననుసరించియే యీ యోగము లన్నియు నిర్మింపబడినవి. మనస్సు మూలమున యోగసిద్ధి పడయు రాజయోగమును కైకొందము. ఇది అపారవిషయము గాన దీని లోని కేంద్రభావమును మాత్రమే నే నిప్పుడు సూచింపగలను. మనకుగల జ్ఞానార్జనమార్గ మొక్కటే. అధమాధమమానవుడు మొదలు మహాయోగీంద్రునివఱకు, అందఱికి ఆ యేకైకమార్గమే కలదు. దీనిని ఏకాగ్రత యందురు. పరిశోధనాలయములో పనిచేయు రసాయనశాస్త్రజ్ఞుడు తన మానసికశక్తు లన్నిటిని కేంద్రీకరించి తన యెదుటి భౌతికపదార్థముల నా ఏకాగ్రబుద్ధితో పరిశీలించును. వెంటనే ఆ పదార్థముల తత్త్వము బహిర్గతమై అత డర్థించుచుండిన జ్ఞాన మలవడును. ఖగోళశాస్త్రజ్ఞుడుకూడ ఇట్లే తన మానసికశక్తుల నన్నిటిని కేంద్రీకరించి దూరదర్శని (టెలిస్కోప్) ద్వారా వస్తువుల నేకాగ్రతతో పరిశీలించును. నక్షత్రములును, గ్రహమండలములును, ముందుకువచ్చి తమతమ రహస్యముల నతనికి వెల్లడించును. జ్ఞానసాధనకై యత్నించు ప్రతివానియొక్క — బాలురకు బోధించు అధ్యాపకునియొక్క,

పాఠములు చదువు బాలకునియొక్క—విషయ మిట్టిదే. మీరు నా మాటలు వినుచున్నారు. వానియందు మీ కాసక్తి కలిగినచో, మీ బుద్ధి వానిపై కేంద్రీకరింపబడును. అప్పుడు గడియారము గంట కొట్టినచో మీ కది వినరాదు. మీ ఏకాగ్రత ఎంత అధికమో అంత చక్కగా నా భావము మీకు తేటపడును. నా ప్రేమను, నా మానసికశక్తులను, నేను కేంద్రీకరించు కొలది, నా భావములను మీకు విశదీకరించు శక్తి యెక్కువగుచుండును. ఈ కేంద్రీకరణశక్తి యధిక మగుకొలది, జ్ఞానార్జన మధిక మగు చుండును. ఏలనన, జ్ఞానార్జన కిదియే ఏకైకమార్గము. అతిస్వల్పుడు కూడ—పాదరక్షలకు రంగు వేయువాడు కూడ—మనశ్శక్తిని తన పనిపై కేంద్రీకరించినచో, దానిని మిక్కిలి బాగుగా చేయ గలుగును. వంట చేయువాడు బుద్ధిని కేంద్రీకరించినచో, మామూలు ప్రకారముకంటె మేలురీతిని వంట చేయును. ధనార్జనమందైనను, భగవదారాధన మందైనను, మఱి యే యితరకార్యమందైనను, ఏకాగ్రత అధికమగు కొలది, కార్య మెక్కువ చక్కగా నిర్వహింపబడుచుండును. ప్రకృతి తన తలుపులు తెఱచి కాంతిపూరములు వెలువరింపవలె నన్నచో, పిలువవలసిన పిలు పిదియే, తట్టవలసిన తలు పిదియే. జ్ఞానధనా గారమును తెఱవగల తాళ మీ కేంద్రీకరణశక్తి యొక్కటే. రాజయోగశాస్త్రమునందు వివరింపబడిన విషయ మించుమించుగా నిది యొక్కటియే అని చెప్పనొప్పును. మన ప్రస్తుత శరీరస్థితిలో మనలను కలవరపెట్టు కార్యము లెన్నియో యుండును. మన మానసికశక్తులు నూఱు తెఱగులుగా చీలి వ్యర్థమగుచున్నవి. నా తలపులను స్వాస్థపఱచి ఏదో ఒక్క ముఖ్యవిషయముపై బుద్ధిని కేంద్రీకరింప జూచితినేని, నా కక్కఱలేని ప్రేరణలు, తలపులు, వేనవేలుగా బుద్ధిలోనికి చొరబడి దానిని కలవరపెట్టును. ఈ కలవరపాటును ప్రతిఘటించి మనస్సును స్వాధీనములోనికి తెచ్చు మార్గమునే రాజయోగము నేర్పునది.

ఇక కర్మయోగమును—కర్మాచరణమూలముగా భగవంతునితో కూడు మార్గమును—కైకొందము. ఏదో యొక కార్యాచరణముకొఱకే జన్మించినట్లుండువారి నెందఱనో మన మీలోకములో చూచుచుందుము. వారి బుద్ధి భావక్షేత్రమున నిలువనే నిలువదు. ప్రత్యక్షరూపమున—చూడదగిన, తాకదగిన, రూపమున—కానిపించు కార్యకలాపమే వారి మనస్సు నంతను ఆక్రమించుకొనియుండును. ఇట్టివారి జీవితముల కుపకరించు శాస్త్రము కూడ ఒకటి ఉండవలెను కదా. మన మందఱ మేదో యొక కర్మ మొనర్చుచునే యుందుము. కాని కర్మరహస్య మెఱుగక ఎందెందఱమో మన జవసత్త్వములను చాలవఱకు వ్యర్థపఱచుకొనుచుందుము. కర్మయోగ మీ రహస్యమును బోధించును. ఎచ్చట, ఎట్లు, కర్మ మొనర్పవలసినది, చేతబూనిన కార్యమును సాధించుటకు మన శక్తిలో నత్యధిక భాగమును — అత్యధిక ఫలము కలుగునట్లు — వినియోగించు టెట్లో అది బోధించును. ఈ రహస్యమును నేర్చుకొనుచో కర్మాచరణమునకు గల యొక గొప్ప ఆక్షేపమునుకూడ మనము గమనింపవలెను. కర్మాచరణముచే క్లేశము కలుగుచుండు ననుటే ఈ యాక్షేపము. మనశ్శరీరములకు కలుగు క్లేశము లన్నిటికి మమకారమే కారణము. కర్మ మొనరించుట నా కిష్టము. ఒకనికి మేలు చేయగోరెదను. కాని అతడా మేలును మఱచి నా కపకారము చేయు అవకాశము లత్యధికముగా గలవు. అట్లు జరిగినచో నాకు మనఃక్లేశము కలుగును. క్లేశము కలుగునన్న ఈ భీతి కర్మాచరణమున కడ్డుతగిలి మానవుల కార్యోత్సాహమును, కార్యశక్తిని, చెఱచుచుండును. నిస్సంగబుద్ధితో, ఎవరికి తోడ్పడుచున్నది ఏల తోడ్పడుచున్నది విచారింపక, కర్మముకొఱకే కర్మ మొనర్పు మని కర్మయోగము బోధించును. కర్మయోగి కార్యాచరణమగ్నుడై యుండుటకు కారణమేమి? అది అతని సహజస్వభావము గనుక; తన కది హితమని అతనికి తోచును గనుక. అంతియే. అతని కుద్దేశ

మేదియు లేదు. అత డెప్పుడును ఇచ్చుచుండు వాడే. పుచ్చు కొనుట అను మాటనే అత డెఱుగడు. కావున అతడు క్లేశము నకు అతీతుడు. మనకు కలుగు క్లేశమంతటికిని మమకారమే మూలకారణము.

ఇక భక్తియోగము—ఇది భావావేశస్వభావముగలవాని, ప్రేమపూరితహృదయుని మార్గము. భగవంతుని తనకు మిగుల గూర్చు నెచ్చెలిగా జేసికొనవలెనని అతని సంకల్పము. అందుకై అత డేవేవో కర్మకలాపము లవలంబించును; పరిమళపుష్ప ధూపములు, సుందరమందిరములు, మనోజ్ఞాకృతులు, మున్నగు వాని నాధారము చేసికొనును. వారిది సరియైన మార్గము కాదందురా? మీ కొక విషయ మిచట తెలుపవలసియున్నది. పురాణవాఙ్మయసమృద్ధి, కర్మకలాపసమృద్ధి, అపారముగా గల మతములందుండియే లోకములోని ఆధ్యాత్మికమహాపురుషులందఱు నావిర్భవించి రని మీరు—ముఖ్యముగా ఈ దేశపువారు—జ్ఞప్తి పెట్టుకొనుట మంచిది. భగవద్రూపరహితముగా, ఉపచారరహితముగా, ఆరాధన మొనర్పజూచిన శాఖలన్నియు, మతములలో గల సుందరవస్తువులను, మహనీయవస్తువులను కటికడెందములతో అణగద్రొక్కి వైచినవి. కన్నుగానని మూర్ఖవిశ్వాసమే వారి మతము. అది కేవలశుష్కరూప మైనది. ప్రపంచ చరిత్రమే ఇందుకు ప్రబలసాక్షి. కావున ఈ కర్మకలాపములను, పురాణ ములను తూలనాడకుడు. వాని నుండనిండు. వానియందు అక్కఱ గలవాని కవి ఉపకరించుగాక! వారిని చులకనజేసి వెడనగవుతో "మూఢులు! పాపము వారి కవి యుండనిండు!" అనబోకుడు. అది మహాప్రమాదజనిత మగు అనుచితచర్య. నేను చూచినవా రందఱిలో మహోన్నతులు, అత్యద్భుతమగు ఆధ్యాత్మికపరిపూర్ణత నొందినవారు, అందఱును ఈ కర్మకలాపశిక్ష నొందినవారే. వారి పాదము లంటి కూర్చుండుటకుకూడ నే ననర్హుడను. అట్టి నేను— వారి నాక్షేపించుటయా! మనుష్యమానసములపై ఈ భావముల

ప్రభావ మెట్టిదో, వానిలో వేని నాదరింపవలెనో, వేనిని నిరాకరింపవలెనో, నా కెట్లు తెలియును? ప్రపంచములో ప్రతివారిని అకారణాక్షేపములపాలుచేయుట మన కలవాటు. జనులకు ఇచ్ఛవచ్చినన్ని పురాణము లుండుగాక! అవి కల్పించు మనోహరప్రేరణలు వారికి లభించుగాక! భావోద్రేకస్వభావము గలవారికి సత్యము యొక్క తత్త్వరూప నిర్వచనములు రుచించునా? భగవంతుడు వారికి స్పర్శవేద్యుడు (తాకి చూడదగినవాడు), ఏకైకయథార్థవస్తువు. వారి కన్నుల కాయన కనిపించును, చెవులకు వినిపించును, మనస్సునకు తోచును. వారి కాయన ప్రేమస్వరూపుడు. కావున వారి దేవుడు వారి కుండు గాక! మీ హేతువాది వారికి కథలోని మూఢునివలె తోచును. ఆ మూఢు డొక చక్కని విగ్రహమును చూచి, అది దేనితో చేయబడెనో చూచుటకై దానిని పగులగొట్ట సంకల్పించెనట! భక్తియోగము వారికి ప్రేమమార్గమును బోధించును: 'ఉత్తరోత్తరలాభము లపేక్షించి ప్రేమింపరాదు. భగవంతుని, సత్పురుషులను, ప్రేమించుట మంచిది గనుక ప్రేమింపవలెను. స్వర్గప్రాప్తి, పుత్రప్రాప్తి, ధనప్రాప్తి, మున్నగు వానిని కోరి ప్రేమింపరాదు.' ప్రేమకు ప్రేమయే మహోత్తమరూపప్రతిఫలమనియు, భగవంతుడు ప్రేమస్వరూపుడే అనియు, అది బోధించును. సృష్టికర్తగా, సర్వగతుడుగా, సర్వజ్ఞుడుగా, సర్వశక్తిసమేతుడగు ఈశ్వరుడుగా, తల్లిగా, తండ్రిగా, ఇట్లనంతకల్యాణగుణపరిపూర్ణునిగా, భగవంతుని కీర్తింపుమని దాని బోధ. భగవంతుని వర్ణించు నత్యున్నతవాక్కు, అతనినిగూర్చి మానవబుద్ధి కల్పించుకొనగల అత్యున్నతభావము, అతడు ప్రేమస్వరూపు డనియే. ప్రేమ ఎచట నున్నను, అది అతడే; భగవంతు డచట నుండును. "భార్యకు భర్త ముద్దిడుచో ఆ ముద్దులో నతడు కలడు. తల్లి బిడ్డ కిచ్చు ముద్దులో నతడు కలడు. మిత్రు లొండొరుల చేతులు జోడించు కొనునప్పు డాయన ప్రేమరూపుడై అందుండును. మానవజాతిని ప్రేమించు మహా

పురుషు డొకడు వారి కుపకార మొనర్పజూచునప్పు డతడు తన ప్రేమామృతమును మానవలోకమునకు ధారాళముగా పంచిపెట్టుచున్నాడు. హృదయ మెప్పుడెప్పుడు ఔదార్యభరిత మగునో, అప్పు డప్పు డత డచ్చట ప్రసన్నుడై యుండును. ఇదియే భక్తి యోగబోధ.

చివరకు జ్ఞానయోగి కడకు వత్తము. ఇతడు వేదాంతి, తత్త్వవిచారపరుడు, దృశ్యలోకమును దాటిపోవు కుతూహలము కలవాడు. ఈ లోకములోని క్షుద్రవస్తువు లతనినితృప్తిపఱుప జాలవు. నిత్యకృత్యములగు భోజనమజ్జనాదుల నతిక్రమించి పోవలె నని అతని భావము. వేనవేలు గ్రంథములలోగల బోధ యంతయు అతనిని తృప్తిపఱుప జాలదు. అవి చేయగలిగిన మహాకార్య మీ లోకము నతని యెదుట నిలుపుటే గదా. అతని నింకేది తృప్తి పఱుపగలదు? లక్షోప లక్షల ప్రపంచమండలములనైనను ఆతడు గణింపడు, అస్తిత్వమను మహాసముద్రములో అవి యన్నియు అతని కొక బిందువుగా తోచును. వీని నన్నిటి నతిక్రమించి అస్తిత్వముయొక్క మూలకేంద్రములోనికిపోవుటకై అతని ఆత్మ ఉవ్విళ్లూరుచున్నది. పరమసత్యమును యథార్థస్వరూపముతో చూడవలెను; దానిని సాక్షాత్కరించుకొనవలెను; తా నదియే కావలెను; ఆ సర్వమయత్వముతో తా నైక్య మొందవలెను. అట్టివాడు వేదాంతి. తండ్రి, తల్లి, సృష్టికర్త, రక్షకుడు, మార్గదర్శి, మున్నగు భావములు దేవుని సూచించుటకు కేవలము అసమర్థము లని అతని తలంపు. భగవంతు డతని ప్రాణమునకు ప్రాణము. అతని ఆత్మకు ఆత్మ. తన ఆత్మయే భగవంతుడు. భగవంతుడు కాని వస్తు వితర మేదియు లేదు. వేదాంతవిద్యామహాప్రఘాతములచే (సమ్మెటపోటులచే) అతనిలోని నశ్వర (నశించు) భాగము లన్నియు పిండియై తుడిచివేయబడును. చివర కతనిలో నిజముగా మిగిలియుండునది భగవంతుడు మాత్రమే.

ఒకే చెట్టుపై రెండు పక్షులు నిలిచియున్నవి: ఒకటి చిట్ట చివర కొమ్మమీద, రెండవది క్రింది కొమ్మమీద. పై పక్షి ప్రశాంతముగా, మౌనముగా, గంభీరముగా, స్వప్రభావమగ్నమై, యున్నది. క్రింది పక్షి తీయని పండ్లను చేదుపండ్లను తినుచు, ఒక కొమ్మనుండి మఱొక కొమ్మమీది కెగురుచు, సుఖాసుఖముల ననుభవించుచున్నది. కొంత సేపటి కీ క్రిందిపక్షి మఱియు మిక్కిలి చేదుపం డొకటి తిని, విసుగు చెంది, తల యెత్తి ఆ పై పక్షిని చూచును. బంగరు ఈకలు గల ఆ అద్భుతపక్షి తీయని పండ్లు గాని చేదు పండ్లుగాని తినుటలేదు. దానికి కష్టానుభూతి గాని సుఖానుభూతిగాని లేదు. ప్రశాంతముగా, ఆత్మస్థమై, తన ఆత్మను తప్ప వేఱేమియు చూడక, కూర్చుండి యున్నది. ఆ స్థితి నొందుటకై క్రింది పక్షి తీవ్రముగా వాంఛించునుగాని, అచిరకాలముననే మఱచి మరల ఫలభక్షణ మారంభించును. కొంత సేపటికి మఱియొక మిక్కుటపు చేదుపండు తిని, మిక్కిలి ఖేద మొంది, మరల పైకి చూచి, పై పక్షిని సమీపింప జూచును. కాని మరల మఱచి, మఱికొంత సేపటికి పైకి చూచి, ఇంకొక పైకొమ్మ కెగురును. ఇట్లు పైపైకి ఎగిరిఎగిరి, చివర కా చక్కని పక్షిని మిక్కిలి సమీపించును. అప్పు డా పై పక్షియొక్క ఱెక్కల కాంతి ప్రతిఫలించి తన శరీరము నంటి ప్రకాశించుచున్నట్లు అది కన్గొనును. దాని కేదో మా ర్పొకటి తోచును. తాను కరగిపోవుచున్న ట్లనిపించును. అంత నది ఇంకను సమీపమునకు వచ్చును. ఇప్పుడు తా నంతయు కరగిపోవుచున్నది. చివర కీ అద్భుతపు మార్పు దానికి తెలిసిపోవును. క్రింది పక్షి ప్రత్యేకవస్తురూపమున తోచినను, అది పై పక్షియొక్క నీడయే. నిజమునకు తా నెప్పుడును ఆ పై పక్షియే. ఈ తినుట, ఈ తీయని పండ్లు, ఈ చేదుపండ్లు, ఈ క్రింది చిన్నపక్షి, ఒకసారి సుఖించుట, ఒకసారి దుఃఖించుట —ఇదంతయు వట్టి భ్రమ, స్వప్నము. మొదటినుండియు, నిజమైనపక్షి ప్రశాంతముగా, మౌనముగా, గంభీరముగా, వైభవో

పేతముగా, ఖేదాతీతమై, పరితాపాతీతమై, పై కొమ్మమీదనే ఉండెను. పై పక్షి భగవంతుడు, జగదీశ్వరుడు; క్రిందిది జీవాత్మ: లోకములోని తీయనిపండ్లను చేదుపండ్లను తినుచున్నది. జీవాత్మ కప్పుడప్పు డొక బలీయమగు దెబ్బ తగులును. తినుట కొంతతడవు మాని అజ్ఞాతుడగు భగవంతుని దెస కేగును. అప్పు డొక కాంతి పూరము కానిపించి, ఈ జగ త్తొక నిస్సారమగు మిథ్యాదృశ్య మను భావము కలుగును. కాని ఇంద్రియములు మరల క్రిందికి లాగును. మరల ఈ ప్రపంచములోని తీయని పండ్లను, చేదు పండ్లను తిన నారంభించును. మరల నొక అత్యంత బలిష్ఠమగు దెబ్బపడును. హృదయము మరల వికసించి, ఆ దివ్యకాంతి పూరముచే దీప్తమగును. ఇట్లతడు క్రమ క్రమముగా భగవం తుని సమీపించుచుండును. సమీపించు కొలది, తన తొల్లిటి ఆత్మ కరగిపోవుచున్న ట్లతడు కన్గొనును. బాగుగా సమీపించి నప్పుడు తానే ఆ భగవంతు డని గ్రహించి, "ఈ జగత్తునకు ప్రాణమని; అణువులందును, సూర్యులందును, చంద్రులందును, ఉండు వాడని; నే నెవ్వనివర్ణించి చెప్పియుంటినో అతడే మన ప్రాణమునకు ప్రాణము, మన ఆత్మకు ఆత్మ—అంతే కాదు, నీవే అతడవు" అని హర్షాశ్చర్యములతో కేక వేయును. జ్ఞానయోగ బోధ యిది. "నీవు వస్తుతః భగవంతుడవే" అని అది మానవులకు తెలుపును. పారమార్థికదృష్టికి సర్వభూతము లొకే వస్తువనియు, మనలో ప్రతివాడును భూలోకమున రూపెత్తిన భగవంతుడే యనియు అది మానవకోటికి నిరూపించును. మన మందఱము— మన పాదముల క్రింద ప్రాకు చిఱుకీటకము మొదలు మనల నాశ్చర్యచకితుల నొనర్చు మహాపురుషులవఱకు — ఆ యేకైక దై వముయొక్క వ్యక్తరూపులమే.

ఇంకొక్క చివరిమాట. ఈ యోగము లన్నిటిని అనుభవ సిద్ధములుగా చేసికొనవలెను. ఇది అత్యంతముఖ్యము. బుద్ధి గ్రాహ్యము లొనర్చుకొనుట చాలనే చాలదు. అది నిష్ఫ్రయో

జనము. మొదట వానినిగూర్చి వినవలెను. పిదప మననము చేయవలెను. హేతుబద్ధముగా వానినిగూర్చి ఆలోచింప వలెను. వానిని మన మనస్సులలో నాటుకొన జేయవలెను. వానినిగూర్చి ధ్యానింపవలెను. వాని ననుభూత మొనర్చుకొనవలెను: చివర కవి మన సర్వజీవితరూప మొందవలెను. ధర్మము అప్పుడు భావసముదాయముగా, సిద్ధాంతసముదాయముగా, బుద్ధి సమ్మతవస్తువుగా నుండుట మాని మన ఆత్మలోనికే ప్రవేశించును. నేడు బుద్ధిసమ్మతములుగా నున్న అనేకవస్తువులు రేపు వెఱ్ఱిమొఱ్ఱివని యెఱిగి మనమభిప్రాయము మార్చుకొన వచ్చును. కాని సత్యధర్మభావ మెన్నటికిని మార్పు నొందదు. అది అనుభూతి, వట్టి మాటల ప్రోవుకాదు. ఇవెంత మనోజ్ఞములుగా నున్నను, సత్యధర్మములు కానేరవు. అది స్థితి (ఉండుట), సిద్ధి (అగుట), వినుట, సమ్మతించుట, కాదు—ఆత్మయంతయు తన విశ్వాసానుసారముగా మాఱుట. అదియే ఆస్తిక ధర్మము.

శ్రీరామకృష్ణార్పణమస్తు

ఓం తత్ సత్.



# అనుష్ఠాన వేదాంతము

## ప్రథమ భాగము

(లండను ఉపన్యాసము ; 10-11-1896)

వేదాంత శాస్త్రముయొక్క అనుష్ఠాన పక్షమును గూర్చి కొంత ముచ్చటింపుడని కోరితిరిగదా. దాని సిద్ధాంత పక్షము చాల శ్రేష్ఠమైనదని ఇప్పటికే తెలిపియుంటిని. కాని దానిని అనుష్ఠానములో పెట్టుటెట్లు? బొత్తుగా అనుష్ఠానసాధ్యముకాని సిద్ధాంతము ఎంత ఘనతరమైనదైనను, బుద్ధికి పరిశ్రమసాధనముగ నుండుట తప్ప నిష్ప్రయోజనమే యగును. కావున వేదాంత మతము పూర్ణముగ ఆచరణయోగ్యమై యుండవలయును; సర్వావస్థలయందును జీవితమున మనము అనుష్ఠింపదగినదిగ ఉండవలయును. ఇంతియేకాదు; మతము, లౌకికవ్యవహారము, పరస్పరసంబంధము లేనివి అను భ్రమ తొలగిపోవలెను. ఏలనన వేదాంతము ఏకత్వమును గదా బోధించును; అనగా జీవనము సర్వవిషయములందును అభిన్నముగ నుండవలయును. మతాదర్శములు మన జీవితసీమనెల్ల ఆక్రమింపవలెను, మన సంకల్పములన్నిటిలో ప్రవేశింపవలెను; మన చర్యలన్నిటిలో క్రమాధికముగా ప్రతిఫలించుచుండవలెను. పోను పోను నేనీ అనుష్ఠానాంశముగూర్చి వివరించెదను. కాని ఈ నా ఉపన్యాసావళి మనకు మూలాధారముగ ఉపకరింపవలయును గాన మనము ముస్ముందుగా సిద్ధాంతభాగమునుగూర్చి విచారించి, అవి యెట్లు కార్యరూపమున వనగుహాంతరములనుండి క్రమముగా సంతత సంచలనపూరితములగు వ్యాపారప్రదేశములకును, నగరములకును వ్యాపించి పరిణామమును పొందినవో గ్రహించుట ముఖ్యము. ఇందొక వింతసంగతి

యేమనగా, ఈ భావములు చాలవఱకు అడవులలో ముక్కు మూసికొని కూర్చుండినవారియొద్దనుండిగాక, అత్యంత తీవ్ర ప్రవృత్తిచే నొప్పువారివలన అనగా రాజ్యపాలనముచేయు చక్రవర్తులయొద్దనుండి బయలువెడలినవి.

శ్వేతకేతుడు ఆరుణి యను ఋషికి కుమారుడు. ఆ ఋషి వానప్రస్థుడై యుండును. కుమారు డరణ్యములందు పెరిగి, పాంచాల రాజధానీ నగరమునకు బోయి ప్రవాహణజైవలి యను రాజు నాస్థానమున కరిగెను. "మరణించునప్పుడు జీవులెట్లు ఇచటనుండి వెడలుదురో యెఱుగుదువా?" అని రాజు ప్రశ్నించెను. "అయ్యా! తెలియ" దని ఆతడు ప్రత్యుత్తర మిచ్చెను. "వారిక్కడికి తిరిగి ఎట్లు వత్తురో తెలియునా?" అని మరల రా జడిగెను. ఆతడు "తెలియదండి" అనెను. "నీవు పితృయాన ములను దేవయానములను ఎఱుగుదువా?" అని యడుగగా అదియు తెలియదనెను. అంతట రాజు మఱికొన్ని ప్రశ్నల నడిగెను. శ్వేతకేతువు వానికిని ప్రత్యుత్తరము నీయజాలడయ్యెను. కావున వాని కేమియు తెలియదని రాజు పలికెను. ఆ బాలుడు తిన్నగ తన తండ్రికడ కేగి అడుగగా ఆయనయును ఈ ప్రశ్నలకు జవాబు చెప్పజాలనని ఒప్పుకొనెను. ఆయన అట్లనుట పిల్లవానికి ఆ విషయము బోధింప నిష్టములేక గాదు; నిజముగా నవి ఆయనకే తెలియవు. అంతట శ్వేతకేతుడును వానితండ్రియు రాజునొద్దకువచ్చి తమకు ఆ రహస్యములను బోధింపుడని వేడిరి. ఈ విషయములు అంతవఱకును క్షత్రియులకుమాత్రమే తెలిసి యుండెననియు, విప్రులకు తెలియరాలేదనియు చెప్పి, అనంతరము చక్రవర్తి వారు కోరినదానిని బోధించెను. కాబట్టి ఈ వేదాంత తత్త్వము వనములలో తపమాచరించినమాత్రముననే సిద్ధించినది కాదనియు, అందలి మహోత్కృష్టభాగములు అనేకములు లౌకికవ్యావృత్తులందు నిమగ్నులై వర్తిలిన ధీమంతులచే గ్రహింప బడినవనియు ఉపనిషత్తులవలన దెలియుచున్నది. నిరంకుశ

ప్రభువులై కోట్ల కొలది ప్రజల బాలించువారికంటె హెచ్చుగ ప్రవృత్తి చిత్తులగు వారిని మనము ఊహింపజాలముకదా. అయినను ఇట్టివారిలో గొందఱు మహామనీషాగ్రగణ్యులైరిసుడీ.

కాన తత్త్వశాస్త్రము సర్వవిధముల అనుష్ఠానయోగ్యమై యుండి తీరవలయుననియే తేలుచున్నది. మీలో అనేకులు భగవద్గీతను జదివి యుందురు. ముందు ముందు దాని విచారణకు గడంగినప్పుడు వేదాంతతత్త్వశాస్త్రమునకు అది ఒక ఉత్తమోత్తమమయిన వ్యాఖ్య యని గ్రహింపజాలుదుము. అదెందు బోధింపబడినదో ఆ క్షేత్రము రణరంగమై ఉండుటయు విచిత్రము. శ్రీకృష్ణుడు ఈ తత్త్వశాస్త్రమును అర్జునునకు అట్టిచోట బోధించి యున్నాడు. ఈ గీతలో ప్రతి పుటయందును ప్రస్ఫుటమై వెలుంగు సిద్ధాంతము ఏదన "తీవ్రప్రవృత్తియు, దానియందుండు తఱిని నిరంతరశాంతియు" నై యున్నది. వేదాంతమునకు పరమావధి యగు ఈ సిద్ధాంతమే కర్మరహస్యము. 'అకర్మ' మన మను కొనునట్టి నిష్క్రియత యైనచో, అది వేదాంత పరమావధి కాజాలదు. అటులైనచో మనచుట్టునున్న గోడలే అత్యంత మనీషావంతము లనవలసివచ్చును. అవి సంపూర్ణముగ నివృత్తిచే నొప్పుచున్నవి గదా. మట్టిముద్దలు, మోడుచెట్లు, ప్రపంచము లోనికెల్ల సాధుసత్తములై యొప్పును; అవి సంపూర్ణముగ క్రియారహితములుగదా! మఱియు రాజసమైన ప్రవృత్తియు ప్రవృత్తి యనిపించుకొనదు. వేదాంతము బోధించు పరమావధి యగు ప్రవృత్తి శాంతిప్రపూర్ణమై యుండును. ఆ శాంతికి చలన ముండజాలదు. ఏమి వాటిల్లినను ఆ చిత్తస్థైర్యము చలింపదు. అటువంటి స్థితియే కర్మ చేయుటకు మిక్కిలి అనుకూలమగు అవస్థ యని జీవితానుభవమువలన అందఱెఱుగుదురు!

'మనము సామాన్యముగ అనుభవించు కార్యావేశమును బోలు తీవ్రవాంఛ లేనిదే, ఏ కార్యమునైన చేయుట ఎట్లు

పొసగును ?' అని నన్నడుగుచుందురు. చిరకాలము క్రిందట నేనును అట్లే తలచియుంటిని; కాని పెద్దవాడనైన కొలదిని, అనుభవము చేకూరినకొలదిని, అందు సత్యము లేదని యెఱింగితిని. ఆవేశము ఎంత తక్కువైన అంత ఉత్కృష్టకర్మను చేయగల్గుదుము. ఎంత శాంతి యలవడిన అంత శ్రేయస్సు; అంత ఎక్కువపనిని మనము చేయగల్గుదుము. మన చిత్తవృత్తులను విచ్చలవిడిగా వదలినకొలది మనసత్త్వము వృథయగుచుండును. మననాడులు చిందఱవందఱలగుచుండును. మనస్సు కలతనొందుచుండును. మనము సాధింపగల కార్యము స్వల్పమైపోవుచుండును. కార్యరూపమున ప్రకాశమునకు రాదగిన శక్తి వ్యర్థమగు మానసోద్రేకరూపమున వ్యయమైపోవును. మనస్సు శాంతితోగూడియున్నప్పుడే మనశక్తియంతయు ఉత్తమకార్యసాధనయందు వినియోగపడగలదు. ఈ ప్రపంచమున ప్రభవించిన ఘనతర కార్యశీలుర జీవితములను పరికించి చూచితిమేని, వారందఱును అద్భుతశాంతిమంతులని గ్రహింపగలము. ఏమైనను కానిండు, వారు చలింపనివారు. కావుననే కోపమువచ్చినతడు మిగుల పనిచేయజాలడు. ఏమిచేసినను కోపమునందనివాడు ఎంతయో సాధింపగలడు. కోపమునకుగాని ద్వేషమునకుగాని మఱే భావోద్రేకమునకుగాని లోబడువాడు పనిచేయజాలడు; తల పగులకొట్టుకొనినను ఈషన్మాత్రమేని ప్రయోజనకరమగు పనిచేయజాలడు. శాంతిక్షాంతులు, శమదమాదులు కల బుద్ధి మహత్కార్యములను సాధింపగలదు.

వేదాంతము ఒక ఆదర్శము నుద్బోధించుచున్నది. ఆదర్శమెల్లప్పుడును ప్రస్తుతస్థితికి ఎంతో అతీతమై వెలుగుచుండునని మన మెఱుగుదుము. అనగా మనము సాధింపగల్గిన దానికి మించియుండును. నరునిస్వభావమందు రెండు పోకడలు గలవు. ఒకటి ఆదర్శమును క్రిందికిలాగి జీవితముతో సామరస్యమును

గూర్చ యత్నించును; రెండవది జీవితమును ఆదర్శముచేరునట్లు ఉద్ధరించుటకు గడంగును. దీనిని గ్రహించుట చాల గొప్పసంగతి. ఏలనన ఈ మొదటిదే సామాన్యముగ మనజీవితములను లోబఱచుకొనజూచుచుండును. ఏదో యొక విధమగు పనిని మాత్రమే చేయగలనని నా అభిప్రాయము అనుకొనుడు. అందు చాలభాగము చెడ్డది కావచ్చును; క్రోధము, లోభము, మోహము మున్నగు చిత్తవృత్తులచే ప్రేరణగాంచునదై యుండ నోపు. అప్పుడెవరేని నాకొక ఆదర్శమును బోధింపవచ్చి, అందు ప్రథమ సోపానముగా స్వార్థమును భోగమును విడువుమనినచో, నాకది సాధ్యముకాదని తోచును. కాని అతడు నా స్వార్థమునకు భంగములేని ఆదర్శమును జూపిన యెడల సంతసించి తత్క్షణము ముందుకు దుముకుదును. అది నాకనుకూలమగు ఆదర్శము! "శిష్టత్వము" అను పదమువలెనే "సాధనీయము" అను శబ్దమును పలురీతుల అర్థముచేయబడుచున్నది. "నా ఆచారమే శిష్టము; నీ ఆచారము దుష్టము!" "సాధనీయము" అనునదియు ఇట్లే యున్నది. నేను సాధనీయము అనుకొనిన దొక్కటే ప్రపంచమున ఆచరణయోగ్యమై నాకు తోచును. నేను అంగడిపెట్టుకొనువాడ నైతినా, అంగళ్లు పెట్టుకొనుటే ప్రపంచమున ఆచరణయోగ్యమగు వృత్తి యని భావింతును, నేను దొంగనైతినా, దొంగతనముచేయుటే ఆచరణయోగ్యమని తలతును; తదితరములు ఆచరణయోగ్యములుగ గాన్పింపవు. "అనుష్ఠానయోగ్యము" అను మాటను తనకిష్టమైనట్టియు, తాను చేయగలట్టియు, విషయములకు అనుబంధముచేసి మనలో ప్రతివాడును ఎట్లు వాడునో తెలిసికొంటిరా? కాబట్టి 'వేదాంతము అత్యంతము అనుష్ఠాన యోగ్య'మనునప్పుడు ఆదర్శార్థములో మాత్రమే యని గ్రహింతురుగాక. అది బోధించు ఆదర్శము అత్యున్నతమైనది నిజమే కాని అసాధ్యము మాత్రము కాదు. ఆదర్శమునకుండవలసిన ఉన్నతియే దానికిగల యున్నతి. ఒక్కమాటలో చెప్పెదను.

ఆ ఆదర్శము "తత్త్వమసి" — బ్రహ్మము నీవే, ఇదే వేదాంత తత్త్వసారము. దానిలోని శాఖోపశాఖలనన్నిటిని గ్రహింప పరిశ్రమించి, దానికి వలయు బుద్ధివ్యవసాయమంతయు చేసిన పిదప, ఆ మతసారము నరుని యాత్మ పవిత్రమనియు, సర్వజ్ఞమనియు తేలును. ఆత్మనుగూర్చి మాటలాడునప్పుడు జననము మరణము అను మూఢవిశ్వాసములన్నియు వెఱ్ఱి అని తేలును. ఆత్మ యెన్నడును జననముగాంచి యుండలేదు; ఎన్నడును మరణింపదు. మనము చత్తుమని తలచుట, చావునకు భీతిలుట కేవలము మూఢ్యము. మనము దీనిని జేయగలము, దానిని చేయజాలము అను భావములును వెఱ్ఱివే. మనము సకలమును చేయగలము. వేదాంతము నరునకు ఆత్మవిశ్వాసమును ప్రప్రథమ విషయముగా బోధించుచున్నది. తనకు అతీతుడయిన సగుణ బ్రహ్మ యొకడు కలడని విశ్వసింపనివాడు నాస్తికుడని ప్రపంచ మందలి కొన్ని మతములు బోధించురీతినే, తనయందు తనకు విశ్వాసము లేనివాడు నాస్తికుడని—మన ఆత్మమహిమను మనము విశ్వసింపకపోవుటే నాస్తికతయని—వేదాంతము బోధించుచున్నది. అనేకులకు ఈ భావము మహాదారుణముగ తోచుననుటకు సందియము లేదు. ఈ ఆదర్శము మనము ఎన్నడును జేరునది కాదు అని అనేకులు అనుకొందురు కాని 'ప్రతివాడును దానిని పొంద గలడు' అనియే వేదాంతము నొక్కి వక్కాణించుచున్నది. వేదాంతసిద్ధాంతానుసారముగ చూచునెడల అది యావరకే సిద్ధించియున్నందువలన, ఈ ఆదర్శప్రాప్తికి స్త్రీ, పురుషుడు, శిశువు అను తారతమ్యములుగాని, జాతిమతిభేదములుగాని, యింకనేవియుగాని అడ్డుపడజాలవు.

జగత్తునగల సర్వశక్తులును ఇదివఱకే మనయందున్నవి. మనంతట మనమే కండ్లను జేతులతో మూసికొని చీకటిగ నున్నదని విలపించుచున్నాము. మనలను చీకటి ఆవరించియుండ లేదని గ్రహింపుడు. చేతులను తొలగించుకొనుడు; ఇంతకుముందు

కూడ వెలుగుచునే ఉన్న తేజము అప్పుడు గోచరించును. ఎన్నడును చీకటి లేదు; దుర్బలత యెన్నడును లేదు. మనమే వెఱ్ఱులమై దుర్బలురమని వాపోవుచున్నాము; మనమే పిచ్చి వారలమై పాపులమని విలపించుచున్నాము. ఈ ఆదర్శ మిప్పుడు సుసాధ్యమనుటే గాక అనాదినుండియు లభ్యమైయే యున్న దనియు, ఈ ఆదర్శము (ఈ సత్యతత్త్వము) మన స్వభావమే అనియుకూడ వేదాంతము వక్కాణించుచున్నది. నీకు కాన్పించు తదితరమంతయు అసత్యము; బూటకము. "నేనొక అల్పుడనగు మర్త్యుడను' అని నీవనగానే అసత్యములు పలికినవాడ వగు చున్నావు; నిన్ను నీవే మోసగించుకొనుచున్నావు; ఇంద్రజాల మునకు లోనై నీయంతట నీవు నీచుడవును, క్షుద్రుడవును, దౌర్భాగ్యుడవును అని భ్రమించుచున్నావు.

వేదాంతము పాపమును అంగీకరింపదు; పొరపాటునటను మాత్రము అంగీకరించును. మఱియు నీవు దుర్బలుడవనియు, పాపివనియు, దీనుడవనియు, శక్తిహీనుడవనియు, దేనినిగాని సాధింపజాలనివాడవనియు, పలుకుటయే అన్నిటిని మించిన పొరపాటని వేదాంతము బోధించుచున్నది. అటుల నీవనుకొని నప్పుడు నిన్ను బంధించు గొలుసునకు నీవొక క్రొత్త కొక్కెమును జేర్చుకొనినట్లగును. నీ ఆత్మను ఆవరించిన ఇంద్రజాలమునకు ఇంకొక క్రొత్తపొరను చేర్చుకొనినట్లగును. కాబట్టి తాను దుర్బలుడనని తలచువాడు దోషి యగుచున్నాడు. తాను అపవిత్రుడనని తలచువాడు బొర్లబడుచు, లోకమున నొక దుష్ట భావమును ప్రచారము చేసినవాడగును. ఇప్పటి మనజీవితమును, ఇంద్రజాలములో పడిన ఈ జీవితమును, మనము ఆరోపించుకొనిన ఈ అసత్యజీవితమును, ఆదర్శముతో సరిపెట్టు యత్నమే వేదాంత మున లేదనియు, ఈ మాయాకల్పితజీవితము పోయి, నిత్యసత్య జీవితము ప్రకటితమై ప్రకాశింపవలసియున్నదనియు, మనము

సదా జ్ఞప్తి నుంచుకొనవలయును. ఏ నరుడుగాని ఒకప్పటికంటె ఇంకొకప్పుడు హెచ్చుగ పవిత్రుడు కాబోవుటలేదు; సహజమై యున్న పవిత్రతను హెచ్చుగా ప్రకాశమునకు దెచ్చుకొనుచున్నాడని చెప్పవలయును. పొరలు తొలగిపోయినకొలది ఆత్మకుగల సహజపావనత్వము ప్రకాశమునకు వచ్చుచుండును. అనంత పవిత్రత, స్వాతంత్ర్యము, అనురాగము, సర్వశక్తులును, చెప్ప నేల! సచ్చిదానందములే మనవియై యున్నవని గుర్తింతుము! సచ్చిదానందములును సర్వశక్తులును అన్నియు సదా మనవై యే యున్నవి!

వనాంతరములందును గుహాంతరములందును వసించువారే గాక, సకలజీవితావస్థలందుండువారును, దీని అనుభవమునకు దెచ్చుకొనగలరనికూడ వేదాంతము బోధించును. ఈ సత్యములను కనుగొనినవారు వనములందును గుహలందును వసించువారు కారనియు, సామాన్యపు వృత్తులచే జీవించువారును కారనియు, నిరంతర కార్యవ్యగ్రులై, సేనలనడుపుచు, కోట్లకొలది ప్రజల క్షేమములను అరయుచు, సింహాసనాధిష్ఠులైయున్న ప్రభువులనియు మన కిప్పటికే తెలియును. దాదాపు కీలుబొమ్మలై పోయిన ఈ కాలపు ప్రభువులవలె కాక, ఆ కాలపు ప్రభువులు నిరంకుశసర్వాధికారకలితులై వర్తించుచుండిరని మనము జ్ఞాపకముంచుకొనవలెను. అంత కార్యవ్యగ్రులే ఇట్టి భావనలపై బుద్ధిని ధారణచేయుటకును, వానిని అపరోక్షానుభూతికి దెచ్చుకొనుటకును, లోకమునకు బోధించుటకును తీఱికకల్పించుకొనగల్గిరి. వారి జీవితములతో పోల్చిచూచినయెడల, నిరంతరవిశ్రాంతిచే నొప్పునవనదగు జీవితములగడుపు మన కీవేదాంతసత్యానుభూతికృషి యెంత సుసాధ్యమై యుండవలయునో యోచింపుడు. చేయుట కంతగా పనిలేక, యెల్లెడల తీఱికగనే ఉండు మనము ఆ ఆదర్శమును అందుకొనజాలకుండుట ఎంతయు లజ్జాకరము గదా! పూర్వపు సర్వాధికారప్రభుని తాపత్రయములతో పోల్చినయెడల నాయవి

గణనకే రాజాలవు. పెద్దసేనను నడపుచు కురుక్షేత్ర రణరంగమున నిలిచిన అర్జునుని కుండిన పని తొందరలతో పోల్చిన నాకు గలవి పూజ్యమనవచ్చును. రణగుణధ్వనిలో మునిగియున్న అతడు పరతత్త్వరహస్యములగూర్చి ప్రసంగింపగలిగినాడు; వానిని తన జీవితమున నాచరించుటకును శక్తుడైనాడు. అందుతో పోల్చి చూచిన నెంతో తీరుబాటుగలిగి, పాటుపడు నవసరములేక సుఖజీవనముచేయుమన మాపాటి చెయువు తప్పక సాధింపగలిగియుందుము. సద్వినియోగము చేయుటకు నిజముగా సంకల్పించితిమేని, మనము అనుకొనుదానికంటె చాల హెచ్చు అవకాశము మనలో అనేకులకు కలదు. పూర్తిగ ప్రయత్నించితిమేని, మనకున్న విశ్రాంతితో మన యీ జీవితములో రెండువందల ఆదర్శములను సాధింపగలము. అయినను ప్రస్తుతస్థితికి జేరువగు నట్లుగా, ఆదర్శమును క్రిందికి పడలాగదగదు సుడీ! మనము కావించు లోపములన్నిటికిని సాకులు కల్పించుచు, మన వెఱ్ఱికోరికలకును, వెఱ్ఱితలపులకును, సాకులను సృష్టించుటను నేర్పుచు దరిజేరు వారుండుట మహానర్థదాయకము; మనమో వారు చూపు ఆదర్శమునే ఉత్తమముగా భావింతుము. అటులగావింపదగదు. వేదాంతమటువంటి బోధను కావించుటలేదు. మనప్రవర్తనమును ఆదర్శముతోడి సామరస్యముగల దానిగ ఉద్ధరింపవలెను. మన యీ జీవితమును శాశ్వత జీవితముతో సరిపోలుదానిగ ఉద్ధరింపవలయును.

వేదాంతమూలభావము ఈ ఏకత్వమే (ఐక్యమే) అని మీరు జ్ఞప్తియందుంచుకొనవలయును. రెండు అనుమాట దేనియందును లేదు. రెండు లోకములందు రెండు జీవితములు లేవు; రెండు భిన్నములగు జీవితసరణులుకూడ లేవు. వేదములు మొదట ఊర్ధ్వలోకములు మొదలగువానినిగూర్చి ప్రశంసించినను పోనుపోను, తత్త్వపరమావధినిగూర్చి తెలుపుచో వాని నన్నిటిని త్రోసివేయుచున్నవి. ఒక్క జీవితమే, ఒక్క ప్రపంచమే, ఒక్క

అస్తిత్వమే! సర్వమును ఆ ఏకవస్తువే. అంశభేదమేగాని జాతి భేదము లేదు. మన జీవితములందు కాన్పించు భేదము భిన్నజాతిత్వమువలన కలిగినదిగాదు. పశువులు నరులకంటె భిన్నములనిగాని, అవి నరుని కాహారముగానుండుటకై సృష్టింపబడెననిగాని, యెంతమాత్రమును వేదాంతము అంగీకరింపదు.

కొందఱు శాస్త్రపరిశీలనార్థము సజీవజంతువులను కోయకూడదని బోధించు సంఘమును దయార్ద్రులై స్థాపించిరి. అట్టి సంఘసభ్యులలో నొకరిని "మిత్రమా, శాస్త్రపరిశోధనార్థ మొకటి రెండు జంతువులను చంపుట అధర్మమని బోధింతురుగదా! ఆహారార్థము చాలజంతువులను చంపుట ధర్మమేయని భావింతురేల?" అని అడిగితిని. "శాస్త్రపరిశీలనార్థము ఖండించుట మహాఘోర కార్యము. మన యాహారార్థమే అవి మన కొసగబడియున్నవి" అని ఆయన ప్రత్యుత్తరమిచ్చెను. ఐక్యభావములో సకలజీవులును ఇమిడియేయున్నవి. మనుష్యజీవనము శాశ్వతమైనచో పశుజీవితమును అట్టిదే. అంశభేదము కలదు గాని, జాతి తారతమ్యము లేదు. ఏకకణసూక్ష్మజీవియు నేనును ఒక్కటియే. భేదమున్నచో అది అంశయందుమాత్రమే. జీవభావపరమావధినుండి చూచినచో, ఈ భేదము లన్నియు అదృశ్యములగును. గడ్డిమొక్కకును, చిన్న చెట్టునకును మధ్య మనకు చాలభేదము కాన్పించును. కాని ఎత్తగుపర్వతమునెక్కి చూచిన యెడల గడ్డియు మహావృక్షమును ఇంచుమించుగ నొకటిగనే ఉండును. అట్లే పరమావధిని గూర్చిన దృష్టికి క్షుద్రజంతువును, మానవాగ్రగణ్యుడును ఒక్కటియే. భగవంతు డొకడు కలడను విశ్వాసము మీకు గలదేని, అల్ప జీవులును అత్యుత్తమజీవులును ఒక్కటని అంగీకరింపవలసి యున్నది. భగవంతుడు నరులనెడు బిడ్డలయెడ పక్షపాతము వహించి, మృగములనెడు బిడ్డలయెడ క్రూరుడగుచో అతడు పెను భూతముకంటె హీనుడనవలసియుండును. అటువంటిదేవుని పూజిం

చుటకంటె వందసారులైనను మరణించుట నాకిష్టము. అట్టి దేవునితో పోరుటకే నా జన్మనంతను వినియోగించెదను. కాని అట్టిభేదమేమియును లేదు; కలదనువారు బాధ్యతను గుర్తింపని వారును, క్రూరులును, అజ్ఞానులునైనవారు. "అనుష్ఠాన యోగ్యము" అనుమాటను అప్రయోగముచేయుట కిది యొక ఉదాహరణము. నేను కేవలము శాకాహారము భుజించువాడను గాకపోవచ్చును. కాని ధర్మము నెఱుగుదును. నేను మాంసమును తినునప్పు డది తప్పని యెఱిగియుందును. కొన్ని పరిస్థితులలో తప్పక తినవలసినవాడనయినను అది క్రూరకర్మమని యెఱిగి తిందును. అందుచేత ఆదర్శమును ప్రస్తుతాచరణకు దింపి, నావర్తనము నెన్నడును సమర్థింపజూడదగదు. జంతువునేని బాధింపకుండుట, మాంసము తినకుండుట ధర్మము. ఏల అందురా ఆ జంతువులు నాతోబుట్టువులే. వానియందు నీకు సోదరభావము కుదిరెనేని సర్వాత్మలయెడలను సోదరభావమును సాధనచేయుటలో చాలదూరము పోయినవాడవగుదువు. ఇక మానవసోదరత్వమునుగూర్చి చెప్పవలయునా? అప్పుడది బాలక్రీడవలె నుండును. ఇది చాలమందికి హితవుగా నుండదనుట నిజము. ఏలనన ఇది వారిని ప్రస్తుతాచరణమార్గమునుండి పైకెగసి, ఆదర్శమును చేరుమనును గదా. వారి ప్రస్తుతాభ్యాసములకు సరిపోవు సిద్ధాంతమును దేనినేని బోధించినప్పుడే వారది పూర్ణముగ అనుష్ఠానయోగ్యమని అంగీకరింతురు.

మానవస్వభావమునందు పూర్వాభ్యాసపరత గాఢముగ నున్నది. దానిని దాటి ఒక్క అడుగు పెట్టుట అనిన మనకిష్టముండదు. ఈ మానవకోటినిగూర్చి నా భావము మంచులోపడి బిగిసికొనిపోయినవారిని గూర్చిన భావమువంటిది. వారు నిద్రింపగోరుచుందురట. మీరు పైకి లాగజూచిన యెడల "మమ్ము నిదురింపనిండు; ఈ మంచులో నిద్రించుట కడుమనోహరము" అందురట! అటుల నిదురించుచునే వారు మరణింతురు. మన

స్వభావమును ఇట్లేయున్నది. మన జీవితములందంతటను మనము కావించునది ఇదియే. ఆపాదమస్తకము క్రమక్రమముగ బిగిసికొనిపోవుచున్నను, నిదురింపగోరుచుందుము. కాబట్టి మీరు ఆదర్శమును చేరుటకై పరితపింపవలయును. ఎవరేనివచ్చి ఆదర్శమును మీరున్న స్థితికి దింపివేసి, పరమాదర్శమును బోధింపని మతమును తెలుపజూచునెడల, వానిబోధ నాలకింపకుడు. అట్టి మతము అనాచరణీయమని నా దృఢవిశ్వాసము. ఎవరేని పరమావధిని జూపు మతమును బోధింపనుండిన, నేను వాని ననుసరించుటకు సిద్ధముగనుందును. ఇంద్రియాడంబరములను, ఇంద్రియలోలత్వమును, సమర్థింపగడగువారినిగూర్చి జాగ్రత్తగనుండుడు. ఇదివరకే ఇంద్రియములకు కట్టువడి తుచ్ఛ మృత్పిండములమైపోయియున్న మనము, అట్టివారిబోధను అనుసరించితిమా, మనకు ముందుగతులుండవు. నే నిట్టివిషయములను చాల చూచినాను. నాకు కొంత లోకానుభవము కలదు. మతశాఖలు కుక్కగొడుగుల లీల పుట్టుచుండు దేశము నాది. ప్రతిసంవత్సరమును క్రొత్తక్రొత్త మతములు బయలుదేరుచుండును. కాని నేను ఒక్క విషయమును మాత్రము బాగుగ గుర్తింపజాలితిని. విషయలంపటత్వమును ధర్మాభిరతితో సామరస్యము కుదుర్పజూడని వారు మాత్రమే వర్ధిల్లగలుగుదురు. విషయాడంబరములను పరమార్థముతో సరిపెట్టజూచి, భగవంతుని మానవునిదశకు ఈడ్చుటకు పిచ్చిప్రయత్నములు చేసినప్పుడు క్షీణతయే ప్రాప్తించుచుండును. నరుడు నీచుడై ప్రాపంచిక దాస్యమున కూలదగదు; ఉత్తీర్ణుడై భగవంతుని జేరవలయును.

కాని, ఈ విషయమున కింకొక పక్షముకూడ కలదు. మనము ఎవరినిగాని నీచులుగ చూడదగదు. అందఱమును ఒక్క ఆదర్శమువైపే పోవుచున్నాము. బలవంతులకును, దుర్బలులకును గల వ్యత్యాసము అంతరమునందే. పుణ్యపాపములకుగల భేదము కూడ అంతరసంబంధమైనదే! అంతరభేదమే స్వర్గనరకములకును

గలదు. చేతనాచేతనములకుగల భేదమును అంతరభేదమే! ప్రపంచమునగల తారతమ్యములన్నియు అంతరసంబంధమైనవే గాని జాతి సంబంధమైనవిగావు. ఏల అందురా, అద్వైతమే సర్వమునందును గల తత్త్వము. సంకల్పరూపమునగాని, ప్రాణరూపమునగాని, జీవాత్మరూపమునగాని, శరీరరూపమునగాని, ప్రకాశించునది అంతయు నొక్కటియే. భేదము కానవచ్చుటంతయు ప్రకాశమున గల అంతరమువలననే! అట్లగుటజేసి మనతో సమానాంతరముగా పరిణామము పొందియుండని వారిని నీచముగా చూచుటకు మనకర్తవ్యత లేదు. ఎవరినిగాని దోషులుగా పరిగణింపకుడు. చేదోడైసాయపడగల్గుచో అటుల గావింపుడు; లేనిచో చేతులు ముడుచుకొని, ఆ మీ సోదరులను ఆశీర్వదించి, వారి త్రోవను వారిని బోనిండు. క్రిందికి పడలాగుటగాని, ఆక్షేపించుటగాని యోగ్యమార్గము కాదు. ఆ మార్గమున కార్యసిద్ధి యెన్నడును చేకూరబోదు. ఇతరులను ఆక్షేపించుటలో మనశక్తిని వినియోగించుచుందుము. అదంతయు దుర్వ్యయము. పోనుపోను, మన మందరమును ఒక్కవస్తువునే దర్శించుచున్నామనియు, ఇంచుమించు ఒక్క ఆదర్శమునే సమీపించుచున్నామనియు మనలో గల భేదములు చాలవఱకు ఆత్మప్రకాశమునందలి అంతరముచే గల్గు తారతమ్యములనియు గ్రహింతుము.

“పాపము” అను భావనను పరికింపుడు. నే నిప్పుడు దానినిగూర్చిన వేదాంతభావమును దెల్పితిని. నరుడు పాపి యనునది ఇంకొక మతభావము. పర్యవసానమునకు రెండును ఒకటియే; కాని యొకటి సవ్యమైనది, మఱొకటి అపసవ్యమైనది. ఒకటి నరునికి వాని శక్తిని చూపును; రెండవది వాని దుర్బలతను చూపును. వేదాంతము తెలుపునదేమన, దుర్బలతయుండుగాక, లక్ష్యముచేయవలదు. మనము పురోభివృద్ధిని పొందవలయును. నరునిపుట్టుకతోడనే వానిరోగము తెల్లమైనది. ప్రతివానికిని వాని రోగము తెలియును. మన రోగమిదియని మన కెవరును తెలుప

నవసరము లేదు. రోగమునుగూర్చి సదా చింతనచేయుచుండుట వలన రోగము కుదురదు. చికిత్స చేయవలయును. మనము బయటి దేనినైనను మఱువవచ్చును; బాహ్యప్రపంచమున కపట వేషములతో దిరుగవచ్చును. కాని నిరంతరము మన దుర్బలత ఎట్టిదో మనహృదయాంతరమున నెఱిగియేయుందుము. దానిని మననముచేయుటవలన ఉపయోగ మేమైన కలదా? బలము నొసగవలయును; సతతము దుర్బలతనుగూర్చి స్మరించుచుండుట వలన బలము చేకూరదు. దౌర్బల్యమునకు చికిత్స బలమును గూర్చి తలచుటగాని, దుర్బలతనుగూర్చి సంస్మరించుటగాని కాదు: నరులందు ఇదివఱకే బలమున్నది; దాని యునికినిగూర్చి వారికి బోధింపుడు. నరులకు మీరు పాపులని చెప్పుటకు మారుగా వేదాంతము సవ్యమార్గమును అనుసరించి, ''మీరు పవిత్రులు, పరిపూర్ణులు, మీరు పాప మనుకొనునది మి మ్మంటునది కాదు'' అని ఉద్బోధించుచున్నది. పాపము అనునది ఆత్మప్రకాశమున కడు నీచాంతరము (చాల క్రిందిమెట్టు). మీ ఆత్మలను ఉత్తమాంతరమున (సాంద్రతరముగ) ప్రకాశింపజేయుడు. ఈ విషయము ముఖ్యముగా జ్ఞప్తి నుంచుకొనదగినది: మనమందఱమును అటుల చేయగలము. ''కాదు; నాచేతగాదు'' అని యెన్నడును అన బోకుడు. మీరు అనంతులు. మీ స్వభావముతో సరిపోల్చిన, కాలము, దేశము సయితము క్షుద్రములై తోచును. మీరు సర్వశక్తిసంపన్నులరు; దేనిని బట్టిన దానిని సాధింపగలరు.

ఈ నీతితత్త్వములనుండి ఒకింత క్రిందికిదిగి వాని వివరములను విచారింతముగాక. ప్రతివానియొక్క, ప్రతిజాతియొక్క, దైనికజీవితములందు, నగరజీవితములందు, గ్రామ్యజీవితములందు, జాతీయజీవితములందు, గృహజీవితములందు ఈ వేదాంతబోధ ఎట్లనుష్ఠింపదగునో చూతము. నరుడు ఎక్కడివాడైనను, ఎట్టి దశయందున్ననుకూడ, వానికి ఉపకరింపని మతము అంతగా

ప్రయోజనకారికాదు. ప్రత్యేకము కొందఱికి మాత్రము ఉపకరించు మతము సిద్ధాంతరూపముననే నిలిచియుండును. నరు డెట్టి స్థితియందున్నను, స్వతంత్రుడయినను దాస్యమున నున్నను గూడ, చేయూతనీయ సమర్థమై, సంసిద్ధమునై, యుండు మతమే మానవకోటి కుపకరింపగలదు; నీచాతినీచదశయందును, అత్యుత్తమపవిత్రదశయందును ఉపకరింపవలయును. ఎల్లెడలను అది వానికి చేయూతనొసగజాలియుండవలయును. ఈ మహాధర్మ మును నిర్వహించు శక్తిగలదైనప్పుడే దానిని వేదాంతమనుడు, ఆదర్శమతమనుడు, మీరే పేరుననైన బిలువుడు, అది సార్థకము కాగలదు.

మనయందు మనకు విశ్వాసమునుగూర్చు ఆదర్శము మనకు అత్యంతప్రయోజనకరము. మనము అంతకన్న నధికముగా ఆత్మవిశ్వాసమును నేర్చి, దానిని అనుష్ఠించియున్నచో, మన మిప్పుడు అనుభవించు అనర్థములును, దుఃఖములును చాలవఱకు రూపుమాసియుండును. మానవచరిత్ర అంతటిని పరికించినచో, ఘనకార్యములను ఒనర్చిన స్త్రీపురుషుల జీవితములందు అన్నింటి కంటెను హెచ్చుగ సామర్థ్యమును ఒసగిన మూలశక్తి వారి ఆత్మవిశ్వాసమే అని తెలియవచ్చును. వారు ఘనులమను విశ్వాసముతో జననము గాంచిరి. ఘనులేయైరి. ఒకనరుడు అధమాధమస్థితిలో పడిపోయెననుకొనుడు. కొంతకాలమునకతడే, నిరాశాకారణముచేతనే తనస్థితినుండి ఊర్ధ్వగమనము సాగించి, ఆత్మవిశ్వాసమును నేర్చుకొని తీరును. అయినను ప్రథమము నుండియు మనము దానిని గుర్తించి యుండుట శ్రేయము. ఆత్మ విశ్వాసమును కుదుర్చుకొనుటకై ఇన్ని కడగండ్లు పడనేల? ఒక నరునికి మఱొకనరునికి గల వ్యత్యాసమంతయు, ఆత్మవిశ్వాసముం డుట ఆత్మవిశ్వాసము లేకపోవుట అను భేదమువలననే కలుగునని మనము సులభముగ గ్రహింపగలము. ఆత్మవిశ్వాసము సర్వమును సాధింపగలదు. నా జీవితములో నాకది అనుభవమునకువచ్చినది;

ఇంకను అనుభవించుచున్నాను; నేను పెద్దవాడనయినకొలదిని ఈ విశ్వాసము బలమగుచున్నది. ఆత్మవిశ్వాసము లేనివాడు నాస్తికుడే. భగవంతు డొకడు కలడను నమ్మకములేనివాడు నాస్తికుడని పూర్వమతములు బోధించినవి. తనయందు తనకు నమ్మకము లేనివాడు నాస్తికుడని ఆధునికమతము బోధించుచున్నది. కాని ఇది స్వార్థమగు విశ్వాసముగాదు; ఏల అందురా, వేదాంతము అద్వైతమునుగదా బోధించును! సర్వమును నీవేగనుక, సర్వమునందును విశ్వాసము కలిగియుండుటయే ఆత్మవిశ్వాసము అని యర్థము; సర్వమును నీవే గనుక, నీయందు నీకు ప్రేమయుండుట యనగా సర్వమును ప్రేమించుటేయగును; పశువులయెడల్ప్రేమ. ప్రతిదానియెడలను ప్రేమయే. ఇట్టివిశ్వాసమే ప్రపంచమును ఉద్ధరింపగలదని నా దృఢవిశ్వాసము. "నన్ను నేను బూర్తిగ దెలిసికొంటిని" అని యథార్థముగా పలుకగలవాడే అత్యంత మహాపురుషుడు. నీ శరీరమునందు ఎన్నిశక్తులు, ఎన్ని సమర్థతలు, ఎన్నిమహిమలు దాగియున్నవో యెఱుగుదువా? నరునందుగల సర్వమును ఎఱింగిన శాస్త్రవేత్త యెవడు గలడు? నరుడు ఈ లోకమున అవతరించి కోట్లకొలది వత్సరములు గడచినవి; అయినను వానిశక్తులలో అణుమాత్రమే ఇప్పటికి ప్రకాశమునకు వచ్చినది. కావున 'నేను దుర్బలుడను' అని పల్కరాదు. పయిపయిన కాన్పించు హీనతకు అడుగున మఱుగుపడి యెంతమహత్త్వము ప్రసుప్తరూపముననున్నదో నీ కెట్లు తెలియును? నీ లోపల అణగియున్న మహిమనుగూర్చి నీకుదెలిసినది అత్యల్పము. నీ యందు మఱుగుపడి అనంతశక్తి అనంతమహిమ పరమగుచున్నది. నీ ప్రజ్ఞ అనంతసింధువును బోలునది.

"ఈ యాత్మనుగూర్చి ప్రప్రథమమున వినవలయును." నీవు ఆ ఆత్మవు అను వాక్యమును దివారాత్రము లాలకించుచుండుము. అది నీ రక్తనాళములలోనికి చొచ్చి, ప్రతిరక్త బిందువును జలదరింపజేసి నీ అస్థిమాంసములందు నిండువఱకును

రేయింబవళ్లా వాక్యమును వల్లించుచుండుము. "జననమరణ రహితమై, దివ్యమై, సర్వజ్ఞమై, సర్వశక్తిసమన్వితమై, వెలుగు ఆత్మను నేను" అను ఆదర్శముతో నీ తనువెల్ల నిండి నిబిడీకృత మగుగాక. రేయింబవళ్లు దానినే మననముచేయుము. అది నీ ప్రాణముతో ఐక్యమైపోవువఱకును మననముచేయుము. దానినే సదా ధ్యానముచేయుము. అప్పు డది కార్యాచరణరూపము నొందును. "హృదయస్ఫూర్తినుండి జిహ్వ మాటలాడును" అను సామెతగలదు. హృదయము నిండినప్పుడు హస్తముకూడ పని చేయును. కర్మ బయలుదేఱును. ఆదర్శముతో నిండియుండుడు. మీరేమి చేసినను దీనిని చక్కగ సంస్మరింపుడు. అట్టి స్మరణ వలన మీ చెయిదములన్నియు విస్తృతిగాంచును, రూపాంతరము పొందును, దివ్యభావముగాంచును. జడపదార్థము శక్తిసమన్విత మైనచో, సంకల్పము సర్వశక్తిసమన్వితము. ఈ విశ్వాసము మీ జీవితములందు కనిపించుచుండుగాక! మీ సర్వశక్తినిగూర్చిన, మీ ఘనతనుగూర్చిన, మీ మహిమలగూర్చిన స్మరణతో నిండియుం డుడు. మూఢవిశ్వాసము లేవియు మీ తలలలో నుంపబడకుండిన యెడల ఎంత బాగుండెడిది! చైతన్యమును హరించు క్షుద్రత్వ దుర్బలత్వాది మూఢవిశ్వాసములు మనలను జన్మమాదిగ నావ రించియుండకుండిన నెంత బాగుండెడిది. మహోన్నతములును మహిమాఢ్యములును అగు సత్యములను తెలిసికొనుటకు మాన వుల కింతకంటె సులభతరమార్గము లభించియుండిన నెంత బాగుండెడిది. కాని నరు డీ అవస్థలను అన్నిటిని పడవలసి వచ్చెను. మీ తరువాత రానున్న సంతతివారికి మార్గము ఇంకను కష్టతరముగ నొనర్పకుడు.

ఒక్కొక్కప్పుడు ఈ ధర్మములను బోధించుట భయంకర ముగ దోచును. ఈ భావములను వ్యక్తీకరించుమాటలను విని నపుడు భీతిలిపోవు జనులను నే నెఱుగుదును. కాని అనుష్ఠాననిరతి

గలవారు నేర్చుకొనవలసిన మొదటి విషయమే యిది. దుర్బలుల మని మీ రెన్నడును తలపకుడు. ఇతరులకు ఎన్నడును అటుల బోధింపకుడు. చేతనైనచో లోకమునకు ఉపకారము చేయుడు. అంతియగాని హాని చేకూర్పకుడు. క్షుద్రులమనుకొనుట, ఆ యీ దేవతల మ్రోల ప్రార్థనలు గావించుట, విలపించుట అను సంకుచితభావము లనేకములు మౌఢ్యజనితములని మీ హృదంతరాళములందు మీ రెఱిగియే యున్నారు. ఇట్టి ప్రార్థనలు ఫలించినట్టి ఒక్కదృష్టాంతమును జూపుడు. కలిగిన ఫలసిద్ధి అంతయు మీ హృదయమునుండియే వెలువడినది సుడీ! దయ్యాలు లేవని మీ రెఱుగుదురు. కాని మీరు చీకటిలోనికి బోయినతోడనే శరీరము గగుర్పొడుచును. బాల్యమునం డిట్టి భీతిహేతువులగు భావములు మన బుఱ్ఱలలోనికి జొప్పింపబడియుండుటే దానికి కారణము. సంఘమునకు వెఱచిగాని, లోకమునకు వెఱచిగాని, స్నేహితులు ద్వేషింతురనిగాని, పూర్వాచారముగా ఆదరింపబడుచున్న మూఢవిశ్వాసములు మాసిపోవునేమో అను భీతిచేగాని యిట్టి భావములను మీ రితరులకు బోధింపకుడు. ఈ విషయములందు లోగిపోకుడు. ప్రకృతిలోనున్న అభిన్నతయు, ఆత్మవిశ్వాసమునుమించి బోధించుటకు మతమునందు ఏమున్నది? వేలకొలదివత్సరముల నుండి మానవజాతి సలుపు కార్యములు అన్నియు ఈ యేకైకగమ్యమును చేరుకొఱకే; అది ఇంకను అందుకే పాటుపడుచున్నది. ఇప్పుడు మీవంతు వచ్చినది; మీకు ఇప్పటికే సత్యము తెలిసియున్నది. ఎల్లెడలను ఇది బోధింపబడుచునేయున్నదిగదా. తత్త్వశాస్త్రము, మనశ్శాస్త్రముమాత్రమేకాక, పదార్థశాస్త్రములు సయితము దానినే చాటుచున్నవి. సర్వజగమును ఏకము అను రహస్యమును అంగీకరించుటకు జంకు శాస్త్రవేత్త నే డేడీ? పెక్కు భువనములు కలవని చెప్పుటకు సాహసించువాడేడి నేడు? ఇవన్నియు మూఢభావములు; ఉండునది ఒక్కజీవమే, ఒక్క లోకమే. ఈ ఒక్కజీవమే, ఈ ఒక్కలోకమే మనకు బహుళ

ముగా గోచరించుచున్నది. ఈ బాహుళ్యము స్వప్నప్రాయము. నీవు కలగనునప్పుడు ఒక కలపోయి మఱొక కలవచ్చుచుండును. నీ స్వప్నములందు నీవు నివసించుటలేదు. ఈ కల లొకదాని పిమ్మట నొకటి వచ్చుచుండును. ఒక రంగముపోయి వేఱొక రంగము సిద్ధమగుచుండును. నూటికి తొంబదిపాళ్లు దుఃఖము, పదిపాళ్లు సుఖముగల ఈ ప్రపంచము విషయముకూడ ఇట్టిదే. ఒక వేళ కొంత కాలమైనపిమ్మట నూటికి తొంబదిపాళ్లు సుఖమున్నట్లు కన్పింపవచ్చును. అప్పుడు దానిని స్వర్గమందుము. కాని జ్ఞానికి సర్వమును అదృశ్యమై, ఈ జగమే ఈశ్వరుడుగను, తనయాత్మయే ఆ ఈశ్వరుడుగను, చూపట్టు కాలము ఏతెంచును. కాబట్టి జీవములు అనేకములులేవు, లోకములును పెక్కులులేవు. ఆఒక్క ఆత్మయే యిట్లు బహుళముగా ప్రకాశించుచున్నది. ఆ అద్వితీయుడే జడపదార్థము, ఆత్మ, మనస్సు, సంకల్పము, మఱియు సర్వమునై, బహురూపముల ప్రకాశించుచున్నాడు. ఆ ''యేక నారాయణు''డే అనేకమై తోచుచున్నాడు. కాబట్టి యీరహస్యమును మనము నేర్చుకొని యితరులకు నేర్పుటే ప్రథమకర్తవ్యము.

లోకమంతయు ఈ ఆదర్శముతో ప్రతిధ్వనించుగాక. మూఢవిశ్వాసము లన్నియు అదృశ్యములగుగాక! దుర్బలులము అనుకొను నరుల కిది బోధింపుడు; వెంటనంటి బోధించుచుండుడు. నీవు పరమపావనుడవు; మేల్కొనుము; లెమ్ము; ఓ మహాత్మా, నీ నిద్ర తగదు. లెమ్ము; మేలుకొనుము నీకిది అనుచితము, నీవు దుర్బలుడవనియు, దుఃఖితుడవనియు ఎంచకుము. సర్వశక్తి సంపన్నా, లెమ్ము; మేల్కాంచుము. నీ సహజలక్షణమును ప్రకటింపుము. పాపి నని భావించుకొనుట నీకు యోగ్యముకాదు. నీవు దుర్బలుడ వనుకొనుట ఉచితముకాదు, ఈ భావమును ప్రపంచమునకు ప్రకటింపుము. నీలో నీవును సంస్మరింపుము. ఎట్టి ఫలము సిద్ధించునో కనుగొనుము. సర్వమును ఎట్లు ప్రకాశవంత

మగునో, విద్యుద్వేగముతో సమస్తమును ఎట్లు రూపాంతరమును పొందునో చూడుము. మానవకోటికి దీనిని బోధింపుము. వారి మహిమను వారికి దెలుపుము. అప్పుడు దినదినము మన సామాన్యజీవితచర్యలందు దాని నెట్లు ప్రయోగింపగలమో తెలిసికొనగలుగుదుము.

వివేక మనుదానిని ప్రయోగింపగల్గుటకును, మన జీవితములందు అనుక్షణమును, మన చేతలం దన్నింటను, ఏది యోగ్యమో, యేది అయోగ్యమో, ఏది సత్యమో, యేది అసత్యమో విచక్షణ చేయగల్గుటకును, సత్యమునకు సహజలక్షణములు పవిత్రత, యేకత్వము అని మనము తెలిసికొని యుండవలయును. ఏకత్వసిద్ధికి దారితీయు సర్వమును సత్యము. ప్రేమ సత్యము; ద్వేషము అసత్యము; ఏలనన ద్వేషము భిన్నత్వమును కల్పించుచున్నది; నరుని నరుని విడదీయుచున్నది. కావున అది అయోగ్యము, అసత్యము. అదివిచ్ఛేదనశక్తి; భిన్నముచేసి నాశనమును కూర్చును.

ప్రేమ కలయికను గూర్చును; ఆ ఏకత్వమునకు దారి తీయును. మీరందఱు ఒక్కటగుదురు: తల్లి బిడ్డతోడను, కుటుంబములు నగరముతోడను, ప్రపంచమంతయు జీవజంతువులతోడను ఐక్యముగాంచును. ఏలనన, ప్రేమయే అస్తిత్వము, ప్రేమయే భగవంతుడు. సర్వమును ఆ ఏకైక ప్రేమరాశి దాల్చిన రూపాంతరమే; దాని ప్రకాశమున మాత్రము హెచ్చు తగ్గులు చూపట్టుచున్నవి. ఆ హెచ్చు తగ్గులచేతనే భేదములు కాన్పించుట. కాని సర్వము ఆ ప్రేమరాశి దాల్చిన రూపాంతరమేసుడీ! కాబట్టి మన ప్రతిచేతయు భిన్నత్వమును కల్పించుచున్నదా, యేకత్వమును చేకూర్చుచున్నదా, యని సతతము విచారింపవలయును. భిన్నత్వ మేర్పఱచుచున్నవానిని పరిత్యజింపవలయును, ఏకత్వసాధకములైనవానిని యోగ్యములని స్వీకరింపవలయును. అట్లే మన తలంపులందును వర్తింపవలయును. వానివలన

విచ్ఛిన్నత, అనేకత్వము, చేకూరుచున్నవా, లేక ఆత్మను ఆత్మను బంధించుచు ఏకత్వమునకు దారితీయుచున్నవా అని అరయవలెను. ఏకత్వమున కభిముఖమైనవానిని స్వీకరింపవలెను, తక్కినవానిని దోషభూయిష్ఠములని పరిత్యజింపవలయును.

నీతిశాస్త్రము ఏదో అజ్ఞేయవస్తువుపై ఆధారపడదు. అజ్ఞాతమగు దేనినిగూర్చియో బోధింపదు. ఉపనిషత్తులు ఉద్ఘోషించునటుల "అజ్ఞాతుడుగా భావించి మనము ఏ దేవుని పూజించుచున్నామో, అతనినిగూర్చియే నేనిప్పుడు మీకు బోధించుచున్నాను". ఆత్మద్వారమున మాత్రమే నేను దేనినైన గ్రహింపగల్గుదును. నేను కుర్చీని కాంచుచున్నాను. కాని నేను ఆ కుర్చీని గుర్తించుటకు మొట్టమొదట నన్ను నేను గుర్తింపవలయును; ఆ పిమ్మట నేను దానిని గుర్తింపవలయును. ఆ కుర్చీ ఆత్మద్వారమున, ఆత్మలోపలనే చూడబడుచున్నది. ఆత్మద్వారమున ఆత్మలోనే మిమ్ము్మను నేను చూడగల్గుచున్నాను. లోకమునంతనుగూడ చూడగల్గుచున్నాను. కావున ఇట్టి ఆత్మను అజ్ఞాతమనుట వెఱ్ఱిమాట. ఆత్మను తొలగింపుము. జగమంతయు అదృశ్యమే యగును. ఈ ఆత్మద్వారముననే, ఈ ఆత్మలోనే సమస్తజ్ఞానమును కలుగుచున్నది. కాబట్టి ఆత్మయే అన్నిటికంటె మిన్నగ తెలిసినది. "నేను" అని మీరనునది మీ ఆత్మనే. "నేను" అని నేను దేనిని అనుచున్నాడనో, అదియే "నేను" అని మీరును అనుకొనునది ఎట్లు కాగలదని మీకు వింత కలుగవచ్చును. పరిమితమగు ఈ "నేను" పరిమితిలేని అఖండాత్మ ఎట్లు కాగలదనియు మీ రాశ్చర్యపడవచ్చును. కాని అట్లగుటే సత్యము. పరిమితమై కానబడునదెల్ల బూటకము. అఖండమగు ఆత్మ కప్పుపడినట్లుకాగా దానిలోని స్వల్పాంశము "నేను"గా ప్రకటితమగుచున్నది. అఖండమగునది నిజముగా పరిమితికి లోబడజాలదు. అట్లగుట బూటకము. కావున మనకందఱకును— స్త్రీకిని, పురుషునకును, శిశువునకును, తుదకు పశువునకును—

అందఱకును ఆత్మ తెలియవచ్చుచునేయున్నది. ఆత్మను ఎఱుగకుండ మనము జీవింపజాలము. చరింపజాలము. నిలువజాలము. ఈ సర్వేశ్వరుని ఎఱుగకుండ మనము శ్వాసింపజాలము. ఒక్క నిమిషకాలము బ్రతుకజాలము. వేదాంతము బోధించు దేవుడు అన్నిటికంటె నెక్కువగ దెలియవచ్చుచుండువాడే. ఊహాకల్పితుడు కానే కాడు.

అది అనుష్ఠానయోగ్యమగు భగవద్బోధ కానిచో, ఇంకెట్లు అనుష్ఠానయోగ్యముగా భగవంతునిగూర్చి బోధించుట? నా యెదుట కాంచునట్టి భగవంతునికంటె సమస్తమునందు నిండి సర్వాంతర్యామియై వఱలు దేవునికంటె, మన యింద్రియముల కంటెను సత్యమైన దైవముకంటె, ప్రత్యక్షముగ మనము తెలిసికొనగల ఈశ్వరుడు ఇంకెవడుండగలడు? ఏలనన, సర్వశక్తి సంపన్నుడై, సర్వత్ర వెలుంగుచు, ఆత్మలకెల్ల ఆత్మయై వఱలు ఆ భగవంతుడు నీవే! నీవు కావని అంటినేని నేను అబద్ధముపలికిన వాడనే అగుదును. సర్వకాల సర్వావస్థలయందును నేను గుర్తించి నను లేకున్నను, నేను ఈ సంగతిని ఎఱుగుదును. అతడు ఏకైక మూర్తి, అన్నిటగల ఏకత్వము, సర్వజీవలోకమునందును వెలుగు సత్యత్వము, అస్తిత్వమునందెల్ల గల సత్యము.

వేదాంతనీతిభావములను ఇంకను విశదీకరింపవలసియున్నది. కావున కొంత ఓపిక పట్టుడు. కడు క్షుద్రాదర్శములనుండి యీ భావములు ఎట్లు ఉద్భవించినవో, ఈ అద్వైతాదర్శము ఎట్లు పరిణామముగాంచినదో, ఎట్లు విశ్వప్రేమరూపముదాల్చినదో, తెలియుటకు దానిని పూర్తిగ విమర్శించి నిరూపణము గావింపవలసియున్నది. అపాయములను తప్పించుకొను కొఱకు దీనిని క్షుణ్ణముగ తెలిసికొనవలయును. అతిక్షుద్రదశలనుండి దీనిని అవలోకనచేసికొనుచు వచ్చుటకు లోకులకు ఓపిక లేకున్నది. కాని ముందు రానున్నవారికి ఈ రహస్యమును అందీయజాలమేని

మనము పై మెట్టుల నిలిచిన లాభమేముండగలదు? కాబట్టి కూలంకషముగ దీనిని పరిశీలించుట యుక్తము. బుద్ధిబలము తుదను నిష్ప్రయోజనమని యెఱిగియున్నను, బుద్ధికి సాధ్యమగు నంతవఱకు విషయమును మున్ముందుగా వివరించుట అవసరము. హృదయమే అన్నింట ప్రధానమైనది. ఈశ్వరుని మనము జూడ గలుగుట హృదయద్వారమున గాని బుద్ధిద్వారమున కాదుసుడీ! మనకై వీధులు చిమ్ము ఊడ్పుకత్తెవంటిది బుద్ధి. మార్గము సరిచేయగలదు. పోలీసువానివలె అప్రధానమైనది. సంఘవర్తన మున పోలీసువాడు ఉండితీరవలయునని నొక్కిచెప్పలేము. అల్లరు లను ఆపుటయే అతడు చేయగల పని. దుర్వర్తనమును అరికట్టుట మాత్రమే. బుద్ధిచేయవలసిన పనియు ఇంతమాత్రమే. కేవలము బుద్ధి చాకచక్యమును ప్రకటించు పుస్తకములను మీరు చదివి నప్పుడు వానిని చక్కగ పఠించినవెనుక "హా దైవమా, బయట పడితిని బాబూ!" అందురు. ఏల? బుద్ధి గ్రుడ్డిది. స్వయముగా చరింపజాలనిది. దానికి కాలుసేతులును లేవు. పనిచేయగలది హృదయభావమే. ఇది విద్యుచ్ఛక్తికంటెను, మఱి దేనికంటెను, అమితవేగముగా చరింపగలదు. నీకు సానుభూతి కలదా అనునదే ప్రధానవిషయము. అది యున్నదా, నీవు ఈశ్వరుని దర్శింప గలవు. నీకిప్పుడు గల ఆ సానుభూతియే సాంద్రమై, దివ్యమై, సమస్తమును స్పృశించి, సమస్తమునందును ఐక్యభావమును కాంచి, నీలోను, అన్యమునందునుగూడ భగవంతుని గుర్తింపజాలువఱకును క్రమోన్నతిని పొందగలదు. బుద్ధి యెన్నడును అటుల జేయ జాలదు. "శబ్దములను వివిధగతులతో ఉచ్చరించుట, శాస్త్రము లకు పలురీతుల వ్యాఖ్యానముచేయుట, ఇవి విద్వాంసుల కానం దముగూర్పగలవేగాని, ఆత్మముక్తిసాధన కాజాలవు."

మీలో థామస్ ఎకెంపిస్‌గారి గ్రంథము చదివిన వారికి ప్రతిపుటయందును ఆయన ఈ విషయమును ఎట్లు నొక్కిచెప్పెనో తెలిసియుండును. లోకములో ఇంచుమించుగా అందఱు

జ్ఞానులును ఈ విషయమును వక్కాణించియే యున్నారు. కాని బుద్ధి బలమును అవసరమేసుడీ! అదిలేనిచో మనము పిచ్చిపోకడల బోదుము; నానావిధములగు పొరపాటులలో పడుదుము. బుద్ధి దీనిని అరికట్టగలదు. కాని అంతకుమించి బుద్ధిపైన ఆధారపడి దేనిని నిర్మాణము చేయ యత్నింపదగదు. బుద్ధి జడమగు, అప్రధానమగు సాధనము. సత్యమగు సాహాయ్యము హృదయ భావమువలన, ప్రేమవలన, కలుగును. ఇతరులయెడల నీకు సానుభూతి గలదా? కలిగినచో నీవు ఏకత్వమున పెంపొందు చున్నట్లే. నీకు ఇతరులపై సానుభూతి లేదా, యీ జగమున జననము గాంచిన మేధావులందఱిలో అగ్రగణ్యుడవైనను, నీవు వ్యర్థుడవే. నీది శుష్కబుద్ధి, నీవు అటులనే నిలిచిపోవలసిన వాడవు. అటులగాక నీకు సానుభూతి గలదేని, నీవు ఏ గ్రంథమును పఠింపజాలకున్నను, ఏ భాషను ఎఱుగకున్ననుగూడ సరియైన త్రోవలో నున్నవాడవే. ఈశ్వరుడు నీవాడే.

ప్రపంచ చరిత్రను పఠించుచో, ప్రవక్తలగువారి మహిమకు మూలమేదియో గ్రహించితిరా? అదెందుండినది? మెదడునందా? వారిలో ఎవరైనను తత్త్వశాస్త్రములనుగూర్చిగాని, తర్కశాస్త్ర క్లిష్టసమస్యలనుగూర్చిగాని, ఒక్కగ్రంథమునైనను ఎన్నడేని వ్రాసిరా? ఒక్కడును అటుల చేసియుండలేదు. వారు మిక్కిలి మితముగా వచించెడివారు. క్రీస్తువలె అనుతాపము పూనుము; నీవు క్రీస్తువగుదువు. బుద్ధునివలె అనుక్రోశము తాల్పుము; నీవు బుద్ధుడవగుదువు. సానుభూతియే జీవితరహస్యము, బలము, చైతన్యము. అది లేనినాడు మేధాశక్తి యెంతయున్నను భగవంతుని పొందుట సున్న. బుద్ధి చలనశక్తిలేని అవయవములవంటిది. అనుతాప మా యవయవములందు ప్రవేశించి, వానికి చలనశక్తి నిచ్చినప్పుడే, అవి చలించి యితరులపై పని చేయగలవు. ప్రపంచమున ఎల్లెడలను ఇట్లే జరుగును; ఈ విషయమును మీరు సదా జ్ఞప్తియందుంచుకొనవలయును. వేదాంతనీతియం దిది మిక్కిలి

అనుష్ఠాన యోగ్యమగు విషయము. ఏలనన, మీ రందఱును ప్రవక్తలే యని వేదాంతము బోధించుచున్నది. కావున మీ రందఱును ప్రవక్తలై తీఱవలయును. మీరు వ్రాయు పుస్తకము మీ శీలమునకు నిదర్శనము కాజాలదు; మీ శీలమే మీ పుస్తకమునకు నిదర్శనము. ఏ పుస్తకముగాని సత్యమును బోధించుచున్నది అని మీ రెట్లు నిర్ణయింపగలరు? మీరే ఆ సత్యమై దానిని అనుభవింపగల్గుదురుగాననే! ఇదే వేదాంతబోధ. లోకమున క్రీస్తులును బుద్ధులును ఉండిరనుటకు సాక్ష్యమేది? మీరును నేనును వారివలె సానుభూతిని చూపుటే! ఆ విధమున మాత్రమే మీరును నేనును వారు సత్యముగా నుండిరని గ్రహింపగలుగుట. మనయందు గల ప్రవక్తాత్మయే ప్రవక్తాత్మలకు సాక్ష్యము. మీ దైవత్వమే భగవంతుని యునికిని ఋజువుచేయునది. మీరు ప్రవక్తలు కానిచో, భగవంతునిగూర్చి ఎన్నడుగాని చెప్పబడినదేదియు సత్యము కాజాలదు. మీరు దైవస్వరూపులుగానిచో, దేవు డెన్నడు ఉండి యుండలేదు; ముం దెన్నడు నుండజాలడు. మనము అనుష్ఠింపదగు ఆదర్శము ఇదియే అని వేదాంతము బోధించుచున్నది. మనలో ప్రతివాడును ప్రవక్తగా మారవలసియున్నది; మీ రిదివఱకే అట్టివారు సుడీ! దానిని తెలిసికొనుటయే కొదువ. ఆత్మకు అసాధ్యమగునది ఏదేని కలదని ఎన్నడును దలపకుడు. అట్లను కొనుట గొప్ప అపచారము. పాపము అనునది ఏదేని ఉన్నయెడల మీరు దుర్బలురని, యితరులు దుర్బలురని పలుకుటే ఆ పాపము!



## ద్వితీయ భాగము

(లండన్ ఉపన్యాసము - 12-11-1896)

ఒక బాలునకు జ్ఞానము లభించిన విధమును తెలుపు ప్రాచీన కథను, ఛాందోగ్యోపనిషత్తులోని దానిని మీకు తెలిపెదను. ఆ కథాస్వరూపము మిగుల వికృతముగానుండునుగాని, దానియం దొక ధర్మసూత్రము కానవగును. ఒక బాలుడు తల్లితోనిట్లనెను : "నేను వేదములను పఠింపబోవుచున్నాను. నా తండ్రి పేరేదియో, నా గోత్రమేదియో తెలుపుము." వాని తల్లి వివాహముచేసి కొనిన స్త్రీకాదు. భారతదేశములో వివాహముగాని స్త్రీకనిన బిడ్డడు జాతిభ్రష్టుడుగ నెంచబడును. సంఘము ఇటువంటివానిని స్వీకరింపదు. అతడు వేదాధ్యయనమున కర్హుడుగాడు, కావున పాప మా బాలుని తల్లి "బిడ్డా, నీ గోత్రమును నే నెఱుగను. నేను దాస్యవృత్తిచేయుచు, పెక్కుతావుల జరించితిని. నీ తండ్రి యెవరో నే నెఱుగను. కాని నా పేరు జాబాల, నీ పేరు సత్యకాముడు" అనెను. ఆ బాలు డొక ఋషిని సమీపించి తన్ను శిష్యునిగా స్వీకరింపుడని వేడెను. ఆ ఋషి "నీ తండ్రి పేరేమి? నీ గోత్రమేమి?" అని ప్రశ్నించెను; బాలుడపుడు తనతల్లివలన వినిన దానిని తెలిపెను. వెంటనే ఋషి యిట్లనెను : "తన్నుగూర్చి ఇట్టి గౌరవహాని కరమగు సత్యమును బ్రాహ్మణుడుతక్క ఇంకొకడు పలుకనేరడు. నీవు బ్రాహ్మణుడవు. నేను నీకు విద్యగఱపుదును. నీవు సత్యముతప్పలేదు." అంతట ఆయన బాలుని తనకడ నిలుపుకొని విద్య నేర్పెను.

ప్రాచీన భారతదేశమునందలి విచిత్ర శిక్షాపద్ధతులు కొన్ని మనకిట కానవచ్చును. గురువు సత్యకామునకు నాలుగువందల ఆవులను, చిక్కి బలహీనముగ నున్నవానిని ఒప్పగించి, మేపు

కొనిరమ్మని అడవికి బంపెను. అతడు అడవికిబోయి కొంతకాలము గడపెను. ఆమంద వేయియయినప్పుడు తిరిగిరమ్మని గురువు అతనికి చెప్పియుండెను. కొన్ని వత్సరములు గడచినపిమ్మట, మందలోని ఒక ఆబోతు యిట్లనుట సత్యకామునకు వినవచ్చినది. ''ఇప్పుడు మేము వేయియైతిమి. మమ్ము మీ గురువుకడకు కొనిపొమ్ము. నేను నీకు ఒకింత బ్రహ్మోపదేశము చేసెదను.'' ''స్వామీ, సెలవిం''డని బాలుడనెను. ''తూర్పుదిశ బ్రహ్మమునందొకభాగము; అటులనే పడమటిదిశ; ఉత్తర దక్షిణదిశలును అట్లే. ఈ నాలుగుదిశలును బ్రహ్మమున నాలుగుభాగములు. అగ్నియు నీకొకింత బ్రహ్మోపదేశముచేయును''అని ఆబోతనెను. ఆ దినములలో అగ్ని ఒక గొప్పదైవచిహ్నము. ప్రతివిద్యార్థియు అగ్నిని గూర్చుకొని హోమములు చేయవలసియుండెను. మరుసటి దినమున సత్యకాముడు గురునింటికయి పయనము సాగించెను. సాయంకాలమగుడు ఆతడు ఆహుతులర్పించి అగ్నిని ఆరాధించి, దాపునకూర్చుండియుండగా ''ఓ సత్యకామా,'' యను పిలుపు అగ్ని మధ్యమునుండి వినవచ్చెను. ''స్వామీ, సెలవిండు'' అని సత్యకాముడు అనెను. (శామ్యూల్‌నకు విచిత్రవాణి వినవచ్చిన దానిని తెలుపు బైబులులోని ప్రాచీనభాగమందలికథ ఇట్టిదని మీ జ్ఞప్తియందుండవచ్చును.) ''ఓ సత్యకామా, నేను నీకు ఒకింత బ్రహ్మోపదేశము చేయవచ్చితిని. ఈ పుడమి బ్రహ్మమునందు ఒకభాగము, ఆకాశమును స్వర్గమును బ్రహ్మమునందలి భాగములే. సముద్రమును వానిలోని భాగమే.'' ఇక ఒకానొక పక్షియు వానికి ఒకింత బోధించునని అగ్ని చెప్పెను. సత్యకాముడు ప్రయాణముసాగింపగా, మఱునాటి సాయంకాలహోమానంతరము ఒక హంస వచ్చి యిట్లనెను. ''నేనును బ్రహ్మమును గూర్చి ఒకింత తెల్పెదను. నీవు ఆరాధించు ఈ అగ్ని బ్రహ్మమునందు ఒకభాగము. సూర్యుడు, చంద్రుడు, మెఱుపు బ్రహ్మమునందలి అంశములే. మద్గువను పక్షియు మఱికొంత ఉపదేశము

చేయును.'' మరునాటి సాయంతనము ఆపక్షి వచ్చినది. వెనుకటి రీతి ధ్వనియే సత్యకామునకు వినవచ్చినది: ''నేను ఒకింత బ్రహ్మోపదేశము చేసెదను; ప్రాణము (శ్వాసము) బ్రహ్మమునందు ఒకభాగము, దృష్టి ఒకభాగము, శ్రవణము ఒకభాగము, మనస్సు ఒకభాగము''. పిమ్మట ఆ బాలుడు గురునిల్లుచేరి వినయవిధేయ తలతో నమ్రుడై వానిమ్రోల నిలువబడెను, శిష్యుని కాంచగనే గురువు ''సత్యకామా, నీ ముఖము బ్రహ్మవిదుని ముఖమువలె ప్రకాశించుచున్నది! నీకు ఎవ రుపదేశించి''రని అడిగెను. ''మను ష్యేతరములు బోధించినవి. కాని, స్వామీ మీరు నాకు ఉప దేశము చేయగోరెదను. ఏలనన గురుముఖమున నేర్చిన జ్ఞానమే పరమార్థమును తెలుపగలదని మీయట్టి పెద్దలవలన వింటి'' నని ఆబాలుడనెను. అంతట గురువు ఆ బాలునకు దేవతలవలన లభిం చిన జ్ఞానమునే మరల బోధించెను. ''సర్వమును, ఏమాత్రము కొఱవడక, బోధింపబడెను''.

ఆ ఆబోతు, అగ్ని, పక్షులు బోధించిన సత్యబంధుర కథాంశము లటుండగా పూర్వ కాలమున ఎట్టి భావనలుండెడివో, ఆ దినములలో ఇవి యెట్లు ప్రసరించెడివో మన కిందుచే తెలియు చున్నది. ఈ వాక్కులన్నియు మనలోనివేయను మహోన్నతభావ మిచట అంకురరూపమున కానవచ్చుచున్నది. ఈ రహస్యములను మనము చక్కగాగ్రహించిన కొలది ఆదివ్యవాణి మన హృదంత రాళములోనిదేయనియు, ఆ బాలు డా సత్యమును సదా విను చుండియు దానిని సరిగా గ్రహింపలేక పోయెననియు మనకు బోధపడును. తనలో నుండియే వెడలుచున్న ఆ వాణి నతడు బాహ్య ప్రపంచమునుండి వచ్చుచున్న ట్లెంచెను. మన కందు వలన తెలియవచ్చు రెండవభావ మేమనగా బ్రహ్మజ్ఞానమును ప్రత్యక్షరూప మూలమున బోధించు ప్రయత్నము జరుగుచుండె ననుట. మతమును అనుష్ఠానయోగ్యముగ నొనరించు సదుపాయ ములకై లోకము మొదటినుండియు ఎదురు చూచుచున్నది. ఈ

కథలవలన అది దినదినము ఎట్లు అనుష్ఠానయోగ్యము కావింప బడుచుండెనో మనము గ్రహింపగలము. విద్యార్థికి పరిచితములగు ప్రతిదాని ద్వారమునను తత్త్వ రహస్యము తెలుపబడుచుండినది. వా రారాధించుచుండిన యగ్నియును బ్రహ్మమును, భూమియును, బ్రహ్మములోని భాగములే! ఇట్లే యన్నియు.

పిమ్మట కథ ఈ సత్యకామునియొద్దకు విద్యార్థియై వెళ్లి, వానితో కొంతకాలముండిన ఉపకోసల కామలాయనుని గూర్చి నది. ఒకపరి సత్యకాముడు యాత్రకు వెళ్లగా ఈ విద్యార్థి దిగులు చెందిన వాడయ్యెను. అప్పుడు గురుభార్యవచ్చి నీవేల భోజనము చేయకున్నావని అడుగగా ఆ బాలుడు "నేను దుఃఖపూరితుడనై యున్నాను. భుజించుటకు మనస్కరించుట లే" దనెను. అప్పు డాతడు ఆరాధించుచున్న అగ్నినుండి "ప్రాణము బ్రహ్మము, ఆకాశము బ్రహ్మము, సుఖము బ్రహ్మము. బ్రహ్మమును తెలిసి కొనుము" అను ధ్వని వెలువడినది. అంత, ఆ బాలుడు "స్వామీ, ప్రాణము బ్రహ్మమని యెఱుగుదును, కాని ఆకాశము, సుఖముకూడ బ్రహ్మమే యనుట తెలిసికొనలేకున్నాను" అనెను. అప్పుడా వాణి "ఆకాశమును సుఖమును సత్యముగ ఒక్కటే" అనెను. ఆకాశము అనగా హృదయాంతరాళమున గల చిదా కాశమే అని వివరించి చెప్పెను. ఇట్లు బ్రహ్మమే ప్రాణమనియు, అదే హృదయమునందలి ఆకాశమనియు వానికి తెలిపెను. అగ్ని వానికింకను ఇట్లుపదేశించినది. "నీ వారాధించు పృథ్వి, అన్నము, అగ్ని, సూర్యుడు, అన్నియు బ్రహ్మస్వరూపములే. సూర్యుని యందు కానుపించు పురుషుడను నేనే. దీని నెఱిగి ఆ పురుషుని ధ్యానించువాని పాపములు నశించును. ఆతడు దీర్ఘాయుష్మంతుడై ఆనందమును అనుభవించును. దిక్కులందు, చంద్రుడు, నక్షత్రము లందు, ఉదకమందు అధివసించునది నేనే. ఈ ప్రాణమునందును, ఆకాశమునందును, స్వర్గములందును, విద్యుత్తునందును ప్రకాశించు వాడను నేనే." ఇక్కడగూడ మతమును అనుష్ఠానసాధ్యముగా

నొనర్చు పూర్వపు భావమే కాన్పించుచున్నది. వారు ఆరాధించుచుండిన అగ్ని, సూర్యుడు, చంద్రుడు మొదలగు వస్తువులే వారికి పరిచితమైయున్న ఆ వాణియే ఈ కథలలో వచ్చునవి. వానిని వివరించి వాని అంతరార్థమును ప్రకటించుటే ఈ కథల ఉద్దేశము. అదియే వేదాంతసత్యమును, అనుష్ఠానయోగ్యమును అగు స్వరూపము. ఇది జగత్తును నిర్మూలము గావించుటలేదు; దాని నిజతత్త్వమును బోధించుచున్నది; పురుషునికి నాశము కూర్చుటలేదు; వాని యథార్థత్వమును తెల్లముచేయుచున్నది. వ్యక్తిత్వమును నశింపచేయుటలేదు. ఆ వ్యక్తిత్వపు సత్యస్వరూపమును వ్యక్తము చేయుటచే దానిని వివరించుచున్నది. ఈ ప్రపంచము వ్యర్థమైనది, ఇది మిథ్య, అనుటలేదు. "దీని తత్త్వమును తెలిసికొనుము; అప్పుడు నిన్నది భంగపఱుపజాలదు" అని బోధించుచున్నది. అల దివ్యవాణి సత్యకాముడు అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు మొదలగువాని నారాధించుట తప్పు అనలేదు; అందుకుమారుగా ఆ అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, పృథ్వి మున్నగు వానియందు అధివసించు ఆత్మయే అతనియందును కలదని బోధించినది. అందువలన సత్యకాముని దృష్టిలో అవి అన్నియు రూపాంతరము పొంది నట్లయ్యెను. ఆతడు ఆహుతుల నిడుచుండిన అగ్నికుండిన స్థూలాకారము పోయి, నూతన స్వరూపము చేకూరగా అది బ్రహ్మమే ఐనది. ఇట్లే పుడమి రూపాంతరము చెందినది. ప్రాణము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, విద్యుత్తు మొదలగువాని రూపములన్నియు మారిపోయి దివ్యత్వమును పొందినవి. వాని సత్యస్వభావ మతనికి వెల్లడియైనది. సర్వమునందును బ్రహ్మమును దర్శించుచు, ఆయావస్తువుల బాహ్యస్వరూపమును దాటి, వాని సత్యస్వరూపమును కాంచుమనుటే వేదాంతబోధ. ఉపనిషత్తులలో ఇంకొకపాఠము నేర్పబడు చున్నది. "నేత్రముల ద్వారమున ప్రకాశించునది బ్రహ్మము.

ఆతడు మనోహరుడు. ఆతడు తేజస్వి. ఆతడు జగములన్నింటను వెలుగుచున్నాడు." "నేత్రములందలి ప్రకాశము" అనగా పవిత్రాత్మునికి లభించు ఒకవిధమైన విశిష్ట తేజస్సనియు, నరుడు పవిత్రుడైనప్పుడు అటువంటి తేజము వానినేత్రములందు నెలకొను ననియు, నిజమునకు అది అంతరస్థమై సర్వవ్యాప్తమగు ఆత్మ తేజస్సని ఒక వ్యాఖ్యానకర్త తెలుపుచున్నాడు. ఆ తేజమే గ్రహములందును, నక్షత్రములందును, సూర్యునందును ప్రకాశించుచుండునది.

ఇక జననము మరణము మున్నగువానినిగూర్చి యీ ప్రాచీనోపనిషత్తులు కావించు మఱొక ఉపదేశమును మీకు చదివి వినిపించెదను. మీకు అది హృద్యముగ నుండనోపు. శ్వేతకేతుడు పాంచాలాధీశునియొద్ద కేగినాడు. ఆ రాజు "నరులు చచ్చిపోయినప్పుడు వారెట కేగుదురో తెలియునా? వారెటుల పునరావృత్తి నొందుదురో యెఱుంగుదువా? పరలోకము ఎన్నడును నిండిపోకుండుటకు కారణము గ్రాహ్యమైనదా?" అని ప్రశ్నించినాడు. బాలుడు తెలియదని చెప్పి, తన తండ్రియగు గౌతముని (ఆరుణి) కడకుపోయి ఆ ప్రశ్నలను అడిగినాడు. తండ్రియు తెలియదనగా వారిరువురును కలిసి రాజుకడ కేగిరి. ఈ విద్య విప్రులకు చెందలేదనియు, అది క్షత్రియులకడనే నిలిచి యున్నదనియు, క్షత్రియులు ప్రపంచమును పాలించుచుండుట కదియే కారణమనియు రాజు చెప్పెను. కొంతకాలము తన్ను సేవించిన అనంతరము ఆ రాజిటుల బోధించెను : "ఓ గౌతమా, పరలోకమే అగ్ని; సూర్యుడు దాని యింధనచయము; కిరణములే పొగ; దివమే దానిజ్వాల; చంద్రుడే నిప్పు; నక్షత్రములే విస్ఫులింగములు; ఈ అగ్నిలో దేవతలిడెడు ఆహుతియే శ్రద్ధ. ఆ ఆహుతినుండి సోమప్రభుడు ఆవిర్భవించుచున్నాడు." ఇట్లుప దేశించుచు బోయెను. "నీ విప్పటివలె నొక అల్పాగ్నిలో హోమము చేయనక్కఱలేదు. ఈ జగమంతయు ఆ అగ్నియే.

ఈ హోమము, లేక ఈ ఆరాధన నిరంతరము జరుగుచునే యున్నది. దేవతలు, దేవదూతలుఅందఱును దీనిని ఆరాధించుచునే యున్నారు. "నరుని శరీరము ఆ అగ్నికి అత్యుత్తమచిహ్నము" ఇందుగూడ అధర్మము అనుష్ఠానసాధ్యమై యొప్పుచున్నది. బ్రహ్మము సర్వమునందును చూపట్టుచున్నాడు. ఈ కథ లన్నిటిలో గల మూలభావ మేమనగా, కల్పితచిహ్నములు ఎంత మంచి వైనను, ఎంత సహకారములైనను, మనము కల్పింపగలవానిని అన్నింటిని మించిన శ్రేష్ఠతమ చిహ్నములు ఇదివరకే యున్నవి. ఈశ్వరారాధనకై నీవు ఒక చిహ్నమును రచింపవచ్చును; కాని సజీవుడైన పురుషుని ఆకారమున శ్రేష్ఠతమమగు విగ్రహము ఇప్పటికే ఉండి యున్నది. నీవు దేవతాప్రతిష్ఠకై ఒక దేవాలయ మును నిర్మింపవచ్చును; కాని నరుని శరీరమను మహోత్తమ దేవాలయము ఉండియే యున్నది గదా.

వేదములందు రెండుభాగములు కలవని మీ రెఱిగి యుందురు; కర్మభాగము, జ్ఞానభాగము. రానురాను కర్మలు పెచ్చు పెరిగిపోయి వానిని వివరముగా తెలిసికొనుటకు అసాధ్య మగునంతటి చిక్కులు ఏర్పడినవి. కావున ఉపనిషత్తులందు ఈ కర్మలు ఇంచుమించుగా విసర్జింపబడెను. కాని మృదువిధమున, విశదీకరణరూపమున నిది సాధింపబడెను. పూర్వకాలమున ఈ హోమములు, యజ్ఞములు విశేషముగా నుండెడివి. పిదప తత్త్వజ్ఞులు బయలుదేరిరి. కాని పామరుల చిహ్నములను బలా త్కారముగా లాగివేయుటకు మారుగా, ఈ కాలపు సంస్కర్త లవలంబించు విఘాతమార్గములకు మారుగా పూర్వచిహ్నపు స్థానమున క్రొత్తదాని నొకటి వారికి చూపుచుండిరి. వా రిట్లు బోధించిరి: "అగ్నికి ఈ చిహ్నము కలదుకదా, మంచిది! ఇదిగో భూమి, ఇది మహోకచిహ్నము. ఎంత ఘనతరమైనదో చూడుడు! ఈ చిన్న దేవాలయము కలదుగదా, అదిగో జగ

త్తంతయు దేవళమే! ఇం దెచ్చటనైన నరుడు పూజలు సలుప నగును. నేలమీాద మానవులు వేలువేలు యంత్రములను గీయు చున్నారుగదా, వేదికల రచింతురుగదా. ఇదిగో ఈ మహత్తర మగు వేదిక, సచేతనమగు మానవశరీరము! జడములగు విగ్రహ ములను ఆరాధించుటకంటె ఈ వేదికచెంత పూజలను సలుపుట ఉత్తమోత్తమము.''

ఇప్పుడొక వింత సిద్ధాంతమునకు వత్తము. దానిని నేనే అంతగా గ్రహింపజాలకున్నాను. మీాకేమైన అర్థమగునేమో చూడుడు, చదివి వినిపింతును. తపస్సుచే పునీతుడై జ్ఞానమును పొందిన నరుడు మరణించినప్పుడు అతడు మొట్టమొదట అర్చిస్సు (తేజస్సు) నందు ప్రవేశించును; అర్చిస్సునుండి అహస్సు (పగలు) నందును, అహస్సునుండి శుక్లపక్షమందును, అందుండి ఉత్తరాయ ణపు ఆరు నెలలందును, అందుండి సంవత్సరమునందును, సంవత్స రమునందుండి ఆదిత్యుని (సూర్యుని) యందును, ఆదిత్యునికడ నుండి చంద్రునిలోను, చంద్రునియందుండి విద్యుత్తునందును ప్రవేశించును. విద్యుత్తునందుండగా అతని కొక అమానవ పురుషుడు దర్శనమిచ్చి వానిని (సగుణ) బ్రహ్మమున జేర్చును. ఇది దేవయానము. ఋషులును జ్ఞానులును మరణించినప్పు డీ మార్గమున పోవుదురు. తిరిగి రారు. ఈ సంవత్సరమన నేమో నెలయన నేమో ఈ సంగతులను ఎవడును స్పష్టముగ గ్రహింప జాలకున్నాడు. ఎవరికివారు వేలువేలుగ అర్థము చెప్పుచుందురు. కొందఱు ఇదంతయు అర్థశూన్యమందురు. ఇట్లు చంద్ర సూర్య లోకములకు పోవుట అన నేమో విద్యుత్తును జేరిన వెనుక నొక పురుషుడు వచ్చి జీవునకు తోడ్పడుటనగా నేమో యెవ్వడు నెఱుగడు. హిందువులలో, చంద్రుడు జీవమునకు స్థానమని ఒక నమ్మకము కలదు. అందుండి యీా జీవము ఎటు లవతరించు చుండునో మున్ముందు చూతము. జ్ఞానసిద్ధిని పొందలేకున్నను ఈ లోకమున పుణ్యకార్యములను గావించినవారు చనిపోయి

నప్పుడు మొదట (పొగ) ధూమమును చేరుదురు. అందుండి రాత్రిని తరువాత కృష్ణపక్షమును, పిమ్మట దక్షిణాయనమును, అటనుండి పితృలోకమును, తరువాత ఆకాశమును, పిమ్మట చంద్రలోకమును పొందుదురు. అక్కడ వారు దేవతలకు ఆహారమై, కొంతకాలమునకు దేవతలయి పుట్టుదురు. తమ పుణ్యము వ్యయమగువఱకు అచ్చట వసింతురు. పుణ్యము వ్యయమైపోగానే తిరిగి అదేమార్గమున పుడమికి దిగుదురు. మొదట ఆకాశమయి, పిదప క్రమముగా గాలి, ధూమము. మంచు, మేఘమై, తుదకు వర్షబిందురూపమున పుడమిపై పడుదురు. అంత ఆహారమునజొచ్చి తుదకు ఆ ఆహారమును భుజించినవారికి బిడ్డలయి పుట్టుదురు. మిక్కిలి ఉత్తమ పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమవంశములలో పుట్టుదురు. దుష్కర్ములు హీనజన్మములను, పశుజన్మములను సయితము పొందుదురు. పశువులు సతతము పుడమికి వచ్చుచు పోవుచు నుండును. అందు చేత లోకము ఎన్నడును నిండదు, ఖాళీయై యుండదు.

దీనినుండియు మనము చాలసంగతులు నేర్చుకొనగలము; ముందుముందు ప్రాయశః ఇంకను బాగుగ గ్రహించి, దీని అర్థవిచారణ చేయగలుగుదుము. పరలోకమున నుండువారెట్లు తిరిగివత్తురో తెలుపు భాగము మొదటిభాగముకంటె సుగ్రాహ్యమై యున్నదనవచ్చును. కాని, బ్రహ్మజ్ఞానము లభింపనిది దేవలోకమున స్థిరావాసము ప్రాప్తింపదనుటే ఇందలి సమష్టిభావమని తోచుచున్నది. బ్రహ్మమును తెలిసికొనని మానవులు కొందరు సత్ఫలముల నాశించి లోకమున పుణ్యకర్మము లొనరించి మరణించినచో, వారు వేర్వేఱు ప్రదేశములగుండ చివరకు స్వర్గము చేరుదురు. మనము ఈ పుడమిని జననముగాంచురీతినే వారక్కడ దేవతలకు బిడ్డలుగా జన్మింతురు, పుణ్యము క్షీణమగు వఱకును అందు వసింతురు. 'నామరూపాత్మకమగునది యెల్ల

అశాశ్వతము' అను వేదాంత మూలభావ మొకటి దీనివలన తేలు చున్నది. నామరూపాత్మకము కావున భూలోక మశాశ్వతము. స్వర్గలోకమునకూడ నామరూపములుండును గాన, అదియు అశాశ్వతమై ఉండవలెను. నామరూపములు గలది సమస్తము కాలములోపుట్టి, కాలమునందుండి, కాలమున తుదముట్టవలసి యుండును కాన, శాశ్వతస్వర్గము అను పదము అర్థరహితమగు చున్నది. వేదాంతమున ఇవి స్థిరతరసూత్రములు, అందుచేత స్వర్గములు నిరాకరింపబడెను.

మహమ్మదీయులకును క్రైస్తవులకును స్వర్గము శాశ్వతమైన దను భావము కలదు. అట్టి భావమును మనము సంహితలందును కాంచియుంటిమి. మహమ్మదీయులు దానికి ఒకింత స్థూలతర రూపము నిత్తురు. అయ్యది ఉద్యానవనములతోడను, వానిగుండా సదా ప్రవహించు నదులతోడను ఒప్పారుస్థలమందురు. ఆరేబియా దేశపు మరుభూమియందు నీరు ఎంతయు వాంఛనీయము; కావున మహమ్మదీయులు తమస్వర్గమున పుష్కలముగ జలము ఉన్నటుల భావనచేయుదురు; సంవత్సరమునకు ఆరునెలలు వానలు కురియు దేశమున పుట్టినవాడనుగాన నేను స్వర్గమును పొడి ప్రదేశముగా భావనచేయవలసియుండును. ఆంగ్లప్రజలును అట్లే భావింప గోరుదురు. సంహితయందు చెప్పబడిన స్వర్గములు శాశ్వతములు. అందు మృతజీవులు మనోహర శరీరములను దాల్చి, తమ పితృ దేవతలతో కూడి, మహానందముతో ఉండిపోదురు. అక్కడ వారు తమ మాతాపితలను, బిడ్డలను, బంధువులను, కలిసికొని యిచ్చటివలెనే కాపురములుచేయుచుందురు. కాని ఇచ్చటికంటె ఎంతో ఎక్కువ సుఖమును అనుభవింతురు. ఐహికజీవితమున వాటిలుచుండు బాధలన్నియును, అవరోధములన్నియును అదృశ్య ములగును. అందలి అనుకూలవిషయములును, సౌఖ్యములును మాత్రము నిలిచియేయుండును. నరులు ఇట్టి స్థితిని ఎంతగా సౌఖ్య

ప్రదమని యెంచినను, సౌఖ్యమునకును సత్యమునకును ఎంతో భేదము కలదు. అవి కేవలభిన్నవస్తువులు. అత్యున్నతాగ్రము చేరువఱకును, సత్యము సుఖరహితముగ నెన్నిమోసారులుండును. మానవుని మనుష్యస్వభావము మిక్కిలి పూర్వాచారపరాయణ మైనది. నరుడు ఒకప్పుడు ఒకపనినిచేయును; అటుల ఒకసారి చేయుటవలన దానినుండి విడివడుట కష్టముగా నెంచును. అసౌఖ్యము వాటిలునను భయముచేత మనస్సు నూతనభావము లను స్వీకరింపనొల్లదు.

ఉపనిషత్తులలో ఈ పూర్వపుమార్గమువిడిచి కేవలము వేఱుమార్గము పట్టబడినది. నామరూపాత్మకమైనదెల్ల నాశము కాక తప్పదు కావున, మరణానంతరము పితృదేవతలతోఁగూడి వసింపనగు స్వర్గమును శాశ్వతము కాదని ప్రకటింపబడినది. రూప ముగల స్వర్గములుండెనేని కాలక్రమమున అవి నశింపక తప్పదు. అవి లక్షలకొలది వత్సరములు నిలిచియుండవచ్చునుగాక; తుదకు ఎన్నడో అవియు గతింపకతీరదు. ఈ భావముతోడ మఱొక భావముకూడ ఏర్పడినది: ఈ జీవులు తిరిగి భూలోకమునకు వచ్చి తీఱవలయును; పుణ్యకార్యముల ఫలములను అనుభవించు తావులే స్వర్గములు; పుణ్యఫలము అంతరించుటతోడనే ఈ భూలోక జీవన మునకు మరల రావలసినదే. దీనినిబట్టి ఒకవిషయము తెలమగు చున్నది. 'నిమిత్త' తత్త్వసూత్రము అనెడు కార్యకారణ పరం పరాధర్మమును మానవజాతి బహుపురాతనకాలమునందే గుర్తించి యుండెను. కాని అప్పుడా సూత్రము పసివాండ్రభాషలోవలె, అనగా, కేవలము అపరిణతరూపమున, దెలుపబడినది. తదనం తరము తత్త్వవేత్తలు బయలుదేఱి, దానినే తత్త్వశాస్త్రానుగుణమును తర్కసంప్రదాయానుకూలమును అగు భాషలో ప్రకటించిరి. ఈ ప్రథమరచనలను పఠించువారికి అందు చెప్పబడిన దంతయు అంతరవలోకనమూలమున లభించినట్లు స్పష్టమగును. ఇది ఆచరణ

సాధ్యమగునా యని మీరు నన్నడిగితి రేని అది మొదట అను ష్ఠానరూపమున నుండి తదనంతరమే గదా తత్త్వసిద్ధాంతరూపమును దాల్చినది అని నేను బదులుచెప్పుదును. ప్రథమమున ఈ విషయ ములను కనిపట్టి, వాని అనుభవమునుపొంది, అనంతరముగదా గ్రంథములను వ్రాసిరి. ఆ ప్రాచీన జిజ్ఞాసువులతో ఈ ప్రకృతి మాటలాడినది. పక్షులు వారితో ప్రసంగించినవి; మృగములు వారితో ముచ్చటించినవి. సూర్యచంద్రాదులు వారికి సుద్దులు చెప్పిరి. క్రమముగా వారు వస్తువుల తత్త్వమును గ్రహించిరి; ప్రకృతి హృదయమును పరికించిరి. వారటుల కావించినది మన నముచేతగాదుసుడీ, తర్కబలమువలననుకాదు. ఈ దినములలో ఆచారమైపోయినటుల ఇతరుల మెదడులలోని సరుకును చౌర్యము చేసి గ్రంథములను తయారుచేయుటనుగూడ వారు పూనలేదు. నావలె వారి వీరి గ్రంథములలోని అంశములను తీసికొని ఉపన్యాస ములను కూర్చుటను సయితము వారు అవలంబింపలేదు. ఓర్పు మెయి విషయపరిశీలనముచేసి నూతనాంశములనుగ్రహించుచు, వారీ మూలతత్త్వమును కనుగొనిరి. వారి ప్రధానసాధనము అనుష్ఠానము. ఎప్పటికైనను అదియే కావలయును. మతము అనునది అనుష్ఠానశాస్త్రము. కేవలము దైవప్రోక్తములైన మత ములు ఇదివఱ కెన్నడును లేవు; ఇక నుండబోవు. ప్రథమమున అనుష్ఠానము; తుదను జ్ఞానము ఆత్మలు మరలివచ్చుననుభావము అదివఱకే యున్నది. ఫలాపేక్షఁబూని సత్కార్యములను ఆచరించు పురుషులు ఫలమును పొందుదురు. కాని ఆ ఫలము శాశ్వతము కాజాలదు. ఫలము కార్యమునకు అనురూపమైమాత్రమే యుండ గలదని తెలిపెడు నిమిత్తసూత్రము చక్కగా ఇందు వ్యక్తము కావింపబడినది. కారణము ఎట్టిదో ఫలమును అట్టిదియే. కార ణము పరిమితమైనచో ఫలమును పరిమితమైయుండితీఱును. కార ణము అనంతమైయున్నచో ఫలమును శాశ్వతమై వఱలనగును. కాని ఈ కారణములన్నియు, అనగా పుణ్యకార్యములను సలుపుట

మొదలగు విషయము లన్నియు, పరిమితములగు కారణములే గనుక, శాశ్వతములగు ఫలములను ఒసగజాలవు.

ఇప్పుడు రెండవపక్షమును విచారణకు తీసికొందము. శాశ్వత స్వర్గములుండజాలవు. కావున, ఆ హేతువుచేతనే శాశ్వత నరకములును ఉండజాలవు. నేను నా జీవితమున అనుక్షణము దుష్కార్యముల గావించు దుష్టమానవుడనే అనుకొనుడు. అయి నను నా శాశ్వత జీవనముతోడ పోల్చిచూచినయెడల ఇప్పటి భూలోకజీవితమంతయు అత్యల్పమే కావున, శాశ్వతశిక్షయే యున్నయెడల పరిమితమగు కారణమువలన అపరిమితమగు కార్యము (ఫలము) కల్గుచున్నదనుటేగదా! అది పొసగదు. నా జీవితమంతయు సత్కార్యములనే చేయుచున్నను నాకు శాశ్వత స్వర్గము లభింపజాలదు. అట్లనుటలో అదే పొరపాటు కలదు. ఇంకను మూడవమార్గమొకటికూడ కలదు. బ్రహ్మము నెఱింగిన వారికి అనగా అపరోక్షానుభూతి గడించినవారి కది సమకూడును. మాయావరణమును దాటుటకు ఇదొక్కటే మార్గము. సత్యాను భూతియే యీ మార్గము. సత్యానుభూతి అననేమో ఉపనిషత్తులు విశదీకరించుచున్నవి.

సర్వమును బ్రహ్మమునుండి వచ్చునదేయని, బ్రహ్మము సర్వమునందును కలదని, గ్రహించి శుభమనిగాని అశుభమనిగాని భేదము పరిగణింపకుండుటే దీనిభావము. ఈ జగత్తు మిథ్య అనుటే దాని అర్థము. ఈ జగత్తునే చూడక, స్వర్గనరకముల రెండింటను "బ్రహ్మమును" చూచుటే. జననమరణముల రెండింటను బ్రహ్మ మును గాంచుటే! నేను పైన తెలిసిన వాక్యమునందలి భావసరణి యిట్టిది! ఈ భూమండలము పరమేశ్వరుని విగ్రహమే. ఆకాశము భగవంతుడే; మనమాక్రమించి కూర్చుండిన స్థలము బ్రహ్మమే. సర్వమును బ్రహ్మమయము! దీనిని గ్రహించి సాక్షాత్కారాను భవమునకు తెచ్చుకొనవలయును. ఊరక దీనినిగూర్చి ప్రసంగిం

చుటయు, తలంచుటయు చాలదు. ఇట్టిభావసరణిని అనుసరించి, సర్వమును బ్రహ్మమయమై యీశ్వరాంశతో నిండియున్నదని సాక్షాత్కారమునకు తెచ్చుకొనిన జీవుడు తాను స్వర్గమునకు పోవునో, నరకమునకు పోవునో, మఱెచ్చటికి పోవునో, తిరిగి భూలోకమున జన్మించునో, స్వర్గమున జన్మించునో, అను నిట్టి విషయములు పాటింపడు. అన్ని తావులును ఆ జీవునకు ఒక్కటియే. ప్రతిస్థలమును బ్రహ్మనిలయమే. అన్నిచోటులును పవిత్రములే; స్వర్గమునగాని, నరకమునగాని, మఱెచ్చటగాని, బ్రహ్మమే వానికి సాక్షాత్కరించుచుండును. శుభాశుభములును, జననమరణములును కానిపింపవు; ఒక్క అఖండ పరబ్రహ్మమే యెల్లెడల కానిపించును.

వేదాంత మతానుసారము, ఇట్టి సాక్షాత్కారమును పొందిన నరుడు ముక్తుడు; అట్టిపురుషుడే యీ లోకమున వసించుటకు అర్హుడు. ఇతరులు అర్హులేకారు. పాపము ఎవనికి గోచరించునో అతడు ఈ లోకమున ఎట్లుండగలడు? వాని జీవితము దుఃఖభాజనమగునుకదా, అపాయములను చూచుచుండువాని జీవితము దుఃఖమయము. మరణమును చూచువారి జీవితము దుఃఖరాశియే. బ్రహ్మవిదుడు, అనగా సర్వమునందును బ్రహ్మమును చూచుచుండు పురుషుడు మాత్రమే, యీ లోకమున జీవింప నర్హుడు; ఆతడుమాత్రమే "నేను జీవితానందమును అనుభవించుచున్నాను; ఈ జీవితమున సుఖముగ నున్నాను" అని పలుకగలవాడు. ఈ సందర్భమున వేదములలో ఎక్కడను నరక ప్రశంసయే లేదని మీ రెఱుగుదురుగాక. చాలకాలమునకు పిమ్మట ఆ భావము పురాణములందు తలచూపినది. వేదములను అనుసరించి మనకు రాగల ఘోరతమశిక్ష యీలోకమున తిరిగి జన్మించి, మరల పరమార్థసాధన కవకాశమునొందుటే. ప్రప్రథమము నుండియు నిర్గుణమువైపునకే దృష్టిపోవుచుండినది. బహూకృతులు శిక్షలనుగూర్చిన భావములు మిగుల స్థూలములు. మనవలెనే ఒకని

ప్రేమించుచు మఱొకని ద్వేషించుచు నుండు మానవలక్షణ సమన్వితుడగు భగవంతుడు కలడను భావమునకు మాత్రమే యివి అనుసరణములైనవి. అటువంటి దేవుడు ఉండిననే శిక్షలును బహుమానములు సమంజసములు కాగలవు. సంహితయందు అట్టి దేవుడుండెను. భయము అనుభావము అందు జొచ్చుచుండెను. కాని ఉపనిషత్తులకు వచ్చినతోడనే భయము అనునది అదృశ్యమగుచున్నది; దాని స్థానమున నిర్గుణభావము నెలకొనుచున్నది. నరుడు సదా సగుణమునే గట్టిగ పట్టుకొని యుండుట చేత, సహజముగ వానికి నిర్గుణభావము గ్రాహ్యమగుట దుస్తరము. ఘన మనీషావంతులని పేరొందిన పురుషులు సయితము నిర్గుణబ్రహ్మము అనగానే వెగటుచెందుదురు. కాని నాదృష్టిలో భగవంతుని సాకారుడగు నరునివలె భావనచేయుట బొత్తుగ వెఱ్ఱిగ తోచును. ఏది శ్రేష్ఠతరము, సచేతనుడగు భగవంతుని భావనయా లేక నిర్జీవుడగు భగవంతుని భావనయా? ఎవరును కాంచనట్టియు, ఎవరును ఎఱుగనట్టియు బ్రహ్మమా, లేక ఎఱుగబడినట్టి బ్రహ్మమా శ్రేష్ఠుడు?

నిర్గుణబ్రహ్మము సచేతనుడయిన దేవుడు; ఒకతత్త్వము. సగుణబ్రహ్మము ఒకపురుషమాత్రుడే! నిర్గుణబ్రహ్మమో దేవుడు, నరుడు, జంతువు; మఱియు నింక మనము గ్రహింపజాలనిదెల్లను కూడనై వెలుగును! నిర్గుణ సగుణముల భేదమిది. నిర్గుణమున సగుణరూపములన్నియు చేరియే యున్నవి; ఈ జగత్తులోగల సర్వమేగాక, పరిపూర్ణతయెల్ల దానియందిమిడి యున్నది. "ఒక్క అగ్నియే సృష్టిలో ప్రవేశించి అనేకరూపముల దాల్చుచున్నది. అయినను దాని అఖండస్వరూపము ఇంకను ఎంతయో కలదు." నిర్గుణతత్త్వమన ఇటువంటిది!

మనము సచేతనుడగు భగవంతునే ఆరాధింప కోరుచుందుము. భగవంతుడు కాని దానిని దేనిని నా జీవితమున నేను

కాంచియుండలేదు. మీరును కాంచియుండలేదు. ఈ కుర్చీని చూచుటకు మీరు మొదట భగవంతుని చూచి, అనంతరము వానియందే వాని ద్వారముననే కుర్చీ కాంచగల్గుచున్నారు. "అహమస్మి" నేను కలను అనుచు ఆయన యెల్లెడల వెలుంగు చున్నాడు. ఈ "అహమస్మి" భావము నీ యనుభవములోనికి వచ్చినప్పుడు సత్తాస్వరూపపు ఉనికి నీకు తెలియవచ్చును. మన హృదయములందును, ప్రతిజీవియందును మన మాయనను కాంచ లేని యెడల, ఆయనను చూచుటకై మన మెక్కడికి పోవలెను? "నీవే పురుషుడవు; నీవే స్త్రీవి; నీవే బాలుడవు; నీవే బాలికవు; కఱ్ఱపై ఊనుకొని తడబడుచుపోవు ముసలివి నీవే; పూర్ణ జవసత్త్వములు గలిగి గర్వమున నడయాడు యువకుడవు నీవే." అస్తిత్వము గల సర్వము నీవే! ఈ సృష్టియందుగల సర్వము తానై వెలుగు సచేతనుడగు బ్రహ్మమవు నీవే! ఎక్కడనో, ఏదో తెరచాటున, ఎవనికిని ఎన్నడును సాక్షాత్కరింపకయుండునని మన మనాది సిద్ధముగ భావించుచుండు దేవునికి మాఱు ఇట్టి దేవుని భావన అనేకులకు మిక్కిలి విరుద్ధముగ తోచును. తమ్ము అనుసరించి నడచుచు, తమ మందలింపులకు చెవియొగ్గుచు, తాము నిర్ణయించు మార్గమున జవదాటక వర్తించినయెడల, మరణించునప్పుడు మనము దేవుని ప్రత్యక్షముగ చూచుటకయి తా మొక అధికార పత్రమును ఇచ్చెదమని మతగురువులు మనకు నమ్మకము జెప్పుదురు! అర్థశూన్యమగు మతగురు సంప్రదాయపు బూటకపు రూపములు తప్ప ఈ స్వర్గములన్నియు ఏమి?

కాని నిర్గుణతత్త్వము విధ్వంసన శీలమైనదనుట తథ్యమే! ఇయ్యది అర్చకుల, చర్చీల, దేవళముల వ్యాపారమునంతయు నశింపజేయును. హిందూదేశమును ఇప్పుడు క్షామము పీడించు చున్నది. కాని చక్రవర్తినైనను పణముగా కొనజాలునంతటి రత్నాభరణరాసులతో నొప్పు దేవళములు ఎన్నియో కలవు!

నిర్గుణతత్త్వమును ప్రజలకు బోధించిరేని అర్చకులవృత్తి నాశమై పోగలదు. అయిననేమి? అర్చకుల మోసములు లేక, యీ తత్త్వమును అస్వార్థబుద్ధితో ప్రజలకు బోధింపవలసియేయున్నది. నీవు బ్రహ్మమవు, నేను బ్రహ్మమను. ఎవరు ఎవరికి లోబడుట? ఎవరు ఎవరిని పూజించుట? నీవు ఈశ్వరుని ఉత్తమోత్తమాలయమవు. ఒక దేవాలయమునుగాని, విగ్రహమునుగాని, బైబులును వేదమును గాని యారాధించుట కంటె నిన్ను ఆరాధించుట నాకిష్టము. కొందరు జనులభావము లంత పరస్పర భిన్నములుగా నుండుట యేలనో! వారు చేతిలోనుండి జారిపోవు చేపలవలె నున్నారు. తామెంతో సుస్థిరానుష్ఠానపరులమని చెప్పుకొందురు. మంచిదే. కాని ఇచటనే పూజల నర్పించుటకంటె, నిన్నే ఆరాధించుటకంటె, ఉత్తమానుష్ఠానము ఏమి యుండగలదు? నేను నిన్ను చూచుచున్నాను, స్పృశించుచున్నాను. నీవు బ్రహ్మమవని నే నెఱుగుదును. 'అల్లా' వినా దైవము లేదని మహమ్మదీయుడు చెప్పుచున్నాడు. దైవముగానిది ఏదియు లేదని వేదాంతము ఉద్ఘోషించుచున్నది. ఇది వినుట మీలో చాల మందికి భీతావహముగ నుండవచ్చును. కాని ముందుముందు మీరు దీనిని గ్రహింపజాలుదురు. సచేతనుడగు భగవంతుడు మీలో అధివసించుచున్నాడు. అయినను మీరు చర్చీలను, దేవాలయములను కట్టించుచు, వెఱ్ఱి మొఱ్ఱి అభూతకల్పనలనన్నిటిని నమ్ముచున్నారు. మానవశరీరములో అధివసించు జీవాత్మ మాత్రమే పూజార్హమగు దైవముసుడీ! అన్ని జంతువుల తనువులును దేవళములు అనుటయు నిజము. అయినను నరశరీరము ఉత్తమోత్తమమై, దేవాలయములలో తాజ్ మహాలువలె చెన్నారుచున్నది. అందు నేను పూజలొనరింపజాలనైతినా, ఇంకే దేవాలయములును ప్రయోజనకరములు కావు. ప్రతి నరుని శరీరమునందును ఆసీనుడై వెలుగు భగవంతుని నేను సాక్షాత్కారము చేసికొనినతోడనే, ప్రతి మానవుని యెదుటను

భక్తిపూరితుడనై నిలిచి అతనియందలి దేవుని నేను దర్శింపజాలిన తోడనే, ఆ క్షణముననే నేను బంధవిముక్తుడ నగుచున్నాను. నన్ను బంధించు సర్వమును పటాపంచలు కాగలదు. నేను సర్వముక్తుడనై నిలుతును.

అన్నింటిలోను ఇది మిగుల ఆచరణీయమగు ఆరాధన. దీనికి సిద్ధాంతములతో పనిలేదు. ఊహాలతో పనిలేదు. అయినను దీనిచే పలువురు భీతిల్లుచున్నారే! ఇది సరికాదందురే! ఎక్కడనో స్వర్గములో దేవుడుండి, ఎవరితోడనో తానే దేవుడనని చెప్పినట్లు తమపూర్వు లెవరో పలికిరని, పురాతనాదర్శములనుగూర్చి సిద్ధాంతములను అల్లుచు గూర్చుందురే! అప్పటినుండియు కేవలము సిద్ధాంతములే మన వెంటబడినవి. వారి అభిప్రాయములో అదే ఆచరణయోగ్యమట! మనభావములు అనుష్ఠానమునకు అనర్హము లట! ప్రతివాడును తన ప్రత్యేకమార్గమును అనుసరింపవలయునని వేదాంతము బోధించుటయు నిజమే, కాని మార్గమనగా పరమ గమ్యము కాదుగదా. స్వర్గమునందు భగవంతుడు కలడని ఆరాధనలు సలుపుట మొదలగు ఇట్టి విషయములును దోషములు కావు; కాని అవి సత్యమును జేర్చు సోపానమాత్రములే గాని సత్యముకాదు. అవి మంచివి; మనోహరములే. అందు కొన్ని మహాద్భుతభావములు ఇమిడియున్నవి. కాని వానివిషయమున వేదాంతము పలుకునది ఇది : ''మిత్రమా, అజ్ఞేయుడు అని నీవు ఆరాధించు దైవమవు నీవే యని భావించి నేను నిన్ను పూజింతును. అజ్ఞేయుడని భావించి ఎవ్వనికి పూజలర్పింపగోరి, ఎవ్వరికొఱకు జగమునం దెల్లెడల నీవు వెదుకుచున్నావో, ఆతడు సర్వకాలమందు నీతోడనే ఉన్నాడుసుమీ. వాని ద్వారముననే నీవు జీవించు చున్నాడవు. ఆయన సదా జగద్రిష్టమై యొప్పుచున్నాడు. 'ఆమ్నాయము లన్నియు ఎవని సేవించుచున్నవో', యింతేల, 'అహం' అను అఖండభావనతో ఎవడు సర్వకాలమందు ప్రవేశించు

చున్నాడో, అతడు ప్రకాశించుటచేతనే ఈ సృష్టియెల్ల ప్రకాశించుచున్నది. ఆతడే జగత్తునకు ప్రాణమును తేజమునై యున్నాడు. ఆ 'నేను' నీలో లేనియెడల నీవు సూర్యుని కాంచనే లేవు. సర్వమును తమోరాశియై పోవును. ఆతడు ప్రకాశించుట చేతనే నీవు జగమును కాంచగల్గుచున్నావు.''

'దీనివలన మహానర్థము వాటిల్లినదా?' అని సామాన్యముగా కొందఱు ప్రశ్నింతురు. మనలో ప్రతివాడును ''అహం బ్రహ్మాస్మి—నేను బ్రహ్మమను; నేనేది ఒనరించినను, నేనేది తలంచినను, అదెల్ల ధర్మమేయగును. దేవుడు దోషము చేయగలడా?'' అని భావించును. ఇట్టి అపార్థమున కవకాశముకలదని అంగీకరించినకూడ అట్టి అపాయమే యిదివఱకు సయితము లేదని ఋజువేమి? తమనుండి వేఱై యెక్కడనో స్వర్గమందున్న భగవంతుని వారు పూజించుచున్నారు. వానినిగూర్చి వారు భయపడుచున్నారు. ఈ భయముతో గజగజలాడుచు జన్మించుచున్నారు. ఆజన్మాంతము వారిట్లు వణకుచునే యుందురు. సరే, దీనివలన లోక మున్నతికి వచ్చినదా? సగుణబ్రహ్మమును తెలిసికొని వానిని ఉపాసించువారిలోను, నిర్గుణబ్రహ్మమును తెలిసికొని వానిని ఉపాసించువారిలోను, ఎవరినుండి యెక్కువ మంది లోకోద్ధారకులు బయలుదేరిరో విచారింపుడు. మహాకార్యదీక్షాపరులును, మహత్తర ధర్మతత్పరులును ఎవరియందు దలచూపిరి? నిర్గుణోపాసకులందుండియే అనుట తథ్యము. భయమునుండి ధర్మతత్పరత యెట్లు వెలువడగలదు? అదెన్నడును పొసగదు. ''ఒక రింకొకని కాంచుటయు, ఇంకొకనికి అపకారము చేయుటయు, మాయావరణలోని విషయములు. ఒక రింకొకనిని చూడక, ఇంకొకనికి అపకారము చేయక, సర్వమును ఆత్మయేయై వెలుగుచో, ఎవడు ఎవని చూచుట? ఎవడు ఎవని గుర్తించుట?'' సర్వమును అతడే, మఱియు, సర్వమును ''నేనే''. జీవుడు పవిత్రుడైనాడు. అప్పుడే ప్రేమ అన నేమో మనకు తెలియ

వచ్చును. ప్రేమ భయమునుండి ఉద్భవము కాజాలదు. స్వేచ్ఛయే ప్రేమకు మూలకందము. మనము నిజముగా ప్రపంచమును ప్రేమింప మొదలిడినప్పుడే భ్రాతృత్వము అన నేమో, మానవ జాతి అన నేమో, మనకు అర్థమగును. అంతవఱకును అది అర్థము కాజాలదు.

కావున, నిర్గుణభావము ప్రపంచములో మహానర్థమునకు మూలమగును అని చెప్పుట యుక్తముగాదు. సగుణారాధనయే గదా ప్రపంచములో ఎన్నో అనర్థములకు మూలమై మతద్వేష ములనుబుట్టించి, లోకమును రక్తములోముంచి, నరులు ఒండొరు లను చీల్చి చెండాడునటుల చేసినది! "నా దేవుడే ఉత్తమోత్త ముడు; రమ్ము, కలహించి, ఈ సత్యమును నిరూపించుకొందము". లోకమునందు ఎల్లెడలను ద్వైతమువలన కలిగిన దిదియే. అనంతమై యొప్పు ఆత్మ ఒక ప్రాతపడ్డ ఇఱుకుగాడిలోపడి జీవించు టకును చచ్చుటకును ఎటొడంబడగలదు. బయటికి, పూర్ణ ప్రకాశములోనికి, రండు! తేజోమయమగు జగత్తులో ప్రవే శింపుడు! ఈ జగమునగల సర్వమును మీయదియే. చేతుల జాచి దానిని ప్రేమాలింగనము చేసికొనుడు. అటుల కావించు బుద్ధి నీకు వొడమెనా నీ వప్పుడు భగవంతుని స్పృశించినట్లే!

అల బుద్ధుని ఉపదేశవాక్యము మీకు జ్ఞప్తి యున్నదా? అతడు తన ప్రేమసంకల్పమును ప్రాక్పశ్చిమోత్తర దక్షిణ దిశల కును, క్రిందికిని మీదికిని సకల దిక్కులకును ప్రసరింపజేసి, సాంద్రమును, ఘనమును, అనంతమును అగు తనప్రేమతో జగము నెల్ల నింపుచుండెనటగదా! అట్టి భావము మీకు కుదిరినప్పుడు నిజమైన మూర్తిమత్త్వము సిద్ధించినట్లు. జగమంతట ఒక్కపురుషుడే నిండి వెలుంగును. అల్పవిషయములను విడిచివేయుడు. పరిపూర్ణము కొఱకై అల్పభావములను త్యజింపుడు; శాశ్వతానందముకొఱకు క్షుద్రభోగముల విసర్జింపుడు. అందుచే సమస్తమును మీకు

నిలిచియే యుండును. ఏలనన, సగుణభావము నిర్గుణతత్త్వమున ఇమిడియే యున్నది. అనగా, బ్రహ్మము నిర్గుణుడును సగుణుడును గూడ అయియున్నాడు. అనంతరూపుడగు నరుడు, అనగా నిర్గుణుడగు నరుడు, దృష్టిగోచరుడై నరుడుగా కానిపించుచున్నాడు. పరిపూర్ణరూపములమగు మనము చిన్న చిన్న భాగములలో ఇమిడి మితత్వమును ఆరోపించుకొన్నాము అనవచ్చును. పరిపూర్ణతయే మన యథార్థస్వభావమని వేదాంతము బోధించుచున్నది. ఆ పరిపూర్ణత ఎన్నడును సమసిపోదు. శాశ్వతముగా నిలిచియుండును. మన మెడచుట్టి పట్టుకొని కించిత్వమునకు పడలాగు గొలుసువంటి కర్మసూత్రమున చిక్కుకొని మనము పరిమితిని అంగీకరించుచున్నాము. ఆ గొలుసును తెగద్రేయుడు; ముక్తులరు కండు! ఆ సూత్రమును అడగద్రొక్కి వేయుడు. మానవతత్త్వమున సూత్రములు లేవు. విధివ్రాత యనునది లేదు. గతియును లేదు. అనంతమును నియమించు సూత్ర మెట్లుండగలదు? ముక్తి దాని సంకేతము! ముక్తి దాని స్వభావము; ముక్తి దాని జన్మస్వాస్థ్యము. ముక్తులరై నపిమ్మట మీ కిష్టమువచ్చినన్ని మూర్తిమత్త్వములను ఆరోపించుకొనుడు, అప్పుడు మనము నాటకరంగమున బిచ్చగాని పాత్రము ధరించిన నటునివలె నుందుము. వీథులలో తిరిపెమెత్తు నిజమైన బిచ్చగానికిని, ఆ నటునికిని, భేదము తలపోయుడు. స్థలమొకటియే కావచ్చును. ఉడుపులును ఒక్కరీతియే కావచ్చును; కాని నిజముగా ఎంత భేదము గలదో చూడుడు! ఒకనికి దారిద్ర్యము వినోదమూలము. రెండవయతనికి అత్యంతదుఃఖభాజనము. ఈ భేదమునకు హేతు వేమి? ఒకడు స్వతంత్రుడు; రెండవవాడు బద్ధుడు. నటునకు తన దారిద్ర్యము సత్యముకాదనియు, తాను ఊరక క్రీడార్థము ఆరోపించుకొనినదే అనియు తెలియును. రెండవయతడో అది తన నిత్యదశయే యనియు, తనకు ఇష్టమున్నను లేకున్నను దాని ననుభవించియే తీరవలయుననియు ఎఱుంగును. ప్రకృతిధర్మ

మిట్టిది. మన సత్యస్వభావమును గ్రహించువఱకును మనము బిచ్చగాండ్రమే. ప్రకృతిలోని ప్రతిదానిచేతను నిటునటు తన్నులు తినుచుండవలసినదే. సృష్టిలోని ప్రతిదానికిని దాస్యము చేయవలసినదే. సాహాయ్యమునకై అంగలార్చుచు ప్రపంచమంతట తిరుగాడవలసినవారమే. అయినను సాహాయ్యము మాత్రము ఎందుండియు లభింపదు. ఎచ్చటను లేని భావకల్పితుల నెవరినో గూర్చి మొఱపెట్టుకొందుము. కాని నిరుపయోగము. ఇంకను ఇంకను అది లభింపగలదను పేరాశ పీడక యేడ్చుచు, విలపించుచు, దేవురించుచునే ఉందుము. ఇట్లొక జన్మ గడచును; ఇంకొకటి వచ్చును; కాని వెనుకటి ఆటయే సాగును.

స్వాతంత్ర్యము పూనుడు. ఏదిగాని, ఎవరుగాని, ప్రసాదింపగలరని నమ్మకుడు. మీ పూర్వజన్మలను వెనుకకు తిలకించితిరేని, ఇతరుల సాహాయ్యమును వేడుచు సదా మీరు వాపోవుచునేయుంటిమనియు, కాని అది మీకు ఎన్నడును ప్రాప్తించియుండలేదనియు, మీరు తప్పక గ్రహింపగలరు సుడీ! ఏదేని సాహాయ్యము మీకు చేకూరినచో అది మీ అభ్యంతరమునుండియే వచ్చియుండెను సుడీ! మీరు దేనికై పాటుపడితిరో అదియే (ఆ కర్మ, ) మీకు ప్రాప్తించినది. అయినను సదా మీరు ఇతరుల సాహాయ్యమునకై దేవిరించుచుండుట ఆశ్చర్యము. శ్రీమంతుని ఇంటిచావడి ఆశ్రితులతో సంతతము నిండియుండును; కాని అందు గాన్పించువారు మారిపోవుచునే యుందురు. ఈ బిచ్చగాండ్రు ఆ శ్రీమంతునివలన తమకు గొప్పమేలు చేకూరునని ఆశపడుచుందురేగాని, వారి కట్టిది ఎన్నడును లభింపదు. అటులనే ఆశలపై ఆశలు పెంచుకొనుచు మన జన్మలనన్నియు ఆశలతోనే గడపుచుందుము. ఈ ఆశలు తుదముట్టుట యుండదు. ఆశను విడనాడుమని వేదాంతము బోధించుచున్నది. మీరు దేనినైన ఆశింపనేల? సకలము మీయదియేగదా! ఇంతేల? సర్వము మీరు కారే? దేనికొఱకై మీరు అర్థించుట? ఒకరాజునకు పిచ్చియెత్తి,

తన దేశప్రభువును కాంచవలయునని యింటింటను వెదుక మొదలిడెనట! తానే ప్రభువై యుండగా వానికి ప్రభువు గాన్పించు టెట్లు? తన దేశములోని ప్రతిగ్రామమున, ప్రతినగరమున, ఇంటింట ఏడ్చుచు, విలపించుచు వెదకెను. కాని నిరుపయోగమయ్యెను. తానే ప్రభువై యుండగా ఆ వెదకులాట ఎట్లుపయుక్తము కాగలదు? కావున మనమే బ్రహ్మమను ఎఱుకనుపొంది, బ్రహ్మము కొఱకని వెడగులరీతి ఎక్కడనో వెదకులాడుట మానదగును. మనమే బ్రహ్మమని గ్రహించినచో ఆనందము నందగలము, సంతృప్తియు కలుగును. కావున మీ పిచ్చిపోకడల నన్నిటిని కట్టిపెట్టి, నాట్యరంగమునందలి వేషధారివలె, ఈజగమున మీపాత్రను నిర్వహింపుడు.

ఇప్పుడు నీ దృష్టియే మాఱిపోయినది. ఈ జగత్తు శాశ్వత బంధనాగారముగ నుండుటకు మారుగా నాట్యరంగముగ మారిపోయినది. స్పర్థకు నిలయమగు ప్రదేశముగ ఉండుటకు మారుగా ఆనందనిలయమై యొప్పినది. సంతతవసంతము, ఎక్కడ చూచినను పుష్పవికాసములే, భ్రమరనాట్యములే! నరక కూపమై కాన్పించుచుండిన ఈ ప్రపంచమే ఇప్పుడు స్వర్గతుల్యమైనది, బద్ధులకు ఈ లోకము ఘోరహింసారంగముగా తోచును. ముక్తులైనవారి దృష్టిలో ఇది ఆనందసాగరమే! ఈ ఒక్క జీవితమే విశ్వజీవనము, స్వర్గాదిలోకములన్నియు ఇక్కడనే యున్నవి. నరరూపమునకు మూలములగు దేవతలందఱు ఇక్కడనే యున్నారు. దేవతలు తమపోలికలో నరుని సృష్టిచేసి రనుట అబద్ధము. నరుడే దేవతలను సృష్టించుచున్నాడు. దేవరూపములకు మూలములగు మూర్తులు ఇక్కడనే యున్నారు. ఇంద్రు డిక్కడనే యున్నాడు, వరుణు డిక్కడనే యున్నాడు. సకలదేవతలు ఇక్కడనే యున్నారు. మన ప్రతిరూపములను మనమే ఇట్లు ఆవిష్కృతి చేయుచున్నాము. ఈ దేవతల మూల మూర్తులము మనమే. మనమే నిజమగు దేవతలము. పూజ

లన్నియు అర్పింపవలసిన దేవతలము మనమే. వేదాంతాదర్శ మిది! ఇదెంతయు అనుష్ఠానయోగ్యము గదా, మనము స్వతంత్రులము అయిన పిమ్మట అత్యాందోళనము అవసరము లేదు. సంఘమును త్రోసిపుచ్చు అగత్యముండదు. ఏ యడవిలోనో, యే గుహాంతరములోనో చావనెంచి, పరుగిడ నక్కఱలేదు. మనము ఉన్నతావుననే నిలుతుము. కాని సర్వమును గ్రహించి యుందుము. పూర్వపు ప్రకృతి వికారములే యుండును. కాని వానిగూర్చి నూతనభావము అమరియుండును. ఇప్పుడు మన మింకను ప్రపంచమును గ్రహింపలేదు. ముక్తి లభించినప్పుడు మాత్రమే ప్రకృతి యిట్టిదని తెలిసి దాని స్వభావమును పూర్ణముగ గ్రహింపజాలుదుము. అప్పుడు ధర్మసూత్రమనునది, దైవసంఘటన మనునది, లేక బ్రహ్మవ్రాత యనునది, మన స్వభావములోని అత్యంతల్పాంశమే యని గ్రహింతుము. ఇదంతయు నొకపక్షము మాత్రమేయనియు, రెండవపక్షమున మొదటినుండియు శాశ్వత ముక్తి నిలిచియుండెననియు మనకు తెలిసిపోవును. ఈ రహస్యము మనకు తెలిసియుండకపోవుటచేతనే, వేటగానిచే దరుమబడు కుందేలులీల తలను నేలలోదూర్చి ముప్పు తప్పించుకొన జూచు చున్నాము. భ్రమకులోనై మన నిజస్వభావమును విస్మరింప జూచుచున్నాము; కాని అట్లు చేయలేకున్నాము. మన సత్య స్వభావము ఎప్పుడును మనలను ఆహ్వానించుచునే యున్నది. భగవంతునికొఱకుగాని, ఆయా దేవతలకొఱకుగాని, బాహ్య స్వాతంత్ర్యముకొఱకుగాని దేవులాడుట యంతయు, మన సత్య స్వభావమును తెలిసికొనుటకై మనము సాగించు అన్వేషణమే సుడీ! మనము ఆ వాణిని అన్యథా తలచితిమి. అయ్యది అగ్ని నుండియో, ఏ దేవతనుండియో, సూర్యునినుండియో, చంద్రుని నుండియో, నక్షత్రములనుండియో, వచ్చుచున్నదని భ్రమించితిమి. తుదకు అది మన అభ్యంతరమునుండియే వచ్చుచున్నదని ఎఱింగితిమి. శాశ్వతముక్తినిగూర్చి దెలుపుచుండు ఈ నిత్యవాణి

మనలోపలనే యున్నది. దాని మధురగానము సదా సాగుచునే యున్నది. ఆత్మనుండి వెలువడు ఈ గానమున ఒక అంశము భూమిగను, ప్రకృతి ధర్మసూత్రముగను జగత్తుగను, రూపాంతరము పొందినది. కాని అది సదా మనదేసుడీ! నిరంతరము మనదై యే యుండును. వేయేల, మానవుని సత్యస్వరూపమును ఎఱుగుటయే వేదాంతాదర్శము! అదిగావించు హెచ్చరిక ఇదియే: ప్రత్యక్ష బ్రహ్మస్వరూపమే యగు నీ సోదర మానవుని నీవు ఆరాధింపజాలవేని, అవ్యక్త పరబ్రహ్మమును నీవు ఎట్లుపాసన చేయగలవు?

మీకు బైబులులోని వాక్యము జ్ఞప్తిలేదా? "నీవు కన్నులార చూచు నీ సోదరుని ప్రేమింపజాలనియెడల నీవు చూడజాలని దేవు నెట్లు ప్రేమింపగలవు?" నరుని ముఖములో మీకు బ్రహ్మము కానరానియెడల, మేఘములందును, స్తంభమును నిర్జీవమును అగు జడపదార్థముతో చేసిన విగ్రహములందును, నీ మెదడు సృష్టించు కల్పితగాథలందును మీ రెటుల ఆ బ్రహ్మము జాడ కనుగొనగలుదురు? మీరు స్త్రీలయందును, పురుషుల యందును భగవంతుని కాంచజాలిననాటినుండియే మీరు మతాసక్తి కలవారని నే నెంతును. అప్పుడే 'కుడిచెంపపై కొట్టినవానికి ఎడమచెంపను త్రిప్పుట' అన నేమో మీకు తెలియగలదు. మీరు నరుని బ్రహ్మముగా చూడగలిగినప్పుడే సర్వమును, పెద్దపులి సయితము, ప్రేమార్ద్రమై మీకు కాన్పించును. మనతండ్రి, మనతల్లి, మనస్నేహితుడు, మనబిడ్డ మొదలగు వివిధరూపములను దాల్చి మనకడకువచ్చి దర్శనమిచ్చునది ఆ బ్రహ్మమే, ఆ శాశ్వత దివ్యస్వరూపుడే అని గుర్తింతుము. వారు మనతోడ లీలలు సలుపు మనయాత్మస్వరూపములే అగుదురు.

ఇట్లు మన యైహిక బాంధవ్యములు పారమార్థికరూపముల నెట్లు తాల్పగలవో, భగవంతునికిని మనకును గల సంబంధము సయితము ఈ రూపములలో నొకదానిని దాల్పవచ్చును. అనగా

మనము భగవంతుని తండ్రిగాగాని, తల్లిగాగాని, నెయ్యునిగా గాని, ప్రియునిగాగాని భావింపవచ్చును. భగవంతుని తండ్రియని పిలుచుటకంటె తల్లియనుట భవ్యతరము; నెయ్యుడనుట యింకను ఉన్నతమైనది. ప్రియునిగా భావించుట ఉత్తమోత్తమము! ప్రియుని ప్రేయసిని అభేదముగా చూడజాలుట వీనియన్నిటికన్న పరమోత్తమ భావన యగును. పరిషియను కథ ఒకటి గలదు. మీరు దానిని వినియుందురు. ప్రియుడొకడు తనప్రియురాలి యింటికివచ్చి తలుపుతట్టగా "నీ వెవరవు?" అని అడుగుటయు, "నేనే" అని అతడనుటయు తటస్థించెను. అప్పుడు తలుపు తెఱువబడలేదు. మూడవతడవ వచ్చినప్పుడు "ఎవరక్కడ?" అని లోపలినుండి వచ్చు ప్రశ్నకు అతడు "ప్రియురాలా, నీవే నేను" అనగానే తలుపు తెఱువబడెనట. భగవంతునికిని మనకును గల సంబంధము ఇటువంటిది! ఆత డన్నిటను కలడు. సర్వమును ఆతడే! ప్రతిస్త్రీయు, ప్రతిపురుషుడును కేవలానందస్వరూపుడగు బ్రహ్మమే! భగవంతుడు అజ్ఞేయుడని యెవ్వరనిరి? ఆయనను వెదకి కనుగొనవలయునని ఎవ్వరనిరి? ఎల్లప్పుడును మనము భగవంతుని ఎఱిగియే యున్నాము. సదా వానిలోనే వసించు చున్నాము; ఎల్లెడల అతడు తెలియవచ్చుచునే యున్నాడు; నిత్యము పూజలనే అందుకొనుచునే యున్నాడు.

ఇతర పూజావిధానములును దూష్యములు కావను విషయము ఇంకొకటి కలదు. ఈ విషయమును జాగ్రత్తగా జ్ఞప్తినుంచుకొనవలయును. మనకెంత మోటుగా కనబడినను సరే, అర్చనావిధానములతో, ఆకృతికల్పనతో భగవంతుని పూజించువారు దోషులుకారు. ఒకసత్యమునుదాటి మఱొక సత్యమును, క్షుద్రసత్యమునుదాటి ఉత్తమసత్యమును చేరుటకై నరుడు కావించు యాత్రయే యది. చీకటి అనునది అల్పతర ప్రకాశమే; దోషము అనునది అల్పతరగుణమే. అపవిత్రత అనగా అల్పతరపవిత్రతయే! మన మింతకుపూర్వము నడచివచ్చిన

మార్గముననే యితరు లిప్పుడు వచ్చుచున్నారు అను జ్ఞానముతో సానుభూతి వహించి ప్రేమదృక్కులతో వారిని ఆదరించుట మన విధియని సదా మదినుంచుకొనవలయును. మీరు ముక్తులరైతి వేని, వెనుక ముందుగా అందఱును ముక్తులగుదురని తెలిసికొనుడు. మీరు ముక్తినందినచో అనిత్యత నీకు ఎట్లు గోచరింపగలదు? మీరు నిజముగా పవిత్రులైతి రేని నీకు అపవిత్రమగునది కనబడు టెట్లు? అభ్యంతరమున గలదే గదా బాహ్యమున గలదియును! మనలో దోషము లేనిది దోషమును గుర్తింపనేలేము. వేదాంతసిద్ధాంతమున అనుష్ఠానాంశములలో ఇది ఒకటి. దీనిని మన జీవితాచరణములందు జొన్పుదుముగాక. మన మీ యైహిక జీవిత మంతయు దీనిని అనుష్ఠించుటకొఱకే. కాని, ఇందుచే మన కొక మహాలాభముకూడ చేకూరుచున్నది. సత్యస్వరూపమై వెలుగు బ్రహ్మము మనలోపల ఉన్నదనియు, అది మనజన్మస్వామ్యమనియు, దానిని మనము ప్రకాశమునకు తెచ్చి ప్రస్ఫుటముగావించుటే కొఱవడియున్నదనియు, తెలిసికొనుటవలన, అతృప్తితోను, అసంతుష్టితోను, పనిచేయుటకు మారుగా సంతుష్టులమై తృప్తివహించి పాటుపడుదుము.



# తృతీయ భాగము

(లండన్ ఉపన్యాసము ; 17-11-1896)

నారదుడను ఋషి సనత్కుమారుడను మఱొక ఋషి యొద్దకేగి వివిధప్రశ్నము లడుగుచు 'వస్తుజాలసృష్టికి ఆత్మ మూలమా?' అని ప్రశ్నించినటుల ఛాందోగ్యోపనిషత్తున చదువు దుము. అంత సనత్కుమారుడు క్రమక్రమముగ మెట్టుమెట్టుగ నడుపుచు, ఈ భూమికంటె ఉత్తమమైనది ఒకటి గలదనియు, దానికంటెను ఉత్తమమైనది ఇంకొకటి గలదనియు, ఇట్లు చెప్పుచు పోగా, ఆకాశమనగా ఏమి? అను విచారణ దగ్గఱకు వచ్చెను. ఆకాశము తేజస్సుకంటె ఉత్తమమైనది; ఏలనన ఆ ఆకాశ మందు సూర్యుడు, చంద్రుడు, మెఱుపు, నక్షత్రములు, అన్నియు ఉన్నవి. ఆకాశమందే మనము వసించుచున్నాము; మఱియు ఆ ఆకాశమందే మనము లయమగుచున్నాము. అప్పుడు అంత కంటె ఉత్తమమైనది ఏదేని కలదా? అను ప్రశ్న బయలు దేఱగా, సనత్కుమారుడు ప్రాణము అనునది కలదనును. వేదాంత సిద్ధాంతానుసారము జీవతత్త్వమే ప్రాణము. అదియు ఆకాశము వలె సర్వత్ర వ్యాపించియుండు తత్త్వము. తనువునగాని మఱెక్కడగాని గల సమస్త చలనమును ప్రాణమువలననే కలుగు చున్నది. అది ఆకాశముకంటె ఎక్కువది. దాని ద్వారముననే సమస్తమును జీవించుట. ఈ ప్రాణమే తల్లియందును, తండ్రి యందును, సోదరియందును, గురువునందును కలదు. ఈ ప్రాణమే జ్ఞాత.

మఱొక ప్రకరణము నిప్పుడు మీకు చదివి వినిపింతును.

శ్వేతకేతు వనునతడు బ్రహ్మమునుగూర్చి తనతండ్రిని ప్రశ్నించును. తండ్రి వానికి వివిధవిషయములను బోధించి యిట్లు

ముగించును. ''ఈ వస్తుజాలమునకు అంతటిలోగల సమవాయ కారణము * ఏదియో, అదియే వాని ఉపాదాన కారణమును † అగుచున్నది. అదియే సర్వము; అదియే సత్యము; ఓ శ్వేతకేతూ, ''తత్త్వమసి (అది నీవే)'' ఇట్లనుచు అనేక సాదృశ్యముల తెలుపును. ''ఓ శ్వేతకేతూ, తేనెటీగ అనేకపుష్పములనుండి తేనెను ప్రోగుచేయును. ఆయా తేనెలు తాము భిన్నభిన్నములగు వృక్షములనుండియు, పుష్పములనుండియు వచ్చిన సంగతి నెఱుగవు కదా. అట్లే, మనమందఱము ఆసత్తను చేరిన పిమ్మట ఒకప్పుడు వేర్వేఱై యుంటిమని ఎఱుగకుందుము. ఆ మూలసూక్ష్మతత్త్వము ఏదియో, అదియే సర్వమునకు ఆశ్రయమై, సర్వాత్మయై యొప్పును. అదియే సత్యము, అదియే ఆత్మ, ఓ శ్వేతకేతూ, ''తత్త్వమసి (అది నీవే)'' సముద్రమున వచ్చిచేరు నదుల యుదాహరణ నొకదానినిగూడ దెలుపును. ''నదులు సముద్రమున చేరినపిదప, తాము పూర్వము వేర్వేఱు నదులుగా నున్న సంగతి నెట్లెఱుగవో, అట్లే మనము ఆసత్తునుండి వచ్చియు, మన మాసత్తే యని తెలిసికొనకున్నాము. ఓ శ్వేతకేతూ, ''తత్త్వమసి (అది నీవే)''. ఆయన యిట్లే యుపదేశించుచు బోవును.

మన జ్ఞానలబ్ధి రెండుసూత్రములకు లోబడియుండును. వ్యష్టిని సామాన్యముతోడను, సామాన్యమును విశ్వముతోడను సంబంధపఱచు టొకటి. మనము ఏ వస్తువు తత్త్వమును తెలియగోరుదుమో, సాధ్యమైనంతవఱకు ఆ వస్తుస్వభావమునుండి మాత్రమే వివరణను తెల్పుట రెండవది. మొదటి సూత్రమును కైకొందము. మన జ్ఞానమంతయు వస్తువులను వర్గీకరించుచు, పైపైకి క్రమక్రమముగ పోవుటచే చేకూరుచున్నది. ఏదేని ప్రత్యేకమై, ఏవర్గములోను చేర్ప సాధ్యముగాక, ఒంటిగా

---

* అన్నియు ఏర్పడుటకు మూలాధారమైన తత్త్వము.

† అవి ఏ పదార్థముతో ఏర్పడుచున్నవో అది.

సంఘటించినప్పుడు మనకు అతృప్తికల్గును. ఆ సంఘటనమే మరల మరల కలుగుచుండునని యెఱిగిన యెడల తృప్తులమై దానిని ప్రకృతిధర్మము అందుము. ఒక్క రేగుపండు మాత్రమే నేలరాలుటను చూచినప్పుడు మన కసంతృప్తి కలుగును. అన్ని రేగుపండ్లును రాలునని తెలిసికొనినప్పుడు దానికి "గురుత్వాకర్షణ" ధర్మము అని పేరిడి సంతుష్టిని పొందుదుము. ఇట్లు విశేషసంఘటనము నాధారము చేసికొని సామాన్యధర్మమును సాధింతుము.

పారమార్థిక ధర్మమును గ్రహింపబూనునప్పుడు మనము ఈ శాస్త్రపద్ధతిని అనుసరింపవలయును. ఆ సూత్రమే ఇచ్చట కూడ వర్తించును. సర్వత్ర ఈ పద్ధతియే అనుసరింపబడునదని మనకు తెలియవచ్చును. మీ కిప్పుడు భాషాంతరీకరించి తెలుపుచున్న యీ పుస్తకములను నేను పఠించినప్పుడు, నాకు ప్రప్రథమమున గోచరించిన దీ విశేషమునుండి సామాన్యమును సాధించు సూత్రమే. దేవతలందఱును ఒక్కతత్త్వమున చేర్పబడిరి. జగత్తుకు సంబంధించిన భావనవిషయమునగూడ ప్రాచీను లీ సూత్రమునే అవలంబించి క్రమక్రమముగ సూక్ష్మతరవిచారణకు కడంగిరి. సూక్ష్మమునుండి సూక్ష్మతరమునకు, అనగా అధికతర వ్యాప్తిగల దానికి పోవుచు, ఈ వ్యష్టి వస్తువిచారణమునుండి విశ్వవ్యాప్తమగు ఆకాశమునకును, అందుండి సర్వశక్తులకు కూటమగు ప్రాణమునకును చేరిరి. ఈ విచారమందెల్ల, తక్కిన వాని భిన్నముగా వేఱై యుండునది ఒక్కటియు లేదను సూత్రము గోచరించుచున్నది. ఆకాశమే సూక్ష్మతర రూపమున ప్రాణము అగుచున్నది; అనగా ప్రాణశక్తి స్థూలతరమై, ఆకాశమగును; ఆ ఆకాశము ఇంకను స్థూలతరరూపము తాల్చును. ఇట్లే జరుగు చుండును.

సగుణబ్రహ్మమునకు సమష్టిరూపము కల్పించుట మఱొక దృష్టాంతము. ఈ సమష్టిభావన యెట్లు చేకూరెనో, అది విజ్ఞాన

మంతటికిని సమష్టి అని ఎట్లు పేరిడబడెనో మన మిప్పటికే యెఱుగుదుము. కాని, ఇందొక కష్టము చూపట్టుచున్నది. ఈ సమీకరణము (జనరలైజేషన్) సమగ్రమయినదికాదు. ప్రకృతిలోని ఒక పక్షమును, అనగా విజ్ఞానమును మాత్రమే విచారణకు దీసికొని దానినుండియే సమష్టి భావనను సాధించితిమి. ఇంకను వేఱొక పక్షము మిగిలియున్నది. కావున నిది అసంపూర్ణ మగు సమీకరణ మగుట యొక లోపము. ఇంకొక లోపము కూడ కలదు. ఇది రెండవసూత్రమునకు సంబంధించినది. ప్రతిదియు ఆ వస్తుస్వభావమునుండియే వివరింపబడవలెనుగదా. నేల రాలిన ప్రతిరేగుపండును ఒక దయ్యముచేత లాగివేయబడు చుండెనని వాదించువా రుండియుండవచ్చును. ఇప్పుడు దానిని గురుత్వాకర్షణధర్మము (గ్రావిటేషన్) అని మనమనుచున్నాము. ఈ వివరణయు సంపూర్ణమయినది కాకున్నను, మొదటిదానికంటె శ్రేష్ఠతరమైనది. ఏలనన, ఇది ఆ వస్తుగుణము ననుసరించియే సిద్ధించుచున్నది; రెండవదో బాహ్యకారణమును వేఱొకదానిని తెచ్చిపెట్టుచున్నది. ఇటులనే మన జ్ఞానసాధనమందంతయు వస్తు గుణమును మాత్రమే ఆధారముచేసికొని తెలుపు వివరణము శాస్త్రీయము; ఉపరిగా అన్యకారణమును తెచ్చిపెట్టు వివరణము అశాస్త్రీయము.

కావున సగుణబ్రహ్మ మొకడు జగత్సృష్టి చేయుచుండును అను సిద్ధాంతము ఈ పరీక్ష కాగవలసియున్నది. ఈ సృష్టితో సంబంధము ఏమియులేక, జగత్తునకు వెలుపలనుండి, బ్రహ్మదేవుడు తనయాజ్ఞవలన ఈ సృష్టినంతను శూన్యమునుండి కల్పించుచుండు ననినయెడల, అది కేవలము అశాస్త్రీయ సిద్ధాంతమైపోవుచున్నది. సగుణదైవబోధకములగు మతము లన్నిటియందును ఈ లోపము కలదు. శూన్యమునుండి, తనసంకల్పమాత్రముచేతనే, జగత్సృష్టి గావించుచు, దానినుండి భిన్నుడై, మానవలక్షణములను అన్నియు

పెక్కుమదుగులు హెచ్చుగాగల సగుణబ్రహ్మము కలడను ఏకేశ్వరోపాసన సిద్ధాంతమునందును ఈ రెండు లోపములు గాన్పించుచునేయున్నవి. ఇందుమూలమున రెండుబాధకములు గల్గుచున్నవి.

ఈ సమీకరణము అసమగ్రమని ఇప్పటికే కన్గొంటిమిగదా. ఇది యొక లోపము. సృష్టి నాధారముగ దీసికొని సృష్టికి వివరణము చెప్పకుండుట రెండవ లోపము. ఈ సిద్ధాంతప్రకారము కార్యము కారణముకాదు. కేవలము భిన్నము. అయినను కారణముదాల్చు రూపాంతరమే కార్యమని మానవవిజ్ఞాన మంతయు తెలుపుచున్నది. ఆధునిక ప్రకృతి శాస్త్రసిద్ధాంతము లన్నియు ఈ భావమును బలపఱచుచున్నవి. సర్వత్ర అంగీకృత మైన నవ్యతరసిద్ధాంతమగు పరిణామవాదము ప్రకారము కార్యము కారణముదాల్చు వేఱొండురూపమేయై యున్నది; అనగా కారణము పునర్నిర్మితమగుచున్నది. ఇదే అందు ప్రధాన సూత్రము. ఆధునికశాస్త్రజ్ఞులు శూన్యమునుండి జగత్తు సృష్టి యగుచున్నదనిన నవ్వుదురు.

సరియే. మతము ఈ విమర్శనలకు ఆగగలదా? ఏ మత సిద్ధాంతములయినను ఈ ద్వివిధపరీక్షలకును తాళినయెడల వానిని ఆధునికశాస్త్రవేత్తలును, మనీషావంతులును అంగీకరింతురు. అట్లు తాళని సిద్ధాంతములను తెచ్చి, వానిని మతసంప్రదాయ ముల, మతగ్రంథముల, మతగురువుల, ప్రమాణమునుగొని నమ్ము డని ఈ కాలపువారిని కోరినయెడల వారు తిరస్కరించుట తథ్యము. ఇక సహింపరాని అవిశ్వాసము బయలుదేఱును. పైకి విశ్వాసముజూపువారి విషయమునగూడ, వారి హృదయములను పరీక్షించి చూచినచో, భయంకరమగు అవిశ్వాసము కాన వచ్చును. ఇతరులు మతమనిన వెగటుచెందుదురు. అర్భకుల కుతంత్రకల్పితమని దానిని పరిత్యజింతురు.

మత మిప్పు డొకరీతి జాతీయ మర్యాద స్వరూపమునకు దిగినది. మన సాంఘికవ్యవస్థలం దిప్పటికిని నిలిచియుండు నత్యుత్తమ విషయములలో నిది యొకటి. ఇది యిట్లే నిలిచి యుండుగాక! పూర్వుల కిది నిజముగా అవసరమై కనబడినది. ఈ కాలపువారి కంత యవసరము లేకుండ పోయినది. అది వీరి విచక్షణకు సంతృప్తినిచ్చుటలేదు. ఆ సగుణబ్రహ్మభావనయు, ఆ సృష్టిక్రమమును, అన్ని మతములందును చూపట్టు సామాన్యేశ్వరోపాసనయు ఇక నిలువజాలవు! హిందూదేశమున నివి పూర్వము బౌద్ధుల వాడికి ఆగలేక యోడినవి. బౌద్ధులకు అప్పుడు జయముకూర్చినది సరిగా నిదియే! ప్రకృతియందు అనంతశక్తి వెలసియున్న యెడల, ఆ ప్రకృతి తనకు కావలయుదానినెల్ల, తానే కూర్చుకొనజాలిన యెడల, ప్రకృతికాక ఇంకొకటి ఏదియో తప్పక కలదని వాదించుట అనవసరమని వారు రుజువుచేసిరి. ఆత్మ యొకటి కలదనుటయు అనవసరమే యనిరి.

పదార్థము, గుణములు, అను రెంటిని గూర్చిన చర్చ చాల పురాతనమైనది. అప్పటి మూఢవిశ్వాసములు ఒక్కొక్కచోట నేటికిని నిలిచియుండుట కాననగును. 'గుణములు పదార్థమును అంటియుండునా, అనగా పొడుగు వెడలుపు దళసరి అను గుణములు వస్తువును అంటియుండునా? లేక గుణములున్నను పోయిననుగూడ, జడమగు పదార్థము వేఱుగ నిలిచియుండ గలదా?' అను చర్చ మాధ్యమికయుగములందు—తదనంతర కాలమునకూడ అని చెప్పుటకు చింతించుచున్నాను—సాగుచుండె నని మీలో ననేకులు చదివియుందురు. దీనినిగూర్చి బౌద్ధు లిటుల వాదించుచున్నారు. "అట్టి పదార్థ మొకటి కలదనుటకు మీ కాధారములేదు; ఉండునవి కేవలము గుణములు మాత్రమే. వానిని మించి మీ కేమియు కానిపింపదు." ఈ కాలమున అజ్ఞేయవాదులును ఇట్లే వక్కాణించుచున్నారు. వస్తువునకును గుణములకును గల యీ జగడమే, సూక్ష్మతరమై సవికార

నిర్వికారముల వైరముగా పరిణమించుచున్నది. కొందఱు ఈ సవికారప్రపంచము — సంతతవికల్పరాశియగునది — యొకటియు, దీనివెనుక వికల్పరహితమగునది ఏదో యొకటియు గలదు. ఈ ద్వంద్వత సత్యము, సవికారము నిర్వికారము అని రెండు కలవు అందురు. వీరికంటె నెక్కువ యుక్తియుక్తముగా మఱికొందఱు రెండువస్తువులు కలవనుట పొరపాటు. మనము చూచునది, స్పృశించునది, భావనచేయునది ఈ వికారరాశిని మాత్రమే, దీని వెనుక ఏమియో కలదని చెప్పుటకు ఆధారము లేదు అందురు. దీనికి సమాధానము రాదయ్యె. వేదాంతమందలి అద్వైతసిద్ధాంతము మాత్రమే దీనికి సమాధానము చెప్పునది: ఒక్కటిమాత్రమే కలదనుటే నిజము. ఆ ఒక్కటి వ్యక్తముగనో అవ్యక్తముగనో ఉండును. వికల్పమగునది ఒకటియు; దానిలో; దాని ద్వారమున, ప్రకాశించు నిర్వికల్పమగునది మఱొకటియు, ఇటుల రెండు కలవనుట అబద్ధము. నిర్వికల్పమయ్యు వికల్పమగుచున్నట్లు చూపట్టునది ఒక్కటి మాత్రమే నిజముగా నుండునది. మనము దేహమును, మనస్సును, ఆత్మను భిన్నభిన్నములుగా భావించుచున్నాము; కాని ఉండునది ఒక్కటేసుడీ! ఆ ఒక్కటే యిన్ని రూపముల కాన్పించుచున్నది. అద్వైతులు తెలుపునట్టి త్రాడు పాముగా గన్పడు సుప్రసిద్ధోదాహరణను విచారింపుడు. కొందఱు మనుష్యులు చీకటిగానుండుటచేతనో, మఱేకారణము చేతనో త్రాడును చూచి పామనుకొందురు. నిజస్థితి తెలియవచ్చినప్పుడు పాము అదృశ్యమై త్రాడు కన్పించినది. మనస్సులో పామున్నప్పుడు త్రాడు అదృశ్యమైనది, త్రాడున్నప్పుడు పాము అదృశ్యమైనదిగదా. మనచుట్టుగల వికల్పప్రకృతిని — వికల్పప్రకృతిని మాత్రమే—చూచుతఱిని నిర్వికల్పము అదృశ్యమగుచున్నది. నిర్వికల్పతత్త్వమును—మార్పులేనిదానిని—గుర్తించునప్పుడు, వికల్పప్రపంచము అంతరించుననుట స్పష్టముగదా! దీనివలన ప్రత్యక్షప్రమాణవాదిభావమును, ఆదర్శవాదిభావమును

మనము బాగుగ గ్రహింపగలుగుచున్నాము. ప్రత్యక్షప్రమాణ వాది వికల్పప్రకృతిని మాత్రమే చూచును. ఆదర్శవాది నిర్వికల్పముకొఱకే చూచును. ఆదర్శవాదికి—అనగా, నిజముగా తత్త్వదృష్టిని సాధించి, వికల్పము గూర్చిన భావనల నన్నింటిని తొలగించుకొనగల్గియున్న ఆదర్శవాదికి—వికల్పప్రపంచ మదృశ్య మైనది. 'ఇదెల్ల వట్టి భ్రాంతి. వికల్పప్రపంచము అనునదే లేదు' అను నధికార మతనికి కలదు. ప్రత్యక్షప్రమాణవాది వికల్ప ప్రపంచమును మాత్రమే చూచును. వానికి నిర్వికల్పము గోచరమేకాదు. అతనికి 'ఇదంతయు సత్యమే' యని పలుకు అధికారము గలదు.

ఈ తత్త్వశాస్త్రమువలన చేకూరిన ఫలితార్థ మేమిటి? సగుణబ్రహ్మభావన సమగ్రము కాదనుటే! దానిని దాటి పైకి పోయి అంతకంటె ఉత్తమమైన నిర్గుణభావమును సాధింప వలయును. అదే మనము అనుసరింపగల వివేకమార్గము. దీనిచేత సగుణబ్రహ్మభావము నాశముకాదు. ఇది సగుణబ్రహ్మము లేదని రుజువుచేయుటయుగాదు. సగుణభావమును చక్కగ విశదీకరించు టకు నిర్గుణతత్త్వమును ఆశ్రయింపవలయును. సగుణభావమువలన లభించుదానికంటె దానివలన ఉత్తమతరమగు సమీకరణము చేకూరుచున్నది. అనంతమై వెలుగ గలిగినది నిర్గుణమే. సగుణము పరిమితమే. ఈ విధముగా మనము సగుణభావమును నిలువబెట్టుదుమేగాని, రూపుమాపము. నిర్గుణబ్రహ్మమును ఉపా సించుటచేత సగుణబ్రహ్మభావమునకు భంగము వచ్చుననియు, నిర్గుణనరభావముచే సగుణనరభావము నశించుననియు తఱచుగా శంకించుచుందుము. కాని వేదాంతోద్దేశము వ్యష్టిని నాశము గావించుటగాదు. దానిని నిజముగా సంరక్షించుటే. సమష్టిని ఆశ్రయించినతప్ప మనము వ్యష్టిని రుజువుచేయజాలము. వ్యష్టిగా కాన్పించునది నిజముగా సమష్టియే యని రుజువుచేయుటవలననే

అది సాధ్యము కాగలదు. వ్యష్టిని ప్రకృతిలోని ప్రతిదానినుండియు వేఱుచేసినయెడల అది క్షణకాలమేని నిలువజాలదు. అటువంటి వ్యష్టి ఎన్నడును లేనే లేదు.

మఱియు ఒక వస్తుతత్త్వము దాని సహజలక్షణమునుండియే వివరింపబడవలయునను రెండవ సూత్రప్రయోగమువలన, నింకను గంభీరతర భావనను చేరగలము. ఈ భావనను గ్రహించుట కూడ కష్టతరము. అత్యుత్తమ సమీకరణమగు నిర్గుణబ్రహ్మము మన లోనే యున్నది, మనమే అది, అనుటే ఈ భావము. "ఓ శ్వేత కేతూ, తత్త్వమసి, (అదే నీవు)" నీవే ఆ నిర్గుణబ్రహ్మమవు. నీవు జగమంతటను ఎవనిని వెదకుచుంటివో ఆ భగవంతుడు మొదటి నుండియు నీవే. ఇట్లు నీవేయనుట, నీ సగుణభావముతో కాదు; నీ నిర్గుణభావముతోడ మాత్రమే అట్లనదగును సుమీ! ఇప్పుడు మనము గుర్తించు నరుని సత్యత్వము, అనగా వ్యక్తరూపుడగు నరుని సత్యత్వము నిర్గుణమునందే కలదు సుమీ. ఈ సగుణ రూపమును అర్థముచేసికొనుటకు దానికి నిర్గుణముతో సంబంధము కలుపవలెను. వ్యష్టిని సమష్టి సంబంధము గల్పించి పరిశీలింప వలసియుండును. నిర్గుణతత్త్వమే సత్యమైనది. అదే నరుని ఆత్మ.

ఈ విషయమును గూర్చి అనేక సంశయములు పుట్టగలవు. క్రమక్రమముగా వానికి సమాధానములు తెలుప యత్నింతును. అందులో కొన్ని చాల కష్టముగా నుండును. కాని మొట్టమొదట అద్వైతబోధను చక్కగ గ్రహింతము గాక. వ్యక్తజీవుల రూపమున మనము వేఱువేఱుగా గాన్పించినను, సత్యముగ ఏకమే. ఆ యేకత్వమును విడిచి వేఱువేఱనుకొనుటను ఎంతగా మన భావమునుండి తొలగించిన అంత శ్రేయము. పరిపూర్ణము నుండి మనము భిన్నమని ఎంతగా ఎంచుకొందుమో, అంత క్లేశమును అనుభవింతుము. ఈ అద్వైతసిద్ధాంతమువలన సమస్త నీతిధర్మమునకును పునాది లభించుచున్నది. ఇంక దేనివలనను

మన నీతివర్తనకు ఆధారము చేకూరదని నా నిశ్చితాభిప్రాయము. ఏదో ఒక పురుషునియిచ్ఛయో, పురుషులయిచ్ఛయో, ధర్మము అను కడు పురాతనభావ మొకటి కలదు. కాని అది అసంపూర్ణ మగు సమీకరణము గనుక ఇప్పుడు దాని నెవరును అంగీకరింపరు. వేదములు అటుల చెప్పుచున్నవి గాన మేము ఇది చేయరాదు, అది చేయరాదు అని హిందువులందురు; కాని వేదములు ప్రమాణములని క్రైస్తవులు ఒప్పుకొనరు. బైబులు శాసించుచున్నది గాన మనము ఇది చేయదగును, అది చేయదగదు అని క్రైస్తవు లందురు. బైబులునందు విశ్వాసము లేనివారికి ఈ నియమము వర్తింపదు. కాన ఇట్టి భిన్నాభిప్రాయములను అన్నింటిని లోగొన సమర్థమగు విశాలతర సిద్ధాంతము మనకు కావలసియున్నది. సగుణబ్రహ్మమునందు విశ్వాసముంచువారు లక్షలకొలది యున్నను, ఈ సగుణభావన సంకుచితమైనదనియు, ఇంతకంటె ఉన్నతతర మైనది కావలయుననియు వాదించువారు లోకములోని మేధాసంపన్నులలో వేలకొలంది కలరు. ఇట్టి భావములు కలవారిని అందఱిని కూడగట్టుకొనుటకు తగినంత విశాలత మతమునందు లేనప్పుడెల్ల సంఘమందలి అత్యంతమనీషావంతులు మతమునకు దూరముగనే నిలిచిపోవుచుండిరి. ఈ కాలములో, ముఖ్యముగా యూరపునందు, ఈ స్థితి ప్రస్ఫుటముగా వెల్లడి యైయేయున్నది.

ఇటువంటి భావములు గలవారిని అందఱను కలుపుకొని వచ్చుటకు మతము తగినంత విశాలముగా నుండవలయును. దాని సిద్ధాంతము లన్నియు వివేకపరిశీలనకు నిలువగలవిగా నుండవలయును. మతసిద్ధాంతములను తర్కసూత్రములచే విమర్శింప తగదనుటేలనో యెవఱికిని తెలియదు. తర్కసూత్రముల సాహాయ్యమును విడిచితిమా, మతవిషయములందు సయితము నిర్దుష్టములగు పరిష్కారములు లభింపజాలవు. ఒక మతము మహాఘోరాచరణములను విధించు ననుకొనుడు. ఉదాహరణకు

మహమ్మదీయమత మా మతస్థులు కానివారినెల్ల చంపుట ననుమతించును. "మహమ్మదీయమతములో కలియ నొప్పుకొనని వారిని వధింపుడు" అని ఖురానులో స్పష్టముగ నున్నది. మతాంతరులను దగ్ధము కావింపవలసినదే; ఖడ్గమునకు ఎరజేయవలసినదే! మహమ్మదీయునితో నిది తప్పనినయెడల "అది నీ కెట్లు తెలియును? అది సత్కార్యము కాదనుట కేమి ప్రమాణము? మా శాస్త్ర మది సత్కార్యమనుచున్నది" అని యతడు సహజముగా బదులు పలుకును. మీ శాస్త్రముకన్న మా శాస్త్రము (బైబులు) పురాతనమైనదని మీ రందురేని, అప్పుడు బౌద్ధులు మా శాస్త్రము మఱింకను ప్రాచీనమైనది అందురు. హిందువులు వచ్చి మా శాస్త్రములు అన్నింటికంటెను మిగుల ప్రాచీనములని వాదింతురు. కాబట్టి శాస్త్రములు ప్రామాణికములనుట ఒప్పదు. ఒండొంటిని పోల్చిచూచుటకు ఇక ఆధారమేమి? మా పర్వతోపదేశము (సెర్మన్ ఆన్ ది మౌన్టు) గాంచుడు అని మీరు (క్రైస్తవులు) అందురు. మా ఖురానుధర్మమును చూడుడు అని మహమ్మదీయుడనును. ఈ రెండింటిలో ఉత్తమతరమగునది ఏదియో తేల్పగలవా డెవడని మహమ్మదీయుడు మిమ్మడుగును. నూతన నిబంధన (బైబులు) కును ఖురానుకును ఏర్పడిన తగవు తీర్చుటకు అవి రెండును ఉపకరింపజాలవు గదా. స్వతంత్రమగు ప్రమాణమొకటి అవసరము. అది ఏ పుస్తకమును ఉండజాలదు. అది సర్వజనాదరణీయముగ నుండవలయును. యుక్తికి మించి యేది అట్లు సర్వజనామోదమును పడయగలదు? యుక్తిసయితము పూర్ణముగ సమర్థమైనది కాదందురు. 'అది సదా సత్యమునే తేల్పగలదను నమ్మకము లేదు. అది తఱచుగ పొరపడుచుండును. కాబట్టి మన మొక చర్చి (మతపీఠము) అధికారమునకు ఒడంబడక తప్పదు' అని యొక రోమను కాతలిక్కు మతస్థుడు నాతో వాదించినాడు. వాని తర్కము నాకు బోధపడలేదు. . నేను చెప్పునది ఏమన, యుక్తి అంత దుర్బలమైనచో, బోధకుల కూట మంతకన్న మరింత

దుర్బలమైనదే అగును. వారు చేయు పరిష్కారమునకు ఒడంబడుట కంటె నా తర్కమునే నేను నమ్ముకొందును. అదెంతదుర్బల మైనను, దానిని నమ్ముకొనినచో నేను ఎప్పటికైన సత్యమును గ్రహింపజాలు అవకాశముండును. తదితర మార్గములందో అట్టి అవకాశమే లేదుగదా!

కావున మనము యుక్తినే ఆధారముచేసికొనవలయును. కాని యుక్తి ననుసరించి విశ్వాసమును కుదుర్చుకొనజాలము అను వారియెడ మనకు సానుభూతి యుండవలసినదే! ఎవరిమాటనో ప్రమాణముగా అంగీకరించి రెండుకోట్ల దేవతలు కలరని గ్రుడ్డి నమ్మకమును వహించుటకంటె యుక్తిని ఆధారముచేసికొని, నాస్తికులైపోవుటే మానవజాతికి శ్రేయస్కరమగును! మనకు కావలసినది అభివృద్ధి, పురోగమనము, బ్రహ్మసాక్షాత్కారము! కేవల సిద్ధాంతములు ఎన్నడును మానవులను ఉద్ధరించి యుండ లేదు. ఎన్ని శాస్త్రములైనను మనలను పవిత్రులనుగ చేయ జాలవు. ఆత్మసాక్షాత్కారమునకు మాత్రమే ఆ శక్తి కలదు. అది మనయందే యున్నది. జిజ్ఞాసచేత అది సిద్ధించును. నరులు సమాలోచనచేయవలయును. మట్టిముద్ద యెన్నడును యోచన చేయజాలదు. కావున అది సదా మట్టిముద్దగనే యుండిపోవును. ఆలోచనాపరుడగుటే నరుని ఘనత! యోచనచేయుట నరుని స్వభావము; ఇదే వానికిని పశువునకునుగల భేదము! ఊరక ప్రమాణములపైని ఆధారపడు ఆచారము మితిమీరి పోయిన దేశమున పుట్టినవాడనై, అట్టి ప్రమాణములవలన చేకూరు అనర్థ ములను చక్కగ గ్రహించినవాడనగుటచేత, నేను యుక్తియందు విశ్వాసముంచి, దానినే అనుసరించుచున్నాను.

వేదములలోనుండి సృష్టి బయలుదేరినదని హిందువులు విశ్వసింతురు. ఆవు అనునది ఉన్నదని నీ కెట్లు తెలియును? అనిన, 'గోవనుశబ్దము వేదములలో కలదుగాన' అని వీరందురు!

వెలుపల ఒక మనుష్యుడున్నట్లు నీ కేవిధమున తెలిసినది అనినచో 'వేదములలో మనుష్యుడను మాట యుండుటచేత' అందురు. వానిలో ఆ మాట లేనిచో వెలుపలి మనుష్యుడే లేడనవలెను. వారి వాదము అట్లుండును! వారి గ్రంథప్రమాణభక్తి మితిమీరి పోయినది! వేదమును నేనొకదృష్టితో చదువుదును. వారింకొక దృష్టితో చదువుదురు. కాని కొందఱు మేధాసంపన్నులు దానిని పఠించి, దాని యాధారమున యుక్తియుక్తములగు మహాసిద్ధాంతములను కొన్నింటిని కూర్చియున్నారు సుడీ! వారు దానిని పూర్తిగా తర్కవిచారణచేసి యొక మహాతత్త్వశాస్త్రమును వెలువఱచినారు. వేలకొలది మనీషాగ్రగణ్యులు వేలకొలది సంవత్సరములుగా తమ జీవితము లిందు కర్పించి ఈ తత్త్వశాస్త్రమును నిర్మించిరి. ప్రమాణములకింతబలము చేకూరెను. దానిచే కలుగు అనర్థములు చాల గలవు. దానివలన మానవజాతి అభివృద్ధి సంకుచితమైపోవును. మనము పురోభివృద్ధిని కాంక్షించువారమను విషయము ఎన్నడును మఱవదగదు. వ్యావహారిక సత్యవిషయమునందుకూడ బుద్ధికి సత్యలబ్ధికంటె వ్యవసాయము ఎక్కువముఖ్యము. బుద్ధివ్యవసాయమే మన ఆయువుపట్టు.

మీరు ఊహింపజాలు మతసిద్ధాంతము లన్నిటిలోను అద్వైత సిద్ధాంతము అత్యంతము తర్కవిమర్శనకు నిలువగలది. అట్టిది దాని ఘనత! ఇతర సిద్ధాంతము లేవియు, అనగా భగవంతుని గూర్చిన అసంపూర్ణములును అల్పములును, సగుణములు నగు భావన లేవియు తర్కపరీక్షకు నిలువజాలవు. అయినను ఈ అసంపూర్ణభావనలు విశేషజనులకు అవసరములే అగుటను అంగీకరించి, అద్వైత సిద్ధాంతము ఈ భావనలను అన్నింటిని తనలో ఇముడ్చుకొని తన మహౌదార్యమును ప్రకటించినది. ఈ సగుణభావము తర్కపరీక్షకు ఆగదుగదా యని కొందఱు ఆక్షేపింతురు. కాని దానివలన హృదయశాంతి లభించ

గలదు సుడీ. అనేకులు అటువంటి హృదయశాంతిని ఒసగు మతము నపేక్షింతురు. వారికి అట్టిది అవసరమని మనము గ్రహించుచున్నాము. సత్యదివ్యమైన తేజమును భరింపగలవారు ఈలోకమున అరుదు. దానిని అనుసరించి జీవింపగలవారు ఇంకను తక్కువ. కాబట్టి శాంతిప్రదమగు ఈ సగుణారాధన నిలిచి యుండుట అవసరమే. అది చాలమందికి క్రమోన్నతి పొందుటలో తోడ్పడును. సంకుచితదృష్టిగల్గి, స్వల్పబుద్ధులై, తమ పోషణకు స్వల్పవిషయముల తోడ్పాటు వలయువారు అత్యున్నత భావవీథి కెగుర సాహసింపరు. క్షుద్రదేవతల క్షుద్రవిగ్రహముల భావనలే యైనను, అవి వారికి మిక్కిలి యోగ్యములే, మిక్కిలి సహకారములే యగును. ఐనను, మీరు ఈ నిర్గుణతత్త్వమును తెలిసికొనుట ముఖ్యము. ఏలనన దీనియందుగాని, దీని ద్వారమునగాని తదితర సిద్ధాంతములకు వివరణము లభింపజాలదు. ఉదాహరణకు సగుణబ్రహ్మభావమును తీసికొనుడు. నిర్గుణతత్త్వమును గ్రహించి దానియందు దృఢవిశ్వాసముగలవారు—జాన్ స్టూఅర్టు మిల్లు వంటి మహాతత్త్వజ్ఞులు—"సగుణబ్రహ్మముండుట అసంభవము. అదియున్నదని రుజువు చూపుట పొసగదు" అని వాదింపవచ్చును. సగుణబ్రహ్మమును రుజువుచేయుట పొసగదని అట్టివారితో నేనును ఒడంబడెదను. కాని నిర్గుణతత్త్వమునుగూర్చి సామాన్యమానవుని బుద్ధి గ్రహింపజాలునట్టి మహోన్నత స్వరూపమే ఈ సగుణబ్రహ్మము! నిర్గుణతత్త్వమును గూర్చిన భిన్నభిన్నములగు భావములరాశియే కదా ఈ జగత్తు! కాక వేఱేమున్నది? సృష్టియంతయు మనయెదుటనున్న ఒక మహాగ్రంథము; ప్రతివాడును తన తెలివితేటల ననుసరించి దానిని పఠించుచున్నాడు. మఱియు ప్రతివాడును దీనిని తనంతటతానే చదువుకొనవలసి యున్నది. మానవులందరి బుద్ధులకును సర్వసామాన్యమగునది ఏదియో యొకటి యున్నది. అందువలన మానవజాతి అందఱి బుద్ధికిని కొన్ని విషయములు ఒక్కరీతినే కాన్పించుచున్నవి.

మీరును నేనును కుర్చీని కనుగొనుటచేత మన యిరువురి మనస్సులకు సామాన్యమై వెలయునది ఏదియో ఒకటికలదని తెలియును. మన యింద్రియములకు భిన్నముగానుండు ఇంద్రియముగలపురుషుడొకడు వచ్చును అనుకొనుడు; వానికి ఈ కుర్చీయే కాన్పింపదు. కాని ఒక్కవిధముగానే నిర్మింపబడినవారి కందఱకును ఒక్క వస్తుజాలమే గాన్పించును. అట్లే ఈజగత్తే నిర్గుణము. నిర్వికారము, స్థాణువు. అందు చూపట్టు వికారములన్నియు చూచు (ఈ జగద్గ్రంథము పఠించు) వారిలోని భేదములను అనుసరించి కలుగుచున్నవి. ఏలయందురా, వికారములన్నియు పరిమేయములని మొదట గ్రహింపుడు. మనము చూడగలట్టియు, అనుభవింపగలట్టియు, ఊహింపగలట్టియు, వికారములన్నియు పరిమితిగలవైయే ఉండును. మన జ్ఞానముచేత వానికి పరిమితి కల్పితమగుచున్నది. మనము భావనచేయు సగుణబ్రహ్మముకూడ నిజముచేత అట్లు కల్పితమైన ఒక జగద్వికారమే. నిమిత్తభావము సవికారప్రపంచమున మాత్రమే కలదు. ఈజగత్తునకు నిమిత్తమైయెప్పు బ్రహ్మమును పరిమితునిగానే భావింపవలసియుండును. అయినను ఈతడా నిర్గుణబ్రహ్మమే! మనము ఇదివఱకే గ్రహించియున్నటుల, ఆ నిర్గుణబ్రహ్మమే మన బుద్ధిచేత పఠింపబడునప్పుడీ జగత్తు రూపమొందుచున్నాడు! ఈజగత్తున సత్యమైయెప్పునది ఆ నిర్గుణబ్రహ్మమొక్కటే. దానియందు ఈ రూపములు, ఈ భావనలు అన్నియు మనబుద్ధిచేత ఆరోపింపబడుచున్నవే సుడీ! ఈ బల్లయందు శాశ్వతమైయెప్పునది బ్రహ్మము! ఈబల్ల ఆకారము మున్నగు రూపములన్నియు దానియందు మన బుద్ధిచేత కల్పింపబడునవే.

ఇందుకు తార్కాణముగా చలనమును చూడుడు దీనికిని సవికారప్రపంచమునకును తప్పని సంబంధము కలదు. కాని పరిపూర్ణమున నిది ఉండనేజాలదు గదా! ఈ జగత్తులోగల ప్రతి నలుసు, ప్రతి అణువు, నిరంతర వికారమును పొందుచు

చలించుచున్నది. కాని విశ్వమంతయు సమష్టిని నిర్వికారమే. ఏలయందురా ? చలనము, మార్పు అనువానికి అన్యసంబంధము విధిగానుండితీరవలయును. చలనరహితమగు నొకవస్తువుతో పోల్చినప్పుడుగాని చలనవస్తువు అను భావనను సాధింపలేము. చలనభావము నర్థముచేసికొనుటకు రెండువస్తువులుండవలయును. విశ్వమును అంతటిని ఒక్క ముద్దగా భావనచేసితిమేని, అది కదల లేదు. అది దేనిదగ్గరనుండి దేనికడకు జరుగగలదు ? అది వికల్పముచెందుననుటకును వీలులేదు. ఏ విషయమున అది మార్పు చెందగలదు ? కావున సమష్టి నిర్వికల్పము. కాని దానిలోపలనో ప్రతి అణువును సంతతము చలించుచు వికారము నొందుచుండును! అనగా అది ఏకకాలమున నిర్వికారమును సవికారమునుకూడ, నిర్గుణసగుణములకూడిక అనవలెను. విశ్వము, చలనము, బ్రహ్మము, అనువానినిగూర్చి మా భావమిది. "తత్త్వమసి (నీవే అది)" అనుట కర్థమిదే. ఇట్లు నిర్గుణము సగుణమును త్రోసి పుచ్చకయే, అఖండము ఖండమును నిర్మూలింపకయే మనబుద్ధికి, మనహృదయమునకు, పరిపూర్ణ సంతుష్టి కలుగువిధమున దానిని వివరించుచున్నది. సగుణబ్రహ్మము, ఇంక ఈ జగత్తుననుండు సర్వము, మన మనస్సుద్వారమున చూడబడు నిర్గుణబ్రహ్మమే సుడీ. మనము వ్యష్టిత్వభావములను, మన మనస్సులను, దాట గలిగినప్పుడు మన మానిర్గుణబ్రహ్మముతో ఐక్యమునొందగలము. "తత్త్వమసి" అనుటకు అర్థమిదియే! మన సత్యస్వభావమగు నిర్గుణతత్త్వమును మనము తెలిసికొనవలసియున్నది.

పరిమితుడై, వ్యక్తరూపమొందిన నరుడు తన మూలమును మఱచి, తాను పూర్తిగ వేఱగు ఒకప్రత్యేకవ్యక్తినని భ్రమించుచున్నాడు. సగుణులమై, వ్యష్టి నరులముగా నేర్పడ్డ మనము మన నిజతత్త్వమును మఱచుచున్నాము. అద్వైతము మన వ్యష్టిత్వభావముల నన్నింటిని విసర్జింపుమనికాదు బోధించునది. వాని నిజతత్త్వమును గ్రహించువిధమును నేర్చుకొనుమనియే. సత్యస్వభా

పమున మన మా నిర్గుణబ్రహ్మమే. మన వ్యష్టిరూపములన్నియు ఆ నిర్గుణబ్రహ్మము వ్యక్తరూపముదాల్చు వేర్వేఱు మార్గములే. జగమునపరగు పరిణామపరంపర అంతయు ఆత్మ తన అనంతశక్తిని క్రమక్రమముగా ప్రకటించు ప్రయత్నమే. పరిపూర్ణమును చేరు లోపల ఎక్కడను మనము ఆగిపోజాలము. మన బలము, మన ఆనందము, మన జ్ఞానము, ఆ పరిపూర్ణమున లీనమగువఱకును, పురోగమించుచుండవలసినదే. పూర్ణ సచ్చిదానంద లక్షణములు అనంతశక్తులు సదా మనయందు ఉండియే యున్నవి. వాని నిప్పు డార్జించుకొననక్కఱలేదు. అవి మనవే. వానిని ప్రకటించుటే మనము చేయవలసిన పని.

అద్వైతవాదములోని మూలభావము ఇది. ఇది అర్థమగుట చాలకష్టము. నా చిన్నతనమునుండి నా చుట్టునున్న వారెల్లరును నాకు దుర్బలతను నేర్పిరి. పుట్టినది ఆదిగా శక్తిహీనుడనను మాటనే నాకు నేర్పిరి. ఇప్పుడు నా శక్తిని నేను గుర్తించుట చాల కష్టము. కాని పరిశోధనవలనను, సవితర్కవిచారమువలనను, నా బలము నాకు తెలియవచ్చుచున్నది; నేను దానిని గుర్తించు చున్నాను. మనకు ఈ ప్రపంచమున లభించిన జ్ఞానమంతయు ఎందుండి వచ్చినది? అది మనయందే యుండినది. మనకు వెలిగా జ్ఞాన మేమికలదు? ఇసుమంతయు లేదు. జ్ఞానము జడపదార్థమున లేదు. అది నరునం దెప్పుడును ఉండియే యున్నది. జ్ఞానము నెవ్వరును సృష్టింపలేరు; నరుడు దానిని తనలోపలనుండియే పొందుచున్నాడు. అది వానియందు నిద్రించుచున్నది. ఎన్ని యెకరాల నేలనో ఆవరించు ఒక గొప్ప మఱ్ఱిచెట్టు అంతయు నలుసంత బీజమున ఇమిడియున్నది. దాని మహాశక్తి యంతయు అందు అడగియుండినది. మహామేధాసంపద అంతయు అత్యల్ప జీవకణమునందు ముడుచుకొని నిద్రించుచుండునని మన మెఱుగు దుముగదా. అనంతశక్తి యేల యుండరాదు? అదట్లున్నదని మన మెఱుగుదుము. ఈ పలుకు విరోధాభాసముగ చూపట్టవచ్చును;

కాని ఆ మాట సత్యమే! మనలో ప్రతివాఁడును చిన్న జీవకణము నుండి వచ్చినాఁడు; మన శక్తులన్నియు అందు చుట్టచుట్టుకొని నిద్రించుచుండినవి. మనము తిను ఆహారముద్వారమున అవి వచ్చుచున్నవని మీరనజాలరు. అన్నమును తెచ్చి కొండలంత యెత్తు గుట్టలువేసి చూడుఁడు. అందుండి యేమి శక్తి వచ్చును? ఆ శక్తి జీవకణమున ప్రసుప్తరూపమున నుండినది. అట్లనే అనంతశక్తి నరుని ఆత్మయందు ఉన్నది. దానిని అతఁడు తెలిసికొని యుండవచ్చును; లేకపోవచ్చును. దానిని గుర్తించుటే అది ప్రకాశమునకు వచ్చుట. ఈ అనంతశక్తి మెల మెల్లగా మేలుకొను చున్నది. నెమ్మది నెమ్మదిగా తన బలమును గ్రహించుచున్నది, నిద్రమత్తును వదలుచున్నది. ఆ గ్రహించుట వృద్ధియైనకొలదిని క్రమక్రమముగా బంధనములు తెగిపోవుచున్నవి. గొలుసులు తెగి తునకతునకలగుచున్నవి. తన అనంతబలమును తన విజ్ఞానమును పూర్ణముగ తెలిసికొని ఈ అనంతశక్తి కార్యారంభ ప్రసక్తయగు దినము తప్పక రాగలదు. ఆ శుభలగ్నము వేగిరము వచ్చునటుల మనమందరమును తోడ్పడుదుముగాక!



# చతుర్థ భాగము

(లండన్ ఉపన్యాసము ; 18-11-1896)

ఇంతవఱకును మనము సమష్టి విచారణ కెక్కువ ప్రాముఖ్య మిచ్చుచుంటిమి. వ్యష్టికిని సమష్టికినిగల సంబంధమును గూర్చి వేదాంత సిద్ధాంతమున గల భావములను ఈ యుదయమున తెలిపెదను. వేదములందుగల ప్రాథమిక భావములగు ద్వైతబోధ లలో ప్రతివ్యష్టికి ఒక్కొక్క ప్రత్యేకము, పరిమితము, స్పష్ట రూపము అగు ఆత్మ కలదని వచింపబడియుండుట మన మెఱుగు దుము. ప్రతివానియందును ఉండు ఈ ప్రత్యేకాత్మనుగూర్చి అనేకసిద్ధాంతములు కలవు. వానిలో ప్రధానమైనవి ప్రాచీన వేదాంతులకును ప్రాచీన బౌద్ధులకును జరిగిన చర్చాంశములై పరగినవి. ప్రతివ్యష్టియందు గల ఆత్మయు సంపూర్ణమైనదని వేదాంతులు వాదించిరి. అటువంటి ప్రత్యేకాత్మ యెంతమాత్ర మును లేనేలేదని బౌద్ధులు వాదించిరి. ఈ వివాదము చాలవఱకు 'వస్తువు' 'గుణము' అనువానిని గూర్చి యూరపున జరుగు వివాదమువంటిదేయని యిదివఱకే తెలిపియుంటిని. ఒక వర్గము వారు గుణములకు వెనుక పదార్థమొకటి (మూలప్రకృతి) కలదు; దానినంటి గుణములు వఱలుచున్నవి అందురు. రెండవ వర్గము వారో అట్టి పదార్థము (మూలప్రకృతి) కలదనుటకు అవసరమే లేదనియు, గుణములు తమంతట తాము స్వతంత్రముగ నిలువగల వనియు ప్రతివాదము సల్పుదురు. ఆత్మనుగూర్చిన తమ పురాతన మగు సిద్ధాంతము "అహమస్మి" అను ప్రత్యక్ష స్వతంత్రజ్ఞానముపై ఆధారపడి యుండెను. నిన్నటి "నేనే" నేటి "నేను"; నేటి "నేనే" రేపటి "నేను" అగును. శరీరమునకు ఎన్ని వికార ములు (మార్పులు) వాటిల్లినను "నేను" సదా ఒక్కటిగనే

నిలిచి యుండునని నాకు విశ్వాసము కలదు. పరిమితంబైనను, సంపూర్ణమగు, నొక ప్రత్యేకాత్మ ప్రతివానికిని కలదని విశ్వసించుచుండినవారి వాదము ఇట్టిదని తోచుచున్నది.

దీనిని ఖండించి, ప్రాచీనబౌద్ధులు అట్టి ఊహకు అగత్యమే లేదనిరి. మనము గ్రహించున దెల్లను, గ్రహింపజాలునది సమస్తమును, కేవల మీ వికారపుంజమునే (గుణరాశినే) అని వాదించిరి. నిర్వికారమై నిర్వికల్పముగ నుండు పదార్థము (మూలప్రకృతి) ఒకటి కలదనుట అనవసరము. మరియు అటువంటి నిర్వికారపదార్థము ఏదేని ఉన్నదనుకొన్నను, మనము దానిని గ్రహించుట అసంభవము. దానినిగూర్చి యెట్టి జ్ఞానమును మనకు కలుగుట అసాధ్యము. సరిగా ఈ వివాదమే యిప్పుడు యూరపుఖండమున, మతధర్మవాదులును, ఆదర్శవాదులును చేరి ఒక్క పక్షమునను, ప్రత్యక్ష ప్రామాణికులును అజ్ఞేయవాదులును చేరి రెండవ పక్షమునను నిలిచి సాగించుచున్నారు. ఒకపక్షము వారు నిర్వికల్పమగు ఏదో ఒకటి యున్నదనియు, అది లీలగా మాత్రము గోచరించుచుండుననియు వాదింతురు. (నవీనులలో మీ హెర్బర్టు స్పెన్సరు వంటివారు) రెండవ పక్షమును "కామ్టి" అనుచరులును నేటి అజ్ఞేయవాదులును వహించిరి. హెర్బర్టు స్పెన్సరుగారికి ఫ్రెడెరిక్ హారిసనుగారికిని కొలది వత్సరముల క్రిందట జరిగిన వాదమును గమనించినవారు వారి వివాదాంశము కూడ పైన పేర్కొనబడినదే అని గ్రహింతురు. అనగా, ఒక పక్షమువారు ఈ సవికార ప్రకృతికి వెనుక ఏదో నిర్వికార మూలప్రకృతి కలదనియు, రెండవవారు అట్టియూహ అనవసరమనియు వాదించుట. ఒకపక్షమువారు నిర్వికారమగు ఒకటి కలదనిభావన చేయనిది యే వికారములను గుర్తించుట అసంభవమందురు. రెండవ పక్షము వారో అట్టి భావన అనవసరము, మనము భావింపగలది వికారయుక్తమగు దానినే వికారమునొందని దానిని మనము ఎఱుగలేము, చూడలేము; స్పృశింపలేము అందురు.

భారతదేశమునందును అత్యంత ప్రాచీనకాలమున ఈ సమస్య పరిష్కారముకాలేదు. ఏలనన, 'గుణముల'కు వెనుక దాగి, ఆ 'గుణముల'కన్న భిన్నమగు పదార్థము ఒకటికలదని రుజువు చేయుట అసంభవము. మఱియు, 'నేను' అను జ్ఞానము పైని ఆధారపడి, అనగా నా 'స్మృతి' అను దానిని ఆధారముచేసికొని, నిన్నటి "నేనే" నేటి "నేను" అనియు, కాబట్టి అవిరామముగా "నేను" ఉండుచున్నాను అనియు చెప్పు వాదనను రుజువు చూపి సమర్థింప వీలులేదు. కల్లబొల్లి కూర్పుగల మాటలమీదనే ఆధారపడిన వాదనను ఇంకొకదానిని తెలుపుదురు. అది కేవలము అర్థశూన్యమగు వాగాడంబరమే. "నేను చేయుచున్నాను", "నేను నడచుచున్నాను," "నేను కలగనుచున్నాను" "నేను నిద్రించుచున్నాను," "నేను కదలుచున్నాను" అను ఇట్టి సుదీర్ఘ వాక్యపరంపరను గూర్చి ఇందు చేయుట, నడచుట, కలగనుట, నిద్రించుట, కదలుట అనునవి మారుచున్నవేగాని "నేను" అనునది స్థిరముగా నిలిచియున్నది గదా. కాబట్టి "నేను" అనునది సుస్థిరమగు స్వతంత్రవ్యక్తియనియు మార్పులన్నియు శరీరసంబంధమైనవనియు నిర్ధారించుచున్నారు. ఈ వాదము పైకి అంగీకరింపదగినదిగాను, తర్కబద్ధముగాను, చూపట్టుచున్నను, బూటకపు వాగాడంబరమే సుడీ! కాగితముమీద "నేను" అనుమాటయు చేయుచున్నాను, పోవుచున్నాను, కలగనుచున్నాను మొదలగు మాటలును వేర్వేఱుగా నుండునే కాని, మనస్సులో వానిని వేఱు పఱుపగలవాడు లేడు.

నేను భుజించునప్పుడు నేను భుజించుచున్నాను అని తలంతును ; అప్పుడు 'భుజించుట'తో 'నేను' కలిసిపోయినది. నేను పరుగిడునప్పుడు 'నేను'ను పరుగిడుటయును భిన్నములు కావు. కావున వ్యక్త్యైక్యభావవాదము అంత బలమైనదికాదు. 'స్మృతి (జ్ఞప్తి)' పై ఆధారపడియున్నదను రెండవ వాదముకూడ దుర్బల

మైనదే. నా అస్తిత్వమునకు (అనగా 'నేను' మారకుండ నిలిచి యున్నాను అనుటకు) నాకుగల స్మృతియే ఆధారమైనచో, నేను మఱచిపోయిన విషయములన్నియు నాకు భిన్నములై పోవుచున్నవి. మఱియు కొన్ని స్థితులందు నరులు తమ పూర్వవృత్తాంతమును పూర్తిగ మఱచుటయు కలదు గదా. ఉన్మాదావస్థయందు అనేకులు తాము గాజువస్తువులమనియో లేక పశువులమనియో భావింతురు. అట్టి యొకని అస్తిత్వము (ఉనికి) వాని స్మృతిపైని ఆధారపడియున్నయెడల ఆతడు గాజుకావలెను; అట్లగుట లేదు గదా! కాబట్టి ఆత్మకు నిరంతరాస్తిత్వముఁ కలదని రుజువుచేయుటకు దుర్బలమగు స్మృతిపై ఆధారపడరాదు. అందువలన పరిమితమయ్యును, సంపూర్ణమై శాశ్వతముగా నుండునని చెప్పబడు ఆత్మను గుణములనుండి వేఱుచేయదగునను వాదము నిలువదు. గుణగణముకలిగి, సంకుచితమును పరిమితమును అయియుండు అస్తిత్వమును రుజువుచేయుట యసంభవము.

గుణములను దాటి మనము దేనినిగాని గ్రహించుటలేదు, గ్రహింపజాలము, అను ప్రాచీన బౌద్ధుల వాదమే ఇంతకంటె దృఢమైనదిగా నున్నది. వీరి మతమున ఇంద్రియానుభవములయు, భావములయు, కూడికచే నేర్పడు గుణముల రాశియే ఆత్మ; ఈ రాశి సతతము వికారములను పొందుచున్నది.

ఆత్మనుగూర్చిన అద్వైతసిద్ధాంతము ఈ రెండు వాదములకును సఖ్యమును కూర్చుచున్నది. అది చెప్పునదేమన: గుణములనుండి వేఱుచేసి వస్తువును ప్రత్యేకముగ గ్రహింపజాలమనుట—వికారమును వికారశూన్యతను ఏకకాలమున ఏకదేశమున భావింపజాలమనుట—నిజమే. అది అసంభవమే. కాని ఏది వస్తువో, గుణముకూడ అదియే. అవి భిన్నములగు రెండు కావు. నిర్వికారమగు ఆత్మయే వికారము నందుచున్నట్లు గోచరించుచున్నది. ఈ జగత్తునందలి నిర్వికారపదార్థము జగత్తుకంటె

భిన్నమగు వేఱొక పదార్థముకాదు. నిర్వికారబ్రహ్మము వికారములనుండి వేఱైన యొకపదార్థములుదు. ఆ నిర్వికారబ్రహ్మమే వికారములతో కూడిన జగమై గోచరించుచున్నది. ఆత్మ ఎన్నడును ఎట్టి వికారమును పొందనిది. మఱియొక దృక్పథమునుండి అదియే అనుభవములును, భావములును, తుదకు శరీరమును అయి చూపట్టుచున్నది. మనకు శరీరములు కలవనియు, ఆత్మలు కలవనియు, ఇట్టివి ఏవేవో కలవనియు తలచుటకు అభ్యాసపడి యున్నాము. కాని, సత్యమునకు ఉండునది ఒక్కటియేసుడీ!

నేనొక శరీరమనని భావించుకొనునప్పుడు శరీరమనే. అప్పుడు శరీరమువినా వేఱొకటి అనుట అర్థశూన్యమగును. మరియు నేను ఆత్మనుగా భావించుకొనినప్పుడు శరీరము అదృశ్యమగును. శరీరభావనయే నిలువదు. శరీరమును గూర్చిన భావన అదృశ్యము గానిది ఎవ్వడును ఆత్మను గుర్తింపలేడు. గుణములనుగూర్చిన భావన అదృశ్యమగువఱకును ఎవ్వడును కేవల పదార్థమును గుర్తింపలేడు.

అద్వైతసిద్ధాంతమందు సుప్రసిద్దిగాంచిన రజ్జుసర్పభ్రాంతి సాదృశ్యము. ఈ విషయమును ఇంకను కొంత వివరముగ అర్థమగునటుల చేయగలదు. త్రాడును చూచి ఒకడు పాముగా భావించునప్పుడు, త్రాడను దృష్టి నశించుచున్నది.. దానిని అతడు త్రాడుగా చూచునప్పుడు పామను దృష్టి నశించి, త్రాడు మాత్రమే నిలిచియుండును. అసమగ్రములగు పరిశీలనాంశములను అనుసరించి విచారించుటవలన రెండు భిన్నపదార్థము లున్నవనియు మూడు భిన్నపదార్థము లున్నవనియు భావమేర్పడును. మఱియు నట్టి సిద్ధాంతములను వినుటచేతను, చదువుటచేతను, శరీరాత్మలు మనకు భిన్నములగు రెండు వస్తువులుగా కానిపించుచున్నవి అనెడు భ్రాంతిలో పడిపోవుచుము. కాని నిజమునకు అట్టి ద్వైత భావ మెన్నడును కలుగదు. శరీరభావమో, ఆత్మభావమో,

ఒక్కటి మాత్రమే ఉండునుగాని రెండు నొక్కసారి యుండవు. దీనిని ఋజువుచేయుటకై వాదనలు అనవసరము. మీా మనస్సులందు దీని సత్యమును సులభముగ గ్రహింప గల్గుదురు.

ఒక ఆత్మగా, ఒక అశరీరవస్తువుగా, నిన్నుగూర్చి భావన చేసికొన ప్రయత్నించి చూడుము. అది నీకించుమించు అసాధ్యముగ నుండును. ఏ కొలదిమందియో అటుల భావన చేయజాలినవారున్నచో, వారి కాత్మతాదాత్మ్యస్థితి కలిగిన కాలమున, శరీరభావమే ఉండదు. తదేక ధ్యాననిష్ఠచేతనో, ఇంద్రజాలముచేతనో, ఉన్మాదముచేతనో. ఓషధుల ప్రయోగముచేతనో, ఒకానొకప్పుడు విపరీత మనోదశలను పొందినవారిని మీారు చూచియుందురు, లేక వారినిగూర్చి వినియుందురు. అభ్యంతరవస్తువొకదానిపై దృష్టి నిలిచియున్నప్పుడు వారి బాహ్యదృష్టి నశించినదని వారి అనుభవములవలన మీారు గ్రహింపగలరు. కలవస్తువొక్కటియే అని దీనివలన తేలుచున్నది. ఆ ఒక్కటియే ఈ బహురూపములతో కానబడుచున్నది. ఈ భిన్నరూపములవలననే కార్యకారణ పరంపర ఏర్పడుచున్నది. కార్యకారణములకు గల సంబంధము పరిణామము. ఒకటి మఱొకటిగా మారును. అదియు వేఱొకటిగ మార్పుచెందును. అట్టి మార్పుల పరంపర కలుగుచుండును. ఒక్కొక్కప్పుడు కారణము అదృశ్యమైనట్లు తోచి దాని స్థానమున కార్యముమాత్రము చూపట్టును. ఆత్మ శరీరమునకు కారణముకాగా. ఆ సమయమున ఆత్మ అదృశ్యమై శరీరము ఒక్కటియే నిలిచియుండును. ఈ శరీర మదృశ్యమైనప్పుడు ఆత్మ నిలిచియుండును. ద్వైతస్థితియే లేదు. 'పదార్థమును, గుణములును, బహురూపముల కానవచ్చుచుండు ఒక్కవస్తువే' అని బోధించు ఈ వాదము 'ఆత్మ ఒకటియు, శరీరము వేఱొకటియు నగు రెండు' అను వాదమును ఖండించు బౌద్ధుల వాదమునకు సరిపోవుచున్నది.

ఈ నిర్వికారభావము సమష్టినిగూర్చి మాత్రమే ఒప్పు ననియు, భాగములగూర్చి ఒప్పదనియు ఇప్పటికే తెలిసికొని యుంటిమి. భాగము అను భావనయే వికారము (మార్పు), చలనము అను భావనలవలన ఏర్పడుచున్నది. పరిమితమగు ప్రతిదియు వికారముతో కూడియుండును కావుననే దానిని మనము గ్రహింపగలము; తెలిసికొనగలము. కాని సమష్టి తప్ప వేఱేదియు ఉండజాలదుగదా. కాన దేని సంబంధమున నది వికారమొందగలదు? అందుచే సమష్టి (పరిపూర్ణము) నిర్వికారమై యుండి తీరవలయును. పూర్తిగ వికారరహితమగు వస్తువుగాని, తనకంటె తక్కువగా వికారమును పొందు వస్తువుగాని ఉన్న తప్ప వికారమను భావమే అసంభవముగదా.

వేదాంతసిద్ధాంతానుసారముగా ఆత్మ సర్వవ్యాపము, నిర్వికారము, శాశ్వతము అను భావమును సాధ్యమైనంతవఱకు ఋజువుచేయవచ్చును. వ్యష్టినిగూర్చి మాత్రమే చిక్కు గలుగు చున్నది. మనలను గట్టిగా పట్టుకొని పీడించుచు, తప్పించుకొన నలవికానట్టి, ఈ ప్రాచీనద్వైతమతవిశ్వాసములు — పరిమితము లును, స్వల్పములు నగు వేర్వేఱు ఆత్మలు కలవని బోధించునవి— వీని విషయ మేమి చేయగలము?

సమష్టి భావదృక్పథమునుండి మనము శాశ్వతులమని గ్రహించితిమి: కాని ఆ సమష్టిలోని భాగములుగా కూడ మనము శాశ్వతత్వమునే కోరుకొనుటలో చిక్కులేర్పడుచున్నవి. మనము అనంతులమనియు, అదియే మన యథార్థ వ్యక్తిత్వమనియు గ్రహించితిమి; కాని సంకుచితములౌ ఈ ప్రత్యగాత్మలనుకూడ వ్యక్తిత్వముతో నిలిపియుంచుకొను వాంఛ మనయందు కలదు. ఈ సంకుచితాత్మలు వ్యష్టిస్వభావము గలవే గాని, అవి సంతతము ప్రవర్ధనము పొందుచున్నవి అని మన సామాన్యపు అనుభవము తెలిపినప్పుడు, వీని విషయము ఏమగును? అవన్నియు మునుపటివే

కాని, మునుపటివి కావు? నిన్నటి "నేను" నేటి "నేనే" కాని కొంత మార్పు గలదు. ఈ వికారము లన్నింటికి నడుమను నిర్వికారమగునది వేఱొకటి కలదు అను ద్వైతభావమును విడిచి ఆధునికమగు పరిణామసిద్ధాంతమును చేపట్టితిమేని ఈ "నేను" అనునది సదా వికారమును పొందుచు వికాసమునందు వస్తువు అని గ్రహింతుము.

సూక్ష్మజీవకణము ఒకటి పరిణామము పొంది పొంది నరరూపము నొందినయెడల, ఆ సూక్ష్మజీవకణమే ఈ నరుడు; కాని అది ఎంతో వికాసమును పొందియున్నది, అని తేలుచున్నది. ఈ సూక్ష్మజీవకణమునుండి నరుని వఱకు కలిగిన వికారపరంపర పరిపూర్ణత్వమును పొందుటకై సాగుచున్న నిరంతరవికాసమే. కావున ప్రత్యగాత్మ పరమాత్మ కభిముఖమై అవిరామముగా ఎదుగుచున్న యొక వ్యష్టి అనదగును. ఈ వ్యష్టికి పరిపూర్ణత లభించుట అల పరిపూర్ణమును జేరినప్పుడే! ఈలోపల నది ఎడతెగక వికారమును పొందుచు, వికాసము నొందుచు వ్యక్తి వ్యష్టిగనే నిలిచియుండును. వేదాంతసిద్ధాంతమునగల మహా విశేషములలో నొకటి పూర్వము వెలసిన సిద్ధాంతముల సమన్వయ పఱచుటే సుడీ! చాలసారులు ఇది ప్రకృత తత్త్వశాస్త్రమున కెంతో తోడ్పడినది. కొన్నిసార్లు మాత్రము దానికి అపకృతి చేసినది. భారతదేశపు ప్రాచీన తత్త్వవేత్తలు పరిణామవాదము అని మీరు చెప్పుకొను సిద్ధాంతమును ఎఱింగియే యుండిరి. పరిణామము క్రమక్రమముగా సోపానసరణిని సాగుచుండును. ఇది ఎఱిగి వారు తమకు పూర్వమున గల సిద్ధాంతములను అన్నిటిని సమన్వయము చేసిరి. అంతకు బూర్వమున్న భావము లలో నొక్కదానినిగానిని పూర్తిగా వారు నిరాకరింపలేదు. బౌద్ధమత మిట్లుగాక, ఈ నిరంతర వికాసక్రియ నెఱుగజాలక, పరమావధిదెసకు సాగు పరిణామపరంపరయందలి పూర్వసోపానా వళిని సమన్వయపఱుపజూడలేదు. ఇదియే బౌద్ధమతములోని

లోపము. ఆ పూర్వదశల నది హానికరములుగను, వ్యర్థములు గను ఎంచి నిరాకరించినది.

మతములలోగల ఈ స్వభావము మిక్కిలి అనర్థదాయకము. ఒకడు నూతనమును శ్రేష్ఠతరమును అగు భావమును గ్రహించిన వెంటనే, తన కిదివఱకు ఉండి, ఇప్పుడు విసర్జింపబడిన భావములు అనవసరములనియు దుష్టములనియు తత్క్షణమే నిర్ణయించుకొను చున్నాడు. తన ప్రస్తుత దృష్టిలో అవెంత అపరిణతములుగ కాన్పించుచున్నను, అవే ఒకప్పుడు తనకు ప్రయోజనకరములుగ నుండి, తానీ ప్రస్తుత స్థితికి వచ్చుటకు అత్యవసరములే అయ్యె ననియు, ప్రతివాడును మొదట అపరిణతభావముల ఆధారమున జీవించి, వాని ప్రయోజనమును అనుభవించి, ఉత్తమదశలను పొందవలసియుండుననియు తలపోయడు. అద్వైతసిద్ధాంతమో తత్పూర్వపు మహాపురాతన సిద్ధాంతములతో సయితము సఖ్యము గలిగి మెలగుచున్నది. ద్వైతము మున్నగు పూర్వసిద్ధాంతము లను అన్నింటిని అద్వైతము అంగీకరించుచునేయున్నది. ఈ అంగీకారము సగర్వకృపాంగవీక్షణరూపము నీయబడునది కాదు. ఆ సిద్ధాంతము లన్నియు సత్యములే అనియు, ఒక్కసత్యమునకే రూపాంతరములు అనియు, తాను సాధింపగలిగిన పరమావధిని పొందుటకు అవన్నియు సాధనములే అనియు అది విశ్వసించు చున్నది.

మానవజాతి క్రమక్రమముగా ఎక్కవలసిన యీ సోపాన ములను అన్నింటిని శపింపక ఆశీర్వదించుచు పోషింపవలయును. దానిని నిరసనదృష్టితో గాక సాదరదృష్టితో వీక్షింపవలెను. కావుననే ఈ ద్వైతమతములేవియు నిరసింపబడలేదు, బహిష్క రింపబడలేదు. వేదాంతమునందు అవి చెక్కుచెదరక నిలుపబడి యున్నవి. పరిమితమయ్యును, తనంత దాను పూర్ణమై వెలుగు ప్రత్యగాత్మ కలదను ద్వైతసిద్ధాంతమునకును ఈ వేదాంతమున స్థానము కలదు.

నరుడు మరణించినప్పుడు పరలోకములకు పోవుట మొదలగు ద్వైతసిద్ధాంతభావములను వేదాంతము చెక్కుచెదరకుండ నిలుపుచున్నది. పరిణామవాదమును అంగీకరించుటతో అద్వైత సిద్ధాంతము అవి అఖండసత్యపు ఖండ దర్శనములని భావించి, వానికి ఉచితస్థానము నిచ్చుచున్నది.

ద్వైతవాదము ప్రకారము ఈ జగత్తు జడపదార్థపు సృష్టియో లేక శక్తి సృష్టియో, జగత్తునకంటె భిన్నమగు ఏదో సంకల్పపు లీలగా మాత్రమే భావింపబడవలసియున్నది. ఈ సిద్ధాంతమును నమ్మి నరుడు తాను శరీరము ఆత్మ అను రెండు భిన్నవస్తువుల సమ్మేళనమనియు, తన ఆత్మ పరిమితమైనదే అయినను, వ్యష్టిరూపమున పరిపూర్ణమైనదే అనియు భావించుకో వలెను. శాశ్వతత్వము, భావిజీవితము మొదలగు విషయముల గూర్చి అతని భావములు ఆత్మనుగూర్చిన తన భావనను అనుస రించియే పరగుచుండవలయును. ఈ దశాంతరము లన్నిటికిని వేదాంతము తావొసంగియే యున్నది. కాన ద్వైతవాదమందలి సామాన్యభావములను కొన్నింటిని తెలుపుట అవసరము. ఈ సిద్ధాంతము చొప్పున మన శరీరము మాటున సూక్ష్మశరీరమన బడున దొకటియుండును. ఈ సూక్ష్మశరీరముకూడ జడ పదార్థ మయమే; కాని అది చాల సూక్ష్మపదార్థము. ఈ సూక్ష్మశరీర ములో మనకర్మమంతయు, మన చేష్టలును, సంకల్పములును, నిలిచి వ్యక్తరూపము లొందుటకు సిద్ధముగా నుండును. మనము తలచు ప్రతి తలపు, మనముచేయు ప్రతిచేత, కొంతకాలమునకు సూక్ష్మమై, బీజరూపమునుపొంది ఈ సూక్ష్మశరీరమున ప్రసుప్తా వస్థయందు నిలిచియుండును. అది ప్రతిదియు మరల వెలువడి దానిదాని ఫలమునిచ్చును. ఈ ఫలములే నరుని జీవిత వైఖరిని నిర్ణయించునవి. ఇటుల నరుడు తన జీవితమును తానే నిర్మించు కొనుచున్నాడు. నరుడు తనకై తాను నిర్మించుకొనినవానికి

మించిన యే యితర శాసనములకును బద్ధుడై యుండుటలేదు. మన తలపులు, మన వాక్కులు, మన క్రియలు అను దారములతో మనమే అల్లుకొనిన వలను మనచుట్టును—మంచికిగాని చెడ్డకు గాని—తగిలించుకొనుచున్నాము. మనము సక్రియారూపమున నొక శక్తిని పెట్టినచో, దానిఫలమును పూర్తిగ అనుభవించియే తీరవలయును. ఇదే కర్మసిద్ధాంతము. ఈ సూక్ష్మశరీరమునకు వెనుక జీవుడుండును, ఇదియే నరుని ప్రత్యగాత్మ. ఈ జీవాత్మ స్వరూప పరిమాణములను గూర్చిన తర్కవాదములు అనేకము కలవు. కొందఱి అభిప్రాయములో ఇది చాల చిన్నదై పరమాణు వంతయుండును. అదంత చిన్నదికాదని కొందరందురు; చాల పెద్దదని మఱికొందఱి భావము. ఇట్లు అనేకవాదములు కలవు. ఈ జీవుడు ఆ సర్వాత్మకవస్తువునం దొక అంశము, కావున శాశ్వతము, అనాద్యనంతము. అది తన సత్యస్వభావమగు పరిశుద్ధత్వమును ప్రకటించుటకై ఇన్ని రూపములను పొందు చున్నది. ఈ ప్రకటనకు అడ్డువచ్చు క్రియలును సంకల్పములును చెడ్డవి. జీవుని వికాసమునకు తోడ్పడుచు దాని సత్యస్వభావమును ప్రకటించుటకు అనువగు క్రియలును, సంకల్పములును మంచివి. హిందూదేశమున ద్వైతవాదులలో బొత్తిగా అపరిణతులుగా నుండువారును, అద్వైతులలో సమగ్రపరిణతి నొందినవారును గూడ ఏకగ్రీవముగా అంగీకరించు సిద్ధాంతము ఒకటి కలదు:— జీవుని ప్రచ్ఛన్నశక్తులు, జీవుని ప్రభావములు, అన్నియు వాని లోనివేగాని బాహ్యమున నుండి వచ్చునవేవియు లేవు. అవి అన్నియు జీవునియందు అవ్యక్తరూపమున ఉన్నవి. వానిని ప్రకాశమునకు తెచ్చుటే మన జీవితకార్యమంతటికిని ఉద్దేశము.

జన్మాంతర సిద్ధాంతమునుకూడ ద్వైతులు నమ్మెదురు. ఈ శరీరము పంచత్వము నొందిన పిదప జీవునకు ఇంకొక శరీరము వచ్చును. అదియు పోయినప్పుడు మరల ఇంకొకటివచ్చును. ఇట్లే

ఈ లోకముననో పరలోకముననో శరీరములు ప్రాప్తించుచునే యుండును. మన కార్యమునకీ లోకమే అన్నిలోకములలోను శ్రేష్ఠతమమైనదిగాన, దీనికే ప్రాముఖ్య మీయబడుచున్నది. ఇతరలోకములలో దుఃఖము కేవలము స్వల్పముగానుండునని భావము. కాని, ఆ కారణముచేతనే జీవాత్మ కక్కడ ఉన్నత సంకల్పములు పూను నవకాశము తక్కువ అని వారివాదము. ఈ లోకములో కొలదిగ సుఖమును విశేషముగ దుఃఖమును ఉండుటచేత, జీవుడు ఎప్పుడో యొకప్పుడు మేల్కాంచి, ముక్తి మార్గమును పట్టును. స్వర్గలోకములోని జీవుని స్థితి ఈలోకములో శ్రీమంతుల స్థితినిబోలి—యింకను సుఖతరముగ గూడ—ఉండుట చేత, ఈ లోకములోని శ్రీమంతులు ఉత్తమసంకల్పములను నూహించుట అరిదియైనట్లే జీవునికాలోకములో పురోభివృద్ధి చింతకు అంతగా అవకాశము ఉండదు. అచ్చట శరీరమత్యంతసూక్ష్మము. పరిపూర్ణారోగ్యవంతము. ఆకలిదప్పులుండవు. కోర్కెలన్నియు ఫలించుచుండును. జీవుడక్కడ సౌఖ్యములపై సౌఖ్యములనే అనుభవించుచు తన నిజస్వభావమునెల్ల మఱచిపోవును. అయినను కొన్ని ఉత్తమలోకములలో ఆత్మకు ఎన్ని సౌఖ్యములున్నను ఉత్తర పరిణామమునకు అవకాశము కలదు. జీవులు భగవంతుని సన్నిధానమున శాశ్వతముగా వసించు నత్యున్నతస్వర్గము ఒకటి కలదనియు, అదియేగమ్యస్థానమనియు కొందఱు ద్వైతులు భావింతురు. అక్కడ వారికి మనోజ్ఞసుందర శరీరములుండును. రోగముగాని మరణముగాని సంభవింపదు. ఏకీడును మూడదు. వారి యీప్సితములన్నియు సిద్ధించును. అటువంటి వారిలో కొందఱు అప్పుడప్పుడు భగవంతుని పొందుమార్గమును ప్రజలకు బోధించునిమిత్తము భూలోకమున నవతరించుచుందురు. లోకమున ప్రభవించిన ప్రవక్తలు అటువంటివారే. వారిదివఱకే ముక్తులు. అత్యున్నతస్వర్గమున భగవంతుని సమక్షమున నివసించుచుండిరి ; అయినను దుఃఖభాజనులగు ఈ లోకజనులపైగల ప్రేమచేతను

సానుభూతిచేతను, మానవకోటికి స్వర్గపథమును జూపుటకై వచ్చి వారు మరల శరీరములు దాల్చిరి.

అద్వైతము దీనిని పరమావధి అనిగాని పరమాదర్శము అని గాని అంగీకరింపదని మన మెఱుగుదుము. విదేహకైవల్యమే దాని ఆదర్శము. ఆదర్శము పరిచ్ఛిన్నమై (మేరగలదిగ) ఉండ జాలదు. అపరిచ్ఛిన్నత్వమునకు తగ్గిన దేదియు పరమావధి కాజా లదు. అపరిచ్ఛిన్నమగు శరీరము ఉండజాలదు. అది అసంభవము. పరిచ్ఛిన్నతయేకదా శరీరమూలము. అపరిచ్ఛిన్నతయే కదా సంకల్పమునకు మూలము. మనము శరీరమునకును మనస్సునకును అతీతముగా పోవలసియుండును అని అద్వైతసిద్ధాంతము. మరియు అద్వైతము ప్రకారము ముక్తి ఇక సాధింపవలసినదికాదు; అది యిదివఱకే మనది. దానిని మనము విస్మరించి లేదనుకొను చున్నాము. పరిపూర్ణత్వము సంపాదింపవలసినదై యుండ లేదు, అది యిదివఱకే మనయందున్నది. అమృతత్వము ఆనందము అను వానిని మనమిప్పుడు పొందుటకై పాటుపడవలసిన పనిలేదు. అవి మొదటినుండియు మనవే.

నీవు ముక్తుడవని ప్రకటించుటకు సాహసించితివేని, ఈక్షణ ముననే నీవు ముక్తుడవు. బద్ధుడవంటివా బద్ధుడవుగానేయుందువు. ఇది అద్వైతము ఘంటాఘోషముగా బోధించు సిద్ధాంతము. ద్వైతుల వాదమును దెలిపియే యున్నాను. మీ కేది హిత వుగ తోచిన దానిని స్వీకరింపవచ్చును.

వేదాంతము బోధించు పరమాదర్శమును గ్రహించుట చాల దుర్లభము; దానిని గురించి మానవులు నిరంతరము జగ డములాడుచునేయున్నారు. ఉన్నకష్టమేమన తాము కొన్ని భావ ములను స్వీకరించి, తక్కిన భావనలనెల్ల తప్పులని పోరాటములకు దిగుదురు. మీ కేవి అనుకూలములో వానిని మీరు గ్రహింపుడు; ఇతరులను వారికి అనుకూలమైన వానిని స్వీకరింపనిండు. సంకుచిత

మగు ఈ వ్యష్టిత్వమును, ఈ పరిమిత నరత్వమును, అంటిపట్టుకొని యుండగోరెదరేని, మీ వాంఛలన్నింటిని తీర్చుకొనుచు, తృప్తిపడి సుఖించుచుండుడు. మీ నరజీవితానుభవము మీకు యోగ్యమై హృద్యముగ తోచినయెడల, మీ యిచ్చవచ్చినంతకాలము దానిని నిలుపుకొనుడు. మీ భవిష్యత్తుకు మీరే కర్తలగుటంజేసి, మిమ్మెవ్వరును నిరోధింపజాలరు. మీ వ్యక్తిత్వమును వీడుడని మిమ్మెవరును బాధించువారు లేరు. మీ యిష్టమువచ్చినంతకాలము మీరు నరులుగా నుండుడు. ఎవరును ఆటంకపఱుపజాలరు. మీరు దేవతలు కానెంచినచో దేవతలగుడురు. అదియే నియమము. కాని దేవతలుగాకూడ ఉండనొల్లనివారు కొందఱుండవచ్చును. వారి సంకల్పము మహాఘోరమనుటకు మీకేమి అధికారము కలదు? మీకు నూరురూకలు నష్టమైనయెడల మీరు దద్దఱిల్లి పోవచ్చును. అయినను ప్రపంచములో తమకుగల సర్వస్వము పోయినను మోముమాత్రమైన చిట్లింపని వారుండవచ్చును. అట్టివారలు ఇంతకుపూర్వము అనేకులుండిరి. ఇప్పుడును ఉన్నారు. మీ ప్రమాణమును బట్టి వారిని ఏల విమర్శింప సాహసింతురు? మీరు మీ సంకుచితభావములనే పట్టుకొని ప్రేలాడుడు. ఈ తుచ్ఛ ప్రాపంచిక భావములే మీకు అత్యుత్తమాదర్శములై తోపవచ్చును. వానినే మీరు నిరాఘాటముగా సేవింపవచ్చును. మీరు కోరుకొనిన దశయే మీకు ప్రాప్తించుచుండును. కాని యితరులున్నారు. వారు బ్రహ్మవిదులు. వారీ లౌకికబంధములకు లోబడుటకు ఇచ్ఛగింపరు. వీనితో వారికి పనిముగిసినది. వీనికి అతీతముగ బోవలెనని వారి వాంఛ. ఎన్నెన్ని సౌఖ్యములున్నను ఈ ప్రపంచము వారికి మురికిగుంటయై తోచును. మీ భావములచే వారిని మీరు బంధింపజూచుటేల? మీ రిట్టి స్వభావమును పరిత్యజించి తీఱవలెను. ప్రతివానిని వాని మార్గమున నడువనిండు.

దక్షిణ సముద్రద్వీపముల దాపున తుపానులో చిక్కువడిన కొన్ని యోడలను గూర్చి యొక కథ నొకసారి చదివియుంటిని.

"ఇలస్ట్రేటెడ్ లండన్ న్యూస్" పత్రికలో దానిని సూచించు బొమ్మ ఒకటుండెను. ఆ ఓడలన్నియు భగ్నములై పోయినవి. ఒక్క ఆంగ్లేయ నౌకమాత్రము గండము తప్పించుకొని సాగిపోవు చుండెను. అందలివారినిజూచి మునిగిపోవుచున్న ఓడలపై నిలిచిన వారు ప్రోత్సాహనినాదములు చేయుచున్నట్లు బొమ్మలో చూప బడినది.* వారివలె ధైర్యవంతులై ఉదారబుద్ధులై వర్తింపుడు. ఉన్నతినున్నవారిని మీరున్నచోటికి పడలాగజూడకుడు. మన సంకుచిత వ్యష్టిభావము పోయినయెడల, లోకములోని నీతి నశించును. మానవజాతికి అనర్థము మూడును అను నొక వెఱ్ఱి యూహ కలదు. ఇంతకాలమును విశ్వమానవజాతికొఱకై ప్రతి వాడును ప్రాణార్పణము చేయుచున్నాడా ఏమి? అట్లయిన లోకము ధన్యమే! ప్రతిదేశమునను మానవజాతికి ఉపకారము చేయబూనినవారు రెండువందలమంది స్త్రీపురుషవరేణ్యులు ఉండిరా, అయిదు దినములలో సత్యయుగోదయము కాగలదు! విశ్వమానవజాతికై మనము ఎంతవరకు ప్రాణార్పణము చేయు చున్నామో మనకు తెలియదా! ఇదంతయు వాగాడంబరముతప్ప మఱేమియునులేదు. సంకుచితమా తమ వ్యష్టిత్వమునుగూర్చి ఎన్నడుగాని తలపోయని జనులే లోకోద్ధారకులై వెలసిరనియు, తమ్ముగూర్చి ఎంత ఎక్కువ తలంతురో, అంత తక్కువగా ఇతరుల కుపకారము చేయగలరనియు, ప్రపంచ చరిత్ర తెల్లము చేయు చున్నది. ఒకతెగవారు స్వార్థత్యాగులు; రెండవతెగవారు స్వార్థపరులు. క్షుద్రభోగలంపటులగుచు ఆ భోగములనే తిరిగి తిరిగి కోరుచుండుట నీచస్వార్థపరత. దానిమూలము సత్యాన్వేషణ పరత్వముకాదు; జీవకరుణకాదు దీనికి మూలకందము! "నాకే సర్వము రానీ; ఇతరులజోలి నాకేల?" అను నీచసంకల్పము

---

* ఓడలివి: హెచ్. ఎం. ఎస్. కల్లియోప్ ను, సమొఆకడ నుండిన అమెరికన్ నౌకలును. —సంపాదకుడు.

నుండియు, మానవహృదయమునందలి క్షుద్రస్వార్థచింతనుండియు ఇది వెలువడుచున్నదని నా భావము. తా మొక అల్పజీవికి ఉపకృతిచేయజాలుచో అందుకొఱకై నూరు జన్మలనైనను అర్పణముగావించియుండజాలిన ప్రాచీనఋషులవంటి, పురాణ ప్రవక్తలవంటి, ధర్మశీలురను నేనిప్పుడుకూడ చూడగోరుదును. నీతిపరత్వము, పరోపకారదీక్ష మాటలేనా? ఈ కాలపు వ్యర్థ ప్రలాపములే అవి!

గౌతమబుద్ధునిబోలు మహానీతిశాలురను నేను చూడ గోరెదను. ఆతనికి సగుణబ్రహ్మమునందు విశ్వాసములేదు. జీవాత్మ కలదని యతడు నమ్మలేదు. వానినిగూర్చిన విచారమునే అతడు పెట్టుకోలేదు. ఆతడు పూర్తిగ అజ్ఞేయవాది. అయినను ఎవరికొఱకైనను తనప్రాణమును అర్పింప సిద్ధముగ నుండిన మహనీయుడు! పరోపకారమునకై తన జీవితమును అర్పణము గావించిన మహాత్ముడు! సదా సమష్టిక్షేమమునే విచారించిన ఘనుడు! ఆతని జనన వృత్తాంతమును వర్ణించుపట్టున, ఆతడు జనులకు మేలుచేయుటకై, జగత్కల్యాణార్థమై, జననముగాంచి నటుల చరిత్రకారుడు చక్కగా వ్రాసియున్నాడు. తన ముక్తిని సాధించుకొనుటకై కాదు అతడు వనములకేగి తపస్సుచేసినది. ఈ లోకమంతయు దహించుకొనిపోవుచున్నట్లును, అందుండి దానిని విముక్తిచేయు మార్గమును అన్వేషించుట తన కర్తవ్యమనియు అతడు భావించెను. "ఈ భూలోకమున ఇంతదుఃఖము ఏలకలదు" అనునదే అతని జీవితమంతటిని లోబఱచుకొనిన సమస్య! మనము బుద్ధునంత ధర్మశీలురమని చెప్పగలమా?

నరుడు స్వార్థపరుడైన కొలదిని అవినీతిపరుడగుచుండును. ఈ సత్యము జాతులకుకూడ అన్వయించును. స్వార్థచింతకు బద్ధమైయున్న జాతి, లోకములోనికెల్ల క్రూరమును దుష్టమును అగుచుండినది. అరేబియా ప్రవక్త ప్రచారము చేసిన మతము కంటె అధికముగా ద్వైతభావమును బట్టుకొని వ్రేలాడిన మతము

ఇంకొకటిలేదు. అంత రక్తపాతము సలిపినట్టియు, అన్యజనులయెడల అంత ద్వేషముం జూపినట్టియు మతము ఇంకొకటిలేదు. ఆ బోధనలను నమ్మని నరులను హతముచేయుడను విధి ఖురానునందు గలదు; అట్టివారిని వధించుటే వారియెడల కరుణజూపుట విశ్వాస రహితులను చంపుటే, సౌందర్యమూర్తులగు అప్సరసలును, అనంతములగు విషయభోగములును మెండుగగల స్వర్గమునకు పోవుట కమోఘసాధనము. అటువంటి విశ్వాసముల మూలమున లోకమున ఎంతటి రక్తపాతము సంభవించినదో విచారింపుడు.

క్రీస్తుమతమునందు అపరిణతత మిక్కిలి స్వల్పము. క్రీస్తు బోధించిన అసలు మతమునకును వేదాంత మతమునకును అంతగా భేదములేదు. అందును అద్వైతభావము గలదు; కాని ఆ పరమావధికి ప్రజలను చేర్చుటకుగాను వారి కాధారముగా స్థూలతరమగు ఊతను అందించుటకై ద్వైతభావములనుగూడ ఆయన బోధించెను. "స్వర్గమందున్న మనతండ్రి" యని బోధించిన ఆ ప్రవక్త "నేనును నా తండ్రియు ఒక్కరమే" అనియు బోధించెను. "స్వర్గమందలితండ్రి" ద్వారముననే "నాకును నా తండ్రికిని అభేదము" అను ఆదర్శమును చేరుట సాధ్యమని అత డెఱిగి యుండెను. క్రీస్తు బోధించిన అసలు మతమునందు ఆశీస్సులును ప్రేమయు మాత్రమే జూపట్టును; కాని దానిలో అపరిపక్వభావములు ప్రవేశింపగానే అది అరేబియా ప్రవక్తమతమునకంటె అంతగా మిన్నకాకుండు స్థితికి దిగిపోయినది. ఈ సంకుచితాత్మకై పెనగులాడుటయు, ఈ యిహలోకమునందే గాక మరణానంతర మందును ఈ "అహం" స్థిరముగా ఉండవలయునని కోరుచు దానిని పట్టుకొని ప్రాకులాడుటయు మాథ్యముగదా. కాని దీనినే వారు స్వార్థరాహిత్యమనియు, నీతికి పునాదియనియు కూడ చెప్పుదురు. నీతి కిది పునాదియగుట నిజమయ్యేనేని, మనల నిక దైవమే రక్షింపవలెను. వివేకవంతులగు స్త్రీపురుషులుసయితము

ఈ క్షుద్రవ్యష్టిత్వము పోయినచో, నీతియే ధ్వంసమగునని భ్రమించుచు, దానిని అంత మొందించుట మీదనే నీతిధర్మము ఆధారపడుననిన నిర్ఘాంతపోయి చూచుట ఆశ్చర్యకరముగ తోచుచున్నది. విశ్వకళ్యాణమునకును నైతికక్షేమమునకును ధర్మసంజ్ఞయై యొప్పునది ఈ "అహం" కాదు, "త్వం" (నీవు) అనునది. స్వర్గనరకములు ఉండిన నేమి, లేకున్న నేమి? ఆత్మ ఉన్నను లేకున్నను ఏమి కొదువ? నిర్వికారబ్రహ్మము ఉన్నదో లేదో యెవరికి ఆ గొడవ? ప్రపంచము ప్రత్యక్షముగ కాన్పించుచున్నది; అందు దుఃఖము నిండియున్నది. అల బుద్ధుడు కావించినటుల ప్రపంచములోనికి జొయి యా దుఃఖమును తగ్గింపుడు; లేదా ఆ ప్రయత్నమున ప్రాణార్పణము సలుపుడు. నిన్ను ("అహం"ను) విస్మరించుకొనుము. ఆస్తికుడవైనను, నాస్తికుడవైనను; అజ్ఞేయవాదివైనను, వేదాంతివైనను; క్రైస్తవుడవైనను, మహమ్మదీయుడవైనను; నీవు మున్ముందుగా నేర్చుకొనవలసిన ధర్మమిదియే. అందఱికిని విస్పష్టముగా తెలిసిన నీతిపాఠ మీ సంకుచితాత్మను రూపుమాపి, సత్యాత్మను ప్రతిష్ఠించుకొనుటే సుడీ!

బండిచక్రములలీల ఒకదాని ప్రక్కను ఒకటిగా రెండు శక్తులు నడుచుచుండును. ఒకటి "నేను" (అహం) అనుచుండును. రెండవది "నేను కాదు" (నాహం) అనుచుండును. ఇవి నరునందే గాక పశువులందును మఱియు చిన్నపురుగులందును కూడ కలవు. నరుని పట్టి గోళ్లతో చీల్చి వేసి నెత్తురును త్రావు ఆడుపులి తన బిడ్డలను రక్షించుటకై తన ప్రాణములను అర్పించును. జంకు గొంకులు లేక సోదరమానవులను వధించు నీచాతినీచుడును ఆకటిబాధతో వాగులు తన భార్యను బిడ్డలను సంరక్షించు నిమిత్తము ప్రాణముల నర్పింపవచ్చును. ఇట్టి రెండు శక్తులును జగమందంతటను కూడి చరించుచున్నవి. ఒకటి కాన్పించుచోట

రెండవదియు చూపట్టును. ఒకటి స్వార్థపరత, రెండవది స్వార్థ త్యాగము. ఒకటి సంపాదనము, రెండవది వ్యయము. ఒకటి స్వీకరణము, రెండవది దానము. బ్రహ్మాది పిపీలిక పర్యంతము ఈ జగత్తు సర్వము ఈ రెండు శక్తులకును నాట్యరంగమై యొప్పు చున్నది. దీనికి రుజువే అవసరము లేదు. తేట తెల్లముగా అందఱ కును కాన్పించుచునే యున్నది.

జగద్వ్యాపారమంతయు, అనగా విశ్వపరిణామమంతయు, ఈ రెండుశక్తులలో నొకటగు స్పర్థ (వైరము) మీాదనే ఆధారపడి యున్నదని చెప్పుటకు జనులలో ఏ పక్షమువారికిని సర్వాతలేదు. జగద్వ్యాపారమంతటిని క్రోధము, వైరము, స్పర్థ, పోటీ, పోరాటముపైని ఆధారముచేయుటకు వారికి ఏమి అధికారము గలదు? ఇవి ఉన్నవి అనుట నిజమే. కాని రెండవశక్తి పనిచేయుట లేదనుటకు ఎవరికిని హక్కు లేదు. ఎవరైనను ఈ ప్రేమ, ఈ "నాహం" (నేను కాదనుట), ఈ త్యాగము, తప్ప వేఱగు అనుకూలశక్తి యేదెస లోకమున కాన్పించుచున్నదని చెప్ప గలడా? మొదటిదియు ప్రేమశక్తియొక్క వక్రరూపమే అన వచ్చును. ప్రేమశక్తియే స్పర్థకు (పోటి) దారితీయును. నిజముగా స్పర్థకు జన్మస్థానము ప్రేమయే. దుర్మార్గమునకు నిజమగు మూలము స్వార్థరాహిత్యమే. దురితమునకు కారణభూతమైనది మంచియే. దాని ఉద్దేశముకూడ మంచిదే! త్యాగశక్తి అను సరించు వక్రగతియే దుష్కర్మ! నరహత్య కావించినవాడు తన బిడ్డపైగల ప్రేమచేతనే అది కావించియుండవచ్చును. ఆతని ప్రేమ జగమునగల కోట్లకొలది ప్రజలను కాదని సంకుచితమై, తన చిన్నబిడ్డయందు పరిమితమై పోయియుండును; కాని, పరిమిత మైనను, అపరిమితమైనను, అది ప్రేమయేసుడీ!

కావున ఈ జగత్తునకు మూలబలమై నడుపుచుండునది, ఏ మార్గమున ప్రకటనకు వచ్చినను, ఆ ఒక్క శక్తియే. ఆ అద్భుత

శక్తియే స్వార్థరాహిత్యము, త్యాగము, ప్రేమ అనబడును. జగమునగల సత్యమగు చైతన్యశక్తి అది యొక్కటియే. కాబట్టియే వేదాంతి ఏకత్వమునకంత ప్రాముఖ్యమిచ్చుట. జగత్తునకు మూలములై రెండుశక్తులుండునని సమ్మతింపజాలము గనుకనే ఈ వివరణము కింత ప్రాముఖ్యమిచ్చుచున్నాము. అద్భుతమై మనోహరమై వెలయు ఆ ప్రేమయే పరిమితమగుటచేత పాపముగా, నీచతగా గాన్పించుచున్నది అని ఒప్పుకొంటిమా, ఆ ఒక్క ప్రేమశక్తి మూలముననే జగద్వ్యాపారము సర్వమును తెల్లమై పోవుచున్నది. కాదేని, జగత్కారణములై ఒప్పు రెండుశక్తు లున్నవి: ఒకటి శుభము, రెండవది అశుభము; ఒకటి ప్రేమ, రెండవది ద్వేషము అనవలసి వచ్చుచున్నది. ఏది యెక్కువగా తర్కపరీక్షకు ఆగగలదు? ఏక శక్తికి సిద్ధాంతమే నిలుచును అనుటకు సందియము లేదు.

ద్వైతమతమున కేమాత్రము సంబంధింపజాలని విషయము లనుగూర్చి యిక విచారింతము. ద్వైతుల విషయము నింకను విచారించుటకు నాకు తీఱిక లేదు. ఉత్తమోత్తమమగు ఆధ్యాత్మిక తత్త్వము ననుగమించుచు అత్యుత్తమమును స్వార్థరహితమును అగు నైతికాదర్శముకూడ వఱలుచుండుననియు, కావున నీతులను ధర్మములను సాధించుకొనుటకై మీ ఆధ్యాత్మికాదర్శమును క్రిందు చేయ నవసరము లేదనియు తెలుపుటే నా ప్రయత్నము. నీతికిని ధర్మమునకును యథార్థమగు మూలమును కనుగొననగోరువారు ఎంత మహోన్నతములగు తాత్త్వికభావములను, ప్రకృతిశాస్త్ర నిర్ణయములను గ్రహించిన నంత అనుకూలముగా నుండును. మానవజాతి కల్యాణము నరుని విజ్ఞానముచే భంగమొందదు. భంగమొందక పోవుటే కాదు. మన జీవితశాఖ లన్నిటియందును మనలను రక్షించునది జ్ఞానమే. జ్ఞానార్జనమునందే భగవ దారాధనయు ఇమిడియున్నది. ఎంత జ్ఞానమును సంపాదించిన

అంత శ్రేయస్కరము. అనర్థమై చూపట్టు సర్వమునకును మూలము అఖండబ్రహ్మమును పరిమితముగా భావించుటే అని వేదాంతవాదము. పరిమితమై సంకుచిత మార్గముల నడచుచు, దోషముగా కానవచ్చు ప్రేమయే తుదకు రెండవ కొనయందు భగవత్స్వరూపముగ ప్రత్యక్షమగుచున్నది. మఱియు కీడనున దొకటి కలదని తోచుటకు మూలకారణము మనయందే యున్న దని వేదాంతము తెలుపుచున్నది. ప్రకృతికి అతీతమగు ఏ దైవత మునో నిందింపబోకుడు; ఆశలనువిడిచి దిక్కు లేదని విలపింపకుడు. ఎవరోవచ్చి మనకు చేయూతయిచ్చినతప్ప మనము తరించు త్రోవలేదని వాపోవకుడు. అది అసంభవమని వేదాంతము బోధించుచున్నది. మనము పట్టుపురుగులలీల నున్నాము. మన లోపలనుండియే మనము దారమును కల్పించుకొని, గూడును అల్లుకొని, క్రమక్రమముగ దానిలో చిక్కుకొనిపోవుచున్నాము. కాని యిది చిరకాలము ఇటులనే జరుగదు. ఆ గూడులోనే పరమార్థజ్ఞానసాధన గావించి, సీతాకోకచిలుకలవలె ముక్తులమై వెలువడుదుము. 'కర్మ' అను గూటిని మనచుట్టును మనమే అల్లుకొనుచున్నాము. అజ్ఞానమువలన మనము బద్ధులమైతిమని భావించి విలపించుటకును, రక్షణకై విలపించుటకును మొదలిడు చున్నాము. వెలుపలినుండి యే సహాయమును రాబోదు; అది మనలోనుండియే వచ్చును. విశ్వమునందలి దేవతలను అందఱిని గూర్చియు మొఱలిడుము. అనేకవత్సరములు నేనును అట్లు మొఱలిడితిని. తుదకు నాకు సహాయము లభించినది. కాని అది నా అభ్యంతరమునుండియే ప్రాప్తించినది. అప్పుడు నేను అజ్ఞానము చేత కావించినది అంతయు రద్దుచేసికొనవలసివచ్చినది. ఇదొక్కటే మార్గము. నా చుట్టును నేనే అల్లుకొనిన గూటిని నేనే ఛేదింప వలసి వచ్చినది: అందుకు వలయు శక్తి లోపలనే యున్నది. నా జీవితములోని వాంఛ యొక్కటియైనను—అది మంచిదికాని, చెడ్డదికాని — వ్యర్థముకాలేదని నాకు గట్టి నమ్మకముకలదు.

నా పూర్వ ప్రవర్తనమంతకును—అందలి మంచికిని చెడ్డకును — సమష్టిఫలమే నా ప్రస్తుతదశ. నా జీవితమున నేను అనేక లోపములను కావించితిని. కాని ఆ లోపములలో ఏది లేకున్నను, నేను నా ప్రస్తుత స్థితికి వచ్చియుండక పోదును అనుట నిస్సంశయము. కావున వానిని కావించినందుకు నేను పూర్ణసంతృప్తుడనై యున్నాను. అట్లనుటవలన మీరిక ఇండ్లకుబోయి బుద్ధిపూర్వకముగ దోషములను ఆచరింపవలసినదని తెలుపుట నా యాశయము కాదు సుడీ! నా పలుకులకు ఆ రీతిగా అపార్థము చేయకుడు. కాని లోపములను కావించితిమే యని విలపింపబోకుడు; తుదకన్నియు చక్కబడునని తెలిసికొనుడు. గత్యంతరములేదు. ఏలనన సౌజన్యమే మనస్వభావము — మనకు పవిత్రత సహజమైనది. అదెట్లు నాశమునొందగలదు? మన సత్యస్వభావము సదా ఏకరీతిగనే నిలిచియుండును.

మనము ఇప్పుడు గ్రహింపవలసినది ఇది : మనము దుర్బలురమగుట చేతనే పొరపాటు లనుకొనునవి, దోషములనుకొనునవి చేయుచుండుట. మన అజ్ఞానమే ఆ దుర్బలతకు కారణము. పొరపాటులు అను పదమును ప్రయోగించుటే నా కిష్టము. 'పాపము' అను శబ్దము ప్రప్రథమమున మిక్కిలి మంచిదే గాని, ఇప్పుడు నాకు భీతిగొలుపు కొన్ని లక్షణములు అందు జేరినవి. మనలను అజ్ఞానులుగా చేసినది ఎవరు? మనమే. మన చేతులతో కండ్లను కప్పుకొని చీకటిగానున్నది అని విలపించుచున్నాము. చేతులను తొలగించుకొనుడు. వెలుతురు కాన్పించును. జీవాత్మలో స్వప్రకాసిత సతతము మనకొఱకై వెలుగుచునే యున్నది. మన ఆధునిక ప్రకృతిశాస్త్రవేత్తలు ఏమనుచున్నారో వినలేదా? పరిణామమునకు కారణమేది? ఇచ్ఛ. పశువొక పనిచేయుటకు ఇచ్ఛగించుచున్నది. పరిస్థితులు దానికి అనుకూలముగ కాన్పింపవు. కావున అదొక నూతనశరీరమును కల్పించుకొనుచున్నది. ఎవ

రీ పరిణామమునకు కర్త? ఆ పశువే! దానియిచ్ఛయే! అత్యల్ప జీవకణమునుండి నీవిట్లు పరిణామమును పొందివచ్చితివి. నీ యిచ్ఛా వ్యవసాయమును ఇంకను సాగింపుము. అదియే ఇంకను నిన్నుద్ధరించును. ఇచ్ఛాశక్తి అనంతము. అది సర్వశక్తిమంతమైయుండ నే నెందుకు దేనినైనను జేయజాలనని నీవు ప్రశ్నింపవచ్చును. కాని (అట్లు ప్రశ్నించునప్పుడు) నీవు నీ సంకుచితాత్మనుగూర్చి మాత్రమే యోచించుచున్నావు. సూక్ష్మజీవకణమునుండి మానవ రూపమును పొందువరకును, వెనుకకు తిరిగి నీ దశాంతరములను చూచుకొనుము. అదంతయు నెవరొనర్చిరి? నీ యిచ్ఛయేకదా! నీ యిచ్ఛ సర్వశక్తిమంతముకాదు అనెదవా యింకను? నిన్నింత యున్నతికి దెచ్చిన శక్తి, యింకను నిన్నుద్ధరింపజాలును. ఇచ్ఛా శక్తిని బలపఱచు శీలము నీ కవసరముగా నున్నది.

నీవు కొన్ని యకృత్యము లొనర్చుటచేతనే, నీ కీ పాప స్వభావము కలిగినది. కాన ఇంటికిబోయి పరితాపసూచకముగా బ్రతికియున్నంతకాలమును రోదనముచేయుమని నేను బోధించిన యెడల, నీ కది సహకారి యగుటకు మాఱు నిన్నింకను దుర్బ లుని కావించునుగదా. ధర్మముదిశకు మాఱుగా నిన్ను ఇంకను దోషమువైపునకే యీడ్చుకొనిపోవు మార్గమును చూపిన వాడ నగుదునుగదా. ఈ గృహము వేలకొలది సంవత్సర ములనుండి చీకటిగానున్నయెడల నీవు దానిలో ప్రవేశించి "అయ్యో చీకటి! అయ్యో చీకటి!!" అని విలపించినచో, చీకటి పోవునా? ఒక్క నిప్పు పుడక గీయుము; క్షణములో వెలుగు నిండును. "అయ్యో నేను పాపముచేసితిని, అకటా నేను ఎన్నియో దోషములను కావించితిని" అని నీ జీవితమెల్ల తల పోయుచు కూర్చుండిన ఫలమేమి? నిష్ఫలమని ఏ భూతమోవచ్చి బోధచేయ అవసరములేదు. వెలుగును కల్పింపుము; దోషము దానంతట అదియే క్షణములో అదృశ్యమగును. శీలమును

నిర్మించుకొనుము; తేజోమయమై, ప్రకాశవంతమగు, సదా పునీతమగు, నీ సత్యస్వభావమును ప్రకటింపుము. నీకు అగపడు ప్రతివానియందును దానిని ప్రజ్వలింపజేయుము. నీచాతినీచునందు సయితము గల సత్యాత్మను ప్రత్యక్షము జేసికొనజాలి, వానిని దూషించుటకు మారుగా, "లెమ్ము; ఓ తేజస్వీ, మేల్కొనుము, నిత్యపావనమూర్తీ, ప్రబోధముగాంచుము, జననమరణరహితుడా, నిద్రలెమ్ము, సర్వశక్తిసంపన్నుడా, నిర్నిద్రుడవుకమ్ము, నీ నిజస్వభావమును వ్యక్తపఱపుము, సంకుచితములగు ఈ వ్యక్తీకరణములు నీకు అర్హములుకావు సుమీ!" అనుచు వారికి ప్రబోధింపజాలు సమర్థత మనకందఱకును అలవడినచో ఎంత బాగుండును! అద్వైతము బోధించు అత్యుత్తమధ్యానము ఇదియే: ఇదియే యేకైక ధ్యానము: మన సత్యస్వభావమును సంస్మరించుటే; మనలో సదా వెలుగు ఈశ్వరుని పరిపూర్ణునిగను, సర్వశక్తిమంతునిగను, నిత్యశుభంకరునిగను, సంతతోపకారిగను, స్వార్థరహితునిగను, అనంతునిగను నిరంతరము ధ్యానముచేయుటే మహోత్తమ ప్రార్థన. ఆ స్వభావము స్వార్థరహితమైనది; కావుననే అది బలాఢ్యమైనది, నిర్భయమైనది. స్వార్థపరునేగదా భీతి బాధింపగలదు. తనకై దేనిని కోరనివాడు ఎవరికి భయపడును? వానిని ఏది భీతిలచేయగలదు? మరణమన్నను వాని కేమిభయము? ఏ అపకారమునకు ఆతడు భీతినందును? కాబట్టి మనము అద్వైతవాదులమైనచో, ఈ క్షణమునుండియే మన పూర్వపు "అహం" నశించిపోయినదని మననము చేయదగును. ఆ పేరున ఈ పేరున పరగు వ్యష్టులందఱును అదృశ్యులయిరి. వారందఱును అజ్ఞానదృష్టిచే కల్పింపబడినవారు. నిత్యశుద్ధమును శక్తిమంతమును సర్వజ్ఞమును అగు బ్రహ్మము మాత్రము ఇప్పుడు నిలిచియున్నది. మన భీతియెల్ల తొలగిపోయినది. సర్వవ్యాప్తమై తేజరిల్లు మనలను ఎవడు బాధింపనోపును? అప్పుడు మన దుర్బలతయెల్లయు తొలగిపోయినది. మనతోడివారిలో ఈ జ్ఞానమును ప్రబోధించుటే మన

యిప్పటి కర్తవ్యము. వారును ఆ పవిత్రాత్మయే యని మనమెఱుగుదుము. వారికిమాత్ర మది తెలియకున్నది. మనమువారికి దానిని దెలిపి వారును తమ యనంతస్వరూపమును ప్రబోధము గావించుకొనునటుల చేయవలయును. ఇప్పుడు సమస్తప్రపంచము నందు అతిముఖ్యముగా జరుగవలసినపని యిదని నాభావము. ఈ సిద్ధాంతములు చాల పురాతనములు. అనేకపర్వతములకంటె పురాతనములై యుండనోపు. సత్య మనంతము. సత్య మొకని సొత్తుకాదు. ఏ జాతిగాని యే వ్యక్తిగాని అది తనదేయని వాదింప వీలులేదు. సత్యము సర్వాత్మల సహజలక్షణము. ఎవ డది కేవలము తనదని వాదింపజాలును? కాని యీ భావనను అనుష్ఠాన యోగ్యముగ నొనరింపవలయును. సుగ్రాహ్యముగ జేయవలయును. మహోన్నత సత్యములన్నియు — ధర్మములన్నియు — సుగ్రాహ్యములైనవే. అప్పు డీ తత్త్వము మానవజాతియం దెల్లెడల వ్యాపించి, మహామనీషాగ్రగణ్యులకును, సర్వసామాన్యులకును, స్త్రీకిని, బురుషునకును, శిశువునకునుగూడ లభ్యమై వఱలగలదు. తర్క-వాదములును, దార్శనికసిద్ధాంతసంపుటములును, భాగవతబోధలును, క్రతువులును, ఆయాకాలములందు మహోపకారకములే యైయుండినవి! ఇప్పుడో సులభతరమార్గములు సమకూరుగాక! ప్రతినరుడును సాధకుడై, ప్రతినరునందలి సత్యస్వరూపము పూజార్హవిగ్రహమై పరగు సత్యయుగమును ప్రారంభింతుముగాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



# భక్తియోగోపన్యాసములు

## ప్రాథమికాంశములు

భక్తియోగ నిర్వచనములలో ప్రాయశః మిగుల ఉత్కృష్టమైన నిర్వచనము ఈ వాక్యములందు గలదు: "హే భగవాన్! అస్థిర ప్రాకృత ప్రాపంచిక విషయములపై వివేకరహితులకు ఎట్టి మాపుకాని మక్కువ యుండునో — నీ సాక్షాత్కారమును కాంక్షించు నా హృదయమును అస్తమయ మెఱుగని అట్టి అనురాగము ఎన్నడును వీడకుండుగాక!" ఇంద్రియములు వలచు వస్తువులపై, ధనముపై, దుస్తులపై ఆస్తులపై ఆలుబిడ్డలపై, స్నేహితులపై మానవుల కెంత ప్రగాఢమైన ప్రీతి (ఘనతరమైన ప్రేమకు అవగతులు కాకపోవుటవలన) యుండునో మన మవలోకించుచున్నాము. ఈ వస్తునిచయముపై వారి కెంత మిక్కుటమైన మక్కువ కలదో! దీని నెఱిగి పూర్వోక్త ప్రార్థనలో యోగి "అట్టి ప్రగాఢప్రణయమును, అట్టి అద్భుతానురాగమును నీయెడల మాత్రమే కలిగియుందును" అని ముక్తకంఠముతో వాకొనెను. ఈశ్వరునకు సమర్పింపబడు ఈ అనురాగము భక్తి యనబరగును. భక్తి అస్తమయమెఱుగనిది. ఈశ్వరప్రదత్తశక్తులలో నేదియు వ్యర్థముకాదనియు, కైవల్యప్రాప్తికి సహజమార్గము వానియందు గలదనియు అది మనకు బోధించుచున్నది. మనప్రవృత్తులను భక్తి నాశనమొనరింపదు; ప్రకృతి కది ప్రతికూలముగాపోదు. మహత్తరమై, ఉదాత్తమైన పథమున దీని నది నడపును. ఇంద్రియములు వ్రాలు వస్తువులపై మనకెట్టి సహజానురాగముండును! అవి మనకు సన్నిహితములై, మనదృష్టిలో సత్యసందీప్తములై యుండుటవలన వానిపై మనకట్టి అనురాగముండి తీరును. ఉదాత్తవస్తువులందలి సత్యమును సాధారణముగా

# భక్తియోగోపన్యాసములు

## ప్రాథమికాంశములు

భక్తియోగ నిర్వచనములలో ప్రాయశః మిగుల ఉత్కృష్టమైన నిర్వచనము ఈ వాక్కులందు గలదు: "హే భగవాన్! అస్థిర ప్రాకృత ప్రాపంచిక విషయములపై వివేకరహితులకు ఎట్టి మాపుకాని మక్కువ యుండునో — నీ సాక్షాత్కారమును కాంక్షించు నా హృదయమును అస్తమయ మెఱుగని అట్టి అనురాగము ఎన్నడును వీడకుండుగాక!" ఇంద్రియములు వలచు వస్తువులపై, ధనముపై, దుస్తులపై, ఆస్తులపై, ఆలుబిడ్డలపై, స్నేహితులపై మానవుల కెంత ప్రగాఢమైన ప్రీతి (ఘనతరమైన ప్రేమకు అవగతులు కాకపోవుటవలన) యుండునో మన మవలోకించుచున్నాము. ఈ వస్తునిచయముపై వారి కెంత మిక్కుటమైన మక్కువ కలదో! దీని నెఱిగి పూర్వోక్త ప్రార్థనలో యోగి "అట్టి ప్రగాఢప్రణయమును, అట్టి అద్భుతానురాగమును నీయెడల మాత్రమే కలిగియుందును" అని ముక్తకంఠముతో వాకొనెను. ఈశ్వరునకు సమర్పింపబడు ఈ అనురాగము భ యనబరగును. భక్తి అస్తమయమెఱుగనిది. ఈశ్వరప్రద తశక్తులలో నేదియు వ్యర్థముకాదనియు, కైవల్యప్రాప్తికి సహజమార్గము వానియందు గలదనియు అది మనకు బోధించుచున్నది. మనప్రవృత్తులను భక్తి నాశనమొనరింపదు; ప్రకృతి కది ప్రతికూలముగాపోదు. మహత్తరమై, ఉదాత్తమైన పథమున దీని నది నడపును. ఇంద్రియములు వ్రాలు వస్తువులపై మనకెట్టి సహజానురాగముండును! అవి మనకు సన్నిహితములై, మనదృష్టిలో సత్యసందీప్తములై యుండుటవలన వానిపై మనకట్టి అనురాగముండి తీరును. ఉదాత్తవస్తువులందలి సత్యమును సాధారణముగా

మనము పరికింపము. ఇంద్రియాతీతవస్తువులందు సత్యమును విలోకించితిమేని, ఇంద్రియ విశ్వమునకు వెలుపల వెలయు యథార్థము మనహృదయము నాకర్షించినయెడల అది ఈశ్వరుడే యని మనము గుర్తింపవలెను. ఒకప్పుడు విషయవస్తువులపై జూపబడిన ప్రేమ భగవంతునియెడల జూపబడుచో, అది భక్తి యనబరగును. ఈ యధికానురాగము నలవఱుచుకొనుటెట్లో శ్రీ రామానుజస్వామి ఇట్లు వివరించెను :

వివేకమువలన నిది యలవడును. — ఇది మొదటిమెట్టు. ముఖ్యముగ ప్రతీచీవాసులకిది వింతగా చూపట్టవచ్చును. శ్రీరామానుజస్వామిదృష్టిలో ఇది ''ఆహారమును గుఱించినవివేకమై యుండవలెను''; మనకు శారీరక మానసిక శక్తులను ప్రసాదించు గుణము ఆహారమందు గలదు. ఆహారము మన ఉదరములో ప్రవేశించి, పరివర్తనమునంది, మనదేహములకు దార్ఢ్యమిచ్చి నడపును. మనము భుజించు ఆహారమునకును, మన శరీర మనస్సులకును ప్రధాన వ్యత్యాసమేదియునులేదు. ప్రాకృతప్రపంచములో మన మవలోకించు పదార్థశక్తులు మన శరీరమనస్సులను సృజించును. కావున శరీరమునకును, మనస్సునకును, మనము భుజించు ఆహారమునకును నడుమ గల వ్యత్యాసము బాహ్యావ్యక్తీకరణమందే అగపడును. మన యాహారపదార్థాంశములనుండి, భావసాధనము సృష్టియగును. ఈ యంశములందలి సూక్ష్మశక్తులనుండి భావము సృష్టియగును. కావున ఈ భావమును, దీనిని సృష్టించు సాధనములును మన యాహారము ననుసరించి మార్పుజెందుచుండును. మన మనస్సులందు కొంత వికారమును, కొంత మార్పును గలిగించు కొన్ని ఆహారపదార్థములు కలవు. ఈ విషయము ప్రతిదినము మన యనుభూతిలో స్పష్టమగుచున్నది. శరీరమున మార్పు గలిగించు మఱికొన్ని ఆహారవస్తువులు కలవు. కాలక్రమమున చిత్తముపై వీని ప్రభావము విశేషముగా ప్రసరించును. ఇది

ముఖ్యముగ గ్రహింపదగిన విషయము. మనము అనుభవించు యాతనలో విశేషభాగము మనము భుజించు ఆహారమువల్లనే సృష్టియగుచుండును. జీర్ణముకాని అమితాహారమును భుజించిన తరువాత మన మనస్సును చిక్కబట్టియుంచుట చాల కష్టమని మీరు గ్రహింపగలరు. భుక్తాయాసమున్నంతకాలము అవిరామముగా ఇందందు అది చిందులాడుచుండును. ఉద్రేకమును కలిగించు కొన్ని ఆహారపదార్థములు కలవు. ఇట్టి పదార్థములను భుజించితిరేని, చిత్తమును చెప్పుచేతలలోనుంచుట దుస్సాధ్యమే యగును. సారానుగాని, మత్తును గలిగించు మఱే పానీయమును గాని విశేషముగ త్రాగిన యనంతరము మనస్సు నరికట్టుట అసాధ్యమని అనుభవమువలన మనుష్యుడు స్పష్టముగ నెఱుగ జాలును. సంయమశక్తి నది అధఃకరించి చెలరేగును.

శ్రీ రామానుజస్వామి ఉద్దేశము ప్రకారము ఆహారమున మనము విసర్జింపవలసిన మూడువస్తువులు కలవు. అదేజాతి పదార్థమో, అదేరీతి ఆహారపదార్థమో మనము [illegible] వలెను. ఉద్రేకము కలిగించు వస్తువును, మాంసమువంటి పదార్థమును వర్జింపవలెను. స్వతస్సిద్ధముగ ఇది అశుభ్రమైనవస్తువు. మఱియొక ప్రాణిని సంహారించినగాని ఈ పదార్థము లభింపదు. దీనిని భుజించువారికి క్షణకాలము సంతోషము కలుగవచ్చును. ఈ సంతోష మొకనికి కలిగించుటకై మఱొకజీవి ప్రాణములను తీయవలెను. ఈ సంహారక్రియ అటుండగా, ఇతరమానవులు దీనివలన నీతిభ్రష్టులగుచుందురు. మాంసమును మెక్కు నాతడు తనచేతితో తానే ఒకజంతువును చంపి అట్లొనరించుట మేలు. కాని యిట్లు జరుగుటలేదు. తమకొఱకై ఆ పనిని జరపు ఒక తరగతివారిని సంఘము తలయెత్తనిచ్చుచున్నది. ఈ తరగతివారి నది జుగుప్సతో వీక్షించుచుండును. ఇంగ్లాండులో కసాయివాడు జూరీసభ్యులలో నొకడై యుండుటకు అర్హుడుకాడు.

అతనిది దుష్టస్వభావమని ఇందువలన బోధపడుచున్నది. వానిని దుష్టునిగా జేసినదెవరు? సంఘమే. గోమాంసమును, మేకనంజుడును మెక్కని వారెవ్వరును లేనియెడల, కసాయివాండ్రే యుండరు. ఎంతో కష్టపడి పనిచేయువారు మాంసమును తినినను తినవచ్చునేమో! వీరిలో నెవ్వరును భక్తులు కాజాలరు. మీరు భక్తులు కాగోరుదు రేని, మీరు మాంసమును స్పృశింపరాదు. మాంసమునే కాదు; ఉల్లిపాయలు, దుర్గంధబంధురమైన ఒకవిధమైన జర్మనీ సీమ ఊరుగాయలు మున్నగు పదార్థములను,—ఉద్రేకమును బుట్టించు వస్తువులను వర్జించి తీరవలెను. తమస్థితి మారువరకు కొన్నిదినములు నిలువచేయబడిన పదార్థములును, సహజరసములు ఇంచుమించుగా ఆరియెండిన వస్తువులును, దుర్వాసనతోనుండు పదార్థములును విసర్జింపబడవలెను.

ఆహారమును గూర్చి విచారణీయమైన మఱొక విషయము పాశ్చాత్త్యుల మనస్సులకు మఱింత దురూహ్యమై యుండును — అది ఆశ్రయమనబరగును. — ఎవనినుండి ఆ యాహారము వచ్చుచున్నదో యను అంశము గణసీయము. ఏ యాశ్రయమునుండి ఆ యాహారము లభించుచున్నది? అని యోచింపవలెను. ఇది హిందువులలో ప్రచలితమగు ఒక విచిత్రసిద్ధాంతము. ప్రతివ్యక్తి చుట్టు ప్రత్యేకమైన ప్రభావము ఆవరించుకొనియుండును. అతడే వస్తువును స్పృశించినను, అతని నడతలో కొంతభాగము, అతని ప్రవర్తనలోని ప్రభావము అతడు స్పృశించిన పదార్థమును సోకును. కొండొక శారీరకశక్తివలె ఒకమనుష్యుని గుణమహిమ అతనినుండి వ్యక్తమై అతడు ముట్టినదానిని హత్తుకొనును. వంట జరుగునపుడు ఆహారము నెవరు స్పృశించుచున్నారో మనము జాగ్రత్తగా పరిశీలింపవలెను; దుష్టుడుగాని నీతిబాహ్యుడుగాని దాని నంటరాదు. భక్తుడు కాగోరువాడు పరమదుష్టులని తా నెఱిగినవారితో భుజింపరాదు. ఏలననగా వారిదౌష్ట్యము అంటురోగమువలె ఆహారముద్వారా అతనిని సోకితీరును.

నిమి తములు ఏ వస్తువులద్వారా ఆహారము గ్రహింప బడుచున్నదో యను నంశము తరువాత గణనీయమైనది. ఆహార శుభ్రత వీనిమూలమునగూడ గ్రహింపదగినది. ఆహారమందు ధూళికాని, రొచ్చుగాని ప్రవేశింపగూడదు. బజారునుండి ఆహార మును తీసికొని రాకూడదు. కడిగి పరిశుభ్రముచేయని బల్లపై ఆహారము నుంచరాదు. నోటిలో సృష్టియగు ఉమ్మి యను పదార్థ మును, కడుపులో జీర్ణ సమయమున ఊరు రసములనుగుఱించికూడ మనము యోచించి తీరవలెను. వ్రేళ్లతో పెదవులను ఎన్నడును స్పృశింపరాదు. ఉదరము నంటియుండు పలుచని చర్మము — జిగురుగానుండు చర్మము — శరీరమందలి మిగుల సున్నితమైన భాగము. నోటిలో నూరుచుండు ఉమ్మినుండి పెక్కుస్థితులు లోనికి వ్యాప్తియగుచుండును; లోపలినుండి దాని ద్వారా వ్యక్త మగుచుండును. దాని సంస్పర్శవలన చెఱుపు ఘటిల్లుట తథ్యము; అది భయంకరమైనదనియు తెలుపజెల్లును. ఒకరు సగము తినగా మిగిలిన ఆహారమును మనము భుజింపరాదు. ఈ యాహారనియమ ములను పాటించునపుడు, ఆహారము పరిశుభ్రమై యుండును. పరిశుభ్రాహారమువలన మనస్సు పరిశుభ్రమగును. పరిశుభ్రమైన మనస్సు అవిరతమననమునకును, అవిరళనిధిధ్యాసమునకును, నిరం తర ఈశ్వరధ్యానమునకును యోగ్యమై యుండును.

మఱియొక భాష్యకర్త శ్రీశంకరాచార్యులు ఈ విషయ మును పరిశీలించిన తెఱగును వివరింతును. ఈ మహనీయుని వ్యాఖ్యానము వేఱుతీరున నున్నది. 'ఆహార' మను సంస్కృత ధాతువున కర్థము 'సంగ్రహము'. సంగ్రహింపబడినది ఆహారము. ఆయన వ్యాఖ్యానమేమి? ''ఆహారము పరిశుభ్రముగా నున్నపుడు మనస్సు నిర్మలమైయుండు''నను వాక్యమున కర్థ మిది: ''ఇంద్రియ ములకు లోబడకుండుటకై ఈ దిగువ విషయమును మనము పరిత్యజింపవలెను. వర్జనీయమైన ప్రథమాంశము అనురక్తి.

ఈశ్వరునియెడల తక్క మఱెవ్వరియెడల గాఢముగ మన మను రక్తులమై యుండరాదు. ప్రతివిషయమును అవలోకింపుడు ; ప్రతి కార్యమును నిర్వహింపుడు ; కాని దేనియెడలను అనురక్తులై యుండకుడు. తీవ్రమైన ఆసక్తభావము చెలరేగినపుడు, మను ష్యాత్మసంయమమును గోల్పోవును ; తనయింద్రియములమీఁది యధికారము మానవుఁడువిడిచివేయును; తనకుదానుదాసై పోవును. ఒకపురుషునిపై నొకయాఁడుది విశేషముగ ననురక్తయై యుండుచో, ఆతని సమక్షమున నామె బానిసబ్రదుకు నీడ్చును. బానిసబ్రదుకు వలన ప్రయోజనమేమి కలుగును? తోడిమానవునకు బానిస యగుటకంటె, జగతిలో గమనార్హములైన మహత్తరాంశములు బహుళముగ గలవు. ప్రతివారిని ప్రేమింపుడు, ప్రతివారికి మేలి సేవచేయుడు, కాని ఎన్నటికిని బానిసలు కాకుండుడు. అనురక్తివలన అథఃపతితులమయ్యెదము. ఈ వ్యక్తిగత అథఃపతనము తొలుతటి చెఱుపు. దీనివలన మనలో స్వార్థచింత మిక్కుటమగును — ఇది రెండవ చెఱుపు. ఈ దోషమువలన ఎవ్వరియెడల మన మనురక్తులమై యుందుమో, వారికి మేలుచేయుటకై ఒరులకెగ్గుచేతుము. ప్రపంచములో జరగు దుష్క్రియలలో నధికసంఖ్యగలవి కొందఱి యెడల జూపబడు విశేషాసక్తభావమువలన నెఱపబడినవే. సత్క్రియలను నిర్వహించునప్పుడు తక్క తక్కిన సకలజీవిత సన్నివేశములందు ననురక్తిని విడువవలెను; కాని ప్రతివారియెడల ప్రేమ జూపుట ముఖ్యము. ఇక ఈర్ష్య విషయమందురా? ఇంద్రియములు వలచు విషయనిచయమందు, వస్తుసముదాయ మందు అది తలయెత్తరాదు. సర్వారిష్టములకు మూలహేతువు ఈర్ష్యయే. దీనిని నిర్జించుట సామాన్యాంశముకాదు. భ్రాంతి లేక మోహమువలన మన కెనలేని సేగు దాపురించును. ఒక విషయమందలి సత్యముపై దృష్టి నిలుపజాలక, దానిని వేఱు తీఱుగ విలోకించి, అపోహ ననుసరించి ఆచరణమునకు కడంగు దుము. ఇట్టి చేతవలన తలమీఁదికి కుంపటి నెక్కించుకొందుము.

"దూ! దూ!" అని అనర్థమును ఆహ్వానింతుము. మేలైన వస్తువును కీడైనదని ఎంచెదము. క్షణకాలమే దేని మనశరీర మందలి స్నాయువునకు గిలిగింతలు పెట్టుచో, దానివలన మనకు విశేషాభ్యుదయము చేకుఱునని ఆశపడుదుము. తత్క్షణమే మక్కువతో దాని నక్కున జేర్చికొందుము. తడయక ఆ యంశమున గుభాలున నుఱుకుదుము. తీవ్రాఘాతము పైబడినపుడు 'హాత విధీ!' అని అంగలార్చెదము. అరిష్టపు బిడికిట జిక్కిన పిదప మురపిల్లిన ప్రయోజనమేమి? ప్రతిదినము మన మీ భ్రమలో పడిపోవుచుందుము. ఆజన్మము ఈ ప్రమాదమున పడుచునే యుందుము. దేనియెడలను అనురక్తి జూపక, ఈర్ష్యకుగాని, భ్రమకుగాని లోబడక ఇంద్రియములు జగతిలో కర్తవ్యమును నిర్వహించుచుండుచో, ఈ కర్తవ్యము లేక నిరుద్దిష్టసంకల్పసము దాయము నిర్మలాహారమగును. ఇది శంకరభగవానుల వ్యాఖ్యానము. పరిశుభ్రోదనమును గ్రహించినపుడు, అనురక్తిచే, ఈర్ష్యచే, భ్రమచే, అపోహచే, విషాక్తములుకాని విషయములను స్వీకరించి, వానిని మననమొనరించినపుడు మనస్సు నిర్మలమై, పునీతమై వెలయును. నిరంతరము ఈశ్వరధ్యానమునకును, ఈశ్వరసంస్మరణమునకును అది యపుడర్హతగలిగియుండును

శ్రీ శంకరుని వ్యాఖ్యానమే ఉత్కృష్టమైనదని ఎవ్వరైన తెలుపుట సహజమే. కాని శ్రీ రామానుజస్వామి వ్యాఖ్యానమును నిరాదరణదృష్టితో త్రోసివేయరాదు. ఆహారముపై సాదరలక్ష్యమును సారించినపుడే శేషించిన జీవితాంశములు సక్రమముగ నిర్వహింపబడును. మనస్సు నియంత్రణకారియని, శాసనకర్తయని తెలుపుట వాస్తవమే; చిత్తమున కధికారముండుట నిర్వివాదాంశము. కాని మనలో ఇంద్రియములకు లొంగనివారి సంఖ్య అత్యల్పము. విషయవస్తువులు మనపై అధికారమును విజృంభింపజేయును. ఇది సాగునంతకాలము

విషయవస్తుగతసహాకారము మన కావశ్యకమై యుండును. మనకు సత్త్వ కలిగినపుడు మనకిష్టమువచ్చిన పదార్థములను మనము భుజింపవచ్చును; వలసిన పానీయమును త్రాగవచ్చును. ఆహార పానీయములను గుఱించి జాగరూకులమై యుండుటకై శ్రీరామానుజస్వామి హితవును మనము శిరసావహింపవలెను. తోడ్తోడనే మానసిక ఆహారవిషయమునగూడ మనము జాగ్రత్త వహింపవలెను. స్థూలదృష్టికిదోచు ఆహారమునుగుఱించి జాగ్రత్త పడుట కష్టముకాదు.—మానసికకర్తవ్యముకూడ తోడ్తోడనే జరుగవలెను. ఇట్లొనరించితిమేని, క్రమక్రమముగ మన యాత్మ శక్తి బలవత్తరమగుచుండును. ఇట్లగుకొలది శారీరకవ్యక్తిత్వము – 'అహం' యొక్క సత్త్వ తగ్గును. దీని దృఢఘోష క్షీణించిన పిదప ఆహారమువలన చెఱుపు ఘటిల్లదు. పరమాశయముపైన లక్ష్యము నిలిపి, దానిని త్రుంపి చేబూనుటకై ప్రతివ్యక్తి విశేషోత్కంఠతో నుఱుకులెత్తును. ఈ విజృంభణము కోరగానిది. ఉఱుకువాడు కూలబడును. మనము శృంఖలములవలన బద్ధులమై యున్నాము. మెల్లమెల్లగా మన మీ సంకెలలను ఛేదింపవలెను. ఇది వివేకమువలన సుసాధ్యమగును.

తరువాత గమనింపదగిన విషయము. విముక్తి—వాంఛల నుండి విమోచనము. ఈశ్వరుని ప్రేమింపదలచువాడు తీవ్రతృష్ణకు లొంగరాదు. భగవంతునిపైతక్క మఱిదేనిమీదను వాంఛా బంధురదృష్టిని సారింపకుడు. ఉత్తమలోకప్రాప్తికి సహాకారియగు నంతవరకు ప్రపంచము మంచిదే. ఉదారాశయసిద్ధికి తోడ్పడు నంతవరకు విషయవస్తువులు మేలైనవే! ఈ జగతి ఆశయసిద్ధికి వలసిన ఒకసాధనముగాని, యిదియే లక్ష్యముకాదని మన మన వరతము మరచుచుందుము. ఇదియే లక్ష్యమైనయెడల, ఈ శరీరము లందే మనము అమరులము కావలెను.—మృత్యువుపాలబడరాదు. కాని నలుదెసలందు మానవులు అనవరతము మరణించుట

మనము విలోకించుచున్నాము. మూఢులమై మన కెన్నడును చావు రాదని ఊహించుచున్నాము. ఈ యాత్మవిశ్వాసమువలన ఈ జీవనమే మనకు పరమగమ్యమని ఊహించుచుందుము. నూటికి తొంబదితొమ్మిది లోకుల మిట్లే తలపోయుచుందుము. ఈ యపోహను మనచిత్తములనుండి మనము తక్షణమే దూరీకృత మొనరింపవలెను. పరిపూర్ణత్వసిద్ధికి దోహదమగువరకు ఈ ప్రపంచము మేలైనదే. అందుల కది తోడుపడుట విరమించిన ముహూర్తమున అది చెఱుపు దెచ్చునదని మనము విశ్వసింపవలెను. ఆలుమగలు, ధనధాన్యములు, బిడ్డలు, ఆత్మబంధువులు, చదువుసంధ్యలు, మనపురోభివృద్ధికి సహకారులగువరకు ఆదరదృష్టి నాకర్షింపవలెను. ఈ ప్రాకృతబాంధవ్యములు, వస్తువులు అందుల కుపయుక్తములు కానపుడు వానివలన అరిష్టమే దాపురించునని మనము నమ్మవలెను. ఈశ్వరుని పొందుటకై అర్ధాంగి తోడుపడునెడల, ఆమె మంచి యిల్లాలని చెప్పక తప్పదు. ఇట్లని మగని విషయమున, కన్నబిడ్డవిషయమున యోచింపవలెను. ఇతరులకు మేలొనరించుటకై ధనము తోడుపడుచో, దానికి కొంత విలువ కలదని, అట్లు కానిచో, అది చెఱుపులమూటయని, దాని నెంత త్వరలో వర్జించిన నంత మేలుకలుగునని మనము విశ్వసింపవలెను.

తరువాతి మనదృష్టి నాకర్షింపవలసిన విషయము అభ్యాసము. మనస్సు అనవరతము ఈశ్వరునిదెస సాగిపోవలెను. పెరవిషయము లెవ్వియు దానిగమనమును నిరోధింపరాదు. అశ్రాంతము అది ఈశ్వరధ్యానము సలుపుచుండవలెను.— ఇది కష్టభూయిష్టమైన కర్తవ్యమైనప్పటికి స్థిరాభ్యాసమువలన సాధ్యమగును. వెనుకటి అభ్యాసఫలమే మనజీవనము. ప్రస్తుతాభ్యాసమువలన మన భావిజీవితనిర్మాణము జరుగును. కొంత జీవితచక్రపరిభ్రమణమువలన మన మీస్థితికి వచ్చితిమి. సక్రమముగ ఈ చక్రమును తిరుగనిచ్చితిమేని, దీని పరిభ్రమణము పూర్తి

యగును. దీనిగతి కడముట్టును. సత్వరముగ నీ యాశయసిద్ధి యగుటకై శక్తివంచనలేక ప్రయత్నింపుడు. విషయవస్తుమననము వలన, ఇంద్రియమననమువలన మన మీ స్థితికి వచ్చితిమి.—ఒక నిమిషము అంగలార్చి, వేఱొక ముహూర్తమున ఆనందమున అల్లాడి, ఏ యనుభూతి ఎట్లు రివ్వురివ్వున వీచునో, దానితో నూగాడి, ప్రతివస్తువునకు దాసులమై చెరలాడుచున్నాము. ఇది లజ్జాకరమైన విషయము. అయినను మనము తేజస్వులమని తెలుపుకొందుము. సముచితమైన అవ్వలిమార్గము ననుసరించి పొందు. ఈశ్వరుని స్మరింపుడు. శారీరక మానసిక ప్రమోదమును గుఱించి మనన మొనరింపకుడు; ఈశ్వరుని గుఱించియే ధ్యానింపుడు. పెరచింతకు మనస్సు తావిచ్చుచో, దానిపై తీవ్రమైన ఆ ఘాతము వేయుడు. చఱపుతిని వెనుకకుతరలి అది భగవంతునిగుఱించియే యోచన చేయును. ఒక పాత్రనుండి వేఱొకపాత్రలో పోయబడుతైలము ఏరీతిగా అవిరతధారగా పడునో, దూరమునుండివచ్చు ఘంటాసమూహరవము నిరంతర నినాదమువలె శ్రుతగోచరమగునో అట్లే అవిరళోద్గత శైవలినిలీల సముచిత చింతాభరితచిత్తము, ఈశ్వరునిదెస సాగిపోవలెను. ఈ యభ్యాసమున చిత్తము బద్ధదీక్షితయై యుండవలెను. మనసు నీ పునీత పంథయందు నడపునపుడు ఇంద్రియములకు సక్రమక్రియలను గలిపింపవలెను. కొఱగాని కథలను చెవులందు జొనుపక భగవంతునిగుఱించిన ప్రసంగములనే మనము వినవలెను. కొఱ కానిపొత్తములపై చూపునిలుపక దైవీప్రసక్తిగల ఉద్గ్రంథములనే మనము పఠింపవలెను.

ఈశ్వరసంస్మరణాభ్యాసమునకు విశేషముగ తోడ్పడునది సంగీతము. భక్తిబోధకుడైన నారద దేవర్షితో భగవంతు డిట్లనెను. "నేను వైకుంఠములో వసించువాడను గాను ; యోగీ హృదయమందును నివసింపను. కాని ఎచ్చోట భక్తులు నా నామమును గానము చేతురో అచ్చోటున వసింతును" మనుష్య

మానసముపై గానమునకుగల ప్రభావము మహత్తరమైనది. దానివలన క్షణములో ఏకాగ్రదృష్టియలవడును. మూర్ఖులును, నికృష్టులును, పశుప్రాయులును, ఒక్కనిముసమైన తమమనస్సులను నిలుకడగా నుంపజాలని జడులును, మధురగానమును వినినపుడు ఆకస్మికముగ ఆంతరంగికపరితోషమునంది చిత్తైకాగ్రతతో నొప్పుదురు. కుక్కలు, సింగములు, పిల్లులు పోలు మృగములును పాములును సంగీతమును వినినతోడనే తన్మయ సుఖమునందును.

తరువాత గణనీయమైనది క్రియ — పరోపకారము. స్వార్థపరునకు ఈశ్వరచింత సాధ్యము కానేకాదు. ఈవలికివచ్చి సంఘములో ప్రవేశించి, మనము సేవాధర్మమును నిర్వహించినకొలది మన హృదయములు పునీతములగును.— ఈశ్వరపీఠములే యగును. ఈ పీఠములను భగవంతుడనవరతము అలంకరించియుండును. మనశ్శాస్త్రములు ఐదురీతుల క్రియలను తెలిపినవి.— ఇవియే పంచ యజ్ఞములు. అధ్యయనము మొదటియజ్ఞము. మనుష్యుడనుదినము పవిత్రగ్రంథపఠన మొనరింపవలెను— జ్ఞానయజ్ఞమున నతడు దీక్షితుడై యుండవలెను. ఈశ్వరుని, దేవతలను, యోగులను ఆతడు సేవింపవలెను.— ఇది రెండవ యజ్ఞము. మూడవది పితృయజ్ఞము. ఇది గతించినవారికి చేయు సేవ. తోడి మానవులకు చేయు సేవ నాలుగవయజ్ఞము. తనయింటిలో నొంటరి బ్రదుకీడ్చు హక్కు మానవునకు లేదు. నిరుపేదలకును, తలదాచుకొనుటకై తహతహలాడువారికిని ఆతడు నివాసవ్యవస్థ జేకూర్చవలెను. గృహస్థుడు అన్నార్తులకును, దుఃఖితులకును, కష్టముల వలన స్రుక్కువారికిని తన గృహకవాటములను తెఱచి యుంచవలెను. ఇట్లొనరించువాడే ఆదర్శ గృహస్థుడు. తనకొఱకును, తన గృహిణికొఱకును స్వీయ కుటుంబసౌఖ్యముకొఱకును మాత్రమే, గృహనిర్మాణము జేసికొను వాడు, ఈశ్వరభక్తుడు కానేరడు. తనకొఱకే, తనపొట్టనింపుకొను

టకే ఎవ్వడును వండుకొనరాదు. ఇతరులకై వంట జేసి, ఒరులను తనిపి శేషించిన ఆహారమునే మానవుడు భుజింపవలెను. ఋతుఫలసాయము తొలుత విపణిమార్గమున ప్రవేశించినపుడు ; మామిడిపండ్లు మున్నగు రసాల ఫలవిశేషములు తొలుత విక్రయశాల కెక్కినపుడు, తన ధర్మ మెఱిగినవ్యక్తి వానిని కొని, పేదలకు పంచిపెట్టును. ఇది భారతదేశములో జరుగు సర్వసాధారణాచారము. ఇతరులకు ఫలదానముచేసియే అతడు ఫలములను తినును. ఈ దృష్టాంత మీ దేశమున నెల్లఅకు సముజ్జ్వలమైన మేలుబంతి యగుట మేలు. ఈరీతి శిక్షణమువలన మనుజుడు తన హృదయమునుండి స్వార్థచింతను దూరీకృత మొనరించి, పరార్థజీవియగును. నీతి సందీపితమైన ఈరీతి ప్రవర్తనము ఒకని దారాపుత్రాదులకు చక్కని గుణపాఠమును బోధింపగలదు. ప్రాచీన కాలమున హీబ్రూలు తొలిఫలములను ఈశ్వరునకు సమర్పించువారు. ప్రతిద్రవ్యమందలి ప్రథమభాగము నిరుపేదలకు పోయితీరవలెను; శేషించినదానిని గ్రహించుటకే మనకు హక్కు కలదు. పేదలు భగవంతుని ప్రతినిధులు — ఆర్తు లందఱు ఇట్టివారే. నిష్పచ్చరమున పొగులు నిర్భాగ్యులపై అదరదృష్టిసారింపక, పిడికిలివిప్పి ఒరులకీయక, ఎవ్వడు మెక్కునో, కడుపార మెక్కి సంతోషముతో త్రుల్లిపడునో వాని ప్రమోదానుభూతి పాపమే యగును. ఐదవయజ్ఞము నికృష్టపశువులయెడల మనము నిర్వహింపవలసిన ధర్మము. జంతుజాలమంతయు మానవుని పొట్టకూటికై సృజింపబడినదనియు, మానవుని ఆహారమునకై పశువులు వధింపబడవలెననియు తెలుపుట అమానుషక్రియను సూచించుటే యగును. వానిని మానవుడు తన చిత్తమువచ్చినరీతిని ఉపయోగించుకొనవచ్చుననుటయు అట్టిదే. ఇది పైశాచికప్రబోధమగునుగాని ఈశ్వరప్రబోధము కాదు. శరీరమందలి ఒకానొక భాగమందలి నరముగాని స్నాయువుగాని చలించుచున్నదో లేదో తెలిసికొనుటకై జంతువులను కోయుట రాక్షసక్రియయేయగును.

పరప్రభుత్వమువలన ఇట్టి కట్టిడిచెట్టకెట్టి ప్రోత్సాహము మా దేశీయులకు లభించుచున్నను, అదృష్టవశమున హిందూధర్మానుయాయులు ఈ చెడు చేతకు చేయూత ఈయరని తెలుపుట కానందించుచున్నాను. ఒక గృహములో వండిన ఆహారములో ఒక భాగము జంతువులకు దఖలు కావలసినదే. దానిపై వానికి హక్కు కలదు. ప్రతిదినము వాని కాహారములభించితీరవలెను. దేశమందలి ప్రతి నగరమందును క్రుంగి కృశించు పశువులకొఱకు, కుంటివై గ్రుడ్డివైయైన గుఱ్ఱములకొఱకు, ఆవులు, కుక్కలు, పిల్లులు మొదలగు జంతువులకొఱకు ఆసుపత్రులు నిర్మింపబడవలెను. వాని కందు తగిన ఆహారరక్షణ వ్యవస్థలు జరిగి తీరవలెను.

తదుపరి గమనింపవలసిన విషయము కల్యాణము—పవిత్రత ఇది సత్యబంధురమైనది. ఎవడు సత్యసందీప్త చరిత్రుడో ఆతని యెడల సత్యనారాయణస్వామి ప్రసన్నుడగును. మనుజుడుత్రికరణ శుద్ధిగా సత్యసంధుడై యుండవలెను. ఆలోచనలో, వాక్కులో, క్రియలో ఆతడు సత్యవంతుడై యుండవలెను. తరువాత గమనింపబడవలసినవిషయము ఆర్జవము — ఋజువర్తనము, న్యాయపరాయణత. కుత్సితభావములకు శఠతకు హృదయమున తావీయరాదు. మనుష్యుడు సరళస్వభావుడై యుండవలెను. ఇంచుక కటువుగ జూపట్టినను, తిన్నని తెరువు ననుసరించి ముందంజ వేయుడు; పెడదారిని కాలుంపకుడు.

ఎల్లఱయెడల దయజూపుడు. మనోవాక్కాయములందే జీవిని హింసింపకుడు. దానము నభ్యసింపుడు. దానమును మించిన దొడ్డ గుణమేదియు లేదు. దేనినైన గ్రహించుటకు చేయిజాపువాడు మనుష్యులందు నికృష్టస్థానమున నిలుచువాడు. ఒరుల కిచ్చుటకై చేయిజాపునాతడు మనుష్యులందు మహోత్కృష్టస్థానము నలంకరించువాడు. అనవరతము ఇచ్చుటకొఱకే చేయి

నిర్మింపబడినది. మీరు ఆకటిబాధలో పొగులనున్నను మీయొద్ద నున్న తుది కబళము నొరులకిచ్చివేయుడు. ఇతరులకొసగి మీరు క్షుద్బాధవలన ఆత్మార్పణ మొనరించుకొంటిరేని, క్షణములో ముక్తి మీకు ముంజేతికంకణమగును; ఇట్లొనరించిన మంగళ ముహూర్తమున మీకు పరిపూర్ణత్వము సిద్ధించును; సమగ్ర దైవసంపద మీది యగును. సంతానముగలవారు బద్ధులైయున్నారు. దేనిని వారర్పింపజాలరు. వారు సంతానసుఖమును కాంక్షింతురు. ఈ యుద్దేశసిద్ధికై వారు కాలమును వెచ్చించితీరవలెను. జగతిలో బిడ్డలకు కొదువకలదా? "నాకొక బిడ్డకావలెను" అనుకొనుట స్వార్థపరత్వము కాదా?

గమనార్హమైన తరువాతివిషయము ప్రమోదము. నైరాశ్యమేమైన గావచ్చును—అది మతము కానేరదు. అనవరతము సంతోషసంభరిత స్వాంతుడైనవాడు హసన్ముఖుడై యుండు వాడు ఈశ్వరునకు సన్నిహితుడు కాజాలును. ప్రార్థనకంటె ప్రమోదమే అవలీలగా మానవుని జగదీశుని చరణద్వంద్వము పొంత జేర్చును. ఉత్సాహరహితములై, నైరాశ్యసంభరితములైన మనస్సులు ఎట్లు ప్రేమింపజాలును? ఇట్టి మనసులుకలవారు అనురాగమును గుఱించి ప్రసంగింతురేని, వారనృతమునే వాకొనుచున్నారని గ్రహింపుడు. వారొరుల చిత్తములను హింసింతురు. మతముపై అతిశయానురక్తిని ప్రకటించువారిని గుఱించి యోచింపుడు. వారు గంభీరవదనములను ప్రదర్శింతురు. మాటలందును చేతలందును ఇతరులతో కలహించుటే వారి మతము. వారి ధర్మమంతయు ఇందే యిమిడియున్నది. ఈవరలో వారేమిచేసిరో, స్వేచ్ఛ యొసగినచో వారిపుడేమి చేతురో యోచింపుడు. అధికారము చేజిక్కుచో సమస్తవసుంధరను రేపు వారు రుధిరప్లావిత మొనరింతురు. అధికారము నారాధించి, వికృతవైఖరులు ప్రదర్శించి హృదయమునుండి అనురాగమును, అనుకంపను వారు పూర్తిగ నిర్వాసిత మొనరింతురు. కావున హతాశులగువారు ఈశ్వరునకు

దూరస్థులైయుందురు. "నేను దుర్దశకు గుఱియైపోతిని—నా బ్రదుకు వమ్మైపోయినది" అని యనుకొనుట మతముకాదు—ఇది మీదు మిక్కిలి నారకీయప్రవర్తనమేయగును. మానవుడై పుట్టిన ప్రతి వ్యక్తి వహింపవలసిన భారము కొంత యుండనేయున్నది. దుర్దశ మిమ్ము వెంటాడుచో, దానినణచుటకై ప్రయత్నింపుడు; సుఖించుటకై యత్నింపుడు.

భగవంతుడు దుర్బలుల అందుబాటులో నుండడు.— ఎన్నడును మీరట్లుండబోకుడు. మీరు శక్తిసమన్వితులై యుండవలెను. మీలో అనంతశక్తి యున్నదిసుడీ. ఈ శక్తివినా దేనినిగాని మీరెట్లు జయింపనేర్తురు? ఈ శక్తిలేనిదే, మీరీశ్వరునకెట్లు సన్నిహితులు కాజాలుదురు? హద్దుమించిన ప్రమోదమునకు మీ యంతరంగములందు చోటీయకుడు సుడీ! ఈస్థితిలోనున్న మానస మెన్నడు శాంతినందజాలదు. అది ఇందందు ఊఱుకులెత్తుచునే యుండును. దుఃఖము అమితప్రమోదము ననుసరించుచునే యుండును. కన్నీళ్లకును, నవ్వులకును దగ్గఱి వియ్యము కలదు. ఒక చరమపంథనుండి వేఱొక చరమపంథకు ప్రజలు తఱచుగా నుఱుకులెత్తుచుందురు. స్వాంతము సంతోషసంభరితమైయుండవలెను, శాంతిబంధురమై యుండవలెను. మనసును అవధులనతిక్రమింపనీయకుడు. దారుణక్రియను ప్రతిక్రియ అనుసరించియే యుండును.

శ్రీ రామానుజసిద్ధాంతప్రకారము భక్తిని గ్రహించుపట్ల ఇవి ప్రాథమికాంశములని మనము గుర్తింపవలెను.

## భక్తిపథములోని తొలి యంజలు

భక్తినిర్వచనమొనరించిన తాత్త్వికులు ఈశ్వరునిమీది గాఢానురాగమే భక్తి యనిరి. భగవంతుని మానవుడేల ప్రేమింపవలెనను ప్రశ్న మొదట తలసూపును. దీని ప్రత్యుత్తర

మేమో ఎఱిగినగాని, ఇందలి యర్థము హృదయంగమమైనగాని భక్తివిషయము మన యాకళింత కందనే యందదు. మనుష్య జీవితమును గుఱించి రెండు ప్రత్యేకాశయములు కలవు. ఇవి వేర్వేఱు ఆశయములు. మనుష్యుడు (అత డే దేశమున వసించు వాడైనను) మతమును గుఱించి ఎట్టి యూహనైన గలవాడు తాను ఆత్మతో కూడిన శరీరమని యెఱుగును. తా నొక్క దేహమని అత డూహింపడు. కాని మనుష్యజీవితగమ్యస్థానము లను గుఱించిన భిన్నాభిప్రాయములు కలవు.

పాశ్చాత్యదేశములందు ప్రజలు నియమానుసారముగా శారీరకాశమున కధిక ప్రాముఖ్యము నిత్తురు. భారతదేశములో భక్తియోగమును గుఱించి వ్రాసిన మనీషులు మానవుని ఆత్మ విషయముమీదనే ఘనతరదృష్టిని సారించిరి. ఈ వ్యత్యాసము ప్రాచీప్రతీచీ సంస్కృతుల ప్రత్యేక విశిష్టతను దృష్టాంతీకరించు చున్నది. సాధారణ భాషావిషయమున సయితము ఈ విభేదము అగపడుచున్నది. ఇంగ్లాండులో మరణమును గుఱించి ప్రసంగించు నపుడు "మనుష్యాత్మ నిష్క్రమించినది" అని అచటివారందురు; "ఒకడు శరీరమును విడిచెనే" యని భారతీయులు వచింతురు. ఒక యూహ ననుసరించి మనుష్యుడు దేహమే యని, అతనికి ఆత్మ కలదని గ్రహింపనగును. మనుష్యు డాత్మయని, వానికి శరీరము కలదని రెండవ యూహ ప్రకారము మనము గ్రహింతుము. వీనినుండి బహుళజటిలసమస్యలు తలలెత్తును. మానవుడు శరీరమే యని, వాని కాత్మ కలదని తెలిపెడు ఊహ శరీరమునకే ప్రాముఖ్యమిచ్చుచున్నది. ఈ యూహ గలవానిని "మనుష్యు డెందుకు జీవించుచున్నా"డని ప్రశ్నింతురేని, "ఇంద్రియసుఖముల ననుభవించుట"కని, "ఐహికధనధాన్యములవలన విశేషభోగము ననుభవించుట"కని అత డుత్తరమిచ్చును. ఐహికజీవితమును మించిన జీవితము కలదని ఆతనితో తెలిపినను, ఆ విషయము నాతడు పెడచెవిని బెట్టును. ఇహజగతినిమించిన దేమైన గలదని

కలలోనైన ఆతడు విశ్వసింపడు. ఇహజీవితసుఖములే భావిజీవన మున అవిరామముగ నడచుచుండునని ఆత డుద్దేశించుచుండును. ఎల్లకాలము తా నీ ప్రపంచమందే ఉండజాలకపోవుచున్నందులకు, ఎప్పుడో ఇహజగతినుండి తాను నిష్క్రమింపవలసివచ్చుచున్నం దులకు ఆత డెంతో దుఃఖించును. కాని ఈ జగతినివీడి తానే జగతికి పోవనున్నను, ఇందువలె నందును తానుల్లాసవీచికలపై నుయ్యాలలూగవచ్చునని ఆత డాశపడును. ఇచటివలెనే ఆ జగతి యందు ఇంద్రియసమన్వితుడై అధిక విషయసుఖములను మఱింత తీవ్రేచ్ఛతో తా ననుభవింపవచ్చునని ఆత డాశపడుచుండును. ఈ యుద్దేశముల సిద్ధి దేవునివలన లభించునని ఊహించి, ఈశ్వరు నాత డారాధించును. ఆతని జీవితపరమావధి విషయవస్తువుల వలన చేకుఱు సుఖము ననుభవించుటే. సుదీర్ఘకాలము ఈ మధు రానుభూతిని ప్రసాదించు సర్వశక్తిసంపన్నుడైన దేవుడున్నాడని యెఱిగి, ఆతని నావ్యక్తి ఆరాధించుచుండును.

భారతీయుని లక్ష్యము ఈ రీతిగా నుండదు. ఈశ్వరుడే జీవితపరమావధి యని ఆత డూహించును. భగవంతున కతీతమైన వస్తువేదియు లేదనియు, కొంత యింద్రియసుఖానుభూతి ఇచట జరుగుచున్నను, ఘనతరవస్తుసంగ్రహమునకే అది నిమిత్తమగు చుండునని ఆత డాశపడుచుండును. విషయవాంఛానుభూతితక్క పడయదగిన దేదియు లేదని యూహించుట ప్రమాదకరము. ఇట్టి యూహ భయానకమును, విధ్వంసకహేతుకమును అని గ్రహింప జెల్లును. ఇంద్రియసుఖానుభూతి తగ్గినకొలది ఉదాత్తజీవితాను భూతి అధికమగుచుండునని దైనందినజీవనమున మనము గ్రహించు చునే యున్నాము. తిండి దినువేళ కుక్కను తేఱిచూడుడు. అంత యుబలాటముతో, అంత యుత్సాహముతో మనుష్యు డెవ్వడూ తన ఆహారమును భుజింపడు. భుజించుచుండగా పందిని పరిశీ లింపుడు, లొట్టలువేయుచు తన యాహారము నది నమలి మ్రింగు

చుండును. తనకిష్టమైన ఆహారము తనకు లభించినయెడల, స్వర్గముదిగివచ్చి తనపాలబడినట్లు ఆ మృగ మెంచును. దేవతలందు సర్వోత్కృష్టపదవి నలంకరించిన నిలింపశిఖామణివచ్చి తన్ను పరిశీలించుచున్నను, ఆ వరాహము తలయెత్తి వానిని చూడనైన చూడదు. దాని బ్రదుకంతయు దాని ఆహారమందే కలదు. ఆ రీతిగా మెక్కుటకై మనుష్యు డెన్నడును పుట్టియుండలేదు. జంతువుల శ్రవణశక్తి యెట్టిదో, దృష్టిసామర్థ్య మెట్టిదో యోచింపుడు. వాని యింద్రియములన్నియును విశేషాభివృద్ధి నందినవి. అవి యనుభవించు ఇంద్రియసుఖము మిక్కుటమైనది; అమితోత్సాహముతో, అమితసుఖానుభూతితో వాని కించుమించుగా పిచ్చిపట్టితీరును. నికృష్టస్థితికి దిగినకొలది మానవుని యింద్రియసుఖము, విషయవస్తులాలస అధికమగుచుండును. ఆత డున్నతస్థితికి పోవుకొలది హేతుశక్తి అధికమగును; ప్రేమపరమావధి యగును. ఈ మహితశక్తులు వృద్ధియైనకొలది, వాని యింద్రియసుఖవాంఛయును, శక్తియును క్షీణించిపోవును.

ఒకదృష్టాంతమును పరిశీలింపుడు. కొంతశక్తి మనుష్యునకు ప్రసాదింపబడినదనుకొనుడు. ఈ శక్తి శారీరకదార్ఢ్యముకొఱకుగాని, మానసికాభివృద్ధికొఱకుగాని, ఆత్మవికాసముకొఱకుగాని వినియోగము కావలెనని ఉద్దేశింపబడినది. ఈ మూడింటిలో దేనికొఱకుగాని ఆ శక్తి ఎంత అధికముగా వినియోగపడునో, తక్కిన వాని వృద్ధికై వినియోగపడునపు డది యంత తగ్గిపోవును. మూర్ఖ అసభ్యజాతులవారికి నాగరకజాతులవారికంటె నధికమైన ఇంద్రియశక్తులుండును. ఒకజాతి నాగరకత హెచ్చినకొలది దాని స్నాయునిర్మాణము సున్నితమగుననియు, దానికి స్నాయువికదౌర్బల్యము కలుగుననియు కావున శారీరకమైన సత్తువ కొంత సన్నగిలుననియు చరిత్రపఠనము వలన మనము గ్రహించితిమి. — చరిత్రపాఠములలో నిదియొకటి. ఒక అసభ్యజాతికి నాగరత ప్రసాదింపుడు; ఈ దృష్టాంతము ప్రత్యక్షముగ దానియందు దృగ్గోచరమగును.

మఱియొక అనాగరకజాతి దండెత్తి ఈ జాతి నణచి విజయధ్వజ మెత్తును. అనాగరకజాతికే అనవరతము శారీరకవిజయము చేకుఱుచుండును. ఇంద్రియసుఖములనే సర్వదా మనము వాంఛించితిమేని, మనము అనాగరకస్థితికి, పశువుల నికృష్టస్థితికి దిగిపోదుము. ఇంద్రియసుఖము లధికమగు తావునకు పోవలెనని మక్కువపడువ్యక్తి, తాను వాస్తవముగ నేది యభిలషించుచున్నాఁడో పాపమెఱుగఁడు. తనకోరిక ఫలించునెడల తాను జఘన్యపశుపరిస్థితికి దిగబడుపోవునని పాప మాజీవి యెఱుగఁడు.

విషయసుఖసంభరితస్వర్గము కావలెనని కాంక్షించువారి కెట్టిగతిపట్టునో ౘెప్పనక్కఱలేదు. ఇంద్రియపంకిలమున పొరలాడు వరాహములు వారు. తాము పొరలాడు బురదను దాటి అవ్వలికి వారిచూపు పోలేదు. వారు వాంఛించినదీసుఖమే. ఈ సుఖముపోవుచో, స్వర్గమే తమయొడినుండి జారిపడినదని వారు దురపిల్లుదురు. భక్తి శబ్దమందలి యుదాత్తభావమును బట్టి వారి ప్రవర్తనమును పరిశీలించితిమేని, వారు భక్తులుకానేకారని, ఎన్నఁడును కాజాలరని, దేవునియెడల వారికి నిక్కంపుభ యల వడదని గ్రహింపజాలుదుము. కాలక్రమమున వారు కన్నులు తెఱచిన మేలు. కొంతకాలము వారీ నికృష్టస్థితిలో అల్లాడినను, వారికి సముచితమానసికపరివర్తనము కలుగవచ్చును. తానీవరలో కని విని యెఱుగని మహత్తరస్థితి యొకటి కలదని అభాగుడై యుండిన వ్యక్తి గ్రహింపవచ్చును. విషయవాంఛలమీఁది ప్రీతి, ఇంద్రియసుఖములమీఁది మక్కువ క్రమక్రమముగ సమసిపోవును.

నేను బడిలో జదువుకొను పిల్లవాడనై యున్నపుడు, తోడి బడిబుడుతనితో మిఠాయికై పోరాడితిని. అతడు నాకంటె బలమైనవాడగుటవలన, నాచేతిలోని మిఠాయిని లాగుకొనిపోయినాడు. అపుడు నా మనసులో ఎట్టి యుద్రేకము రేకెత్తినదో నా

కిపుడు జ్ఞప్తియందున్నది. పుడమిలో పుట్టినపిల్లలందఱిలో అతడు పరమదుష్టుడనియు, రానురాను నాకు సత్తువచేకుఱినకొలది వానిని పల్లార్చి తీరెదననియు, వాని దౌష్ట్యమునకు తగిన దండన లేనేలేదనియు నే నపు డూహించితిని. ఆతడును, నేనును ఇపుడు బాల్యావస్థనుండిదాటి పెద్దలమైతిమి. మేమిపుడు గాఢానురాగబద్ధులమైన స్నేహితులమైతిమి. ప్రపంచమంతయు పసికూనలతో నిండియున్నది. తినుట, త్రాగుట వారికి పరిపాటియై పోయినది — మిఠాయిదినుసులు, చిన్నరొట్టెలువారికి సర్వస్వములు. ఈ రొట్టెలను గుఱించియు, మిఠాయిలనుగుఱించియు వారు కలలు కనుచుందురు. ఈ తినుబండము లెందు సమృద్ధిగా లభించునో అందే తమ భావిజీవితము నిర్వహణము కావలెనని వారు గ్రుక్కిళ్లు మ్రింగుచుందురు. అమెరికా యిండియను దృక్పథమేదియో గమనించిచూడుడు. వేటకై యుపకరించు చక్కని నేలయందు తన భావిజీవితము గడపవలెనని ఆతడు మక్కువపడును. మనలో నొక్కరొక్కరికి మనమభిలషించు ప్రత్యేక స్వర్గమును గుఱించిన భావనకలదు. వయసువచ్చినకొలది, కాలము కడచుకొలది, ఉన్నతవిషయములపై, ఉదాత్తవస్తువులపై మన చూపులు వ్రాలును. సముజ్జ్వలజ్ఞానమరీచికాగుచ్ఛము లోచనగోచరమగును. కాని ఆధునికయుగమందలి సర్వసామాన్యమార్గమననుసరించి దేనిని విశ్వసింపక భావిజీవితపుటూహలను మనము త్రోసి రాజనరాదు.—ఈ పద్ధతి సర్వనాశనహేతువగును. ప్రతి వస్తువును వినాశనమొనరించు అజ్ఞేయవాది పని దోషభూయిష్ఠమైనది. భక్తునిచూపు ఉన్నతభావనావీథులందు వ్రాలును. అజ్ఞేయవాది స్వర్గమే లేదని నమ్మును; కావున వానికి స్వర్గమక్కఱ లేదు. భక్తునకును స్వర్గమక్కఱలేదు — ఏలనన స్వర్గమునకై తహతహలాడుట పసివాని యాటకంటె మిన్నయైనదికాదని వాని విశ్వాసము—అతనిదృష్టిపడినది ఈశ్వరునిపై. అతడభిలషించినది ఈశ్వరసాక్షాత్కారము.

ఈశ్వరునికంటె మహత్తరమైన ఆదర్శమేముండును ? — భగవంతుడే మనుష్యుని మహోత్కృష్టమైన లక్ష్యము. ఆతనిని వీక్షించి, ఆనందానుభూతినందుదుము. ఈశ్వరుని మించినదాని నేదియు మన మూహింపలేము. ఏలనన భగవంతుడు పరిపూర్ణుడు. అనురాగానందమును మించిన దానిని మన మూహింపలేము. కాని అనురాగమున కనేకార్థములు కలవు. ఈసందర్భములోనే ననురాగమనినపుడు అది సాధారణప్రాపంచిక స్వార్థానురాగము కాదు. దీని ననురాగమనుట ఈశ్వరనిందజేయుట. దారాపుత్రాదులయెడల మనము చూపు అనురాగము పశుప్రవృత్తికి సంబంధించినదే. నిస్వార్థప్రేమయే నిజమైనప్రేమ—ఇది ఈశ్వరుని యెడల జూపబడు ప్రేమ. ఈ ప్రేమనందుట చాల కష్టము. శిశువాత్సల్యము, పితృప్రేమ, మాతృప్రీతి మున్నగు వివిధానురాగానుభూతిని మనమందుచున్నాము. మెల్లగా మనము ప్రేమశక్తి నలవఱుచుకొందుము. కాని మనలో పలువురకిది యలవడనే యలవడదు. ఒక యంజవేసినను నిలిచిపోదుము. ఒక వ్యక్తి యెడల అనురక్తిగలిగి బద్ధులమైయుందుము. ఇహజగతిలో మానవులు ఇల్లాండ్రకొఱకు, విత్తముకొఱకు, కీర్తికొఱకు ప్రాకులాడుచుందురు. ఒక్కొకపుడు వారితలకు గట్టిదెబ్బతగులవచ్చును; బొప్పికలుగవచ్చును. వాస్తవముగ ఈప్రపంచమేమో వారపుడు గుర్తించుకొనగలరు. ఈశ్వరునితక్క పుడమిలో ఎవ్వరును దేనియెడలను నిస్తులానురాగమును చూపలేరు. మానవసులభానురాగము కేవలము అప్రకృతమనియు, అయథార్థమైనదనియు నరుడు గుర్తించును. ప్రేమనుగుఱించి పెద్దకబురులు చెప్పువారున్నారు; కాని మనుజులు ప్రేమింపనేలేరు. ఇల్లాలు పతి నుద్దేశించి "ప్రాణేశ్వరా! మీపై నాకు మిక్కుటమైన మక్కువ కలదు" అని వాని చెక్కిలిని ముద్దాడును. కాని ఆతడు కడయూపిరి విడిచిన పిదప, తొలుత ఆమె యోచించు విషయము, బ్యాంకులో ఆత డెంత సొత్తు నిలువజేసెనో యనియు, మఱునాడు తానే

తెన్నుబట్టి నడువవలెనో యనియు ఆమె యోచించును. "ప్రేయసీ!" అని భర్త భార్యను లాలించును; కాని ఆమె వ్యాధిపీడితయైనపుడు, ఆమె అందచందములు అస్తమించినపుడు, లేక వికృతరూపములతో నామె ప్రత్యక్షమైనపుడు, లేక ఏదో తప్పుచేసినపుడు ఆమెయెడల వానికిగల అనురాగము సన్నగిలును; శ్రద్ధ కుంటుపడును. ప్రాపంచికప్రణయమంతయు కేవలము ప్రవంచనము; వట్టి మిథ్య.

అఖండుడు కానివాడు, — సీమాబద్ధుడు ప్రేమింపనేరడు. అవధులందు ఇముడునది, సీమాబద్ధమైనది ప్రేమింపబడదు. మానవుని ప్రేమ నాకర్షించు వస్తువుగాని వ్యక్తిగాని ప్రతిక్షణము గతించుచుండగా, వాని వయస్సు క్రమక్రమముగా ముదురుచుండగా జగతిలో మార్పుగానిప్రేమ యుండునని ఎట్లాశపడ గలరు? భగవంతునిలోతక్క సత్యప్రదీప్తమైన ప్రణయమింకనే లేదు. ఇక నీ చిల్లరప్రేమతో, కొరగాని అనురాగవ్యక్తీకరణములతో పనియేమికలదు? ఇవి కేవలము సోపానములుమాత్రమే. మనలను ముందులకు నడపు శక్తి యొకటి కలదు. అసలువస్తువు నెందుకు కనుగొనవలెనో మనమెఱుగము. కాని యీ ప్రేమశక్తి దాని నన్వేషించుటకై మనలను ముందులకు పురికొలుపుచున్నది. మాటిమాటికి మనము మన నెరసును గుర్తింతుము. ఏదో ఒకదానిని మనము చేబట్టుదుము; అది వ్రేళ్లనుండి దిగజారుట చూతుము. అపుడు వేఱొక వస్తువును చేబూనుదుము. ఈ విధముగా మన కథ నడచుచుండును. మన మడుగులువేయుచుందుము. ఎట్టకేలకు మనము కన్నులు తెఱతుము; వెలుగు గోచరించును. ప్రేమ చూపజాలు ఒక్కరని, — జగదీశుని తుట్టతుదకు జేరజాలుదుము. ఈశ్వరుని ప్రేమలో మార్పుండదు. అది మనలను స్వీకరించుటకు సిద్ధముగా నుండును. మీలో నెవరికైన నేను హానిచేసినయెడల ఎంతకాలము మీ రోర్తురు? ఎవ్వని

హృదయములో రాగద్వేషములును, ఈర్ష్యాదిదుర్గుణములును ఉండవో, ఎవ్వడు ఎన్నడును మానసిక సహనశాంతులను నిముస మైన సడలనీయడో అట్టివాడు మరణించినను, పుట్టినను ఎవ్వడై యుండును? అత డీశ్వరుడుకాక మఱెవ్వరు? కాని ఈశ్వరుని చేరుటకై మనము త్రొక్కవలసిన పథము దీర్ఘమైనది; కష్ట భూయిష్ఠమైనది. కొలదిమంది మానవులే ఆతని నందజాలుదురు. మనమందఱును ప్రాకులాడు పసిపిల్లలము. మనుష్యునిలో అసంఖ్యాకులు మతముతో వాణిజ్యము సలుపుదురు. ఒకశతాబ్ద ములో ఏ కొలదిమందిమాత్రమో నిస్తుల ఈశ్వరప్రీతినందజాలు దురు. వారివలన సమస్తదేశము ధన్యమగును; పునీతమగును. ఈశ్వరపుత్రుడొకడు గోచరించునేని, సమస్తసీమ పవిత్రమగును. ఏ శతాబ్దమందైన సమస్తవసుంధరలో ఇట్టివారు ఏ కొలది మందియో జన్మించుట నిక్కమే. కాని ఎల్లఱు అట్టి ఈశ్వరప్రీతి నందుటకై ప్రయత్నింపవలెను. మీరో లేక నేనో దాని నంద జాలుదుమేమో! ఎవరెఱుగుదురు? ఈ సదాశ ననుసరించి, ఈ యుదారాశయసిద్ధికై శక్తివంచనలేక ప్రయత్నింతుముగాక!

ఇల్లాలొకర్తుక తనభర్తను ప్రేమించునందుము ఆమె యాత్మయంతయు ఆమె యనురాగమున నివిష్టమైనదని ఆమె యావత్తువ్యక్తిత్వము భర్తయందు గలిసిపోయెనని యోచింతము కొంతకాలమైన పిదప ఆమె కొక బిడ్డ కలిగెననుకొందము. సగమో, సగముకంటె అధికముగానో ఆమె యనురాగము బిడ్డకు పోవును. తా నీవరలో తనపతియెడల జూపుచుండిన ప్రీతి తగ్గిన దని ఆమెయే స్వానుభూతివలన గ్రహింపజాలును. తండ్రివిషయ మున ఈ రీతిగానే యోచింపవచ్చును. విశేషప్రేమాస్పదులైన వ్యక్తులసంఖ్య అధికమగుకొలది తొల్లింటి యనురాగము మెల్లగా గతించునని మనమే మనజీవితానుభూతిలో గ్రహింపజాలుదుము. బడిలో చదువుకొను బిడ్డలు తోడిబాలురలో కొందఱు జీవితములో

తమకు మిగుల ప్రీతిగలవారని ఊహింతురు. తలిదండ్రులపట్లగూడ అట్లే తలంతురు. కొంతకాలము కడచిన పిదప బాలికలకు భర్తలును, భర్తలకు భార్యలును లభింతురు. తోడనే తొల్లింటి యనురాగము సమసిపోవును. నూతన ప్రణయ మంకురించి, వృద్ధి యగును. తొలుత ఒకనక్షత్ర ముదయించును; తరువాత అంత కంటె పెద్దదైన నక్షత్రము గోచరించును. పదపడి మఱింత పెద్ద తార దృగ్గోచరమగును; కాలక్రమమున సూర్యు డుదయించును. అప్పుడు తక్కువకాంతులన్నియును అదృశ్యమగును. సూర్యుడు భగవంతుడు. చుక్కలు కొద్దిపాటి ప్రేమాలోకమును వెలారించునవియే! మహోజ్జ్వల సూర్యతేజస్సు ఒకవ్యక్తిపై ప్రసరించినపుడు మనుష్యు డున్మాదుడగును; ఎమర్సన్ తెలిపిన "ఈశ్వరోన్మాదుడగును." మానవుడు దేవుడే యగును. సమస్తము ఆ ప్రేమ సాగరమున లీనమైపోవును. సామాన్యానురాగము వట్టి పశుప్రీతి మాత్రమే! కావున్న స్త్రీపురుషజాతులందు వ్యత్యాస మేల యుండవలెను? ఒకరొక విగ్రహముత్రోల సాగిలపడినయెడల, అది భయంకర ప్రతిమోపాసన యగును. కాని ఒకతె పతి త్రోల, ఒకడు సతిత్రోల మోకరించుకొనినయెడల, ఆ క్రియ సర్వాంగీకారము పడయజాలును.

జగతియందు బహువిధ ప్రేమసోపానములు గోచరించును. వీనిని గుర్తించుటకుమున్ను అవగాహమార్గము సుగమము కావలెను. మనజీవనదృక్పథముపై ప్రేమసిద్ధాంతము ఆధారపడి యుండును. ఈ జగతియే మనజీవితపరమాదర్శమని యెంచుట పాశవికప్రవృత్తియే యగును. ఈ యాశయము అధఃపతన హేతువే యగును. ఏ మానవుడైన ఈ యూహతో జీవితపథమున నడుగిడెనేని, అత డధోగతిపాలగును. అతడెన్నడు ఉన్నతస్థితి జేరజాలడు. వెనుకనుండి ఆతడే యాలోకమును వీక్షింపనేలేడు. అనవరతము అత డింద్రియములకు బానిసయై యుండును. మెక్కుటకై కొన్నిరొట్టెలను తెచ్చిపెట్టు నాణెమును చేబట్టుటకై

ఆతడు నడుముగట్టి ఉఱుకులెత్తును. ఈ రీతి బ్రదుకీడ్చుటకంటె చచ్చుట మేలు. ఈ పుడమికి బానిసలము; ఇంద్రియములకు దాసులము; నికృష్టస్థితినుండి లేచుదము; ఇంద్రియసుఖము గాంక్షించు ఈ జీవితముకంటె ఉదాత్తమైనది కలదు. అఖండ అనంతపరమాత్మ తననేత్రములకు, తననాసికకు, తనవీనులకు బానిసయగుటకె జన్మించెనని మీరూహింతురా? సర్వమును నిర్వహింపజాలు ఆత్మ కలదు. అనంత, అఖండ, సర్వజ్ఞాత్మ కలదు; ప్రతిశృంఖలమును ఛేదించివేయుడు. ఆ యాత్మ మనమే యని గుర్తింపుడు; ప్రేమద్వారా మన మా శక్తి నందవలెను. ఇది మన జ్ఞప్తియందుండవలసిన సర్వోత్తమాదర్శము. ఈ యాదర్శ సిద్ధి ఒక్కనాటితో కానేరదు. ఇది మనచేతులందే కలదని కల్పనజేసికొనవచ్చును; కాని యిది కల్పనమాత్రమే! ఈలక్ష్యము మనకెంతో దూరమందున్నది. మానవు డెందు నిలిచియున్నాడో పరిశీలించి, ఆత డగ్రేసరుడగుటకై మనము తోడుపడవలెను. మనుష్యుడు జడవాదమున నిలిచియున్నాడు. మీరును, నేనును జడవాదులమే! ఈశ్వరుని గుఱించియు, ఆత్మను గుఱించియు, పరమాత్మను గుఱించియు మనము ఘోషించుచుందుము. ఇది మేలి ఘోషయే కావచ్చును. ఈ రీతిగా ప్రసంగించుట మన సంఘములో ఒక యాచారమైనది. చిలుకలవలె ఈ పలుకులను మనము నేర్చుకొంటిమి; వీనినే మాటిమాటికి ఉచ్చరించు చుందుము. మన మెందు నిలిచితిమో యెఱిగి, జడవాదులమై యున్నట్లు గుర్తించి, జడముయొక్క చేయూతనంది, నిక్కంపు ఆత్మికవాదులమగువరకు మెల్లగ సాగిపోయి, మనమే ఆత్మ యను అనుభూతిని పడసి, ఆత్మను అవగాహమొనరించుకొని, అనంతమైనదని మనము తెలుపు ఈ ప్రపంచము అంతరంగ ప్రపంచపు బాహ్యావరణముమాత్రమేయని గుర్తింతుముగాక!

మనదృష్టి నాకర్షింపవలసిన విశేషమింకను కలదు. బైబిలులోగల ''గిరిమీది ధర్మోపదేశము''లో మీరీ వాక్కులను

చదువుచుందురు "అడుగుము, నీ కది యీయబడును; వెతకుము; నీవు దానిని కనుగొనెదవు, తట్టుము, నీకై అది తెఱువబడును." చిక్కేమన : వెతకువారెవరు? కావలసినదెవరికి? మన మీశ్వరు నెఱుగుదుమని మనమందఱము తెలుపుచుందుము. భగవంతుడు లేడని ఋజువుచేయుటకై ఒకడు గ్రంథముఁ వ్రాయును. ఆతడున్నాడని రూఢిచేయుటకై మఱొకడు వేఱొక పుస్తకమును రచించును. దేవుడున్నాడని రూఢిచేయుట తన యాజన్మకర్తవ్యమని ఒక వ్యక్తి యూహించును. వేఱొకనిబుద్ధి ప్రతికూలముగ నడచును. దేవుడు లేడని మానవునకు బోధించుటకై అతడు స్థానస్థానము లందు సంచరించుచుండును. భగవంతుడున్నాడనిగాని లేడనిగాని రూఢిచేయుటకై ఒకగ్రంథమును వ్రాయుటవలన కలుగు ప్రయోజనమేమి? "భగవంతు డున్ననేమి? లేకున్ననేమి?" పలువు రీ ప్రశ్నలపై దృష్టిసారింపరు. మనుష్యులలోననేకులు యంత్రము వలె పనిచేయుచుందురు. వీరి కీశ్వరునిగుఱించిన చింతయే లేదు. భగవంతునిగుఱించిన అక్కఱయే లేదని వారు భావింతురు. ఇట్లుండ నొకనాడు మృత్యుదేవత సాక్షాత్కరించి "కదలి రమ్ము" అనును "కొంచము తాళుము. నాకు కొంత వ్యవధి అవసరమైయున్నది — మా పిల్లవాని కింకను కొంత వయసు రావలెను." అని మానవుడు మిత్తి నుద్దేశించిపలుకును. "తత్ క్షణము రమ్ము" అని మృత్యువు ఆదేశించును. ఈ రీతిగా మానవ జీవితము నడచిపోవుచుండును. పాపము అభాగుడు జాఁ తప్పని సరిగ బోవును. ఆ దౌర్భాగ్యునుద్దేశించి ఏ మందుము? భగవంతుడు సర్వోత్కృష్టుడని తెలుపుదానినెన్నడు ఆతడు కనుగొనలేదు. ప్రాయశః పూర్వజన్మలో ఆతడు వరాహమైయుండును, మానవుడై పుట్టి పై మెట్టు నెక్కినాడు. కాని కొందఱు మానవులకు ఇంచుక మెలకువవచ్చును. ఏదో విపత్తు తలయెత్తును. మనము విశేషముగా ప్రేమించిన ఒక వ్యక్తి మరణించును. ఆతనిపై సర్వాత్మను, పంచప్రాణములను మనము నిలిపియుంచు

దుము. ఆతనికొఱకై మనము సర్వప్రపంచమును మోసగించి యుందుము ; మన యనుగు సోదరునే వంచించియుందుము. మనకు మిగులగూర్చు ఆవ్యక్తి అస్తమించుటవలన మనపై పెద్ద దెబ్బ పడును. "దీని తరువాత నేమి?" అను ధ్వని అంతరంగమునుండి వినబడునేమో! ఒక్కొకపుడు చప్పు వేయకుండనే మృత్యువు ఎదురైనను అగును. కాని, యీ రీతి సంఘటన లెన్నియో యుండవు. వేళ్లనడుమనుండి ఏదో జారిపడినపుడు మనలో పలు వురము "తరువాతనేమి?" అని ప్రశ్నింతుము. ఇంద్రియములను పట్టుకొని మనమెట్లు ప్రాకులాడుదుమో! మునిగిపోవువాడు వట్టి గడ్డిపరకను పట్టుకొనునని మీరు వినియున్నారు. తొలుత ఈగడ్డి పరకను పట్టుకొని, దానివలన తనకు సముద్ధరణము కానపుడు ఎవరో చేయిజాపి తన్నుద్ధరింపవలెనని మానవు డూహించును. కాని మానవులు ఉదాత్తాంశముల నందుకొనుటకుముందు ఆంగ్ల మందలి నానుడి తెలుపునట్లు 'యౌవనసులభ ఆమోద ప్రమోదములందు' దీక్షితులై యున్నను ఉందురు గాక! సముద్ధరణమునకు నాంది అనివార్యాను భూతి.

భక్తి ఒక మతము. మతము అసంఖ్యాకులకు కాదు.— అది అసాధ్యము. ఒక విధమైన మోకాటిడ్రిల్లు, గుంజీలుతీయుట అనేకులకు సరిపడవచ్చును. కాని మతము కొలదిమందికిమాత్రమే సరిపడునది. ప్రతి దేశమందును ఏకొలదివందలమందికి మాత్రమే మతాభ్యాసము సుసాధ్యము – అల్పసంఖ్యాకులుమాత్రమే మతాభ్యాసమున సిద్ధహస్తులు కాజాలుదురు. ఒరులట్లు కాజాలరు, ఏలనన వారు జాగృతి నెఱుగకుందురు. మేల్గొనవలెనను కాంక్షయే వారి కుండదు. ఈశ్వరుని కాంక్షించుటే ప్రధానవిషయము. కాని భగవంతుడుతక్క మన కన్నియు కావలయును. కారణమేమనగా మన సాధారణవాంఛలు బాహ్యజగత్తువలన పరిపూర్తి నందును ; బాహ్యజగతి నధఃకరించి మన కోరికలు పోయినపుడే,

ఆంతరంగిక జగతినుండి, భగవంతునినుండి వానిని పడయ జూతుము. బాహ్యవిశ్వమందలి పరిమిత పరిధిలో మనయక్క ఱలు సంకుచితములై యుండునంతకాలము, దేవుని యావశ్యకత మనకుండనే యుండదు. ఇచ్చటనున్న వానియన్నిటితో మనకు సంపూర్ణసంతృప్తి కలిగిన యనంతరము, తరువాతి అభావపూర్ణ మునకై గ్రుక్కిళ్లు మ్రింగుదుము. ఆవశ్యకత కలిగినపుడే సంధానము తలసూపును. సాధ్యమైనంతత్వరలో జగతిలోని ఈ బాల్య ఖేలనమును చాలించుకొనుడు. అట్లొనరించుకొనినపుడు జగత్తిని మించినదానికై మీరు తహతహలాడెదరు; అపుడు మతమందలి తొలిమెట్టుపై అడుగు వేతురు.

ప్రత్యేకవిలాసాభిరుచి కనుకూలమైన ఒకానొక మతము కలదు. నా నెచ్చెలి యొకర్తుకకు ఆమె యాగారములో దైనంది నోపయోగమునకు వలసిన సామగ్రి విశేషముగా గలదు. జపాను దేశములో తయారైన ఒక వింతకూజాను తన గదిలో నుంచు కొనుటకై ఆమెకు ప్రత్యేకపు మక్కువ కలదు. వేయిడాలర్లు వ్యయముకావలెనన్నను, ఆమె ముద్దు చెల్లితీరవలెను. ఈ విధము గానే ఆమెకు కొంతమతమవసరమై యున్నది. ఆ ముద్దు చెల్లు టకై ఆమె యొక చర్చిలో ప్రవేశింపవలెను. భక్తి ఈరకపు వ్యక్తులకై ఉద్దేశింపబడలేదు. ఈ ముద్దుముచ్చటలు ప్రగాఢ కాంక్షలుకావు, ఏది లేనియెడల మన జీవితమే లేదో అది ప్రగాఢ కాంక్ష. మనకు ఊపిరి అవసరము; ఆహారము అవసరము. వస్త్రము లవసరములు. ఇవి లేనియెడల, మనము బ్రదుకనేలేము. ఒక డీలోకములో ఒకయాడుదానిని ప్రేమించెననుకొనుడు. ఆమె లేనిదే తన బ్రదుకే లేదని ఆతడనుకొను ముహూర్తములు (ఈ యోచన ఉచితమైనది కాకపోయినప్పటికి) ఉండవచ్చును. భర్త మరణించినపుడు, తనబ్రదుకే తెల్లవారినదని భార్య ఆరాటపడ వచ్చును. కాని ఆమె బ్రదుకు నీడ్చుచునేయుండవచ్చును. ఆవశ్య

కతలోని రహస్యమిది. అది లేనిదే మనము జీవింపనేలేము. అది మన చేతులందు చిక్కితీరవలెను. లేకున్న చావుమూడుట తథ్యము. ఈశ్వరుని గుఱించి ఈరీతిగా యోచింపజాలు కాల మాసన్నమైనపుడు, అనగా ప్రాపంచకావశ్యకతను మించిన అక్కఱయొకటి నిక్కముగా మనకు కలిగినపుడు, విషయవస్తువులను మించిన అక్కఱ, ప్రాకృతశక్తుల నధిగమించిన ఆవశ్యకత కలిగినపుడు మనము భక్తులము కాజాలుదుము. క్షణకాలము కారుమబ్బు మనచూడ్కినుండితొలగినపుడు, అవ్వలినుండి అద్భుత ద్యుతి మనదృష్టిలో తళుక్కొత్తినపుడు, మహత్తరముహూర్తములో ఈక్షుద్రవాంఛలన్నియును కడలిలోని నీటిబొట్టుకంటె మిన్నలు కావను జ్ఞానోదయము మనకు కలిగినపుడు, ఈ కొద్దిపాటి మన బ్రదుకు లెంతటివని గ్రహింపజాలమా? మనయాత్మ అపుడు సము ధికవృద్ధినందును; ఈశ్వరుని ఆవశ్యకత దానికి కలిగితీఱును, ఆతని వది పొందితీఱవలెను.

ప్రథమ విచారణీయాంశమిది: మన యావశ్యకతయేది? "మనకు భగవంతుని ఆవశ్యకత కలదా?" అని ప్రతిదినము మనలో మనము ప్రశ్నించుకొనవలెను. మీరు బ్రహ్మాండములో గ్రంథముల నన్నిటిని మానసికముగ దిగ్రమింగవచ్చును. — మీరు చదువని పుస్తకమేదియు విశ్వములో లేకపోవచ్చును, కాని పూర్వోక్తావశ్యకత, ఈశ్వరునిమీఁది భక్తివిస్తృత గ్రంథపఠనము వలన మీకు లభించుట కల్ల. మీ వచః కౌశలమువలన మీకది యబ్బదు. మహోత్కృష్ట మేధాశక్తివలననైనను మీకది చేకూఱదు. వివిధభౌతికశాస్త్రములు మీయాకళింతలో ప్రవేశించినను, మీకది దక్కునదికాదు. ఈశ్వరుని ఆవశ్యకత ఎవనికి కలుగునో, ఆతని యనురాగము వానికి చిక్కితీఱును. భగవంతుడు వానికర్పితుడైపోవును. ప్రణయము పరస్పరమైనది; ప్రతిబింబితమైనది. నాపై మీకు జుగుప్స యుండవచ్చును. మిమ్ము నేను

ప్రేమింపజూచినపుడు కొండొకవడి మీరు పెడమొగములు పెట్ట వచ్చును. కాని ప్రేమదానములో వెనుకంజవేయక అట్లే నేనుం డుచో, ఒకమాసములోనో, లేక నొకవత్సరకాలమందో మీరు నన్ను ప్రేమింపకతప్పదు. ఇది సుప్రసిద్ధ మనశ్శాస్త్ర దృశ్యము– ఆంతరంగిక విషయము. అస్తమించిన భర్తను గుఱించి ఉదాత్త ప్రేమభరితహృదయముతో ధర్మపత్ని ఎట్లు చింతించునో, అట్టె ప్రణయబంధురాంతరంగముతో మనము జగదీశుని గుఱించి చింతింపవలెను. మనకపుడు ఈశ్వరసాక్షాత్కారము కలుగును. సమస్త గ్రంథసమూహములుగాని వివిధభౌతికశాస్త్రములు గాని మనకు దేనిని బోధింపజాలవు. గ్రంథపఠనమునలన మనము చిలు కలమగుదుము. పుస్తకములను చదువుటవలన ఎవ్వరును విద్వాం సులుకాలేరు. ఒక ప్రణయశబ్దమును మాత్రము మానవుడు పఠిం చుచో, నిక్కముగ నాతడు విద్వాంసుడు కాజాలును. కావున తొలుత మనకట్టి జిజ్ఞాస అలవడవలెను.

“మనకు భగవంతు డవసరమైయున్నాడా ?” అని ప్రతి దినము మనము ప్రశ్నించుకొందుముగాక. మనలను గుఱించి మనము ప్రసంగింపబూనుకొనునపుడు,—ముఖ్యముగా మన మొక యున్నత పీఠము నలంకరించి ఒరులకు ప్రబోధముసేయు గడంగి నపుడు ఈరీతిగా మనము ప్రశ్నించుకొనవలెను. అనేక పర్యాయ ములు ఈశ్వరుని అక్కఱ నాకగపడదు; అధికాహారమె అవ సరమై యుండును. ఒకరొట్టెముక్క నాచేతులలో పడకపోయిన యెడల నాకు పిచ్చిపట్టవచ్చును. ఒకవజ్రపుసూది లభింపక పోయినయెడల ఆడువారిలో అనేకులకు బారుగా మతిపోవచ్చును. కాని భగవంతుని గుఱించిన ఈరీతి యాకాంక్ష వారి హృదయ ములో శూన్యమైయుండును. విశ్వమందలి ఏకైకసత్యమును వా రెఱుగరు. “వేటాడదలతునేని ఖడ్గమృగమునే వేటాడుదును; దొంగతనముజేయ నూహింతునేని, చక్రవర్తి ఖజానానే అపహరిం

తును. బిచ్చకుల సొత్తును దొంగిలింపనేల? లేక చీమలను వేటాడ నేల?'' అను సామెత మావాఙ్మయమునకలదు. కావున ప్రేమింప దలతురేని, భగవంతునే ప్రేమింపుడు. ఈ ప్రాపంచకవస్తువులకై ప్రాకులాడువారెవరు? ప్రపంచము బొత్తుగా మిథ్యయైనది; మహనీయులైన జగద్గురువులందఱు అట్లని గుర్తించిరి. ఈశ్వరునివలన గాని ఇందుండి నిష్కృతిలేదు. మన జీవితపరమావధి ఆతడు,— మనజీవనగమ్యస్థాన మాతడు. జగతియే మన జీవనపరమలక్ష్య మని తెలుపు ఊహలు వినాశకరములు. ఈపుడమికి, ఈదేహము నకు కొంత విలువ యున్నను, ఈ మూల్యము ఆనుషంగికమైనది, అప్రధానమైనది, గౌణమైనది. ఇది లక్ష్యసిద్ధికి అవసరమైన నిమిత్తముమాత్రమే. కాని ప్రపంచమే లక్ష్యముకారాదు. దురదృష్ట వశాత్తు పలుపర్యాయములు మనము జగతిని లక్ష్యముజేసికొని, జగదీశుని నిమిత్తము జేసివైతుము. ప్రజలు ఛర్చికి (దేవాలయమునకు) పోయి ''ఓ దేవుడా! నాకు దీనినిమ్ము, దానినిమ్ము. ఓ భగవంతుడా! నా వ్యాధి కుదుర్పుము'' అని ప్రార్థనసలుపుదురు. వారికి చక్కని, ఆరోగ్యకరములైన శరీరములుకావలెను. ఎవరో తమకై వీనిని చేకూర్చెదరనివిని వారు పోయి దేవునిప్రార్థింతురు. మతమును గుఱించి ఈరీతి యూహకు మనసులో చోటిచ్చుటకు బదులు ఒకడు నాస్తికుడై యుండుటమేలు. నేను తెలిపినట్లు భక్తి పరమాదర్శము. లక్షలాది సంవత్సరములు దొరలిపో వచ్చును—యీ సుదీర్ఘకాలములో ఈ పరమాదర్శసిద్ధి మనకు కలుగునో కలుగదో తెలుపలేను. కాని అది మహోత్కృష్టమైన లక్ష్యమని మనము మఱువరాదు. మహత్తరమైన ఈ యాయశమే మన యింద్రియముల నాకర్షింపవలెను. గమ్యస్థానమును మనము చేరుకొనలేకపోయినను, దానిని సమీపింపజాలుదుము. ఈశ్వరు నందుటకై జగతిద్వారా, ఇంద్రియములద్వారా మెల్లమెల్లగా మనము కృషిచేయవలెను.

## ఆ ధ్యా త్మి క బో ధ కు డు

ప్రతి ఆత్మకు పరిపూర్ణత్వము సిద్ధించి తీఱును. ప్రతి జీవికి ఎట్టకేలకు ఆ స్థితి లభించి తీఱును. భూతకాలములో మన మెట్లుంటిమో, ఎట్లు యోచింతిమో అట్టి జీవితవిధానఫలమును, అట్టి చింతాఫలమును వర్తమానకాలమున మన మనుభవించుచున్నాము. ఇపుడు మన మెట్లూహింతుమో, ఎట్లు ప్రవర్తింతుమో అట్టి యూహాఫలమును, అట్టి ప్రవర్తనసముద్భవఫలమును భావికాలమున అనుభవింతుము. ఇట్లనినపుడు అవ్వలిసాహాయ్యమును కాదనుట కాదు. ఆత్మాభివృద్ధికి వలసిన బహుళాంశములు వెలుపలినుండి చేకుఱు తోడ్పాటువలన చురుకుగా పనిచేయును. బాహ్యసహకారము అనివార్యమైనదను విశ్వాసము కలుగునంత వరకు ప్రపంచమందలి బహుళదృష్టాంతములు మన దృష్టి నాకర్షించుచున్నవి. ప్రేరణాప్రభావము అవ్వలినుండి మన హృదయములపై హత్తుకొనును. మన యంతరంగమున నిహితమైన శక్తులే యావేగసంస్పర్శ నందును. అపు డాంతరంగికాభివృద్ధి ఆరంభమగును. ఆధ్యాత్మికజీవన మావిర్భవించును. మనుష్యుడు పవిత్రజీవియై, తుదకు పరిపూర్ణుడగును. అవ్వలినుండి లభించు సునిశితప్రేరణశక్తి గ్రంథములవలన లభింపదు. ఆత్మ ఇట్టి శక్తిని మఱొక ఆత్మనుండియే పడయగలదు; మఱేవిధముగాను ఇది సాధ్యముకాదు. ఆజన్మము మనము గ్రంథపఠనము చేయవచ్చును; మనము మహామేధావులము కావచ్చును. కాని మన కాధ్యాత్మికాభివృద్ధి కలుగలేదని కాలక్రమమున గ్రహింతుము. మేధాసంపద వృద్ధియైనపుడు తోడ్తోడనే ఆధ్యాత్మికపురోభివృద్ధియై తీఱునని తలపజెల్లదు. దురదృష్టవశమున ప్రతికూలదృశ్యమే వ్యక్తమగుచుండుట తఱచుగ మనము చూచుచుందుము. ఆత్మవిభూతిని కొరవడచేసి మేధాశక్తి విశేషాభివృద్ధిని పడయుచుండుట

ఇంచుమించుగా ప్రతిదినము గోచరమగుచుండును — యీ రీతి దృష్టాంతములు తక్కువకావు.

మేధాభివృద్ధిలో పుస్తకముల సాహాయ్యము మనకు విశేషముగా లభించును. కాని ఆధ్యాత్మిక పురోభివృద్ధికి వీనివలన కలుగు ప్రయోజనము ఇంచుమించుగా హుళిక్కి యనియే చెప్పనగును. గ్రంథపఠనమువలన ఈ రీతి ప్రయోజనము మన కెంతేని చేకుఱునని ఒక్కొక్కపుడు మనము అపోహ పడుచుందుము. కాని మనము మన అంతరంగములను పరిశీలించుకొనినపుడు మన బుద్ధిబలము పెద్దదైనది; కాని ఆత్మశక్తి అట్లు కాలేదని మనకు బోధపడును. కావుననే ఇంచుమించుగా మనలో ప్రతివ్యక్తి ఆధ్యాత్మిక విషయములను గుఱించి ఎంతో అద్భుతముగ మహోపన్యాసముల నీయగలడు. కాని ఆచరింపవలసిన సమయము ఆసన్నమైనపుడు మన క్రియాశక్తి మిగుల శోచనీయమై యున్నదని గుర్తింతుము. వెలుపలనుండి రావలసిన అనివార్యప్రేరణశక్తి పుస్తకములనుండి రాకపోవుటయే ఇందులకు కారణము. సముచిత ఆధ్యాత్మిక హృదయసంచలనము ఒక మహత్తరాత్మనుండియే కలుగును.

ఈ యంతరంగిక సంచలనము గలిగించువాడు మహాత్ముడు. ఇతడు గురువు. ఆధ్యాత్మిక ప్రేరణమునందు వాడు శిష్యుడు. ఈ ప్రేరణశక్తిని ప్రసాదింపజాలు ప్రజ్ఞాశాలి గురువున కెంత అక్కఱైనదో, దాని నందుటకు వలసిన ప్రజ్ఞ అంతేవాసికిని అంత యక్కఱైనది. విత్తనము సజీవమై యుండవలెను; పొలము తయారుగా దున్నబడియుండవలెను. ఈ రెండు నియమములు ఎపుడు పరిపాలింపబడునో అపుడు మతము అద్భుతాభివృద్ధి నందును. "మతబోధకుడు మహానీయుడై యుండవలెను; శిష్యుడును అట్టివాడై యుండవలెను; చెప్పువా డాశ్చర్యమును గలిగించువాడు కావలెను; వినువాడును అట్టివాడై యుండవలెను." గురు శిష్యు లిరువురు నిక్కముగ అసాధారణప్రజ్ఞ

గలవారగునపుడే ప్రశంసనీయమైన ఆధ్యాత్మికపురోభివృద్ధి సుసాధ్యమగును. వారట్టివారు కాకపోవుచో, ఈ యాశయము సిద్ధింపదు. అట్టివారే వాస్తవగురుశిష్యులు. దీక్షాజీవులు కాక ఆధ్యాత్మికముగా కొంత కాలక్షేపము చేయువారు కొందఱు కలరు. వీరికి కొంత మానసికసంచలనము కలదు. ఇంచుక కౌతుకము కొఱకై ఈవిషయములందు వీరికి కొంత ప్రసక్తియుండును. ధార్మికదిగ్వలయపు టంచుపై వీరు నిలుచువారే. వీరిచేతయందు కొంత విలువ యుండును. మతమును గుఱించిన కొంత దాహము వీరివలన కలుగవచ్చును. కాలక్రమమున కొంత మేలు చేకూఱును. క్షేత్రము సిద్ధమైనపుడు అందు బీజము పడితీరవలెను. శిష్యుడు జిజ్ఞాసువై, జ్ఞానపిపాసువై, ఉపదేశమునకై తహతహలాడు నపుడు, ప్రజ్ఞాధురీణుడైన ధర్మబోధకుడు సాక్షాత్కరించి తీర వలెను—ఇది దుర్బోధ్యప్రకృతిసూత్రము. "అన్వేషియైన సాధి అన్వేషియైన ఆచార్యుని కనుగొనును". గ్రహించువాని ఆకర్షణ శక్తి పరిపూర్ణపరిణతిని పడసినపుడు దానికి చరితార్థతను చేకూర్ప జాలు శక్తి ప్రత్యక్షమై తీరవలెను.

కాని ఈ మార్గము తీవ్రసంకటసంకులమైనది. ఉపదేశ మును గ్రహింపదలచువాడు యథార్థమైన ఆధ్యాత్మికతృష్ణ నెఱుగక క్షణికావేశముతో ముందుల కుఱుకవచ్చును. మనలో ఈ యను భూతి కలదు. మనము విశేషముగా ప్రేమించిన ఒకవ్యక్తి మరణింప వచ్చును. ఇట్టి విపత్తు తఱచుగ మనలను నెదుర్కొను చునే యుండును. గుండెపై తీవ్రమైన చఱపుతిని, క్షణముసేపు సమస్తప్రపంచము మనవ్రేళ్లనుండి జారిపోవుచున్నదని అడలుదుము. అపుడు మనదృష్టి ఊర్ధ్వదిక్కుగా సారింపబడును. ఆధ్యాత్మిక జీవనము గడపుట మన ధర్మమని ఊహింతుము. కొలది దినము లలో పొంగు చల్లారును. ఉత్తాలమై వచ్చిన కెరటము సమసి పోవును. వెనుకటి పరిస్థితిలోనే మనము అల్లాడుచుందుము.

తాత్కాలికోద్రేకమే మతతృష్ణ యని మనము తఱచుగా భ్రమ పడుచుందుము; ఈ భ్రమ నిలుచునంతకాలము నిస్తుల ధర్మజిజ్ఞాస మనకలవడనే యలవడదు. ధర్మబోధచేయు మహాత్ముడు మనకు గోచరింపడు.

మనము సత్యాన్వేషులమై యున్నపుడు, మనకు సత్య సాక్షాత్కారము కాలేదని మనము మొరపెట్టుకొనుచుందుము. ఇట్లు మొరపెట్టుకొనుటకు మాఱు—అభియోగమును వ్యక్తీకరించుటకు మాఱు మన హృదయములను పరిశీలించుకొనుట మన ప్రధానకర్తవ్యము. నిక్కంపు జిజ్ఞాసానలము మనలో రవుల్కొనెనాయని మనము ప్రశ్నించుకొనవలెను. మనలో అనేకులందీ జిజ్ఞాస కొఱవడినదని గ్రహింతుము. సత్యసాక్షాత్కారమునకు మన మర్హులము కామనియే గుర్తింతుము.

ఈచిక్కు శిష్యులందు మాత్రమే కాక గురువులందు సయితము తలయెత్తుచున్నది. గురువుల నివి మఱింత మిక్కుటముగా నెదుర్కొనుచుండును. అజ్ఞానపంకిలమున దిగబడియున్నను, తాము సర్వజ్ఞులమని పల్వురు గర్వపడుచుందురు. అంతటితో వారూఱకొనియుండరు. తమ భుజములపై నొరుల నెక్కించుకొనుటకై వారు సిద్ధపడుచుందురు. "ఒక అంధుడు వేఱొక అంధునకు మార్గదర్శకుడైనపుడు, ఇరువురు గోతిలో పడిపోదురు" అను నుడువు నిక్కమగును. ఈరీతి వ్యక్తులతో ప్రపంచమంతయు నిండి యున్నది. తానాచార్యుడు కావలెనని ప్రతివాడు ఉబలాటపడుచుండును. పది లక్షల మేలినాణెములను దానముచేతునని ప్రతి భిక్షుకుడు పెద్ద కబురులు చెప్పుచుండును. ఇదెంత హాస్యాస్పదమైన విషయమో అదియు నిట్లే హాస్యాస్పదమైన విషయమగును. ఈ భిక్షుకులును ఆగురువులును సహపాఠులే!

ఈ పరిస్థితిలో నిక్కంపు గురువును గుర్తించుటెట్లు? సూర్యకాంతి నెఱిగించుటకు దివిటీ అక్కఱలేదు. రవిని విలోకిం

చుటకై మనము క్రొవ్వువత్తిని వెలిగింప నక్కరలేదు. దిగ్వలయముపై దినమణి ఉదయించినతోడనే భానూదయ ప్రభావమును గ్రహింతుము. మనలనుద్ధరించుటకై జగద్గురువు సాక్షాత్కరించినపుడు సత్యము ప్రత్యక్షమైనదని మన యాత్మ తక్షణమే గుర్తింపజాలును. సత్యము స్వతస్సిద్ధముగ సాక్షియగునది. పెర ఋజువుల ఆవశ్యకత దానికి లేదు. అది స్వయముగ ప్రకాశించు పరంజ్యోతి. అది మన నిభృతప్రకృతిగర్భములో ప్రవేశింపగలుగును. బ్రహ్మాండమంతయు లేచి, "ఇది సత్య" మని ఘోషించును. మహోన్నతపీఠముల నలంకరించు జగద్గురువులను గుఱించి ఇట్లు యోచింపజెల్లును. అగ్రశ్రేణిలోని ఆచార్యులయొద్దనుండిమాత్రమే కాక సామాన్యగురువుల యొద్దనుండికూడ మనము కొంత అభ్యుదయమును పొందజాలుదుము. ఉపదేశమును ప్రసాదించు గురువరుని ప్రజ్ఞావిశేషములను గుర్తింపజాలు సముచితచైతన్య ప్రభావము మనలో కలదని ఘంటాపథముగ తెలుపజాలము. కావున గురుశిష్యుల ప్రభావమును గుఱుతించుటకై కొన్ని పరీక్షలను మన మవలంబింపవలెను. అంతేవాసిలోను, ఆచార్యునిలోను గూడ కొన్ని ముఖ్యలక్షణము లవసరములై యున్నవి.

శిష్యుడు పవిత్రజీవియై యుండవలెను. వీనికి నిక్కంపు జ్ఞానతృష్ణ మిక్కిలి ఆవశ్యకమైనది. శ్రద్ధ వీని నైసర్గికగుణము కావలెను. పట్టుదల కీతడు పెట్టినపేరై యుండవలెను. పవిత్రజీవికాని వానికి ఆధ్యాత్మికవిద్య అలవడనే యలవడదు. జిజ్ఞాసకు పవిత్రత అనివార్యము. ప్రజ్ఞానముపై మక్కువ తక్కువై యుండరాదు. కాంక్ష ఎవరికి? ఇదియే ప్రశ్న. మనకు కావలసినది మన చేతులందు చిక్కును. — ఇది ప్రాచీనకాలమునుండి ప్రచలితమైయున్న సూత్రము. ఎవనికి ఏ కోరిక కలదో, ఆకోరిక ఫలించును. ధర్మజిజ్ఞాసకష్టభూయిష్టమైనది — సర్వసాధారణముగా మనమనుకొనునట్లు అది సులభసాధ్యము కాదు. ధర్మోపదేశములకు చెవియొగ్గుటే,

గ్రంథములను పఠించుటే మతము కాదని మన మెల్లపుడు మఱచుము. ఇది అవిరామముగ జరగు యుద్ధమని, మన ప్రకృతితో మనము సలుపు సమరమని, విజయము లభించువఱకు జరుగవలసిన అవిరళసంగ్రామమని మనము గ్రహింపవలెను. ఈ విజయసిద్ధి ఒకటి రెండు దినములలో, కొన్నేళ్లలో, కొన్ని జన్మలలో, ప్రాయశః నూఱులకొలది జన్మలలోగాని సాధ్యమగునది కాదు. ఈ దీర్ఘసాధనకు మనము సంసిద్ధులమై యుండవలెను. ఈ దీక్షతో ఈ తీవ్రసంకల్పశక్తితో ఏ అంతేవాసి సాధనపథమున ముందంజ వేయునో ఆతడు నిక్కముగ విజయధ్వజమును చేబూనజాలును.

ఆచార్యుడు ఆధ్యాత్మికశాస్త్రముల రహస్యమును హృదయంగమము జేసికొనవలెను. ఆతనిలో ప్రధానముగ మనము గమనింపవలసిన విషయమిది. సమస్తప్రపంచము మతశాస్త్రములను—వేదములు, బైబిలు, కొరాను మున్నగు గ్రంథములను—పఠించుచునే యున్నది. అవి శబ్దపరంపరమాత్రమే; బాహ్యపదవిన్యస్తమే; వ్యాకరణయుక్తశబ్దవిన్యాసమే; పదప్రకరణమే; శబ్దోత్పత్తి శాస్త్రమే; భాషావిజ్ఞానమే; మతమను అస్తిపంజరములోని ఎండు యెముకలమూటయే. ఏగ్రంథమైన ఎపుడు పుట్టినదో గ్రహించు సామర్థ్యము ఆచార్యున కుండవచ్చును. విషయబాహ్యావరణములే శబ్దములు. శబ్దములమీదనే విశేషదృష్టి సారించి, పదశక్తిపై, పదప్రభావముపై సర్వదా తమ మనస్సులను పాఱనిచ్చువారు, వానియందలి ఆత్మను జారవిడిచి అల్లాడుదురు. కావున ఆచార్యుడు ధర్మశాస్త్రముల ఆత్మ ఏదియో గ్రహింపజాలినవాడై యుండవలెను. పదజాలము పెద్ద అరణ్యము వంటిది; మనుష్యుని మనస్సు ఈ శబ్దకాంతారములో చిక్కుపడి బయటికి పోవుటకు దారిగనజాలకపోవును. వివిధపదసముచ్చయవిధానము, సమాసగ్రథననైపుణ్యము, విభిన్నసుందరభాషాప్రసంగకౌశలము, మతశాస్త్రములందలి అనుశాసనవాక్యములను నీతివచన

ములను వివిధరీతుల వ్యాఖ్యానించు నైపుణ్యము పండితులకు ప్రమోదము చేకూర్చుటకై ఏర్పడిన వాఙ్మయవిచిత్రపరంపర వీరికి పరిపూర్ణత్వము సిద్ధింపవు. పాండితీ విజృంభణము వీరి పరమాశయు — ప్రపంచ ప్రశంసకై వీరిట్లు ప్రదర్శింతురు. పండిత ప్రకాండులని వీరు ప్రశస్తి పడయుదురు. మహనీయులైన జగద్గురువులలో నెవ్వరును ఈ రీతి పుంఖానుపుంఖశబ్దసమీక్షతో కాలక్షేపము చేయలేదని మీరు గ్రహింపగలరు. ధర్మశాస్త్రములను తర్జనభర్జనచేసి "ఈ శబ్దార్థమిది. భాషావిజ్ఞానశాస్త్రమును బట్టి ఈ పదమునకును, ఆపదమునకును ఈరీతి సంబంధమున్న"దని వారెన్నడు బలుకలేదు. జగతియందు జనించిన ఆచార్యవర్యుల ఉద్గ్రంథములనన్నిటిని పరిశీలింపుడు; వారిలో నెవ్వరును ఈ పద్ధతి నవలంబింపలేదని మీకు బోధపడును. వారు కావించిన కర్తవ్యము ప్రబోధము. బోధచేయుటకు ప్రజ్ఞానసామగ్రిలేని వారు ఒకశబ్దమును దీసికొని, దాని వ్యుత్పత్తిని గుఱించియు, ప్రయోగమును గుఱించియు మూడు సంపుటముల పెద్ద గ్రంథమును తయారుచేయుదురు. మా ఆచార్యు డీరీతిగా తెలుపువారు! "కొందఱు వ్యక్తులు ఒక మామిడితోటలో ప్రవేశించి, అందలిచెట్ల ఆకులను లెక్కపెట్టుటలోను, ఆకులరంగును పరిశీలించుటలోను, రెమ్మల పొడవును గమనించుటలోను, కొమ్మల సంఖ్యను గణించుటలోను, ఈరీతిపనులలో యావత్తువేళను వెచ్చబెట్టుచుండగా, వారిలో నొక బుద్ధిమంతుడు అట్లు కాలహరణము చేయక చెట్లనుండి పండ్లు కోసికొని, వానిని మిక్కిలి మక్కువతో భుజింపనారంభించినాడు. ఆ వ్యక్తులను గుఱించి ఏమి యోచింతురు?" ఆకులను రెమ్మలను లెక్కపెట్టి పెద్ద జాబితా తయారుచేయుపని ఒరులకు వదలివేయుడు. ఆపనికి తగిన తావున దానికి సముచితమైన మూల్య ముండవచ్చును. కాని, ఇందు,—ఆధ్యాత్మికప్రపంచమున ఆపనికి చోటులేదు. ఈ విధమైన చేతలు చేయుటవలన మానవులు ఆధ్యాత్మికశక్తి నలవఱుచు కొనలేరు.

ఈ "పర్ణగణనసమర్థులలో" మహత్తర ఆధ్యాత్మికశక్తి నల వఱుచుకొనిన మహనీయు నెవ్వనిని మీ రెన్నడును చూచి యుండరు. మనుష్యుని పరమాదర్శము ధర్మము లేక మతము. వాని జీవితమునకు మహోత్కృష్టమైన మహిమను చేకూర్చున దదియే! ఈ యుదారాశయసిద్ధికై "ఆకులలెక్క" అవసరము లేదు. మీరు క్రైస్తవులు కాగోరుదురేని, "ఏసుక్రీస్తు జెరూస లేములో పుట్టెనా లేక బెథలెహోమ్‌లో పుట్టెనా? 'గిరిమీది ప్రబోధము' సరిగ ఏ తేదీనాడు చేయబడినది?" అని మీరు ప్రశ్నించుకొన నక్కఱలేదు. "గిరిమీది ప్రబోధము" లోని జ్ఞానానుభూతిని పొందుట మీ కర్తవ్యము. అది బోధచేయబడిన కాలమును గుఱించి, రెండువేలశబ్దములను మీరు పరిశీలింప నవసరములేదు. ఇట్టి పరిశీలనము పండితులకై ఏర్పడినది. వారిని పరిశీలింపనిండు, మీరు "తథాస్తు" అనుడు. మనము మామిడిపండ్లను భుజింతము.

ఆచార్యుని గుఱించి పాటింపవలసిన రెండవనిబంధన మిది. అతడు పాపరహితుడై యుండవలెను. ఇంగ్లాండులో ఒకప్పుడు మిత్రుడొకడు నన్నిట్లు ప్రశ్నించినాడు "ఆచార్యుని వ్య- వైశిష్ట్యమును గుఱించి మనము ప్రశ్నింపనేల? — అతడు బోధించిన దానిని వివేకపూర్వకముగా గ్రహించుటే కదా మనకర్తవ్యము!" ఈయూహ సరియైనదికాదు. ఒకానొక వ్యక్తి నాకు గతివిజ్ఞాన శాస్త్రమునుగాని, రసాయనశాస్త్రమునుగాని లేక మఱే భౌతిక శాస్త్రమునుగాని బోధింపదలచినయెడల, అతని గుణ మెట్టిదైన గావచ్చును. గతివిజ్ఞానశాస్త్రమునుగాని లేక మఱే భౌతికశాస్త్ర మునుగాని ఆతడు బోధింపవచ్చును. భౌతికశాస్త్రములవలన చేకుఱవలసినది మేధాసంపదకు సంబంధించిన జ్ఞానము మాత్రమే. మేధాశక్తి మీదనే ఇది ఆధారపడి యుండును. గురుగంభీరమేధా శక్తిగల వ్యక్తికి ఆత్మశక్తి శుద్ధపూజ్యము కావచ్చును. కాని ఆధ్యా

త్మికశాస్త్రములను గుఱించిన సమీాక్ష వేత్తై యుండవలెను. ఎవ్వని హృదయము కళంకితమై యుండునో, అందాధ్యాత్మికా లోకముండునని మన మెన్నటికిని తలపరాదు. పాపసంభరిత హృదయము బోధించునదేమి? దానికేమియు దెలియదు. ఆధ్యాత్మికసత్యము పవిత్రతయే "పవిత్రచిత్తులు ధన్యులు; కారణమేమన వారి కీశ్వరసాక్షాత్కారము లభించితీఱును" సర్వమతసారము ఈయొక్క ప్రవచనమున గలదు. దీనిని మీారవగాహ మొనరించుకొంటిరేని, భూతకాలమున బోధింపబడినదంతయు, భావికాలమున బోధింప సాధ్యమగునదంతయు మీారు గ్రహించియే యున్నారని వక్కాణింప జెల్లును. మీారు మఱిదేనిని పరిశీలింప నక్కఱలేదు. అవశ్యముగ మీారు గ్రహింపవలసినదంతయు ఆయొక్కవాక్యలో నిమిడియున్నది. తక్కినమతశాస్త్రములన్నియును పోయినప్పటికిని; ఆ యేకైకప్రవచనము ప్రపంచసముద్ధరణమును చేయజాలును. వ్యక్తి పరిశుద్ధాత్ముడైనగాని ఈశ్వరదర్శనము, — దైవీశక్తి బంధురభాస్వద్రోచిసాక్షాత్కారము సుసాధ్యము కానేరదు. కావున ఆధ్యాత్మవిద్యాబోధకునకు పవిత్రత అనివార్యగుణము. అతడెట్టివాడో ముందు గమనించి, తరువాత ఆతడేమి బోధించునో మనము గ్రహింపవలెను. కేవలము మేధావులైన బోధకులను వేఱుతీఱున పరిశీలింపవచ్చును. ఒకవ్యక్తి ఎట్టివాఁడో అను నంశముకంటె ఆత డేమి తెలుపునో అను విషయము వానిపట్ల ఘనతరప్రాముఖ్యమును వహించును. ఆధ్యాత్మికవిషయబోధకుడెట్టివాడో పరిశీలించిన పిదప ఆతని మాటల విలువ మనకు బోధపడును. కారణమేమన ఉదాత్తభావప్రేరణ మొనరించువాడీతడు. తనలో ఆధ్యాత్మికశక్తి లేనియెడల, ఈతడు దానినెట్లు ప్రేరణమొనరింపజాలును? విషయమొక ఉపమాలంకారములో స్పష్టమగును. 'ఉష్ణయంత్రమనబరగు దానియందు వేండ్ర మున్నపుడే అది ఉష్ణస్పందనమును మఱొకవస్తువులో కలిగింపజాలును. ఆయంత్రమున ఉష్ణములేనియెడల అదియట్లు చేయజాలదు.

శిష్యుని మనస్సున మానసికస్పందనమును ప్రసారణ మొనరించు మఱగురువు విషయమున మనమిట్లే యోచింపవలెను. నిర్వహింప వలసినకర్తవ్యము కేవలము మేధాశక్తుల నుద్దీపిత మొనరించుట మాత్రమే కాదు. మఱి ఆధ్యాత్మిక ప్రభావమును సమక్షమున అధివసించిన అంతేవాసి హృదయములోనికి ప్రసారిత మొనరించుట. ఒకానొకశక్తి, వాస్తవమై, బోధగమ్యమైన శక్తి గురువు నుండి వెలువడి శిష్యునిమనస్సున ప్రవేశించి విస్తరించును. కావున గురువు సత్యసందీపితవ్యక్తియై యుండవలెనను నిబంధ నము అనివార్యముగ గమనార్హమైనది.

మూడవ నిబంధనము: ఉద్దేశ్యము. శిష్యునకు ప్రబోధము చేయునపుడు ఆచార్యుని ఉద్దేశ్యము వానియెడల జూపబడు వాత్స ల్యమై, పవిత్రప్రేమయై యుండవలెను. కీర్తి పిపాసగాని, మఱే యన్యాశయముగాని గురువుహృదయములో నుండరాదు. ఆచార్యుని యొద్దనుండి అంతేవాసికి ఆధ్యాత్మికశక్తులు అనురా గముద్వారా పంపబడును. అన్యనిమిత్తమేదియు అందుల కుపక రింపదు. లాభముమీది ప్రీతిగాని, పేరుపై మక్కువగాని శక్తి ప్రసారమార్గమును తక్షణమే నాశనము చేయును. కావున ప్రేమ వలననే కర్తవ్య నిర్వహణము కావలెను. భగవంతు నెఱిగిన వ్యక్తియే ఆచార్యుడు కాజాలును.

ఈ లక్షణములన్నియును గురువులో వెలయునపుడు శిష్యుడు సురక్షితుడగును. ఎవనియందివి యుండవో వానిని ఆచా ర్యునిగా పరిగ్రహించుట తెలివిమాలిన పనియే యగును. శిష్యు నకు సద్గుణము నలవడజేయ లేకపోయినను, దౌష్ట్యమును కలుపు దుర్దశ ఒక్కొకపుడు వాటిలవచ్చును. ఈ విపత్తు తలయెత్తకుండ అంతేవాసి జాగరూకుడై యుండవలెను. ఎవ్వడో యొకడు మన కాచార్యుడు కాజాలడను విషయము స్పష్టాంశమే కదా.

సెలయేళ్లును, శిలాఖండములును ప్రబోధముచేయునను విషయము కవితాలంకార శోభితము; కాని సత్యసందీపితజీవి

కానివాడు ఆవంత సత్యమునైనను ఒరునకు బోధింపజాలడు. నిర్ఝరిణు లెవ్వరికి బోధించును? ఎవ్వాని జీవితకమలము ప్రఫుల్లమై యుండెనో, అట్టి పుణ్యాత్మునకు గురువు బోధింపజాలును. హృదయపుండరీకము ప్రఫుల్లమైనపుడు అది ఝరీమతల్లుల నుండియు, ప్రస్తరఖండములనుండియు ప్రబోధమును పడయ గలదు — యీ ప్రకృతి దృశ్యములన్నిటినుండి అప్పుడది ఆధ్యాత్మిక ప్రబోధము నందజాలును. వికసింపని హృదయమునకు వట్టి సెలయేళ్లును, గుండురాళ్లను అగపడును. గుడ్డివాడొకడు కొంతొక వివిధవస్తుప్రదర్శనగృహము (మ్యూజియము) కు పోవచ్చును. అతడు వచ్చి పోవును.—అంతియే! అతడు వీక్షింపవలెననిన వాని కన్నులు తెఱువబడవలెను. ధార్మికదృష్టిని ప్రసాదించువాడు ఆచార్యుడు. ఆచార్యునకును, అంతేవాసికిని గల సంబంధము పూర్వపురుషునకును, వంశధరునకునుగల బాంధవ్యముబోలునది. గురువర్యు డాధ్యాత్మిక పితృపాదుడు; శిష్యు డాధ్యాత్మిక తనూభవుడు.

స్వేచ్ఛను గుఱించి, స్వాతంత్ర్యమును గుఱించి పెద్ద కబురులు చెప్పవచ్చును. కాని వినయము, విధేయత, భక్తిశ్రద్ధలు లేకున్న, ధార్మికజ్ఞానము అలవడనేయలవడదు. గురుశిష్యుల నడుమ పూర్వోక్తపూతబాంధవ్యమెందు పరిఢవిల్లునో అందే మహోత్కృష్ట ఆధ్యాత్మికహృదయములు పెంపొందును. ఈసంబంధమెందు గగనకుసుమమగునో మతమందు కేవల మొక వినోద కాలక్షేపమే యగును. ఏజాతులందు, ఏ ఆలయములందు ఈదృశ గురుశిష్య సంబంధము మృగ్యమైపోవునో, ఆధ్యాత్మికవిభూతి ఇంచుమించుగా అందు శుద్ధశూన్యమై యుండును. పవిత్రబాంధవ్యానుభూతి వినా జ్ఞానము ప్రసారమొనరించువాడుగాని, జ్ఞానప్రసారమునకై హృదయము నొడ్డువాడుగాని లేడు; ఏలయన వారు పరస్పరసంబంధ మెఱుగని స్వతంత్రులు. అంతేవాసి ఎవనియొద్ద

విద్యనందగలడు ?—శ్రద్ధాభక్తులు లేని శిష్యుడు విద్యను కొనును. పెద్దనాణెము నిచ్చినపుడు, — కొంత క్రయధనము నొసగినపుడు, విత్తపు విలువకు తగిన మతబోధలభించును. ఇందుకై మిసమిస మెఱయు నాణెము నిచ్చుట అమ్మకమ్ యగునా ? కాని ధార్మిక జ్ఞానమును, మతవిభూతిని అలవఱుచుకొను విధాన మదికాదు.

ఆధ్యాత్మికప్రభావముగల ఆచార్యుడు అంతేవాసికి ప్రసాదించు ప్రజ్ఞానముకంటె పునీతమై, మహత్తరమైన దేదియులేదు. ఒక వ్యక్తి సంపూర్ణదక్షుడైన యోగియైనచో, ప్రజ్ఞానము తనంత దాను ఆతనిహృదయమును వరించును. కాని, ఇది గ్రంథముల వలన లభించునదికాదు. ప్రపంచపు నాలుగుమూలలకు బోయి ఎంతగానెత్తి కొట్టుకొన్నను, హిమాలయములందును, ఆల్ప్స లోను, కాకాసస్‌లందును, గోబీ యెడారిలోను, లేక సహారా మరుభూమియందును లేక కడలి యడుగులోను మీరెంత అల్లాడినను (మీరొక ఆచార్యుని కనుగొనువఱకు) మీకాజ్ఞానము అలవడదు. గురువును కనుగొని, బాలకునివలె ఆతనిని సేవించి, మీ హృదయములను విప్పి, గురుప్రభావమునందు ప్రసరింపనిచ్చి, ఆతనియందు ఈశ్వరసాక్షాత్కారము నవలోకింపుడు. సర్వేశుని సర్వోత్కృష్టవ్యక్తీకరణమును ఆచార్యునిలో ప్రత్యక్షమైనదని గుర్తించి, దృష్టి ఆతనిపైని కేంద్రీకరింపుడు. మీశ్రద్ధ! ఘనతరమగు కొలది, మీ యేకాగ్రదృష్టి నిశితమగుకొలది ఆచార్యుని మానవస్వరూపము అంతర్ధానమగును; శారీరికావరణము అదృశ్యమగును: శేషించిన సత్యనారాయణుడు సాక్షాత్కరించును. భక్తిశ్రద్ధలతో నిస్తులప్రేమతో సత్యమును జేరువారి నుద్దేశించి సత్యనారాయణుడే మహిమోపేతభాషణముల నుచ్చరించును. "మీ చరణములనుండి పాదరక్షలను తొలగింపుడు ; ఏలయన మీరు నిలిచినతావు పవిత్రస్థలము" ఏతావున భగవంతుని నామ ముచ్చరింపబడునో ఆతావు పవిత్రస్థానమగును. ఆ నామము

నుచ్చరించు మానవున కెంత పవిత్రత చేకూరునో యోచింపుడు. ఆధ్యాత్మికసత్యము లేమహానీయునినుండి వ్యక్తమగునో, ఆమహాత్ముని మనమట్టి భక్తిశ్రద్ధలతో సమీపింపవలెను. ఈ శ్రద్ధామహిమద్వారా మన ముపదేశము నందవలెను. ఇట్టి మహిమగల ఆచార్యులసంఖ్య జగతిలో మిక్కిలి తక్కువయనుట నిక్కమే. కాని పుడమిలో వారు బొత్తుగా లేరనుట నిజముకాదు. ఏ ముహూర్తమున వసుంధరలో వీరు బొత్తుగా లేకపోవుదురో, ఆ ముహూర్తములో పుడమి భయంకరనిరయమై ధూళ్యవలుంఠితమగును, ఈయాచార్యులు మనుష్యజీవనమున కుసుమించు సుందరప్రసూనములు. వారివలన జగతి గురుగుణగంధబంధురమై చలించుచుండును. జీవితహృదయములు వారు; వారి నుండి వ్యక్తమగు శక్తివలన సాంఘికబంధములు సడలక, బలవత్తరములై యుండును.

ఈ యాచార్యులను మించిన మఱియొకశ్రేణి గురువులు కలరు. వీరు ప్రపంచపు ఏసులు. వీరు గురువులకు పరమగురువులు. వీరు మనుష్యస్వరూపములందు గోచరించు ఈశ్వరప్రతినిధులు ; మహోత్కృష్ట స్థానముల నలంకరించిన మహాత్ములు. కేవలము స్పర్శవలన, ఆశీస్సువలన, వీరాధ్యాత్మికశక్తిని ప్రసారముచేయగలరు. వీరి సంస్పర్శవలన, ఆదరభరితసద్భావము వలన మిగుల నికృష్టులై పతితులైనవారు సయితము తృటిలో యోగులు కాజాలుదురు. ఇట్టి యద్భుత క్రియలను వీరెట్లు నిర్వహించువారో గ్రంథపఠనమువలన మీ రెఱుగరా? నే నింతకుముందుల్లేఖించిన ఆచార్యులవంటివారు కారు వీరు. వీ రాచార్యులందఱికి ఆచార్యులు. వీరి జీవనములు దైవశక్తిప్రదర్శనములు —— ఈశ్వరప్రభావసాక్షాత్కారములు. వీరిద్వారాగాని మనము భగవంతుని వీక్షింపలేము. వీరు మనకు పరమపూజ్యులు. వీరినే మనము ఆరాధించితీరవలెను.

తనూభవునిలో వ్యక్తమైన విధమునగాని ఈశ్వరు నెవ్వడు వీక్షింపలేదు. మనము భగవంతుని చూడలేము. దేవునిజూడ బ్రయత్నింతుమేని, హాస్యోద్రేకసాదృశ్యస్వరూపము నొకదానిని సృష్టించి "ఇతడే ఈశ్వరు" డందుము. మనము మానవులమై యున్నంతకాలము, మానవాతీతు డాతడని ఊహింపలేము. మనుష్యప్రకృతి నతిక్రమించి, ఈశ్వరుని స్వస్వరూపమును గుఱుతించు కాలము వచ్చితీఱును; కాని మనము మనుష్యులమై యున్నంతకాలము మనుష్యునిలోనే మన మీశ్వరు నారాధింప వలెను. మనమేమి ప్రసంగించినను ప్రసంగింపవచ్చును; ఎట్టి యత్నము చేసినను చేయవచ్చును. మనముభగవంతుని మనుజునిరూపమునగాక మఱేరూపమందును విలోకింపజాలము. మనము మేధాశక్తి బంధురములైన మహోపన్యాసముల నీయవచ్చును. గురుగంభీరశక్తిని ప్రదర్శించు యుక్తివాదులము కావచ్చును; దేవుని గుఱించిన ఈ కథలన్నియును వట్టి పుక్కిటిపురాణములని మనము ఋజువుచేయవచ్చును కాని ఆచరణయోగ్యమైన సాధారణబుద్ధి ఎద్దియో వ్యకరించుట మనధర్మము. ఈ మేలి మేధాశక్తి వెనుక నేమున్నది ? పూర్ణానుస్వారము; శుద్ధపూజ్యము; కేవల ఫేనము ; శూన్యము. ఈశ్వరారాధనకు విరుద్ధముగ నెవ్వడైన మేధాశక్తి బంధురమహోపన్యాసము లిచ్చుట ఇకముందు మీరు వింటిరేని, వానిని చేబట్టి, "భగవంతుడన నీ యూహయేమి?, "సర్వశక్తి" అన నేమి ? "సర్వజ్ఞత" అనిన నేమి ? "సర్వత్ర విరాజిల్లుప్రేమ" అన నేమి ? ఈ రీతి మహావాక్యముల వర్ణక్రమములే కాక, వాని యందలి అంతరార్థమేమి ?" అని ప్రశ్నింపుడు. అతడేమియు జెప్పజాలడు. ఒక్క భావమునైనను ఆతడు సూత్రబద్ధ మొనరింప లేడు. ఒక్క గ్రంథమునైనను చదువని పామరునికంటె ఆతడధికుడు కాడు. పామరుడు ప్రశాంతమూర్తి. జగతిలో ఆతడెట్టి గగ్గోలును పుట్టింపడు. ఇక నావాచాలుడో, తన పిడివాదములతో ప్రపంచములో చెప్పరాని గడబిడ సృజించును. నిక్కంపు

పరిశీలనాశక్తి వానిలో హెచ్చు. ఇరువురును ఒకే స్థితియందున్న వారు.

మతమనిన మహత్తరభావానుభూతి. కేవల ప్రసంగమునకును ఆధ్యాత్మికభావానుభూతికిని గల వ్యత్యాసమును మీరు గ్రహింపవలెను. ఆత్మవిలోకనమున, ఆత్మసాక్షాత్కారమున సాధ్యమగున దీ యనుభూతి. మానవు డాత్మనుగుఱించిన భావన జేయజాలడు. సమక్షమున దృగ్గోచరములగు దృశ్యములద్వారా దాని నాతడు భావనచేయవలెను. నీలినీలియత్తలమును, విశాల కేదారములను, గభీరసింధువును ఈదృశ మహిమోపేతప్రకృతి దృశ్యమును పురస్కరించుకొని ఆతడు భావనచేయవలెను. వేఱు తీఱున భగవంతుని భావనచేయుటెట్లు? నిక్కముగ మీ రేమి చేయుచున్నారు? సర్వత్రవిద్యమానశక్తిని గుఱించి మీరు ప్రసంగింతురు; సముద్రమును గుఱించి మీ రూహింతురు. భగవంతుడు సముద్రమా? సహజబుద్ధి మఱికొంత అవసరమైయున్నది. సాధారణబుద్ధి యనబరగు అసాధారణధీశక్తి మఱొకటి లేదు. ప్రపంచము మాటలతో నిండియున్నది. ఫేనసదృశప్రపంచవాగ్వాదమును కట్టిపెట్టుడు. మన ప్రస్తుత స్థితి ననుసరించి మనశక్తి పరిధి గలదియైనది. భగవంతుని మనము మనుష్యస్వరూపములో వీక్షింపక తప్పదు. దున్నపోతులు ఈశ్వరు నారాధింప నుద్దేశించిన నైన, ఆతడొక పెద్ద దున్నపోతనియే భావనచేయజాలును. చేపయొకటి దేవుని గొలువదలచినచో, ఆతడొక పెద్దచేప యనియే అది యూహింపజాలును. మీరును, నేనును, దున్నపోతును, చేపయును వేర్వేఱు పాత్రల బోలువారము. ఈ పాత్రలన్నియును తమతమ స్వరూపముల ననుసరించి సముద్రోదకముతో నిండుకొన నుంకించును. పాత్రలను బట్టియే సలిల ప్రవేశముండును. ఈశ్వరుని గుఱించిన భావనకూడ ఇట్టిదే! మనుష్యులు భగవంతుని మనుష్యస్వరూపమున భావనచేయుదురు. పశువులు స్వీయస్వరూపమం దాతడున్నట్లూహించును. ఒక్కొక్కజీవి

వ్యక్తిగత దృక్పథమునుబట్టి, వ్యక్తిగతాశయము ననుసరించి ఈశ్వరభావన జేయజాలును. ఆతని నాకళించుకొనజాలు విధాన మదియే. మనుష్యభావనతో మీరాతని నారాధింపవలెను. ఏల యన వేఱువిధానము సాధ్యముకాదు. ఈ భావనతో ఈశ్వరు నారాధింపనివారు రెండు తెగలవారు కలరు. — మతభావనలేని నరజంతు వొకడు; రెండవవాడు పరమహంస; ఈతడు మానవా తీతుడు. ఈతడు తన మానసశరీరములను పరిత్యజించినవాడు; ప్రకృతి పరిధుల నతిక్రమించినవాడు. ప్రకృతియంతయు వీని దివ్యాత్మయయ్యెను. వీనికి మనస్సులేదు; దేహమూలేదు. ఏసు బుద్ధులట్లు ఈతడు ఈశ్వరుని ఈశ్వరునివలెనే ఆరాధింపజాలును. మనుష్యభావనతో ఇట్టి వారు భగవంతుని పూజింపరు. వేఱురీతి మానిసి నరజంతువంటివని గదా. వేర్వేఱు చరమస్థితు లొకే తీఱున నుండుట మీ రెఱుగుదురు. అజ్ఞాన ప్రజ్ఞాన చరమస్థితులు గూడ ఇట్టివే; ఈ స్థితులందుండువా రెవ్వరిని ఆరాధింపరు. ఈశ్వ రారాధనావశ్యకత నెఱుగజాలు ఆంతరంగికాభివృద్ధి నెఱుగక పోవుటచే అజ్ఞాను లందఱ్రగగణ్యులు; దానిమాట నెత్తనే యెత్తరు. ప్రజ్ఞానాగ్రము నందుకొనిన ఈశ్వరుని పూజింపరు. ఉదాత్త యాధ్యాత్మికానుభూతినంది, తామీశ్వరుడే యగుటవలన వీ రట్లొనరింపరు. భగవంతుడు భగవంతు నారా ధింపడు. ఈ యిరు తెగలనడుమ నెవ్వడైన మనుష్యభావనతో ఈశ్వరుని తానారాధింపనని తెలుపుచో వానియెడల జాగ రూకులై మెలగుడు. ఆతడు బాధ్యతనెఱుగని వాచాలుడని, వాని వాక్కులు భ్రమబంధురములని గ్రహింపుడు. వాని ప్రబోధము భావశూన్యులకై ఉద్దేశింపబడినది. — వాని యుపదేశము భావ రహితమే ధాతశక్తివిజృంభణము.

కావున భగవంతుని మనుష్యభావనతో ఆరాధించుట అత్యంత ముఖ్యమైన విషయము. ఆరాధనయోగ్యుడైన "ఈశ్వర తుల్యమనుష్యు" డేజాతులందుగలడో ఆ జాతులు ధన్యతగాంచి

నవి. క్రైస్తవులం దిట్టి దివ్యపురుషుడు ఏసు. కావున క్రైస్తునకు సన్నిహితులై యుండుడు. ఆతని నెన్నడు పరిత్యజింపకుడు. ఈశ్వర సాక్షాత్కారము నందు విధానమది. మానవునిలో దేవుని అవలోకింపుడు. ఈశ్వరుని గుఱించిన మన యూహలన్నియును అందు కేంద్రీకరింపబడి యున్నవి. ఒక్క ఏసునుతక్క తక్కిన ఈశ్వరావతారములను క్రైస్తవు లంగీకరింపరు— ఇది వారిలోని గొప్ప లోపము. ఏసు ఈశ్వరావతారమైనట్లే బుద్ధుడును ఈశ్వరావతారమే; అట్లే మఱికొందఱవతారపురుషులు కలరు. ఇట్లే నూఱులకొలది అవతారపురుషులు గోచరింపవచ్చును. భగవంతున కెందును అవధులను సృష్టింపకుడు. ఈశ్వరునకు చేకుఱ వలసిన భక్తిశ్రద్ధలను ఈశ్వరునియెడల జూపుడు. ఏసు నారాధింపుడు. మనముచేయదగు ఏకైక ఆరాధన మదియే. నిర్గుణుడైన భగవంతుని పూజించుట సాధ్యముకాదు. ఆతడు సమస్తవిశ్వమందు అంతర్యామియై యున్నాడు. మనుష్యరూపమందు నిర్గుణ బ్రహ్మము వ్యక్తమైనపుడే మన మారాధింపజాలుదుము. ప్రార్థన చేయునపుడు క్రైస్తవులు "క్రైస్తునామమున" అను వాక్కు నుచ్చరించుట ముదావహము. నిర్గుణోపాసనకంటె ఇట్లారాధించుట సుసాధ్యము. మనుష్యుని హృదయానుభూతులను భగవంతుడు గుఱితించి లోకకల్యాణ మొనరించుటకై మనుష్యుడై యవతరించును.

"ఎప్పుడు ధర్మమునకు గ్లాని కలుగునో, ఎపుడు అవినీతి చెలరేగునో, ధర్మసముద్ధరణ మొనరించుటకై నేనవతరింతు" నని శ్రీకృష్ణభగవానుడు వచించెను. "సర్వ శక్తి సంపన్నుండనై, విశ్వమందు సర్వాంతర్యామినై మానవావతారమెత్తిన నన్ను మూర్ఖులు గుఱితింపక నిందింతురు; నే నీశ్వరుడనుగానని యెంచెదరు" అనియును ఆతడనెను. వారిమనస్సులు ఆసురికసంతమసావృతములైనవి. కావున ఆతడు విశ్వేశ్వరుడని వారు గుర్తింపజాలరైరి. ఈ ఈశ్వరావతారములు పరమపూజ్యములు. వారు

ఆరాధ్యులని నొక్కి వచింతును. వారవతరించిన దినములందును, పృథ్వీరంగమునుండి వారు నిష్క్రమించిన దినములందును వారి యెడల మనము ఘనతరభక్తిశ్రద్ధలను ప్రదర్శింపవలెను. ఏసు నారాధించు తఱి, ఆతడు కోరినవిధమున నారాధింతును. ఆతని జన్మతిథియందు విందారగించుటకంటె ఉపవాసమొనరించి, ప్రార్థన జేసి, నేనాతనిని సేవింతును. వారిని గుఱించి మనన మొనరింతుమేని, ఈ యవతారపురుషులు మన యాత్మలందావిర్భవింతురు; తమ్ముబోలువారినిగా మనలను పరివర్తన మొనరింతురు. మన ప్రకృతియంతయు మార్పుచెందును; మనము వారివలె కాజాలుదుము.

కాని మీరు క్రైస్తునుగాని, బుద్ధునిగాని అంతరిక్షమున నెగయు దుష్టదేవతాగణమందు జేర్చరాదు. అది కాని పని;—అది అపవిత్రీకరణమే యగును. ప్రేతగవేషకబృందమున జేరి, నృత్యవిజృంభణమొనరించుటా? ఇదెట్టి విపరీతభావనము! ఈ దేశమున నే నిట్టి మిథ్యాప్రదర్శనము నవలోకించితిని. ఈశ్వరావతారము లీ రీతిగా సాక్షాత్కరింపరు. వారిలో నేయొకరి స్పర్శయందలి ప్రభావమైన మనుష్యునిపై వ్యక్తమగును. క్రైస్తు సంస్పర్శవలన మనుజుడు సంపూర్ణాంతరంగికపరివర్తనము నందును. ఈయద్భుత పరివర్తనమువలన ఆతడు క్రైస్తువలె కాజాలును. ఆతని జీవితము సమగ్రముగ ఆధ్యాత్మికాలోకసందీపితమగును. వాని శరీరమందలి ప్రతి లోమకూపమునుండి ఆధ్యాత్మికశక్తి వ్యక్తమగుచుండును. క్రైస్తు కొన్ని మహిమలను ప్రదర్శించెను; ఈ మహిమలలో రోగనివారణ మొకటి. ఇవి ఆతని దివ్యచరిత్రను ప్రకటించునవియా? ఇవి వైశిష్ట్యహీనక్రియలు. నిమ్నశ్రేణిప్రజలందు మసలునపుడు ఈ విడ్డూరముల నాతడు చేయవలసివచ్చెను. ఈ యలౌకికక్రియల నాత డెందు నిర్వహించెను? యూదులనడుమ వాని నాతడు ప్రదర్శించెను. యూదు లాతనిని గుఱుతింపలేదు. స్వీకరింపలేదు. ఈ విడ్డూరముల ప్రదర్శన మెందు జరుగలేదు?

యూరపులో క్రైస్తును నిరాకరించిన యూదులకు దక్కినది విడ్డూరపు చర్య ప్రదర్శనము. క్రైస్తును స్వీకరించి ఆదరించిన యూరపునకు చేకూఱినది మహత్తరమైన "గిరిమీది ఉపదేశము". మనుష్యాత్మ సత్యమును స్వీకరించినది; అసత్యమును పరిగ్రహింప నిరాకరించినది. క్రైస్తుయొక్క అద్భుతశక్తి, వ్యాధినివారణాది అలౌకికక్రియాప్రదర్శనములందు లేదు. ఎట్టి మూర్ఖుడైన ఇట్టి పనులను చేయజాలును. మూఢు లొరుల తెగుళ్లను మాన్పజాలుదురు. పిశాచములును ఇట్లొనరింపజాలును. ఘోరపైశాచికప్రకృతిగల వ్యక్తులు కొందఱు అద్భుతాలౌకికక్రియలను నిర్వహించుట నే జూచితిని. మృత్తికను చేబూని దానితో పండ్లను సృజించుచున్నట్లు వారు గోచరింతురు. కొందఱు మూఢులను, ఆసురశక్తిసంపన్నులను త్రికాలవిషయములను తెలుపుట నే నెఱుగుదును. ఒక్కచూడ్కిని సారించి సంకల్పశక్తివలన, భీషణవ్యాధులను పోగొట్టిన మూర్ఖులు కొందఱిని నే నవలోకించితిని—ఇవి శక్తులనుట నిక్కమే! కాని విశేషించి ఇవి ఆసురశక్తులే! ఏసు ప్రదర్శించిన రెండవరీతి శక్తి ఆధ్యాత్మికశక్తి. ఈ శక్తి సర్వదా విద్యమానమైనది.—సర్వకాలములందు విరాజిల్లునది. ఇది అతడు వ్యక్తీకరించిన మహోత్కృష్టప్రేమయందు, ఉచ్చరించిన సత్యసందీప్తవాక్కులందు, గురుగంభీరబోధనలందు గలదు. ఒక్కచూపుతో అతడు మానవులవ్యాధులను మాపొనరించిన విషయము విస్మృతిలో పడిపోయినది. "నిర్మలహృదయులు ధన్యుల"ని అతడుచ్చరించిన మహావాక్కు నేడును స్మరణీయమై యున్నది. ఈ వాక్కులోని శబ్దములు మహత్తరశక్తిభండారములు. ఈ శక్తి ఎన్నడును మాపుకానిది. ఎంతకాలము మానవమానసము విద్యమానమైయుండునో, ఎంతకాల మీశ్వరనామము మఱపునబడకుండునో ఈ శబ్దములు మాపుకాక ప్రభాకలితములై, సచలములై వెలయును. ఈ శక్తులు ఏసుబోధించినవి; ఇవి ఆ మహనీయునిలో పరిఢవిల్లినవి. పవిత్రత యనునది మహత్తరశక్తి. ఇది

స్థిరీకృత మహాశక్తి క్రైస్తు నారాధించునపుడు, ఆతనిని గుఱించి ప్రార్థించునపుడు మనమన్వేషించునదేమో మనము స్మరించుకొనవలెను. మనుష్యునకు ముక్తిని ప్రసాదించునది, ప్రకృతి నాతని చెప్పు చేతలందుంచునది, దాస్యచిహ్నమాతని యొద్దనుండి నూడబెఱుకునది, వాని కీశ్వరసాక్షాత్కారమును ప్రసాదించునది మాహాత్మ్యగర్భితములైన విడ్డూరపు ప్రదర్శనములుగాక ఆశ్చర్యకరములైన ఆత్మశక్తులే.

## ప్రతిమల ఆవశ్యకత

భక్తి రెండు భాగములుగా విభజింపబడినది. ఒకభాగము "వైధి" అనబరగుచున్నది. ఇది చిహ్నగతమైనది; విగ్రహమూలకమైనది. ఇది ఆచారప్రియులు కాంక్షించుభక్తి. రెండవ భాగము ముఖ్యమైనదని, మిగులనుత్కృష్టమైనదని యొప్పుచున్నది. అనున్నతవిధానమునుండి మహోన్నత విధానమైన రీతులు భక్తి ప్రదర్శనమున ఇమిడియున్నవి. ప్రపంచమందలి ఏదేశమందైనను, ఏమతమందైనను ప్రచలితమగు ఆరాధనము ప్రేమవలన నియాశ్రితమైనది. కాని కొన్నికొన్ని సందర్భములందు కేవలము చిహ్నములద్వారా ప్రదర్శింపబడుచుండును. మఱికొన్ని సందర్భములందు ఈ రీతి ప్రదర్శ నెఱుగకున్నను ప్రేమ వ్యక్తీకరణముగాక అనున్నత స్థితియందున్నది. పూర్వోక్తములైన అనుష్ఠానములను, ఆ[illegible]రములను అనావశ్యకములని తెలుపలేము. ఆత్మ నగ్రేసరమొనరించుటకై భక్తియొక్క బాహ్యభాగము విశేషముగ నావశ్యకమైనది. ఒక్క ఉఱుకులో సర్వోత్కృష్టస్థితిని జేరజాలుదునని ఊహించినపుడు మనుష్యుడు గొప్ప తప్పుచేయుచున్నాడు. ఒకనాటికో తాను వృద్ధుడు కాజాలునని పసిబాలుడు యోచించుచో వాని యూహ దోషభూయిష్టమైన దండుముగదా. పుస్తకములందుగాని, బుద్ధిగతసమ్మతియందుగాని, హేతుశక్తియందుగాని మతముండదను ప్రగాఢభావమును మీరు సదా మీమనస్సు

లందుంచు కొనెదరని ఆశపడుచున్నాను. హేతుశక్తి, సిద్ధాంతములు, ప్రమాణపత్రములు, ఉపదేశావళి, గ్రంథములు, మతాచారములు : ఇవి యన్నియును మతమునకు తోడ్పడు వ్యవస్థలు; "అంతరంగికానుభూతియే మనము" అని యెఱుగుడు. ఈశ్వరుడున్నాడని మనమందఱము వచింతుము. మీరు భగవంతుని జూచితిరా ? ఇదియే ప్రశ్న. "దేవుడు స్వర్గమందున్నా"డని ఒక మనుజుడనుట మీరు వినియుందురు. "ఈశ్వరుని చూచితివా ?" అని మీరు వాని నడుగుడు. "చూచితిని" అని అతడనుచో, మీరు వాని నెగతాళిచేసి "అత డున్మాదగ్రస్తు"డని తెలిపెదరు. పలువురదృష్టిలో మన మొకరీతి బుద్ధిగత సమ్మతిని గణింతుము. అదియొక ప్రమాణపత్రమును మించిపోదు. దానిని నేను మత మనను. ఆ రీతి మతమును పొందుటకంటె ఒకడు నాస్తికుడై యుండుటమేలు. మతము మన బుద్ధిగతసమ్మతిమీదను, అసమ్మతి మీదను ఆధారపడదు. ఆత్మ కలదని మీరు వాకొందురు. మీరాత్మను విలోకించితిరా ? ఎల్లఱకు ఆత్మయుండగా దానిని చూడ జాలకపోవుటేల ? ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చుచు, ఆత్మను వీక్షించుమార్గమును మీరు జూపవలెను. అట్లొనరింపజాలక పోవుదురేని, మతమును గుఱించి ప్రసంగించుట నిష్ప్రయోజనము. మతము సత్యసందీపితమైనయెడల, మనకది ఆత్మను చూపవలెను; భగవంతుని జూపవలెను ; మనలోని సత్యమును చూపవలెను. మీరును, నేనును అనంతకాలము ఉపదేశావళిలో నొకదానిని గుఱించియు, ప్రమాణపత్రములలో నొకదానిని గుఱించియు పోరుసలుపుచో మన మేసిద్ధాంతమును కనుగొనజాలము. యుగముల నుండి మనుజులు పోరుసలుపుచున్నారు; దీనినుండి తలసూపిన ఫలమేమి ? మేధాశక్తి ఆధ్యాత్మికలక్ష్యమును చేరలేదు. మనము మేధాశక్తి నతిక్రమించి పోవలెను; మతముయొక్క తార్కాణము స్పష్టపరిశీలనమందే, ప్రత్యక్షానుభూతియందే, ఆత్మ - సాక్షాత్కారమందే కలదు. ఎదుట ఈగోడ కలదనుటకు ఋజువు అది

మనకగపడుటయందే కలదు. ఇది యున్నదా లేదాయని మనము కూర్చుని యుగములతరబడి వాదించినయెడల, ఏ సిద్ధాంతమును మీరు కనుగొనజాలరు; ఎదుటనున్న కుడ్యమును చూడుడు; చాలును. ప్రపంచములోని ప్రజలందఱు ఇదిలేదని తెలుపుచో, వారిమాటను మీరు విశ్వసింపరు. ఏలయన మీ కన్నులిచ్చు సాక్ష్యము జగతిలోని ఉపదేశావళికంటె, ప్రమాణపత్రముల కంటె మిన్నయైనదని మీ రెఱుగుదురు.

ధార్మికతాపూర్ణజీవులు కాగోరుదురేని, తొలుత మీ గ్రంథావళిని విసరిపాఱవేయుడు. గ్రంథపఠన మెంత తక్కువ జరిగిన అంత మేలు చేకుఱును; ఏకకాలమున ఏకకర్తవ్యమును నిర్వహింపుడు. ఆధునికయుగములో ప్రతీచీదేశములందు మెదడులో నానాపదార్థములను జేరవేయుట పరిపాటియైపోయినది. జీర్ణముకాని బహువిధ భావపరంపర మెదడులో అల్లకల్లోల మొనరించును. విశృంఖలరీతిని ఊహలు చెలరేగుచుండుటవలన స్పష్టభావరూపమేర్పడుట కవకాశము కలుగదు. పలువురం దీ స్థితి ఒకవిధమైన వ్యాధిగా పరిణమించుచున్నది. ఇది మతముకాదు; ధర్మముకాదు. కొందఱు వ్యక్తులు తీవ్రమైన ఆవేగము నభిల షింతురు. వారికి భూతములను గుఱించిన కథలను తెలుపుడు; ఉత్తరధ్రువమునుండి వచ్చువారిని గుఱించి వారికి వినిపింపుడు. రెక్కలతోగాని, మఱే రూపములతోగాని ఏదియో దూరప్రదే శమునుండి వింతజీవులువచ్చి అదృశ్యులై తమ్ము పరిశీలించుచు, అపార్థివానుభూతిని కలిగింతురని వారితో తెలుపుడు. ఈ విడ్డూరపు గాథలు విని, సంతృప్తి నంది వారు తమ తమ గృహములకు తరలి పోదురు. కాని ఇరువదినాలుగు గంటలలో రోమాంచకర ఉత్తేజనానుభూతికై వారు తహతహలాడుచుందురు. కొందఱీ యనుభూతిని మతానుభూతి యనుచుందురు. ఈ మార్గము మతముదెస గాక వారిని ఉన్మాదాలయముదెస నడపును. శక్తి హీనులకు ఈశ్వరు డందడు. పూర్వోక్త అతిప్రకృతవిశేషములు

మానవుని శక్తిరహితుని జేసి వదలును. కావున వాని దరి జేరకుడు; వాని దాపున చేరువారి శక్తి సన్నగిలును; వారి మేధయందు విశృంఖలస్థితి విజృంభించును; మనసుకు దుర్బలత దాపురించును; ఆత్మ యవినీతిపాలబడును; దారుణవిహ్వలత దాపురించును. మతము ప్రసంగములందు లేదని, ఉపదేశావళియందు లేదని, గ్రంథపరంపరలో లేదని, ఆత్మానుభూతిలో కలదని విశ్వసింపుడు. అది పాండిత్యముకాదు మఱి అస్తిత్వము. "దొంగతనము కూడదు" అను నీతివాక్యము నెల్ల తెలియుదురు. ఐననేమి? హర్త కానివాడే నిక్కముగ అందలి వైశిష్ట్యము నెఱుంగును. "ఇతరులను హింసింపవలదు" అను నీతివాక్యకూడ ఎల్లఱకు సుపరిచితమే. కాని ప్రయోజనమేమి? హింసింపనివారే మహిమోపేతమైన భావానుభూతి నందెదరు. ఈ యనుభూతి ననుసరించియే వారు స్వీయగుణగ్రథన మొనరించుకొందురు. మతమనిన ఆంతరంగికానుభూతి. ఈ భావానుభూతిని మీ రెపు డందెదరో, అపుడు మీ రీశ్వరారాధకులని వచింతును. ఈ దివ్యానుభూతిని పడయుటకుమున్ను మీ రా శబ్దమందలి వర్ణ క్రమమును మాత్ర మెఱుగుదురని వచింతును. ఈ యనుభూతి శక్తియే మతమగును; ధర్మమగును—ఉపదేశావళిని, తత్త్వశాస్త్ర పరంపరను, నీతిశాస్త్రగ్రంథములను పెద్దయెత్తున మీ మస్తకము లందు మీరు నింపినను, మీ కంతగా చేకుఱు ప్రయోజనము లేదు; మీ రెవ్వరో, మీ రందిన అనుభూతి ఎద్దియో గమనార్హములైన విషయములు కావున మతానుభూతి అవసరమైనది. ఇది యొక్క నాటితో సాధ్యమయ్యెడిదికాదు. ఇది దీర్ఘాభ్యాసమువలననే సుసాధ్యమగును. ఒక యుదాత్తమైన విషయమును, ఆశ్చర్యాన్వి తాంశమును వినినపుడు మానవులు అది సులభముగ చేబడునదని ఊహింతురు; క్రమానుష్ఠానమువలనగాని ఆశయము సిద్ధింపదని తుణమైన నిలిచి వా రూహింపరు. ఒక్కఉదుటుతో దాని నందు కొనవలెనని వా రుబలాటపడుదురు. అది సర్వోత్కృష్టమైన

లక్ష్యమైనయెడల, అది కరతలామలకము కావలెననియే కాంక్షింం తుము. దాని నందుకొనజాలు శక్తి మనకు కలదా, లేదా అను ఊహకు హృదయమున చోటియ్యము. ఈ ప్రవర్తనవలన పొడసూపు ఫలము; మనమేమియు చేయజాలకపోవుటయే. మీరు మానవు నొక్క చిన్నపుల్లతో లేవనెత్తి ఆ లక్ష్యముదెస త్రోసి వేయజాలరు. క్రమానుష్ఠానమువలన మనకు లక్ష్యసిద్ధి సాధ్యమగును. కావున ఈ యనుష్ఠానమందలి తొలిభాగము "వైధి భక్తి" యైనది. ఇది యారాధనలోని ప్రథమదశ.

ఈ దశలోని ఆరాధనవిధానము లేవి? అవి వివిధములు. అంతరంగికానుభూతినందుటకై స్థూలవస్తువులద్వారా సాధన సాగించి, (బాలకులు తొలుత వస్తువాచకరీతిని విద్యాభ్యాసము చేయునట్లు) క్రమక్రమముగా మనము భావమూలకసాధనసిద్ధిని పడయవలెను. పసిపాప నుద్దేశించి ఐదును రెండుతో గుణించిన యెడల పది యగునని చెప్పినచో, విషయము దానికి బోధ పడదు; కాని మీరు పదివస్తువులను తెచ్చి, రెండువస్తువులచొప్పున ఐదు శ్రేణులలో పేర్చిచూపినయెడల విషయము పసిపాపకు బోధ పడును. మతానుష్ఠానము సుదీర్ఘప్రగతికి సంబంధించినది. సాధకుడు మెల్లగా, క్రమక్రమముగా ఈ పథము ననుసరించి పోవలెను. మనమందఱము ఇచట పసిపాపలము. మనము వయసు ముదిరినవారము కావచ్చును; విశ్వమందలి సమస్తగ్రంథములను మనము పఠించియుండవచ్చును; కాని మనమందఱము ఆధ్యాత్మిక శిశువులము. ఉపదేశపరంపరను, దృఢభావబంధురసిద్ధాంతములను మనము గ్రాసము లొనరించుకొంటిమి; కాని మనజీవితములలో అంతరంగికానుభూతినందిన దేదియు లేదు. మనమిపుడు స్థూలవస్తు పరిశీలనముతో, ఆకారములతో, శబ్దములతో, ప్రార్థనలతో, బాహ్యానుష్ఠానములతో మనసాధన నారంభింపవలెను. ఈ స్థూలవ్యవస్థలు బహుసహస్రములు కావచ్చును. ఏకైకమైన ఆకారమును ఎల్లఱును అంగీకరింపనక్కఱలేదు. కొంతమందికి

విగ్రహముల సాహాయ్యముతో పని చెల్లవచ్చును; మఱికొందఱికి ఈరీతివ్యవస్థ అక్కఱలేకపోవచ్చును; కొందఱికి ఆవలివిగ్రహపు ఆవశ్యకత ఉండవచ్చును; మఱికొందఱు ఆంతరంగికవిగ్రహముతో సాధన సాగించవచ్చును. హృదయఫలకముపై విగ్రహప్రతిష్ఠ చేసికొను నాతడు "నేనుచ్ఛతరస్థితి నలంకరించిన వ్యక్తిని. మూర్తి అంతరంగమున ప్రతిష్ఠింపబడినయెడల, నిర్దుష్టక్రియయే అగును. కాని ఆ విగ్రహ మవ్వల ప్రతిష్ఠింపబడుచో, అది విమర్శకు గుఱియగును. ప్రతిమోపాసనయగును. ఈరీతి ఉపాసనను నేను ప్రతిఘటింతును" అని పలుకును. ఛర్చిరూపముననో లేక ఆలయరూపముననో ఒకడు స్థూలస్వరూపమును నిర్మించినయెడల, అది పవిత్రమైనదని మానవు డూహించును; కాని ఆ స్థూలరూపము మనుష్యునిదైనయెడల, అది దోషభూయిష్ఠమైనదని ఆతి డెను ర్కొనును.

కావున వివిధాకారములద్వారా మనస్సు స్థూలవస్తుసాధనను నిర్వహించును. తరువాత క్రమక్రమముగ భావావగాహము నలవఱుచుకొని, భావానుభూతి నందజాలును. ఒకేఆకారము నెల్లఱు స్వీకరింపనక్కఱలేదు. ఒకస్వరూప మొక్కనికిని, వేఱొకస్వరూప మఱొక్కనికిని అనుకూలముగా నుండవచ్చును. ఇట్లే బహుసంఖ్యాకులకు వేర్వేఱు రూపములపై మక్కువ నిలువవచ్చును. సర్వస్వరూపములు ఏకైకగమ్యస్థానమునకు సాధకులను ప్రేరేపింపజాలినను, సర్వమానసములకు అవి సరిపడకపోవచ్చును. ఈ విషయముపై దృష్టి సారింపక మనమందఱము మఱియొక దోషమును చేయుచున్నాము. నా యాశయము మీ కనుకూలింపనప్పుడు, నిర్బంధించి దానిని మీ తలకు గట్ట యత్నించుట ఎట్టిచెట్ట? నే నవలంబించు దేవాలయనిర్మాణవిధానముగాని, శ్లోకపఠనపద్ధతిగాని మీకు నచ్చకపోవచ్చును; ఆ విధానమును, ఈ పద్ధతిని మీరుకూడ అవలంబించి తీఱవలెనని నే నేల మొండిపట్టు పట్టవలెను? ప్రపంచములో ముందంజవేసిచూడుడు; ప్రతి

మూర్ఖుడు తాను చేపట్టిన రూపమే నిర్దుష్టమైనదనియు, తదితర రూపములన్నియును నారకీయములనియు, తానే సమస్త విశ్వమందును నిర్ణీతవ్యక్తియై ఉదయించియుండెననియు తెలుపుకొనును. ఈ స్వరూపములన్నియును మంచివియే యనియు, ప్రాథమిక సాధనమున సహకారులనియు మనము ఘంటాపథముగ చెప్పవచ్చును. మనుష్యప్రకృతిలో వేర్వేఱు తెఱగులుండుటవలన, వానితో సమానసంఖ్యగల రూపములు మతములో నుండితీఱవలెను. వీని సంఖ్య అధికమగుకొలది, జగతికి మేలే చేకూఱును. ప్రపంచములో ఇరువైరీతుల మతరూపము లుండుట మేలే యందును; అట్టివి నాలుగువంద లుండుట మఱింత మే లందును. వానిలోనుండి అనుకూలమైనవాని నెన్నుకొనుటకు ఘనతరావకాశము మానవులకు లభించును. మతముల సంఖ్యయును, మతభావముల సంఖ్యయును అధికమై, రానురాను మఱింత హెచ్చెనను మన మానందింపవలెను. ఏలయన ప్రతిమానవుడును వానివలన అభ్యుదయము పడయజాలును. వానివలన మానవాభ్యుదయము సుసాధ్యమగును. ప్రతిమనుష్యునకు వ్యక్తిగతమైన మతము, మఱొక మతముతో నది తలసూపుటకై బహుళమతములు ఈశ్వరేచ్ఛవలన వృద్ధియగునుగాక. భ యోగ భావ మిది.

ఈ సమీక్షలో కట్టకడపట మనము గ్రహింపవలసిన భావ మిది. నామతము మీదికాదు; మీమతము నాదికాదు. మీలక్ష్యమును, నాలక్ష్యమును ఒక్కటియేయయ్యు, ప్రతిమనుజుడు, వ్యక్తిగతమానసప్రవృత్తినిబట్టియే, వ్యక్తిగతమైనపథమునను సరించియే ముందంజవేయవలెను. ఈ పథములు వివిధములైనప్పటికి, అవి యన్నియును సత్యప్రదీప్తములై యుండవలెను. ఏలయన అవి యన్నియును సాధకు నొకేగమ్యస్థానమున జేర్చును. ఒకమార్గము యథార్థమైనదనియు, తక్కినవి అయథార్థములనియు తలపజెల్లదు. వ్యక్తి తనమనసుకువచ్చిన తెరువు నెన్నుకొనుట భ వాఙ్మయమున ఇష్టమార్గము ననుసరించుట అనబరగును.

ఇక శబ్దసమీక్ష చేయుదము. మీరందఱు శబ్దముల కెంత శక్తియున్నదో వినియుంటిరి. పదముల ప్రభావ మెంత యద్భుతమైనదో ఊహింపుడు. ప్రతి గ్రంథము — అది బైబిలు కావచ్చును, కొరాను కావచ్చును, వేదగ్రంథము కావచ్చును — శబ్దశక్తిసంభరితమైనది. మానవులపై కొన్ని శబ్దములకుగల ప్రభావము అద్భుతమైనది.

చిహ్నములను మఱొకరీతి ఆకారములు కలవు. వీనికి మనుష్యమానసముపై గల శక్తి ప్రగాఢమైనది. కాని మతప్రాంగణమందలి చిహ్నములు అనిశ్చితసృష్టి సముద్భవములని తలపజెల్లదు. అవి భావము వలచు సహజవ్యక్తీకరణములని ఎఱుగుదుము. మనము చిహ్నములద్వారా ఊహించుచుందుము. శబ్దములన్నియును వెనుకనున్న భావముల చిహ్నములే. వేర్వేఱు వ్యక్తులు, వేర్వేఱు చిహ్నములను, హేతుజ్ఞానరహితులై, ఉపయోగించుచుందురు. హేతువు అంతరంగగర్భితమైనది. ఈ చిహ్నములు లేక గుర్తులు ఊహల నంటియుండును. ప్రతిభావము వెలుపల ఒక సంకేతమును సూచించునట్లు ప్రతిమూర్తి ఒకానొక ఆంతరంగిక భావమును సూచించును. కావున భక్తియందలి ఒక భాగము వివిధచిహ్నముల విషయమును వివిధశబ్దముల విషయమును, వివిధప్రార్థనల విషయమును వివరించుచుండును.

ప్రతి మతమందును ప్రార్థనల విషయము కలదు. కాని మీరొక ముఖ్యాంశమును మనసులో నుంచుకొనవలెను. — ఆరోగ్యముకొఱకును, అర్థముకొఱకును ఆరాధించుట భక్తి కానేరదు. అది కర్మ లేక ప్రశంసనీయమైన క్రియ యగును. శారీరకలాభమునకై సలుపబడు ప్రార్థనము కర్మమాత్రమే, స్వర్గప్రాప్తి మున్నగు ప్రయోజనములకై కావింపబడు ఆరాధన మిట్టిది. ఈశ్వరుని ప్రేమింపవలెనను ఉద్దేశ మెవరికికలదో, భక్తుడు కావలెనను కాంక్ష ఎవనికికలదో అతడీరీతి స్వార్థచింతాభరిత ఆరాధనమును విడువవలెను. ఆలోకప్రదీప్త సీమలందు

ప్రవేశింపవలెనను ఉద్దేశ మెవ్వనికిగలదో ఆత డీరీతి క్రయవిక్రయ భక్తి విధానమును, ఈ "బేరసారముల" మతమును పరిత్యజించి ఆ సీమలద్వారములందు ప్రవేశింపవలెను. మీరారాధించునది మీకు లభింపదని నే దెలుపుచుండుట లేదు. మీకోరికలన్నియును ఫలించును. కాని యీరీతి భక్తివిధానము, ఈరీతి ప్రార్థనము బిచ్చకాని మతమనబరగును. "గంగాతీరమున వసించుచు నీటికై పొంతనొక చిన్నబావిని త్రవ్వువాడు నిక్కమగు మూఢుడు. వజ్రములగని యొద్దకువచ్చి, గాజుపూసలకై నెమకువాడు నిజముగ వెఱ్ఱివాడు". ఎప్పుడో ఒకప్పుడు శరీరము మృత్యువువాత బడును. కావున దాని యారోగ్యమునకై మాటిమాటికి ప్రార్థన సలుప నేల? ఆరోగ్యమందును, ఐహికార్థమందును ఏమున్నది? విశేష ధనముగలవాడు తన విత్తమందలి ఏకొంచపు భాగమునో ఉపయోగించుకొని ఆనందింపగలడు. ప్రపంచమందలి యావత్తు వస్తు నిచయమును పిడికిట బట్టలేము. పట్టలేకున్న పోయినదేమి? ఈ శరీరము పోవునదే! ఈ వస్తువులను లెక్కపెట్టువారెవరు? మంచి వస్తువులు చేబడుచో, చేబడనిండు, చేబడకపోవుచో, చేబడ నీయకుడు. వానిని పోనిండు. అవి వచ్చునపుడు స్వీకరించువారు ధన్యులు. అవిరానపుడు గ్రుక్కిళ్లు మ్రింగనివారును ధన్యులే. చక్రవర్తులలో చక్రవర్తియైన వాని సమక్షమునకు రావలెనని మనము ప్రయత్నించుచున్నాము. ఆయనమ్రోలకు మనము భిక్షుకవస్త్రములతో పోరాదు. ఒక సామాన్యరాజు మ్రోలకు పోవలెనని మన ముద్దేశించినను, భిక్షుకవేషముతో నున్న మనకు ప్రవేశము చేకూడునా? చేకూడనే చేకూడదు. మనము దూరముగ నెట్టింపబడుదుము. ఇట్లుండ మనము సార్వభౌములలో సార్వభౌముడైనవాని సమక్షమున ప్రవేశింపదలచినపుడు బిచ్చకాని చింపిరిగుడ్డలతో ప్రవేశింపజాలము. అంగడివాని కెపుడును అందు ప్రవేశము లేదు; క్రయ విక్రయముల కందు తావు లేదు. దేవాలయమునుండి క్రయవిక్రయములను సలుపువారిని ఏసు వెలుపలికి

తఱిమివేసెనను ఉదంతమును మీరు బైబిలులో చదివితిరి కదా. క్షుద్రవస్తువులకై ప్రార్థింపకుడు. శారీరక సౌఖ్యములనే మీరన్వేషించుచో, మనుష్యులకును, పశువులకును గల వ్యత్యాసమేమి కలదు? ఈ స్థితికంటె ఉదాత్తమైన స్థితిని గుఱించి మీరు యోచింపుడు.

భక్తుడు కాగోరువాడు స్వర్గముమీది కాంక్షను, భోగము మీది బుద్ధిని పరిత్యజింపవలెనను విషయము నిర్వివాదాంశమని గ్రహించితిమి. ఈ వాంఛలను పరిత్యజించుటెట్లను ప్రశ్న తల యెత్తుచున్నది. మనుష్యులు దుర్దశపాల బడుచుందు రేల? బానిసలగుటవలన క్షుద్రభావశృంఖలములవలన మానసికముగ బంధింపబడుటవలన, ప్రకృతిచేతిలో ఆటబొమ్మలగుటవలన, ఆటవస్తువులవలె ఇటు అటు విసరివేయబడుటవలన వారు దుఃఖితులగుచుందురు. దేనివలననైనను నేలగూలగల ఈ శరీరమును గుఱించి, అనవరతము “భద్రము! భద్రము!” అని హెచ్చరించుకొనుచున్నాము. అశ్రాంతము భయవిహ్వలచేతస్కులమై యున్నాము. లేడి దినమునకు సాధారణముగా అరువది డెబ్బది మైళ్లదూరమువఱకు పరుగెత్తుచుండునని నేను చదివితిని. — ఈ పరుగునకు కారణము దానిభయమే! హరిణదురవస్థకంటె మన దుర్దశ మఱింత దుర్దాంతమైనదని మనము గ్రహింపవలసియుండెను. జింకకు కొంత విశ్రాంతి లభించును; మనకది హుళిక్కి. నోట గఱచుకొనుటకై కొన్ని గఱికపోచలు లభించినయెడల లేడి సంతృప్తిపడును. మనకీ సంతృప్తి లేదు; నిరంతరము మనము మన వాంఛలను హెచ్చించుకొనుచున్నాము. ఇవి కావలెనను కాంక్ష రోగభూయిష్ఠమైనది. మన మానసికగ్రంథులు పూర్తిగ సడలిపోయినవి; అస్వాభావికస్థితి మనలో పెంపొందినది; కావున సహజమైన దేదియును మనలను సంతృప్తిపఱుపజాలదు. రోగలక్షణపూర్ణములైన పదార్థములకై మనము ప్రాకులాడుచుందుము; అసహజమైన ఉద్రేకమునకై తహతహలాడుచుందుము.

సహజముకాని ఆహారమును, పానీయమును పరిసరస్థలములును, జీవనమును మనకు కావలెనని ఉఱుకులెత్తుచుందుము. భయమును గుఱించి యోచించినపుడు మన బ్రదుకులు వెఱపుల మూటలుగాక మఱేమని ప్రశ్నించుకొనవలసి వచ్చును. లేడి కొక విధమైన వెఱపుమాత్రము కలదు. పులులు, తోడేళ్లు మున్నగు వన్యపశువులవలన గలుగు భీతి దానికి కలదు. కాని మానవుడు సమస్త విశ్వమును చూచి ఉలికిపడుచుండును.

"దీనినుండి మనకు నిష్కృతి లభించుటెట్లు?" అను ప్రశ్న తలసూపుచున్నది. ఉపయోగవాదులు (యుటిలిటేరియనులు) "భగవంతుని గుఱించిగాని, మరణానంతరస్థితిని గుఱించిగాని ప్రసంగింపకుడు; వీనిని గుఱించి మనకేమియు దెలియదు. ఈ ప్రపంచములోనే మనము సుఖముగ బ్రతుకుదుము" అనుచుందురు. ఈ సుఖజీవనము సుసాధ్యమగుచో, వారి యుపదేశమును నేను తొలుత శిరసావహింతును. కాని జగతి మనలనట్లు బ్రతుకనీయదు. మనుష్యుడు ప్రకృతికి క్రీతదాసై యున్నంతకాలము, సుఖ మాతనికి గగనకుసుమమై యుండును. సుఖేచ్ఛతో ముందంజవేయుటకై అతడు పెనగులాడుకొలది వాని మానసము వాంఛచే కప్పబడియుండును. సుఖజీవితమునకై మీ రెన్నెన్నో పరికల్పనలు సృష్టించుకొనుచున్నారు. ఎన్నేళ్లనుండి మీ రిట్లొనరించుచున్నారో యెఱుగను. కాని సంవత్సరము తరువాత సంవత్సరము దొరలినకొలది పరిస్థితులు మరింత విషమించుచున్నవి. ప్రాచీనవసుంధరలో,—రెండువందలయేళ్లకు ముందు మనుజుల వాంఛ లెన్నో లేవు; వారిజ్ఞానము ఆంకికవిధానమున అధికమగుకొలది వారివాంఛల సమూహము గుణోత్తర విధమున, ఒకదానినిమించి వేఱొకటి హెచ్చుచుండెను. 'ముక్తి' లభించినయెడల మన కోరికలన్నియును ఫలించునని మనమూహించుచుందుము. ముక్తియన స్వర్గప్రాప్తి అని తలతుము. కావున స్వర్గమునకు పోవలెనని మనము మక్కువపడుచుందుము.

ఆదాహము తీరునదికాదు; ఇదిచిరంతనదాహము. ఏదియో యొకటి కావలెనను నిరంతరకాంక్ష! ఒకడు బిచ్చకుడై యున్నపుడు, వానికి ధనముపై బుద్ధినిలుచును. ధనము చేబడినపుడు ఇతరవస్తువులపై వానిమనసు వ్రాలును. సంఘము, దానితరువాత మఱి యొకటి వానిచిత్తము నాకర్షించును. విశ్రాంతి యనునది యుండదు. ఈ దాహమును తీర్చుటెట్లు? మనము స్వర్గములో ప్రవేశించినయెడల, మనకోరికలు వృద్ధియగును. పేదకు పెన్నిధి దొరకినయెడల, వానికాంక్ష తీఱదు. వానిస్థితి నిప్పుపై వెన్న వేసినట్లుండును. ఈ పనివలన మంటలధికమై ఎగయునట్లు భుగ ల్భుగల్మనుచు వానివాంఛలును చెలరేగును. స్వర్గమున ప్రవేశించుటనిన విశేషధనము నార్జించుటని తెలుపజెల్లును. వాంఛలపుడు మరింత హెచ్చును. ప్రపంచమందలి వివిధమతగ్రంథములందు స్వర్గమునలంకరించిన పల్వురుమానవులను గుఱించిన వృత్తాంతములను చదువుచుందుము. వారనవరతము అందు సుఖులై యుండలేదు; స్వర్గప్రాప్తిమీది బుద్ధి సుఖమునకై కాదా? ఈ యిచ్ఛకు మానవుడు నీళ్లు వదలవలెను. స్వర్గకాంక్ష నైతిష్ఠ్యహీనమైనది, కడుంగడు క్షుద్రమైనది. కోటీశ్వరుడనై ఎల్లఱపై పెత్తనము చెలాయింతునను కోరికవంటిదే అది. ఈ స్వర్గముల సంఖ్య ఎంతయోకలదు; కాని వానిద్వారా మతద్వారములందును ప్రేమద్వారములందును ప్రవేశించు హక్కుమీకు లభింపజాలదు.

## ప్రధాన చిహ్నములు

''ప్రతీక'', ''ప్రతిమ'' అను రెండు సంస్కృత శబ్దములు కలవు. ''ప్రతీక'' అనగా దాపునచేరుట - సమీపించుట. సర్వదేశములందును వివిధరీతుల ఆరాధనలు కలవు. దృష్టాంతముగా ఈ దేశమునే తీసికొందము. మీలో కొందఱు యోగుల విగ్రహముల నారాధింతురు. కొన్నివిధముల రూపములను, చిహ్నములను పూజించువారు కలరు. మానవులకంటె ఉచ్చస్థితిలోనున్న

కొందఱు జీవులను ఆరాధించువారు కలరు. వీరు మృతులైనవారి ఆత్మలను ఆరాధింతురు. వీరిసంఖ్య మిగుల వేగముగా వృద్ధియగుచున్నది. ఇచట వీరిసంఖ్య ఎనుబదిలక్షలని విన్నాను. మఱింత యుచ్చదశలోనున్న ప్రాణులను ఆరాధించువారు కొందఱు కలరు. ఈ యారాధ్యజీవులు దేవతలు, పెక్కురీతుల దేవుళ్లు మున్నగువారు. ఈ వివిధరీతుల ఆరాధనమును భక్తియోగము కాదనదు. ఇవి "ప్రతీక" రీతులని వ్యవహరింపబడుచున్నవి. వీరు కావించునదీశ్వరారాధనకాదు. కాని ఈశ్వరారాధనమునకు దాపల జేర్చునది. ఈ యారాధనమున కది సన్నిహితసోపానపరంపరవంటిది. "ప్రతీక"సేవ మోక్షప్రదాయినికాదు. కొన్ని ప్రత్యేకాశయముల సిద్ధికై ఈ రీతి పూజ సలుపుచుందుము. ఈ యుదాహరణము నవలోకింపుడు: ఒకవ్యక్తి తనపితృదేవతలనుగాని, అస్తమించిన మిత్రులనుగాని ఆరాధించినయెడల, వానికి కొన్ని శక్తులు చేకుఱును; ఈ యారాధ్యదేవతలనుండి కొంత విషయవృత్తాంతము లభింపవచ్చును. ఈ దేవతలనుండి చేకుఱు ప్రత్యేకప్రయోజనము "విద్య" యనబడును—ఇది ప్రత్యేకజ్ఞానము. కాని సర్వోత్కృష్టాశయమైన మోక్షము ఈశ్వరారాధన వలన లభించును. కొందఱు ప్రాచ్యపండితులు, వేదములను వ్యాఖ్యానించు నవసరమున, దైహికస్వరూపమున నిరూపింపబడిన ఈశ్వరుని సయితము "ప్రతీక"మని ఊహింతురు. వ్యక్తిగతభగవంతుడు "ప్రతీకము" కావచ్చును; కాని "ప్రతీకసముదాయము" వ్యక్తిగతభగవంతుడు కాడు; అవ్యక్తిగతభగవంతుడును గాడు. ఈశ్వరభావనతో అవి యారాధింపబడజాలవు. ఈ వివిధ "ప్రతీకము"లను దేవతలనిగాని, పితృదేవతలనిగాని, మహాత్ములని (పవిత్రజీవులని, యోగులని) గాని, పరలోకవాసులనిగాని ఆరాధించువారు తమకు మోక్షము లభించునని తలచుట పెద్ద పొరపాటే యగును. విశేషించి వారు కొన్నిశక్తుల నలవఱుచుకొందురు; కాని ఈశ్వరుడొక్కడే మనకు ముక్తిని ప్రసాదింపగలడు. ఇట్లనిన ఆ యారా

ధనమును తెగడజెల్లదు; దానివలన కొంత ఫలము లభింపగలదు. ఆ యారాధనముకంటె మహత్తరమైనదాని నవగాహమొనరించుకొనజాలని మానవుడు కొంత శక్తిని, కొంత పరితోషానుభూతిని దానివలన పడసి, విశేషానుభూతి లభించిన యనంతరము, మోక్షార్హతను పడసిన పిదప తనంత దాను "ప్రతీకములను" పరిత్యజించును.

పైని తెలుపబడిన వివిధరీతుల "ప్రతీకారాధన"లలో మిగుల వ్యాప్తిజెందిన యారాధనము విగతజీవులైన మిత్రుల నుద్దేశించి సలుపబడు ఆరాధనమే. మనుష్యప్రకృతిలో వ్యక్తిగతమైన అనురాగము, మిత్రులయెడల జూపబడు ప్రీతి మిగుల ప్రగాఢమై యుండుటవలన, వారు అస్తమించినపుడు వారిని మరల జూడవలెనని మక్కువపడుచు వారి స్వరూపములను బట్టుకొని ప్రాకులాడుదుము. ఈ స్వరూపములు సజీవములై యున్నపుడు తఱచుగా మాఱుచుండునను విషయమును మఱతుము. అవి మృత్యువువాత బడినపుడు, మాఱుపెఱుగక నిరంతరము కడచిన భావన ననుసరించి యుండునని ఊహించి, అట్లే వానిని చూడవలెనని ఉద్దేశింతుము. అంతియకాదు. నాకొక మిత్రుడుగాని పుత్రుడుగాని యుండుచో సజీవుడై యుండగా ఆతడు పలుగాకియై యున్నను, మరణించినపిదప ఆతడు మహత్తరగుణవిభూతితో వెలసిన యోగిపుంగవుడని నేనూహింతును; ఆత డారాధ్యదేవత యగును. ఒకపసిపిల్లవాడు మరణించినపుడు వానిశరీరమును దహనముచేయక, భూస్థాపితమొనరించి అచట నొక గుడిని గట్టువారు కొందఱు భారతదేశములో గలరు. ఆ గుడిలో ఆ పసివాడు దేవుడై వెలయును. పెక్కుదేశములలో ఈ రీతి మతాచారము ప్రచలితమైయున్నది. సమస్తమతములకు ఈ రీతి యాచారము మూలాధారమని తెలుపు తాత్త్వికులకు కొదువలేదు. తమ యూహ నిక్కమైనదని వారు రూఢిచేయలేరు. ఈ రీతి "ప్రతీకో

పాసన''వలన మనకు మోక్షము లభింపదని మనము జ్ఞాపక ముంచుకొనవలెను.

ఈ రీతి యారాధనమువలన గొప్ప ముప్పుకూడ దాపురింప వచ్చును. ఈ ''ప్రతీకములు'' ఈశ్వరారాధనమునకు క్రమసోపానములై యుండునంతవఱకు నిర్దుష్టములే. కాని యీ క్రమాభ్యుదయమును గాంచువారు నూటికొక్కరుమాత్రముందురు. తొంబది తొమ్మిది వ్యక్తులు ఆజన్మము ''ప్రతీకములనే'' అంటియుందురు. ఒక ఛర్చిలో పుట్టుట మిక్కిలి మేలే. కాని అందే గిట్టుట మిక్కిలి కీడు. స్పష్టవివరణమున విషయ మిట్లు బోధపడును. ఒక మత సమాజశాఖలోపుట్టి దానిశిక్షణమును పొందుట మిగుల మంచిది. ఆ శిక్షణమువలన మనలోని గురుగుణములు వ్యక్తములగును. కాని పెక్కు దృష్టాంతములను పరిశీలించినపుడు మనకు గోచరించు దృశ్య మిది: చిన్నదైన ఆ మతసమాజశాఖలోనే జనులు కట్టుబడి యుండి, అందే మరణింతురు. అందుండి వారు వెలుపలికిరారు; వృద్ధిజెందరు. ''ప్రతీకోపాసన''లలో తలయెత్తు పెద్ద యపాయ మిదియే. ఈ క్రమసోపానములను సాధకుడు తప్పక అనుసరించి సాగిపోవలెనని అనువారు కలరు. కాని వానిని దాటిపోవువారు సాధారణముగా అగపడరు. ఒకడు కాటికి కాళ్లుచాచుకొనినను, వాని నంటిపెట్టుకునే యుండును. యువకు డొకడు ఛర్చికి పోని యెడల, వాని నుద్దేశించి మనము చీవాట్లుపెట్టవలెను. ఒకవృద్ధుడు పోయినయెడల, అతనికికూడ చీవాట్లు తగులవలసినదే. ఈ పిల్లల ఆటలో అతనికి జోక్యముండరాదు. మఱొక ఘనతరస్థితికి ఛర్చి ప్రాథమికవ్యవస్థయైమాత్ర ముండవలెను. స్వరూపములతో, ''ప్రతీకము''లతో, ప్రారంభికవ్యవస్థలతో వానికిక ప్రసక్తి ఎందుల కుండవలెను?

''ప్రతీకోపాసన''లో గ్రంథారాధనము బలవత్తరమైనది; మిగుల బలవత్తరమైనది. ప్రతిదేశములోను గ్రంథమే దేవుడగు

చుండుట మీరు కనుగొనెదరు. భగవంతుడు మానవుడై అవతరించునని విశ్వసించు మతశాఖలు మా దేశమున గలవు. కాని అవతారపురుషుడుకూడ వేదముల ననుసరింపవలసినదే. వాని యుపదేశములు వేదాధికారముపై ఆధారపడనియెడల, ప్రజలు వానిని స్వీకరింపరు. హిందువులు బుద్ధు నారాధింతురు. కాని ప్రజల నుద్దేశించి, "మీరు బుద్ధు నారాధింతురుకదా. అతని యుపదేశముల నేల స్వీకరింపరు?" అని మీరు ప్రశ్నింతురేని, "బౌద్ధులు వేదమును స్వీకరింపరు; కావున వారి యుపదేశములను మేము పెడచెవినిబెట్టెదము" అని వారు ప్రత్యుత్తరమొసగెదరు. పుస్తకారాధనమందలి అర్థ మిది. ఒకగ్రంథముపేరిట ఒకవ్యక్తి ఎన్నెని అసత్యములను చెప్పవచ్చును. భారతదేశములో నేనేదేని నూతనాంశము నుపదేశింపబూని, నా యుపదేశమునకు నేనే ప్రమాణమునని, నా బుద్ధికుశలతయే ప్రమాణమని నేను తెలిపిన యెడల, నా యుపదేశమును చెవిబెట్టుట కెవ్వరును ముందుకురారు; కాని వేదములనుండి కొంతవిషయమును నేను పేర్కొని నా వ్యాఖ్యానపు గారడిని ప్రదర్శించి, అసంభవార్థమును నిరూపించి అందలి హేతుసంబద్ధమైన విషయమును యావత్తు హత్యాకాండకు గురిచేసి, వేదవ్యాఖ్యానమని నేను కానికూతల నుచ్చరించినను, మూర్ఖులు మూకమూకలై నా వెంటబడుదురు. కొందఱు వ్యక్తులు సాధారణ క్రైస్తవుల నులికిపడజేసి అయోమయస్థితిలో అర్థమెఱుగని అవస్థలో బడవేసి వారిని ఉక్కిరిబిక్కిరి జేయు ఒకవిధమైన క్రైస్తవమతమును బోధింతురు; కాని వారు "ఇది ఏసుక్రీస్తు భావము" అని వచింతురు. పలువురు వారిచుట్టు గుమిగూడెదరు. వేదములలోగాని, బైబిలులోగాని లేని నూతనాంశము ప్రజల కక్కఱలేదు. విషయము స్నాయువికశక్తికి సంబంధించినది. ఒక అపూర్వవిషయము—ఆకర్షణీయాంశము మీ చెవులందు పడినపుడు మీ రులికిపడుదురు; లేక ఒక క్రొత్త వస్తువును పరిశీలించినపు డులికిపడుదురు. ఇది శారీరక మానసిక

విన్యాసమునకు సంబంధించిన విషయము. ఊహలను గుఱించి ఈ యనుభూతి విశేషమై యుండును. మనస్సు ఒకగాడిలో పడి పోవుచుండును. ఒకభావమును ఆకళించి కందించవలెననిన మానసమునకు విశేషశ్రమ కలుగును. క్రొత్త తలపు ఆ గాడికి సమీపమున నిలువవలెను; అది మెల్లమెల్లగా స్వీకరింపబడును. అది మంచికర్మ పంథయే; కాని సునీతికాదు. మతసంస్కర్తలును, ఉదారమతప్రబోధకులనబరగువారును నేడు సంఘములో పరస్పర విరుద్ధములైన ఊహల నెట్లు వెదజల్లుచున్నారో ఊహింపుడు. క్రైస్తవులైన భౌతికశాస్త్రవేత్తల ప్రబోధముల ప్రకారము ఏసొక గొప్పచికిత్సకుడు; ఆధ్యాత్మికవాదుల యూహలప్రకారము ఆతడు మానసికతత్త్వవేత్త; దివ్యజ్ఞానసమాజసభ్యుల యుద్దేశముల ప్రకార మాత డొక మహాత్ముడు. ఈ సిద్ధాంతములన్నియు నొకేమతగ్రంథమునుండి గ్రహింపబడినవి. ఒకానొక వేదగ్రంథమునం దిట్లు వివరింపబడెను: "'సత్' మాత్ర ముండెను. ఓ! ప్రియముగూర్చువాడా! అదిని మఱేదియులేదు" ఈ గ్రంథమందలి 'సత్' శబ్దమునకు బహురీతుల వ్యాఖ్యానములు కావింపబడెను. ఈ శబ్దముయొక్క అర్థము 'అణువు' అనియు, ఈ యణువునుండి ప్రపంచము సృష్టింపబడినదనియు అణువాదులు వచింతురు. ఈ శబ్దముయొక్క అర్థము 'ప్రకృతి' యనియు, ప్రకృతినుండియు సమస్తము ఉద్భవించినదనియు ప్రకృతివాదులు పలుకుదురు. ఈ శబ్దార్థము కేవలము 'శూన్య' మనియు, 'శుద్ధపూజ్య' మనియు, శూన్యమునుండియే సమస్తసృష్టి తలసూపినదనియు శూన్యవాదులు వాకొందురు. ఆ శబ్దార్థము 'దేవు'డని ఆస్తికవాదులును, 'పూర్ణసత్త' లేక 'పరబ్రహ్మ' యని అద్వైతవాదులును పలుకుదురు. వీరందఱును ఒకేగ్రంథమును తమప్రమాణముగా పరిగణింతురు.

గ్రంథారాధనమందలి లోపము లివి. కాని యీ యారాధనమువలన గొప్ప ప్రయోజనముకూడ గలదు. అది శక్తిని ప్రసా

దించును. గ్రంథాధారమునగల మతశాఖలు తక్క తక్కిన మత శాఖలన్నియును అదృశ్యములై పోయినవి. గ్రంథములను పరిమార్చునదేమియును లేదు. మీలో కొందఱు పారశీకులను గుఱించి వినియుందురు. వారు ప్రాచీన పరిష్యనులే. ఒకప్పుడు వారు సుమారు పదికోట్లమంది యుండిరి. వారిలో అనేకులు ఆరబ్బులవలన పరాజితులై, మహమ్మదీయమతములో గలుపబడిరి. తమ్ము బాధపెట్టువారి పట్టునుండి కొలదిమంది తమగ్రంథముతో ఎట్లో తప్పించుకొనిపోయిరి. ఇదే నేడు వారి కాధారమై వారిని నిలుపుచుండెను. స్థూలదృష్టికి గోచరించి, స్పర్శవలన స్పష్టమగు దైవము గ్రంథము. యూదుల విషయమును యోచింపుడు. వారికొక గ్రంథముండకపోయినయెడల, వారు ప్రపంచములో నెందో నదృశ్యులై యుండెడివారు. అది వారిని నిలిపినది. ఘోరమైన అత్యాచారము వారి నెంత వేదించినను, వారి 'టాల్మడ్' వారిని పరిరక్షించినది. గ్రంథమునవలన చేకుఱు మేళ్లలో మిగుల ముఖ్యమైనదిది; దానివలన ప్రతివిషయము సుస్పష్టనిర్వచనము నందును. సమస్త 'ప్రతీకము'లలో నది యనుకూలముగా చేతి కందునది. ఒక పూజావేదికపై గ్రంథము నుంపుడు; ఎల్లఱకు అది గోచరించును. ప్రతివ్యక్తి మంచిగ్రంథమును పఠించును. పక్షపాతభావముతో ప్రసంగించుచున్నానని మీరు యోచింతు రేమో! పుస్తకములవలన మేలుకంటె కీడే పొడసూపినదని నా యూహ. హానికరములైన ప్రబోధము లెన్నో వానియం దుద్భవించినవి. విశాలదృష్టి నంతగా నెఱుగని మతవిశ్వాసము లన్నియును పొత్తములందు బుట్టినవే. జగతిలో చెలరేగిన అత్యాచారమును, అంధమతానురాగమును పుస్తకములలో పుట్టిన పుట్టిములకలే. ఆధునికకాలములో పుస్తకములు పుడమిలో ఎంద రెందఱు అనృతవాదులనో సృజించుచున్నవి. ప్రతిదేశమందును గోచరించు ఈ యనృతవాదుల సంఖ్యను చూచినపుడు నే నాశ్చర్యాన్వితుడనగుచుందును.

విగ్రహారాధన విషయమును తరువాత పరికింతము గాక! ఏదో యొకరూపమున సమస్త ప్రపంచమందును విగ్రహములగ పడుచున్నవి. కొందఱు మనుష్యస్వరూపములో విగ్రహమును నిర్మింతురు. ఇది సర్వోత్కృష్టమైన స్వరూపము. నేను విగ్రహారాధన చేయవలసివచ్చునెడల, పశురూపమునగాని, లేక ఏదేని భవనరూపమునగాని మఱే యితరరూపమునగాని కాక ఆ విగ్రహము మనుష్యరూపమున నుండునట్లు చూతును. ఒక్కొక్క మతశాఖ ఒక్కొక్కరీతి విగ్రహమే నిరుష్టమైనదని ఊహించును. మఱొక మతశాఖ అది దోషభూయిష్టమైనదని వాకొనును. భగవంతుడు పకిస్వరూపమున గోచరించుట మేలేయని క్రైస్తవు డూహించును. హిందువులు మత్స్యావతారమును విశ్వసించునట్లు వారు విశ్వసింపరు. చేపరూపమున దేవుడు గోచరించుట పెద్ద దోషమని, మూఢవిశ్వాససూచకమని వారందురు. మూర్తియొకటి మంజూషరూపములో నిర్మింపబడినట్లును, దానిపై నిరువురు దేవత లుపవసించినట్లును, లేక దానిపై ఒక గ్రంథముంచబడినట్లును దృగ్గోచరమగునెడల అది నిరుష్టనిర్మాణమని యూదులు వచింతురు. కాని అది ఒక పురుషరూపములోగాని స్త్రీరూపములో గాని నిర్మింపబడుచో వారులికిపడుదురు. మహమ్మదీయులు ప్రార్థన సలుపువేళ, 'కాబా' యనబరగు నల్లని శిలగల దేవాలయ స్వరూపమును మానసికముగ భావనమొనరించి, పశ్చిమదిశగా తిరిగినయెడల తప్పులేదని ఎంచెదరు. కాని ఛర్చిరూపములో విగ్రహభావన జరిగినయెడల, అది కూడని విగ్రహారాధనయని వారు కంఠమెత్తివచింతురు. విగ్రహారాధనమందలి లోపమిది. కాని సాధకునిదృష్టిలో నివియన్నియు అవసరమైన సోపానములవలె అగపడుచుండును.

ఈ విషయములో మన విశ్వాసమేమో గమనించుట ముఖ్యము. మన యనుభూతి యేమని మనము ప్రశ్నించుకొన

వలెను. ఏసుగాని, బుద్ధుడుగాని, మోసెస్‌గాని ఏమిచేసెనో యను విషయమును (అవిధముగ మనముకూడ చేసినగాని) పాటింప నక్కఱలేదు. మన మొకగదిలో తలుపులు మూసి కూర్చుని మోసెస్ ఏమిభుజించెనో యని యోచించుచున్నయెడల, మన యాకలి తీరదు; మోసెస్ ఏమి చింతించెనో అను విషయము మనలను రక్షింపజాలదు. ఈవిషయములను గుఱించిన నా యూహలు స్పష్టమైనవి; సమగ్రమైనవి. ప్రాచీనాచార్యుల యూహలతో నాయూహలు సరిపడుచో నాతలపులు నిర్దుష్టములని ఒక్కొకపుడు నేను అనుకొనుచుందును; వారియూహలు నాయూహలతో సరిపడుచో వారి భావములు నిర్దుష్టములైనవని వేఱొక ప్పుడు నేను అభిప్రాయబడుచుందును. స్వాతంత్ర్యయోచనలో నాకు విశ్వాసముకలదు. పవిత్రజీవులైన మతాచార్యుల నంటియుండక, స్వతంత్రుడనై యుండఁగోరుదును; వారి యెడల జూపదగు భక్తి విశ్వాసములను నే జూపుదును. కాని మతమును స్వాతంత్ర్యపరి శోధనాదృష్టితో వీక్షింతును. వారు ఆలోకమునెట్లు తమతమ తపసువలన విలోకించిరో నేను నాయాలోకమును స్వీయ కృషివలన వీక్షింప నుద్దేశించెదను. వారి యాలోక విలోకనము మనల నించుకంతైన సంతృప్తిపఱుపజాలదు. బైబిలు ననుసరిం చుటకాదు; మీరే బైబిలు కావలెను. పథమందలి ప్రదీపమని, తెరువును నిర్దేశించు స్తంభమని, ఒక చిహ్నమని బైబిలును మీ రాదరింపుడు; గౌరవింపుడు – దానిమూల్యమంతియునంతియే. కాని యీస్వరూపములును, ఇతరవస్తువులును చాల అనవసరములై నవి. మానసిక సాధనచేసి మీరేకాగ్రదృష్టి నలవఱుచుకొనుడు, భావపరికల్పన జేయుడు. మీయంతరంగములో సహజముగ మీరు మూర్తిభావన జేయుచుండుట గమనింతురు. ఇది తప్పనిసరిగ జరుగు చునే యుండును.

రెండుతీరుల వ్యక్తుల కెన్నడును ఏ విగ్రహము అవసరమై యుండదు. ఒకరకపు వ్యక్తి ఎన్నడును ఈశ్వరచింత జేయని

నరపశువు. రెండవరీతివ్యక్తి ఈ సోపానముల నతిక్రమించి ఈ ప్రాకారములనన్నిటిని దాటి పరిపూర్ణత్వసిద్ధినందిన మహాత్ముడు, ఈ రెండు కొనలనడుమ మన మందఱము ఒక ఆశయమును, బహిరంతరములందు వెలయుదానిని అవలంబింపవలెను. అది అస్తమించిన ఒకవ్యక్తి రూపములో నుండవచ్చును; లేక సజీవుడైన పురుషరూపములోగాని, జీవించియున్న స్త్రీరూపములోగానియుండవచ్చును. ఇది వ్యక్తి ననుసరించుటే యగును; శరీరముల నాశ్రయించుటేయగును. ఇది సహజప్రక్రియయే. స్థూలరూపభావన చేయుట మనకు స్వభావసిద్ధమైన కర్జమే కదా. ఈ క్రియచేయక, మన మిచట నెట్లుండగలిగితిమి? మనము స్థూలరూపావృతులమైన ఆత్మలము; కావున మనమీ ప్రపంచమున విరాజిల్లుచున్నాము. స్థూలరూపభావన మనల నిచటికి గొనివచ్చినది; అది మనలను అవ్వలికి గొనిపోవును. విషయవస్తువుల ననుసరించుటచే మనము మానవులమైతిమి. కావున మనము వ్యక్తులనారాధింపక తప్పదు. వేఱు యూహలను మన మెట్లు వ్యక్తీకరించినను, ఈ యారాధన మనకు తప్పనిసరియైనదే యగుచున్నది. "వ్యక్తిగతభావనకు మనసున చోటీయవలదు" అని అవలీలగా ఒకడు పలుకవచ్చును. సాధారణముగా ఇట్లు పలుకువాడే విశేషముగా అట్లొనరించుచుండును. ప్రత్యేకపురుషులయెడలను, స్త్రీలయెడలను వాని ఆసక్తి, వాని అనురాగము మిగుల ప్రబలమైయుండును; వారు మరణించినను ఈ యాసక్తి వానిని విడువదు; మరణానంతరమున వారి నాలేకు అనుగమింపనుద్దేశించును. ఇది మూర్తియారాధనము; ఇది మూర్తిపూజకు బీజము; మూర్తిపూజకు మూలకారణము. కారణము విద్యమానమైయుండుటవలన, అది ఏదో యొకరూపమున వ్యక్తమగును. సామాన్యమానవుని యెడలగాని, సాధారణస్త్రీయెడలగాని గాక ఏసువిగ్రహము ఎడలగాని, బుద్ధమూర్తియెడలగాని వ్యక్తిగతమైన ఆసక్తియుండుట మేలుకాదా, విగ్రహములముందు సాగిలపడుట తప్పని పాశ్చాత్యదేశములలో

ప్రజ లనుచుందురు. కాని వారొక మగువప్రోల మోకరించు కొని "నీవు నాజీవనసర్వస్వమవు, నాకన్నులందలి కాంతివి; నాయాత్మవు" అని పలుకుచుందురు. ఇది మఱింత హేయమైన మూర్తిపూజకాదా? 'నాయాత్మ' యని 'నాబ్రదుకు' కని చేయు ప్రసంగ మెట్టిది? ఇది ఎంతకాలమో సలుపబడు ప్రసంగముకాదు. ఇది కేవలము విషయలాలసయే. ఇది బహుళ కుసుమావృతమైన స్వార్థానురాగమే! కవులు దీనికి చక్కని పేరిడుదురు. దీనిపై లవండరు సలిలమును పోయుదురు. బహువిధమనోహరవస్తువులను వేతురు. ఈపనికి పూనుకొనుటకంటె బుద్ధుని విగ్రహముప్రోల గాని, జితేంద్రియుడైన మహావీరుని మూర్తి ప్రోలగాని సాగిల పడి "నీవు నాజీవనసర్వస్వమవు" అని పలుకుట మేలుకాదా? అట్లుగాక నే నిట్లు చేతును.

ప్రతీచీదేశములందు పాటింపబడని మఱొకరీతి 'ప్రతీకోపాసన'గలదు. ఈ విధానము మా గ్రంథములందు బోధింప బడినది. ఈశ్వరునివలె మనస్సు నారాధించుట ఈ విధానము, ఈశ్వరభావనతో దేనినారాధించినను, అది చరమోపాసనకు మార్గదర్శకమేయగును. అది దానిని సమీపించును. మిగులచిన్నది యైన అరుంధతీనక్షత్ర విలోకన మీ యారాధన విధానములలో నొకటి. ఈనక్షత్రము సప్తఋషిమండలమున కనతిదూరమున గలదు. వృషరాశిపై దృష్టిగోచరమగు తారకలబృందములోనిది. ఒకనికి దాని సమీపమందలి పెద్ద నక్షత్రము తొలుత చూప బడును. దానిపై నాతడు తనదృష్టి నిబద్ధమొనరించినపిదప, దాని నాత డెఱిగిన అనంతరము, దానికనతిదూరమందలి చుక్కపై వాని చూడ్కి కేంద్రీకరింపబడును. తరువాత అతని చూపు అరుంధతీ తార మీదికి జరుపబడును. బుద్ధునియారాధనము, ఏసు యారాధనము "ప్రతీకోపాసనయే" ఇది ఈశ్వరారాధనకు సమీపమైనది. కాని బుద్ధుని యారాధనముగాని, ఏసు యారాధనముగాని మానవునకు రక్షణమీయదు. ఈ యారాధనము నతిక్రమించి ఏసు

క్రీస్తుగా వ్యక్తమైన ఈశ్వరు నారాధింపవలెను. ఏలయన భగవంతు డొక్కడే మనకు మోక్షమును ప్రసాదింపజాలను. బుద్ధుడు దేవుడని, ఏసు దేవుడని గ్రహింపవలెనను కొందఱు తాత్త్వికులు కలరు. వారు "ప్రతీకములు" కాక, ఒక్కొక్కరు డీశ్వరుడనియే వారితలపు. వేర్వేఱు "ప్రతీకములను" మనము స్వీకరింపవచ్చును. ఈశ్వరారాధనకు మనలను సమీపింపజేయు ఈ క్రమగత విధానములను మన మవలంబింపవచ్చును. ఈ యారాధనమువలన మనకు ఎగ్గేమియు కలుగకుండవలెను. బుద్ధుని, ఏసుని ఆరాధించుపట్ల మన మీశ్వరునే యారాధించుచున్నట్లు అపోహపడితిమేని, మనము పొరపడినవారమయ్యెదము. ఒకడు ఏసుక్రీస్తును పూజించుచు ఈ పూజవలన తనకు నిష్కృతి లభించునని తలచునెడల, అతడు పూర్తిగ పొరపడినవాడే యగును. ఒక విగ్రహమునుగాని, మృతులైనవారియాత్మలనుగాని ఆరాధించిన యెడల మోక్షము లభించునని ఎవడైన ఊహించుచో, అతడు పొరపడును. ఏవస్తువునందైన ఈశ్వరునవలోకించి, విగ్రహమును మఱచి, భగవంతునే మనము విలోకించుచో, మనయారాధనము సమ్మతింపదగినదే యగును. ఈశ్వరుని విగ్రహభావపరికల్పన జేయరాదు. కాన మనమేవిగ్రహమందైన దివ్యజీవనమును నింపవచ్చును. మూర్తిని విస్మరించినజాలును; మీకర్తవ్యము నిర్దుష్టమగును.—ఏలయన "ఈశ్వరుని"నుండి సమస్తము ఆవిర్భవించును. అతడు సమస్తము. ఒక బొమ్మను దేవుడని మనము పూజింపవచ్చును; కాని దేవుడు బొమ్మయని పూజింపరాదు. ప్రతిమలో భగవంతుడున్నాడని తలచుట తప్పుకాదు; కాని ప్రతిమ భగవంతుడనుకొనరాదు. మూర్తిలో ఈశ్వరుడున్నాడనుకొనవచ్చును. ఈ యూహలో అపాయమేమియు లేదు. ఇది నిక్కంపు ఈశ్వరారాధనము. విగ్రహరూపము కేవలము "ప్రతీకము" మాత్రమే.

భక్తిలో మనము తరువాత గమనింపవలసిన ముఖ్యవిషయము "శబ్దము". నామశక్తి – నామమందలి శక్తి. సమస్తవిశ్వము

నామరూపబంధురమైనది. మన మేమిచూచినను, అది నామరూపముల కలయికయే. మానసికస్వరూపపు నామము. నామరూపములు కానిదేదియు లేదు. నామరూపరహితు డీశ్వరుడని మన మందఱము విశ్వసింతుము. కాని అతనిని గుఱించి మనము చింతింప నారంభించినపుడు అతడు నామరూపసహితుడగును. చిత్తము ప్రశాంతకాసారము బోలునది. తలపులు దానిమీది తరంగములు. ఈ యలలు నామరూపములతో తలయెత్తును; నామరూపములతో కాక ఏ యల తలయెత్తలేదు. రూపము లేనిది అనూహ్యము, అది యోచన కతీతము. యోచనకు రూపమేడుగడ. యోచనకు విషయవస్తువు లేనపుడు, నామరూపముల యావశ్యకత ఏర్పడును. వీనిని మనము ప్రత్యేకింపలేము. భగవంతుడు విశ్వమును శబ్దమునుండి సృజించెనని బహుళగ్రంథములందు తెలుపబడెను. సంస్కృతమున ఉల్లేఖింపబడిన శబ్దబ్రహ్మము క్రైస్తవమతవాఙ్మయమందలి శబ్దసిద్ధాంతమే. ఇది ప్రాచీనకాలపు భారతీయసిద్ధాంతమే. భారతబోధకులు దానిని అలెగ్జాండ్రియాకు గొనిపోయి అందు స్థాపించిరి. శబ్దావతారభావము ఈ రీతిగా నందు నెలకొనెను.

భగవంతుడు సమస్తమును శబ్దమునుండి సృష్టించెనను భావము గభీరార్థబంధురమైనది. ఈశ్వరుడు అనిరాకారుడగుటు, రూపసృష్టిని వర్ణించుటలో ఇది యుత్తమమైన విధానము. విశ్వావిర్భావము సంస్కృతమందలి సృష్టిశబ్దమున నిరూపింపబడినది. ''శూన్యమునుండి భగవంతుడు వస్తువులను సృష్టించెను'' అను వాక్కులోని అర్థమేమి? విశ్వము భగవంతునుండి సృజింపబడినది. అతడు విశ్వమగును, విశ్వము అతనిలో లీనమగును; ఆతనినుండి అది మరల వ్యక్తమగును; మరల ఆతనిలో లీనమగును. అనంతకాలమందు ఈ చర్య జరుగును. మనసులో నేది సృష్టికావలెననినను నామరూపములు లేకుండ జరుగదని మన

మీవరలో గ్రహించితిమి. ఏ యాలోచనలేక మనస్సు నిశ్చలమై యున్నదని యోచింపుడు. అయినను, అందు తలపు తలయెత్తి నపుడు తోఁచునే అది నామరూపముల నందును. ప్రతియూహ కొక రూపముండును; ఒక పేరుండును. ఈ విధముగానే, సృష్టి నామరూపములతో కూడియున్నది. మనుజుని మనసులో పుట్టు ప్రతిభావమునకు ఒకపేరు లేక శబ్దముండవలెను. దీనినిబట్టి మీ యూహ స్థూలరూపముదాల్చి, బాహ్యావ్యక్తీకరణమునందినట్లు, మీ శరీరములు మీ భావములనుండి వ్యక్తమైనట్లు, ఈ విశ్వము నీ మనస్సునుండి వ్యక్తమైనదని తలచుట సహజమే కదా. సమస్త విశ్వము ఈ రీతి పరికల్పన ననుసరించి నిర్మింపబడినదనినపుడు, ఒక అణువెట్లు నిర్మింపబడినదో విదితమైనయెడల, సమస్త విశ్వము ఎట్లు నిర్మింపబడినదో మీరు గ్రహింపగలరు. మనుష్యుని దృష్టాంతమును తీసికొనినపుడు శరీరము వెలుపల గోచరించు స్థూలరూపమై మనస్సులోని సూక్ష్మరూపమగుతజ్జి రెండింటికిని అవినాభావముండుటవలన దేహము శిథిలమైపోయిన వేళ, మనస్సుకూడ లేనిదే యని స్పష్టమగుచున్నది. ఒకవ్యక్తి మెదడులో అలజడి పుట్టునో, అతని యూహలో సయితము అలజడి పుట్టితీఱును. కారణమేమన: అవి రెండును ఒక్కటే! ఒకేవస్తువుయొక్క స్థూలసూక్ష్మరూపములే! విషయవస్తువు, మనస్సు అను రెండు విషయములు కలవు కదా. సమున్నత వాయుపథములో గభీరాగభీరసమీరస్తరములుండునట్లు పంచభూతములందలి ఒక్క వాయువులో అదృశ్యము స్పష్టమగునట్లు శరీరము గూడ ఒక్కటియై స్థూలసూక్ష్మ స్తరబంధురమై వెలయును. దేహము వ్రేళ్లమీది గోళ్లసముదాయమువంటిది. గోళ్లను దీసివేసినప్పటికి అవి యేరీతిగా మరల పెరుగుచుండునో అదేరీతిగా మన సూక్ష్మ భావములనుండి శరీరము తరువాత శరీరము పెరుగును. ఒకవస్తువు సూక్ష్మమగుకొలది అది స్థిరమై యుండును; ఈ విషయము ననవరతము మనము విలోకించుచున్నాము. స్థూలమగుకొలది

దాని స్థిరత్వము కుంటుపడుచుండును. ఏకైకభావశక్తి వ్యక్తీకరణములో రూపము స్థూలమైన వ్యక్తీకరణమనియు, నామము సూక్ష్మమైన వ్యక్తీకరణమనియు మనము గ్రహింతుముగాక. కాని యీ మూడును ఒక్కటియే. ఇందు ఏకత్వము కలదు, త్రిత్వము కలదు. ఏకైకవస్తువుయొక్క మూడురీతుల వ్యక్తీకరణ క్రమము. ఒకటి సూక్ష్మమైనది, రెండవది కొంత స్థూలమైనది. మూడవది మఱింత స్థూలమైనది. ఒకదానితో తక్కిన రెండును కలిసియే యుండును. భావ మెందు గలదో, నామ మందు గలదు; రూపమును గలదు.

దేహము ఏ పరికల్పన ననుసరించి, ఏ పద్ధతిని బట్టి నిర్మింపబడినదో అదేపరికల్పన ననుసరించి, అదేపద్ధతిని బట్టి విశ్వము నిర్మింపబడుచో, దాని నిర్మాణమందు సయితము నామరూప భావములు కలవని సహజముగ గ్రహింపజాలుదుము. విశ్వమందలి సూక్ష్మతమభాగము "భావము". అది యందలి యుద్దేశశక్తి. మనశరీరమందలి భావశక్తిని ఆత్మ యందుము. విశ్వమందలి భావశక్తి నీశ్వరుడందుము. తరువాత గణనీయమైనది నామము; తదనంతరము పేర్కొనబడునది రూపము. దీనిని మనము చూతము; స్పర్శవలన నెఱుగుదుము. దృష్టాంతమునకు మీలో నొకరిని పేర్కొందుము. ఈ విశ్వములో నితడు ఒక చిన్న విశ్వము; ఒక ప్రత్యేకరూపముగల శరీరము. దానికొక పేరు కలదు; జాన్ అనుడు లేక జేన్ అనుడు. ఆ పేరు వెనుక భావము కలదు. ఇదేవిధముగ విశ్వమున్నది. దీని కొకపేరుకలదు. ఇది అన్ని మతములందు "శబ్ద" మనబరగును. దీనివెనుక ఈశ్వరుడు కలడు. విశ్వజనీనభావము మహాత్ అని సాంఖ్యులవలన పేర్కొనబడునది.—అది విశ్వజనీన జ్ఞానము, ఆపేరేమి? ఏదియో ఒక పేరుండవలెను గదా. ఈ ప్రపంచము ఏకరూపమున లేక సమ రూపమున విరాజిల్లునది. సమస్తవిశ్వమం దేపదార్థమున్నదో ప్రత్యణువునందు అదేపదార్థముగలదని ఆధునిక భౌతికశాస్త్రము

నిస్సందేహముగా ఋజువుచేయుచున్నది. ఒక మట్టిముద్ద ఎట్టిదో మీ రెఱిగితిరేని సమస్త విశ్వ మెట్టిదో మీరు గ్రహింపగలరు. విశ్వమందలి ప్రాణులలో మనుజుని ప్రతిరూపజీవిగా మనము భావింపవచ్చును. అతఁడొక చిన్నవిశ్వము — పిండాండము. మనుష్యునకు రూపమున్నది, రూపమునకు నామమున్నది ; వాని వెనుక భావము కలదు—చింతాసమన్వితసత్త యున్నది. విశ్వము కూడ ఈ విధానము ననుసరించియే నిర్మింపబడినది. ప్రశ్న యిది. దానిపేరేమి ? హిందువుల విశ్వాసముననుసరించి అది ఓమ్ ; ప్రాచీనకాలపు ఈజిప్టుదేశవాసులు కూడ అట్లే విశ్వసించిరి. కఠోపనిషత్తులో ఇట్లు నిర్వచింపబడినది; దేని నన్వేషించి మానవుఁడు బ్రహ్మచర్యమును అభ్యసించునో అదేమో సంక్షేపముగా వివరింతును. అది ఓమ్ — అది బ్రహ్మ—పరివర్త మెఱుఁగనిది ఒక్కటి ; సర్వోత్కృష్టమైనది పరివర్తన మెఱుఁగని ఆ యొక్కదాని నెవ్వ డెఱుఁగునో, ఆతడు తాను కాంక్షించిన దానిని పడయగలఁడు.

ఓమ్ సమస్తవిశ్వమును లేక భగవంతుని సూచించు నామము. బాహ్యప్రపంచమునకును, ఈశ్వరునకునునడుమనిలిచి, అది రెండింటిని సూచించును. వివిధేంద్రియముల ననుసరించి, స్పర్శయని, రంగుయని, రుచియని, యిట్లే వివిధరీతుల విడివిడిగా విశ్వము నూహింపగలము. వేర్వేఱు దృక్పథములననుసరించి, ఈ విశ్వమును సహస్రసంఖ్యలుగల విశ్వములుగా గ్రహింపగలము. ప్రత్యేకవిశ్వము సమగ్రమై, ప్రత్యేకమైన నామముతో, రూపముతో, భావముతో వెలయును. ఈ భావములు "ప్రతీకములు". ఒక్కొక్కదాని కొక్కొక్కపేరు కలదు. ఈ పేర్లు పవిత్రచిహ్నములను సూచించును. అవి భక్తియోగమున వ్యవహరింపబడుచుండును. ఇంచుమించుగా వాని కనంతశక్తికలదు. ఈ శబ్దములను పురశ్చరణ మొనరించినంతనే, మనము దేనిని కాంక్షించిన దానిని పడయగలము. మనము పరిపూర్ణత్వమును

పడయజాలుదుము. కాని, యీ సందర్భమున రెండు విషయము లను మనము గమనింపవలెను. "గురువు మహిమోపేతుడై యుండ వలెను; అంతేవాసికూడ అట్టివాడై యుండవలెను". అని కఠోప నిషత్తు తెలుపుచున్నది. ఈ ప్రభావము, ఈ నామము ఒకని నుండి వేఱొకనికి పరస్పరానుసారముగ రావలెను. పరమగురువు నుండి గురువుకు, గురువునుండి శిష్యునకు, శిష్యునుండి ప్రశిష్యు నకు ఆధ్యాత్మికభావస్రవంతి ప్రగాఢశక్తిసమన్వితమై ప్రాచీన కాలమునుండి చేకుఱుచుండెను. ఈశక్తిని ప్రసాదించువాడు గురువు; పడయువాడు శిష్యుడు. క్రమవిధానమున శక్తిసమన్వితమైనశబ్దము గురుశిష్యపరంపరలో ప్రచలితమై పురశ్చరణ మొనరింపబడినపుడు భక్తియోగమున విశేషోన్నతినందును. ఆ శబ్దపురశ్చరణమాత్ర మున భక్తిలోని సర్వోత్కృష్టస్థితి నయితము లభించును.

"ఈశ్వరా! నీకు బహుళనామములు కలవు. వాని యర్థ మేమో నీకవగతమే! ఈ నామములన్నియు నీవే! ప్రతిదాని యందు నీయనంతశక్తి విద్యమానమై యున్నది. ఈ నామపుర శ్చరణ మొనరించుటకు కాలము లేదు, స్థలము లేదు. ఏలయన సర్వ కాలములును, సర్వస్థలములును పవిత్రమైనవే! నీవు సులభుడవు; నీవు దయామయుడవు; నిన్ను ప్రేమింపని నేనెంత దురదృష్ట వంతుడను!"

## ఇష్ట సిద్ధాంతము

ఈ వరలో ఇష్టసిద్ధాంతమును గుఱించి నే నుల్లేఖించి యుంటిని. ఈ సిద్ధాంతమును మనము విశేషశ్రద్ధతో వీక్షింప వలెను. ఏలయన దీనిని మనము సముచితముగ అర్థముచేసికొన గలిగితిమేని, ప్రపంచమందలి వివిధమతములును మనకు సుబోధక ములగును. 'ఇష్ట' శబ్దము 'ఇష్' ధాతువునుండిపుట్టినది. "ఇష్" అనగా కోరుట; కోరిక ననుసరించి ఎన్నుకొనుట. సర్వమతముల

లక్ష్యము, సమస్తమతశాఖల లక్ష్యము ఒక్కటియే — అది మోక్షము ; దుఃఖనివృత్తి. ఎచ్చో మతము నెలకొనియున్నదో, ఈ యాశయసిద్ధికై కావింపబడు సాధన ఏదో యొకరీతిగా సాగుచున్నది. నిమ్నదశలందున్న మతములలో ఈ యాదర్శము సువ్యక్తము కాలేదు. సువ్యక్తమైననేమి, సువ్యక్తము కాకపోయిననేమి. ప్రతిమతము ఆ యేకైకలక్ష్యముదెసకే పోవుచుండును. మనమందఱము దుఃఖనివృత్తిని కాంక్షింతుము ; శారీరక, మానసిక, ఆధ్యాత్మికముక్తికై శతధా తపించుచున్నాము. ఈ యాశయము ననుసరించియే సమస్తవసుంధరలోని కార్యక్రమము సాగుచున్నది. లక్ష్యమొక్కటియే యైనప్పటికి, లక్ష్యసిద్ధికి బహులోపాయములుండవచ్చును. ఈ యుపాయములు వ్యక్తిగత మానసిక ప్రవృత్తులననుసరించి, ప్రకృతి వ్యత్యాసములను బట్టియుండును. ఒక డావేగసమన్వితుడు కావచ్చును ; మఱొకడు మేధాశక్తి సంపన్నుడు కావచ్చును; మఱొకడు క్రియాదక్షుడు కావచ్చును. ఇట్లే వేర్వేఱు గుణగ్రథనముతో వ్యక్తుల మానసము లుండవచ్చును. గమనార్హమైన మఱొకవిషయముకలదు. ఒక ప్రకృతిలో విభిన్న విభాగములుండవచ్చును. దృష్టాంతముగా అనురాగమును గైకొనుడు. భక్తివిషయములో అనురాగమును మనము ప్రత్యేకదృష్టితో వీక్షింపవలెను. ఒకవ్యక్తికి బిడ్డలపై విశేష వాత్సల్యముండవచ్చును ; మఱొకనికి అర్ధాంగిపై అధికానురాగ ముండవచ్చును ; వేఱొకడు కన్నతల్లిని, ఇంకొకడు కన్నతండ్రిని, మఱియొకడు మిత్రులను గాఢముగ ప్రేమింపవచ్చును. మఱొకనికి స్వతసిద్ధముగ జన్మభూమిపై మిక్కిలి మక్కువ యుండవచ్చును. కొలదిమంది విశాలదృష్టితో మానవజాతిని ప్రేమింపవచ్చును. మనలో ప్రతివ్యక్తి మానవప్రేమయే మనజీవితపరమాదర్శమని తెలుపుచున్నను, ఇట్టి యనురాగముగలవారు మిక్కిలి తక్కువగ నున్నారు. కొలదిమంది యోగులకే గాఢానుభూతికలదు. మనుష్యలోకమందు ఏ కొలదిమంది మహాత్ములో విశ్వజనీన

ప్రేమానుభూతితో పఱలుచుందురు. ఇట్టి మహాశయుల యభావము పుడమిలో నుండరాదని మన మాశించెదము గాక.

ఒకే మతవిషయములో ఆదర్శసిద్ధికై విభిన్నమార్గములవలంబింపబడుట విలోకింతము. క్రైస్తవులందఱు ఏసుక్రీస్తును విశ్వసింతురు. కాని ఏసును గుఱించి వా రెన్నెన్ని విభిన్న వ్యాఖ్యానములు చేతురో యోచింపుడు. ఒక్కొక్క ఛర్చి ఒక్కొక్క దృక్పథముతో ఆతనిని వీక్షించును. క్రైస్తవులలో ప్రెస్బిటేరియనులను వారిదృష్టి ఏసు జీవితమందలి ఒక ప్రత్యేక ఘట్టముపై,—కొంత పైకము దీసుకొని చిల్లర ఇచ్చువారియొద్ద కాతడు పోయినప్పటి ఘట్టముపై సారింపబడును. వా రాతనినొక యోధునిగా భావనచేతురు. క్రైస్తవులలో జార్జిఫాక్సు అను నాతడు ప్రతిష్ఠించిన క్వేకర్లు (ఈశ్వరనామము వినినంతనె వడకు వారు) అనబడు మిత్రసంఘమువారు ఏసును గుఱించి తెలుపుచు "అతడు తన శత్రువులను క్షమించెను" అను నాతని క్షమాదృష్టి నుగ్గడించు దృష్టాంతములను పేర్కొందురు. ఒక రోమన్ కేథలిక్ క్రైస్తవు నుద్దేశించి ఏసుజీవితోదంతమున తన మనసుకు వచ్చిన విశేషమేమని యడిగినప్పుడు ప్రాయశః ఆతడు "పీటరు కాతడు బీగములిచ్చిన ఘట్ట" మని చెప్పవచ్చును. ప్రతి క్రైస్తవమతశాఖ ఆతనిని తన దృక్పథముతో వీక్షించితీరును.

ఒకే మతప్రాంగణములో బహుళశాఖోపశాఖ లుండుట గమనింతుము కదా! మూర్ఖులీ యుపశాఖలలో ఒకదానిని స్వీకరించి, చలింపక దానిమీదనే నిలుతురు; అంతియకాదు, ఏవ్యక్తియైన తన ప్రత్యేకోద్దేశము ననుసరించి విశ్వాంతరార్థమును, మతవిషయమును తెలుపరాదని రాయి గ్రుద్ది పలుకుదురు. అంతటితో వా రూరకొనరు; తాముచెప్పినదే సత్యమని ఇతరులేమనినను, అది శుద్ధఅబద్ధమని తెలుపుటకు వారు సాహసింతురు. తాము తెలిపినదాని నెవరైనను, పూర్వపక్షముజేసిరేని, వారు కలహము

నకు కడంగుదురు. వారు విశ్వసించినట్లైవరైన విశ్వసింపనిచో అటు విశ్వసింపనివారిని సంహరింతుమని వారనుచుందురు. ఈ నిర్బంధవిధాన మొకప్పుడు మహమ్మదీయులందుండెను. తమ విశ్వాసముననే విలువగట్టువారు తామే అకృత్రిమస్వభావులమని ఊహించి, ఒరుల నవజ్ఞతో వీక్షింతురు. భక్తియోగ సమీక్షలో మనమవలంబింపవలసిన విధానమేది? ఇతరులు తెలిపినది అయథార్థమని వచింపక, వారువచించినది నిరుపమమైనదని, తమతమ పథముల ననుసరించువారి పద్ధతి దోషరహితమైనదని మనము ముక్తకంఠములతో పలుకవలెను. మీ ప్రకృతి ననుసరించి, మీ రనివార్యముగ ఏ మార్గముననుసరింతురో, అదియేసరియైన తెరువు. పూర్వానుభూతి ననుసరించి మనము ప్రత్యేకప్రకృతి విశేషముతో మనలో ప్రతి ఒక్కరు పుట్టెదరు. అది పూర్వభవ సంచితజ్ఞానమనుడు, అనుభూతియనుడు, వంశపరంపరాక్రమ పరిజ్ఞానమనుడు, అదెట్టిదని మనము తెలిపినను, గతానుభూతి ఫలము మనజన్మయని మనము విశ్వసించి తీఱవలెను. గతానుభూతి ఏయేమార్గముల ననుసరించి మనలో ప్రవేశించినను, ఇది నిక్కమైన విషయమని, ఈ సిద్ధాంతము సత్యసందీపితమైనదని మనము నమ్మవలెను. భూతకాలకారణము ననుసరించి వర్తమాన కార్యము మనలో ప్రతివానియందు విరాజిల్లునను విషయము సుస్పష్టము. కావున మనలో నొక్కొక్కనియందు, ఒక ప్రత్యేకసంచలనము, వ్యక్తిగత భావానుశీలన కలదు; కావున మనలో ప్రతివాడు తన యిష్టానుసారమైన మార్గమును తాను కనుగొనవలెను.

మనలో ప్రతివాడు సహజప్రకృతి ననుసరించి నడచు మార్గము "నిర్వాచితపథ" మనబరగును. ఇది ఇష్టసిద్ధాంతము. మనయది యగు మార్గమును మనయిష్టపథమందుము. ఉదాహరణము గైకొనెదము. భగవంతుడు సర్వశక్తిసంపన్నుడైన విశ్వాధిపతి యని ఒక డూహించెననుకొనుడు. తనప్రకృతిననుసరించి ఆతడీ భావన జేసియుండును. ప్రతివారిమీదను తన పాలనాశక్తిని

విస్తరింపజేయ నుద్దేశించిన ఈవ్యక్తిప్రకృతి అధికారవిజృంభణమును కాంక్షించియుండును. మఱొకవ్యక్తి ఒక బడిపంతులు కావచ్చును. వీని ప్రకృతి కఠోరపద్ధతి నభిలషించునదని యూహింపుడు. ఈతని దృష్టిలో ఈశ్వరుడు నిష్ఠురధర్మమును నిర్వహించువాడు. ఈ ధర్మమును నెఱవుపట్ల దండనవిధి నీత డనుష్ఠించుచుండును. ప్రతివ్యక్తి భగవంతుని తనప్రకృతిననుసరించి వీక్షించును. మనప్రకృతిననుసరించి ఏర్పడు ఈ దృష్టి మన యిష్టసిద్ధాంతమును నిర్ణయించును. మన యిష్టసిద్ధాంతము ననుసరించి ఈశ్వరసాక్షాత్కారము నందెదము. మన మనసునకు వచ్చిన రూపమునే మనము విలోకింతుము. మఱొక దర్శనశక్తి మన కలవడదు. ఒకని ప్రబోధమునకు చెవియొగ్గి, అది సర్వోత్కృష్టమైన ప్రబోధమనియు, మీ మనసునకు అనుకూలమైనదనియు మీరూహింపవచ్చును. మర్నాడు మీ మిత్రులలో ఒక్కరిని ఆతని బోధను వినుటకై ప్రోత్సహింతురు. ఆతడు పోయి వానిప్రసంగమును వినివచ్చి అంత హేయమైన బోధ మఱియొకటి లేదనియు, తాను వినిన బోధనలలో అది మిగుల నికృష్టమైనదనియు తెలుపును. ఆ మిత్రుని విమర్శ దోషభూయిష్ఠము కాకపోవచ్చును; వానితో కలహించినయెడల ప్రయోజనము లేదు. ఆ ప్రబోధము దొడ్డదియైనను, ఆ మిత్రుని మనసున కది సరిపడియుండదు. ఈ విషయమును మఱింత విస్తరించి వీక్షింతుముగాక. వేర్వేఱు దృక్పథములతో వీక్షింపబడు సత్యము సత్యమే కావచ్చును; ఏకైకమైన సత్యము కానేరదని గ్రహింతుముగాక.

ఈ మాటలు పరస్పరవిరుద్ధములట్లు తోచవచ్చును. కాని పరమసత్యమొక్కటియే యని మన మెఱుగవలెను. వ్యక్తిగతమైన యూహల ననుసరించి వ్యక్తమగు సత్యములు, సంబంధవాచకనిర్వచనములు విభిన్నములుసుమీ. ఈ దృష్టాంతమును గమనింపుడు. విశ్వమును మీ రేదృష్టితో విలోకింతురో ఊహింపుడు.

విశ్వము పూర్ణమైనది; విశుద్ధమైనది; పరమాస్తిత్వముగలది. అది పరివర్తనముకాలేదు; పరివర్తనమయ్యెడిదికాదు. సదా యొకేరీతిని నుండునది. కాని మీరును, నేనును, తక్కినవారును ప్రత్యేకదృష్టితో విశ్వమును విలోకింతుము. విశ్వమును గుఱించి వించుము. ప్రతివానికి ప్రత్యేకవిశ్వమున్నట్లగపడును. సూర్యుని విషయము గమనింపుడు. సూర్యుడొక్కడే. కాని మీరును, నేనును, ఇతరులు పల్వురును వేర్వేఱు తావులందు నిలిచి సూర్యుని చూచినయెడల, ఒక్కొక్కని సూర్యుడొక్కొక్క రీతిగా అగపడును. దృశ్య మిట్లగపడక తప్పదు. స్థలమందించుక మార్పు అగపడినయెడల, రవిని విలోకించు దృష్టిపథమున మార్పు అగపడి తీఱును. వాతావరణమున ఇంచుక మార్పు అగపడిన యెడల, మనము చూచు దృశ్యమందుసయితము మార్పు తలయెత్తి తీఱును. కావున వేర్వేఱు వ్యక్తుల విభిన్నరీతుల పరిశీలనమువలన సత్యము సర్వదా వేర్వేఱు రీతులుగా గోచరించును. కాని, పరమసత్యమొక్కటియేసుడీ! కావున ఒరులు మతమును గుఱించి మన అభిప్రాయములకు భిన్నమైన ఊహలను ప్రకటించినపుడు వారితో మనము కలహింప నక్కఱలేదు. స్థూలదృష్టికి వారి యూహలను మన యభిప్రాయములును వేర్వేఱుగా దోచినను, సూక్ష్మదృష్టిపరిశీలనమువలన భిన్నాభిప్రాయము లుండకనే పోవచ్చును. ఒకానొక వృత్తాకార (సర్కిల్) మున నడుమ కేంద్రమందు సూర్యుడు కలడని యోచింపుడు. కేంద్రమునుండి వృత్తాకారపరిధిదెసకుపోవు అనంతములైన కిరణరేఖలు కలవను కొనుడు. కేంద్రమునుండి ఇవి దూరముగా పోయినకొలది, రెండు రెండురేఖలనడుమగల దూరముకూడ విస్తరించును. కాని అన్ని రేఖలును (రేడియై) కేంద్రమందు కలియునపుడు వ్యత్యాసములు అదృశ్యములగును. మనుష్యజాతియొక్క పరమలక్ష్యమైన ఒక కేంద్రము కలదు. ఈ లక్ష్యము భగవంతుడు. మనమందఱము పూర్వోక్తరేఖలము. వీని మధ్యగల దూరములు స్వాభావికములై,

వ్యక్తిగతములైన మానసికప్రవృత్తులు. దీని ననుసరించియే మన మీశ్వరుని విలోకింపగలము. ఈ రీతి కావున నిలిచినపుడు పరమ సత్యమును గుఱించి మనము విభిన్నదృక్పథములను గలిగియుండక తప్పదు. అందుచే సమస్తాభిప్రాయములును సమాదరణీయములే. కావున మనలో నెవ్వరును పోరాటమునకు దిగరాదు. కేంద్రము దెస సాగిపోయినప్పుడు సందేహములు నివారణములగును; సమస్యలు పరిష్కరింపబడును. వాగ్వాదములతోను, కలహముల తోను భిన్నాభిప్రాయములను తొలగించుకొనవలెనని మన ముద్దేశించుచో, ఏ సిద్ధాంతమును కనుగొనక మనము వందలకొలది సంవత్సరములను గడపివేతుము. ఇట్లని చరిత్ర సాక్షి చేయు చున్నది. కేంద్రముదెస అగ్రేసరులమగుట మన ధర్మము. ఎంత త్వరలో మనము ముందంజవేతుమో అంత త్వరలో మన భిన్నాభిప్రాయములు అదృశ్యములగును.

ఇష్టసిద్ధాంతము వ్యక్తిగతములైన మతాభిప్రాయముల కెడమిచ్చుచున్నదని గ్రహించితిమి. తాను దేని నారాధించు చుండెనో దానినే యారాధింపుమని ఎవ్వడును మఱొక్కరుని నిర్బంధింపకూడదు. సేనలవలన, బలప్రయోగమువలన లేక తీవ్రవాదనల వలన మనుష్యుల నొకమందగా జేర్చవలెనని, కంచె గల ఒకేదొడ్డిలోనికి విశృంఖలరీతిని వారిని తఱుమవలెనని, ఒకే ఈశ్వరు నారాధింపుడని, వారిని నిర్బంధింపవలెనని చేసిన ప్రయత్నములన్నియు ఈవఱలో వ్యర్థములైనవి; సర్వదా అట్టి యత్నములు వ్యర్థములగును. కారణమేమన, స్వాభావికముగ అసాధ్యములైనవానిని సుసాధ్యములు చేయదలచుట దుస్సాధ్యమే యగును. ఇంతియకాదు; ఈ రీతి యత్నమువలన వారి మానసి కాభివృద్ధిని నిరోధించు అపాయముకూడ ఘటిల్లవచ్చును. ఏదియో ఒకమతమునకై కృషిసలుపని పురుషునిగాని, స్త్రీనిగాని కను గొనుట సాధ్యముకాదు. ఈ యత్నములో సంతృప్తినందిన

వారెందఱున్నారు? ఉన్నను ఏకొలదిమందిమాత్రమేకదా యుందురు. ఏకొలదిమందిమాత్రమేకదా సత్యాన్వేషణసమర్థులు! ఇట్లుండుటకు కారణమేమి? కారణమిది: వారిలో పలువురు అసాధ్యక్రియలను నిర్వహించుటకై ఉఱుకులెత్తెదరు. ఒరుల ఆదేశములను తలదాల్చి, ఒరుల నిర్బంధమునకు లోబడి అందులకై వారు నడుముగట్టెదరు. ఈదృష్టాంతమును గమనింపుడు: నేను పసివాడనై యున్నపుడు నా తండ్రిగారు నాచేతిల్లో ఒక పుస్తకమునుంచెననుకొనుడు. "దేవుడిట్లుండెను; అట్లుండెను" అని ఆ గ్రంథమున వివరింపబడెనని తలపుడు. ఆ విషయమును నా మనసులో ఆతడేల దూర్చవలయును? నేనేవిధముగా నభివృద్ధి నొందుదునో ఆత డెట్లెఱుగును? నా స్వాభావికస్థితి నెఱుగక, తన యూహలను బలవంతముగ నా మెదడులో చొప్పించుటకై ఆత డుద్దేశించెనని ఊహింపుడు. ఈ ప్రయత్నమువలన నా యభివృద్ధి నిరోధింపబడును గదా! అనుకూలముకాని నేలలో మీరొక మొక్కను నాటి పెంచజాలరు. పసివాడు తనంతదానే నేర్చుకొనును. తన తెరువున తాను ముందంజవేయుటకై మీరు వానికి తోడ్పడవచ్చును. విషయమును నిర్దిష్టమొనరించుట మీపనికాదు; అంకిలిని, సంకెలను తొలగించుట మీకర్తవ్యము. బాలకునికర్తవ్యమార్గమందలి నిరోధములను మీరు తప్పింపుడు. కాని జ్ఞానము వాని స్వకీయప్రకృతి ననుసరించి వచ్చును, గట్టిదైననేల నించుక సడలింపుడు; అట్లొసరించితిరేని అందలి సత్త్వ పనిచేయును. మడిచుట్టు కంచెవేయుడు; మడిలోని మొక్కల నేవ్యక్తిగాని, ఏజంతువుగాని పాడొనరింపకుండ కాపాడుడు. అంతటితో మీకర్తవ్యము ముగియును. దానినిమించి మీరు చేయగలిగినదేదియు లేదు. తదనంతరము స్వతస్సిద్ధమైనశక్తి తనంత దాను వ్యక్తమగును. పసివానివిషయమున గమనింపవలసిన విధానమిది. పసివాడు స్వయంశిక్షణమునందును. మీరు నా ప్రసంగమును వినుచున్నారు. మీరు మీమీగృహములకు తరలిపోయి మీకైనసర్గిక

పరిజ్ఞానముతో నా ప్రసంగాంశమును పోల్చిచూచుకొనుడు. నేను తెలిపిన విషయమునే మీరును యోచించుకొంటిరని గ్రహింపజాలుదును. మీయూహలనే నేను ప్రకటించితిని. నేను మీకేమియును బోధింపలేను; మీయంతకు మీరే బోధచేసికొనవలెను. మీ మనోగతభావము వ్యక్తమగుటకు ప్రాయశః నేను తోడ్పడగలను.

మతమును గుఱించి ఈ బోధనవిధానమును మఱింత శ్రద్ధగా పరిశీలింపుడు. నా మతమును నేనే బోధించుకొనవలెను. పలువిధములైన అపోహలను నాతలలో ప్రవేశపెట్టుటకు నా తండ్రికేమి హక్కు కలదు? నా మస్తకమున తనుచిత్తమువచ్చిన సరకుల నేల దిగుమతిచేయుటకు నా యాచార్యులకు గాని సంఘమునకు గాని ఏమి హక్కు కలదు? వారియూహలు ప్రాజ్ఞవియే కావచ్చును; కాని అవి నా ప్రకృతికి సరిపడునవి కాక పోవచ్చును. నా పురోభివృద్ధికవి తోడుపడకపోవచ్చును. నేడు ప్రపంచములో ఎట్టి భయంకరమైన హాని చెలరేగుచున్నదో యూహింపుడు. అసంఖ్యాకులైన అమాయికపు పిల్లలు కుంటిని బోధనా పద్ధతులవలన సత్యపథభ్రష్టులై పోవుచున్నారు. కుటుంబమతమని, సంఘమతమని, జాతీయమతమని, ఇంకను ఎన్నెన్నో రీతుల మతములని ఆతంకజనకభావములను చిత్తమున జొనుపుచు ఎన్నెన్ని సుందరాశయములను అద్భుత ఆధ్యాత్మిక సత్యములుగా పెరుగనియక పుట్టుకలోనే కొందఱు విధ్వంసమొనరించుట లేదా? మీ బాల్యకాలపు మతమును గుఱించియు, మీదేశమతమును గుఱించియు, ఎట్టి అంధవిశ్వాసపరంపర మీ మస్తకములందిప్పుడు నిండుకొని, ఎట్టి హానిచేయుచున్నదో, ఎట్టి కీడు చేయగలదో ఊహింపుడు. ప్రతిభావమందును, ప్రతిక్రియయందును ఎట్టి మహత్తరశక్తి కలదో మనుష్యుడెఱుగడు. "దేవతలు అడుగిడ వెఱచునపుడు మూర్ఖులు ముందులకుఱుకుదురు" అను తొల్లింటి సత్యవచనము సత్యసంశోభితమైనదికదా. తొలినుండియు ఈ విషయమును

మనసునందుంచుకొనవలెను. ఎట్లు? ఇష్టసిద్ధాంతము ననుసరించుట వలన, బహుళాశయములు కలవు. వానిలో మీ యాశయమేదియై యుండునో తెలుపుటకుగాని, ఏయాశయమునైన నిర్బంధముగ మీ మనసులపై మోపుటకుగాని నాకు హక్కులేదు. నాకు తెలిసిన ఆశయములను మీ సమక్షమున నివేదించుట నా ధర్మము; మీమీ స్వాభావికమానసికప్రవృత్తుల ననుసరించి వానిలో మీకు సరిపడునదేదియో, సర్వోత్కృష్టమైనదని మీకు నచ్చిన దేదియో స్వీకరించుట మీధర్మము. మీదృష్టిలో దొడ్డదైన ఆశయమును పరిగ్రహించి, దృఢభావముతో దాని ననుసరింపుడు. అది మీ యిష్టసిద్ధాంతము కావచ్చును; మీ ప్రత్యేకాశయము కావచ్చును.

ఒక ఉపాసకమండలికై ఏర్పడు ఏకైకమతము నిర్దిష్టమొనరింపబడవలెనని నేను పలుకను. మతవిషయమైన కర్తవ్యమును ఎవరికివారే నిర్ణయించుకొనవలెను. మతమును గుఱించి నాకొక యాశయము కలదు; ఇది నాకు ప్రత్యేకమైనది. దాని పవిత్రతను నేను కాపాడవలెను; అది గుహ్యమై యుండవలెను. కారణమేమన: అది మీ యాశయము కాకపోవచ్చును. నా యూహ యేదో ఎల్లఱకు తెలియపఱచి, నేనేల గందరగోళమును సృష్టింపవలెను? ఒరులు ముందులకువచ్చి, నాతో పోరాటమునకు డీకొనవచ్చును. నా యూహను నేను వ్యక్తీకరింపక పోయినయెడల వారటు చేయజాలరు. నా తలపులను నేను బట్టబయలొనరించినయెడల, వారు నన్నెదిరింపవచ్చును? వానిని గుఱించి ప్రసంగింపనేల? ఈ యిష్టసిద్ధాంతము రహస్యముగ నుండవలెను. అది మీకును భగవంతునకు మాత్రమే విదితమై యుండవలెను. మతమునకు సంబంధించిన తదితర సిద్ధాంతములను గుఱించి ప్రజలయెదుట బోధచేయవచ్చును; మతసమాజములందు వాని నేకరువుపెట్టవచ్చును; కాని ఉదాత్తమైన మతమును ఎల్లఱ యెదుట వెల్లడిచేయరాదు. క్షణకాలవ్యవధిలో నా యాధ్యాత్మిక

భావనలను నేను సిద్ధపఱచియుంచజాలను. ఈ హాస్యకర అనుష్ఠానములవలన, ఈ పరిహాసఖేలనమున దాపురించు ఫలమేమో చెప్పుగలరా? దీనివలన మతమును వెక్కిరించినట్లు గేలిచేయుట అగును. దీనిని మించిన హేయమైన ఈశ్వరనింద మఱొకటి ఉండబోదు. ఫలము నేటి దేవస్థానములలో, మతసంస్థలలో మీకగపడుచునే యున్నది. మానవులు మతవిషయమున ఈ రీతి నిర్బంధవిధానము నెట్లు సహింపగలరు? సైనికనివాసమునందలి సిపాయిలపద్ధతివలె నిది యున్నది. భుజములపై ఆయుధములనుంచి, ముందుకువంగి, ఒకపుస్తకమును చేతబుచ్చుకొని, ఒకరు చెప్పినట్లు అంగప్రత్యంగములను త్రిప్పు వ్యాయామపద్ధతి నెలకొనియున్నది. ఐదునిమిషములు భావానుభూతినందుట, ఐదునిమిషములు హేతుశక్తి ననుసరించి సమీక్షించుట, ఐదునిమిషములు ప్రార్థనచేయుట మున్నగు పనులు ముందే నిర్ణయింపబడుచుండును. మతవిషయమున ఈ హాస్యనాటకములు అసలుమతమును ఎచటికో తరిమికొట్టినవి. చర్చిలు ఉపదేశావళిని, సిద్ధాంతములను, తాత్త్వికాశయములను తమ మనసులకు వచ్చినట్లు బోధించుగాక. కాని ఆరాధన సలుపవలసిన సమయమున నిక్కమైన మతానుష్ఠానము ఏసు చెప్పినట్లుండవలెను: "నీవు ప్రార్థనసలుపువేళ నీ రహస్యాగారమున ప్రవేశింపుము. కవాటమును బంధించి, నిభృతమున నున్న నీ తండ్రిని (ఈశ్వరుని) ఆరాధింపుము."

ఇది ఇష్టసిద్ధాంతము. విభిన్న స్వాభావిక ప్రకృతుల మతావశ్యకత దీర్చుటకును, పరస్పరకలహములకు తావీయకుండుటకును, ఆధ్యాత్మికజీవితమున నిస్తులమైన అభ్యాసమును సుసాధ్యమొనరించుటకును తోడుపడు ఏకైకసిద్ధాంత మిది యొక్కటియే. కాని నా మాటలలోని సత్యమును గుర్తింపక, అపార్థమువలన పెరతెరువుకు పోవుచు, మీరు రహస్యసంఘములను నెలకొలుపరాదని హెచ్చరించుచున్నాను. పిశాచమనునది ఉన్నయెడల, అది ఇట్టి రహస్యసంఘములందే కాపురముండునని తెలుపుదును.

రహస్యసంఘనిర్మాణమున అది యధివసించియుండును. ఈ సంఘములు పైశాచికప్రణాళికల ననుసరించి నడచును. ఇష్టసిద్ధాంతము పవిత్రసిద్ధాంతము. అది రహస్యసిద్ధాంతముకాదు. దీని భావ మేమో గ్రహింతురుగాక! నా యిష్టసిద్ధాంతమును గుఱించిన ఉదంతమును నే నితరులముందు ఏల యేకరువుపెట్టరాదు? అది నాకు మిగులగూర్చు పవిత్రసిద్ధాంతము. ఒరుల కది సహకారి కావచ్చును. అది వారికి చెఱుపు తెచ్చినను తేవచ్చునేమో! వారి కది యెగ్గు కలిగింపదని ఎట్లు తెలుపుదును? తన ప్రకృతి ననుసరించిన సగుణబ్రహ్మోపాసన ఒకనికి గిట్టకపోవచ్చును; నిర్గుణోపాసన, ఆత్మోపాసన వాని కిష్టమైయుండవచ్చును. ఆతనిని మీముందు నేను విడచితినన్నుకొనుడు. "అనంతకల్యాణగుణయుతుడైన ఈశ్వరుడు లేనే లేడు; సగుణోపాసన కూడదు. మీలోను, నాలోను విరాజిల్లు భగవంతునే విశ్వసింపుడు" అని మీ కాతడు బోధించును. ఆ ప్రబోధము విని మీ రులికిపడుదురు. వానియూహ పునీతమైనదే! కాని గుహ్యమైనదికాదు. ఈశ్వరసత్యములను బోధించుటకై రహస్యసంఘములను నెలకొలిపిన మహనీయుడైన ఒకమతాచార్యుడు లేడు; మహత్తరమైన మతవ్యవస్థయును లేదు. ఈ రీతి గూఢసంఘములు భారతదేశములో లేవు. ఇవి పాశ్చాత్య సంప్రదాయములోనివే! ఇవి బలవంతముగ భారతదేశముపై మోపబడినవి. వానిని గుఱించిన విషయమే మే మెఱుగము. రహస్యసంఘములు భారతదేశములో ఎందుల కుండవలెను? సుస్థిరముగ స్థాపింపబడిన మతసంస్థ యూహలకు సరిపడని మతోద్దేశములను గుఱించి ఒక్కమాటనైన ఉచ్చరించుటకు యూరపులో ప్రజలకు స్వాతంత్ర్యము లేదు. కాబట్టి వారు కొండలలో ప్రవేశించి, మఱుగున నివసించి, రహస్యసంఘములను స్థాపించువారు. ఇట్లొనరించుటవలన వారు తమ తమ మనసులకు నచ్చినరీతిని ఈశ్వరారాధన జేసికొనుట సాధ్యమయ్యెడిది. మతమును గుఱించిన స్వతంత్రభావములుగల వ్యక్తిని బాధించు

అత్యాచార మెన్నడును భారత దేశములో తలయెత్తలేదు. గూఢ మతసమితు లెన్నడును భారతభూమిలో తలసూపలేదు. అవి యచ్చోటనుండెనను నూహ మీ మనసులందుండుచో, తక్షణమే దానిని తఱిమికొట్టుడు. ఈ రహస్యసంఘములు అనవరతము భయదవ్యవస్థలై విజృంభించును; అవెట్టి చెఱుపును కలిగించునో పరిశీలించు అనుభూతి నాకీజగతిలో కలదు. అవవెలగా నవి విశృంఖలప్రేమసంఘములుగాను, పైశాచిక సమితులుగాను మాఱుట నే నెఱుగుదును. వీనివలన కొందఱు కొందఱు అభాగులు పెరవారి (వీరు మగవారు కావచ్చును, మగువలు కావచ్చును) చేతులందు పడిపోదురు. ఆ యభాగుల మానసికాభివృద్ధియును, క్రమాభివృద్ధియును, భావికాలజీవితాభివృద్ధియును ధ్వంసమగుచుండును; ఈ యరిష్టమింకను బహుముఖముల చెలరేగును. ఈ రీతిగా నేను ప్రసంగించుట మీలో కొందఱికి కిష్టము లేకపోవచ్చును. కాని సత్యమును వచించుట నా విద్యుక్తధర్మము. ప్రాయశః స్త్రీపురుషు లెఱుగుదురు మాత్రమే నా సమస్తజీవిత మందు నన్ననుసరింతురేమో! కాని వారు సత్యారాధకులైన పవిత్రజీవులై యుందురు. పెద్దగుంపుపై నేను చూపు నిలుపను. గుంపులు చేయగలుగునదేమి? ప్రపంచచరిత్ర ఏకొలదిమంది వల్లనో నిర్మింపబడినది. వీరిది పజనుల సంఖ్యయే! వీరిని వ్రేళ్లపై లెక్కపెట్టవచ్చును. ఒరులు నట్టి మూకలు మాత్రమే. ఈ గూఢ సంఘములన్నియును, ఈ మిథ్యాసంఘములన్నియును స్త్రీపురుషులను నీతిబాహ్యులను జేసివేయును. వారికి మానసికదుర్బలత యేర్పడును; వారి దృక్పథము మిగుల హ్రస్వమై యుండును. మానసికదుర్బలతగలవారి సంకల్పశక్తి శూన్యమైపోవును. క్రియాంగణములో వారు ముందంజవేయలేరు. అందుచే అట్టి సంఘముల దాపల జేరకుడు; వాని ప్రసక్తి లేకనే యుండుడు. గుప్తమతవాదముమీది ప్రీతి, తొలిమాఱు మీ మనసులందు ప్రవేశించినంతనే దానిని ధ్వంసముచేసి వదలుడు. ఎవ్వాని

మనస్సున ఆవంత మాలిన్యము చేరినదో ఆతడు మతబాహ్యు డగును. చీము నెత్తురులతో కంపుగొట్టు పుండులను గులాబి రేకులతో కప్పివేయ నుంకింపకుడు; మీ రీశ్వరుని మోసగింప గలమని యూహింతురా? ఎవ్వరును దేవుని వంచింపలేరు. కపట మెఱుగని ఒకపురుషునిగాని, స్త్రీనిగాని నాకు ప్రసాదింపుడు, చాలును. ఈశ్వరా! పెనుభూతములనుండి, ఎగురజాలు దేవతల నుండి, పిశాచములనుండి నన్ను గాపాడుము. అనుదినము సామాన్యప్రజలై, నిర్మలచేతస్కులై యుండుడు.

మనలో సహజప్రవృత్తికలదు. ఈ నైసర్గికప్రవృత్తి పశువులకునుగలదు. ఈ ప్రవృత్తివలన శరీరము ప్రయత్నరహితముగ చలించును. దానినిమించిన శక్తి హేతుశక్తి—మేధాశక్తి ప్రపంచ విషయములను పరిశీలించి, వానినుండి సిద్ధాంతములను చేకొనును. సహజప్రవృత్తికంటె ఈ శక్తి మనజీవితమున విశేషసహకారి కాగలదు. ఈశక్తిని మించిన మహత్తరశక్తి మఱొకటికలదు. అది ప్రకృతి కతీతమైనది. ఆధ్యాత్మికప్రభావముగలది. అది హేతు పంథననుసరింపదు. దాని ప్రభావమువలన ఆకస్మికద్యుతివలె జ్ఞానము మానసదిగ్వలయముపై తళుక్కుమని మెఱయును. దానివలన సర్వో త్కృష్ట ప్రజ్ఞానము లభించును. సహజప్రవృత్తివలన దాని నెట్లు గ్రహింపజాలుదుము? ఇది మిగుల కష్టమైనది. ఈ దినములలో ప్రతివాడు మీసముందునకువచ్చి, తనకు ఆధ్యాత్మికమైన ఉద్వేగము కలిగినదని తెలుపును. తనకుగల అతిలోకప్రభావమును గుఱించి పెద్దకబురులు చెప్పుచుండును. ఆధ్యాత్మికమైన ఉద్వేగమునకును, ప్రపంచమునకునుగల వ్యత్యాసమును గ్రహించుటెట్లు? ఆధ్యాత్మికోద్వేగశక్తి (ఈశ్వరప్రేరితజ్ఞానము) హేతుశక్తికి విరుద్ధమై యుండరాదు. ఇది తొలుత మనము గ్రహింపవలసినవిషయము. వృద్ధుడు శిశువునకు వేఱుకాడు; అతడు పెరిగిన పాపయే! మన ముల్లేఖించు ఆధ్యాత్మికోద్వేగప్రభావము హేతుశక్తి వృద్ధియే!

హేతుశక్తిద్వారా స్వాజాతశక్తి యలవడును. సహజప్రవృత్తివలన కలుగు శారీరకసంచలనము హేతుశక్తికి విరుద్ధముకాదు. మీరొక వీధిని దాటునపుడు, కడునడిగవచ్చు మోటారుకారులనుండి కాపాడుకొనుటకై మీ శరీరములనెట్లు ఆకస్మికముగ చలింప జేతురో ఎఱుగుదురు కదా. మీ దేహములను అట్టి విపత్తులనుండి సంరక్షించుకొనుట తెలివితక్కువపనియని మీ మనస్సులు మిమ్మాక్రోశించునా? అట్లుచేయవు. అదేరీతిగా ఆధ్యాత్మికోద్వేగ ప్రభావము హేతుశక్తికి ప్రతికూలమై విజృంభింపదు. అట్లు ప్రతికూలముగ విజృంభించెనేని, అది దైవీప్రభావ సమన్వితశక్తి కానే కాదు. ఈ యాధ్యాత్మికశక్తి సర్వజనాభ్యుదయమును గలిగించునది; ఇది పేరు ప్రాకులాటకుగాని, వ్యక్తిగతలాభము కొఱకుగాని వినియోగముకాదు. ఇది సర్వదా ప్రపంచకల్యాణమునకై తోడుపడును; ఇందు ఆవంత స్వార్థచింత లేదు. ఈ సమీక్షలో ఇది నిరుష్టమై నిలిచెనేని, ఇది యాధ్యాత్మికోద్వేగశక్తి యని మీరు నిశ్చయముగా తెలిసికొనవచ్చును. ప్రస్తుతప్రపంచపరిస్థితిలో పదిలక్షల మానవులలో ఒక్కనికైన ఈయద్భుతశక్తి లేదని మీరు గ్రహింపవలెను. ఈ పరిస్థితిలో పరివర్తనము కలుగునని విశ్వసించుచున్నాను. మన మిప్పుడు మతముతో ఆటలాడుచున్నాము. అతిప్రకృతశక్తి, పూర్వోక్త ఆధ్యాత్మికవిభూతి మన కలవడిన మంగళ ముహూర్తమున మనలో మతావిర్భావము గోచరించును. ''మన మిపుడు ఒక కాచఫలకముద్వారా చూచుచున్నాము. అది స్పష్ట విలోకనము కాదు. కాని అపుడు సన్నిహితముఖవీక్షణము సుసాధ్యమగును'' అని పాల్ యోగి తెలిపినవాక్కు సత్యప్రదీపితమైనది. ప్రస్తుతప్రపంచస్థితిలో ఆయుదాత్తశక్తి నలవఱచుకొనిన వారు శుద్ధపూజ్యులు. కాని, యిప్పటివలె మఱెప్పుడును ఈయాధ్యాత్మికశక్తి కలదని దృఢోక్తు లుచ్చరించువారు లేరు. — ఈ దృఢోక్తులు మిథ్యాప్రలాపములే! స్త్రీలలో స్వాజాతశక్తులు కలవనియు, పురుషులు హేతుశక్తినుండి మెల్లమెల్లగా ఉదాత్తమైన

స్థితిని జేరుచుందురనియు కొందఱనుచుందురు. ఈ మాటసత్యమని విశ్వసింపకుడు. ఈ శక్తిగలవారిసంఖ్య స్త్రీ పురుషులందు సమానముగానే యున్నది. కాని ప్రాయశః స్త్రీలలో పల్వురందు స్నాయవిక దౌర్బల్యయుక్త వ్యాధియును, వివిధరీతుల హిస్టీరియా ప్రకోపమును విజృంభించుచుండును. గారడీవిద్యను ప్రదర్శించువారిచేతులందును, వంచకులచేతులందును చిక్కుటకంటె మీరు నాస్తికులై మరణించుటమేలు. వినియోగమునకై హేతుశక్తి మీకు ప్రసాదింపబడినది. ఈ శక్తిని మీరు సక్రమముగా వినియోగించితిరని సాక్షిచేయుడు. అట్లొనరించితిరేని, ఉదాత్తాశయములదెస మీరు మీ దృష్టిని సారింపగలరు.

భగవంతుడు ప్రేమయను విషయమును మనమందఱము జ్ఞాపకముంచుకొనవలెను. "గంగాతీరమున వసించి, నీటికై చిన్న నూయిత్రవ్వువాడు నిక్కముగ మూర్ఖుడు. వజ్రములగని యొద్ద వసించుచు గాజుముత్తెములను వెదకుటకై తన జీవితమును వెచ్చించువాడు నిజముగ మూర్ఖుడు." భగవంతుడు వజ్రముల ఖని. ఈశ్వరుని పరిత్యజించి, భూతములను గురించిన పుక్కిటి పురాణముల కొఱకును, ఇంపంబెగయు పిశాచముల గాథల కొఱకును ఎగబడుదుమేని మనమును బుద్ధిహీనులమే యగుదుము. ఈ ప్రవర్తన యొకవ్యాధి యనవలెను; రోగభూయిష్టమైనవాంఛ అట్లు వ్యక్తమగుచుండును. ఈవ్యాధి జాతిని అధోగతిలో గూల ద్రోయును; దీనివలన శరీరమందలి నరములును, ధమనస్నాయువులును, మెదడును, శక్తివిహీనములగును. పిశాచగణమును గురించిన నిరంతరక్షీ[illegible]యును, ఆశ్చర్యజనకక్రియలను గురించిన పిపాసయును, తీవ్రవాంఛాప్రకోపమును, భయంకరకథాపఠనమును చిత్తమున దారుణోద్రేకమును పుట్టించును. ఈరీతిగ ఉత్తేజితమగు జాతి దౌర్బల్యకలంకితమగును. ఇది యాకస్మికపతనము కాకపోవచ్చును. కాని ఇది సునిశ్చితపతనమే. ఈశ్వరుని పరిత్య

జించుట, నిర్మలజీవితమునకు నీరువదలుట, పవిత్రతయనిన కనులెఱ్ఱ జేయుట, ఆధ్యాత్మికచింతకు అంతు బెట్టుట, కొఱగాని విస్తార ములకై గ్రుక్కిళ్లు మ్రింగుట ఇవి మనుజునకొరగనిట్టి దుష్ట ప్రవృత్తులు. ఒరులచిత్తములందలి ఊహలను గ్రహించిచెప్పుట ప్రశంస నీయమగుచున్నది. ఒరుల మనసులందలి తలపులను ఒక్కమాఱుగ ఐదునిమిషములలో తెలిసికొనదలచితి మేని, నే నుస్మత్తుడనయ్యె దను. శక్తిసమన్వితులుకండు; లేచినిలువంబడుడు; ప్రేమనారా యణు నన్వేషింపుడు. ఇట్లొనరించితి రేని, మీను సర్వోత్కృష్టమైన శక్తి అలవడును. పవిత్రతకుగల శక్తికంటె ఘనతరమైన శక్తి యేది? ప్రణయమును, పవిత్రతయును ప్రపంచము నేలును. శక్తిహీనులకు ఈశ్వరప్రేమ అలవడదు. కావున, శారీరకముగగాని, మానసిక ముగగాని, నైతికముగగాని, ఆధ్యాత్మికముగగాని శక్తిహీనులు కాకుండుడు. ఈశ్వరుడొక్కడే సత్యము ; ఈశ్వరుడు కానిది మిథ్య, భగవంతునికొఱకై అన్యవస్తువులనన్నిటిని పరిత్యజింపుడు. అవి వ్యర్థములు ; వ్యర్థ విజృంభణము కేవలము దంభమే. — దంభములలో దంభము—సర్వమును దంభము. ఈశ్వరుని సేవిం పుడు ; ఈశ్వరునే సేవింపుడు.



# ఉపాసకుడు - ఉపాస్యుడు*

(శాన్‌ఫ్రాన్సిస్కో ప్రదేశములో 1900-వ సం॥ ఏప్రిల్ 9-వ తేదీని చేసిన ఉపన్యాసము)

మానవప్రకృతి నింతవఱకు వైశ్లేషికదృష్టితో పరిశీలించుచున్నాము. ఇప్పు డతని యావేశప్రకృతిని గమనింతము.... ఈ రెంటిలో మొదటిది మానవుని యనంతునిగా పరిగణించి, అతని తత్త్వమును బోధించును. రెండవది మానవుని పరిమిత వ్యక్తిగా పరిశీలించును....కొలది యశ్రుకణములను, హృదయోద్వేగములను పరిశీలించుటకు మొదటిదానికి వ్యవధిలేదు; రెండవది, కన్నీరు తుడువక, గాయమును మాన్పక ముందడుగు వేయజాలదు. మొదటిది మహోత్కృష్టమైనది. దాని మహిమాతిశయము మనలను విహ్వలచిత్తుల జేయును. రెండవది సర్వసాధారణమైనది. కాని, బహుసుందరమైనది. మన కత్యంతప్రియమైనది. ఒకటి మనలను మహోన్నతస్థాయికి గొనిపోవును. ఆ యెత్తున మన యూపిరితిత్తులు పగిలిపోవునేమో ననిపించును. ఆ గాలిని మనము పీల్చజాలము. రెండవది మనలను ఉన్నచోటనే ఉంచును. పరిమితదృష్టితో జీవితాశయములను గ్రహించుటకు ప్రయత్నించును. ఒకటి, ధగధగ మెరసెడి హేతుజ్ఞానము తన ఆమోద ముద్ర వేయనిదే, దేనిని స్వీకరింపదు; రెండవది విశ్వాసముగలది. తాను చూడలేని దానిని విశ్వసించును. ఈ రెండును అవసరములే. ఏలయన, పక్షి ఒక్కటెక్కతో ఎగురలేదుకదా!...

సమగ్రసుందరముగా, అన్ని అంశములు సామరస్యముతో వ్యక్తి వికసింపవలెనని మన యభిమతము....హృదయము గొప్ప

* ఈ యుపన్యాసము 'వేదాంత అండ్ ది వెస్ట్' నుండి గ్రహింపబడినది.

దిగా ఉండవలెను, మనస్సు గొప్పదిగా ఉండవలెను, క్రియాశక్తి గొప్పదిగా ఉండవలెను. లోకములోని దుఃస్థితికి, దుఃఖములకు వేదనపడగల హృదయము గలవారు కావలెను.

వేదనపడుటేగాక, విషయముల కర్థము, ఆంతర్యము గ్రహింపగలిగినవారై యుండవలెను. ప్రకృతిహృదయము లోనికి చొచ్చుకొనిపోయి రహస్యమును భేదింపగలుగవలెను. అంతేకాదు. హృదయావేదనను, జ్ఞానమును కార్యరూపమున నిరూపింపగలుగవలెను. మనము కాంక్షించునది అట్టి ప్రణయ జ్ఞానక్రియాశక్తుల సమన్వయవికాసము. లోకములో బోధకు లనేకులు గలరు. కాని, వారిలో చాలమంది ఏదో ఒకపక్షము నే అవలంబింతురు. ఒకరు మధ్యందినమార్తాండునివంటి ధీశక్తిని మాత్రమే తిలకింతురు. వారు మరేమియు చూడజాలరు. మరొకరు మనోహరమగు మధురప్రేమగీతాలాపనమాత్రమే ఆల కింతురు. అతని కింకేమియు వినబడదు. వేతొకడు నిర్విరామ కార్యోత్సాహములో నిమగ్నుడగును. ఆలోచనకు, ప్రవేశాను భూతికి అతనికి వ్యవధిలేదు. జ్ఞానమునందు, ప్రేమమునందు, కర్మపరాయణత్వమునందు సమానముగా ఉత్తీర్ణుడగు మహాపురుషు డేల ఉండకూడదు? అసాధ్యమా? ఎన్నటికిని కాదు. భవిష్య న్మానవు డట్టివాడే. ఇప్పు డటువంటివారు కొలదిమందియే గలరు. ప్రపంచమంతయు మానవత్వముతో నిండిపోవువఱకు అటువంటి వారిసంఖ్య వృద్ధియగుచునేయుండును.

ఇంతవఱకు బుద్ధినిగుఱించి, హేతుక్రమమునుగుఱించి నేను మీతో ముచ్చటించుచుంటిని. మనము వేదాంతమును సమగ్ర ముగా వింటిమి. మాయ యనెడి తెఱ తొలగిపోవును. శీతకాలపు మబ్బులు విడిపోవును. సూర్యునికాంతి మనపై ప్రసరించును. హిమాలయపర్వతము నెక్కి మేఘములనుదాటి యదృశ్యమగు శిఖరముల నధిరోహించుటకు ప్రయత్నించుచుంటిని. ఇప్పుడు

మీాతో కలసి రెండవ విషయమును పరిశీలింపవలెనని యున్నది. రమ్యములగు లోయలతో, మనోహరములగు ప్రకృతిసుందర దృశ్యములతో ఇది బంధురమై యున్నది. లోకములో దుఃఖమెంత విస్తరించియున్నను, మనల నిక్కడ నిబ్బరముతో నుంచిన ప్రేమను గుఱించి, దుఃఖపరంపరను మనచే కల్పింపజేసిన ప్రేమను గుఱించి యిప్పుడు తెలిసికొందము. నిత్యము మానవుడు తనంత తానుగా కోరి తనప్రాణమును బలియిచ్చి యనుభవించుచున్న దుఃఖమది. దేనికొఱకు మానవుడు తనచేతులతో తానే దుఃఖ పరంపరను తెచ్చిపెట్టుకొనియున్నాడో, దేనికొఱ కతడు బాధలు పడుచున్నాడో అట్టి శాశ్వతప్రేమతత్త్వమును తెలిసికొందము. రెండవ విషయమును మఱచిపోవుట మనయుద్దేశముకాదు. హిమాలయములలోని శిశిరప్రాంతమునకు, కాశ్మీర్ సీమలోని వరినేలలకు పోత్తు కుదరవలెను. పిడుగుశబ్దము పక్షుల కలకల ధ్వనులతో అట్టడుగు స్థాయియందయినను మేళవించవలెను.

ఈ పథమునకు సుందరము, మనోహరము నయినదానితో నెల్ల సంబంధమున్నది. సర్వత్ర పూజ్యభావము కలదు; ప్రతి ఆత్మయందు కలదు. ప్రతి జీవుడు ఈశ్వరుని పూజించును. పూజించు రీతులు వేఱైననేమి? అందఱు ఈశ్వరుని పూజించు చున్నారు. ఉపాసన ప్రారంభదశలు—సుందరమగు పద్మమువలె, జీవితమువలె—నేలలోని బురదతో కలసియున్నవి....భయలక్షణ మొకటి యున్నది. ప్రాపంచిక ప్రయోజనము పొందవలెననెడి తృష్ణ కలదు. బిచ్చగాని యాచనభావముతోకూడిన ప్రార్థన కలదు. ఇవి లోకములోని ఉపాసన ప్రారంభదశలు. ఇవి ఈశ్వరునియందు ప్రేమగా, మానవునిద్వారా ఈశ్వరుని ఉపాసించుటగా పరిణమించినవి.

దేవుడనెడివా డెవడేని కలడా? ప్రేమాస్పదుడగువా డెవ యిన ఉన్నాడా? ప్రేమించుటకు సాధ్యమగువాడు కలడా?

రాతిని ప్రేమించుటవలన పెద్దప్రయోజనములేదు. ప్రేమ నర్థము చేసికొనగలవానినే, మనప్రేమ నాకర్షించువానినే మనము ప్రేమింపగలము. ఉపాసన విషయముకూడ అంతే. రాయిని రాయిగా పూజించినవా డెవడేని లోకములో కలడని చెప్పకుము. రాతియందున్న సర్వవ్యాపియగు దేవునే అతడు పూజించెను.

సర్వవ్యాపియగు దేవుడు మనయందు కలడని మనము గ్రహింతుము. ఆ పురుషుడు మనకు వేఱుగా లేనియెడల, మన మెట్లు ఉపాసింపగలము? నేను నిన్ను ఉపాసింపగలనే గాని నన్ను ఉపాసింపజాలను. "నీవు" అనదగునది యేదయిన కలదా?

ఏక మనేకమగును. ఏకమును చూచినప్పుడు మాయ ద్వారా ప్రతిఫలించు పరిమితులన్నియు అదృశ్యమగును; అయితే అనేకము నిష్ప్రయోజనము కాదన్న మాటకూడ నిజమే. అనేకము ద్వారా మాత్రమే మన మేకమును చేరుకొందుము....

సగుణుడైన దేవుడు — ఆలోచనచేయుచు, అర్థముచేసికొనుచు మనలను నడిపించుచు దారిచూపు దేవుడు కలడా? కలడు. నిర్గుణుడైన నా దేవున కీగుణములలో నేదియు లేదు. మీలో ప్రతిఒక్కరు ఆలోచింప సమర్థులు. ప్రేమింతురు, ద్వేషింతురు, ఆగ్రహింతురు, దుఃఖింతురు. ఇంకను యిట్టిపనులు చేయుదురు; మీరు నిర్గుణులు, అనంతులు. మీరు సగుణులు, నిర్గుణులుకూడ. ఈ రెండు లక్షణము లొక్కదానియందే గలవు. మీయందు సగుణతత్త్వము, నిర్గుణతత్త్వము గలవు. ఆ నిర్గుణ సత్యము కోపగింపజాలదు, దుఃఖింపజాలదు, దుఃస్థితికి గుఱి కాజాలదు—దుఃస్థితిని గుఱించి తలంపనయినను తలంపజాలదు. అది యోచింపజాలదు, తెలిసికొనజాలదు. అది జ్ఞానమే. కాని, సగుణతత్త్వము తెలిసికొనును, యోచించును, మరణించును, యిట్టిపనులు చేయును. కనుక విశ్వజనీనమయిన పరమసత్యము నందుకూడ ఈ రెండు లక్షణములుకూడ గలవు. ఒకటి సకల

వస్తువులలోని అనంతసత్యము, రెండవది సగుణతత్త్వము, ఆత్మల కెల్ల ఆత్మ; ప్రభువులకెల్ల ప్రభువు. అతడే ఈ జగత్తును సృజించును. ఈ విశ్వ మతని ఇచ్ఛాధీనమై యున్నది....

అతడు అనంతుడు, నిత్యపవిత్రుడు, నిత్యముక్తుడు.... అతడు న్యాయమూర్తి కాడు. దేవుడు న్యాయమూర్తి కాడు. అతడు సింహాసనముమీద కూర్చుని మంచిచెడ్డలను విచారణ చేయువాడు కాడు....అతడు మేజిస్ట్రేటు కాడు, సేనాపతి కాడు, యజమాని కాడు. సగుణుడైన దేవుడు కడలేని దయాపరుడు. అతని ప్రేమ యనంతము.

మరొక దృక్పథమునుండి చూడుడు. మీ దేహమందలి ప్రతి జీవకణమునం దాత్మ కలదు. దానికి జీవకణమును గుఱించిన యెఱుక గలదు. అది వేఱువస్తువు. దానికి అల్పమగు ఇచ్ఛ కలదు; పరిమితమగు కార్యరంగము గలదు. ఈ జీవకణము లన్నియు కలిసి వ్యక్తియగును. అటులనే సకలజీవులు కలిసి విశ్వాధిపతియగు 'సగుణదేవు' డగును.

వేఱొక విధముగా చూతము. నేను చూడగలుగుచున్నంత వఱకు—మీ రెంతగా నాదృష్టికి బద్ధులయి పరిమితులో అంతగా సర్వాతీతపరతత్త్వముగలవారు. నేను చూడగలుగుటకుగాను మిమ్ము నా నేత్రములకు, ఇంద్రియములకు గల శక్తిద్వారమున పరిమితులనుచేసితిని. మిమ్ము నా కన్ను లే మేరకు చూడగలుగునో ఆ మేరకే చూతును. మిమ్ము నా మనస్సెంతవఱకు గ్రహింప గలుగునో అంతవఱకే మిమ్ము నే నెఱుగుదును. అంతకుమించి మిమ్ము నే నెఱుగను. అదేవిధముగా నేను పరమనిర్గుణతత్త్వ మును గ్రహించుచున్నాను. ఆ విధముగా నే నతనిని సగుణునిగా చూతును. మనకు దేహము, మనస్సు ఉన్నంతవఱకు ఈ త్రిత్వ మును చూచుచుందుము: దేవుడు, ప్రకృతి, జీవుడు. సర్వదా ఈ మూడును అవిభాజ్యముగా నొక్కదానియం దుండక తప్పదు.

...ప్రకృతి యున్నది. మానవాత్మ లున్నవి. ప్రకృతిని, మానవాత్మలను తనయం దిముడ్చుకొనియున్నది కలదు.

విశ్వాత్మ ఉపాధిబద్ధమైనది. నా యాత్మసహితము ఈశ్వరుని యంశయే. మనకంటె కతడే నేత్రేంద్రియము. మనజీవమున కతడే ప్రాణము. మన మనస్సున కతడే మనస్సు. మన ఆత్మ కతడే ఆత్మ. దేవుని సగుణతత్త్వమును గుఱించిన పరమోత్కృష్టమగు ఆశయ మిది.

నీవు ద్వైతివికాక అద్వైతివే యైనను, దేవుని సగుణతత్త్వమును మన్నింపవచ్చును....'ఏకమేవాద్వితీయ' మున్నది. ఆ యొక్కటి తన్ను తాను ప్రేమింప నిచ్ఛగించెను. అంతట ఏకమునుండి అత డనేకమును సృజించెను....ఆ బృహత్తరమగు నన్ను, సత్యమగు నన్ను, ఈ యల్పమగు నేను ఉపాసించుచున్నాను. కనుక అన్నివాదములందును సగుణబ్రహ్మమునకు తావు గలదు.

కొందఱు పుట్టిన పరిస్థితులు వారితరులకంటె ఎక్కువ సుఖపడుటకు సహాయపడును; న్యాయస్వరూపుడగు దేవుని పరిపాలనయం దిది యేల జరుగవలెను? లోకములో హృత్యవున్నది. ఈ చిక్కులున్నవి. ఈ ప్రశ్నల కెన్నడును ద్వైతవాద దృక్పథమునుండి సమాధానము లీయబడలేదు. విషయములను వాటి యథార్థరూపములో పరిగణింపగల తత్త్వవాదులు నాశ్రయింపవలెను. మన కర్మఫలితమే మన మనుభవించుచున్నాము. అది దేవుని దోషముకాదు. మనము చేయునది మనదోషమే గాని మరేమియుగాదు. దేవుని యేల దూషింపవలెను?

చెడుగెందుకున్నది? దేవుడు మంచిచెడ్డలు రెంటికి కారకుడని చెప్పుటచేతనే ఈ ప్రశ్నకు సమాధానము గలదు. దేవుడు సగుణుడనెడి వాదములో పెద్ద చిక్కు గలదు. అతడు మంచివాడే గాని చెడ్డవాడు కాదందువా, నీ యుక్తివాదములోనే నీవు చిక్కు

కొందువు. దేవుడున్నాడని యెట్లు తెలియును? అతడు జగత్పిత యని, మంచివాడని నీవందువు; అయితే, జగత్తులో చెడుగుకూడ కలదు కనుక అతడు చెడ్డవాడన్నమాటే....అదే చిక్కు.

మంచి లేదు, చెడుగు లేదు. ఉన్నదెల్ల దేవుడే....ఏది మంచియో నీకెట్లు తెలియును? మీకు తోచును. ఏది చెడుగో నీకెట్లు తెలియును? చెడుగు జరుగును. మీకు తోచును.... స్పర్శజ్ఞానమువంటి జ్ఞానముచేత మనము మంచిచెడ్డలను గ్రహింతుము. మంచిని, సుఖప్రదమగు భావములు మాత్రమే కలిగెడివారెవ్వరును లేరు. బాధాకరమగు అనుభవమునే కలిగెడివారును ఎవ్వరు లేరు.

ఒకవైపున కోర్కె, మరొకవైపున ఆందోళన అశాంతికి కారణములు. సుఖమునకుకూడ నవియే కారణములు. కోర్కె నానాటికి ఎక్కువగుచున్నదా? తగ్గుచున్నదా? జీవిత మానాటి కానాడు సుగమమగుచున్నదా? జటిలమగుచున్నదా? నిస్సందేహముగా జటిలమే యగుచున్నది. కోర్కెలు పెరిగిపోవుచున్నవి. మీరు ధరించెడి దుస్తులు, మీరు కోరునంత ధనము మీ తాతలకు లేదు. వారికి విద్యుత్తుతో నడిపెడి కార్లు లేవు. రైలురోడ్లు మొదలయినవిలేవు. అందుచేతనే వారు చేయవలసినపని తక్కువ. ఇవన్నియు రాగానే కోర్కె ఎక్కువగును. ఎక్కువ శ్రమపడి పనిచేయుట అవసరమగును. ఆందోళన అధికాధికమగుచుండును. పోటీ యెక్కువగుచుండును.

ధనసంపాదనకు విశేషప్రయాస పడవలసియున్నది. దానిని భద్రపరచుకొనుటకు మఱింత శ్రమపడవలెను. కొంచెము ధనము నార్జించుటకు లోకమంతటితో పోరుసలుపవలసియున్నది. దానిని కాపాడుకొనుటకు జీవితమంతయు పోరుసాగింపవలసియున్నది. పేదవానికంటె ధనవంతున కాందోళన యెక్కువ....ఇదియే లోకపు పోకడ....

మంచిచెడ్డలు లోకమంతటను గలవు. ఒక్కొక్కప్పుడు చెడుగు మంచియే యగును. ఆ మాట నిజమే; ఒక్కొక్కప్పుడు శుభము అశుభమగును. అదియు నిజమే. మన ఇంద్రియము లన్నియు ఎప్పుడో ఒకప్పుడు కీడు తెచ్చిపెట్టును. ఒకడు మద్యము త్రాగును. ప్రారంభమున అది కీడు కలిగింపదు. కాని, అతడదే పనిగా త్రాగుచుండినచో అనర్థము కలుగును....ఒకడు ధనికుల కుటుంబములో జన్మించును; మంచిదే. అతడు మూర్ఖుడగును. దేహమునకు, బుద్ధికి ఏనాడును శిక్షణ సేయడు. అనగా మంచి చెడుగును కలిగించుచున్నదన్న మాట. జీవితమందలి యనురాగ మును గుఱించి యోచింపుడు: మన మిక్కడకు అక్కడకు పోవుదుము. ఏదోవిధముగా కాలము గడపుదుము; కష్టపడి పనిచేయుదుము. బొత్తుగా అసమర్థులమగు శిశువులుగా జన్మించితిమి. విషయగ్రహణమునకు సంవత్సరముల కాలము పట్టును. అరువది డెబ్బదియేండ్లు వచ్చిన తరువాత కన్నులు తెఱచి చూతుము. అప్పుడు, "పో, పొమ్ము" అని యాదేశమగును. మన స్థితి యది.

మంచిచెడ్డలు సాపేక్షపదములని మనము తెలిసికొంటిమి. నాకు మంచిదయినది మీకు చెడ్డది. నేను చేసెడి భోజనము మీరు చేసినచో మీరు విలపింతురు. నేను నవ్వగును....మనము నృత్యము చేయవచ్చును. నేను సంతోషముతోను, మీరు బాధతోను అడుగులు వేయుదుము. ఒకేవిషయము మనజీవితమునందొకభాగమున మేలును, మఱొకభాగమున కీడును కలిగించును. మంచిచెడ్డ లనునవి వేర్వేరు విషయములని మీరెట్లు చెప్పగలరు? ఇదంతయు మేలు, అదంతయు కీడు అనుటెట్లు?

దేవుడు సర్వదా మంగళస్వరూపుడే అయినచో ఈ మంచి చెడ్డలన్నిటికి బాధ్యులెవరు? సైతాను పెద్దమనుష్యుడొకడు కలడని క్రైస్తవులు, మహమ్మదీయులు చెప్పుదురు. ఇద్దరు పెద్ద

మనుష్యులు పనిచేయుచున్నారని మీరెట్లు చెప్పగలరు? ఉన్న దొక్కరే అయియుండవలెను....బాలుని వ్రేళ్లు కాల్చివేయు అగ్ని ఆహారములను పచనముచేయును. నిప్పు మంచిదనిగాని చెడ్డదనిగాని యెట్లు చెప్పగలరు? నిప్పును సృష్టించినవారిద్దరు వేర్వేరు వ్యక్తులని యెట్లు చెప్పగలరు? అశుభమనుదానినెల్ల సృజించినవారెవరు? దేవుడే. ఇంతకుమించి సమాధానము లేదు. అతడు మృత్యువును, జీవమును, ప్లేగును, అంటుజాడ్యములను సర్వమును పంపును. దేవుడట్టివాడైయెనచో అతడు మంగళమయుడు, అమంగళమయుడు; అతడు సౌందర్యస్వరూపుడు, భయంకరుడు; అతడు జీవము, మృత్యువుకూడ.

అట్టి దేవుని యుపాసించుటెట్లు? భీషణస్వరూపుని ఆత్మ నిజముగా ఎట్లు ఉపాసింప నేర్చుకొనగలదో మనము తెలిసికొందము; అప్పు డాత్మకు శాంతి ననుభవించును....మీకు శాంతి కలదా? ఆందోళనలనుండి విడివడెదరా? ఇటు తిరిగి మొదట భయంకరుని దెస చూడుడు. ముసుగును ప్రక్కకు లాగి వేయుడు. అదే దేవుని యిప్పుడు చూడుడు. అతడు సగుణుడు. శుభముగా కనబడునదియంతయును, అశుభముగా కనబడును. యంతయును అతడే. మరొక రెవ్వరును లేరు. ఇద్దరు దేవుళ్లుండినచో ప్రకృతి యొక్క నిమిషముసేపయినను తాళలేకపోయి యుండును. ప్రకృతియందు మరొకరు లేరు. అందతయు సామరస్యమే. ఒకప్రక్క దేవుడు, మరొకప్రక్క దయ్యము క్రీడించుచున్నచో ప్రకృతియంతయు సంక్షోభమునకు గుఱియగును. శాసనము నెవరు ఉల్లంఘింపగలరు? నేనీ గాజుపాత్రను పగులగొట్టినచో, అది పడిపోవును. ఎవరయినచో నొక్కయణువున దానిస్థానమునుండి త్రోసివేయగలిగిరేని, ప్రతియణువు దాని సమరసస్థితినుండి భ్రష్టమగును....శాసనము నెన్నటికిని ఉల్లంఘించుట సాధ్యముకాదు. ప్రతియణువు దాని నియమితస్థానము నందున్నది. ప్రతియణువు తూచబడినది, కొలవబడినది. అది తన

స్థానమున తనధర్మమును నిర్వర్తించును. అతని యాజ్ఞాబద్ధమై వాయువు వీచుచున్నది; సూర్యుడు ప్రకాశించుచున్నాడు. అతని నియమమునకు లోబడి లోకములు తమతమ స్థానములలో నున్నవి. మృత్యుదేవత సయితము అతని యానతి ననుసరించియే పృథివిపై క్రీడించుచున్నది. ఇద్దరు ముగ్గురు దేవుళ్లును ఈ లోకములో కుస్తీపోటీలు జరుగుచున్నట్లు ఊహింపుడు! అది యసంభవము.

జగత్కర్తయై, దయామయుడు, క్రూరాత్ముడునగు సగుణ దేవుడుండుటకు వీలుకలదని మనము గ్రహింపగలిగితిమి.... అతడు మంగళమయుడు, అమంగళమయుడు. అతడు మందహాసము చేయును, ఆగ్రహించును. అతని శాసనము నెవ్వరును ఉల్లంఘింపజాలరు. అత డీ జగత్తుకు కర్త.

సృష్టియననేమి? శూన్యమునుండి యేదో పుట్టుటా? ఆరువేలసంవత్సరములకుపూర్వము దేవుడు తనస్వప్నమునుండి మేల్కాని ఈ జగత్తును సృజించెను. అంతకుముందేమియు లేదా? అప్పుడు దేవుడేమిచేయుచుండెను? మంచినిద్రపోవుచుండెనా? అతడే జగత్కారణుడు. ఫలితమునుబట్టి కారణమును తెలిసికొనగలము. ఫలితము లేనియెడల కారణము కారణమేకాదు. కారణమును సర్వదా ఫలితమునందు, ఫలితముద్వారా తెలిసికొనగలము....సృష్టి యనంతము....స్థలమునకుగాని, కాలమునకుగాని ప్రారంభమును మనమూహింపలేము.

అతడేల సృష్టించును? సృష్టిచేయుట అతనికిష్టము కనుక, అతడు స్వతంత్రుడు కనుక......మీరు, నేను శాసనబద్ధులము. ఏలయన మనము కొన్నివిధములుగానే పనిచేయగలము. "అతనికి కరములులేవు. కాని, సర్వమును పట్టుకొనగలడు. అతనికి చరణములులేవు. కాని, వేగముగా పోగలడు." అతనికి దేహము లేదు. కాని, సర్వశక్తుడు. "ఎవనిని కన్నులు చూడజాలవో,

కాని, ఎవడు ప్రతినేత్రములోని చూపున కెవడు కారణమో అతడు ఈశ్వరుడని గుర్తించుము.'' మీరు మరిదేనిని ఉపాసింప జాలరు. ఈ విశ్వమున కీశ్వరుడే సర్వశక్తుడగు ఆధారము. శాసన మనునది అతని సంకల్పప్రకాశమే. అత డీ జగత్తును తనశాసన ముల ద్వారా పాలించును.

మన మింతవఱకు దేవునిగుఱించి, ప్రకృతినిగుఱించి, నిత్యు డగు దేవునిగుఱించి, నిత్యమగు ప్రకృతినిగుఱించి చర్చించితిమి. ఆత్మలనుగుఱించిన విషయమేమి? అవికూడ నిత్యములే? ఆత్మ సృజింపబడలేదు. అది అస్తమించదు. ఎవరును తనమరణము నూహించుకొనజాలరు. ఆత్మ యనంతమయినది, శాశ్వత మయినది. అదెట్లు మరణించగలదు? అది దేహములను మార్చు కొనుచుండును. మానవుడు తన చినిగిపోయిన ప్రాతదుస్తులను విసర్జించి, క్రొత్తదుస్తులు ధరించునట్లు శిథిలమయిన దేహమును విడిచిపెట్టి క్రొత్తదేహమును ధరించును.

ఆత్మతత్త్వమేమి? ఆత్మకూడ సర్వవ్యాపి. సర్వశక్తిమంత మయినది. ఆత్మకు పొడుగు, వెడల్పు, దళసరితనము లేవు.... ఇక అది యిక్కడ ఉన్నది, అక్కడ ఉన్నది అని యెట్లు చెప్ప నొప్పును? ఈ దేహము రాలిపోవును; ఆత్మ మరొకదేహము ద్వారా పనిచేయును. ఆత్మ వృత్తమువంటిది. దానికి రిథి యెక్కడనులేదు. కేంద్రము దేహమునందు గలదు. దేవుడు కూడ వృత్తమువంటివాడే. అతనికి పరిధి యెక్కడనులేదు; కేంద్రము సర్వత్ర గలదు. ఆత్మ స్వతస్సిద్ధముగా, తనప్రకృతి చేతనే పరిశుద్ధమయినది, పరిపూర్ణమయినది, ఆనందస్వరూప మయినది; దానిప్రకృతి యపరిశుద్ధమయినయెడల అదెన్నటికిని పరిశుద్ధము కాజాలదు....ఆత్మ స్వతస్సిద్ధలక్షణమే పరిశుద్ధత. కావుననే ఆత్మలు పరిశుద్ధములు. స్వభావముచేతనే ఆత్మ ఆనంద మయము. కనుకనే అది యానందమనుభవింపగలదు. అది శాంతి స్వరూపము. కనుకనే అది ప్రశాంతత ననుభవింపగలదు.

ఈ భూమికమీాద ఈ దేహమున కాకర్షింపబడిన మన మందఱము అసూయలతో, కలహములతో, కష్టములతో జీవనోపాధికి కృషిచేసి చనిపోవుదుము. అనగా మనముండవలసిన విధముగా లేమన్నమాట. మనము స్వతంత్రులముకాము, సంపూర్ణముగా పరిశుద్ధులముకాము; ఇంకను యిట్టి లక్షణములు లేవు. ఆత్మ పతనము చెందినదన్నమాట. కనుక ఆత్మ కిప్పుడు కావలసినది వ్యాకోచము....

అదెట్లు సాధ్యము? మీాయంతట మీారా పని సాధింపగలరా? సాధింపజాలరు. ముఖముమీాద దుమ్ముపడియున్నచో, దుమ్ముతో ముఖప్రక్షాళనముచేసి దుమ్మును పోగొట్టగలమా? నేలలో విత్తనము నాటినచో చెట్టు వచ్చును. చెట్టునుండి విత్తనము వచ్చును. విత్తనమునుండి మరల చెట్టు వచ్చును. ఇదేవరుస. కోడి గ్రుడ్డుపెట్టును. గ్రుడ్డునుండి కోడివచ్చును. మీారేదేని శుభము చేసినయెడల దానిఫలితమును మీారనుభవింపవలసినవారగుదురు. మరల జన్మమెత్తి దుఃఖపడవలసివచ్చును. తెంపులేని యీా సూత్రమును ప్రారంభించిన తరువాత దానిని నివారింపజాలరు. మీారు దానివెంట పోవుచుండవలసినదే....స్వర్గములకారోహించుచుండవలసినదే. పృథివికి అవరోహించుచుండవలసినదే. ఈ దేహములను ధరించుచుండవలసినదే....మార్గాంతరము లేదు.

ఈ చక్రము నతిక్రమించుటెట్లు? మీారిక్కడ ఉన్నదెందుకు? దుఃఖమునుండి విముక్తులము కావలెననియెడి యభిప్రాయ మొకటి కలదు. దుఃఖనివృత్తికొఱకు మనమందఱము దివారాత్రములు యాతనపడుచున్నాము....కర్మచేయుటచేత మనప్రయోజనమును సాధింపజాలము. కర్మ మరింతగా కర్మను వృద్ధిచేయును. ముక్తస్థితియందున్నవారెవరేని చేయూతనిచ్చినచో సాధ్యమగును. ''అమృతపుత్రులారా! భూలోకనివాసులారా!

స్వర్గవాసులారా! అవధరింపుడు. నేను రహస్యము తెలిసి కొంటిని" అని ఋషీశ్వరుడు ఉద్ఘోషించుచున్నాడు. "సమస్త అంధకారమున కావలితీరముననున్న పరమపురుషుని సాక్షాత్కారము నేను పొందితిని. అతని కృపామహిమవలననే మన మీ జీవితసాగరము దాటగలము."

భారతీయుల లక్ష్యమిది: స్వర్గములున్నవి, నరకము లున్నవి, భూమండలములున్నవి. కాని, అవేవియు శాశ్వతమయి నవి కావు. నన్ను నరకమునకు పంపినను అది శాశ్వతము కాదు. నే నెక్కడ ఉన్నను ఈ విధమగు పోరాటమే సాగుచుండును. ఈ పోరాటమునంతటిని ఎదొర్కొనుట ఎటులన్న దేసమస్య. నేను స్వర్గమునకుపోయినచో, ప్రాయశః నాకక్కడ కొంత విశ్రాంతి కలుగునేమో. దుష్కార్యములు చేసినందుకు నాకు శిక్షపడిన యెడల అదియు చిరకాలముండదు....స్వర్గమునకుపోవుట భార తీయుల లక్ష్యము కాదు. ఈ పృథివినుండి, నరకమునుండి, స్వర్గము నుండి సహితము యీనలకు బొమ్ము! గమ్యమేమి? విముక్తియే. మీరందరు ముక్తులు కావలెను. ఆత్మమహిమ మరుగుపడినది. మరల ఆ తెరను తొలగింపవలెను. ఆత్మ యున్నది. అది యంత టను ఉన్నది. అదెక్కడకు బోవును!...అదెక్కడకు పోగలదు? అది లేనిచోటకేకదా పోగలదు! అది సర్వత్ర సర్వదా కలదని మీరు గ్రహించినచో...సంపూర్ణమయిన సౌఖ్యము శాశ్వత ముగా కలుగగలదు. ఇక జననములు ఉండవు, మరణములు ఉండవు....వ్యాధులుండవు, దేహముండదు. దేహమే అన్నిటి కంటె పెద్ద వ్యాధి....

ఆత్మ సహజతేజముతో ప్రకాశించును. ఆత్మ ఆత్మగా జీవించును. ఇదెట్లు సాధ్యమగును? ఆత్మయందున్న దేవుని ఉపాసించుటమూలమున అతడు స్వతస్సిద్ధముగానే సర్వదా నున్నాడు; అతడు పరిశుద్ధుడు, పరిపూర్ణుడు. లోకములో సర్వ

శక్తులగు ఇరువురు వ్యక్తులు లేరు. ఇద్దరు ముగ్గురు దేవుళ్లున్నట్లు భావింపుడు; ఒకడు విశ్వమును సృజించును. మరొకడు, ''నేను దీనిని నాశనము చేయుదును'' అనును. కనుక అది యసంభవము. దేవుడొక్కడే ఆత్మపరిపూర్ణత్వము పొందును; అది దాదాపు సర్వశక్తిమంతమగును, సర్వజ్ఞత్వము పొందును. ఉపాసకు డిట్టివాడు. ఉపాస్యుడెవరు? సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు అయిన సర్వేశ్వరుడు. అన్నిటికంటె ముఖ్యముగా అతడు ప్రేమస్వరూపుడు. ఈ పరిపూర్ణత్వము నాత్మ యెట్లు పొందగలదు? ఉపాసన మూలమున.



# ఈశ్వరునియందు ప్రేమ*

(డెట్రాయిట్ ట్రిబ్యూన్, ఫిబ్రవరి 21, 1894)

గతరాత్రి వివేకానందస్వామి యుపన్యాసమును వినుటకు వచ్చిన జనులతో మొదటి యూనిటేరియన్ చర్చి క్రిక్కిరిసి పోయినది. శ్రోతలు జెఫర్‌సన్ ఎవెన్యూనుండియు, ఉడ్‌వర్డ్ ఎవెన్యూ ఎగువప్రాంతమునుండియు వచ్చిరి. సభాసదులలో ఎక్కువమంది స్త్రీలు. స్వామీజీ యుపన్యాసమునందు వారెక్కువ ఆసక్తిచూపిరి. ఆయన వ్యక్తీకరించిన బహుళవాక్కులు వారి నానందపరవశుల నొనరించినవి. ప్రశంసతో నిండిన ఉత్సాహ మును వారు ప్రకటించిరి.

ప్రేమతత్త్వమును గురించి వక్త ప్రసంగించెను. అది ఉద్రేకముతో కూడినది కాదు. భారతదేశములోనివారు భగవంతుని యెడల చూపు నిర్మలము, పవిత్రమునగు ప్రేమయది. ఉపన్యాస విషయము. "భారతీయునకు అతని దేవునియందుగల ప్రేమ". అని వివేకానందస్వామి యారంభముననే చెప్పెను. కాని, యత డా విషయమునకు బద్ధుడయి బోధచేయలేదు. అతని యుపన్యాస ములోని విశేషభాగము క్రైస్తవమత విమర్శయే. భారతీయుని మతమును గుఱించియు, అతనికి దేవునియందుగల ప్రేమనుగుఱించియు అతడు చెప్పినది చాల తక్కువ. అతని యుపన్యాసము లోని అంశములు చరిత్ర ప్రసిద్ధులయిన మహాపురుషుల జీవితము లోని యితివృత్తములతో నుదాహరింపబడెను. అతడు పేర్కొనిన యితివృత్తములలోని వ్యక్తులు తనదేశములోని మొగలాయిచక్ర వరులేగాని హైందవరాజులు కారు.

* ఈ యుపన్యాసము డెట్రాయిట్ ఫ్రీప్రెస్‌లో ప్రచురణమైనది.

మతావలంబులను రెండు తరగతులుగా వక్త విభజించెను: జ్ఞానమార్గము ననుసరించువారు, భక్తిమార్గము ననుసరించువారు. జ్ఞానమార్గనుసరించెడివారి జీవిత చరమఫలితమనుభూతి. భక్తికి జీవితచరమలక్ష్యము ప్రేమ.

ప్రేమలక్షణము త్యాగమే అని యాతడు చెప్పెను. అదెన్నడును స్వీకరించదు; సర్వదా యిచ్చివేయుచుండును. హిందువు తన దేవుని యేమియు కోరడు. మోక్షముకొఱకు, మరణానంతర సుఖజీవితము కొఱకు అతడెన్నడును ప్రార్థించి యెఱుగడు. అతడు తన్మయత్వము చెందించెడి ప్రేమతో పూర్తిగా తన్నుదాను భగవంతునకు సమర్పించుకొనును. ఈశ్వరునికొఱకు తమ్ము వివశులజేయు విశేషానురక్తి గలిగినవారికే యట్టియనుభూతి సంభవము. అట్టివారికి దేవుడు సంపూర్ణముగా సాక్షాత్క రించును.

భగవంతుని త్రివిధ దృక్పథములతో చూడవచ్చును. దేవుడు మహత్తరశక్తిమంతుడగు వ్యక్తిగా భావించి, ప్రణమిల్లి అతనిశక్తిని ఉపాసింపవచ్చును. అతనిని జనకునిగా ఉపాసించుట మరియొకవిధము. భారతదేశములో తండ్రి బిడ్డలను దండించును. తండ్రియందుగల ప్రేమాదరములలో భయము కొంత మిళితమై యుండును. దేవుని మాతృమూర్తిగా భావించుట మూడవ విధము. భారతదేశములో జననియందు సర్వదా నిజమగు ప్రేమ, పూజ్యభావముతో చూపబడుచుండును. భారతీయునకు దేవుని యందుగల భావ మిదియే.

నిజమగు భక్తుడు దేవునియందలి ప్రేమతో తన్మయుడగు చుండును. ఇతర మతావలంబుల నుద్దేశించి, దేవుని సాక్షాత్కారము బడయుటకు వారు తప్పుత్రోవలో నడుచుచున్నారని చెప్పి, వారిని తనమార్గమునకు త్రిప్పుకొనుటకు ప్రయత్నించుట కతనికి వ్యవధియుండదు.

* * * *

## డెట్రాయిట్ పత్రిక

ఈ నగరములో ఉపన్యాసములు చేయుచున్న బ్రాహ్మణ సన్న్యాసి వివేకానందుని మరియొకవారము దినము లిక్కడ ఉండవలసినదని ప్రేరేపించినచో, అతని యుపన్యాసములను వినుట కాత్రముతో వచ్చెడి జనులకు డెట్రాయిట్‌లోని యెంత పెద్ద భవనమయినను చాలకపోవును. అతనియందు జనులకు వెఱ్ఱి వ్యామోహము కలిగినది. నిన్న సాయంకాలము యూనిటేరియన్ చర్చిలోని కుర్చీలన్నియు నిండిపోయినవి. అతడుపన్యసించినంతసేపు పెక్కుమంది శ్రోతలు నిలబడవలసినవారయిరి.

ఉపన్యాసవిషయము, "ఈశ్వరునియందు ప్రేమ". ప్రేమ సంపూర్ణముగా స్వార్థరహితమయినదని అతని నిర్వచనము. "మన ప్రేమయంతయు దేనియందు కేంద్రీకృత మయినదో దానిని కీర్తించుట, ఆరాధించుట తక్క వేఱొక్క ఆలోచనయే ప్రేమకు లేదు." ప్రణమిల్లుట, ఉపాసించుట, ప్రతిఫల మాశింపకపోవుట —ప్రేమ ఈ లక్షణములుగల గుణమని యతడు చెప్పెను. ఈశ్వరునియందు ప్రేమ యిందుకు భిన్నముగా నున్నదని యతని భావము. నిజముగా మనకవసరమని కాక, స్వప్రయోజనము కొఱకు మాత్రమే దేవు డంగీకరింపబడు చున్నాడు. ఈశ్వరుని యందలి ప్రేమలో స్వార్థచింతయే నిహితమైయున్నదని నిరూపించుట కతడు తన యుపన్యాసములో కథలను, యితిహాసములను ఉదహరించెను. సోలమన్ కీర్తనలను వక్త యుల్లేఖించి, క్రైస్తవుల బైబిలులో అవి యుత్తేజకరమగు భాగమని వచించెను. బైబిలులోనుండి యాభాగములు తీసివేయబడగల యవకాశము కలదని యతడు విని మిక్కిలి విచారించెను. ఉపన్యాసాంతమున అతడు బలమైన యుక్తిగా పేర్కొనుచు యిట్లనెను : "యదార్థమునకు, నాకు దానివలనకలుగగల ప్రయోజనమేమి ?" అను వాదముపై ఈశ్వరునియందు ప్రేమ ఆధారపడినట్లు కనబడు

చున్నది.'' క్రైస్తవుల ప్రేమ స్వార్థచింతతో నిండియున్నది. వారు దేవుని నిరంతరము ఏదో కోరుచునేయుందురు; స్వప్రయోజనముతో కూడిన అన్ని విధముల కోర్కెలను కోరుదురు. కనుకనే ఆధునిక మతము కేవలము వినోదము, విలాసములకొఱకేర్పడినదే. జనులు చర్చికి గొఱ్ఱెలమందవలె వచ్చుచుందురు.''

## భారతనారీమణులు

(డెట్రాయిట్ ఫ్రీప్రెస్, మార్చి 25, 1894)

నిన్నరాత్రి వివేకానందస్వామి యూనిటేరియన్ చర్చిలో ''భారతనారీమణులు'' అను విషయమును గుఱించి యుపన్యసించెను. ప్రాచీనకాలమున భారతదేశములోని స్త్రీలను గుఱించి ఆయన ప్రసంగించుచు పవిత్ర గ్రంథములలో వారికెంతటి పూజ్యభావము చూపబడినదో వివరించెను. నాటి స్త్రీలు భవిష్యత్తును గురించిన జ్ఞానము గలవారని యతడు చెప్పెను. వారి యాధ్యాత్మికశక్తి యద్భుతమైనది. పాశ్చాత్య సభ్యతా ప్రమాణముతో ప్రాచ్యస్త్రీలను నిర్ణయించుట అన్యాయము. పాశ్చాత్యదేశములలో స్త్రీ యనగా భార్య; ప్రాచ్యదేశములలో స్త్రీయనగా మాతృదేవి. మాతృభావమును హిందువులు పూజింతురు. సన్న్యాసులు సహితము తల్లుల సమక్షమున భూదేవిని నుదుటితో తాకుట విధి. పాతివ్రత్యమునకు విశేషాదరము కలదు.

వివేకానందస్వామి చేసిన మిక్కిలి యాహ్లాదకరమగు ఉపన్యాసములలో నిదియొకటి. అతనియందు సముచిత ఆదరాభిమానములు చూపబడెను.

*    *    *

(డెట్రాయిట్ సాయంకాలసమాచారము, మార్చి 25, 1894)

వివేకానందస్వామి గతరాత్రి యూనిటేరియన్ చర్చిలో, ప్రాచీన, మధ్యకాల, వర్తమానకాలములలో భారతనారీ

మణులు'' అను విషయమును గురించి యుపన్యసించెను. భారతీయులకు స్త్రీ ప్రత్యక్షదైవమని యతడు వక్కాణించెను. తాను తల్లిననెడి భావముతోనే ఆమె జీవించును. నిరుపమమగు మాతృత్వమున కామె పతివ్రతయై యుండవలెను. భారతదేశములోని యే స్త్రీయు తన శిశువును విడిచిపెట్టలేదని యతడు చెప్పెను. ఇందుకు విరుద్ధమైన నిదర్శనమున్న యెడల, నిరూపింపవలసినదని యతడు సవాలు చేసెను. అమెరికాలోని బాలికలవలె యువకుల నీచపు చూపులకు గురియగుటకుగాను తమ దేహములను సగమునగ్నముగా ప్రదర్శించుకొనవలసినదని భారతదేశములోని బాలికలను నిర్బంధించినయెడల, వారాపని చేయుటకంటె ప్రాణము లర్పించుటకే యిష్టపడుదురు. భారతదేశమును ఆదేశపుప్రమాణముతో నిర్ణయింపవలెనుగాని ఈదేశపుప్రమాణముతో నిర్ణయింపరాదని యతని యభిమతము.

* * *

(ట్రిబ్యూన్, ఏప్రిల్ 1, 1894)

వివేకానందస్వామి డెట్రాయిట్‌లో నుండగా అనేకపర్యాయములు గోష్ఠి జరుపబడెను. భారతదేశ స్త్రీలనుగురించి నా ప్రశ్నల కాతడు సమాధానములు చెప్పెను. అతడు చెప్పిన సమాచారమునుబట్టి ఈ విషయమై బహిరంగసభలో అతని యుపన్యాస మేర్పాటు చేయించవలెననియెడి సూచన చేయబడెను. అతడు ఆశువుగా ఉపన్యసించును. అందుచేత గోష్ఠి సమావేశములలో అతడు తెలిపిన యంశములు కొన్ని సభలో చేసిన ఉపన్యాసములో ప్రస్తావింపబడలేదు. అంతట అతని మిత్రులకు కొంత ఆశాభంగము కలిగినది. కాని, మధ్యాహ్నము జరిగిన గోష్ఠిలో అతడు చెప్పినవిషయములు కొన్నిటిని ఒకస్త్రీ వ్రాసి పెట్టినది. ఆవిషయము లిప్పుడు తొలిసారిగా పత్రికా ప్రచురణ కీయబడినవి :

ఆర్యులు తొలిసారిగా హిమాలయపర్వత ప్రాంతముల లోని మహోన్నతమయిన పీఠభూములకు వచ్చిరి. అక్కడ నేటికిని స్వచ్ఛమగు బ్రాహ్మణవర్ణముకలదు. అటువంటివారిని పాశ్చాత్త్యులు భావనాస్వప్నముగ గ్రహింపవలసినవారె. మనోవాక్కాయ్మ లందు వారు పరిశుద్ధులు. బహిరంగస్థలములో బంగారముగల సంచి విడిచిపెట్టినయెడల ఇరువది సంవత్సరముల తరువాతకూడ అది యక్కడనే సంరక్షితముగానుండును. వారంతటి సత్యసంధులు, ఋజువర్తనముగలవారు; వివేకానందస్వామిమాటలు ఉదాహరించవలెననిన "పొలములలో ఒక బాలికను చూచుట యనగా భగవన్మహిమాతిశయమున కచ్చెరువడి, అతడు దేనినయినను సౌందర్య మట్టిపడునట్లు చేయగలడని భావించుట." వారి యాకార ప్రకారములు తీర్చిదిద్దినట్లుండును. వారి నేత్రములు, శిరోజములు నల్లనయినవి. గాజుపాత్రలోని క్షీరములో గాయపడిన వ్రేలినుండి స్రవించిన రక్తబిందువులుపడినప్పు డేవర్ణము వచ్చునో అదియే వారి దేహచ్ఛాయ. సంకరముకాని, స్వచ్ఛమగు హిందూజాతివారిట్టివారు.

ఆస్తివిషయము: భార్యకిచ్చిన కట్నము పూర్తిగా ఆమెదే. ఆదేనాటికిని భర్త ఆస్తిగా మారదు. అతని యనుమతిలేకుండ దాని నామె దానముచేయవచ్చును, విక్రయింపవచ్చును. ఆమె కెవ్వరెవ్వరిచ్చిన బహుమతులయినను, భర్తయిచ్చిన బహుమతులయినను పూర్తిగా ఆమెధనమే యగును. దాని నామె ఏమయినను చేసికొనవచ్చును.

స్త్రీ యొక్కడయినను నిర్భయముగా సంచరించును; తన వారి సంపూర్ణవిశ్వాసమున కనుగుణముగా ఆమె స్వతంత్రురాలు. హిమాలయ ప్రాంతములలో స్త్రీలకు ప్రత్యేకముగా అంతఃపురములు లేవు. మతప్రచారకు లేనాటికిని ప్రవేశింపనేరని ప్రాంతమొకటి హిందూదేశములో కలదు. ఈ గ్రామములు

దుర్గమప్రాంతములు. ఈప్రాంతములోని వారికి మహమ్మదీయ మతప్రభావము ప్రసరింపలేదు. ఎవరైన వారిదరి జేరదలతురేని బహు శ్రమపడి ఎగ్రాకి అట్లొనరింపవచ్చును. వారిని గురించి మహమ్మదీయులకుగాని, క్రైస్తవులకుగాని తెలియదు.

## భారతదేశములోని ఆదిమనివాసులు

భారతదేశములోని అడవులలో అనాగరకజాతులు గలవు. ఆజాతులవా రాటవికులు. నరమాంసభక్షకులనదగినంత యనాగరకులు. భారతదేశములోని ఆదిమనివాసులు వీరె. వీరు ఆర్యులు కారు, హిందువులును కారు.

హిందువులు దేశమధ్యప్రాంతములో స్థిరపడి విశాలమయిన సీమలలో వ్యాపించుటతో నానావిధములగు దురాచారములు తల లెత్తినవి. సూర్యుడు తీక్ష్ణముగా ప్రకాశించుచుండెను. ఎండ తీవ్రతకు గురి అయినవారి దేహచ్ఛాయ నల్లబడెను.

అయిన తరములలోనే హిమాలయపర్వతములలో నివసించెడివారి తనుకాంతి, — తెల్లనిఛాయ కంచువర్ణముగా మారిపోయెను.

వివేకానందస్వామికంటె అతని సోదరుడొకడు మంచి దేహచ్ఛాయగలవాడు. మహొకని వర్ణము వివేకానందుని వర్ణముకంటె నలుపు. అతని తల్లిదండ్రులు చక్కని రంగుగలవారు. స్త్రీలు అంతఃపురనివాసులు. ఈ క్రూరమైన సంప్రదాయమునకు వారు బద్ధులుకావలసినవారయిరి. మహమ్మదీయుల బారినుండి రక్షించునిమిత్తము ఆకాలపు సాంఘికనేతలు వారి నిండ్లలోనే యుంచవలసి వచ్చెను. కనుక పురుషులకంటె వారి దేహవర్ణ మందమయినదిగా నుండెను.

వివేకానందస్వామి ముప్పదియొక్క సంవత్సరములవయసు గలవాడు.

## అమెరికన్లపై నిశితవిమర్శ

అమెరికాప్రజలు తనకు వినోదము కలిగించుచుందురని వివేకానందస్వామి స్పష్టపరచెను. స్త్రీయందు పూజ్యభావ మున్నట్లు వారు చెప్పుచుందురేకాని నిజమునకు వారు పూజించునది యౌవనమును, సౌందర్యమును మాత్రమే అని తన యభిప్రాయమని యతడు వక్కాణించెను. నెరసిన జుట్టును, ముఖము మీది ముడతలను వారెన్నడును ప్రేమింపరని అతడు పలికెను. తమ వృద్ధస్త్రీలను కాల్చివేసెడి దురాచారము పాశ్చాత్యులలో నొకప్పుడు కలదని యతని దృఢమయిన యభిప్రాయము. అపనిని ఆధునికచరిత్ర క్షుద్ర మంత్రకత్తెలను తగులబెట్టుట యనును. ఆ మంత్రకత్తెలను దూషించువారును వారిచేష్టలను ఖండించువారును పురుషులే. మంత్రకత్తెలు దారుణకృత్యములకు బలి యగుటకు సర్వసాధారణముగా వారివార్ధక్యమే కారణము. కనుక జీవించియున్న స్త్రీలను మంటలలోనికిత్రోసి చంపెడి యనాచారము ఒక్కహిందువులదే కాదు. క్రైస్తవమతము వృద్ధస్త్రీలను నిండు ప్రాణములతో తగులబెట్టిన విషయము జ్ఞాపకముచేసికొనినచో హిందూ వితంతువులను తగులబెట్టు విషయమై అంతగా ఆందోళనను వ్యక్తీకరింపవలసిన యవసరముండదని అతని యభిప్రాయము.

## కాల్పుల భేదము

హిందూ వితంతువు మృత్యుదేవత నెదుర్కొను సంఘటన విందులతో సంకీర్తనముతో జరుగును. ఆమె విలువైన దుస్తులు ధరించును. ఆమె మరణించుటవలన ఆమెకు, ఆమెకుటుంబమునకు స్వర్గములభించునని నమ్మకము కలదు. ఆమెను ధర్మముకొఱకు ప్రాణదానముచేసిన వీరవనితగా కీర్తింతురు. ఆమె పేరు వంశ చరిత్రలో చిరస్థాయిగానుండును.

ఈ దురాచారమెంత ఘాతుకముగా మనకు కనబడినను - క్రైస్తవ మంత్రకత్తెలను దహనముచేయుటతో పోల్చినప్పుడు — చాల మెరుగని చెప్పవచ్చును. మంత్రకత్తెను చంపుట నేరమని మొదటినుంచి గుర్తించియు, తప్పు ఒప్పుకొనునట్లు చేయుటకు— ఊపిరి తీసికొనుటకును, పీడుటకును వీలుకలుగని కటికచీకటి కొణములోనికి ఆమె నప్పటివారు త్రోయుచుండువారు; క్రూరముగా హింసించువారు. అప్రతిష్ఠపాలయిన పద్ధతిని విచారణచేయువారు. అపహాస్యములతో ఈడ్చుకొనివచ్చి స్తంభమునకు కట్టివేయువారు. ఆమె దేహమును దహనముచేయుట శాశ్వతనరకజ్వాలలకు చిహ్నమనియు, నరకములో ఆమె యాత్మ యింతకంటె ఎంతో ఎక్కువక్షోభపడవలసి వచ్చుననియు దగ్గరనున్నవారు ఓదార్పుమాటలు చెప్పుచుండువారు.

## తల్లులు పవిత్రులు

మాతృత్వ ధర్మమును పూజింపవలసినదిగా హిందువులకు గురువులు బోధింతురని వివేకానందస్వామి చెప్పెను. భార్యకుగల గౌరవముకంటె తల్లికి గౌరవమెక్కువ. తల్లి పవిత్రురాలు. హిందువు మనస్సులో ఈశ్వరుని పితృభావముకంటె మాతృభావమే ప్రాబల్యము వహించును.

ఏకులమునకు చెందినను సరే, స్త్రీకి శారీరకశిక్ష మినహాయింపబడినది. ఒకస్త్రీ హత్యాపరాధముచేసినను ఆమె యుత్తమాంగము రక్షణబడయును. ఆమెను గాడిదమీాద దాని తోకను చూచునట్లు వెనుకకు త్రిప్పి కూర్చుండబెట్టి ఊరిలోని వీథులలో త్రిప్పుట కలదు. ఆ సమయములో డప్పువాయించువాడు ఆమె చేసిన నేరమును చాటి చెప్పువాడు. తరువాత ఆమె విడుదల చేయబడును. మరల నేరముచేయకుండ ఆపరాభవ మామెను నిరోధింపగలదని భావింపబడుచుండెను.

ఆమె తన నేరమునకు పశ్చాత్తాపము తెలుపదలచిన యెడల అందుకు తగిన ఆలయములు కలవు. ఆమె తనకోర్కె ననుసరించి యక్కడ ప్రాయశ్చిత్తము చేసికొని శుద్ధి పొంద వచ్చును; వెంటనే సన్న్యాసమఠములో చేరవచ్చును ; పవిత్రు రాలు కావచ్చును.

వివేకానందస్వామికి క్రింది ప్రశ్న వేయబడినది :

"పై అధిపతులే సన్న్యాసమఠములో చేరుట కావిధ ముగా నిచ్చిన స్వాతంత్ర్యమువలన సన్న్యాసులలో ప్రవంచన తలసూపుట కవకాశము లేదా?" హిందూతత్త్వజ్ఞులలో సన్న్యా సులు మిక్కిలి పవిత్రమైన క్రమమునకు చెందినవారని వివేకానంద స్వామి యభిప్రాయము. తన్నడిగిన ప్రశ్నకు సమాధానముగా స్వామిజీ ఔనని ఒప్పుకొని, ప్రజలకు సన్న్యాసికి మధ్య నెవ రును లేరనిచెప్పెను. సన్న్యాసి కులభేదములను పాటింపడు. బ్రాహ్మణుడు మిక్కిలి తక్కువకులమునకు చెందిన హీనువుచు స్పృశింపడు. కాని, అతడు సన్న్యాసము స్వీకరింపనిండు. ఎంతెం తటి ప్రముఖులును హీనకులమునందు పుట్టిన సన్న్యాసి చరణము లకు సాష్టాంగపడి దాసోహమ్మందురు.

సన్న్యాసి క్షేమమును చూచుట ప్రజలవిధి. అతని చిత్త శుద్ధియందు నమ్మకమున్నంతవఱకే వారు తమ విధి నెరవేర్చెదరు. వంచకుడని ఒక్కమారు నిర్ణయింపబడినతరువాత అతనిని మోసగాడందురు. అతడు పతనముచెందును. గౌరవముకోల్పోయి దేశద్రిమ్మరియగు బిచ్చగాడగును.

## మరికొన్ని తలపులు

రాజుతో నయినను స్త్రీ తనమార్గమును నిరూపించు కొనుట కధికారము గలిగియుండెను. జ్ఞానసాధనోద్దేశముగల గ్రీకులు హిందువులను గుఱించి తెలిసికొనుటకు భారతదేశమునకు

వచ్చినప్పుడు వారి కన్ని తావులందు స్వాగతమీయబడెను. కాని, కత్తి చేబూని మహమ్మదీయుడును, తుపాకి పట్టుకొని ఆంగ్లేయుడును వచ్చినప్పుడు వారు తలుపులు వేసికొనిరి. అటువంటి అతిథులకు ఆహ్వానము లభింపలేదు. వివేకానందుడు సొగసుగా అన్న మాటలివి :

"వ్యాఘ్రము వచ్చినప్పు డది పోవువఱకును తలుపులు వేసికొనియే యుందుము."

అమెరికాకు ఉజ్జ్వలభవిష్యత్తు కలదన్న ఆశ తన్నుత్తేజపరచినదని వివేకానందస్వామి చెప్పెను. కాని, మన భవిష్యత్తు, —ప్రపంచ భవిష్యత్తు నేటి శాసననిర్మాణాధికారుల చేతిలో కాక స్త్రీలచేతిలోగలదని స్వామిజీ తెలిపిరి. వివేకానందుని మాటలివి: "మీ దేశాభ్యుదయము మీ స్త్రీలపై ఆధారపడి యున్నది."



# వర్ణానుక్రమికసూచి